ర్లంఘితః క్షీణః [1]జీర్ణ్ భుక్తః పిపాసితః, న పిబేదౌషధం జంతుః సం శోధన మథేతరత్. 55. వీర్యాధికం భవతి భేషజ మన్నహీనం హన్యా త్తదామయ మసంశయ మాశుచైవ, తద్బాలవృద్ధయువతీమృదుభిశ్చ పీతమ్, గ్లానిం పరాం నయతి చాశు బలక్షయం చ. 56. అనులోమోనిల సాన్వ స్థ్యం క్షుత్తృష్ణాసుమనస్కతా, లఘుత్వమింద్రియోద్గార శుద్ధిర్జీర్ణౌషధాకృతిః. 57. క్లమో దాహోంగసదనం భ్రమో మూర్ఛా శిరోరుజా, అరతిర్బలహానిశ్చ సావశేషౌషధాకృతిః. 58. ఔషధ శేషే భుక్తం పీతం చ తథౌషధం సశేషేఽన్నే, ప్రకరోతి గదోపశమం ప్రకోప యత్యన్యరోగాంశ్చ. 59. శీఘ్రం విపాక ముపయాతి బలం న హింస్యాదన్నావృతం నచ ముహు ర్వదనా న్నిరేతి, ప్రాగ్భుక్తసేవిత మథౌ షధ మేతదేవ దద్యాచ్చ వృద్ధ శిశు భీరు వరాంగనాభ్యః. 60.

అన్ని విధములగు జ్వరములకును, శొంఠి, దేవదారు, ధనియములు, పెద్దములక, చిన్నములక అనుబృహతిలోవల రెండువిధములును తెచ్చి వీనితో కాచిన కషాయ మును పాచనమనగా జ్వరిమును యవనీయును. ఇయ్యది జ్వరమును పోగొట్టును. నీటిని త్రాగినవాడును, లంఘనము చేసినవాడును, దప్పిగొని యున్నవాడును, కృశించిన వాడును, అజీర్ణరోగియును, భుజించినవాడును, ఔషధమునుగాని, ఇతరవిధమగు శోధనను గాని సేవింపరాదు.

అన్నములేని యౌషధము పరాక్రమవంత మగును. ఇట్టియౌషధ మామయును చంపివైచును. సందేహము వలదు. కావున పిల్లలు, వృద్ధులు, యౌవనవతు లగు స్త్రీలు, మృదుశరీరులు మున్నగువా రౌషధమును అన్నములేక సేవించిన బడలిక నొందుదురు. శీఘ్రముగా బలమునునశించును. ఈవిషయమున సందేహము బొత్తుగా వలదు.

అనుకూలముగా వాయువువెడలుట, స్వస్థులై యుండుట, ఆకలి దప్పికల గలిగియుండుట, మనస్సు నిర్మలముగానుండుట, శరీరము తేలికగా నుండుట, ఇంద్రియములు కలుషితములుగాక ప్రసన్నములై యుండుట, త్రేపులు రాకుండుట మున్నగునవి జీర్ణౌషధునకు అనగా నౌషధము జీర్ణించినవానికి లక్షణములు. వాడబా రుట, ఆయాసమునొందుట, దప్పిగొనియుండుట, కాళ్లుచేతులు మొదలగు నవయవములు లాగుచుండుట, భ్రమకమ్ముట, మూర్ఛిలుట, తలనొప్పి, అసహ్యము, అరుచి మున్నగునవి మనోవ్యాకులము అనునీయవి కలయప్పుడు, ఔషధము జీర్ణముకాక శేషించియున్న దని తెలిసికొనవలయును.

---

1 'జీర్ణో' అనికూడ పాఠమున్నది.

ఔషధము పూర్ణముగా జీర్ణింపకముందు తినినయన్నమును, త్రాగిననీరును, అవిఘ్నముగానే అన్నము సంపూర్ణముగా జీర్ణింపక ముందు తీసికొనిన యౌషధమును, రోగమును శాంతి నొందింపదు. పైఁగా నిది ఇంకను ఇతరరోగములను పుట్టించును. అన్నావృతమైన యౌషధము, అనఁగా అన్నము చక్కఁగా జీర్ణమైనపిమ్మట దానితో ఇమిడిక పొందినదైనచో అట్టిఔషధము త్వరగా పక్వమై జీర్ణించును. బలమును నశింపనీయదు నోటినుండి మాటిమాటికి వెళ్లిరాదు. ఈపైని చెప్పియున్న తెఱఁగున యౌషధమును సాధారణముగా వైద్యులు ముదుసలివారికి, పిల్లలకు, భయస్వభావము గలవారికి, సౌందర్యవతు లగు నారీమణులకును ఈయవలయును.

ఔషధమును సేవించునప్పుడు గమనింపవలసిన మాత్రాపరిమాణము; క్వాథాది ఔషధముల విషయములోఁగల పరిమాణము, కషాయ విషయమున వైద్యుల పరిభాష.

శ్లో. మాత్రాయా నా_స్త్యవస్థానం దోషమగ్నిర్బలం వయః, వ్యాధిం ద్రవ్యం చ కోష్ఠం చ వీక్ష్య మాత్రాం ప్రయోజయేత్. 61. ఉత్తమస్య పలం మాత్రా త్రిభి శ్చాక్షైశ్చ మధ్యమే, జఘనస్య పలార్ధేన స్నేహక్వాథౌషధేషు చ. 62. కర్షాదాతు పలం యావ ద్దద్యాత్ షోడశికం జలం, తతస్తు కుడపం యావత్ తోయ మష్టగుణం పిబేత్. 63. క్వాథ్యద్రవ్యపలే కుర్యాత్ప్రస్థార్ధం పాదశేషితమ్.

రోగులకు ఔషధము నిచ్చునప్పుడు సాధారణముగా మాత్రల నింతింతలుగా నిట్లు ఈయవలయు నను సాధారణముగా నియమము లేదు. కాని వైద్యుఁడగువాఁడు, రోగికిఁగల దోషమును బలమును వయస్సును వ్యాధిని ఔషధమును జఠరకోష్ఠమును చక్కఁగా బరీక్షించి తదనుసారముగా నౌషధమాత్రల నుపయోగింపవలయును. తైలము కల్కము మున్నగువాని నుపయోగించునప్పుడు ఉత్తమమగుమాత్ర (అనఁగాజఠరాగ్నికలవానికిచ్చెడి మాత్ర) పలప్రమాణ ముండవలయును. మధ్యమము మూఁడుకర్షముల పరిమాణముననుండవలయును. అంతకంటెఁ దక్కువ పరిమాణముగల మాత్ర యన్నిటికంటె నధమము అనెదరు. స్నేహకషాయములఁ దయారుచేయుటలో ఒకకర్షము మొదలుకొని పలప్రమాణమువఱకు గలవానికి, పదియాఱురెట్ల నీటిని చేర్పవలయును. పలము మొదలుకొని కుడపమువఱకు గలవానికి నెనిమిదిరెట్లు ఉదకమును చేర్చవలయును. కల్కములు మున్నగు ప్రత్యేకక్వాథాదులయందు ఒకపలము యౌషధమునకు ప్రస్థపరిమాణము నీటిలో పక్వముచేసి నాల్గవభాగము నీరు మిగులునట్లు చేయవలయును. (దీనినే పాదావశేష విధి యని యందురు.)

### పలపరిమాణవిషయమున చరకాదుల మతభేదములు.

శ్లో. ద్వాత్రింశన్మాషకైర్మాషశ్చరకస్యతు తైః పలమ్. 64. అష్టచత్వారింశతా స్యాత్సుశ్రుతస్య తు మాషకః, ద్వాదశభి ర్ధాన్యమాషైశ్చతుష్షష్ట్యాతు తైః పలమ్. 65. ఏతచ్చ తులితం పంచరక్తి మాషాత్మకం పలమ్, చరకార్ధపలోన్మానం చరకే దశరక్తికైః. 66. మాషైః పలం చతుష్షష్ట్యా యద్భవేత్తద్ధరితం, తస్మాత్పలం చతుష్షష్ట్యా మాషకై ర్దశరక్తికైః 67. చరకానుమతం వైద్యైశ్చికిత్సా సూపయుజ్యతే.

చరకమహామునిమతానుసారముగా ముప్పదిరెండు మాషముల [మినపగింజల] యెత్తు ఒక మాషమగును. 48 మాషములయెత్తు పల మగును. ఇతనిమతమున నొకపలమునకు పదిరత్తికలనియందురు. సుశ్రుతునిమతానుసారము 12 మాషములయెత్తు మాషమును 64 మాషములయెత్తు పలమగును. ఈమతమున పలమనగా (అనగా 5 రతుల [గురిగింజలు]యెత్తు గలది) పలమగును. ఇయ్యది అనగా సుశ్రుతునియొక్క రత్తికలు, చరకముని యర్ధపలమునకు సమానము. పదిరత్తులు మాషమని యందురు. 64 మాషములచేత నగుపలమే ఇచ్చట గ్రహింపబడును. వైద్యులు చరకునిమతానుసారముగనే చికిత్సల యందు పలాదిప్రమాణములను ఉపయోగించుచున్నారు.

### వాతజ్వరమునకు చికిత్సలు; బిల్వాదిపంచమూలకషాయము; నేలవేముకషాయము; రాస్నాదికషాయము; పిప్పల్యాదికషాయములు; ద్రాక్షాదిక్వాథము.

శ్లో. బిల్వాదిపంచమూలస్య క్వాథస్స్యాద్వాతికే జ్వరే. 68. పాచనం పిప్పలీమూలం గుడూచీ విశ్వౌషధం వా, కిరాతాబ్దామృతోదీచ్య బృహతీద్వయ గోక్షురైః. 69. సస్థిరాకలశీవిశ్వైః క్వాథో వాతజ్వరాపహః, రాస్నా వృక్షాదనీ దారు సరళం శైలవాలుకమ్. 70. కషాయశ్శర్కరాక్షౌద్రయుక్తో వాతజ్వరాపహః, ప్రక్షేపః పాదికః క్వాథాత్ స్నేహే కల్కసమో మతః. 71. పరిభాషామిమామన్యే ప్రక్షేపోఽప్యాచిరే యథా, కర్షచూర్ణస్య కల్కస్యగుటికానాంచ సర్వశః. 72. ద్రవ్యశక్త్యా సలేహవ్యః పాతవ్యశ్చ చతుర్ద్రవః, మాత్రాక్షౌద్రఘృతాదీనాం స్నేహే క్వాథేషు చూర్ణవత్. 73. బిల్వాదిపంచమూలీచ గుడూచ్యామలకే తథా, కుస్తుంబురుసమోహ్యేష కషాయో వాతికే జ్వ

రే. 74. పిప్పలీ శారివా ద్రాక్షా శతపుష్పా హరేణుభిః,కృతః కషాయ స్సగుడో హన్యాత్పవనజం జ్వరమ్. 75. గుడూచీ శారివా ద్రాక్షా శతపుష్పా పునర్నవా, సగుడోఽయం కషాయ స్స్యాత్ వాతజ్వరవినాశనః. 76. ద్రాక్షా గుడూచీ కాశ్మర్యం త్రాయమాణా స్సశారిబాః, నిష్క్వాథ్య సగుడం క్వాథం పిబే ద్వాతజ్వరాపహమ్. 77. శతావరీ గుడూచీభ్యాం సర్వసో యంత్రపీడితః, గుడప్రగాఢ శ్శమయేత్ సద్యోఽనిలకృతం జ్వరమ్. 78.

బిల్వాది పంచమూలములు వీటికషాయమును గాని, వాతజ్వరితుల కీయవలయును. లేనిచో పిప్పలీమూలము, తిప్పతీగె శొంఠితో చేసిన కషాయమునైన నిచ్చినచో వాతజ్వరములు పక్వము లగును. నేలవేము, తుంగముస్తలు, తిప్పతీగె, కురువేరు, పెద్దములక,చిన్నములక,సుగుపల్లేరు,మయ్యాకుపొన్న, కోలపొన్న, శొంఠి వీటికషాయము (అనఁగా వీటిని సమభాగములుగ వేసి చేసినకషాయము) వాతజ్వరములను నాశనము చేయును.

సన్నరాష్ట్రము, బదనిక, సరళదేవదారు,ఏలకులు, కుంతురుబుడమ వీనిని సమభాగములుగా వేసి కషాయముగా గాచి తేనెతోను, చక్కెరతోను కలిపి పుచ్చుకొనిన వాతజ్వరములు నిర్మూలములగును. కల్కమైనయెడల నివి (అనఁగా శక్కర, తేనెమొదలగునవి) నాల్గవభాగమును కలుపవలయును. తైలమునందు సమానభాగమును వేయవలయును. ఈతైలమును చేయుటయందు చెప్పినట్లు క్రింద చూపించుచున్నాము. చూర్ణము, కల్కము, మాత్రలు, గుటికలు చేయునప్పుడు పలప్రమాణము మాత్రమే శర్కర, తేనె సమముగా చేర్చవలెను. ఇట్లేపాకవిధిలో చిక్కగాచేయునెడల ద్రవమునకు రెట్టింపుగను, ఇంకను ద్రవరూపముగ జేయునెడల నాల్గురెట్లును నీటిని చేర్చవలయును.

తేనె, నేయి మొదలగువానివిషయములో మాత్రా ప్రమాణ మెట్లనఁగా: చతుర్లో చూర్ణమువలె సమముగా చేర్చుటయుత్తమము. బిల్వము మొదలుగాగల పంచమూలములు వీనికే గురుపంచమూలములనిపేరు. తిప్పతీగె, ఉసిరిక, కొత్తిమరలు వీనిని అన్నిటిని సమానభాగములుగా వైచి కాచినకషాయము వాతజ్వరమును పోఁగొట్టఁగలదు. పిప్పళ్లు, సుగంధపాల, ద్రాక్ష,సదాప, రేణుకయను గంధద్రవ్యము, సోపు వీట్లతోటికాచఁబడిన కషాయమునందు బెల్లముగలిపి త్రాగినయెడల వాతజ్వరములు నశించిపోవును.

ద్రాక్ష, తిప్పతీగె, సుగంధిపాల, సదాప, తెల్లగజ్జేరు వీటితో సమభాగముగ కాచినకషాయమునందు బెల్లమునుకలిపి సేవించిన నది వాతజ్వరములను మొదలంటునట్లు అణఁచివేయును. ద్రాక్ష, తిప్పతీగె, వట్టివేళ్లు, కలుక్రామగ వీటిని వేసి కాచినకషాయములో మంచిబెల్లమును గలిపి త్రాగిన వాతజ్వరము నశించిపోవును. తిప్పతీగె వీటిని యంత్రములోనుంచి మర్దించి, వీటినుండితీయఁబడిన రసమునందు బెల్లమును కలిపి త్రాగినయెడల తత్క్షణమే వాతప్రకోపమువలనఁ బుట్టిన జ్వరమును నశింపఁజేయును.

[పిత్తజ్వరచికిత్సలు; కళింగాదికషాయము; తిక్తాదిచూర్ణము; గూడూచీ క్వాథము; పటోలాదిగుటికలు; దూలగొండిస్వరసము; త్రాయమాణాదిక్వాథములు, మృద్వీకాదికషాయములు, పర్పటకక్వాథము; శుంఠ్యాదికషాయము; ద్రాక్షాదికషాయము.]

శ్లో. కలింగం కట్ఫలం, ముస్తం పాఠాం తిక్తకరోహిణీమ్, పక్వం సశర్కరం పీతం పాచనం పైత్తికే జ్వరే. 80. సక్షౌద్రం పాచనం పైత్తే తిక్తాబ్దేన్ద్రయవైః కృతమ్, లోధ్రోత్పలామృతా పద్మశారివాణాం సశర్కరః. 81. క్వాథః పిత్తజ్వరం హన్యాదథవా పర్పటోద్భవః,* [1]పటోలేంద్రయవక్వాథో మధునా మధురీకృతః. 82. తీవ్రపిత్తజ్వరామర్ది పానాత్తృట్దాహనాశనః, దురాలభా పర్పటక ప్రియంగు భూనింబవాసా కటురోహిణీనామ్, జలం పిబే చ్ఛర్కరయావగాఢం, తృష్ణాస్రపిత్తజ్వరదాహయుక్తః 83. త్రాయమాణా చ మధుకం పిప్పలీమూల మేవచ, కిరాతతిక్తకం ముస్తం మధుకం సవిభీతకమ్. 84. సశర్కరం పీత మేతత్పిత్తజ్వర[2]నిబర్హణం, మృద్వీకా మధుకం నింబం కటుకా రోహిణీసమా. 85. అవశ్యాయస్థితం పాక్యమేతత్పిత్తజ్వరాపహమ్, ఏకః పర్పటకః శ్రేష్ఠః పిత్తజ్వర వినాశనః. 86. కింపున ర్యది యుజ్యేత చందనోదీచ్యనాగరైః, విశ్వాంబుపర్పటోశీరఘనచందనసా

* [గుడూచీపద్మలోధ్రాణాం శారిబోత్పలయోస్తథా, శర్కరామధురః క్వాథః శీతః పిత్తజ్వరాపహః.] ఈశ్లోకము కొన్నిప్రతులలో నున్నది. తిప్పతీగె కమలములు, లొద్దుగచెక్క వీనితో గాని, సుగంధిపాలకలువలు వీనితో గాని సమభాగముగ కషాయముగాచి చెక్కరవైచి చల్లార్చి త్రాగిన పిత్తజ్వరములు హరించునని దీనిభావము. ఇది సుశ్రుతములో నున్నది.

1 'పటోల యవనిష్క్వాథ'. 2 'వినాశకమ్' అని పాఠాంతరములు.

**ధితం. 87. దద్యాత్సుశీతలం వారి తృట్ఛర్దిజ్వరదాహనుత్, పర్పటామృతధాత్రీణాం క్వాథః పిత్తజ్వరాపహః. 88. ద్రాక్షారగ్వధయోశ్చాపి కాశ్మర్యా శ్చాథవా పునః. 89. ద్రాక్షాభయా పర్పటకాబ్దతిక్తా క్వాథం ససమ్యాకఫలం విదధ్యాత్, ప్రలాపమూర్ఛా భ్రమదాహ శోష తృష్ణాన్వితే పిత్తభవే జ్వరే తు. 90.**

పిత్తజ్వరమునకు చేయవలసిన చికిత్స.—కొండిసెనిత్తనాలు, నేలగుమ్మడు, తుంగముస్త, చేదుపొట్ల, అగరుశొంఠి, కటుకరోహిణి వీటిని సమముగా నీటిలో వైచి చక్కగాకాచి శర్కరనువైచి పిత్తజ్వరముగలవారి క్రియవలయును. ఇది పిత్తజ్వరము నకు చేయఁదగిన పాచనము. చేదుపొట్ల, తుంగగడ్డలు, కొండిసెపాలవిత్తులు వీని చేత చేయఁబడిన పాచనమునందు తేనెకలిపి వాడవలయును. లొద్దుగు, నల్లకలువ, తిప్పతీగ, కమలములు, సుగంధిపాల వీట్ల సమభాగములతో జేయఁబడిన కషాయము నందు చక్కెరనుకలిపి త్రాగిన పిత్తజ్వరమును నశింపఁజేయును. పర్పాటకముతో చేయఁబడిన కషాయమైనను పిత్తజ్వరములను పోఁగొట్టగలుగును. చేదుపొట్ల, యవలు వీనితో కాచఁబడినకషాయమునందు తేనెను కలిపి తీసికొనించి త్రాగినయెడల అతితీవ్రముగా వచ్చిన పిత్తజ్వరములైనను నశించిపోవును. ఈకషాయము త్రాగినంతనే అతిదాహము మున్నగు నవగుణములును నశించిపోవును.

మాలగొండి, పర్పాటకము, ప్రేంకణపుచెక్క, నేలవేము, అడ్డసరము, కటుకరోహిణి వీటితోసిద్ధముచేసిన స్వరసమునందు శర్కరను మిశ్రమముచేసి త్రాగి యెడ విదాహము, చెమట, పిత్తజ్వరమును నశించిపోఁగలవు. కిలుక్రానుగ, మధుకము, మోడి, వాయువిడంగము, చేదపొట్ల, ముస్త, తుంగముస్తలు, విప్పపువ్వు, తాడికాయ వీనితో సమభాగముగ పక్వముచేయఁబడిన కషాయమునందు చక్కెరను కలిపి త్రాగిన పిత్తజ్వరములు నశించి పోఁగలుగును.

ద్రాక్ష, యష్టిమధుకము, వేపవేళ్లు, లేక వేపచెక్క, కటుకరోహిణి వీనినిసమాన భాగములను తీసికొని మంచునీటిచే పాకమునుచేసి త్రాగించిన పిత్తజ్వరము లణగిపోవును. ఇదియే పిత్తజ్వరములకు పాచనము. లేనిచో కేవల మొక్కపర్పాటకమే పిత్తజ్వరముల నణంచుటకు నుత్తమముగాఁ బనిచేయగలదు. ఇది ఎఱ్ఱగంధపుపొడి, కురువేరు, శొంఠి మున్నగువానితోగూడినచో నిఁక దాని ప్రభావము చెప్పుటకు నలవియగునా? అనఁగా నత్యంత ముత్తమ మనట.

శొంఠి, కురువేరు, పర్పాటకము, వట్టివేరు, తుంగగడ్డలు, ఎఱ్ఱగంధపుపొడి వీని చేత సమభాగముగా సిద్ధముచేయఁబడిన చల్లనియుదకము దప్పి, ఛర్ది విదాహముగల

పిత్తజ్వరమును పోఁగొట్టును. పర్పాటకము, ఉసిరిక వీటితో చేయఁబడిన క్వాథముగాని; ద్రాక్ష, తిప్పతీగె, రేలచెక్క వీటితో చేయఁబడిన కషాయముగాని పిత్తజ్వరమును పూర్ణముగా నశింపఁజేయును. ద్రాక్ష, కరక్కాయ, పర్పాటకము, తుంగముస్తలు, కటుకరోహిణి, రేలచెక్క వీటితో సమభాగముగ సిద్ధము చేయఁబడిన క్వాథమును, ప్రలాపము, మూర్ఛపోవుట, భ్రాంతికప్పుట, అతిదాహము, సొమ్మసిల్లుట, దప్పి, అరకయుండుట ఈమొదలగు గుణము లుండెడి, పిత్తజన్యమైన జ్వరము వచ్చినరోగికి యిచ్చినయెడల నెమ్మది కలుగును.

[పిత్తజ్వరము గలవానికి శీతక్రియలు; ధాన్యాకశ్రుతము; అభ్యంజనము; శిరోలేపనము; ఉద్వర్తనాదులు; కాంజికవస్త్రధారణము; మాతులుంగబంధనము.]

శ్లో. వ్యుషితం [1]ధాన్యకజలం ప్రాతః పీతం సశర్కరం పుంసామ్, అన్తర్దాహం శమయత్యచిరాద్దూరప్రరూఢమపి. 91. పిత్తజ్వరేణ తప్తస్య క్రియాం శీతాం సమాచరేత్, విదారీదాడిమం లోధ్రం [2]దధిత్థం బీజపూరకమ్. 92. ఏభిః ప్రదిహ్యా న్మూర్ధానం తృడ్దాహార్తస్య దేహినః, ఘృతభృష్టామ్లపిష్టాచ ధాత్రీలేపాచ్చ దాహనుత్. 93. అమ్లపిష్టై స్సుశీతైర్వా పలాశతరుజై [3]ర్లిహేత్, బదరీపల్లవోత్థేన ఫేనే నారిష్టకస్య [4]చ. 94. కాలేయ చందనానన్తా యష్టీబదర కాంజికైః, సఘృతై స్స్యా చ్ఛిరోలేప స్తృష్ణాదాహార్తిశాంతయే. 95. ఉత్తానసుప్తస్య గభీరతామ్ర కాంస్యాదిపాత్రం ప్రణిధాయ నాభౌ, తత్రాంబుధారా బహుళా పతంతీ నిహంతి దాహం త్వరితం సుశీతా. 96. శీతకాంజిక వస్త్రావగుంఠనం దాహనాశనమ్, జిహ్వాతాలుగళక్లోమ శోషే మూర్ధ్నితు దాపయేత్. 97. కేసరం మాతులుంగస్య మధు సైంధవసంయుతమ్.

పిత్తజ్వరమునకు చేయవలసిన శైత్యోపచారములను చెప్పుచున్నాఁడు—ధనియాలను నీటిలో రాత్రియంతయును నానవైచి, ఆనీటిని చక్కెరఁ గలిపికొని త్రాగినయెడల రోగులకు కలిగిన భయంకరమగు నంతర్దాహము ముదిరినదైనను శీఘ్రముగా నశిం

1 ధాన్యకజలం. 2 కపిత్థం. 3 ర్దహేత్. 4 వా.

చిపోఁగలదు. పిత్తజ్వరముచే సంతాపము కలిగినమనుష్యునికి శీతలోపచారము అవశ్యముగాఁ జేయవలయును.

వేలగుమ్మడు, దానిమ్మపండు, లొద్దుగ, వెలగ, మాద్దీఫలము వీటిని అనఁగా కేసరములను నీటితో మెత్తగానూరి, దాహము ఎక్కువగా గలిగిన రోగియొక్క మాడునకు పట్టు వేయవలయును. నేతిలోగాని, నిమ్మపండ్లరసములోగాని, ఉసిరికపట్టును అమ్లకాంజికముతో నూరి పట్టువేసినయెడల దాహ మణఁగిపోవును. మోదుగచిగుళ్లను గాని, పూవులనుగాని ఉసిరికపట్టునుగాని అమ్లకాఁజికముతో నూరి పూసినను దాహము శాంతి నొందఁగలదు. రేఁగుఆకులను పిండగా వచ్చినరసముతో కుంకుడుకాయల నురుగును చేసి పూసినను తగ్గిపోవును. హరిచందనము, నల్లనుగంధిపాల, యష్టిమధుకము, రేగుపండ్లు వీనిని గంజితోనూరి దానిలో నేతిని కలిపి తలకు పట్టువేసినయెడల, తృష్ణ, దాహము కలిగిన జ్వరములనైనను నశింపఁజేయును.

మనుష్యుని (అనగా రోగిని) వెల్లకిలఁ బరుండఁబెట్టి, ఆమనుష్యునిబొడ్డుపైన లోతైనరాగిపాత్రనుగాని కంచుపళ్లెరమునుగాని పెట్టి, ఆపాత్రయందు సన్నగా చాల ఎత్తునుండి నీటిని ధారకట్టునట్లు పోసినయెడల అతిదాహమును త్వరగా తగ్గించివైచును. చల్లనినీటిలోనుగాని, గంజిలోగాని గుడ్డను ముంచి శరీరముపై నుంచినయెడల దాహ ముపశమించిపోవును. నాలుక, దవడలు, గొంతుక, దాహస్థానము ఇవి పైత్యజ్వరాధిక్యముచేత ఎండిపోయిన యప్పుడు తలపైని మాదీఫలమును, తేనె, సైంధవలవణము వీనినినూరి లేపనము చేయవలయును.

[కఫజ్వరచికిత్స:— మాతులుంగాదిచూర్ణము; కఫహరద్రవ్యములు;
కటుకాదిక్వాథములు; నింబాదికషాయములు; దీపనపాచన
యోగములు, త్రిఫలాముస్తాదిక్వాథములు.]

మాతులుంగ శిఫా విశ్వ బ్రాహ్మీ గ్రంధికసంభవమ్. 98. కఫజ్వరేంబుసక్షారం పాచనంవా కణాదికం, పిప్పలీ పిప్పలీమూలం చవ్యచిత్రకనాగరమ్. 99. మరీచైలాజమోదేంద్ర పాఠా రేణుకజీరకం, భార్గీ మహానింబఫలం హింగురోహిణిసర్షపం. 100. విడంగాతివిషే మూర్వా చేత్యయం కీర్తితోగణః, పిప్పల్యాదిః కఫహరః ప్రతిశ్యారోచకా[1]నిలాన్. 101. నిహన్యా ద్దీపనో గుల్మశూలఘ్న స్త్వామపాచనః, కటుకం చిత్రకం నింబం హరిద్రాతివిషే [2]వచాం. 102. కుష్ఠ మింద్ర

1 జ్వరాన్. 2 వచా,

యవం మూర్వాం పటోలం చాపి సాధితం. పిబే న్మరిచసంయుక్తం స క్షౌద్రం శ్లేష్మికే జ్వరే. 103. నింబవిశ్వామృతా దారు శటీభూనింబ పౌష్కరం, పిప్పల్యా బృహతీచేతిక్వాథో హంతి కఫజ్వరం. 104. సింధువారదల[1]క్వాథం శోషణం కఫజే జ్వరే, జంఘయోశ్చ బలే క్షీణే కర్ణే వా విహితేపి బేత్. 105. ఆమలక్యభయా కృష్ణా చిత్రక శ్చేత్యయం గణః, సర్వజ్వరకఫాతంక భేదీ దీపనపాచనః. 106. త్రిఫలాపటోలవాసాచ్ఛిన్నరుహా తిక్తరోహిణీ షడ్గ్రంథాః, మధునా శ్లేష్మసముత్థే దశమూలీవాసకస్య వా క్వాథః. 107. ముస్తం వాత్సకబీజాని త్రిఫలా కటురోహిణీ, పరూషకాణి చ క్వాథః కఫజ్వరవినాశనః. 108.

కఫజ్వరచికిత్సా:—మాదీఫలము, శొంఠి, సరస్వతిఆకు, మోడి, వట్టివేరు వీటితో చేసిన క్వాథమునందు యవక్షారమును కలిపి త్రాగినయెడల కఫజ్వరములు నశించును. కణాది క్వాథముచేతఁగూడ నీకఫజ్వరములు పోఁగలవు. కణాది క్వాథ మనఁగా పిప్పల్యాదికమును వేసి కాచిన కషాయము. ప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, మిరియములు, ఏలకులు, ఓమము, దాల్చినపట్ట, అగరుశొంఠి, రేణుకలు, జీలకఱ్ఱ, గంటుభారంగి, గజనిమ్మపండు, ఇంగువ, కటుకరోహిణి, ఆవాలు, వాయువిళంగములు, అతివస, చాగవేళ్లు వీటిని కఫహరమగు కణాదిగణమని చెప్పెదరు. అనఁగా పిప్పల్యాది గణపఠితము లగు శబ్దము లని యర్థము.

ఈపిప్పల్యాదిగణము కఫమును పోఁగొట్టును. మఱియును, పీనస లేక పడిసెము. అరోచకము, వాతరోగము అనువానిని నశింపఁజేయును. జఠరాగ్నిని దీపింపఁజేయును, గుల్మము, శూలరోగము వీటిని మొదలంట నశింపజేయును. ఆమమును పక్వముజేయును. కటుకరోహిణి, చిత్రమూలము, వేఁపచెక్క, మ్రానిపసపు, అతివస, వస, చెంగల్వకోష్ఠు, కొడిసెపాలవిత్తులు, చాగవేళ్లు, వేదుపాళ్ల, (పాట్లఆకులని కొందఱు) వీనితో కషాయమును సమభాగముగచేసి మిరియములచూర్ణమును తేనెను కలిపి త్రాగిన కఫజ్వరములు నశించును.

వేపచెక్క, శొంఠి, తిప్పతీగ, దేవదారుచెక్క, కచ్చూరము, నేలవేము, పుష్కరమూలము రెండువిధములగు పిప్పళ్లు, అనఁగా పిప్పళ్లు, గజపిప్పళ్లు, పెద్దములక వీటిని కషాయమునందు వైచి కాచి కఫజ్వరములు గలవారిచేత త్రాగించుచుండవలయును. తెల్లవావిలిఆకులతోచేసిన క్వాథము కఫజ్వరమును ఖండింపఁజేయును. మఱి

[1] పి క్వాథః.

యును, పిక్కలయందు బలములేనియప్పుడును, చెవులు మూసికొని పోయినప్పుడును ఈకషాయమును సేవించినయెడల హితము కలుగును. ఉసిరిక, కరక్కాయ, పిప్పళ్లు, చిత్రమూలము, ఈగణము అన్నివిధములైన కఫజ్వరములను పోఁగొట్టును.

అడ్డసరము, తుంగముస్తలు, కొడిశెపాలవిత్తనములు, త్రిఫలములు, కటుకరోహిణి, చిట్టీతకాయలు వీటితోటి చేయఁబడిన క్వాథము కఫజ్వరమును పోఁగొట్టును.

### చాతుర్భద్రావలేహిక; శ్వాసాదులకు పిప్పలీచూర్ణము; ద్వంద్వజ్వరచికిత్స.

శ్లో. కట్ఫలం పౌష్కరం శృంగీకృష్ణాచ మధునాసహ, కాసశ్వాసజ్వరహరః శ్రేష్ఠో లేహః కఫాంతకృత్. 110. కర్షశ్చూర్ణస్య కల్కస్య గుటికానాం చ సర్వశః, ద్రవశుక్తాః స లేహవ్యః పాతవ్యశ్చ చతుర్ద్రవః. 111. ఊర్ధ్వజత్రుగరోగఘ్నీ సేయం స్యాదవలేహికా, అధోరోగహరీయా తు సా పూర్వం భోజనాన్మతా. 112. క్షౌద్రోపకుల్యాసంయోగః కాసశ్వాసజ్వరాపహః, ప్లీహానం హంతి హిక్కాంచ బాలానాం చ ప్రశస్యతే. 113. సంసృష్టదోషేషు హితం సంసృష్ట మథ పాచనం.

ఇప్పుడు చాతుర్భద్రావలేహికను చెప్పుచున్నాడు—నేలగుమ్ముడు, పుష్కరమూలము, కర్కాటకశృంగి, పిప్పళ్లు వీటిని సమభాగముగ చూర్ణమును చేసి తేనెలోకలిపి తినినట్టులయినచో దగ్గు, శ్వాసము, జ్వరము, కఫము వీటిని పోఁగొట్టును. ఇట్లు సిద్ధము చేసిన యవలేహికను సాయంకాలమునందు గ్రహించినయెడల జత్రువుసంగలిరోగము అనఁగా గొంతుకకు క్రిందిభాగమునఁ బుట్టెడివ్యాధులను కూడ పోఁగొట్టును. ఈఅవలేహికను భోజనము చేయుటకు ముందుగానే పుచ్చుకొనవలయును. పిప్పళ్లును, తేనెను కలిపినయెడల, దగ్గును, శ్వాసమును, జ్వరమును పోఁగొట్టఁగలుగును. మఱియును ప్లీహను పోఁగొట్టును. వెక్కిళ్ల నణఁచును. ఇది బాలురను మిక్కిలి శ్రేష్ఠమైనదియును కూడ నై యున్నయది. గుంపుగా నొకచోటఁ జేరిన దోషములయందు అనఁగా ననేకరోగములు ఒక్కటిగా సంసృష్టములై యున్న విషయములలో మిక్కిలి హితకారి యగును. పాచనమును అనఁగా జీర్ణమునుగూడ చేయుచుండును.

### నవాంగకషాయము.

శ్లో. విశ్వామృతాబ్దభూనింబైః పంచమూలీసమన్వితైః. 114 కృతః కషాయో హంత్యాశు వాతపిత్తోద్భవం జ్వరం, త్రిఫలా శాల్మలీ రాస్నా రాజవృక్షాటరూషకైః. 115. శృతమంబు హరేత్తూర్ణం వాతపిత్తో

ద్భవం జ్వరం, కిరాతతిక్తమమృతాం ద్రాక్షా మామలకీం శఠీం. 116. నిష్కాథ్య పిత్తానిలజే క్వాథం తం సగుడం పిబేత్.

శొంఠి, తిప్పతీగె, తుంగముస్తలు, నేలవేము, లఘుపంచమూలములు వీటితో చేసిన క్వాథము వాతపిత్తములవలనఁ బుట్టిన జ్వరమును పోఁగొట్టును. త్రిఫలములు, బూరుగువేరు, సన్నరాస్న, రేలగుజ్జు, అడ్డసరము వీటితోఁ జేయఁబడిన క్వాథము వాతపిత్త జ్వరములను హరించును. తిప్పతీగె, ద్రాక్ష, ఉసిరిక, కచ్చూరము వీటి సమభాగకషాయములో బెల్లమునుగలిపి సేవించిన వాతపిత్తజ్వరములు నశించును.

వాతపిత్తజ్వరాలకు నిదిగ్ధికాదికషాయము; పంచభద్రము; మధుకాదిశీతము.

శ్లో. నిదిగ్ధికా బలా రాస్నా త్రాయమాణాఽమృతాయుతైః. 117. మసూరవిదళైః క్వాథో వాతపిత్తజ్వరం జయేత్, గుడూచీ పర్పటం ముస్తా కిరాతం విశ్వభేషజం. 118. వాతపిత్తజ్వరే దేయం పంచభద్రమిదం శుభం, మధుకం సారిబా ద్రాక్షే మధుకం చందనోత్పలం. 119. కాశ్మర్యపద్మకం లోధ్రం త్రిఫలాం పద్మకేసరం, పరూషకం మృణాళం చ న్యసేదుష్ణాంమవారిణి. 120. మధులాజసితాయుక్తం తత్పీత ముషితం నిశి, వాతపిత్తజ్వరం దాహతృష్ణామూర్ఛాభ్రమాన్. 121. శమయే ద్రక్తపిత్తం చ జీమూతానివ మారుతః.

వాకుడు, సుద్ద పల్లేరుగము, సన్నరాస్న, కలుద్రాసుగ, తిప్పతీగె, చిల్లిపెసర, నల్లతెగడ వీటికషాయము వాతపిత్తజ్వరముల నణంచును. తిప్పతీగె, పర్పాటకము, తుంగముస్తలు, నిడంగాలు, శొంఠి వీటితోఁ జేయఁబడిన కషాయమునకు పంచభద్ర మని పేరు. ఇది వాతపిత్తజ్వరములకు శ్రేష్ఠము. యష్టిమధుకము, తిప్పతీగె, సుగంధపాల వేళ్లు; (నల్లవి, తెల్లవి) ద్రాక్ష, ఇప్పపూవు, ఎఱ్ఱచందనము, నలుకలువ, గుమ్ముడు, పద్మకములు, లొద్దుగ, త్రిఫలములు, కమలముల కింజల్కములు, చిట్టీతపండ్లు, తామరతూడు వీటిని నిర్మలమైన నీటిలో వైచి రాత్రియంతయును నానవైచి దానిలో పర్పాటకము, పేలపిండి, చక్కెర కలిపి త్రాగవలయును. ఇది వాతపిత్తజ్వరమును, విదాహమును, మూర్ఛ, పడిపోవుట మొదలగురోగములను, గాలి మేఘములనువలె రక్తపిత్తజ్వరములను గూడ నశింపజేయును.

పిత్తశ్లేష్మములకై పటోలాదిగణము; గుడూచ్యాదిగణము.

శ్లో. పటోలం చందనం మూర్వా తిక్తా పాఠా మృతా గణః. 122. పిత్తశ్లేష్మారుచిచ్ఛర్ది జ్వరకండూవిషాపహః, గుడూచీ

నింబధాన్యాకం పద్మకం చందనాని చ. 123. ఏష సర్వజ్వరాన్ హంతి గుడూచ్యాదిస్తు దీపనః, హృల్లాసారోచకచ్ఛర్ది పిపాసాదాహ నాశనః. 124.

చేదుపొట్ల, ఎఱ్ఱగంధము, చాగ, కటుకరోహిణి, విషబొద్ది, తిప్పతీగె, ఈవస్తువులు పటోలాది గణ మనఁబడును. ఇయ్యది పిత్తము, కఫము, అరుచి, ఛర్ది, జ్వరము, దుఃఖద, విషము మొదలగువానిని పోఁగొట్టును. తిప్పతీగ. నిమ్మకాయ, ధనియాలు, పద్మకములు, రక్తచందనము అను వీటిని గుడూచ్యాది గణమని యనియెదరు. ఇది అన్నివిధములగు జ్వరములను పోఁగొట్టును. ఆకలిని పుట్టించును. ఎప్పుడును అతిగా ఉమ్మివేయుట, పదార్థములపైని యసహ్యత, ఛర్ది, నీటియందిచ్ఛ, దాహము వీటిని బోఁగొట్టును.

శ్లో. కిరాతం నాగరం ముస్తం గుడూచీంచ కఫాధికే,
పాఠోదీచ్యమృణాలైస్తు సహ పిత్తాధికే పిబేత్. 125

నేలవేము, శొంఠి, తుంగముస్తలు, తిప్పతీగె, వీటిని కఫ మెక్కువగా నుండిన జ్వరమునం దుపయోగింపవలయును. విషబొద్ది, కురువేరు, తామర అను వానిని పిత్తాధిక్యమువలన సంభవించెడు జ్వరమునందుపయోగింపవలయును.

కంటకార్యాదివర్గము; వాసాకషాయము; పటోలాదికషాయము.

శ్లో. కంటకార్యమృతా భార్గీ నాగరేంద్రయవాసకం, భూనింబం చందనం ముస్తం పటోలం కటురోహిణీ. 126. కషాయం పాయయేదేత త్త్రిదోషజ్వరాపహం, దాహతృష్ణారుచిచ్ఛర్ది కాసహృత్పార్శ్వశూల నుత్. 127. సపత్రపుష్పవాసాయాం రసః క్షౌద్రసితాయుతః, కఫపిత్తజ్వరం హంతి సాస్రపిత్తం సకామలం. 128. పటోలం పిచుమర్దశ్చ త్రిఫలా మధుకం బలా, సాధితోఽయం కషాయ స్స్యాత్ త్రిదోషోద్భవే జ్వరే. 129.

వాకుడు, తిప్పతీగె, గంటుభారంగి, శొంఠి, కొడిసెపాలవిత్తులు, దూలగొండి, నేలవేము, రక్తచందనము, తుంగముస్తలు, చేదుపొట్ల, కటుకరోహిణి వీనిని సమభాగముగా కషాయముగా గాచి త్రాగించినయెడల పైత్యాధిక్యమువలనగాని, శ్లేష్మమువలనగాని వచ్చిన జ్వరములను వెంటనే యణఁచివేయును. దాహము, నీటిని త్రాగునిచ్ఛ, దప్పి, అరుచి, వాంతి, కాసము, రొమ్మునొప్పి, పార్శ్వపునొప్పి ఈమొదలగువానినిగూడ నశింపఁజేయఁగలదు. ఇదియే కంటకార్యాది వర్గము అనఁబడు.

ఆకులు, పూవులుతో యడ్డసరపు తీగెతెచ్చి దంచి దానిరసమునందు తేనెను శర్కరను కలిపికొని త్రాగినయెడల కఫపిత్తజ్వరములను, రక్తపిత్తమును, కామెరలను నశింపఁజేయును. చేదుపొట్ల, వేపవేళ్లు, త్రిఫలములు, యష్టిమధుకము, ముత్తకపులగము వీనితోఁ జేయఁబడిన కషాయమును సేవించినయెడల పిత్తమువలనను, శ్లేష్మమువలనను ఉద్భవించిన జ్వరము లణఁగిపోవును.

అమృతాష్టకము; పంచతిక్తము.

శ్లో. గుడూచీంద్రయవారిష్ట పటోలం కటురోహిణీ, నాగరం చందనం ముస్తా పిప్పలీచూర్ణసంయుతం. 130. అమృతాష్టక ఇత్యేష పిత్తశ్లేష్మజ్వరాపహః, హృల్లాసారోచకచ్ఛర్ది తృష్ణాదాహనివారణః. 131. పటోలయవధాన్యాకం మధూకామలకచందనం, పైత్తికే శ్లేష్మపిత్తోత్థే జ్వరే తృట్ఛర్దిదాహనుత్. 132. క్షుద్రామృతాభ్యాం సహ నాగరేణ సపౌష్కరం చైవ కిరాతతిక్తం, పిబేత్కషాయం త్విహ పంచతిక్తం జ్వరం నిహంత్యష్టవిధం సమగ్రమ్. 133.

అమృతాష్టకమును జెప్పుచున్నాడు—తిప్పతీగె, కొడిసెపాలవిత్తులు, వేప, చేదుపొట్ల, కటుకరోహిణి, శొంఠి, రక్తచందనము, తుంగముస్తలు, పిప్పళ్లు వీనిని కషాయముగా గాఁచి త్రాగవలయును. దీనినే అమృతాష్టకమని యందురు. ఈఅమృతాష్టకము, పిత్తజ్వరములను పోగొట్టును. మఱియును నోటివెంట నుమ్మిఊరుచుండుట, అరోచకము, ఛర్ది, దాహము, దప్పి మొదలగువానిని దూరముగాఁ బాఱఁదోలును.

చేదుపొట్ల, యవలు, కొత్తిమెర, పెసలు, ఉసిరిక, రక్తచందనము నీటితో సమభాగముగ కషాయమును పెట్టి పుచ్చుకొనిన పిత్తజ్వరకఫజ్వరములయందుండెడి దప్పి, ఛర్ది, గొంతెండిపోవుట అనునివి మొదలంట నణఁగిపోవును. వాకుడు, తిప్పతీగె, శొంఠి, పుష్కరమూలము, నేలవేము ఈఅయిదును పంచతిక్తము లనఁబడును. ఈపంచతిక్తములతో చేసిన కషాయమును సేవించినయెడల, ఎనిమిదివిధములయిన జ్వరములను సంపూర్ణముగా నశించిపోగలవు.

[కఫపిత్తజ్వరములకై కటుకాదియోగములు; ధాన్యకాదియోగములు; వాతశ్లేష్మజ్వరచికిత్స; వాలుకాస్వేదనము; ముస్తాదిక్వాథము.]

సశర్కరా మక్షమాత్రాం కటుకా ముష్ణవారిణా, పీత్వా జ్వరే జయే జ్జంతుః కఫపిత్తసముద్భవం. 134. దీపనం కఫవిచ్ఛేది వాతపిత్తానులోమనం, జ్వరఘ్నం పాచనం భేది శృతం ధాన్యపటోలయోః. 135.

కఫవాతజ్వరే స్వేదాన్ కారయేద్రూక్షనిర్మితాన్, స్రోతసాం మార్దవం కృత్వా నీత్వా పావకమాశయం. 136. హత్వా వాతకఫస్తంభం స్వేదో జ్వర మపోహతి. ఖర్పరభృష్టపటస్థిత కాంజికసిక్తో హి వాలుకా స్వేదః, శమయతి వాతకఫామయ మస్తకశూలాంగభంగాదీన్. 137. ముస్తానాగర భూనింబం త్రయ మేతత్త్రికార్షికం, కఫవాతాఽఽమ శమనం పాచనం జ్వరనాశనమ్. 138.

చక్కెరతో కలిసిన కటుకరోహిణిని ఒక్కొక్క అర్ధకర్షముగా చేకొని వేడినీళ్లతో కూడ త్రాగినయెడల కఫజ్వరములును, పిత్తజ్వరములును, వాతపిత్తజ్వరములును నశించిపోవును.

ధనియములు, చేదుపొట్ల వీటికషాయము జఠరాగ్నిని దీపింపజేయును. కఫమును బోఁగొట్టును. వాతపిత్తములకు సమానత్వమును కలుగచేయును. జ్వరమును పోఁగొట్టును. ఆహారాదులను పక్వముచేయును. భేదిని కలిగించును.

కఫము వాతము మున్నగువానిచే వచ్చిన జ్వరములయందు రూక్షపదార్థములవలన చెమ్మట కలుగునట్లు రక్తనాడులను శుభ్రపఱచి, మృదువుగా చేసి జీర్ణకోశమునందలి యగ్నిని వృద్ధిపొందించునట్లు చేయవలయును. వాతము కఫము అను వీటి యావద్రోగము లను గూలద్రోసి జ్వరమును పోఁగొట్టగలదు. పెనముపైనఁగాని మూఁకుడులోఁగాని ఇసుకను వేయించి కాఁచి తరువాత దానిని ఒకగుడ్డయందు కట్టి గంజిలో ముంచి దానిచేత యొడలిని తడపవలయును. దీనిపేరు వాలుకాస్వేదము. ఈవాలుకాస్వేదము వాతరోగములను, కఫరోగములను, తలనొప్పిని, కాళ్లుచేతులు లాగుటను ఈమొదలగు బాధలను అణఁచివేసి సౌఖ్యము నీయఁగలదు.

తుంగముస్తలు, శొంఠి, నేలవేము ఈమూఁడువస్తువులను పలముచొప్పున తీసికొని కాచి ఆకషాయము నిచ్చినచో కఫమును, వాతమును, ఆమమును తగ్గించివైచును. పాచనముగూడ నగును. జ్వరము నణఁచివేయును.

## కఫవాతజ్వరములకై పంచకోలకషాయము; పిప్పలీఘృతము; ఆరగ్వధాదిక్వాథము.

శ్లో. పిప్పలీ పిప్పలీమూల చవ్యచిత్రకనాగరం, దీపనీయః స్మృతో వర్గః కఫానిలగదాపహః. 139. పిప్పలీభి శ్శృతం తోయం అనభిష్యంది దీపనం, వాతశ్లేష్మవికారఘ్నం ప్లీహాజ్వర వినాశనం .140. ఆరగ్వధగ్రంథికముస్తతిక్తా హారీతకీభిః క్వథితఃకషాయః,

యః, సామే సశూలే కఫవాతయుక్తే జ్వరే హితో దీపనపాచనశ్చ. 141

పిప్పళ్లు, పిప్పలీమూలము, (పిప్పలి, మోడి,) చవ్యము, చిత్రమూలము, శొంఠి ఇవి పంచమూల మని చెప్పఁబడును. ఈపంచమూలముల కషాయము జఠరాగ్నిని వృద్ధిని బొందించును. కఫసంబంధములయిన వాతసంబంధములయిన రోగములను నిశ్శేషముగా బోఁగొట్టును. పిప్పళ్లకషాయము కఫమును బుట్టింపదు. జఠరాగ్నిని వృద్ధి నొందించును. వాతకఫములవలనను శ్లేష్మవికారమువలనను కలిగిన రోగములను నశింపజేయును. రేలచెక్క, పిప్పలిదుంప, మోడి, తుంగముస్తలు, కటుకరోహిణి, కరక్కాయలు వీటితో సమభాగములుగా చేయఁబడిన కషాయము, ఆమశూలముచేతను కఫవాతములతోను కూడిన జ్వరములను పోఁగొట్టుటయందు శ్రేష్ఠమైనది.

## క్షుద్రాదిగణము.

శ్లో. క్షుద్రామృతా నాగరపుష్కరాహ్వయైః
కృతః కషాయః కఫమారుతోద్భవే,
సశ్వాస కాసారుచి పార్శ్వరుక్కరే
జ్వరే త్రిదోషప్రభవే చ శస్యతే. 142

తా. ములక, తిప్పతీగ, శొంఠి, పుష్కరమూలము వీనిని కషాయముగాఁ గాచి పుచ్చుకొనినయెడల కఫవాతములవలనఁ బుట్టిన జ్వరములును, శ్వాస, దగ్గు, అరుచి, పార్శ్వపునొప్పి మొదలగు లక్షణములు గల త్రిదోషములవలన బుట్టిన జ్వరమును నశించిపోవును.

## { కఫాదిజ్వరములకు దశమూలీరసము; ముస్తాదికషాయము; దేవదార్వాదిక్వాథము; మాతులుంగాదికల్కము. }

శ్లో. దశమూలీరసః పేయః కణాయుక్తః కఫానిలే, అవిపాకేతినిద్రాయాం పార్శ్వరుక్ఛ్వాసకాసకే. 143. ముస్తం పర్పటకశ్శుంఠీ గుడూచీ సుదురాలభా, కఫవాతారుచి చ్ఛర్ది దాహ శోషజ్వరాపహాః. 144. దారుపర్పటభార్జ్యబ్ద వచాధాన్యాకకట్ఫలైః, సాభయా విశ్వభూతిక్తైః క్వాథోహింగుమధూత్కటః. 145. కఫవాతజ్వరే పీతో హిక్కా శ్వాసగళగ్రహాన్, కాసశోష ప్రసేకాంశ్చ హన్యాత్తరుమివాశనిః. 146. మాత్రాక్షౌద్రఘృతాదీనాం స్నేహే క్వాథేషు చూర్ణ

వత్, మాషికం హింగుసింధూత్థం జరణాద్యాస్తు శాణికాః. 147. మాతులంగఫల కేసరో ధృతః సింధుజన్మమరిచాన్వితో ముఖే, హంతివాతకఫ రోగ మాస్యగం శోష మాశు జడతా మరోచకం. 148.

కఫవాతజ్వరము, అజీర్ణము, అతినిద్ర, పార్శ్వపుతలనొప్పి, అధికముగ శ్వాస ము వెడలుట, దగ్గు వీనియందు అనగా నివి సంభవించినయపుడు దశమూలమును కషాయముపెట్టి ఆ కషాయమునందు పిప్పళ్లను పొడిచేసి వైచి త్రాగింపవలయును. తుంగముస్తలు, పర్పాటకము, శొంఠి, తిప్పతీగె, చిన్నదూలగొండి వీనినికషాయము చేసి ఇచ్చినయెడల కఫమును, వాతమును, అరుచిని, ఛర్దిని, దాహమును, గొంతు ఎండిపోవుటను, ఇట్టి గుణములుగల జ్వరమును అణచివైచును. దేవదారువు, పర్పాటకము, గంటుభారంగి, తుంగముస్తలు, వస, ధనియములు, గుమ్ముడు, కరక్కాయలు, శొంఠి, నేలవేము వీటితో జేయబడిన కషాయములో దేనెను ఇంగువను కలిపి త్రాగిన కఫ వాతజ్వరములు నశించును.

ఈకషాయము వెక్కిళ్ళను, శ్వాస మెక్కువగా వెడలుట, గొంతుక పట్టుకొనుట, దగ్గు, గొంతెండిపోవుట, ప్రసేకము అనునీదోషములను పోగొట్టును. పిడుగు వృక్షములను కూల్చునట్లు పైరోగముల నీకషాయము మొదలంట నశింపజేయును. తేనె, నెయ్యి మొదలగువాని మాత్రాప్రమాణములను తెలుపనందు కషాయమునందు చూర్ణములలాగుననే ఎఱుంగవలయును. మఱియును ఇంగువ, సైంధవలవణమును, ఒక్కొక్కమాషప్రమాణమును, జీలకఱ్ఱ పిప్పళ్లు మొదలయినవి నాలుగుమాషముల ఎత్తును కలపవలయును. మాదీఫలము, కింజల్కములు, సైంధవలవణము, మిరియములు వీటినికలిపి నోటను ధరించుకొనినయెడల వాతకఫమువలన బుట్టుచుండెడి గొంతుకయెండిపోవుట, మొద్దుబారుట, అసహ్యము మున్నగునవి అతిశీఘ్రముగా నశించిపోగలవు. ఇచ్చట కలిసిన దోషములవలన కలుగుచుండెడి జ్వరమునకు చేయదగిన చికిత్స ముగిసినది.

[సన్నిపాతజ్వరచికిత్స; త్రిదోషజ్వరచికిత్సారంభ క్రమము; సన్నిపాతమునందు లంఘనరీతి; సన్నిపాతమునందు నిష్ఠీవనము; సన్నిపాతమున నస్యవిధి.]

శ్లో. లంఘనం వాలుకాస్వేదో నస్యం నిష్ఠీవనం తథా, అవలేహాఞ్జనంచైవ ప్రాక్ప్రయోజ్యం త్రిదోషజే. 149. సన్నిపాతజ్వరే పూర్వం కుర్యా దామకఫాపహం, పశ్చా చ్ఛ్లేష్మణి సంక్షీణే శమయే

త్పిత్తమారుతౌ. 150. త్రిరాత్రం పంచరాత్రం వా దశరాత్ర మథాపివా, లంఘనం సన్నిపాతేషు కుర్యా దారోగ్యదర్శనాత్. 151. దోషాణామేవ సా శక్తి ర్లంఘనే యా సహిష్ణుతా, నహి దోషక్షయే కశ్చి త్సహతే లంఘనాదికం. 152. ఆర్ద్రికస్వరసోపేతం సైంధవం సకటుత్రికం, ఆకంఠం ధారయే దాస్యే నిష్ఠీవేచ్ఛ పునఃపునః. 153 తేనాస్య హృదయా చ్ఛ్లేష్మా మన్యా పార్శ్వశిరోగలాన్, లీనోప్యాకృష్యతే శుష్కో లాఘవం చాస్య జాయతే. 154 పర్వభేదోఽంగమర్దశ్చ మూర్ఛాశ్వాసగలామయాః, ముఖాక్షిగౌరవంజాడ్య ముత్క్లేశ శ్చోపశామ్యతి. 155. సకృ ద్ద్వి త్రి చతుః కుర్యా ద్దృష్ట్వా దోషబలాబలం, ఏతద్ధి పరమం ప్రాహు ర్భేషజం సన్నిపాతినాం. 156. మాతులుంగార్ద్రికరసం కోష్ణం త్రిలవణాన్వితం, అన్య ద్వా సిద్ధవిహితం తీక్ష్ణం నస్యం ప్రయోజయేత్. 157. తేన ప్రభిద్యతే శ్లేష్మా ప్రభిన్నశ్చ ప్రసిచ్యతే, శిరోహృదయకంఠాస్యపార్శ్వరుక్ చోపశామ్యతి. 158.

లంఘనము, వాలుకాస్వేదము, నస్యము, ఉమ్మివేయుట,అవలేహము, అంజనము ఇవి యన్నియును త్రిదోషముల వలనపుట్టిన జ్వరములవిషయములో మొదట నుపయోగింపవలసినది. సన్నిపాతజ్వరమున వైద్యుఁడు మొదట ఆమము, కఫము హరించునట్టి చికిత్సను ఆరంభింపవలయును. అటుతరువాత కఫము తగ్గిపోయినయెడల పిత్తమునకును వాతమునకు చికిత్స చేయవలయును. సన్నిపాతజ్వరములలో, ఆయాజ్వరమురీతుల ననుసరించి మూఁడురాత్రులు, లేక అయిదురాత్రులు, లేక పదిరాత్రులు ఇఁతయేల? ఆరోగ్యము అగువఱకును లంఘనములను చేయింపవలయును.

ఇన్ని లంఘనములను రోగి సహింపఁగలుగునా? యని సందేహము వలదు. లంఘనములను సహించుట, దోషముల శక్తివలననే గలుగుచున్నది. కాని దోషములు నశించినపిమ్మట ఎంత పుష్టి గలవాఁడైనను లంఘనాదులను సహింపఁజాలక యుండును.

అల్లపురసములో సైంధవలవణము, శొంఠి, మిరియములు, పిప్పళ్లు వీటినికలిపి నూరి కంఠమున ధారణచేసి మాటిమాటికి ఉమ్మివేయుచుండవలయును. ఇట్లు చేసిన యెడల సన్నిపాతరోగికి హృదయము మెడ ప్రక్కభాగము, తల, గొంతు వీటిలో

నున్న కఫము ఎండిపోయినను సంపూర్ణముగా లాగివేయఁబడును. శరీరముకూడ చులుకనగును. మఱియును కీళ్లుపోటు, కాళ్లులాగుట, మూర్ఛ, దగ్గు, గొంతుక పట్టుకొని పోవుట, ముఖమును కండ్లును బరువెక్కుట, మొద్దుబారుట, వాడిపోవుట మొదలగు నవగుణములను నాశనము నొందించును. ఈచికిత్సను వైద్యుఁడు దోషమునందలి బలాబలములను చక్కఁగాఁ బరికించి నిర్ణయించికొని తగినయట్టులు ఒకతేప రెండుమాఱులు నాలుగుమాఱులుగూడ చేయవలయును. ఇట్లుచేయుట రోగులగువారికి పరమౌషధ మని తెలియవలయును. మాదీఫలరసమును అల్లపు రసముతో కొంచెము వెచ్చఁగా గాచి యందు లవణత్రయము వేసి వెచ్చఁజేసి యిచ్చినను, సిద్ధపురుషులు విధించిననస్యము నిచ్చినను చాలును. ఈనస్యమువలన కఫము తగ్గును. శిరస్సు కంఠము హృదయము ముఖము వీనియందుపుట్టెడు బాధలు నుపశమించును.

## సన్నిపాతమున మధూకసారనస్యము; సైంధవాదినస్యము; అంజనక్రియ.

శ్లో. మధూకసార సింధూత్థ వచోషణ కణా స్సమాః, శ్లక్ష్ణం పిష్ట్వాంభసా నస్యం కుర్యా త్సంజ్ఞాప్రబోధనం. 159. సైంధవం శ్వేత మరిచం సర్షపం కుష్ఠమేవచ, బస్తమూత్రేణ పిష్టాని నస్యం తంద్రీనివారణం. 160. శిరీషబీజగోమూత్ర కృష్ణామరిచసైంధవైః, అంజనం స్యాత్ప్రబోధాయ సరసోనశిలావచైః. 161.

ఇప్పపండురసమునందు సైంధవలవణము, వస, మిరియములు, పిప్పళ్లు వీనినిసమానభాగములను తీసికొని వీటితోనూరి ఆరసమును నస్యవిధిని చేయించినచో స్మృతి కలిగించును. సైంధవలవణము, తెల్లఆవాలు, మునగవిత్తులు, చెంగల్వకోష్ఠు వీనిని మేకయుచ్చతోనూరి నస్యముచేయించిన సన్నిపాతమునందలి మ్రాఁగన్నుపోఁగొట్టును. ఇచ్చట కొన్నిప్రతులలో వత్సమూత్రేణ అనిపాఠము నంగీకరించి, గోవత్సమూత్రముతో నూరి నస్యము చేయఁదగుననిరి. దిరిసెనగింజలు, పిప్పళ్లు, మిరియములు, సైంధవలవణము వీనిని గోమూత్రముతోనూరిగాని, లేక ఉల్లిగడ్డ, మణిశిల, వస వీటితోసిద్ధముఁజేయఁబడిన యంజనమునుగాని ప్రయోగించిన సన్నిపాతరోగికి చేతనము కలుగును.

## అష్టాంగావలేహనము.

శ్లో. కట్ఫలం పౌష్కరం శృంగీ వ్యోషం యాస శ్చ కారవీ. శ్లక్ష్ణచూర్ణీకృతం హ్యేత న్మధునాసహ లేహయేత్. 162. ఏషాఽవలేహికా హంతి సన్నిపాతం సుదారుణం, హిక్కాం శ్వాసం చ కాసం చ

కంఠరోగం నియచ్ఛతి. 163. ఊర్ధ్వగ శ్లేష్మహరణే ఉష్ణస్వేదాదికర్మణి, విరోధ్యుష్ణే మధు త్యక్త్వా కార్యైసార్ద్రికజై రసైః 164.

గుగ్గులు, కర్కాటకశృంగి, పుష్కరమూలము, శొంఠి, దాల్చినచెక్క, నల్లజీలకఱ్ఱ వీటిని మెత్తగా పొడిచేసి తేనెతో కలిపి సేవింపవలయును. ఈయవలేహిక దారుణము లగు సన్నిపాతములను పోఁగొట్టును. మఱియును వెక్కిళ్లు, దగ్గు, గొంతుక పట్టికొనిపోవుట మొదలగువానిని నశింపఁజేయును. శరీరపు పైభాగములయందుండెడి కఫమును పోఁగొట్టుటయందును వెచ్చగా చెమటను పుట్టించుట మొదలగు కార్యములందును, సరిపడనియంత వేడిమియందును ఈయవలేహికను తేనెనువదలివైచి అల్లపురసముతో సేవింపవలయును.

## పంచముష్టికకషాయము; సప్తముష్టికయూషము.

శ్లో. యవకోలకుళుత్థానాం ముద్గమూలకఖండయోః, ఏకైకముష్టి మాహృత్య పచే దష్టగుణే జలే. 165. పంచముష్టిక ఇత్యేష వాతపిత్తకఫాపహః, శస్యతే గుల్మశూలే చ శ్వాసే కాసే క్షయే జ్వరే. 166.

యవలు, పిప్పళ్లు, ఉలవలు, పెసలు, ముల్లంగిదుంపలు వీనిని ఒక్కొక్కదాని నొక్కొక్కపిడికిలిని తీసికొని మొత్తమునకు ఎనిమిదిరెట్లు నీటిలోపోసి పక్వమును చేయవలయును. దీనిపేరు పంచముష్టికము, అనుయూషము అనఁబడును. ఈపంచముష్టికము వాతము, పిత్తము, కఫమును నశింపఁజేయును. మఱియును గుల్మములను, శూలబాధలను, శ్వాసమును, దగ్గును, క్షయను, జ్వరమునుకూడ మొదలఁట నశింపఁజేయును. ఈరెండవదానికి సప్తముష్టికయూష మని పేరు.

## సన్నిపాతములకై చాతుర్భద్రక పంచమూలము.

శ్లో. పంచమూలీ కిరాతాది ర్గణో యోజ్య స్త్రిదోషజే,
పిత్తోత్కటే చ మధునా కణయాచ కఫోత్కటే. 167

ఇప్పుడుచాతుర్భద్రకపంచమూలమును చెప్పుచున్నాఁడు.—గురుపంచమూలములు, వాయువిడంగములు, శొంఠి, తుంగముస్తలు, తిప్పతీగె వీనికషాయమును పిత్తాధిక్యతను గలిగించుదానియందును త్రిదోషములవలన నుత్పత్తియయ్యెడిదానియందును తేనెతోటియును కఫమును పెంచుత్రిదోషమునందు పిప్పళ్లచూర్ణముతోను కషాయమును గాచి ఈయవలయును.

### దశమూలకషాయము.

శ్లో. బిల్వస్యోనాక గాంభారీ పాటలా గణకారికాః, దీపనం కఫవాతఘ్నం పంచమూల మిదం మహత్. 168. శాలపర్ణీ పృశ్నిపర్ణీ బృహతీద్వయ గోక్షురం, వాతపిత్తహరం వృష్యం కనీయః పంచమూలకం. 169. ఉభయం దశమూలం తు సన్నిపాతజ్వరాపహం, కాసే శ్వాసే చ తంద్రాయాం పార్శ్వశూలే చ శస్యతే. 170. పిప్పలీచూర్ణ సంయుక్తం కంఠహృద్గ్రహనాశనం.

బిల్వము(అనఁగా మారేడు) (దుండిగము గంభారి) అనఁగాగుమ్ముడు, కలిగొట్టు, తక్కెడ ఈవర్గమును బృహత్పంచమూల మ దురు. ఇయ్యది జఠరాగ్నిని వృద్ధినొందించును. కఫమును వాతమును అణఁచివేయును. ముయ్యాకుపొన్న కోలపొన్న వాకుడు పెద్ద ములక పల్లేరు ఇది లఘుపంచమూలము. ఇయ్యది వాతపిత్తములను హరించును. వీర్యవృద్ధిని కలుగఁజేయును.

పైరెండునుకలిసిన దశమూలము లగును. ఈదశమూలము సన్నిపాతజ్వరములను పోఁగొట్టును. దగ్గు అలత ఆలస్యము పార్శ్వపునొప్పి వీనినిపోఁగొట్టుట కిదియుత్తమమైనది. పిప్పళ్లచూర్ణముతో కలిపి దశమూలకషాయమును సేవించినయెడల గొంతుకనుగుండెలను పట్టుకొనెడి కఫమును (అనఁగా గళగ్రహములను హృద్గ్రహములను) పోఁగొట్టును.

### చతుర్దశాంగకషాయము.

శ్లో. చిరజ్వరే వాతకఫోల్బణే వా త్రిదోషజేవా దశమూలమిశ్రః,
కిరాతతిక్తాదిగణః ప్రయోజ్యః శుద్ధ్యర్థినే వా త్రివృతా విమిశ్రః.

పురాణజ్వరములయందు గాని, వాతకఫము లధికముగాగల జీర్ణజ్వరమునందు గాని, త్రిదోషములబుట్టెడి జ్వరములందుగాని దశమూలముతో కిరాతతిక్తాదిగణమును ప్రయోగింపవలయును. మఱియును గుణాగుణములను శోధించుటకు తెల్లతెగడ నందు చేర్పవలయును. కిరాతతిక్తాదిగణమనఁగా, వాయువిడంగములు, శొంఠిముస్తలు, తిప్ప తీగె అనునివి యని తెలియవలయును,

### అష్టాదశాంగకషాయము.

శ్లో. దశమూలీ శఠీ శృంగీ పౌష్కరం సదురాలభం, భార్గీ కుటజబీజం చ పటోలం కటురోహిణీ. 172. అష్టాదశాంగ ఇత్యేష స్సన్నిపాతజ్వరాపహః, కాసహృద్గ్రహ పార్శ్వార్తి శ్వాసహిక్కావమీ

హారః. 173. భూనింబ దారు దశమూల మహౌషధాబ్ద తిక్తేంద్ర బీజ ధనికేభ కణాకషాయః, తంద్రీ ప్రలాప కసనారుచి దాహ మోహ శ్వాసాదియుక్త మఖిలం జ్వర మాశు హంతి. 174.

దశమూలమును, కచూరమును, కర్కాటకశృంగి, పుష్కరమూలము, సన్నదూలగొండి, గంటుభారంగి, కొడిసెపాలవిత్తులు చేదుగొట్లు, కటుకరోహిణి అనునివి కలిసి అష్టాదశాంగము లనఁబడును. వీటి సమభాగకషాయము సన్నిపాతజ్వరమును దగ్గును గుండెపట్టుటను పార్శ్వపుపోట్లును శ్వాసములను ఎక్కిళ్లను వమనమును వీనిని నశింపఁజేయును. నేలవేము, దేవదారు, దశమూలములు, శొంఠి, తుంగముస్తలు, చాగనారముట్లలు, కొడిసెపాలవిత్తులు, కొతిమెరలు, ఏనుగుసిప్పల్లు. వీటితో సమభాగముగాచేయఁబడిన కషాయము, అతినిద్రను, ప్రేలాపనను, దగ్గు, అరుచి, దాహము, మోహము. శ్వాసము, ఇట్టి వికారములతోఁగూడిన వివిధములగు జ్వరములను శీఘ్రముగా పోఁగొట్టును.

## పిత్తశ్లేష్మాతిశయమున్న కై యష్టాదశాంగము.

శ్లో. ముస్తా పర్పటకోశీర దేవదారు మహౌషధం, త్రిఫలా ధన్వయాస శ్చ నీలీ కంపిల్లకం త్రివృత్. 175. కిరాతతిక్తకం పాఠా బలా కటుకరోహిణీ, మధుకం పిప్పలీమూలం ముస్తాద్యో గణ ఉచ్యతే. 176. అష్టాదశాంగ ముదిత మేతద్వా సన్నిపాతనుత్, పిత్తోత్తరే సన్నిపాతే హితం చోక్తంమనీషిభిః. 177. మన్యాస్తంభే హ్యురోఘాతే ఉరఃపార్శ్వ శిరోగ్రహే.

తుంగముస్తలు, పర్పాటకము, వట్టివేళ్లు, దేవదారు, శొంఠి, త్రిఫలములు, చిన్నదూలగొండి, నీలి, కంపిల్లకము, తెల్లతెగడ, నేలవేము, విషబొద్ది, ముత్తువపులగము, కటుకరోహిణి, తిప్పతీగ, పిప్పలిమూలము, యష్టిమధుకము ఇది ముస్తాదిగణము. అనఁబడును. పైనఁజెప్పఁబడినట్టి అష్టాదశాంగముగాని, ముస్తాదిగణముగాని సన్నిపాతములను పోఁగొట్టును. పిత్తాధిక్యతఁగల సన్నిపాతమునందును, మన్యాస్తంభమునందును, ఉరోఘాతము, ఉరోగ్రహము, పార్శ్వగ్రహము, శిరోగ్రహము అను వీనియందును, హితమని పండితులు సెప్పిరి.

## శఠ్యాదిగణము.

శ్లో. శఠీ పుష్కరమూలం చ వ్యాఘ్రీ శృంగీ దురాలభా. గుడూచీ నాగరం పాఠా కిరాతం కటురోహిణీ, 178. ఏష శఠ్యాదికోవర్గః.

సన్నిపాతజ్వరాపహాః. 179. కాస హృద్గ్రహ పార్శ్వార్తి శ్వాసే తం ద్ర్యాంచ శస్యతే.

కచోరములు, పుష్కరమూలము, వాకుడు, కర్కాటకశృంగి, దూలగొండి, తిప్పతీగ, శొంఠి, వాయువిడంగము వేలవేము, కటుకరోహిణి, ఇది శఠ్యాదిగణ మనబడును. ఈశఠ్యాదిగణము సన్నిపాతజ్వరములను పోగొట్టును. మఱియు నతిగా నుపద్రవమును గలిగించెడి దగ్గుమొదలగు వానియందుగూడ దీనిని వాడుట యుత్తమము.

## బృహత్యాదిగణము.

శ్లో. బృహత్యౌ పుష్కరం భార్గీ శఠీ శృంగీ దురాలభా. 180
వత్సకస్య చ బీజాని పటోలం కటురోహిణీ,
బృహత్యాది ర్గణః ప్రోక్తః సన్నిపాతజ్వరాపహః. 181
కాసాదిషుచ సర్వేషు దేయ స్సోపద్రవేషు చ,

చిన్నములక, పెద్దములక, పుష్కరమూలము, గంటుభారంగి, కచ్చూరము, కర్కాటకశృంగి, దూలగొండి, కొడిసెపాలవిత్తులు, చేదుపొట్ల, కటుకరోహిణి, ఇవి బృహత్యాదివర్గ మనబడును. ఇయ్యది కాసప్రముఖతము లగు సన్నిపాతజ్వరములను హరించును. ఉపద్రవకరము లగు నన్నివిధములయిన కాసరోగములను అణచును.

## భార్గీగణము; చతుర్దశాంగము; అభిన్యాసజ్వరచికిత్స; శ్లేష్మగణము; దానియందు కారవ్యాదిరసము; శూలచికిత్స; మాతులుంగరసాయనము; త్రికటుకాది క్వాథములు.

శ్లో. భార్గీ పుష్కరమూలం చ రాస్నాం బిల్వం యవానికాం.182. నాగరం దశమూలం చ పిప్పలీం చాప్సు సాధయేత్, సన్నిపాతజ్వరే దేయం హృత్వా ర్శ్వనాహ శూలినాం. 183. కాస శ్వాసాగ్నిమందత్వం తంద్రీం చ వినివర్తయేత్, ద్విపంచమూలీ షడ్గ్రంథా విశ్వగృధనఖిద్వయాత్. 184. కఫవాతహరః క్వాథః సన్నిపాతహరః పరః. కారవీపుష్కరైరండ త్రాయంతీ నాగరామృతాః.185. దశమూలీ శఠీ శృంగీయాసభార్గీ పునర్నవాః, తుల్యా మూత్రేణ పిష్ట్వాధ్య పీతాః స్రోతోవిశోధనాః.186. అభిన్యాసజ్వరం ఘోర మాశు హంతి

సముద్ధృతమ్, మాతులుంగాశ్వభిద్బిల్వవ్యాఘ్రీ పాఠోరుబూకజః. 187. క్వాథోలవణమూత్రాఢ్యోభిన్యాసానాహశూలనుత్, నిద్రోపేతమభిన్యాసం క్షీణం విద్యాద్గతౌజసమ్. 188. కంఠరోధ కఫశ్వాస హిక్కాకాసన్యాసపీడితః, మాతులుంగార్ద్రకరసం దశమూలాంభసా పిబేత్. 189. వ్యోషాబ్ద త్రిఫలాతిక్తపటోలారిష్టవాసకైః, సభూనింబామృతాయాసై స్త్రిదోషజ్వరను జ్జలం. 190.

గంటుభారంగి, పుష్కరమూలము, సన్నరాస్న, మారేడువేరు, ఓమము, శొంఠి, దశమూలములు, పిప్పళ్లు వీనిసమభాగకషాయము సేవింపవలయును. దీనిని బొమ్మ, ప్రక్కలు, పిక్కలు మొదలగుచోట్ల నొప్పిగలిగిన రోగులకు సన్నిపాతజ్వరములందు ఇయ్యవలయును. మఱియును దగ్గు, శ్వాసము, మందాగ్ని, ఆసల్యము వీటిని నశింపచేయును.

దశమూలములు, వస, నల్లఉప్పి, తెల్లఉప్పి వీటిసమభాగ కషాయము, కఫవాతములను, సన్నిపాతములను పోఁగొట్టును. నల్లజీలకఱ్ఱ, పుష్కరమూలము, కలుక్రానుగ, ఆముదపువేళ్లు, శొంఠి, తిప్పతీగె, దశమూలములు, కచ్చూరము, వృషభకమనుగంధద్రవ్యము, దూలగొండి, గంటుభారంగి, గజ్జేరు వీటిని సమానభాగములను తీసికొని ఆవుపంచితములోనూర కషాయమును గాచి త్రాగినయెడల రక్తపుకాలువలను పరిశుద్ధము చేయును. మాదీఫలము పాషాణభేద మారేడు ములకి అగురుశొంఠి ఊగుపండు వీటిని కషాయముచేసి సైంధవలవణమును గోమూత్రమును కలిపి ఇచ్చినయెడల, అభిన్యాసజ్వరము ఆనాహము శూల వీటిని పోఁగొట్టును. నిద్రితుఁడగు నభిన్యాసజ్వరము గల రోగిని హతౌజునిగాను క్షీణించినవానిఁగాను తెలియవలయును. కంఠము ఎండుట,కఫము శ్వాసము వెక్కిళ్లు వీనిచే పీడింపఁబడుట, ఈబాధలుగల మనుష్యుఁడు మాదీఫలము అల్లపురసమును కలిపికొని దశమూలకషాయమును శొంఠి మిరియములు పిప్పళ్లు త్రిఫలములు కటుకరోహిణి చేదుపొట్ల వేపచెక్క అడ్డసరము నేలవేము తిప్పతీగె దూలగొండి వీటికషాయమును సేవించిన త్రిదోషప్రకోపజనితములగు జ్వరములను పోఁగొట్టును.

### సన్నిపాతములకు త్రివృదాదులగు కషాయములు.

శ్లో. త్రివృద్విశాలా త్రిఫలా కటుకారగ్వధైః కృతః, సక్షారో భేదనః క్వాథః పేయః సర్వజ్వరాపహః. 191. స్వేదోద్గమే జ్వరే దేయ శ్చూర్ణో భృష్టకులుత్థజః, ఘృష్యేజ్జిహ్వాం జడాం సింధుత్ర్యూషణై స్సామ్లవేతసైః. 192. ఉచ్ఛుష్కాం స్ఫుటితాం జిహ్వాం ద్రాక్షయా

మధుపిష్టయా, లేపయే త్సఘృతం చాస్యం సన్నిపాతార్త్రికే జ్వరే. 193. కాకజంఘా జటా నిద్రాం జనయే చ్ఛిరసి స్థితా, సన్నిపాతే ప్రకంపంతు క్షీరలపంతం న బృంహయేత్. 194. తృష్ణాదాహాభిభూతేఽపి న దద్యా చ్ఛీతలంజలమ్, సన్నిపాతజ్వరస్యాంతే కర్ణమూలే సుదారుణః. 195. శోథ స్సంజాయతే తేన కశ్చిదేవ ప్రముచ్యతే, రక్తావసేచనైః పూర్వం సర్పిః పానైశ్చ తం జయేత్. 196. ప్రదేహైః కఫపిత్తఘ్నైః వమనైః కబళగ్రహైః, గైరికం పాంశుజం శుంఠీ వచా కటుక కాంజికైః. 197. కర్ణశోథహరో లేప స్సన్నిపాతజ్వరే భృశమ్, కులుత్థ కట్ఫలే శుంఠీ కారవీ చ సమాంశకైః. 198. సుఖోష్ణై ర్లేపనం కార్యం కర్ణమూలే ముహుర్ముహుః.

సన్నిపాతమునందుపయోగింపఁదగిన త్రివృదాదికషాయములు:—తెల్లతెగడ పాపరబుడమ త్రిఫలములు కటుకరోహిణి రేలచెక్క వీనితో సిద్ధముఁజేయఁబడిన కషాయమునందు యవక్షారమును కలిపి త్రాగినయెడల సన్నివిధములగు జ్వరములు నశించును. తలనొప్పి తగ్గిపోవును. త్రిదోషముల ప్రకోపముచేతఁ బుట్టిన జ్వరమునందు మిగుల చెమట పుట్టుచున్నట్లయిన వేయించిన ఉలవలను చూర్ణముచేసి రుద్దవలయును. నాలుక మొద్దువలె మద్దగట్టుకొనిపోయినట్లయిన సైంధవలవణము శొంఠి మిరియములు పుల్లప్రబ్బలి వీటిచే లేపనము చేయవలయును. మిక్కిలి ఎండిపోయినను అతిగా పగిలియున్నను అట్టినాలుకకు తేనెలో ద్రాక్షనునూరి నేతిలోఁగలిపి సన్నిపాతజ్వరమున్నప్పుడు లేపనము చేయవలయును. కాకజంఘవేరు దంచి దానిని తలపైని వేసి కట్టినయెడల నిద్రను పుట్టించును. సన్నిపాతజ్వరముచేత వడకుచున్నవానిని నోటికివచ్చుచున్నట్టులు ప్రేలువానిని పలుకరింపగూడదు. అతిదాహము, పానేచ్ఛ వీటితోఁ దపించుచున్నప్పటికి నిట్టివానికి చల్లని నీటి నీయరాదు. సన్నిపాతజ్వరము వచ్చి చివఱదశలోనున్నప్పుడు చెవిదగ్గఱ నొకవిధమగు శోథ పుట్టును. అట్టిశోథ పుట్టినవారిలో నెక్కడనో యొక్కఁడే నూటికి కోటికి బ్రదకును.

రక్తమును వెడలించుటచేతను, పిప్పల్యాదిఘృతము పుచ్చుకొనుటచేతను గాని కఫపిత్తముల నణచివేయగల ప్రలేపనలచేతను, వాంతులచేతను, అట్టిపదార్థములను భుజించుటచేతను అట్టిశోథను జయింపవలయును. కావిరాయి, శొంఠి, అన్నభేది, వస, కటుకరోహిణి వీటిని కలినీళ్లతో నూరి లేపనచేసినయెడల సన్నిపాతజ్వరములలో వచ్చు కర్ణశోథన మతిత్వరగా పోఁగొట్టును. ఉలవలు, నేలగుమ్ముడు, నల్లజీలకఱ్ఱ వీటిని

సమానభాగములను తీసికొని నీటితో నూరి కొద్దిగా వెచ్చజేసి చెవిగూబదగ్గఱ మాటి మాటికి పట్టువేయుచుండవలయును. ఇంతటితో సన్నిపాతజ్వరములకు చేయవలసిన చికిత్సలు ముగిసినవి.

## జీర్ణజ్వరచికిత్స; నిదిగ్ధికా క్వాథము.

శ్లో. నిదిగ్ధికా నాగరకామృతానాం క్వాథం పిబే న్మిశ్రితపిప్పలీకమ్, జీర్ణజ్వరారోచక కాసశూల శ్వాసాగ్నిమాంద్యార్దిత పీనసేషు. 199. హన్త్యూర్ధ్వగామయం ప్రాయః సాయం తేనోపయుజ్యతే, పిప్పలీచూర్ణసంయుక్తః క్వాథ శ్ఛిన్నరుహోద్భవః. 200. జీర్ణజ్వరకఫధ్వంసీ పంచమూలీకృతోఽథవా, కాసాజీర్ణారుచిశ్వాస హృత్పాండుక్రిమి రోగనుత్. 201. జీర్ణజ్వరేఽగ్నిసాదేచ శస్యతే గుడపిప్పలీ, కళింగకాః పటోలస్య పత్రం కటుకరోహిణీ. 202. పటోలం శారివా ముస్తం పాఠా కటుకరోహిణీ, నింబ పటోలం త్రిఫలా మృద్వీకా ముస్తవత్సకా. 203. కిరాతతిక్త మమృతా చందనం విశ్వభేషజమ్, గుడూచ్యామలకం ముస్త మర్ధశ్లోకసమాపనాః. 204. కషాయా శ్శమయంత్యాశు పంచ పంచవిధాన్ జ్వరాన్, సంతతం సతతాన్యేద్యు స్తృతీయకచతుర్థకా. 205. గుడప్రగాఢాం త్రిఫలాం పిబేద్వా విషమార్దితః, దీర్ఘపత్రక కర్ణాఖ్యం నేత్రం ఖదిరసంయుతమ్. 206. తాంబూలై స్తద్దినే భుక్తం ప్రాత ర్విషవినాశనమ్, గుడూచీ ముస్త ధాత్రీణాం కషాయం వా సమాక్షికం. 207.

వాకుడువేళ్ళు, శొంఠి, తిప్పతీగె వీనినికషాయములో పిప్పళ్లచూర్ణము కలిపి త్రాగిన పురాణజ్వరము, అరోచకము, దగ్గు, శూల, శ్వాసము, అగ్నిమాంద్యము, పీడ, పీనసరోగము మొదలగునవి నశించిపోవును. మఱియును తఱుచుగా నీకషాయము ఊర్ధ్వావయములపై వ్యాపించినరోగమును పోఁగొట్టును. కావున దీనిని సాయంకాలమునందు పుచ్చుకొనుచుండవలయును.

తిప్పతీగెకషాయమునందు పిప్పళ్లపొడిని కలిపిగాని, లేక పంచమూలములతో చేసినకషాయమున పిప్పళ్లచూర్ణమును కలిపిగాని సేవించినయెడల జీర్ణజ్వరములను, కఫమును మొదలంట నశింపఁజేయఁగలదు. మఱియును దగ్గు, అజీర్ణము, అన్నమునం దరుచి, శ్వాసము, తెల్లబారుట (పాండురోగము), కృమిరోగము (అనఁగా నులిపురుగులు) ఈ మొదలగువానిని గూడను తప్పక నశింపఁ జేయఁగలుగును. జీర్ణజ్వరము అనఁగా పురాణ

జ్వరములయందును, అగ్నిమాంద్యమునందును బెల్లముతోఁ గలిపినపిప్పలిచూర్ణము సేవించుట చాల యుత్తమము.

(1) కొడిసెపాలవిత్తులు చేదుపొట్లఆకు వీనిని గాని, సుగంధపాల కటుకరోహిణి. (2) చేదుపొట్ల, శారివ, తుంగముస్తలు, విషబొద్ది, కటుకరోహిణి వీనినిగాని. (3) వేప,చేదుపొట్ల, త్రిఫలములు, ద్రాక్ష, తుంగముస్తలు, చెంగల్వకోష్టు వీనినిగాని, (4) నేలవేము, తిప్పతీగె, రక్తచందనము, శొంఠి. (5) తిప్పతీగె, ఉసిరిక,తుంగగడ్డలు ఇట్లు సగముసగము శ్లోకములలో చెప్పఁబడిన అయిదురకముల వస్తువులను కషాయము పెట్టి సేవించిన అయిదువిధములగు జ్వరములను అతిశీఘ్రముగా శాంతింపజేయఁగలవు.

(1) ప్రతిదినము వచ్చెడిజ్వరము (దీనినే ఆహ్నిక మనియెదురు.) (2) విడువక వచ్చుచుండెడి జ్వరము. (3) దినముమార్చి దినమువచ్చుచుండెడి జ్వరము. (4) మూఁడు రోజులకొకసారి వచ్చుచుండెడి జ్వరము, చాతుర్థికజ్వరము, (5) అయిదేసి రోజులకొకమారు వచ్చుచుండెడి జ్వరము అని విషమజ్వరము లయిదువిధములుగా నున్నవి. ఇట్టి విషమజ్వరములచే పీడింపఁబడుచున్న మనుష్యుఁడు బెల్లముఁగలిపిన త్రిఫలముల కషాయమును త్రాగవలయును.

ముల్లంగి, లవంగపుపట్ట, కాచు వీనిని తాంబూలములో జూటుపెట్టికొని ప్రాతఃకాలములయందు భక్షించుచున్నయెడల ఇయ్యది విషమజ్వరములను పోఁగొట్టును. లేకపోయినచో తిప్పతీగ, తుంగముస్తు, ఉసిరికపప్పు వీటితో సిద్ధముచేయఁబడిన కషాయములోఁ దేనెను కలిపికొని త్రాగినయెడల విషమజ్వరము తొలగిపోవును.

[విషమజ్వరమున ముస్తాదికషాయము, అజాజీకల్పము, రసోనాతైలము, ఘృతపాకములు, పేయములు, విషమజ్వరారంభచికిత్స, నీల్యాదికషాయము, మాంసాద్యాహారములు, చాతుర్థికముల కాష్ఠోటజము, అంజనక్రియలు, ధూపములు, నస్యములు మున్నగునవి.]

శ్లో. ముస్తామలకగూడూచీ విశ్వౌషధ కంటకారికాక్వాథః, పీతస్సకణాచూర్ణః సమధు ర్విషమజ్వరం హంతి. 208. మహౌషధా మృతాముస్త చందనోశీరధాన్యకైః, క్వాథ స్తృతీయకం హంతి శర్కరామధుయోజితః.209.వాసాధాత్రీస్థిరాదారుపథ్యానాగరసాధితః,సితామధుయుతః క్వాథః చాతుర్థికనివారణః. 210. మధునా సర్వజ్వరనుత్ శేఫాలీదలజోరసః, అజాజీగుడసంయుక్తా విషమజ్వరనాశినీ. 211. అగ్నిసాదం జయే త్సమ్యక్ వాతరోగాంశ్చ నాశయేత్. రసోనకల్కం తిల

తైలమిశ్రం యోఽశ్నాతి నిత్యంవిషమజ్వరార్తః. 212. విముచ్యతేసోఽప్యచిరాజ్వరేణ వాతామయైశ్చాపి సుఘోరరూపైః, ప్రాతఃప్రాతస్సర్పిర్వారపానముపయోజయేత్. 213. పిప్పలీంవర్ధమానాంవాపిబేత్ క్షీరరసాశనః, షట్పలం వా పిబేత్సర్పిః పథ్యాం వా మధునా పిబేత్. 214. పయస్తైలం ఘృతంచైవ విదారీక్షురసం మధు, సంచూర్ణ్య పాయయేదేత ద్విషమజ్వరనాశనమ్. 215. పయసా వృషదంశస్య శకృద్వేగాగమే పిబేత్, [పిప్పలీశర్కరా క్షౌద్రం ఘృతంక్షీరం యథాబలం, ఖాజేన మథితం పేయం విషమజ్వర నాశనం.] వృషస్య దధిమండేన సురయా వా ససైంధవం. 216. నీలినీ మజగంధాంచ త్రివృతాం కటురోహిణీం, పిబే జ్జ్వరస్యాగమనే స్నేహస్వేదోపపాదితః. 217. సురాం సమండాం పానార్థే భక్ష్యార్థే చరణాయుధాన్, తిత్తిరీంశ్చ మయూరాంశ్చ ప్రయుంజ్యా ద్విషమజ్వరే. 218. అమ్లోటజ సహస్రేణ ద్రవేణ సుకృతం పిబేత్, పేయాం ఘృతప్లుతాం జంతుః చాతుర్థకహరాం త్ర్యహం. 219. సైంధవం పిప్పలీనాంచ తండులాన్సమనశ్శిలాః, నేత్రాంజనం తైలపిష్టం విషమజ్వరనాశనం. 220. వ్యాఘ్రీరసా హింగుసమా నస్యం తద్వత్ససైంధవా, కృష్ణాంబరదృఢా బద్ధం గుగ్గులూలూకపుచ్ఛజః. 221. ధూపశ్చాతుర్థికం హన్తి తమస్సూర్యఇవోదితః, శిరీషపుష్పస్వరసో రజనీద్వయసంయుతః. 222. నస్యం సర్పిస్సమాయోగా చ్చాతుర్థికజ్వరం జయేత్, నస్యం చాతుర్థికం హంతి రసో వాగస్త్యపత్రజః. 223.

ముస్తకాదిగణమును చెప్పుచున్నాఁడు,—తుంగముస్తలు, ఉశిరికపొట్టు, తిప్పతీగె, శొంఠి, వాఁకుడు వీటితో సిద్ధముచేయఁబడిన కషాయమును, పిప్పళ్లచూర్ణమును, తేనెను కలిపి పుచ్చుకొనినయెడల విషమజ్వరము నశించిపోఁగలదు.

శొంఠి, తిప్పతీగె, తుంగముస్తలు, రక్తచందనము, వట్టివేళ్లు, ధనియములు వీటితో సిద్ధము చేయఁబడిన కషాయమునందు చక్కెరను, తేనెను కలిపి త్రాగినయెడల మూఁడురోజుల కొకతూరి వచ్చు విషమజ్వరము నశించిపోవును. అడ్డసరము, ఉసిరికపొట్టు, వట్టివేళ్లు, దేవదారుచెక్క, కరకకాయలు, శొంఠి, వీటితోఁటి సిద్ధము చేయఁ

[ ] ఈ కుండలీకరణములోని శ్లోకము నొత్తరాహులప్రతిలో గానరాదు.

బడిన కషాయముతో కలకండ, తేనెను కలిపి పుచ్చుకొనిన చాతుర్థికజ్వరములు మొదలంట నశించిపోవును.

నల్లావాలిగూరు రసమును తీసి దానిలో తేనెను కలిపి త్రాగినను కాని, లేక బెల్లమునందు జీలకఱ్ఱను పొడిగా నూరి కలిపి తినినగాని విషమజ్వరము నశించి పోఁగలదు. ఇయ్యది అగ్నిమాంద్యమును మొదలంట నశింపఁజేయును. మఱియును వాతరోగములనుకూడ శీఘ్రముగానే పోఁగొట్టఁగలుగును.

విషమజ్వరముచేత బాధపడుచుండెడివాఁడు తెల్లులికల్కమును, నూనెనుకలిపి ప్రతిదినమును తినుచున్నయెడల విషమజ్వరములును, అతిభయంకరములగు వాతరోగములును తొలఁగి దూరముగా పోవును. ఉదయమునందు ప్రతిదినము తెల్లులికల్కమును నేతితో అద్దుకొని తినుచుండినయెడల కాని, పాలుత్రాగెడి యభ్యాసముగల, లేక, మాంసమును భుజించు నలవాటుగలిగిన విషమజ్వరరోగి పెద్దపిప్పళ్లకషాయమునుగాని, ఆముదమునుగాని, నారుపలముల నేతిని త్రాగినఁగాని, అదియును లేకయున్నచో కరక్కాయలను తేనెతోకూడా నూరిగాని, పాలు, నూనె, నెయ్యి, నేలగుమ్ముడిగసము, చెఱకురసము, తేనె, వీటిని నూరికొనిగాని త్రాగినయెడల విషమజ్వరములు నశించును.

పిప్పళ్లచూర్ణము, కలకండ, తేనె, నేయి, పాలు వీటిని మంటిపాత్రలో పోసి బలముకొలఁది చిలికి త్రాగినయెడల విషమజ్వరములను పోఁగొట్టును. విషమజ్వరమతితీవ్రముగా వచ్చుచున్నయెడల ఎద్దుపేడ పాలలో కలిపికొని త్రాగవలయును. లేకపోయినయెడల ఎద్దుపేడను సైంధవలవణముతో కలిపి పెరుగునీటితోఁగాని, కల్లుతోగాని కలిపి త్రాగవలయును. నీలివేళ్లు, వావింటఆకు, తెల్లతెగడ, కటుకరోహిణి వీనితోచేయఁబడిన కషాయమును, చెమ్మటగలవానికి జ్వరమువచ్చినయెడల నీయవలయును.

త్రాగుటకు మజ్జిగకలిపిన కల్లును, తినుటకు కోడిమాంసమును ఇయ్యవలయును. తిత్తిరిపక్షి, నెమలి వీట్లయొక్క మాంసమును విషమజ్వరములలో నుపయోగింపవలయును. వేపుచింతాకులరసముతో పానకమును సిద్ధముచేసి నేతిని కలిపి మూఁడురోజులు పుచ్చుకొనినయెడల చాతుర్థికజ్వరములు నశించిపోవును.

సైంధవలవణము, పిప్పలిగింజలు, మణిశిల వీటిని నూనెతో నూరి కన్నులకు కాటుకగా నుపయోగించిన విషమజ్వరములు మొదలంట నశించును. వాఁకుడు, వస, ఇంగవ, సైంధవలవణము వీటిని తైలములో నూరి నస్యమునుగా నుపయోగించిన యెడల విషమజ్వరములు హరించిపోవును.

నల్లనిగుడ్డలో గుగ్గిలమును గుడ్లగూబయొక్క తోక ఈకలను కట్టి కాల్చి వేయఁబడినధూపము సూర్యుఁడు చీకటిని పొలఁదోలినట్టు చాతుర్థికజ్వరమును పోఁగొట్టును. దిరిసిన పూవులయొక్క రసమునందు పసుపును, మ్రానుపసుపును కలిపి నేతితో చేర్చి నస్యమునుగా నుపయోగించినయెడల చాతుర్థికజ్వరముల నణఁచివేయఁగలదు. లేకపోయినయెడల, అవిసెఆకులను రసమును పిండి నస్యమునుగా నుపయోగించినను చాతుర్థికజ్వరములను నశింపఁజేయును.

[జ్వరములకు అష్టాదశాంగధూపము; అపరాజితాధూపము తృతీయజ్వర ఏకాహిక సర్వజ్వరములకు చిటుకాలు; ఆగంతుజ్వరమునకు తంత్రము మొదలగునవి.]

పలంకషా నింబపత్రం వచా కుష్ఠం హరీతకీ, సర్షపా స్సయవా స్సర్పి ర్ధూపనం జ్వరనాశనమ్. 224. పురధ్యామవచా (?) సర్జ నింబార్కా గురుదారుభిః, సర్వజ్వరహరో ధూపః కార్యోఽయ మపరాజితః. 225. బైడాలం వా శకృద్యోజ్యం వేపమానస్య ధూపనే, అపామార్గజటా కట్యాం లోహితై స్సూత్రతంతుభిః. 226. బద్ధ్వా వారే రవే స్తూర్ణం జ్వరం హంతి తృతీయకమ్, కాకజంఘా బలా శ్యామా బ్రహ్మదండీ కృతాంజలిః. 227. పృశ్నిపర్ణీ త్వపామార్గః తథా భృంగరజోష్టమః, ఏషా మన్యతమం మూలం పుష్యేణోద్ధృత్య యత్నతః. 228. రక్తసూత్రేణ సంవేష్ట్య బద్ధ మైకాహికం జయేత్, మూలం జయంత్యా శ్శిరసా ధృతం సర్వజ్వరాపహమ్. 229. కర్మసాధారణం జహ్యాత్ తృతీయః చతుర్థకౌ, ఆగంతు రనుబంధీ హి ప్రాయశో విషమే జ్వరే. 230.

గుగ్గిలము, వేపఆకులు, వస, చెంగల్వకోష్టు, కరక్కాయబెరడు, ఆవాలు, కొడిసెపాలవిత్తులు, నేయి వీటితో వేయఁబడిన ధూపము జ్వరమును నశింపఁజేయును. దీనినే అష్టాంగధూప మని చెప్పెదరు. గుగ్గిలము, కామంచిగడ్డి, (లేక, దవనము) వస, సజ్జకంకెలు, వేపఆకు, జిల్లేడుఆకులు, అగురు, దేవదారుచెక్క వీటితో వేయఁబడిన ధూపము, అన్నివిధములగు జ్వరములను నశింపజేయును. దీనిని అపరాజితాధూప మని యనెదరు.

జ్వరముచే వణఁకుచున్న మనుష్యునికి పిల్లిపెంటికలను తెచ్చి ధూపమునుగా వేయవలయును. ఉత్తరేణు వేరును ఎఱ్ఱనినూలుపోగులతో గట్టి ఆదివారమునాఁడు తాయెతులాగున మొలలో గట్టినయెడల మూఁడుమూఁడు రోజులకు వచ్చు జ్వరములు శీఘ్రము

గా నశించిపోవును. కాకిదొండ, ముత్తవపులగము, నీలి, బ్రహ్మదండి కోలపొన్న, ఉత్తరేణు, గుంటగలరాకు వీటిని వేరేరీతిగానే వీనిలోనేదైన నొకవేరును పుష్యనక్షత్రమున నూఁడ బెరికి ఎఱ్ఱనిదారముతో చుట్టి కట్టికొనినయెడల ఒక్కొక్కరోజున వచ్చెడి జ్వరములను అనఁగా నైకాహికజ్వరములను అణఁచివేయును.

తక్కిలియొక్క వేరును తలమీఁద ధరించినయెడల నన్నివిధము లగు జ్వరములను పోఁగొట్టును. తృతీయకజ్వరములయందును, చాతుర్థికజ్వరముల యందును సాధారణముగా పనిచేయుటను వదలిపెట్టవలయును. విశేషముగా హఠాత్తుగా వచ్చినజ్వరము గూడను విషమజ్వరములలోనే చేరికయగు నని లెక్కపెట్టఁబడును.

## ఏకాహికజ్వరనాశనమంత్రాదులు.

శ్లో. గంగాయా ఉత్తరే కూలే అపుత్ర స్తాపసో మృతః, తస్మై తిలోదకం దద్యా న్ముచ్య త్యేకాహికో జ్వరః. 231. ఏతన్మంత్రేణ చాశ్వత్థ పత్రహస్తః ప్రతర్పయేత్, సోమం సానుచరం దేవం సమాతృగణ మీశ్వరం. 232. పూజయన్ ప్రయత శ్శీఘ్రం ముచ్యతే విషమజ్వరాత్, విష్ణుం సహస్రమూర్ధానం చరాచరపతిం విభుం. 233. స్తువ న్నామసహస్రేణ జ్వరా న్సర్వా న్వ్యపోహతి, [కృతాసురాసురైఃపూర్వంధన్వంతరిసమర్చనా. 234. కల్పోక్తే విధానేన సావిధేయాసభక్తికం, సర్వజ్వర విముక్త్యర్థం సదారోగ్యాభికాంక్షిభిః. 235.]

ఏకాహికాదిజ్వరములు నశించిపోవుటకు మంత్రాదులను చెప్పుచున్నాఁడు—గంగానదియొక్క యుత్తరపుగట్టున నొకమహర్షి పుత్రులులేక చిరకాలము తపస్సును చేసి చనిపోయియుండెను. ఆఋషికి తిలోదకముల నిచ్చినయెడలను ఏకాహికజ్వరమునుండి మనుజుఁడు విడుదలయగును.

ఇది మంత్రము:—ఈమంత్రముచేత రాగిఆకులను చేతిలో నుంచికొని తర్పణము చేయవలయును. పార్వతీసహితుఁడును, అనచరసహితుఁడును, మాతృగణవిరాజితుఁడు నగు ఈశ్వరుని ప్రాతఃకాలమున పూజించిన యెడల విషమజ్వరము లన్నియు నశించిపోఁగలవు. వేయితలలుగలవాఁడును, చరాచరముల కధిపతియు నగు సమర్థుఁడైన విష్ణుదేవుని సహస్రనామములచే గీర్తించితిమేని అన్నివిధము లగు జ్వరములును శాంతి నొందును. ఇందులో కుండలీకరణములోనిశ్లోకము ప్రక్షిప్తము. గనుక టీక వ్రాయఁబడలేదు.

## జ్వరమునందు ఘృతప్రయోగము.

శ్లో. జ్వరాః కషాయై ర్వమనై ర్లంఘనై ర్లఘుభోజనైః,
రూక్షస్య యేన శామ్యంతి సర్పి స్తేషాం భిషజ్జితమ్. 236
నిర్దశాహమపి జ్ఞాత్వా కఫో త్తర మలంఘితమ్,
నసర్పిః పాయయే త్ప్రాజ్ఞః శమనై స్త ముపాచరేత్. 237

రూక్షగల మనుష్యునికి జ్వరమువచ్చిన కషాయములచేతను, వమనౌషధములచేతను, లంఘనములచేతను, లఘుభోజనములచేతను ఉపశాంతిని పొందనియెడల నేతిని త్రాగింపవలయును. కఫ మెక్కువగా గలవారికిని, లంఘనములేని జ్వరపీడితులకును పదిదినములు గడచినతరువాత చక్కఁగా బరీక్షించి వైద్యుఁడగువాఁడు నేతిని త్రాగింపఁగూడదు. మఱియు అప్పుడు చేయవలసినది శమనములచేతను, ఔషధములచేతను, నాజ్వరములను ఉపశాంతిఁ బొందించుటయే యై యున్నది.

## జ్వరితునకు ఆహారనియమము; పిప్పలాద్యఘృతము; ఘృతపాకమున వస్తుపరిమాణము.

శ్లో. యావల్లఘుత్వాదశనం దద్యా న్మాంసరసేన తు, మాంసార్థ మేణలావాదీ న్యుక్త్యా దద్యా ద్విచక్షణః. 238. కుక్కుటాంశ్చ మయూరాంశ్చ తిత్తిరిం క్రౌంచమేవ చ, గురూష్ణత్వా న్న శంసంతి జ్వరే కేచి చ్చికిత్సకాః. 239. లంఘనే నానిలబలం జ్వరే యద్యధికం భవేత్, భిషజ్మాత్రా వికల్పజ్ఞో దద్యా త్తా నపి కాలవిత్. 240. పిప్పల్య శ్చందనం ముస్త ముశీరం కటురోహిణీ, కలింగకాస్తామలకీ శారివాతివిషే స్థిరా. 241. ద్రాక్షామలకబిల్వాని త్రాయమాణా నిదిగ్ధికా, సిద్ధ మేతైర్ఘృతం సద్యో జ్వరం జీర్ణ మపోహతి. 242. క్షయం కాసం శిరశ్శూలం పార్శ్వశూలం హలీమకమ్, అంగాభితాపమగ్నిం చ విషమం సన్నియచ్ఛతి. 243. పిప్పల్యాదమిదం క్వాపి తన్త్రే క్షీరేణ పచ్యతే, యత్రాధికరణే నోక్తి ర్గణేస్యా త్స్నేహసంవిధౌ. 244. తత్రైవ కల్కనిర్యూహా విష్యేతే స్నేహవేదినా, ఏతద్వాక్యబలేనైవ కల్పసాధ్యం పరం ఘృతమ్. 245.

ఎంత లఘువుగానున్న ఆహారమైనను మాంసరసముతోటి గూడ కలిపి ఈయవలయును. లేడి, లావుకపిట్ట మొదలగు జంతువుల మాంసములను మాంసముతినుటకు కో

కపడినయెడల యుక్తిగానీయవలయును. కోడి, నెమలి, తీతువ, క్రౌంచపిట్ట వీటిమాంసము చాల గురుపదార్థము. కావునఁ గొందరువైద్యులు వీనిమాంసమునిచ్చుటకు సమ్మతింపరు.

లంఘనము చేయుటచేత జ్వరమునందు వాయువునకు అధికబలము కలిగినయెడల మాత్రల వికల్పభావములను సరిగా నెఱిఁగినవాఁడును, సమయాసమయముల నెఱిఁగినవాఁడునై వైద్యుఁడు కోడి మొదలగువానియొక్క గురువగు మాంసమును గూడ నీయవచ్చును. పిప్పళ్లు, రక్తచందనము, తుంగముస్తలు, వట్టివేళ్లు, కటుకరోహిణి, కొడిసెపాల విత్తులు, నేలఉసిరిక, సుగంధపాల, అతివస, కోలపొన్న, ద్రాక్ష, ఉసిరిక, ప్రబ్బలి, మారేడు, కలంక్రానుగ, వాకుఁడు వీటితో సిద్ధముచేయఁబడిన నేయి జీర్ణజ్వరములను శీఘ్రముగా నణఁచును. మఱియును క్షయ, దగ్గు, తలనొప్పి, పార్శ్వపునొప్పి, హలీమకము, అవయవములమంటలు, విషమాగ్ని ఈరోగములను పోఁగొట్టును.

ఇయ్యది పిప్పల్యాదిగణము.—ఈపిప్పల్యాదిగణము కొన్నిగ్రంథములలో కొందఱిచేత పాలలో పక్వముఁజేయఁబడు నని చెప్పఁబడియున్నది. దానినే పిప్పల్యాదిక్షీర మందురు. తైలాదులను చెప్పునపుడు గణవిషయము అధికరణములో చెప్పఁబడకపోయినయెడల నచ్చట స్నేహాదివిధుల నెఱింగినవైద్యుఁడు కల్కమును, నిర్యూహమును తీసికొనవలయును. ఈవాక్యబలముచేతనే కల్కసాధ్యము ఘృత మగుచున్నది.

శ్లో. జలస్నేహౌషధానాంతు ప్రమాణం యత్ర నేరితమ్, తత్ర స్యా దౌషధా త్స్నేహః స్నేహా త్తోయం చతుర్గుణమ్. 246. అనుక్తే ద్రవకార్యే తు సర్వత్ర సలిలం మతమ్, ఘృతతైలగుడాదీం శ్చ నై కాహా దవతారయేత్ 247. వ్యుషితా స్తు ప్రకుర్వంతి విశేషేణ గుణా న్యతః, స్నేహకల్కో యదాంగుల్యా వర్తితో వర్తివ ద్భవేత్. 248. వహ్నౌ క్షిప్తే చ నో శబ్దః తదా సిద్ధిం వినిర్దిశేత్, శబ్దే వ్యుపరమం ప్రాప్తే ఫేనస్యోపరమే తథా. 249. గంధవర్ణరసాదీనాం సంపత్తౌ సిద్ధి మాదిశేత్.

నీరుమున్నగువానికి కొల్తలు చెప్పనప్పుడు చేయవలసినపనులఁ జెప్పుచున్నాఁడు.—నీళ్లకు, చమురునకు, ఔషధమునకు ప్రమాణములను చెప్పనిస్థలములయందు ఔషధమునకంటె చమురు నాలుగురెట్లధికముగాను, చమురుకంటె నీటిని నాలుగురెట్లు అధికముగాను తీసికొనవలయును. ద్రవపదార్థములను చెప్పక యుండినచోటుల నన్నిస్థలములలోను నీటినే తీసికొనవలయును. నెయ్యి, నూనె, బెల్లము మొదలగువాని నొకేదినములో సిద్ధము చేయఁగూడదు.

ఏలయనఁగా — నడుమ నొకదిన మవకాశ ముంచి చేసినయెడల నెక్కుడు ఫలమును గుణము నిచ్చుచుండును. స్నేహకల్కము అనఁగా చమురుతో చేసెడి కల్కమును వ్రేలితో త్రిప్పినప్పుడు వత్తివలె అయిపోయినయెడలను, నిప్పులో వేసినయెడల చప్పుడుగాక యుండినను సిద్ధి యయ్యె నని చెప్పవలయును, చప్పు డణఁగిపోయి, భగ్గుమనుట తగ్గిపోయి, వాసన, కాంతి, రుచి ఈమొదలగునవి పుట్టినట్లయిన సిద్ధిఅయినదని చెప్పవలయును.

## క్షీరషట్పల ఘృతము.

శ్లో. పంచకోలైః ససింధూత్థైః పలికైః పయసా సమమ్. 250

సర్పిః ప్రస్థం శృతం ప్లీహ విషమజ్వరగుల్మనుత్,

అత్ర ద్రవాంతరానుక్తేః క్షీరమేవ చతుర్గుణమ్. 251

ద్రవాంతరేణ యోగేహిం క్షీరం స్నేహసమం భవేత్.

శొంఠి, పిప్పలి, పిప్పలిమూలము, చెవ్యము, చిత్రమూలము ఈయైదిటిని పంచకోలము లని యనియెదరు. ఈపంచకోలములను, సైంధవలవణమును ప్రత్యేకముగా నొక్కొక్కపలమును గ్రహించి ఒకప్రస్థము నేతిని పాలనొకప్రస్థమును పోసి ఘృతమునుచేసి సేవింపవలయును. ఇయ్యది తిల్లిరోగమును అనఁగా నప్పిని, విషమజ్వరమును, గుల్మములను పోఁగొట్టును. ఇచ్చట మఱి ఇతరమైన ద్రవపదార్థ మేదియును చెప్పకపోయినయెడల పాలనే నాలుగుమడ్లధికముగా తీసికొనవలయును. ద్రవపదార్థమునితరమును దేనినైనను చెప్పినయెడల చమురుతో సమానముగానే పాలను గ్రహింపవలయును.

## దశమూలషట్పలఘృతము; కషాయక్షీరాదుల పరిమితి.

శ్లో. దశమూలీరసే సర్పిః సక్షీరే పంచకోలకైః. 252. సక్షారైర్హంతి తత్సర్వం జ్వరకాసాగ్నిమందతాః, వాతపిత్తకఫవ్యాధీన్ ప్లీహానం చాపి పాండుతాం. 253. క్వాథ్యా చ్చతుర్గుణం వారి పాదస్థం స్యా చ్చతుర్గుణం, స్నేహా త్స్నేహసమం క్షీరం కల్కస్తు స్నేహపాదికః. 254. చతుర్గుణం త్వష్టగుణం ద్రవద్వైగుణ్యతా భవేత్, పంచప్రభృతి యత్ర స్యు ర్ద్రవాణి స్నేహసంవిధౌ, తత్ర స్నేహసమా న్యాహు రర్వాక్చ స్యా చ్చతుర్గుణం. 255.

దశమూలముయొక్కరసము, పాలు, పిప్పళ్లు, మోడి, చెవ్యము, చిత్రమూలము, శొంఠి, యవక్షారము వీటియందు సిద్ధము చేయఁబడిన నేయి జ్వరమును, దగ్గును, అగ్నిమాంద్యమును, వాతపిత్తకఫరోగములను, ప్లీహానాహము

లను పాండురోగమును నశింపఁజేయును. ఇయ్యది దశమూలషట్పలక ఘృత మనఁబడును. కషాయమునకుఁ దగినట్టులు నాలుగురెట్లు నీటిని తెచ్చి చమురు, పాలు వీటిని సమానముగా తీసికొనవలయును. మఱియును చమురుతో కూడ నాల్గవభాగము కల్కమును తీసికొనవలయును. ద్రవపదార్థముయొక్క రెండవభాగములో నెనిమిదిరెట్లు గ్రహింపవలయును. ద్రవమును విధించుటయందు అయిదుమొదలుకొని అయినపుడు చమురుతో సమానముగానే యని చెప్పియున్నారు. ముందుమాత్రము నాలుగురెట్లు మాత్రమే.

## వాసాదిఘృతము.

శ్లో. వాసాం గుడూచీం త్రిఫలాం త్రాయమాణాం యవాసకమ్,
పక్త్వా తేన కషాయేణ పయసా ద్విగుణేన చ. 256
పిప్పల్యామలమృద్వీకా చందనోత్పలనాగరైః,
కల్కీకృతైశ్చ విపచే ద్ఘృతం జీర్ణజ్వరాపహమ్. 257

ఆడ్డసరము, తిప్పతీగె, త్రిఫలములు, కలుంత్రానుగవేరు, తీటకసింద వీటితో కషాయముగాగాచి ఆకషాయమునకు రెండురెట్లును పాలను చేర్పవలయును. పిప్పళ్లు, ఉసిరిక, ద్రాక్ష, రక్తచందనము, కలువగడ్డ, శొంఠి వీటిని కల్కముచేసి నేతియందు పక్వముచేయవలయును. ఈఘృతమునే వాసాద్యఘృతమని యనియెదరు. ఇయ్యది పురాణజ్వరముల నన్నిటిని బోఁగొట్టును.

[గుడూచ్యాదిపంచఘృతములు; ఔషధదానకాలము; క్షీరవిషయమునందు విధినిషేధములు; పంచమూలీక్షీరము; పాకవిధి; మలబద్ధమునకై త్రికటుకాదిక్షీరము; పునర్నవాదిక్షీరము; క్షీరవీర్యభేదము; శోధనక్రియ; మదనాదియోగములు; విరేచనౌషధులు; శిరోవిరోచనము; అభ్యంగనాదివిధులు.]

శ్లో. గుడూచ్యాః క్వాథకల్కాభ్యాం త్రిఫలాయా వృషస్య చ, మృద్వీకాయా బలాయా శ్చ సిద్ధా స్నేహాజ్జ్వరచ్ఛిదః. 258. జ్వరే పేయాః కషాయాశ్చ సర్పిః క్షీరం విరేచనమ్, షడహే షడహే దేయం కాలం వీక్ష్యామయస్య చ. 259. జీర్ణే జ్వరే కఫే క్షీణే క్షీరంస్యాదమృతోపమమ్, తదేవ తరుణే పీతం విషవ ద్ధంతి మానవమ్. 260. కాసాచ్ఛ్వాసాచ్ఛిరశ్శూలాత్ పార్శ్వశూలాత్సపీనసాత్, ముచ్య

తే జ్వరితః పీత్వా పంచమూలీశృతం పయః. 261. ద్రవ్యా దష్టగుణం క్షీరం క్షీరా త్తోయం చతుర్గుణం, క్షీరావశేషః కర్తవ్యః క్షీరపాకే త్వయం విధిః. 262. త్రికంటకబలా బిల్వ గుడనాగరసాధితం, వర్చోమూత్రవిబంధఘ్నం శోథజ్వరహరం పయః 263. వృశ్చీర విశ్వవర్షాభూ పయశ్చోదకమేవచ, పచేత్ క్షీరావశిష్టం తు తద్ధి సర్వజ్వరాపహం. 264. శీతం కోష్ణం జ్వరే క్షీరం యథాస్వైరౌషధైర్ఘృతం, ఏరండమూలసిద్ధం వా జ్వరే సపరికర్తితే. 265. జ్వరిభ్యో బహుదోషేభ్య ఊర్ధ్వం చాధశ్చ బుద్ధిమాన్, దద్యా త్సంశోధనం కాలే కల్పే య దుపదేక్ష్యతే. 266. మదనం పిప్పలీభి ర్వా కలింగై ర్మధుకేన వా, యుక్తముష్ణాంబునా పీతం వమనం జ్వరశాంతయే. 267. ఆరగ్వధంవా పయసా మృద్వీకానాం రసేన వా, త్రివృతాం త్రాయమాణాంవా పయసా జ్వరితః పిబేత్. 268. జ్వరక్షీణస్య న హితం వమనం న విరేచనం, కామంతు పయసా తస్య నిరూహై ర్వా హరేన్మలాన్. 269. ప్రయోజయే జ్జ్వరహరా న్నిరూహా న్సానువాసనాన్, పక్వాశయగతేదోషే వక్ష్యంతే యేచ సిద్ధిషు. 270. గౌరవే శిరసః శూలే విబద్ధేష్వింద్రియేషు చ, జీర్ణజ్వరే రుచికరం దద్యా చ్ఛీర్షవిరేచనం. 271. అభ్యంగాం శ్చ ప్రదేహాం శ్చ సస్నేహాన్ సానువాసనాన్, విభజ్య శీతోష్ణకృతాన్ దద్యాజ్జీర్ణజ్వరే భిషక్. 272. తై రాశు ప్రశమం యాతి బహిర్మార్గగతో జ్వరః, లభంతే సుఖ మంగాని బలం వర్ణశ్చ వర్ధతే. 273.

గుడూచ్యాదిఘృతమును చెప్పుచున్నాఁడు.—తిప్పతీగెయొక్కగాని, త్రిఫలములయొక్కగాని, ద్రాక్షకషాయముయొక్క కల్కముగాని, ముత్తువపులగముయొక్కగాని, కషాయములతోనేనియు, కల్కములతోనేనియు సిద్ధముచేయఁబడిన తైలము జ్వరములను మొదలంట హరింపఁజేయును. దీనిని గుడూచ్యాదిఘృత మని యనెదరు.

జ్వరమువచ్చినప్పుడు రోగమును, కాలమును చక్కఁగా పరికించి పానకములనుగాని, కషాయములనుగాని, తైలములను, పాలను, విరేచనౌషధములను వీటిని ఆరారుదినముల కొకొక్కటేప నీయవలయును. జీర్ణజ్వరము అనఁగా పురాణజ్వరము వచ్చినప్పుడు కఫముబాగా క్షీణించిపోయినమీఁదట పాలనిచ్చినయెడల అమృతముతో సమాన మగును. కాని తరుణజ్వరమునందు పాలను త్రాగించినయెడల మనుష్యుని విషముచంపిన రీతిగా అది చంపివేయును.

పంచమూలములయందు పక్వము చేయఁబడిన పాలను జ్వరితుఁడు త్రాగినయెడల దగ్గు, శ్వాసము, శిరోవేదన, పార్శ్వపునొప్పి, పీనస ఈ రోగములనుండి విడుదల చేయఁబడును. ఇచ్చట మూలికకంటె (ద్రవ్యముకంటె) ఎనిమిదిరెట్లు పాలును, పాలకంటె నాలుగురెట్లు నీరును కలిపి పాలుమాత్రము మిగిలియుండునట్లుడుకఁబెట్టి దింపి సేవింపవలయును. పాలలో పాకముచేయవలసినప్పుడు చేయదగినరీతి యిది.

త్రికటుకములు, మృత్తువపులగము, మునఁగ, బెల్లము, శొంఠి వీనిచే సిద్ధము చేయఁబడినకషాయము మలమూత్రములు బద్ధిచిపోవుటను పోఁగొట్టును. శోఫకలిగిన జ్వరములను గూడ నశింపఁజేయును. తెల్లగలిజేరు, మారేడువేరు, ఎఱ్ఱగలిజేరువేరు, పాలు, నీరు వీటినన్నిఁటిని కలిపి వండి పాలుమాత్రము మిగిలియుండు సమయమున దించి తీసికొనవలయును. ఇయ్యది అన్నివిధములగు జ్వరములను పోఁగొట్టును. తగుమాత్రముగా ఔషధముఁ గలిసినదియును కొంచెము వేడిగా నున్నపాలు జ్వరము వచ్చిన సమయములలో మిక్కిలి హితకరము లగును. లేకపోయిన యెడలను పరికర్తికతోఁ గలసివచ్చినజ్వరములను అనఁగా జ్వరముతో గుదస్థానముకత్తిరించినట్లుఁడువానిలో ఆముదపువ్రేళ్లతో కాచి సిద్ధము జేయఁబడిన ఘృతము హితకరము అగును. అనేకవిధములగు దోషములతో కలిసికొనివచ్చిన జ్వరముగలవారలకు బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు సమయమునుగుర్తించి కల్పములలో చెప్పఁబడిన ప్రకారము వమనములకుగాని, విరేచనములకుగాని యౌషధమును ఇప్పించవలయును. మంగకాయరసమును పిప్పళ్ల కషాయముతోఁగాని, కొడిసెపాలను యష్టిమధుకములతోఁటిగాని, కాఁచబడిన వేడినీటితోఁగాని తీసికొనినయెడల వాంతులును, జ్వరమును ఉపశమించి పోవును.

లేకున్నచో — రేలచెక్కను పాలతోఁగాని, ద్రాక్షారసముతోఁగాని, తెల్లతెగడరసముతోఁగాని, కలుకానుగచెక్కతోఁగాని చేర్చి కాచి జ్వరముగలవాఁడు త్రాగవలయును. జ్వరముచేఁకృశించిన మనుష్యునికివమనములుగాని, విరేచనములుగానిహితములు కావు. ఎవరికైనను విరేచనములను తీసికొనవలయు నని కోరిక [అనగా నిర్బంధము] ఉండినయెడల ఆరోగికి పాలనిచ్చిగాని, నిరూహములచేతఁగాని మలమును పోఁగొట్టవలయును. మఱియును జ్వరమునుపోఁగొట్టునట్టివియు అనువాసనలతోఁగూడినవియు నగు నిరూహములను ప్రయోగింపవలయును. వీనిని మలదోషము జీర్ణకోశమునందున్నప్పుడే యుపయోగింపవలయును. ఇట్టినిరూహముల నన్నిఁటిని ముందు చెప్పఁగలము.

శరీరము బరువెక్కుట, తలయందు శూలనొప్పి గలుగుట, ఇంద్రియములన్నియును విశేషముగా మూసికొనిపోవుట, ఇట్టిలక్షణములుగల జీర్ణజ్వరము వచ్చినవానికి రుచినికలిగించు శిరోవిరేచనమును ఈయవలయును. పురాణజ్వరములయందు వైద్యుఁడు

తైలసహితములును, అనువాసనాసహితములును నగు అభ్యంగనములను అనఁగా తలంట్లను, లేపనములను వేరు వేరుగా విభాగించి చల్లగాను వేడిగాను చేసి ఇచ్చుచుండవలయును. ఈయుపచారములవలన చెవుడుపట్టినట్టి జ్వరములుకూడ యణఁగిపోవును. అంగములయందు సుఖము కలుగును. బలము, కాంతియును హెచ్చును.

## షట్కట్వర తైలము.

శ్లో. సువర్చికానాగరకుష్ఠమూర్వాలాక్షానిశాలోహితయష్టికాభిః
తైలంజ్వరే షడ్గుణతక్రసిద్ధమభ్యంజనాత్ శీతవిదాహనుత్స్యాత్.
దధ్నః ససారకస్యాత్ర తక్రం కట్వర మిష్యతే,
ఘృతవత్తైలపాకేఽపి స్నేహే ఫేనో ధికః పరః. 274

సజ్జక్షారము, శొంఠి, కోష్ఠు, చాగమట్ట, లక్క, పసపు, మంజిష్ఠను, యష్టిమధుకను వీటికల్కమునుగాని, కషాయమునుగాని ఆరురెట్లు మజ్జిగతో కాచి తైలమును మర్దనయొడల జ్వరమునందలి శైత్యము, దాహమును హరించిపోవును. నేయి కలిసిన పెరుగు మజ్జిగను కట్వరమనిఈశాస్త్రజ్ఞులపరిభాషగలదు. తైలమునందువలెనే నేయియందుకూడ పక్వముచేయవచ్చును. తైలము అనఁగా నూనెలో పక్వముచేసిన ఎక్కువయుద్గీపకమును, నేతిలో పక్వముచేసిన ఆయుద్దీపకము శాంతమును బొందును.

## అభ్యంగాదుల కంగారక తైలము.

శ్లో. మూర్వా లాక్షా హరిద్రే ద్వే మంజిష్ఠా సేంద్రవారుణీ,
బృహతీ సైంధవం కుష్ఠం రాస్నా మాంసీ శతావరీ. 275
ఆరనాలాఢకేనైవ తైలప్రస్థం విపాచయేత్,
తైలమంగారకం నామ సర్వజ్వరవిమోక్షణమ్. 276

అంగారకతైలమును చెప్పుచున్నాఁడు.—చాగమట్ట,లక్క,పసుపు, మ్రానిపసపు, మంజిష్ఠ, పాపర, వాకుడు, సైంధవలవణము, చెంగల్వకోష్టు, సన్నరాష్ట్ర, పిల్లిపీచర వీటియొక్కకల్కమునందును ఒకఆఢకముగంజియందు ప్రస్థప్రమాణము నూనెను బోసి వండి సేవింపవలయును. దీనినే అంగారకతైల మని చెప్పెదరు. ఈతైలము అన్నివిధములగు జ్వరములను పోఁగొట్టి మనుష్యునికి మేలుచేయును.

{ శీతజ్వరములకు లాక్షాదితైలము; యవాదితైలము; సర్జాదితైలము; చందనాదితైలము; ఆగంతుజ్వరచికిత్స; అభిచారజ్వరచికిత్స; కామాదిజనితజ్వరచికిత్స; భూతజ్వరచికిత్స; జ్వరమోక్షణ లక్షణములు. }

శ్లో. లాక్షాహరిద్రా మంజిష్ఠా కల్కైః తైలం విపాచయేత్, షడ్గుణే నారనాళేన దాహశీతజ్వరాపహం. 277. యవచూర్ణార్ధకుడపం మంజిష్ఠార్ధపలేన తు, తైలప్రస్థం శతగుణే కాంజికే సాధితంజయేత్. 278. జ్వరందాహం మహావేగ మంగానాం చ ప్రహర్షనుత్, సర్జకాంజికసంసిద్ధం తైలం శీతాంబుమర్దితమ్. 279. జ్వరదాహాపహం లేపాత్స ద్యోవాతాస్రదాహనుత్, చందనాద్య మగుర్వాద్యం తైలం చరకకీర్తితం. 280. తథా నారాయణం తైలం జీర్ణజ్వరహరం పరం, అభిఘాతజో జ్వరో నస్యా త్పానాభ్యంగేన సర్పిషః. 281. క్షతానాం వ్రణితానాం చ క్షతవ్రణచికిత్సయా, ఔషధీగంధవిషజౌ విషపీతప్రబాధనైః. 282. జయే త్కషాయై ర్మతిమాన్ సర్వగంధకృతై స్తథా, అభిచారాభిశాపోత్థ జ్వరౌ హోమాదినా జయేత్. 283. దానస్వస్త్యయనాతిథ్యై రుత్పాతగ్రహపీడజౌ, క్రోధజే పిత్తజాత్కామ్యా అర్థా స్సద్వాక్య మేవ చ. 284. ఆశ్వాసే నేష్టలాభేన వాయోః ప్రశమనేన చ, హర్షణైశ్చ శమం యాంతి కామక్రోధభయజ్వరాః. 285. కామా త్క్రోధజ్వరో నాశం క్రోధా త్కామసముద్భవః, యాతి తాభ్యా ముభాభ్యాంచ భయశోక సముద్భవః. 286. భూతవిద్యాసముద్దిష్టై ర్బంధావేశనతాడనైః, జయేద్భూతాభిషంగోత్థం మనస్సాంత్వైశ్చ మానసం. 287. వ్యాయామం చ వ్యవాయం చ స్నానం చంక్రమణాని చ, జ్వరయుక్తో న సేవేత యావన్నో బలవాన్ భవేత్. 288. దేహోలఘుర్వ్యపగతక్లమమోహతాపః పాకోముఖే కిరణసౌష్ఠవ మవ్యథత్వం, స్వేదః క్షవః ప్రకృతిగామిమనోఽన్నలిప్సా కండూశ్చ మూర్ధ్నివిగతజ్వరలక్షణాని. 289.

లక్క, పసపు, మంజిష్ఠ వీటితో చేయఁబడిన కల్కములతో తైలమును కాచవలయును. చక్కఁగా కాఁగుచున్న సమయమునందు ఆరుకొల్లు గంజిని

అందులోఁ జేర్పవలయును. ఈతైలము దాహమును, చలిజ్వరమును పోఁగొట్టును. ఇయ్యదియే లాక్షాదితైలము. యవలచూర్ణము అర్థకుడపమును, మంజిష్ఠ అరపలమును నూనె ఒకప్రస్థమును, గంజి నూరురెట్లును చేర్చి ఈరీతిగా సిద్ధము చేయఁబడిన, తైలము అత్యంతము వేగము కలిగిన జ్వరమును, విదాహమును అణచి వైచును. అవయవము లదరుటనుకూడ మాన్పును. సర్జరసమునందును, గంజియందును కలుపఁబడి సిద్ధముచేయఁబడిన తైలమును చల్లనినీటితో చేర్చి చిలికి పూతపూసినట్లయిన జ్వరము, విదాహము, వాతరక్తప్రకోపమువలన గలిగిన దాహము వీనిని పోఁగొట్టును.

చందనాదితైలమును, అగుర్వాదితైలమును చరకుఁడు చెప్పినరీతిగా— నారాయణతైలమును, ఈ మూఁడుతైలములును పురాణజ్వరములను హరించును. నేతిని పీల్చుటచేతను, త్రాగుటవలనను, రుద్దికొనుటవలనను, అభిఘాతజ్వరము దూరముగా తొలఁగిపోవును. గాయము తగిలినవారలకుగాని, వ్రణములు కలుగుటవలనగాని, జ్వరమువచ్చినయెడల గాయములకును వ్రణమునకును చికిత్సచేయుటచేత జ్వరము తొలఁగిపోవఁగలదు.

ఔషధుల వాసనవలనఁగాని విషమువలన గాని కలిగిన జ్వరములను విషభక్షణము నశించుట కిచ్చెడు కషాయముచేతగాని మఱియు నన్నివిధములగు గంధములతోఁ గలిసిన కషాయములచేతఁగాని వైద్యుఁ డగువాఁడు తొలఁగునట్లు చేయవలయును. అభిచారము, అనఁగా చిల్లంగి (దీనిని ప్రయోగ మని చాతపాడి యని వాడుచుందురు.) శాపమిచ్చుటవలనఁ బుట్టెడు జ్వరములను హోమము మున్నగువానివలనఁ జయింపఁదగును.

ఉత్పాతములచేతను గ్రహపీడలచేతను పుట్టినజ్వరములను, దానము, పుణ్యాహవాచనము, అతిథిపూజ, బ్రాహ్మణసంతర్పణము మొదలగువానివలన పోఁగొట్టుకొన వచ్చును. కోపాధిక్యమువలనఁ బుట్టుచుండెడి జ్వరములకు పిత్తజ్వరములను పోఁగొట్టు క్రియలనే చేయవలయును.

కామ్యములు, వాంఛితలాభము, ప్రయోజనసిద్ధి, ఊరడింపుమాటలు, వాయువును తగ్గించుట, సంతోషము, దీనిచేత కామక్రోధభయజనితములగు జ్వరములు నశించును. కామమువలన పుట్టెడిజ్వరమును, క్రోధమువలన కలిగెడి జ్వరములును ఈ రెండువిధములుగాక భయదుఃఖాదులవలన పుట్టిన జ్వరములు హర్షణక్రియలచేత శాంతినొందగలుగును.

మంత్రశాస్త్రము (అనఁగా భూతవైద్యము)లోఁ జెప్పఁబడియున్న, గ్రహబంధములు, ఉచ్చాటనలు, ఆవేశనములు, తాడనములు, మారణములు మున్నగునీచికి

ర్శ్వలను చేసినయెడల భూతభయమువలన వచ్చిన జ్వరములు నశించిపోఁగలవు. ఇట్లే మనస్సును సమాధానము చేసికొని మానసజ్వరములను పోఁగొట్టుకొనవలయును.

దండెములనుతీయుట, కసరత్తుచేయుట, ఇంకను శరీరమున కలతనిచ్చు వ్యాయామము నేదానినైనను చేయుట, స్త్రీసాంగత్యము, స్నానముచేయుట, దిమ్మతిరుగుట ఈమొదలగువానిని జ్వరపడిలేచినవాఁడు మఱల తనకు యథాప్రకారముగా బలము వచ్చునంతవఱకును విధిగా మానవలయును.

శరీరము చులకనగానుండుట, "గ్లాని(అనఁగా వాడిపోవుట) మోహము ఓపలు తెచ్చుఁబడుట" అనునివిలేకయుండుట, ముఖమున రోగచిహ్నములు లేక పక్వముగానుండుట, ఇంద్రియములు స్వాధీనములై యుండుట, బాధలేకయుండుట, చెమటయూరుచుండుట, తుమ్ములు వచ్చుచుండుట, పూర్వపురీతిగా మనస్సుండుట, అన్నముతినుటకు కోర్కి కలిగియుండుట, తలపైని దురద యెత్తుట ఈమొదలగునవి యన్నియును జ్వరము బొత్తిగా నశించిపోయినవానికుండెడి లక్షణములుగా నెఱుఁగవలయును.

ఇట్లని చక్రదత్తసంహితయందు జ్వరాధికారము ముగిసినది.



# ౨. జ్వరాతీసారాధికారము.



శ్లో. జ్వరాతిసారే పేయాదిక్రమ స్స్యా ల్లంఘితే హితః,
జ్వరాతిసారీ పేయాం వా పిబే త్సామ్లాం శృతాం నరః. 1
పృశ్నిపర్ణీబలాబిల్వనాగరోత్పలధాన్యకైః,
పాఠేంద్రయవభూనింబముస్తపర్పటకామృతాః, 2
జయంత్యామమతీసారం సజ్వరం సమహౌషధాః,

జ్వరాతిసారమునందు లంఘనము చేసియున్న రోగులకు పానకము మున్న గునవి క్రమముగా హితకరము లగుచున్నవి. జ్వరాతిసారము గల మనుష్యుఁడు దానిమ్మపండ్లరసముతీసి మిశ్రితముచేసి కోలపొన్న, ముత్తువపులగము, మారేడువేళ్ళు, శొంఠి, నల్లకలువ, ధనియములు వీటితో పక్వముచేయఁబడిన పానకమును త్రాగవల యును. అగరుశొంఠి, కొడిసెపాలవిత్తులు, నేలవేము, తుంగముస్తలు, పర్పాటకము, తిప్పతీగె, శొంఠి వీనిని కషాయముగా గాచి పుచ్చుకొనినయెడల జ్వరసహితములగు ఆమాతిసారములను పోఁగొట్టును.

## అతిసారములకు నాగరాదిక్వాథము.

శ్లో. నాగరాతివిషా ముస్త భూనింబామృత వత్సకైః. 3
సర్వజ్వరహరః క్వాథః సర్వాతీసారనాశనః,
హ్రీబేరాతివిషా ముస్తా బిల్వధాన్యకనాగరైః. 4
పిబే త్పిచ్ఛావిబంధఘ్నం శూలదోషామపాచనమ్,
సరక్తం హ న్త్యతీసారం సజ్వరం వాథ విజ్వరమ్. 5

శొంఠి, అతివస, తుంగముస్తలు, నేలవేము, తిప్పతీగె, కొడిసెపాలవిత్తులు వీటితో సిద్ధముచేయఁబడిన కషాయము అన్నివిధములగు జ్వరములను, అతిసారములను పోఁగొట్టును. కురువేరు అతివస తుంగముస్తెలు మారేడువేరు ధనియములు శొంఠి వీనిని కషాయముచేసి పుచ్చుకొనినయెడల పిచ్ఛబంధములను (అనగా నొకరీతిశూలలను) అణఁచి వేయును. మఱియును శూలదోషమును ఆమమును పోఁగొట్టి పక్వముచేయును. ఇయ్యది రక్తాతిసారమును, జ్వరాతిసారమును, అతిసారమునుకూడ నాశనము నొందింపఁగలదు.

### గుడూచ్యాదిపేయము.

శ్లో. గుడూచ్యతివిషాధాన్య శుంఠీ బిల్వాబ్దవాలకైః,
పాఠాభూనింబ కుటజ చందనోశీర పద్మకైః. 6
కషాయ శ్శీతలః పేయో జ్వరాతీసారశాంతయే,
హృల్లాసా రోచక చ్ఛర్ది పిపాసాదాహనాశనః. 7

తిప్పతీగె, అతివస, ధనియములు, శొంఠి, మారేడువేఱు, తుంగముస్తలు, విష బొద్ది, నేలవేము, కొడిసెపాలవిత్తనములు, రక్తచందనము, వట్టివేరు, పద్మకము వీటిని కషాయమును చేసి చల్లగా త్రాగవలయును. ఇయ్యది జ్వరాతిసారముల నుపశాంతిని బొందించును. మఱియును ఉమ్మివేయుచుండుట, అరోచకము, ఛర్ది, అతిదాహము, గొంతుకఎండిపోవుట మొదలగువానినికూడ నశింపఁజేయును.

### ఉశీరాదిక్వాథము.

శ్లో. ఉశీరం బాలకం ముస్తం ధాన్యకం విశ్వభేషజం,
సమంగా ధాతకీ లోధ్రం బిల్వం దీపనపాచనం. 8
హన్త్యరోచకపిచ్ఛామం విబంధం సాతివేదనం,
సశోణిత మతీసారం సజ్వరం వాఽథ విజ్వరం. 9

ఉశీరాదికషాయమును చెప్పుచున్నాఁడు.—వట్టివేళ్లు ఏలకులు తుంగముస్తలు ధనియములు శొంఠి ముత్తవపులగము ఆరెపూవు లొద్దుగ మారేడువేఱు వీటితో సిద్ధము చేయఁబడిన కషాయము ఆకలిని దీపింపఁజేయును. ఆహారమును జీర్ణింపఁజేయును. అరోచకము పిచ్ఛము ఆమము మలబద్ధకము పోటు నెత్తురుపడునట్టి జ్వరము గలిగినట్టియు ఒకప్పుడు జ్వరరహితమైనదియు నగు నతిసారమును పోఁగొట్టును.

### పంచమూలకషాయము; కలింగాదిక్వాథము; వత్సకాదియోగము; నాగరాదిక్వాథము; ముస్తకాదిక్వాథము.

శ్లో. పంచమూలీ బలా బిల్వగుడూచీముస్తనాగరైః, పాఠా భూనింబ హ్రీబేర కుటజత్వక్ఫలై శ్శృతం. 10. హంతి సర్వానతీసారాన్ జ్వరదోషం వమిం తథా, సశూలోపద్రవం శ్వాసం కాసం హన్యా త్సుదారుణం. 11. కలింగాతివిషా శుంఠీ కిరాతాంబుయవాసకం, జ్వరాతీసారసంతాపం నాశయే దవికల్పతః. 12. వత్సకం కట్ఫలం దారు రోహిణీ గజపిప్పలీ, శ్వదంష్ట్రా పిప్పలీధాన్యం బిల్వం పాఠా యవానికా. 13.

ద్వావప్యేతౌ సిద్ధియోగౌ శ్లోకార్థేనాభిభాషితౌ, జ్వరాతీసారశమనౌ విశేషాద్దాహశాతనౌ. 14. నాగరామృత భూనింబ బిల్వవాలకవత్సకైః, సముస్తాతివిషోశీరైః జ్వరాతీసారహృజ్జలం. 15. ముస్తకబిల్వాతివిషా పాఠాభూనింబవత్సకైః క్వాథః, మకరందగర్భయుక్తో జ్వరాతిసారౌ జయేద్ఘోరౌ. 16. ఘనజల పాఠాతివిషా పథ్యోత్పలధాన్యరోహిణీ విశ్వైః, సేంద్రయవైః కృత మంభః సాతీసారం జ్వరం జయతి. 17.

పంచమూల్యాదికషాయమును చెప్పుచున్నాఁడు.— పంచమూలములు ముత్తువపులగము మారేడుచెక్క తిప్పతీగె శొంఠి విషబొద్ది నేలవేము కురువేరు కొడిసెపట్ట కొడిసెపాలవిత్తులు వీటితో సిద్ధముచేయఁబడిన కషాయము అన్నివిధము లగు జ్వరదోషములను పోఁగొట్టును. మఱియును చెలిది శూల ఉపద్రవసహిత మగుశ్వాసము భయంకర మగు దగ్గు మొదలగువానినిగూడ నాశము నొందించఁగలదు.

కొడిసెపాలవిత్తులు అతివస శొంఠి వాయువిడంగములు వట్టివేళ్లు దూలగొండి వీటిని కషాయముగా చేసి ఇచ్చినట్టులయిన జ్వరాతిసారములను మొదలంట నశింపఁజేయును. కొడిసెపండు దేవదారుచెక్క కటుకరోహిణి ఏనుగుపిప్పళ్లు పెద్దపల్లేరు ధనియములు మారేడువేరు విషబొద్ది ఓమము ఇట్లని సగముసగము శ్లోకములో చెప్పఁబడిన ఈరెండుసిద్ధయోగములు [1 కొడిసెపండు మొదలుకొని ఏనుగుపిప్పలివఱకును. 2 పెద్దపల్లేరుమొదలగు ఓమమువఱకును] జ్వరాతిసారములను నాశనము చేయును. ఎక్కువగా నగుచున్నదాహమును కూడ ముఖ్యముగా నశింపఁజేయును.

శొంఠి తిప్పతీగె నేలవేము ముల్లంగి కొడిసెపాలు తుంగముస్తలు అతివస వట్టివేళ్లు వీటితో సిద్ధముచేయఁబడిన కషాయము జ్వరాతిసారములను పోఁగొట్టును. తుంగముస్తలు మారేడువేళ్లు అతివస విషబొద్ది నేలవేము కొడిసెవిత్తులు వీటితో సిద్ధముచేయఁబడిన కషాయము అతిసారముల నణచును. తుంగముస్తలు వట్టివేళ్లు విషబొద్ది అతివస కరకకాయలు నల్లకలువ ధనియములు కటుకరోహిణి శొంఠి కొడిసెపాలవిత్తనములు వీటితో సిద్ధముచేయఁబడిన కషాయమును ఇచ్చినచో జ్వరాతిసారములను జయించును.

## కళింగాదిఘుటికలు; ఉత్పలాదియోగము.

శ్లో. కళింగబిల్వజంబ్వామ్ర కపిత్థం సరసాంజనం, లాక్షాహారిద్రే హ్రీబేరం కట్ఫలం శుకనాసికాం. 18. లోధ్రం మోచరసం శంఖం ధాతకీవటశుంగకం, పిష్ట్వా తండులతోయేన వటకానక్షసమ్మితాన్. 19.

ఛాయాశుష్కాన్ పిబే చ్ఛీఘ్రం జ్వరాతీసారశాంతయే, రక్తప్రసాదనా శ్చైతే శూలాతీసారనాశనాః. 20. ఉత్పలం దాడిమత్వక్చ పద్మకేసర మేవ చ, పిబే త్తండులతోయేన జ్వరాతీసారనాశనం. 21.

కొడిసెపాలవిత్తులు మారేడువేళ్లు నేరేడుపలుకులు మామిడిపలుకులు వెలగపండు ఇంగిలీకము లక్క పసపు మ్రానిపసపు కురువేరు నేలగుమ్ముడు పండిగచెక్క లొద్దుగ ద్రాక్షరసము పాలు ఆరెపువ్వులు మఱ్ఱివేళ్లు వీటిని బియ్యపుకడుగుతో నూరి ఒక్కఅక్షమంతేసి ప్రమాణముగల మాత్రలనుచేసి నీడయందు యెండించి జ్వరాతిసారరోగుల కిచ్చిన యెడల నెమ్మది కలుగును.

ఈమాత్రలు రక్తము శుభ్రము చేయును. నొప్పిగల అతిసారములను కూడ పోఁగొట్టును. కమలములు దానిమ్మబెరడు కమల కింజల్కములు వీటిని బియ్యపుకడుగుతో కూడ కలిపి నూరి కలిపిత్రాగవలయును. ఇయ్యది జ్వరాతిసారములను మొదలంట నశింపఁజేయఁ గలుగును.

## వ్యోషాదిచూర్ణము; దశమూలీకషాయము; విడంగాదిక్వాథము; కిరాతాదిక్వాథము.

శ్లో. వ్యోషం వత్సకబీజం చ నింబభూనింబ మార్కవం, చిత్రకం రోహిణీం పాఠాం దార్వీ మతివిషాం సమాం. 22. శ్లక్ష్ణచూర్ణీకృతాన్ సర్వాన్ తత్తుల్యాం వత్సకత్వచం, సర్వ మేకత్ర సంయుజ్య ప్రపిబే త్తండులాంబునా. 23. సక్షౌద్రం సా వహే దేతత్ పాచనం గ్రాహి భేషజం, తృష్ణారుచిప్రశమనం జ్వరాతిసారనాశనం. 24. కామలాన్ గ్రహణీదోషాన్ గుల్మం ప్లీహాన మేవ చ, ప్రమేహం పాండురోగం చ శ్వయథుం చ వినాశయేత్. 25. దశమూలీకషాయేన విశ్వ మక్షసమం పిబేత్, జ్వరేతివాఽతిసారే చ సశోథే గ్రహణీ గదే. 26. విడంగాతివిషాముస్తం దారుపాఠాకలింగకం, మరిచేన సమాయుక్తం శోథాతీసారనాశనం. 27. కిరతాబ్దామృతావిశ్వ చందనోదీచ్యవత్సకైః, శోథాతిసారశమనం విశేషాజ్జ్వరనాశనం. 28. కిరాతాబ్దామృతోదీచ్య ముస్తచందనధాన్యకైః, శోథాతిసారతృడ్దాహ శమనో జ్వరనాశనః.29.

వ్యోషాదిచూర్ణమును చెప్పుచున్నాఁడు.—శొంఠి, మిరియములు, పిప్పళ్లు, వేపచెక్క, కొడిసెపాలవిత్తులు, నేలవేము, జిల్లేడువేళ్లు, చిత్రమూలము, కటుకరోహిణి,

అగరుశొంఠి, దేవదారు, అతివస వీనినన్నిటిని సమానభాగములుగా తీసికొనవలయును. పిదప వీనిని బాగా చూర్ణముచేసి కొడిసెపట్టయొక్క చూర్ణమునుగూడ నిందుగలిపి కలికడుగునీళ్లలో వేసికొని త్రాగినయెడల గాని తేనెలోకలిపికొని నాకినయెడల గాని, తలనొప్పులనుపోఁగొట్టును. అన్నముకు పచనముజేయును, దప్పిని అరుచిని పోఁగొట్టును. జ్వరాతిసారములను గూడ నశింపఁజేయును.

దశమూలముల కషాయముతో కలిపి ఒకపలమెత్తు శొంఠిరసమును త్రాగవలయును. ఇట్లుచేసిన జ్వరమువచ్చినప్పుడును, అతిసారము గలిగినప్పుడును, శోఫయందును, గ్రహణిదోషములయందును బాధను పోఁగొట్టి సుఖముకు ఈయఁగలదు. వాయువిడంగము,అతివస, తుంగముస్తలు, దేవదారు, అగరుశొంఠి, కొడిసెపాలవిత్తులు వీటితో చేసిన కషాయమునుఁ ద్రాగిన అతిసారములుగూడ నశించిపోవును.

నేలవేము, తుంగముస్తలు, తిప్పతీగె,శొంఠి, రక్తచందనము, కరువేపు, కొడిసె విత్తులు, చందనము వీటికషాయము శోఫముగల అతిసారములగూడ నణంచును. మఱియును ముఖ్యముగా జ్వరములను పోఁగొట్టును. వాయువిడంగములు, తుంగముస్తలు, తిప్పతీగె, కురువేపు, భద్రముస్తలు, రక్తచందనము, ధనియములు వీటితోఁ జేయఁబడిన కషాయము శోఫలతోగూడిన యతిసారములను, దప్పి,గొంతెండిపోవుట, జ్వరమున్నగువానినిగూడ పోఁగొట్టును.

ఇట్లు చక్రదత్తసంహితయందు జ్వరాతిసారప్రకరణము ముగిసెను.



# 3. అతిసారాధికారము.



శ్లో. ఆమపక్వక్రమం హిత్వానాతిసారే క్రియాయతః, అతస్స ర్వాతిసారేషు జ్ఞేయం పక్వామలక్షణం. 1. మజ్జత్యామాగురుత్వాద్విట్ పక్వాతూల్లవతే జ్వరే, వినాతిద్రవసంఘాత శైత్యశ్లేష్మ ప్రదూషనాత్. 2. శకృద్దుర్గంధిసాటోప విష్టంభార్తిప్రసేకినః, విపరీతం నిరామంతు కఫాత్పక్వంచ మజ్జతి. 3. ఆమే విలంఘనం శస్తమాదౌ పాచన మేవ చ, కార్యం చానశనస్యాంతే ప్రద్రవం లఘుభోజనం. 4. లంఘనమేకం ముక్త్వా వ నచాన్య దస్తీహ భేషజం బలినః, సముదీర్ణం దోషచయం శమయతి తత్పాచయ త్యపి చ. 5. హ్రీబేరశృంగబేరాఖ్యాం ముస్తపర్పటకేన వా, ముస్తోదీచ్యశృతం తోయం దేయం వాపి పిపాసవే. 6. భుక్తేన్నకాలేక్షుత్క్షామం లఘూన్యన్నాని భోజయేత్. ఔషధసిద్ధా పేయా లాజానాం సక్తవోతిసారహితాః, వస్త్రప్రసృతమండః పేయశ్చ మసూరయూషశ్చ. 7. గుర్వీ పిండీ ఖరాత్యర్థం లఘ్వీసైవ విపర్యయాత్, సక్తూనా మాశు జీర్యేత మృదుత్వా దవలేహికా. 8.

పక్వములగు నామరోగములకు లక్షణములను చెప్పుచున్నాఁడు.—అతిసారరోగము కలిగినప్పుడు, ఆమమును పక్వముచేయవలసినరీతిని తెలిసికొనక యే వైద్యుఁడును చికిత్సను చేయకూడదు. కావున సమస్తములగు అతిసారముల విషయములలోను ఆమమును పక్వముచేయు లక్షణమును తెలిసికొనవలయును. గురుత్వ విషయములో పక్వముగాని మలము నీటిలో మునిఁగిపోవును. పక్వమైనమలము నీటిపైని తేలు నని తెలిసికొనవలయును.

మిగుల పలచనగాలేకుండుట, శైత్యముచే దూషింపఁబడుట, కడుపులో గుడగుడమని ధ్వని పుట్టుట, ఇట్టిలక్షణములు గల మలము చాల దుర్గంధముగా నుండును. దీనికంటె భిన్నమైనది అమరహిత మనఁబడును. కఫాతిరేకముచేత వెడలు మలము నీటిలో మునుగును. ఆమముచే వచ్చిన అతిసారములయందు మొదట లంఘనము చేయవలయును. అటుతరువాత పాచనము చేయించవలయును. అటుతరువాత లంఘనము చేసినవారలకు లఘువగు ఆహారము నిచ్చుచుండవలయును.

బలముగల యతిసారరోగికి లంఘన మొక్కటిదక్క యితర మౌషధమే లేదు. ఆలంఘనము, పెటేఁగిన దోషముల గుంపును నశింపఁజేయఁగలదు. ఆహారమును పక్వము గూడ చేయఁగలదు. కురువేరు, శొంఠి వీటిరసము, తుంగముస్తలు, పర్పాటకము వీటి కషాయముగాని లేకున్న తుంగముస్తలు, కురువేరు వీటితో కాచిననీటిని గాని యిచ్చిన యెడల దాహము తగ్గిపోవును.

భోజనసమయములయందు ఆఁకలిగొన్నవానికి లఘువగు ఆహారమును ఇవ్వవలయును. ఔషధులచేత సిద్ధముచేయఁబడిన పానకమును గాని, ధనియములు పేలపిండిని గాని ఇచ్చినయెడల అతిసారవ్యాధి నిమ్మళించి హితమగును.

వడయఁగట్టిన మజ్జిగగాని, పానకముగాని, మసూరధాన్యముల గంజిగాని, హితకరము అగును. ఖారముగాను, తీక్ష్ణముగాను ఉండవలెగట్టిగాను ఉండునట్లు చేయఁబడిన లాజసత్తులేహ్యము అను పదార్థము శీఘ్రముగా జీర్ణింపఁజేయును.

[బృహచ్ఛాలిపర్ణీచూర్ణము; లఘుశాలిపర్ణీక్వాథము; అతిసారాపథ్యములు; ధాన్యపంచకము; పంచమూల్యాదిక్వాథములు; ధాన్యకాదియోగములు; చికిత్సానర్హతలు; స్తంభనాద్యౌషధనిషేధములు; పాచనౌషధ నిషేధములు; సుఖవిరేచన క్రియ మొదలగునవి.]

శ్లో. శాలిపర్ణీపృశ్నిపర్ణీ బృహతీ కంటకారికా. 9. బలాశ్వదంష్ట్రా బిల్వాని పాఠానాగరధాన్యకం, ఏత దాహారసంయోగే హితం సర్వాతిసారిణాం. 10. శాలిపర్ణీబలాబిల్వైః పృశ్నిపర్ణ్యా చ సాధితా, దాడిమామ్లాహితాః పేయాః పిత్తశ్లేష్మాతిసారిణాం. 11. వాతపిత్తే పంచమూల్యా కఫే వా పంచకోలకైః, యవాగూ ముపభుంజానో నను వ్యంజన మాచరేత్. 12. శాకమాంసఫలైర్యుక్తా యవాగ్వోఽమ్లాశ్చదుర్జరాః, ధాన్యపంచకసంసిద్ధో ధానకైశ్వకృతో ఽథవా. 13. ఆహారో భిషజో యోజ్యోవాతశ్లేష్మాతిసారిణాం, వాతపిత్తే పంచమూల్యా కఫే వా పంచకోలకైః. 14 ధాన్యోదీచ్యశృతం తోయం తృష్ణాదాహాతిసారను త్, ఆభ్యామేవ సపాఠాభ్యాం సిద్ధం మాహార మాచరేత్. 15. దోషాస్సన్నిచితాం యస్య విదగ్ధాహారమూర్చితాః, అతిసారాయ కల్పంతే భూయ స్తాన్ సంప్రవర్తయేత్. 16. న తు సంగ్రహణం దద్యాత్పూర్వ మామాతిసారిణే, దోషా హ్యాదా వధ్యమానా జనయంత్యామయా న్బహూన్. 17. శోథపాండ్వామయప్లీహా కుష్ఠగుల్మోదరజ్వ

రాన్, దండకాలసకాధ్మానా న్ గ్రహణ్యర్శోగదాం స్తథా. 18. క్షీణ ధాతు బలార్తస్య బహుదోషోఽతిసిస్సృతః, ఆమోఽపి స్తంభనీయ స్స్యాత్ పాచనా న్మరణం భవేత్. 19. స్తోకం స్తోకం విబంధంవా సశూలం యోఽతిసార్యతే, అభయాపిప్పలీకల్కైః సుఖోష్ణై స్తం విరేచయేత్. 20.

ముయ్యాకుపొన్న, కోలపొన్న, పెద్దములక, చిన్నములక, ముత్తవపులగము, ఏనుగపల్లేరు, మారేడుపిండెలు, అగరుశొంఠి, శొంఠి, ధనియములు వీటిని భోజనముచేయునప్పుడు కూడాకలిపి తినినయెడల నతిసారరోగముకలవారికి గుణమిచ్చును. దీనినే బృహచ్ఛాలిపర్ణ్యాదిచూర్ణ మని వైద్యులు చెప్పుచుందురు. ముయ్యాకుపొన్న, ముత్తవపులగము, మారేడుపిండెలు, కోలపొన్న వీటితో సిద్ధము చేయఁబడిన దానిమ్మపండ్లయొక్కయును రసముతో కలిపినపానకము పిత్తకఫములవలన గలిగిన అతిసారరోగములను పోఁగొట్టి సుఖమును గలిగించును. ఇదియును శాలిపర్ణ్యాదియే యగును. కొందఱు దీనిని లఘుశాలిపర్ణీక్వాథ మందురు.

గంజిని త్రాగుచుండెడివాఁడు వ్యంజనము మొదలగువానిని తినగూడదు, ఎందువలన ననఁగా కూరలుగాని మాంసముగాని పండ్లు మొదలగునవిగాని కూడా భక్షించుచు తీసికొనినగంజి జీర్ణము కాజాలదు. వాతకఫములచే నతిసారరోగము కలవానికి ధాన్యపంచకమును కలిపి సిద్ధము చేయఁబడిన యన్నమునుగాని, లేక శొంఠిపొడికలిపిన యన్నమును గాని పథ్యముగా నొసఁగవలయును.

వాతపిత్తములచేతఁ గలిగిన నతిసారరోగములను లఘుపంచమూలములతో సిద్ధము చేయఁబడిన కషాయముగాని, కఫముచేతఁగలిగిన నతిసారరోగమునందు పంచకోలములతో చేయఁబడిన కషాయముగాని, లేకపోయినయెడల ధనియములు ఉదీచ్యనాగరములతో కాచఁబడినకషాయముగాని ఇచ్చినచో దప్పి, గొంతుకఎండిపోవుట, అతిసారము మున్నగువానిని మొదలంట నశింపఁజేసి సౌఖ్యము నిచ్చును.

ధనియములు, కురువేరు, అగరుశొంఠి వీనిచూర్ణముచేత మిశ్రముచేసిన యన్నమును పెట్టుచుండవలయును. దీనినిఅసహ్యత, ఆహారమునందిచ్ఛలేకుండుట, మూర్ఛిల్లుట మొదలగుదోషములుగలవానికిని, దోషములు వృద్ధినొందినవానికిని ఈయవలయును. ఆమముచేతకలిగిన నతిసారముగల రోగులకు మొదట, పట్టుపట్టునట్టివియును, వఘచివేయునట్టియును యగు ఔషధములను [అనఁగా సంగ్రహ ఔషధములను] ఈయరాదు. ప్రారంభములో అజ్ఞానముచేత పెంచినచో పిదప ననేకరోగములు పుట్టును.

శోఫ పాండురోగము బిళ్లలుబిళ్లగావచ్చు తిల్లీయను రోగము (దీనినే ప్లీహ మందురు). కుష్ఠు, గుల్మరోగము, ఉదరరోగము, జ్వరము మొదలగువానిని కొయ్యలాగున నీలిగికొనిపోవుట, నడవలేకపోవుట, వణకుట, రక్తగ్రహణి, అర్శోరోగము లను కూడ నాదోషము పుట్టించును. ధాతుక్షీణము గలవానికిని బలముచేత పీడింపబడిన వానికిని, మిక్కిలిగా రక్తస్రావము గలవానికిని, మిగుల దోషము లుండినయెడల ఆమ మునుగూడ స్తంభనము చేయవలయును. మఱియును పాచనముచేత నొక్కొక్కయప్పుడు చనిపోవుటకూడ సాధారణముగా సంభవించుచుండును.

మిగుల కొద్దికొద్దిగాను, లేక బద్ధము గాను, కడుపునొప్పి, తీపు గలుగునట్లు గాను స్రవించుచున్నయెడల సిద్ధియతిసారరోగమునకు కరకకాయలు, పిప్పళ్లును, గోరువెచ్చగా కల్కముగాఁజేసి విరోచన మగునట్లుగు ఔషధము నీయవలయును.

[ధాన్యపంచకము; త్రికటుకాదిచూర్ణము; పిప్పల్యాదిచూర్ణము; హరిద్రాదియోగములు; ఖండయూషాదులు; నాగరాదిక్వాథములు; పాఠాదిచూర్ణము; ముస్తాదిక్షీరము; పంచమూల్యాదిచూర్ణము.]

శ్లో. ధాన్యకం నాగరం ముస్తం వాలకం బిల్వ మేవ చ, ఆమశూలవిబంధఘ్నం పాచనం వహ్నిదీపనం. 21. ఇదం ధాన్యచతుష్కం స్యాత్ పిత్తే శుంఠీం వినా పునః, పిప్పలీం నాగరం ధాన్యం భూతికం చాభయాం వచాం. 22. హ్రీబేరభద్రముస్తాని బిల్వం నాగరధాన్యకం, పృశ్నిపర్ణ్యశ్వదంష్ట్రా చ సమంగా కంటకారికా. 23. తిస్రః ప్రమథ్యా విహితాః శ్లోకార్ధై రతిసారిణాం, కఫపిత్తే చ వాతే చ క్రమాదేతాః ప్రకీర్తితాః. 24. సంజ్ఞా ప్రమథ్యా జ్ఞాతవ్యా యోగే పాచన దీపనే, త్ర్యూషణాతివిషా హింగుబలా సౌవర్చ లాభయాః. 25. పీత్వోష్ణే నాంభసా హన్యాత్ ఆమాతీసార ముద్ధతం, అథవా పిప్పలీ మూల పిప్పలీ ద్వయచిత్రకాన్. 26. సౌవర్చలవచా వ్యోష హింగు ప్రతివిషాభయాః, పిబే చ్ఛ్లేష్మాతిసారార్త శ్చూర్ణితాః కోష్ణవారిణా. 27. హరిద్రాదిం వచాదిం వా పిబే దామేషు బుద్ధిమాన్, ఖండయూష యవాగూషు పిప్పల్యాదిం ప్రయోజయేత్. 28. తక్రే కపిత్థ చాంగేరీ మరీచా జాజిచిత్రకైః, సుపక్వః ఖండయూషోయ మయం కాంబారికో పరః. 29. దధ్యమ్లో లవణస్నేహ తిల

మాంససమన్వితః, నాగరాతివిషాముస్తైః అథవా ధాన్యనాగరైః. 30. తృష్ణాతీసారశూలఘ్నమ్ పాచనం దీపనం లఘు, పాఠావత్సకబీజాని హరీతక్యో మహౌషధం. 31. ఏత దామసముత్థాన మతీసారం సవేదనం. కఫాత్మకం సపిత్తంచ వర్చోబధ్నాతి చ ధ్రువం. 32. పయస్యుత్క్వాథ్య ముస్తాం వా వింశతిం భద్రకాహ్వయాః, క్షీరావశిష్టం తత్పీతం హన్యా దామం సవేదనం. 33. పక్వోఽసకృదతీసారో గ్రహణీ మార్దవా ద్యదా, ప్రవర్తతే తదా కార్యః క్షిప్రం సాంగ్రహికో విధిః. 34. పంచమూలీబలావిశ్వధాన్యకోత్పలబిల్వజాః, వాతాతిసారిణే దేయాః తక్రేణాన్యతమేన వా. 35.

ధనియములు,శొంఠి,తుంగముస్తలు, కురువేరు, మారేడుపిండెలు వీటితో చేయఁబడిన పాచనము ఆమమును,నొప్పిని, మలబద్ధకమును పోఁగొట్టును. జఠరాగ్నిని దీపింపఁజేయును. పిత్తమువలన వచ్చిన అతిసారములకు శొంఠిని వదలి ధాన్యచతుష్కము నుపయోగింపవలయునని చెప్పెదరు. పిప్పళ్లు, శొంఠి, ధనియములు, కానుగుచెక్క, కరకకాయలు, వస, కురువేరు, తుంగముస్తలు,మారేడుపిందెలు,శొంఠి, ధనియములు, కోలపొన్న,పల్లేరు, ముత్తవపులగము, నేలములకవేరు అని సగముసగము శ్లోకములలో మూఁడువిధములగు ప్రమథ్యలు చెప్పబడినవి. ఇయ్యవి కఫపిత్తవాతముల విషయములలో చెప్పఁబడినయవి. పాచనమునకును, జఠరాగ్నినిఉద్దీపింపచేయుట కిచ్చెడు నౌషధమునకు ప్రమథ్య యని గుర్తు పెట్టఁబడినది.

శొంఠి,మిరియములు, పిప్పళ్లు, అతివస, ఇంగువ, ముత్తవపులగము, సౌవర్చలవణము, కరకాయ వీటిని చూర్ణముచేసి వేడినీటియందు ఆచూర్ణమును వైచికొని త్రాగినయెడల కఫాతిసారముచేత పీడింపబడువానికి సుఖము కలుగును. బుద్ధిమంతుఁ డగువాఁడు హరిద్రాదిగణములో చెప్పఁబడినవానినిగాని వచాదిగణపఠితములగు మూలికలనుగాని కషాయము చేసికొని త్రాగవలయును.

ఖండయూషములయందుగాని గంజియందుగాని పిప్పల్యాదిగణములో చెప్పఁబడిన మూలికలచూర్ణమును కలిపికొని పుచ్చుకొనవలయును. ఆవుమజ్జిగ, వెలగపండులోని గుజ్జు, చాంగేరి, మిరియములు, జీలకఱ్ఱ,చిత్రమూలము, అనువీటినిగూడఁజేర్చికొని కాచవలయును. ఇయ్యదియే ఖండయూషమనఁబడును. మఱియును వీటినే కొందఱు కాంబలికములని చెప్పెదరు. కాని పెరుగు, నిమ్మపండ్లరసము, ఉప్పు,తైలము, నువ్వులు, మాంసము వీటితో కూడినయెడలనే కాంబలిక మగును.

శొంఠి, అతివస, తుంగముస్తలు లేక ధనియములు, శొంఠి వీటితో సిద్ధము చేయఁబడిన క్వాథము, పాచనము, దాహము, అతిసారము, పోటు మొదలగువానిని పోఁగొట్టును. మఱియును జఠరాగ్నిని దీపింపఁజేయును. దేహమునుగూడ తేలిక చేయును.

అగరుశొంఠి, కొడిసెపాలవిత్తులు, కరకకాయలు, శొంఠి, వీటితోఁటి సిద్ధముచేయఁబడిన పాచనము ఆమముచేత పుట్టినట్టియు బాధాకరము లగునట్టియు నతిసారములను, కఫాతిసారములను, పిత్తాతిసారసంబంధము లగు మలములను (నిశ్చయముగా) బంధించివైచును అనుటకు సందియము లేదు.

తుంగముస్తెలను ఇరువదియొక్కలనుగాని లేక భద్రముస్తెల నిరువదింటినిగాని పాలలో వైచి కాచి త్రాగవలయును. పాలుమాత్రము మిగిలియుండినప్పుడు త్రాగిన యెడల ఆమాతిసారములను నశింపఁజేయును. పక్వమైన అతిసారము గ్రహణిమార్గమున మాటిమాటికి వచ్చుచున్నయెడల శీఘ్రముగా సాంగ్రహికమును అనఁగా మలమును బంధించు నుపాయమును చేయవలయును. పంచమూలములు, ముత్తవపులగము, శొంఠి, ధనియములు, కలువ, మారేడుపిందెలు వీటిలో నేదియైన నొకదానితో చేర్చి మజ్జిగతో సేవించినయెడల వాతకఫవలనఁ బుట్టుచుండెడి యతిసారముగల రోగులకు సౌఖ్యము కలుగును.

శ్లో. కంచటజంబూదాడిమశృంగాటకపత్రబిల్వహ్రీబేరం, జలధరనాగరసహితం గంగామపి వేగినీం రుంధ్యాత్. 36. కృత్వాలవాలం సుదృఢం పిష్ట్వైరామలకైర్భిషక్, ఆర్ద్రకస్వరసేనాశు పూరయేన్నాభిమండలం. 37. నదీవేగోపమం ఘోరం అతీసారం నిరోధయేత్, కరాతతిక్తకం ముస్తం వత్సకం సరసాంజనం. 38. పిబేత్పిత్తాతిసారఘ్నం సక్షౌద్రం వేదనాపహం, ఫలం వత్సకబీజస్య శ్రపయిత్వా జలం పిబేత్. 39. యోరసాశీ జయేచ్ఛీఘ్రం సపైత్తం జఠరామయం, మధూకం కట్ఫలం లోధ్రం దాడిమస్య ఫలత్వచం. 40. పిత్తాతిసారే మధ్వక్తం పాయయేత్తండులాంబునా, కుటజాతివిషాముస్తం హరిద్రాపర్ణినీద్వయం. 41. సక్షౌద్రశర్కరం శస్తం పిత్తశ్లేష్మాతిసారిణాం, కుటజత్వక్ఫలం ముస్తం క్వాథయిత్వా జలం పిబేత్. 42. అతీసారం జయత్యాశు శర్కరామధుయోజితం, బిల్వచూతాస్థినిర్యూహః పీతస్సక్షౌద్రశర్కరః. 43. నిహన్యాచ్ఛర్ద్యతీసారం వైశ్వానర ఇవాహుతిం,

పటోలయవధాన్యాక క్వాథః పేయః సుశీతలః. 44. శర్కరామధు సంయుక్తః ఛర్ద్యతీసారనాశనః, ప్రియంగ్వంజనముస్తాఖ్యం పాయయేత్తు యథాబలమ్. 45. పటోలయవధాన్యాక క్వాథః పేయఃసుశీలః, తృష్ణాతిసారచ్ఛర్దిఘ్నంసక్షౌద్రం తండులాంబునా. 46. కలింగకవచాముస్తం దారుసాతివిషంసమమ్, కల్కం తండులతోయేన పిబే త్పిత్తానిలామయీ. 47. కుటజం దాడిమం ముస్తం ధాతకీబిల్వవాలకం, లోధ్రచందనపాఠా శ్చ కషాయం మధునా పిబేత్. 48. సామే సశూలే రక్తేపి పిచ్ఛాస్రావేషు శస్యతే, కుటజాది రితి ఖ్యాతః సర్వాతీసారనాశనః. 49. సమంగాతివిషాముస్తం విశ్వం హ్రీబేరధాతకీ, కుటజత్వక్ఫలం బిల్వ క్వాథ స్సర్వాతిసారనుత్. 50. దలోత్థః స్వరసః పేయః కింజల్కస్య సమాక్షికః, జయత్యామ మతీసారం క్వాథో వా కుటజత్వచః. 51. వటారోహం తు సంపిష్య శ్లక్ష్ణం తండులవారిణా, తం పిబే త్తక్రసంయుక్త మతీసారరుజాపహం. 52. తండులజలపిష్టాం కోరమూలకద్రావ పాన మపహరతి, సర్వాతిసారగ్రహణీ రోగసమూహం మహాఘోరం. 53 కల్కః కోమలబబ్బూలదలా త్పీతో తిసారహా, కుటజత్వక్కృతః క్వాథో ఘనీభూత స్సుశీతలః. 54. లోహిత స్వతివిషాయుక్తః సర్వాతీసారను ద్భవేత్, వదంత్యత్రాష్టమాంశేన క్వాథా నతివిసారజః. 55. ప్రతీష్యత్వాత్వాదికం తు లేహా దితి చ నో మతిః.

కొడిసిపాలపట్ట, నేరేడు, దానిమ్మ, పల్లేరు, మారేడుపిందెలు, కరువేరు, తుంగముస్తెలు, శొంఠి వీటిని చూర్ణముచేసి ఆచూర్ణమును క్వాథముచేసి సేవించినయెడల గంగాప్రవాహపు వేగమునైనను ఆపగలుగును అనిన అతిసారము విషయములో నిదుర్వం గల దని వేఱుగా చెప్పవలయునా? లేకపోయిన ఉసిరికపప్పు పిండిగా నూరి దానిని చిక్కని అంబలిగా గాచి తరువాత అల్లపురసమును చేర్చి బొడ్డునకు పట్టించినయెడల నదీవేగమువలె భయంకరమగు నతిసారమైనను ఆగిపోవును.

వాయువిడంగములు, నేలవేము, కొడిసెపిత్తులు, సరసాంజనము వీటిని చూర్ణము చేసి దీనియందు తేనెను గలిపికొని పుచ్చుకొనినయెడల పిత్తమువలనం బుట్టిన నతిసార రోగము తత్క్షణమే యుపశమనము నొందును. ఒకపలప్రమాణముగల కొడసెపాలవిత్తులను కషాయమునందుకాచి త్రాగినను మాంసరసమును భుజించినను గాని పిత్తమువలనం

బుట్టెడి అతిసారరోగము దూరముగా తొలఁగిపోవును. ఇప్పపువ్వు, కాయఫలపుచెక్క, లొద్దుగచెక్క, దానిమ్మపండుపైబెరడు, దానిమ్మఫలము వీటిని ఎండబెట్టి చూర్ణముచేసి ఆచూర్ణములో తేనెను వైచికొని బియ్యపుకడుగు అనుపానముతో చేర్చి పిత్తసంబంధములగు నతిసారవిషయములలో త్రాగవలయును.

కొడిసెవిత్తులు, అతివస, తుంగముస్తెలు, మ్రానిపసపు, పచ్చిపసపు, కోలపొన్న, ముయ్యాకుపొన్న వీటిని చూర్ణమునుచేసి కషాయమునుగాచి యందు తేనెను కలిపికొని నాకినయెడల పిత్తసంబంధములైనవియును, కఫసంబంధములు నైనవియు నగు అతిసారముల పోగొట్టుటయందు దిట్ట యగును. కొడిసెపట్ట, కొడిసెపండు, తుంగముస్తెలు వీనిని కషాయమునుగా గాచి ఆకషాయములో కండచక్కెరను తేనెను వేసి త్రాగినయెడల నతిసారరోగము లతిశీఘ్రముగా నశించిపోవును.

మారేడుగింజలు, మామిడిపలుకులు వీటిని నిర్యూహముచేసి తేనెను కండచక్కెరను కలిపి త్రాగినయెడల దుర్దరమైన యతిసారములు కూడను అగ్నిదేవునియందలి ఆహుతులవలె రూపడఁగిపోవును. చేదపొన్న, యవలు, ధనియములు వీటితో చేయఁబడిన కషాయమును చల్లగా చల్లార్చి దానిలో కలకండను తేనెను చేర్చికొని త్రాగినయెడల భద్రగల యతిసారములు గూడను నశించి పోగలవు. కొడిసెవిత్తులు, వస, తుంగముస్తెలు వీటిని కషాయమునుచేసి తాను ఓపగలుగునంతమట్టునకు తీసికొని తేనెను అందులో కలిపి బియ్యపునీళ్లతో కలిపి సేవించినయెడల దాహము, అతిసారము, ఛర్ది మొదలగునవి నశించి పోగలవు.

కొడిసెపాలవిత్తులు, దానిమ్మబెరడు, తుంగముస్తెలు వీటిని అన్నిఁటిని సమానములుగా తీసికొని కల్కముఁజేసి బియ్యపుకడుగుతోఁగూడా వాతపిత్తములవలనఁ బుట్టిన యతిసారముగల రోగి పుచ్చుకొనవలయును. కొడిసెపాలవిత్తులు, దాడిమబెరడు, తుంగముస్తెలు, ఉసిరికెపప్పు, మారేడుపిందెలు, కురువేరు, లొద్దుగ, రక్తచందనము, అగరు శొంఠి వీటిని కషాయముపెట్టి తేనెను ఆకషాయములో వైచికొని త్రాగవలయును. ఈయౌషధము ఆమముచేత వచ్చిన యతిసారములనును, పోటుగలిగిన యతిసారమునను, రక్తాతిసారమునను, పిచ్ఛాస్రావమునకును మిగుల శ్రేష్ఠమైనది. ఇయ్యది కుటజాదికషాయ మనఁబడును. ఈకషాయ మన్నివిధములగు నతిసారములను పోగొట్టును.

ముత్తవపులగము, అతివస, తుంగముస్తెలు, శొంఠి, కురువేరు, ఆరెపువ్వు, కొడిసెచెక్క, కొడిసెపండు, మారేడుపిందెలు వీటియొక్క కషాయము అన్నివిధములగు నతిసారములను నశింపఁజేయును. నీరుప్రబ్బలి ఆకులరసములో తేనెను కలిపికొని తాగి

నను కొడిసెపట్టతో చేసిన కషాయమునందు తేనెను కలిపికొని త్రాగినను ఆమాతిసారములు నశించి పోఁగలవు. మఱ్ఱిచిగుళ్ళను బియ్యపుకడుగుతోఁ గూడ చేర్చి నూరికొని త్రాగినయెడల నతిసారనుల పీడ లేకుండ తొలగిపోవును.

ఊడుగవేళ్ళను బియ్యపుకడుగుతో నూరి కల్కముచేసి అర్ధకర్ష ప్రమాణము సేవించినయెడల అన్నివిధములగు నతిసారములును, గ్రహణులును, భయంకరము లగు నితర రోగములును నశించిపోఁగలవు. బబ్బూలపుచెట్టుయొక్క లేతచిగుళ్లను (అనఁగా వెలితుమ్మ చిగుళ్లు) కల్కముచేసికొని త్రాగినయెడలగాని కొడిసెపట్టునుగట్టిగా కషాయమునుగా గాచికొని చక్కగా చల్లార్చికొని అతివసనుచూర్ణమునుగా చేసికొని పుచ్చుకొనినయెడలగాని అన్నివిధములు లగు నతిసారములును నశించిపోఁగలవు. కొందఱు కషాయమునందు ఎనిమిదవపాలు అతివసచూర్ణమును వేయవలయు నని చెప్పెదరు. మఱియును దేహముకంటె అతివసచూర్ణము నాల్గవపాలు వేయవలయు నని నేను యభిప్రాయము నొందుచున్నాను.

## అంకోలవటకము: విడంగాదిక్వాథము.

శ్లో. సదా ర్ద్వ్యం కోట పాఠానాం మూలం త్వక్కుటజస్య చ. 56. శాల్మలీశాలనిర్యాస ధాతకీలోధ్ర దాడిమం, పిష్ట్వాక్ష సమ్మితాన్ కృత్వా వటకాం స్తండులాంబునా. 57. తేనైవ మధుసంయుక్తా నేకైకాః ప్రాత రుత్థితః, పిబే దత్యయ మాపన్నో విడ్వసర్గేణ మానవః. 58. అంకోటవటకో నామ్నా సర్వాతీసారనాశనః, కయ స్యర్ధోనకే భాగే హ్రీబేరోత్పలనాగరైః. 59. పేయా రక్తాతిసారఘ్నీ పృశ్నిపర్ణ్యా చ సాధితా, రసాంజనం సాతివిషం కుటజస్య ఫలం త్వచం. 60. ధాతకీ శృంగబేరం చ ప్రపిబే త్తండులాంబునా, క్షౌద్రేణ యుక్తం నుదతి రక్తాతీసార ముల్బణం. 61. మందం దీపయతే చాగ్నిం శూలం చాపి నివర్తయేత్, విడంగాతివిషాముస్తం దారుపాఠాకలింగకం. 62. మరిచేన సమాయుక్తం శోధాతీసారనాశనం.

మ్రానిపసపు, అంకోలపుచెట్ల (ఊడుగు) వేళ్లు, అగరుశొంఠి, కొడిసెచెక్క, బూరుగబంక, మద్దిబంక, ఆరెచెక్క, లొద్దుగచెక్క, దానిమ్మబెరడు, వీటిని అన్నిఁటిని సమానముగా ఒక్కొక్క అక్షము చొప్పున తీసికొని కడుగునీళ్లతో నూరి కల్కమును చేసికొని తేనెను కలిసికొని మాత్ర కట్టి యుండవలయును. మఱల ప్రాతఃకాలముననే లేచి అతిసారరోగముగల రోగి దానిని పుచ్చుకొనవలయును. ఇయ్య

దియే అంకోటవటక మనఁబడును. ఈఅంకోటవటకము అన్నివిధము లగు అతిసార ములను నశింపఁజేయును.

సగపాలు నీరుకలిసిన మేకపాలలో కుఱువేరు, నల్లకలువ, తుంగముస్తలు, కోలపొన్న వీటిని కలిపి సిద్ధముచేయఁబడిన పాకము రక్తాతిసారములను పోఁగొట్టును. రసాంజనము, అతివస, కొడిసెచెక్క, కొడిసెపండు, ఆగరుచెక్క, అల్లము వీటిని బియ్యపుకడుగుతో నూరి చేర్చికొని త్రాగవలయును. తేనెలో కలపినయెడల నియ్యది అత్యంతము భయంకరములయిన అతిసారములను కూడ నశింపఁజేయును. అగ్నిమాంద్యమును కూడ పోఁగొట్టి ఆకలిని దీపింపఁజేయును. శూలరోగమును పాండురోగమును వాయువిడంగములు, అతివస, తుంగముస్తలు, దేవదారుచెక్క, అగరుశొంఠి, కొడిసెపాల, మిరియములను కషాయముగా గాచి సేవించినయెడల శోధముగల యతిసారములుగూడ నడుగంటి పోవును.

[వత్సాదియోగములు; దాడిమాదికషాయములు; బిల్వవటి; బిల్వాదిరసము; శాల్మల్యాదిరసము; జంబ్వాదిరసము, బిల్వాదిరసము మొదలగునవి.]

శ్లో. సవత్సక స్సాతివిష స్సబిల్వ స్సోదీచ్యముస్త శ్చ కృతః కషాయః, సామే సశూలే సహశోణితే చ చిరప్రవృత్తే పి హితో౽తిసారే. 63. కషాయో మధునా పీత స్త్వచో దాడిమవత్సకాత్, సద్యో జయే దతీసారం సరక్తం దుర్నివారకం. 64. గుడేన ఖాదయే ద్బిల్వం రక్తాతీసారనాశనం, ఆమశూలవిబంధఘ్నం కుక్షిరోగవినాశనం. 65. బిల్వాబ్దధాతకీపాఠా శుంఠీమోచరసా స్సమాః, పీతా రుంధం త్యతీసారం గుడతక్రేణ దుర్జయం. 66. శాల్మలీ బదరీజంబూ ప్రియాలామ్రార్జునత్వచః, పీతాః క్షీరేణ మధ్వాఢ్యాః పృథక్ శోణితనాశనాః. 67. జంబ్వామ్రామలకీనాం తు పల్లవా నథ కుట్టయేత్, సంగృహ్య స్వరసం తేషా మజాక్షీరేణ యోజయేత్. 68. తం పిబే న్మధునా యుక్తం రక్తాతీసారనాశనమ్, బిల్వం ఛాగపయస్సిద్ధం సితామోచరసాన్వితమ్. 69. కలింగచూర్ణసంయుక్తం రక్తాతీసారనాశనమ్, జ్యోత్స్నాంబునా తండులీయం పీతం చ ససితా మధు. 70. పీత్వా శతావరీకల్కం పయసా క్షీరభు గ్జయేత్, రక్తాతిసారీ పీత్వా చ తయా సిద్ధం ఘృతం నరః. 71.

కొడిసెపట్ట, అతివస, మారేడువేలు, కురువేరు, తుంగముస్తలు వీటితోటి చేయఁబడిన కషాయము ఆమాతిసారములను, నొప్పిగలిగిన యతిసారరోగములను, రక్తాతిసారములను, మఱియును, చాలరోజులనుండి పుట్టిన యతిసారరోగములను నాశనము చేసి హితమును కలుగఁజేయును.

లేఁతదానిమ్మబెరడు, కొడిసెపట్ట వీనితో పెట్టినకషాయములో తేనెను కలిపికొని త్రాగినయెడల రక్తాతిసారములు దూరముగా తొలఁగిపోవును. బెల్లముతో కలిపి మారేడుపండ్లను తినినట్టులయిన రక్తాతిసారములు నశించిపోవును. మఱియును ఆమశూలము మలబద్ధకము మొదలగునవియుఁగూడ దూరముగా తొలఁగిపోవును. కడుపునొప్పి మొదలగునట్టి రోగములుకూడను మొదలంట నశించి పోఁగలవు.

మారేడుపిందెలు, తుంగముస్తలు, ఆరెచెక్క, అగరుశొంఠి, శొంఠి, బూరుగవేరు వీటి నన్నింటిని సమానములైన భాగములనుగా తీసికొని బెల్లముతో కలిపి మజ్జిగతో త్రాగినట్టులయిన నత్యంతము భయంకరము లగు నతిసారములును దూరము లగును. బూరుగువేరు, రేగువేరు, మొగటవేరు, మామిడివేరు, మద్దివేరు వీటిని వేరువేరుగా తీసికొని మేకపాలును తేనెను చేర్చికొని త్రాగినయెడల రక్తాతిసారమును పోఁగొట్టును.

నేరేడు, ఉసిరిక, మామిడి వీటిచిగుళ్ల రసమును మేకపాలలో కలిపి తేనె చేర్చి త్రాగినయెడల రక్తాతిసారములు నశించిపోవును. మేకపాలలో మారేడుపిందెలు సిద్ధముచేసి (అనఁగా నానవైచి) చక్కెర మిఱియపుపొడిని కలిపి ఆపిమ్మట నానుకొడిశె పాలవిత్తుల చూర్ణమును వేసికొని త్రాగినయెడల రక్తాతిసారము లణఁగిపోవును.

అతిమధురమును నూరి చక్కెర తేనెల నందులో కలిపి బియ్యపుకడుగుతో చేర్చికొని త్రాగినట్టులయిన గాని శతావరి [అనఁగా పెద్దపిల్లి పీచర] యొక్క కల్కమును పాలతో చేర్చి త్రాగినయెడల గాని మనుష్యుఁడు రక్తాతిసారమును జయింపగలుగును. లేకపోయిన శతావరిని కల్కముగా చేసి సిద్ధముచేయఁబడిన నేతిని రక్తాతిసారరోగముగల రోగి త్రాగినయెడల సుఖము కలుగును.

కుటజరసాయనము; గుద భ్రంశములకు కషాయము; కుటజపుటపాకము.

శ్లో. కుటజస్య పలం గ్రాహ్య మష్టభాగజలే శృతమ్, తథైవ విపచే ద్భూయో దాడిమోదకసంయుతమ్. 72. యావచ్ఛైవ లసీకాభం శృతం త ముపకల్పయేత్, త స్యార్ధకర్షం తక్రేణ పిబే ద్రక్తాతిసారవాన్. 73. అవశ్యమగణీయోపి మృత్యో ర్యాతి న గోచరమ్, క్వాథతుల్యం దాడిమాంబు భాగానుక్తౌ సమంతతః. 74. కల్క స్తిలానాం

కృష్ణానాం శర్కరాభాగసంయుతః, ఆజ్యేన పయసా పీతః సద్యో రక్తం నియచ్ఛతి. 75. గుదదాహే ప్రపాకే వా పటోలమధుకాంబునా, సేకాదికం ప్రశంసంతి ఛాగేన పయసాపి వా. 76. గుదభ్రంశే ప్రకర్తవ్యా చికిత్సా తత్ప్రకీర్తితా, అవేదనం సుసంపక్వం దీప్తాగ్నేస్త్వచిరోత్థితమ్. 77. నానావర్ణమతీసారం పుటపాకైరుపాచరేత్. స్నిగ్ధం ఘనం కుటజవల్కమజంతు జగ్ధమాదాయ తత్క్షణ మతీవచ పోథయిత్వా, జంబూపలాశపుట తండులతోయసిక్తం బద్ధం కుశేన చ బహిర్ఘనపంకలిప్తమ్. 78. సుస్విన్న మేత దవపీడ్య రసం గృహీత్వా క్షౌద్రేణయుక్త మతిసారవతే ప్రదద్యాత్, కృష్ణాత్రిపుత్రమతపూజిత ఏష యోగః సర్వాతిసారహరణే స్వయమేవ రాజా. 79. స్వరసస్య గురుత్వేన పుటపాకపలం పిబేత్, పుటపాకస్య పాకోఽయం బహి రారక్తవర్ణతా. 80.

ఒక పలము కొడిసెపట్టను తీసికొని ఎనిమిదిరెట్లధికముగా నున్న నీటిలోవైచి పాకము చేయవలయును. మఱల నదేప్రకారము దానిమ్మపండ్లరసమును కలిపి ఉడుకఁబెట్టవలయును. బాగుగా నుడికి తీగెమోస్తరుగా నుండినయప్పుడు దింపి జాగ్రత్త చేసికొని అర్థకర్ష ప్రమాణముగా మజ్జిగతో కలిపి త్రాగుచుండినయెడల రక్తాతిసారములు నశించిపోవును. దీని సామర్థ్యమువలన చావునకు సిద్ధమైన మనుష్యుఁడుకూడను బ్రదుకగలఁడు. కషాయముతో సమానముగా దానిమ్మరసమును తీసికొనవలయును.

నల్లనూవులను కల్కముచేసి దానికి సమభాగముగ కలకండను కలిపి మేకపాలతో కలిపి త్రాగినయెడల రక్తాతిసారము లన్నియు నతిశీఘ్రముగా నశించి పోఁగలవు. ముడ్డి ఎండిపోవునప్పుడుగాని, తీపు ఎత్తుచున్నప్పుడుగాని చేదుపొట్ల యష్టిమధుకము మొదలగువానితో చేయఁబడిన కషాయముతో తడుపుచుండుట చాల శ్రేయమును కలిగించును. లేకపోయినచో మేకపాలతో తడుపుటయైనను ఉత్తమమే యగును. గూద దిగినప్పుడీచికిత్సను చేయవలయును.

అగ్నిదీప్తిగలవానికిని, కష్టములు లేనివానికిని పరిపక్వమై చాలకాలముక్రింద టనే పుట్టి నానావిధములుగా నుండు అతిసారములకు పుటపాకముచేత చికిత్సను చేయవలయును. దట్టముగాను పురుగులు మున్నగువానిచే కొఱకబడకయు యుండినదియును, తగలఁబడనిదియు నగు కొడిసెపట్టను తీసికొనివచ్చి నూరి నేరేడుఆకులలో

చుట్టి బియ్యపుకడుగుతో తడిపి .తోకగాగట్టి పైకి పూతను పూసి ఆముద్దను నిప్పులో పెట్టి యుడికించి తరువాత రసమును పిండి దానియందు తేనెను కలిపి అతిసార రోగము కలవాని కౌషధముగా నీయవలయును. ఈయోగము కృష్ణాత్రిముసేముని కౌమరునిమతముచేత పూజితమై యున్నయది. అన్నితెఱంగులగు నతిసారములను నశింపచేయుటలో నిదియె యుత్తమమై కూడ నున్నయది. స్వరసమును మఱిగించి పుటపాకముచేసిన రసమును పలమంత తీసికొనవలయును. పైని అన్నిప్రక్కలను ఎఱ్ఱ బారినయప్పుడు పుటపాకము పక్వమైనది యనితెలిసికొనవలయును.

### కుటజలేహము.

శ్లో. త్వక్పిండం దీర్ఘవృంతస్య కాశ్మరీపత్రవేష్టితమ్, మృదావ లిప్తం సుకృత మంగారే ష్వవలేహయేత్. 81. స్విన్న ముద్ధృత్య నిష్పీ డ్య రస మాదాయ యత్నతః, శీతీకృతం మధుయుతం పాయయే దుద రామయే. 82. శతం కుటజమూలస్య క్షుణ్ణం తోయార్మణే పచేత్, క్వాథే పాదావశేషేఽస్మిన్ లేహం పూతే పునః పచేత్. 83. సౌవర్చ లయవక్షారవిడసైంధవపిప్పలీ, ధాతకీంద్రయవా జాజీ చూర్ణం దత్వా పలద్వయమ్. 84. లిహ్యా ద్బదరమాత్రం తచ్ఛీతం క్షౌద్రేణ సంయు తం, పక్వాపక్వ మతీసారం నానావర్ణం సవేదనం. 85. దుర్వారం గ్రహణీరోగం జయేచ్చైవ ప్రవాహికాం.

దుండిగపుచెక్క నునూరి ముద్దగాచేసి గుమ్మడిఆకుతో చుట్టిపెట్టి పైనమట్టిని పొదివి నిప్పులో (కుమ్ములో) నుడుకబెట్టవలయును. చక్కగా మ్రగ్గిన తరువాత బయలునకు తీసి రసమునుతీసి చక్కగా చల్లారినతరువాత దానిలో తేనెను వైచికొని అతిసారరోగ ము కలిగినప్పుడు సేవింపవలయును. కొడిసెపట్టను నూరుపలములు తెచ్చి నూరి ఒకద్రోణ పరిమాణముగల నీటిలో నుంచి పక్వము చేయవలయును. మొదలపోసిన నీటిలో నా ల్గవపాలు మిగిలియున్నప్పుడు వడియకట్టి మరల వండవలయును.

తరువాత యవక్షారము, బిడాలవణము, సైంధవలవణము, పిప్పళ్లు, ఆరెకెక్క, కొడిసెపాలవిత్తులు, తెల్లజీలకఱ్ఱ వీటిని చూర్ణముచేసి రెండుపలములంతకలిపి చక్కగా చల్లారినతరువాత తేనెనుకలిపి రేగుపండంతమాత్రలను చేసికొని తినవలయును. ఇయ్యది యే కుటజాదిలేహ మనఁబడును. ఈకుటజాదిలేహము పక్వములగు నతిసారములను, చ క్కగాఁ బక్వముకానివానిని, అనేకములగు రంగులతో గూడినవానిని, శూలరోగముగలిగిన

**వియు నగువానిని భయంకరము లగునవి యగు అతిసారములను ప్రవాహిక గ్రహణి రోగము మున్నగువానిని పోఁగొట్టును.**

### కుటజాష్టకయోగములు.

శ్లో. తులామథార్ద్రాం గిరిమల్లికాయాః సంక్షుద్య పక్త్వా రసమాదదీత, తస్మిన్ సుపూతే ఫలసమ్మితాని శ్లక్ష్ణాని పిష్ట్వా సహ శాల్మలేన. 86. పాఠాం సమంగాతివిషాం సమస్తాం బిల్వం చ పుష్పాణి చ ధాతకీనాం, ప్రక్షిప్య భూయో విపచేత్తు తావ ద్దర్వీ ప్రలేప స్స్వరసస్తు యావత్. 87. పీత స్త్వసౌ కాలవిదా జవేన మండేన వాఽజాపయసాఽథవాపి, నిహన్తి సర్వం త్వతిసార ముగ్రం కృష్ణం సితం లోహితపీతకం వా. 88. దోషం గ్రహణ్యా వివిధం చ రక్తం శూలం. తథార్శాంసి సశోణితాని, అసృగ్దరం చైవ మసాధ్యరూపంనిహన్త్య వశ్యం కుటజాష్టకోయం. 89.

పచ్చికొడిసెపట్టను తులాప్రమాణము తెచ్చి ద్రోణము నీళ్లనైచి నాన్చి చక్కగా నూరి వండి రసమును తీయవలయును. ఆపిమ్మట వడయంబోసి బూరుగచక్కను నూరి పల ప్రమాణముగల అగరుశొంఠి, సుత్తవపులగము, అతివస, తుంగముస్తెలు, మారేడు వేళ్లు, ఆరెపువ్వులును వీనినన్నిటిని చూర్ణమును చేసి పైనిచెప్పిన రసములో వేసి వండవలయును. గరిటెకు అంటుకొని తీగవారుచు స్వరస మెప్పుడగునో అప్పుడు పక్వమైదిగా తెలిసికొనవలయును. అంతట దించి తీసికొనవలయును.

పిమ్మట కాలమును గుర్తెఱింగినవాడై మంచినీళ్లు త్రాగునప్పుడుగాని, మజ్జిగను త్రాగునప్పుడు గాని, లేక మేకపాలతో జేర్చిగాని త్రాగవలయును. ఇయ్యది భయంకరములగు నతిసారములను, లేక నలుపు, తెలుపు, ఎఱుపు, పసపు మొదలగు రంగులుగల అతిసారములను, గ్రహణులను, మఱియును అనేకవిధములగు రక్తదోషములను, పోటుగల మూలరోగములను సాధ్యముకానివని వదలిపెట్టిన ప్రదరములను ఈకుటజాష్టకము సమూలముగా నశింపఁజేసివైచును.

### షడంగఘృతము.

శ్లో. తులాద్రవ్యే జలద్రోణో ద్రోణే ద్రవ్యతులా మతా, వత్సకస్య చ బీజాని దార్వ్యాశ్చ త్వచ ఉత్తమాః. 90. పిప్పలీశృంగ

బేరం చ లాక్షాకటుకరోహిణీ, షడ్భి రేభి ర్ఘృతం సిద్ధం పేయం మండావచారితమ్. 91. అతీసారం జయే చ్ఛీఘ్రం త్రిదోష మపి దారుణమ్.

తా. తులాపరిమాణము గల ఔషధులయందు ద్రోణపరిమాణము నీటిని చేర్పవలయును. ద్రోణపరిమాణముగల నీటియందు ఒకతులా మాత్రము ఔషధులను చేర్పవలయును.

కొడిసెపాల, దేవదారుపట్ట, మాదీఫలపుచెక్క, పిప్పళ్లు, శొంఠి, లక్క, కటుకరోహిణి ఈఔషధులచేతను సిద్ధముచేయఁబడిన నేతిని మజ్జిగతోఁగూడ త్రాగవలయును. ఇయ్యది త్రిదోషములవలన పుట్టినదియైనట్టిఅత్యంత భయంకరములయినట్టి అతిసారములఁగూడ శీఘ్రముగా నశింపఁజేయును. దీనినే షడంఘ్రుతమని చెప్పెదరు.

## క్షీరద్రుమాదిఘృతము.

శ్లో. క్షీరద్రుమాంఘ్రిరసే విపక్వం తజ్జైశ్చ కల్కైః పయసా చ సర్పిః, సితోపలాఢ్యం మధుపాదయుక్తం రక్తాతిసారం శమయ త్యుదీర్ణమ్. 92. జీర్ణేమృతోపమం క్షీర మతీసారే విశేషతః, ఛాగం తు భేషజై స్సిద్ధం దేయం వా వారిసాధితమ్. 93. బాలం బిల్వం గుడం తైలం పిప్పలీవిశ్వభేషజమ్, లిహ్యా ద్వాతే ప్రతిహతే సశూలే సప్రవాహికే. 94. పయసా పిప్పలీకల్కః పీతో వా మరిచోద్భవః, త్ర్యహా త్ప్రవాహికాం హంతి చిరకాలానుబంధినీమ్. 95. కల్క స్స్యా ద్బాలబిల్వానాం తిలకల్కశ్చ తత్సమః, దధ్న స్సారామ్లు స్స్నేహాఢ్యః ఖండో హన్యాత్ప్రవాహికామ్. 96. బిల్వోషణం గుడం లోధ్రం తైలం లిహ్యా త్ప్రవాహణే. దధ్నా ససారేణ సమక్షికేణ భుంజీత నిశ్చారకపీడితస్తు, సుతప్తకుప్యక్వథితేనవాపి క్షీరేణ శీతేన మధుప్లుతేన. 97. దీప్తాగ్ని ర్నిష్పురీషో యః సార్యతే ఫేనిలం శకృత్. 98. స పిబే త్ఫాణితం శుంఠీ దధితైలపయోఘృతమ్, శోథం శూలం జ్వరం తృష్ణాం శ్వాసం కాస మరోచకమ్. 99. ఛర్దిం మూర్ఛాం చ హిక్కాం చ దృష్ట్వాతీసారిణం త్యజేత్, బహుమేహీ నరో యస్తు భిన్నవిట్కో న జీవతి. 100. స్నానాభ్యంగావగాహాం శ్చ గురుస్నిగ్ధాతిభోజనమ్, వ్యాయామ మగ్ని సంతాప మతిసారీవివర్జయేత్. 101.

క్షీరద్రుమాద్యఘృతమును చెప్పుచున్నాఁడు:—మఱ్ఱి, మేడి, జువ్వి మొదలగు క్షీరవృక్షములతో సంభవమైనవానిక్వాథమున పిల్లిపీచరసమును నేతికి రెండురెట్లుగా కలిపి కల్కమును చేయవలయును. పిమ్మట చక్కెరను సగపాలును, తేనెను నాలవపాలును కలిపి త్రాగినయెడల నతిభయంకరము లగు రక్తాతిసారములు గూడ తొలఁగిపోవును. జీర్ణజ్వరవిషయములో పాలు అమృతతుల్యములును, అతిసారమునందు విశేషించి యమృతముతో సమానములును అగును. ఓషధులచేత తయారుచేయఁబడినట్టి మేకపాలనుగాని నీటితో సిద్ధము చేయఁబడిన మేకపాలను కాని యిచ్చుట మంచిది. మారేడుపిందెలు, బెల్లము, తైలము, పిప్పళ్లు, శొంఠి వీనిని పోటు ప్రవాహికలు గల వాతమునకు ప్రతిక్రియచేయుటయందు వినియోగింపవలయును.

నాలుగమాషములపిప్పలిచూర్ణమునుగాని, మిరియములచూర్ణమునుగాని పలప్రమాణముగల మేకపాలలో కలిపికొని త్రాగినచో మూఁడురోజులలో నెంతటిపురాణమైన ప్రవాహికలుగూడ నశించిపోవును. మారేడుపిందెలతో చేసిన కల్కమునందు తిలకల్కమును సమానముగా కలిపి గట్టిపెరుగును తైలము కలిపి పుచ్చుకొనవలయును. ఇది చిన్నప్రవాహికలను రూపుమాపును. మారేడుపిందెలు, మిరియములు, బెల్లము, చమురు వీటితో చేయఁబడినపచ్చడిని (అవలేహము) గట్టిపెరుగునందు తేనెను కలిపికొని భక్షింపవలయును. వేడిపాత్రలో కాచియున్న పాలను చల్లార్చి తేనెను కలిపికొని త్రాగవలయును.

అగ్నిదీప్తికలవాఁడును, మలము లేనివాఁడును, నురుగులు (అనగా బుడగలు) గట్టిమలము వెడలువాఁడును శొంఠి, పెరుగు, నూనె, పాలు, నేయి వీటిని కలిపి పుచ్చుకొనవలయును. శోథ, పోటు, జ్వరము, దప్పి, శ్వాసము, దగ్గు, అరుచి, ఛర్ది, మూర్ఛ, వెక్కిళ్లు వీటితో కూడిన అతిసారరోగిని కనుగొని (కార్యము లేదని) వదలివేయవలయును. అనేకపర్యాయములుగా మూత్రము వెడలుచుండుట వేరువేరు రీతులగా మలము వెడలుట కలరోగి బ్రదుకఁడు. అతిసారరోగి స్నానము, తలంటు, నీళ్లమునుఁగుట, భారకరములగు భోజనపదార్థములను తినుట, మృష్టాన్నము ఎక్కువతినుట, కసరత్తుచేయుట, నిప్పుమీద కాచికొనుట మున్నగువానిని వదలవలయును.

ఇట్లు చక్రదత్తసంహితయందు అతిసారచికిత్సప్రకరణము ముగిసెను.



# ౪. గ్రహణ్యాధికారము.



శ్లో. గ్రహణీ మాశ్రితం దోష మజీర్ణవ దుపాచరేత్, అతీసారోక్తివిధినా తస్యామం చ విపాచయేత్. 1. శరీరానుగతే సామే రసే లంఘనపాచనం, విశుద్ధామాశయా యాస్మై పంచకోలాదిభి ర్యుతం. 2. దద్యా త్పేయాది లఘ్వన్నం పున ర్యోగాంశ్చ దీపకాన్, కపిత్థబిల్వ చాంగేరీ తక్రదాడిమసాధితా. 3. పాచనీ గ్రహణీ పేయా సవాతే పంచమూలికీ, గ్రహణీదోషిణాం తక్రం దీపనం గ్రాహి లాఘవాత్. 4. పథ్యం మధురపాకిత్వా న్న చ పిత్తప్రకోపనం, కషాయోష్ణవికాసిత్వా ద్రౌక్ష్యా చ్చైవ కఫే హితం. 5. వాతే స్వాద్వమ్లసాంద్రత్వా త్సద్యస్క మవిదాహితం. శుంఠీం సముస్తాతివిషాం గుడూచీం పిబే జ్జలేన క్వథితాం సమాంశం, మందానలత్వే సతతామతాయా మామానుబంధే గ్రహణీగదే చ. 6. ధాన్యకాతివిషోదీచ్య యవానీముస్తనాగరం, బలా ద్విపర్ణీబిల్వం చ దద్యా ద్దీపనపాచనం. 7.

గ్రహణీ ప్రకారమును చెప్పుచున్నాఁడు:—గ్రహణిలో కలిగెడు దోషములకు అజీర్ణమునకువలెనే చికిత్సలను చేయవలయును. అతిసారమునకు చెప్పఁబడినరీతిగనే ప్రతిక్రియలను చేసి ఆమమును పక్వము నొందింపవలయును. శరీరతత్త్వముల ననుసరించినదియును ఆమము వెడలునదియు నగు రసమునందు (అనఁగా గ్రహణియందు) లంఘనము చేయుటకాని పాచనము చేయుటకాని చాల యుత్తమమగు కార్యము.

విశేషముగా పరిశుద్ధమైన ఆమాశయము గలరోగికి పంచకోలములచేత సిద్ధము చేయఁబడిన పానకము మొదలయినవియును, చులక నగు నాహారమును ఇచ్చుచు జఠరాగ్నిని దీపింపఁజేయు ఔషధయోగములను కూడ నిచ్చుచు నుండవలయును.

వెలఁగపండు, మారేడుపండు, పులిచింత, మజ్జిగ, దానిమ్మపండ్లు వీటితోటి సిద్ధము చేయఁబడిన పానకము ఆహారమును పక్వముచేయును. మలమును మిక్కిలిగా వెడలకుండునట్లు బంధించును. మఱియును వాతముతో కూడినదోషములు గలిగినప్పుడు పంచమూలములతో సిద్ధముచేయఁబడిన పానకమును ఈయవలయును.

గ్రహణిరోగముగలవారలకు మజ్జిగ దీపకమగును. మలమును బంధించును. ఒడలిని తేలిక చేయును. మిక్కిలిహితమును కలుగ చేయును. మధురపాకముగలదగుటచేత పిత్తమును పెఱుగనీయదు. కషాయము వేడిగాను వికాసముగలదిగా నుండుటవలన రూక్షముగాను నుండుటవలన కఫమునకు హితకారి యగును. రుచిగాను ఆమ్లమెక్కువగాను నుండుట వలన అప్పటికప్పుడు సిద్ధముచేసిన తక్రము వాతమునందు హితకర మగును. శొంఠి, తుంగముస్తలు, అతివస, తిప్పతీగె ఇవి యన్నియును సమానభాగములుగా తీసికొని నూరి నీటితోకూడా త్రాగవలయును. ఇయ్యది అగ్నిమాంద్యము, ఆమదోషము, ఆమముగల గ్రహణిదోషము వీటిని పోఁగొట్టును. ధనియములు, అతివస, కురువేరు, వాము, తుంగముస్తలు, శొంఠి, ముత్తవపులగము, ముయ్యాకుపొన్న, కోలపొన్న, మారేడుపండు ఇయ్యవి (అనఁగా వీటితో చేయఁబడిన పానకములు) అగ్నిదీపనమును పాచనమును పుట్టించును.

## చిత్రకాదిఘుటికలు; శ్రీఫలాదిఘుటికలు; నాగరక్వాథాదులు.

శ్లో. చిత్రకం పిప్పలీమూలం ద్వౌ క్షారౌ లవణాని చ, వ్యోష హింగ్వజమోదాం చ చవ్యం చైకత్ర చూర్ణయేత్. 8. గుటికా మాతులుంగస్య దాడిమామ్లరసేన వా, కృతా విపాచయ త్యామం దీపయ త్యాశుచానలమ్. 9. సౌవర్చలం సైంధవం చ బిడ మౌద్భిద మేవచ, సాముద్రేణ సమం పంచ లవణా న్యత్ర యోజయేత్. 10. శ్రీఫలశలాటుకల్కో నాగరచూర్ణేన మిశ్రిత స్సగుడః, గ్రహణీగద మత్యుగ్రం తక్రభుజా శీలితో జయతి. 11. జంబూదాడిమశృంగాట పాఠా కంచటపల్లవైః, పక్వం పర్యుషితం బాలబిల్వం సగుడనాగరమ్. 12. హంతి సర్వా నతీసారాన్ గ్రహణీ మతిదుస్తరామ్, నాగరాతివిషాముస్త క్వాథ స్స్యా దామపాచనః. 13. చూర్ణం హింగ్వష్టకం వాతగ్రహణ్యాం తు ఘృతాని చ.

చిత్రమూలము, మోడి, యవక్షారము, సర్జక్షారము, పంచలవణములు, శొంఠి, మిరియములు, పిప్పళ్లు, ఇంగువ, అజామోదము, చెవ్యము సమభాగముగా వీటిని కలిపి చూర్ణము చేసి మాచిపత్రిపసరుతోగాని, దానిమ్మపండ్లరసముతోగాని సిద్ధము చేయఁబడిన గుటికలు ఆమమును పక్వము చేయును. జఠరాగ్నిని ప్రకాశింప చేయును.

మారేడుపిందెలతో చేయఁబడిన కల్కమునందు బెల్లము శొంఠి చూర్ణము కలిపి మజ్జిగను పోసికొను నలవాటుకలిగినవాఁడు భక్షించినయెడల మిగుల భయంకరములైనట్టి గ్రహణిరోగములు అయినను దూరముగా పరుగులెత్తి పోవును.

నేరేడు, దానిమ్మ, విషబొద్ది, కంచటము అను నీమోషధుల ఆకులతోటి కాచబడినకషాయమును; మారేడుపిందె, బెల్లము, శొంఠి వీటితో చేర్చిపుచ్చుకొనినయెడల నన్నిరకములయతిసారములను భయంకరములగు గ్రహణిరోగములనుపోఁగొట్టును. శొంఠి, అతివస, తుంగముస్తలు వీటితో చేయఁబడిన కషాయము ఆమమును పక్వముచేయును. వాతమువలన కలిగిన గ్రహణులయందు హింగ్వష్టకచూర్ణమును, నేయియును మిగుల హితకరము లగును.

## నాగరాద్యచూర్ణము.

శ్లో. నాగరాతివిషా ముస్తం ధాతకీం సరసాంజనమ్. 14. వత్సకత్వక్ఫలం బిల్వం పాఠాం కటుకరోహిణీం, పిబేత్సమాంశం తచ్చూర్ణం సక్షౌద్రం తండులాంబునా. 15. పైత్తికే గ్రహణీదోషే రక్తం య చ్చోపవేశ్యతే, అర్శాంస్యథ గుదే శూలం జయే చ్చైవ ప్రవాహికాం. 16. నాగరాద్య మిదం చూర్ణం కృష్ణాత్రేయేణ పూజితం, శీతం కషాయమానేన తండులోదకకల్పనా. 17. కే ష్వష్టగుణతోయేన ప్రాహు స్తండులభావనాం.

నాగరాద్యచూర్ణమును చెప్పుచున్నాఁడు:—శొంఠి, అతివస, తుంగముస్తలు, ఆరెపువ్వులు, సరసాంజనము, కొడిసెపట్ట, కొడిసెపండు, మారేడుపిందెలు, అగరుశొంఠి, కటుకరోహిణి ఇవి యన్నియును సమానభాగములుగా గ్రహించి చూర్ణముచేసి తేనెను కలిసి బియ్యపుకడుగుతో చేర్చి త్రాగవలయును. పిత్తసంబంధమైన గ్రహణీరోషమునందు గల రక్తపుపోటులను, అతిమాత్రమును గుదస్థానములో పోటుగలుగుట మొదలగువాని నణచివేయును. దీనినే నాగరాద్యచూర్ణ మని చెప్పెదరు. ఇయ్యది కృష్ణాత్రేయమునిచే నంగీకరింపఁబడెను. శీతకషాయపు ప్రమాణముతో సమముగా కడుగును కల్పింపవలయును. పలువురు విజ్ఞు లగు వైద్యులు ఎనిమిదిరెట్లు నీటియందు బియ్యమును భావనచేయవలయు నని చెప్పెదరు. భావన యనఁగా ఏవైనరసములలో నోషధులఁ ఒక్కనుచేయుట.

## భూనింబాదిచూర్ణము; అగ్నిదీపనవిధి; పిప్పలీమూలాది; భల్లాతకక్షారము, మరీచ్యాదిచూర్ణము మొదలగునవి.

శ్లో. భూనింబ కటుకావ్యోష ముస్తకేంద్రయవాన్సమాన్. 18.

ద్వా చిత్రకా ద్వత్సక త్వగ్భాగాన్ షోడశ చూర్ణయేత్, గుడశీతాంబునా పీతం గ్రహణీదోషగుల్మనుత్. 19. కామలాజ్వరపాండుత్వమేహారుచ్యతిసారనుత్, గుడయోగా ద్గుడాంబు స్యా ద్గుడవర్ణరసాన్వితం. 20. గ్రహణ్యాం శ్లేష్మదుష్టాయాం మమితస్య యథావిధి, కట్వమ్లలవణక్షారైః తీక్ష్ణైశ్చాగ్నిం వివర్ధయేత్. 21. సమూలాం పిప్పలీం క్షారౌ ద్వౌ పంచలవణాని చ, మాతులుంగాభయా రాస్నా శఠీమరిచనాగరం. 22. కృత్వాసమాంశం తచ్చూర్ణం పిబే త్ప్రాతస్సుఖాంబునా, శ్లైష్మికే గ్రహణీదోషే బలవర్ణాగ్నివర్ధనమ్. 23. ఏతై రే వౌషధై స్సిద్ధం సర్పిః పేయం సమారుతే, భల్లాతకం త్రికటుకం త్రిఫలాలవణత్రయమ్. 24. అంతర్ధూమం ద్విపలికం గోపురీషాగ్నినా దహేత్, సక్షార స్సర్పిషా పేయో భోజ్యే వా వ్యవచారితః. 25. హృత్పాండుగ్రహణీదోష గుల్మోదావర్తశూలనుత్, సర్వజాయాం గ్రహణ్యాం తు సామాన్యో విధి రిష్యతే 26. చూర్ణం మరిచమహౌషధ కుటజత్వక్సంభవం క్రమా ద్ద్విగుణమ్, గుడమిశ్రమథితపీతం గ్రహణీదోషాపహం ఖ్యాతమ్. 27.

నేలవేము, కటుకరోహిణి, శొంఠి, మిరియములు, పిప్పళ్లు, తుంగముస్తలు, కొడిసెపాలవిత్తులు వీని నన్నిటిని సమానభాగములను; చిత్రమూలమును రెండుభాగములను; కొడిసెపట్ట పదియారుభాగములను కలిపి చూర్ణము చేసి బెల్లమునుచేర్చి చల్లనీటితో కూడా త్రాగవలయును. ఇయ్యది గ్రహణిదోషములను, గుల్మములను, కామెరలను, జ్వరములను, పాండురోగములను, మేహములను, అరుచిని, అతిసారమును మొదలంట నశింపజేయును. బెల్లమునుకలుపుటవలన బెల్లపురంగుగలిగిన బెల్లపునీళ్లు( బెల్లపుషర్బత్) అగును. మఱియును కఫాధిక్యముచే దుష్టమగు గ్రహణియందు వాంతులు చేయింపబడిన రోగికి తగునట్లుగా కటువు (చేదు) పులుపు, ఉప్పు, క్షారము (కారము) తీక్ష్ణము గల పదార్థములచేత జఠరాగ్నిని వృద్ధి పొందింపవలయును.

మోడి, పిప్పళ్లు, సర్జక్షారయవక్షారములు, పంచలవణములు, మాదీఫలము, కరకకాయలు, సన్నరాస్న, కచ్చూరము, మిరియములు, శొంఠి వీనినన్నిటిని సమానభాగములనుగా తీసికొని చూర్ణమును చేసి ప్రాతఃకాలమునందు నులివెచ్చని నీటితో కలిపి త్రాగవలయును. కఫసంబంధములయిన గ్రహణీదోషములయందియ్యది బలమును కాంతిని జఠరాగ్నిని వృద్ధినొందించును. ఈఔషధులనువేసి కాచి సిద్ధము చేయబడిన నేతిని

వాతసంబంధములగు గ్రహణులయందు పుచ్చుకొనవలెను. నల్లజీడివిత్తనములు, శొంఠి, మిరియములు, పిప్పళ్లు, కరకకాయలు, తాడికాయలు, ఉశిరికకాయలు, సౌవర్చలవణము, బిడాలవణము, సైంధవలవణము అను నీయెనిమిదింటిని రెండుపలముల ప్రమాణముగా తీసికొని ఈరీతిగా ఎండిన ఆవుపేడ ముద్దలను కాల్పవలయును. తరువాత యవక్షారము నిందులో కలిపికొని నేతితో రంగరించి పుచ్చుకొనవలయును. లేకపోయిన ఆహారముతో కూడతినవలయును. ఇయ్యది హృదయరోగము (గుండెలునొప్పి) పాండువు (తెల్లబారిపోవుట) గ్రహణీదోషము, గుల్మము, ఉదావర్తము, శూలము మున్నగువాని పోఁగొట్టగలదు.

ఇట్లు అన్నివిధములగు దోషములవలనఁ బుట్టెడి గ్రహణీదోషములకును సామాన్యవిధి చెప్పఁబడినది. మిరియములు ౧ కర్షముచొ॥ శొంఠి ౨ కర్షములుచొ॥ కొడిసెపట్ట ౪ కర్షములుచొ॥ వీటిని తీసికొని చూర్ణమును చేయవలయును. ఆచూర్ణమునందు బెల్లమును కలిపి మథితము (చిలికినమజ్జిగ) తోచేర్చి త్రాగినయెడల నన్నివిధములగు గ్రహణిదోషములును మొదలంట నాశనమును పొందఁగలవు.

## పాఠాదిచూర్ణము.

శ్లో. పాఠాబిల్వానలవ్యోషజంబూదాడిమధాతకీ, కటుకాతివిషాముస్తదార్వీభూనింబవత్సకైః. 28. సర్వైరేతైస్సమం చూర్ణం కౌటజం తండులాంబునా, సక్షౌద్రం చ పిబే చ్ఛర్దిజ్వరాతీసారశూలవాన్. 29. తృడ్దాహగ్రహణీదోషా౽ రోచకానలసాదజిత్,

అగరుశొంఠి, మారేడువేళ్లు, చిత్రమూలము, శొంఠి, మిరియములు, పిప్పళ్లు, నేరేడుపలుసులు, దాడిమవిత్తులు, ఆరెపూవులు, కటుకరోహిణి, అతివస, తుంగముస్తలు, మ్రానిపసపు, నేలవేము, కొడిసెవిత్తులు వీటినన్నిటిని సమానభాగములను తీసికొని వీటి అన్నిటితో సమానముగా కొడిసెపట్టుతీసికొని చూర్ణమునుచేసి తేనెను కలిపి బియ్యపు కడుగుతోకూడఁ ద్రాగవలయును. ఇయ్యది ఛర్ది, జ్వరము, అతిసారము, పోటు, దప్పి, గొంతెండిపోవుట, గ్రహణీదోషము, అపథ్యాను (అనఁగా నరోచకము) అగ్నిమాంద్యము వీనిని జయింపఁగలదు.

## కపిత్థాష్టకచూర్ణము.

శ్లో. యవానీ పిప్పలీమూల చతుర్జాతక నాగరైః. 30. మరిచాగ్ని జలా జాజీ ధాన్యసౌవర్చలై స్సమైః, వృక్షామ్లధాతకీ కృష్ణా బిల్వ దాడిమ తిందుకైః. 31. త్రిగుణై ష్షడ్గుణసితైః కపిత్థాష్టగుణైః

కృశః, చూర్ణోఽతిసారగ్రహణీక్షయగుల్మగళామయాన్. 32. కాసం శ్వాసారుచిం హిక్కాం కపిత్థాష్ట మిదం జయేత్.

కపిత్థాష్టకచూర్ణమును చెప్పుచున్నాడు:—ఓమము, మోడి, చతుర్జాతకములు (అనఁగా దాల్చినపట్ట), యాలకులు, జాపత్రి, నాగకేసరములు, శొంఠి, మిరియములు, చిత్రమూలము, కురువేరు, జీలకఱ్ఱ, ధనియములు, సౌవర్చలవణము వీనిని అన్నిటిని సమానభాగములనుగా తీసికొనవలయును. చింతపండు, ఆరెపువ్వు, పిప్పళ్లు, మారేడువేరు, దానిమ్మవిత్తులు, తుమికిచెక్క వీటిని మూఁడురెట్లెక్కువగా తీసికొనవలయును. చక్కెర ఆరురెట్లు వెలగ ఎనిమిదిరెట్లుగా తీసికొనవలయును. ఈరీతిగా తీసికొని వీని నన్నిటిని చూర్ణముచేసి పుచ్చుకొనినయెడల నతిసారము, గ్రహణిరోగము, క్షయ, గుల్మవ్యాధి, గళరోగము, దగ్గు, శ్వాసము, నోరుఅసహ్యముగానుండుట, వెక్కిళ్లు ఈ మొదలగువానిని నశింపఁజేయును. ఇదియే కపిత్థాష్టకచూర్ణము.

## దాడిమాష్టకచూర్ణము.

శ్లో. కర్షోన్మితా తు గోక్షీరీ చాతుర్జాతం ద్వికార్షికమ్. 33
యవానీధాన్యకాజాజీ గ్రంథివ్యోషం పలాంశుకమ్,
పలాని దాడిమాదష్టౌ సితాయా శ్చైకతః కృతః. 34
గుణైః కపిత్థాష్టకవ చ్చూర్ణోయం దాడిమాష్టకః.

తవాక్షీరి ఒకకర్షము, దాల్చినపట్ట, జాపత్రి, ఏలకులు, నాగకేసరములు మొదలగునవి అన్నియును రెండురెండు కర్షములు, ఓమము, ధనియములు, జీలకఱ్ఱ, మోడి, శొంఠి, మిరియములు, పిప్పళ్లు ఇవియన్నియును ఒక్కొక్కపలములును, దానిమ్మవిత్తులు, చక్కెర ఇరువదిఎనిమిదిపలములును కలిపి చూర్ణమును చేయవలయును. దీనిని దాడిమాష్టక మని చెప్పెదరు. ఇయ్యదియును కపిత్థాష్టకచూర్ణమువలెనే గుణముల నిచ్చును.

## వార్తాకుగుటికలు.

శ్లో. చతుఃపలం సుధాకాండా త్రిపలం లవణత్రయం. 35. వార్తాకుకుడవ శ్చార్క దష్టౌ ద్వే చిత్రకా త్పలే, దగ్ధ్వా వార్తాకురసే గుడికా భోజనోత్తరాః. 36. భుక్తం భుక్తం పచం త్యాశు కాసశ్వాసార్శసాం హితాః, విషూచికా ప్రతిశ్యాయ హృద్రోగఘ్నా శ్చ తా హితాః. 37.

ములుదంతి నాలుగుపలములు, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము అనులవణత్రయము వీటిని ఒక్కొక్కపలములును, తెల్లములక నాల్గుపలములు, జిల్లేడు వేఱు యెనిమిదిపలములు, చిత్రమూలము రెండుపలములును తెచ్చి వీటిని కాల్చి వార్తాకురసమునందు కలిపి మాత్రలను చేయవలయును. ఈమాత్రలను భోజనమైన తరువాత తినుచున్నయెడల శీఘ్రముగా నాహారమును జీర్ణింపచేయును. దగ్గు, శ్వాస, అర్శోరోగము మున్నగు రోగములను పోఁగొట్టి హితము కలుగచేయును. విషూచిక, పీనస, గుండెలనొప్పులనుగూడ పోఁగొట్టును.

## అష్టపలఘృతాదులు.

శ్లో. త్ర్యూషణత్రిఫలాకల్కే బిల్వమాత్రే గుడాత్పలే, సర్పిషోష్టపలం పక్త్వా మాత్రాం మందానలః పిబేత్. 38. మసూరస్య కషాయేణ బిల్వగర్భం పచేద్ఘృతం, హంతి కుక్ష్యామయాన్ సర్వాన్ గ్రహణీపాండుకామలాః. 39. కేవలం ప్రీహిప్రాణ్యంగకాన్వాథో వ్యష్టస్తు దోషలః.

అష్టపలఘృతముఁ జెప్పుచున్నాఁడు:—శొంఠి, మిరియములు, పిప్పళ్లు, కరక్కాయలు, తాడి, ఉసిరిక వీటిని ఒక్కపలము నేర్చి కల్కముచేసి దానియందుఒకపలము మారేడుపిందెలు ఎనిమిదిపలముల నేతిలో పచనముచేసి తగుమైనరీతిలో మాత్రలనుకట్టి పుచ్చుకొనిన అగ్నిమాంద్యము నశించును. ఇయ్యది అష్టపలఘృతమనఁబడును. ఇదిఅన్ని విధములగు కుక్షిరోగములను, గ్రహణులను, పాండురోగములను, కామెరలను నశింపఁజేయును.

## శుంఠీఘృతము.

శ్లో. విశ్వౌషధస్య గర్భేణ దశమూలజలే శృతం. 40
ఘృతం నిహన్యాచ్ఛ్వయథుం గ్రహణీసామతామయం,
ఘృతం నాగరకల్కేన సిద్ధం వాతానులోమనం. 41
గ్రహణీపాండురోగఘ్నం ప్లీహకాసజ్వరాపహం.

శుంఠీఘృతమును చెప్పుచున్నాఁడు:—శొంఠి కల్కము, దశమూలములకషాయమున పక్వముచేసి త్రాగినయెడల శోఫ, గ్రహణి, ఆమదోషము మొదలగువానిని శీఘ్రముగా పోఁగొట్టును. శొంఠికల్కమున సిద్ధముచేయఁబడిన నేయి వాతమును వంచుటయందు అనుకూలమును చేయును. మఱియును గ్రహణిని పాండురోగమును పోఁగొట్టును. ఉబ్బసము, దగ్గు, జ్వరము మున్నగువానినిగూడ పోఁగొట్టును.

### చిత్రకఘృతము.

శ్లో. చిత్రకక్వాథకల్కాభ్యాం గ్రహణీఘ్నం శృతం హవిః,
గుల్మశోథోదరప్లీహ శూలార్శోఘ్నం ప్రదీపనం. 42

చిత్రమూలకషాయము, కల్కము వీటితో చేయఁబడిన నేయి గ్రహణిని పోఁగొట్టును. మఱియును గుల్మమును, ఉదరరోగమును, ప్లీహను, శూలను, అతిసారమును పోఁగొట్టును.

### బిల్వాదిఘృతము.

శ్లో. బిల్వాగ్నిచవ్యార్ద్రికశృంగబేర క్వాథేన కల్కేన చ సిద్ధమాజ్యం, సచ్ఛాగదుగ్ధే గ్రహణీగదోత్థే శోథాగ్నిమాంద్యారుచినుద్వరిష్ఠం. 43.

మారేడుపిండెలు, చిత్రమూలము, చవ్యము, శొంఠి వీటిని కషాయముగాఁగాని కల్కముగాఁగాని చేసి మేకపాలతో సిద్ధము చేయఁబడిన నేతిలోఁ జేర్చి పుచ్చుకొనిన యెడల గ్రహణివలనఁ బుట్టిన శోఫ, మందాగ్ని, అరుచి మున్నగువానిని పోఁగొట్టును.

### చాంగేరీఘృతము.

శ్లో. నాగరం పిప్పలీమూలం చిత్రకో హస్తిపిప్పలీ, శ్వదంష్ట్రా పిప్పలీ ధాన్యం బిల్వం పాఠా యవానికా. 44. చాంగేరీ స్వరసే సర్పిః కల్కైరేతైర్విపాచితం, చతుర్గుణే చ దధ్నా చ తద్ఘృతం కఫవాతనుత్. 45. అర్శాంసి గ్రహణీదోషం మూత్రకృచ్ఛ్రం ప్రవాహికాం, గుదభ్రంశార్తిమానాహం ఘృత మేత ద్వ్యపోహతి. 46.

చాంగేరీఘృతమును చెప్పుచున్నాఁడు:—శొంఠి, మోడి, చిత్రమూలము, చెవ్యము, పల్లేరు, పిప్పళ్లు, ధనియములు, మారేడుపిండెలు, అగరుశొంఠి, ఓమము వీటియొక్క కల్కమును నాగకేసరముల స్వరసమున నాలుగురెట్ల పెరుగుతో కలిపి నేతిని వండవలయును. ఇట్టులు సిద్ధము చేయఁబడిన నేయి కఫమును వాతమును పోఁగొట్టును. మఱియును అతిసారము, గ్రహణి, మూత్రకృచ్ఛ్రము, ప్రవాహిక, గూదదిగుట, ఆనాహము మున్నగువానినిగూడ దూరముగాఁ బోఁగొట్టును.

### మరీచాదిఘృతము.

శ్లో. మరిచం పిప్పలీమూలం నాగరం పిప్పలీం తథా, భల్లాతకం యవానీ చ విడంగం హస్తిపిప్పలీ. 47. హింగుసౌవర్చలం చైవ విడసైంధవదార్వ్యథ, సాముద్రం సయవక్షారం చిత్రకో వచయా

సహ. 48. ఏతై ర్ధపలై ర్భాగై ర్ఘృతప్రస్థం విపాచయేత్, దశమూలీరసే సిద్ధం పయసా ద్విగుణేన చ. 49. మందాగ్నీనాం హితం సిద్ధం గ్రహణీదోషనాశనమ్, విష్టంభ మామం దౌర్బల్యం ప్లీహాన మపకర్షతి. 50. కాసం శ్వాసం క్షయం చైవ దుర్నామసభగందరం, కఫజాన్ హంతి రోగాం శ్చ వాతజాన్ క్రిమిసంభవాన్. 51. తాన్ సర్వా న్నాశయ త్యాశు శుష్కం దా ర్వానలో యథా.

మరీచాద్యఘృతమును చెప్పుచున్నాఁడు:—మిరియములు, మోడి, శొంఠి, పిప్పళ్లు, నల్లజీడివిత్తనములు, ఓమము, వాయువిడంగములు, ఏనుగుపిప్పళ్లు, ఇంగువ, సౌవర్చలవణము, బిడాలవణము, సైంధవలవణము, యవక్షారము, సాముద్రలవణము; చిత్రమూలము, వస వీటినన్నిటిని అర్ధపలము లంతంత తీసికొని ప్రస్థమాత్రము నేతిలోవండవలయును. తరువాతదశమూలములరసమునందును, రెండురెట్లు మేకపాలలోను సిద్ధమును చేయవలయును.

ఈరీతిగా సిద్ధముచేయఁబడిన నేయి అగ్నిమాంద్యము గలవారికి హితమును కలిగించును. అన్నివిధము లగు గ్రహణిదోషములను పోఁగొట్టును. విష్టంభరోగము, ఆమదోషము, ప్లీహమున్నగువానిని దూరముగా తొలఁగించును. దగ్గు, శ్వాసము, క్షయరోగము, అతిసారము, భగందరరోగమును, కఫరోగములను, వాతరోగములను, కృమిరోగమును మున్నగు వీని నన్నిఁటిని శీఘ్రముగా ఎండుకట్టెలను అగ్ని రూపుమాపునట్లు నశింపఁ జేయును.

## మహాషట్పలఘృతము.

శ్లో. సౌవర్చలం పంచకోలం సైంధవం హపుషాం వచామ్. 52. అజమోదాం యవక్షారం హింగుజీరక మౌద్భిదమ్, కృష్ణాజాజీసభూతీకం కల్కీకృత్యపలార్ధకం. 53. ఆర్ద్రికస్య రసం చుక్రం క్షీరం మస్త్వమ్లకాంజికం, దశమూలకషాయేణ ఘృతప్రస్థం విపాచయేత్. 54. భక్తేన సహ దాతవ్యం నిర్భక్తం వా విచక్షణైః, క్రిమిప్లీహోదరాజీర్ణజ్వరకుష్ఠ ప్రవాహికామ్ 55. వాతరోగాన్ కఫవ్యాధీన్ హన్యాచ్ఛూల మరోచకం, పాండురోగం క్షయం కాసం దౌర్బల్య గ్రహణీగదం. 56. మహాషట్పలకం నామ ఘృత మింద్రాశని ర్యథా.

మహాషట్పలకఘృతమును చెప్పుచున్నాఁడు:—సౌవర్చలవణము, పంచకోలములు, సైంధవలవణము, బోడతరము, బిడాలవణము, ఓమము, యవక్షారము, ఇంగువ, జీలకఱ్ఱ, ఔద్భిదలవణము, నల్లజీలకఱ్ఱ, వాము వీటి నన్నిటిని ఒక్కొక్క అర్ధపలమును తీసికొని

కల్కమును చేసి అల్లపురసము, చుక్రము మేకపాలు పెరుగుపైతేరినీళ్లు, ఫలికడుగు దశమూలములకషాయము ఈఅన్నిటిలోను ప్రత్యేకముగ ప్రస్థము నేయిని పక్వము చేయవలయును.

తరువాత ఈఘృతమును అన్నముతో కలిపిగాని, లేక ఉత్తదిగాని రోగికి ఈయవలయును. కృమిరోగములను, పీనసలను, ఉదరరోగములను, అజీర్ణమును, జ్వరమును, కుష్ఠును పరివాహికను వాతరోగమును కఫరోగమును శూలను అరోచకములను పాండురోగములను, క్షయ, దగ్గు, దౌర్బల్యము, గ్రహణి మున్నగువానిని ఈమహాషట్పలకఘృతము దేవేంద్రునివజ్రము వృక్షములం బడఁగొట్టునట్లు గూల్చివేయును.

### లఘుచుక్రము.

శ్లో. యన్మస్త్వాది శుచౌ భాండే సగుడక్షౌద్ర కాంజికాం. 57
ధాన్యరాశౌ త్రిరాత్రస్థం శుక్తం చుక్రం త దుచ్యతే,
లవణం గుడ మధ్వారనాలమస్తు క్రమా దిహ. 58

పరిశుద్ధమైన కుండలో బెల్లము, దానికి రెట్టింపు తేనె, దానికి రెట్టింపు కాంజికము, దానికి రెట్టింపు పెరుగుపైతేట చేర్చి మూడు రోజులు ధాన్యరాశియందుంచిన యెడల నది (అనఁగా చుక్రము) శుక్తమని చెప్పఁబడును. కొందరు చుక్రమని గూడ నందురు. బెల్లము, తేనె, గంజి పెరుగుపైనితేట వీటిని క్రమముగా రెండురెట్ల చొప్పున నిందు తీసికొనవలయును.

### బృహచ్చుక్రలక్షణము.

శ్లో. ప్రస్థం తండులతోయతః తుషజలా త్ప్రస్థత్రయం చామ్లతః, ప్రస్థార్థం దధితో ఽమ్లమూలకపలా న్యష్టౌ గుడా న్మానికే. 59. మాన్యౌ శోధితశృంగబేరసకలా ద్వే సింధుజాజ్యోః పలే, ద్వే కృష్ణోషణయో ర్నిశాపలయుగం నిక్షిప్య భాండే దృఢే. 60. స్నిగ్ధే ధాన్యయవాదిరాశినిహితం త్రీ న్వాసరా న్స్థాపయేత్, గ్రీష్మే తోయధరాత్యయే చ చతురో వర్షాసు పుష్పాగమే. 61. షట్ శీతేష్టదినా న్యతః పర మిదం విస్రావ్య సంచూర్ణయేత్, చాతుర్జాతపలేన సంహిత మిదం శుక్తం చ చుక్రం చ తత్. 62. హన్యా ద్వాతకఫామదోషజనితా న్నానావిధా నామయాన్, దుర్నామానిలగుల్మశూలజఠరా న్హత్వానలం దీపయేత్. 63.

బృహచ్ఛుక్రసంధానమును చెప్పుచున్నాడు:—బియ్యపుకడుగు ఒకప్రస్థము, పొట్టుగల యవలనీరు మూఁడుప్రస్థములు, పెరుగుఅర్ధప్రస్థము, కాంజికములోనూరిన కుసువేరుముక్కలు యెనిమిది పలములు, శుద్ధిచేసిన (శొంఠి) అల్లము 2 ప్రస్థములు, సైంధవలవణము జీలకఱ్ఱ, రెండేసిపలములు, పిప్పళ్లు మిరియములు రెండేసిపలములు, పసుపు 2 పలములు వీటినన్నిటిని గట్టి కుండలో వేయవలయును.

పాత్రము స్నిగ్ధముగా నున్నయెడల ధాన్యము, యవలు మున్నగువాని రాశియందు మూడుదినము లుంచవలయును. దీనిని జ్యేష్ఠము ఆసాఢము, ఆశ్వయుజము, కార్తీకము ఈమాసములలో పెట్టవలయును. శ్రావణభాద్రపదములలో నాలుగురోజులును, చైత్ర వైశాఖమాసములలో నారుదినములపర్యంతమును, మార్గశిర పౌషమాఘఫాల్గుణమాసములలో నెనిమిదిదినములవఱకును పెట్టవలయును.

తరువాత బయటకు తీసి చూర్ణముచేసి, దాలచినచెక్క జాపత్రి, ఏలకులు, నాగకేసరములు వీటిచూర్ణమును అందులో కలపవలయును. ఇది శుక్తమని గాని, చుక్రి మనిగాని యనఁబడును. ఇయ్యది వాతరోగము, కఫరోగము ఆమదోషము వీటివలన పుట్టిన అనేకవిధము లగు రోగములను, అతిసారమును, గుల్మమును, శూలమును, ఉదర రోగమును పోఁగొట్టును. మఱియును జఠరాగ్నిని ఉద్దీపింపఁజేయును.

## తక్రారిష్టము,

శ్లో. యవాన్యామలకం పథ్యా మరిచం త్రిపలాంశికమ్,
లవణాని పలాంశాని పంచ చైకత్ర చూర్ణయేత్. 64
తత్ర కంసాయుతం జాతం తక్రారిష్టం పిబేన్నరః,
దీపనం శోథగుల్మార్శః క్రిమిమేహోదరాపహమ్. 65

తక్రారిష్టము:—ఓమము, ఉసిరిక, కరకకాయ, మిరియములు, వీని నన్నిటిని మూడేసిపలములును; పంచలవణములు ఒక్కొక్కపలమును తీసికొని అన్నిఁటిని చేర్చి చూర్ణమును చేయవలయును. ఈచూర్ణమును, మజ్జిగలో కలిపి త్రాగవలయును. ఇయ్యది దీపనమును కలిగించును. శోథ, గుల్మరోగము, అతిసారము, కృమిదోషము, మేహము ఉదరరోగము మున్నగువానిని నశింపఁజేయును. దీనికే తక్రారిష్టమని పేరు.

శ్లో. వాట్యస్య దద్యా దవశుక్తకానాం పృథక్పృథక్త్వాఢకసంమితం చ, మధ్యప్రమాణాని చ మూలకాని దద్యాచ్చతుష్షష్టి సుకల్పితాని 66. ద్రోణేంభసః ప్లావ్య ఘటే సుధౌతే దద్యా దిదం భేషజజాతయుక్తమ్, క్షారద్వయం తుంబురుబస్తగంధాధానీయకం స్యా ద్విడసైం

ధవం చ. 67. సౌవర్చలం హింగుసిరాటికాం చ చవ్యం చదద్యాద్ద్వి పలప్రమాణమ్, ఇమాని చాన్యాని పలోన్మితాని విజర్జరీకృత్య ఘటే క్షిపేచ్చ. 68. కృష్ణామజాజీ ముపకుంచికాం చ తథాసురీం కారవిచిత్రికం చ, పక్షస్థితోఽయం బలవర్ణదేహావయస్కరోఽతీవ బలప్రదంచ. 69. కాం జీవయామీతి యతః ప్రవృత్త స్తత్కాంజికేతి ప్రవదంతి సంతః, అయామకాలాజ్జరయేచ్చ భక్త మాయామకేతి ప్రవదంతి చైనం. 70. దకోదరం గుల్మమథప్లీహానం హృద్రోగ మానాహమరోచకం చ, మందాగ్నినా కోష్ఠగతం చ శూల మర్శోవికారా న్సభగందరాంశ్చ. 71. వాతామయా నాశు నిహంతి సర్వాన్ సంసేవ్యమానం వివిధం నరాణాం.

ఆయామకాంజికము:— పెట్టుచెరిగి దంచిచేసిన యవలసత్తును వేరువేరుగా నొక యాఢకమును తీసికొనవలయును. మఱియును మధ్యప్రమాణముగల కురువేరుముక్కలు 64ను ఒకద్రోణమాత్రము నీటితో చక్కగా కడిగి కుండలో వేసి పిష్టట యవక్షారము, సర్జక్షారము, తుంబురులు, పస్త్రగ్రంథ ధనియములు, బిడాలలవణము, సైంధవలవణము సౌవర్చలవణము, ఇంగువ, ఇంగువపత్రి చవ్యము వీనిని రెండేసిపలములుగా తీసికొనవలయును. మఱియును చెప్పబోవు నితరౌషధులను ఒక్కొక్కపలమును తీసికొనవలయును. తరువాత నన్నింటిని నూరి కుండలో పడియకట్టవలయును.

తరువాత పిప్పళ్లు, జీలకఱ్ఱ, పెద్దజీలకఱ్ఱ, చిన్నజీలకఱ్ఱలు, రెండు రకములగు ఆవాలు, ఓమము, చిత్రమూలము వీనినన్నింటిని వైచి కుండకు వాసెనగట్టి పదియేనుదినములవఱకు నుండనీయవలయును. ఇయ్యది బలమును, కాంతిని, వయస్సును వృద్ధి పొందించును. ఈయౌషధము "తాను ఎవ్వరిని జీవింపచేయుదును" అని [కాం=దేనిని, లేక ఎవరిని, జీవయామి=బ్రతికింపవలెను అని] ప్రవర్తించును. గనుక దీనిని కాంజిక పెద్దలు చెప్పెదరు.

ఇయ్యది ఒకజాములోపల అనగా యామములోపల భోజనమును జీర్ణింపజేయును. ఈకారణమువలననే దీనిని ఆయామక మని చెప్పెదరు. జలోదరము, కడుపులోని బల్ల, ప్లీహరోగము, హృదయరోగము, ఆనాహము, అరోచకము, అగ్నిమాంద్యము, శూలము, అతిసారము, భగందరము మొదలగు నన్నివిధములగు వాతరోగములును ఈ యామకాంజికమును సేవించినయెడల శీఘ్రముగా నశించిపోవును.

## కల్యాణగుడము.

శ్లో. ప్రస్థత్రయేణామలకీరసస్య శుద్ధస్య దత్వార్ధతులాం గుడస్య. 72. చూర్ణీకృతై ర్గ్రంధికజీరచవ్య వ్యోషేభకృష్ణాహపుషాజమోదైః, విడంగసింధు త్రిఫలాయమానీ పాఠాగ్నిధాన్యై శ్చ పలప్రమాణైః. 73. దత్వా త్రివృచ్చూర్ణపలాని చాష్టౌ వష్టౌ చ తైలస్య పచే ద్యథావత్, తం భక్షయే దక్షపల ప్రమాణం యథేష్టచేష్టం త్రిసుగంధియుక్తం. 74. అనేన సర్వే గ్రహణీవికారాః సశ్వాసకాసస్వరభేదశోథాః, శామ్యంతి చాయం చిరమంథరా గ్నే ర్హతస్య పుంస్త్వస్య చ వృద్ధిహేతుః. 75. స్త్రీణాం చ వంధ్యామయనాశనోఽయం కల్యాణకో నామ గుడః ప్రదిష్టః, తైలే మనా గ్భర్జయంతి త్రివృ దత్ర చికిత్సకాః. 76. అత్రోక్తమానసాధర్మ్యాత్ త్రిసుగంధం పలం పృథక్,

కల్యాణగుడమును చెప్పుచున్నాడు:—ఏఁబదిపలముల మంచిబెల్లమును, ఉసిరికాయలరసము ప్రస్థముతో శుద్ధిచేసి ముద్దచేసి 8 పలముల తెల్లతెగడ చూర్ణము తైలములో కాచి దానియందా ముద్దను పక్వముచేయుచు, జీలకఱ్ఱ మోడి, శొంఠి, మిరియములు పిప్పళ్లు చవ్యము ఏనుగుపిప్పళ్లు, ఓమము, వాయువిడంగములు, సైంధవలవణము, కరకకాయ, తాడి, ఉసిరిక, అగరుశొంఠి, చిత్రమూలము, ధనియములు, ఇవియన్నియును ఒక్కొక్కపలము చొప్పున తీసికొనవలయును. మఱియును వీటిని అన్నిటిని చూర్ణముచేసి పైపాకములో కలిపి యథావిధిగా వండవలయును.

తరువాత దించి దాల్చినపట్ట, ఏలకులు, జాపత్రి, వీటిని చూర్ణముచేసి కలిపి బలానుసారముగా నీయౌషధమును తినవలయును. దీనివలన నన్నివిధములగు గ్రహణి వికారములును, శ్వాసము, కాసము, స్వరభేదము శోఫము అనునవి నశించిపోవును. మఱియును చాలకాలమునుండి యుండెడి అగ్నిమాంద్యము వలన నష్టమై పోయిన పుంస్త్వముగలవాని పుంస్త్వమును వృద్ధిపొందించుటకు కారణముకూడ నగుచున్నది. స్త్రీలకు గూడను గొడ్డుపోతుతన మనురోగమును పోగొట్టగలుగును. ఇట్లని కల్యాణకమను గుడము చెప్పఁబడినది.

తైలమునందు తెల్లతెగడచూర్ణమును వైద్యులు పలుమారు పక్వముచేయుచున్నారు. మఱియును దీనిలో పూర్వము, అనఁగా పైఁచెప్పఁబడినట్లు-బలానుసారముగా దాల్చినపట్ట, ఏలకులు, జాపత్రి అను నీమూఁడిఁటిని ఒక్కొక్కపలము చొప్పున తీసికొనవలయును.

## కూష్మాండగుడ కల్యాణకము.

శ్లో. కూష్మాండకానాం గూఢానాం సుస్విన్నం నిష్కులత్వచామ్.
77 సర్పిః ప్రస్థే పలశతమ్ తామ్రభాండే శనైః పచేత్, పిప్పలీ పిప్పలీ
మూలం చిత్రకో హస్తిపిప్పలీ, 78 ధాన్యకాని విడంగాని యవానీ మ
రిచాని చ, త్రిఫలా చాజమోదాచ కలింగాజాజిసైంధవమ్. 79. ఏకైక
స్య పలం చైవ త్రివృ దష్టపలం భవేత్, తైలస్య చ పలా న్యష్టౌ గు
డః పంచాశ దేవ తు. 80. ప్రస్థై స్త్రిభి స్సమేతం తు రసేనామలకస్య తు,
యదా దర్వీప్రలేపస్తు తదైన మవతారయేత్. 81. యథాశక్తి గుడాన్
కుర్యా త్కర్షకర్షార్ధమానకాన్, అనేన విధినా చైవ ప్రయుక్తస్తు జయే
దిమాన్. 82. ప్రసహ్య గ్రహణీరోగాన్ కుష్ఠా న్యర్శోభగందరాన్,
జ్వర మానాహ హృద్రోగ గుల్మోదరవిషూచికాః, 83 కామలాపాండు
రోగాం శ్చ ప్రమేహాం శ్చైవ వింశతిం, వాతశోణితవీసర్పాన్ దద్రుచ
ర్మహలీమకాన్. 84 కఫపిత్తానిలాన్ సర్వాన్ ప్రరూఢాం శ్చ వ్యపో
హతి, వ్యాధిక్షీణా వయఃక్షీణాః స్త్రీషు క్షీణా శ్చ యే నరాః. 85.
తేషాం వృష్యం చ బల్యం చ వయఃస్థాపన మేవ చ, గుడకల్యాణకం
నామ వంధ్యానాం గర్భదం పరం. 86. యామ్లపిత్తే విధాతవ్యా గుడికా
చ క్షుధావతీ,

మంచిపక్వమయిన గుమ్మడికాయలను నున్నగా చెక్కుతీసి నూరుపలముల ము
క్కలను చేసి నేతిలో పదహారుపలములలో రాగిపాత్రలో మెల్లగా పచనము చేయ
వలయును. పిప్పళ్లు, మోడి, చిత్రమూలము, ఏనుగుపిప్పళ్లు, ధనియములు, వాయువిడంగ
ములు ఓమము, మిరియములు, కరకకాయ, తాడి, ఉసిరిక, కొడిసెపాలవిత్తులు, జీల
కఱ్ఱ, సైంధవలవణము వీటివన్నిఁటిని ఒకొక్కపలము చొ॥ తెల్లతెగడ ఎనిమిదిపల
ములు తైలము 8 పలములు, బెల్లము 50 పలములు, ఉసిరికరసముమూడుప్రస్థములుతో
కలిపి వండవలయును. గరిటెకు చుట్టుకొనునట్లు పాకము రాగానే క్రిందికి దింపవల
యును. తరువాత తమతమ శక్తి ననుసరించి అర్ధకర్ష మంతంతగా మాత్రలను చేయవ
లయును. ఈరీతిగా నుపయోగించిన యెడల నీవిధములైన రోగముల నన్నిఁటిని పోఁ
గొట్టును.

మఱియును గ్రహణిరోగము, కుష్ఠు, అతిసారము, భగంధరము, జ్వరము, హృద్రోగము, గుల్మము, ఉదరరోగము, మశూచికము, కామెరలు, పాండురోగములు, వింశతివిధములగు ప్రమేహములును, వాతరోగము, చలిదివ్యాధి, దద్రుచర్మరోగము, హలీమకము, కఫము, పిత్తము, వాతము మున్నగువానివలనఁ గలిగెడిరోగములును దీనివలన నశించిపోవును.

రోగముచేత చిక్కిపోయినవారుగాని, వయస్సువలనకృశించినవారుగాని, స్త్రీవిషయాదులవలన ఎండిపోవువారు గాని, ఈగుడమును సేవింపవలయును. అట్టివారి కియ్యది వీర్యమును వృద్ధిని పొందించును. బలము నిచ్చును. పూర్వపు వయోవస్థను కూడ మఱల నిచ్చును. గొడ్రాండ్రు సేవించినయెడల గర్భము నిల్చును. అమ్లపిత్తాధికారములో చెప్పఁబడిన క్షుధావతీమాత్రలనుకూడ నిందులో ఉపయోగింపవలయును.

## రసపర్పటిక.

శ్లో. తత్ర ప్రోక్తవిధా శుద్ధౌ సమానౌ రసగంధకౌ. 87. సమ్మర్ద్య కజ్జలాభంతు కుర్యాత్పాత్రే దృఢాత్రయే, తతో బాదరవహ్నిస్థలోహపాత్రే ద్రవీకృతమ్. 88. గోమయోపరి విన్యస్తకదలీపత్రపాతనాత్, కుర్యాత్పర్పటికాకార మస్య రక్తిద్వయం క్రమాత్. 89. ద్వాదశరక్తికా యావ త్ప్రయోగః ప్రహరార్ధతః, తదూర్ధ్వం బహుపూగస్య భక్షణం దివసే పునః. 90. తృతీయపవ మాంసాజ్యదుగ్ధాన్యత్ర విధీయతే, వర్జ్యం విదాహిస్త్రీరంభామూలం తైలం చ సార్షపమ్. 91. క్షుద్రమత్స్యాంబుజఖగాన్ త్యక్త్వోన్నిద్రః పయః పిబేత్, గ్రహణీక్షయకుష్ఠార్శ శ్శోథపాజీర్ణవినాశినీ. 92. రసపర్పటికా ఖ్యాతా నిబద్ధా చక్రపాణినా,

పైనిచెప్పఁబడినరీతిగా శాస్త్రప్రకారము శుద్ధిచేయఁబడిన పాదరసము, గంధకమును సమానముగా తీసికొని గట్టికుండలో వైచి కాటుకవలె మెత్తగా నూరవలయును. అటుతరువాత రేగుకొయ్య నిప్పులయందు లోహమయమగుపాత్రములో ద్రవరూపముగా చేసినతరువాత పేడపైని పెట్టియుంచిన యరఁటియాకులో పడవేయవలయును. ఇట్లుచేసి దీనిని పర్పటికాకారముగా చేయవలయును. దీనిని రెండురెండు రతు లంతగా మాత్రలు చేయవలయును. పండ్రెండురతులవఱకు సగముసగము ప్రహరమునకు అనగా జామునకు రెండుపర్యాయములు చొప్పున నీయవలయును.

ఇది యైన తఱువాత రెండవదినము చాల పోకచెక్కలరసముతో దీనిని తినవలయును. మూడవజాము మాంసమును, నేయి, పెరుగు మొదలగువానితో పెట్టవలయును. విదా

హాముపుట్టించువస్తువులు అరఁటిపండ్లు, లేకదుంపలు, ఆవనూనె, చిరిచేపలు, జలము లోపుట్టుచుండుపీతలు, కమలములు, పక్షులు మొదలగువానిని భక్షింపరాదు. నిదురపోవ రాదు. పాలనుమాత్రమే త్రాగి యుండవలయును. ఇది రసపర్పటక మని చెప్పఁబడినది.

ఇయ్యది గ్రహణి, క్షయరోగము, కుష్ఠము, అతిసారము, శోషము, అజీర్ణము వీని నన్నిఁటిని పోఁగొట్టు నని చక్రపాణివైద్యుడు స్వానుభవ ప్రక్రియఁగా చెప్పుచు న్నాడు.

## తామ్రయోగము.

శ్లో. స్థాల్యాం సమర్ద్య దాతవ్యౌ మాషికౌ రసగంధకౌ. 92. నఖక్షుణ్ణం తదుపరి తండులీయం ద్విమాషికం, తతో నైపాలతామ్రాది పిధాయ సుకరాలితం. 93. పాంశునా పూరయేదూర్ధ్వం సర్వాం స్థాలీం తతోఽనలః, స్థాల్యాధో నాలికాం యావద్దేయస్తేన మృతిస్య చ. 94. తామ్రా తామ్రస్య రక్త్యేకా త్రిఫలా చూర్ణరక్తికా, త్ర్యూషణస్య చ రక్త్యేకా విడంగస్య చ తన్మధు. 95. ఘృతే నాలోడ్య లేఢవ్యం ప్రథమే దివసే తతః, రక్తివృద్ధిః ప్రతిదినం కార్యా తామ్రాదిషు త్రిషు, 96. సితావిడంగరక్తిస్తు యదా భేదో వివక్షితః. తదా విడంగం త్వధికం దద్యాద్రక్తిద్వయం పునః. 97. ద్వాదశాహం యోగవృద్ధిస్తతో హ్రాసక్రమోఽస్త్వయం, గ్రహణీ సామ్లపిత్తం చ క్షయం శూలం చ సర్వదా. 98. తామ్రయోగో జయత్యేష బలవర్ణాగ్నివర్ధనః.

తామ్రయోగమును చెప్పుచున్నాఁడు:—స్థాలియందు (అనఁగా కల్వమునందు శుద్ధిచేయఁబడిన) మర్దనచేయఁబడిన యొక్కొక్కమాషమును పాదరసము గంధకమును వేసి, గోర్లతో చిట్లగొట్టి వేయఁబడిన బియ్యపుగింజలు రెండుమాషములును, పిమ్మట నేపాళపు తామ్రము మొదలగువానిని చేర్చి మాత్రలను చేసి పాత్రలో నుంచి ఇసుకతో నింపించి వేయవలయును. తరువాత స్థాలిమీద నెక్కించి నిప్పుంటించి మంటబెట్టుచుండ వలయును.

తరువాత నౌషధి యొకరక్తికయును, త్రిఫలములచూర్ణ మొకరక్తికయును శొంఠి మిరియములు పిప్పళ్లు నొకరతియును, వాయువిడంగము లొకరతియును, తేనె యొకరతియును వీని నన్నిటిని కలిపి నేతితో ఆలోడనమును చేసి మొదటిరోజున సేవింపవలయును. చన్నీళ్లు త్రాగవలయును. తరువాత ప్రతియొక్కొక్కరోజునను తామ్ర మూషములగు నౌషధులు మున్నగువానిలో నొక్కొక్కరతిచొప్పున హెచ్చించు

చుండవలయును. వాయువిడంగములుమాత్రము ఒక్కరతినిమాత్రమే యుంచవలయును.

విరేచనబంధాదులవలన ఎప్పుడైనను మార్చవలయు నని కోరిక గలిగినయెడల వాయువిడంగము నెక్కువగా చేర్పవలయును. అనగా రెండురతుల నీయవలయును. పండ్రెండుదినములవఱకు నీయోగమును వృద్ధిచేయవలయును. అనఁగా నౌషధమును హెచ్చు చేయవలయు ననుట. ఈతామ్రయోగము గ్రహణి, అమ్లపిత్తము, క్షయ, శూలము వీటిని అన్నివేళలలోను జయించును. మఱియును బలము వర్ణము జఠరాగ్ని వీటిని వృద్ధిని పొందించును.

ఇట్లని చక్రదత్తయందు గ్రహణీచికిత్సాధికారము సంపూర్ణము.



# ౫. అర్శోరోగాధికారము.



## మూలరోగమునకు చేయఁదగిన నాల్గుపాయములు.

శ్లో. దుర్నామ్నాం సాధనోపాయ శ్చతుర్ధా పరికీర్తితః, భేషజక్షారశస్త్రాగ్నిసాధ్యత్వాదాద్యఉచ్యతే. 1. యద్వాయో రానులోమ్యాయ యదగ్నిబలవృద్ధయే, అనుపానౌషధద్రవ్యం తత్సేవ్యం నిత్యమర్శసాం. 2. శుష్కార్శసాం ప్రలేపాదిక్రియా తీక్ష్ణా విధీయతే, స్రావిణాం రక్తమాలోక్య క్రియా కార్యాస్రపైత్తికీ. 3. స్నుక్‌క్షీరం రజనీయుక్తం లేపా ద్దుర్నామనాశనం, కోశాతకిరజోఘర్షాత్ నిపతంతి గుదోద్భవాః. 4. అర్కక్షీరం సుధాక్షీరం తిక్తతుంబ్యాశ్చ పల్లవాః, కరంజో బస్తమూత్రేణ లేపనం శ్రేష్ఠ మర్శసాం. 5. అర్శోఘ్నీ గుదగావర్తి ర్గుడఘోషా ఫలోద్భవా, జ్యోతిష్మికా మూలకల్కేన లేపో రక్తార్శసాం హితః. 6. తుంబీబీజం సుద్భినం తు కాంజీపిష్టం గుటీత్రయం, అర్శోహరం గుదస్థం స్యా ద్దధి మాహిష మశ్నతః. 7. అపామార్గాంఘ్రిజః క్షారః హరితాలేన సంయుతః, లేపనం లింగసంభూతమర్శో నాశయతి ధ్రువం. 8. మహారోధిప్రదేశస్య ఘర్షాత్కోశాతకీరజః, కఫేన లేపతో హంతి లింగవర్తి మసంశయం. ౯. వాతాలీసారవద్భిన్నవర్చాంస్యర్శాం స్యుపాచరేత్, ఉదావర్తవిధానేన గాఢవిట్కాని చాసకృత్.

మూలరోగములను సాధించుటకు నాల్గుపాయములు.—ఔషధము లని, క్షారము లని, శస్త్రక్రియ లని, అగ్నిక్రియ లని చెప్పఁబడినవి. వీనిలో సాధ్యమైనది కావున మొదటిదగు నౌషధచికిత్సను చెప్పెదను. వాయువు ననులోమమునుగా చేయునదియును, జఠరాగ్నిని పెంచునదియు నగు నౌషధము ననుపానముతో చేర్చి మూలరోగులు నిత్యమును సేవింపవలయును. ఎండినమూలరోగముల పైని తీక్ష్ణములగు చికిత్సలను చేయవలయును. రక్తము స్రవించు మూలరోగములయందు రక్తమును పరీక్షించి రక్తపిత్తములను తగ్గించు చికిత్సను చేయవలయును. జెముడుపాలలో పసపును కలిపి లేపము చేసినచో మూలరోగము తొలఁగి చనును. చేదుబీర సమూలముగా నెండించి చూర్ణించి రాచిన మూలరోగములు నశించును. జిల్లేడుపాలు, జెముడుపాలు, చేదుపొళ్ల, సారఆకు

లను, కరంజము అనగా నెమలియడ్డుచెట్టు, మేకయుచ్చ వీటిని కలిపి లేపముచేసిన మూలరోగములకు శ్రేష్ఠము. కంద, కొడిసెపాలవిత్తనములు పొడిచేసి వత్తిచేసి గుదస్థానమున నుంచినను, చేదుపొట్ల, ముల్లంగి కల్కముచేసి లేపనుచేసినను రక్తపుటర్శోరోగములకు హితకరము. చేదుసొరవిత్తులు రేహమనునుప్పును వేసి గంజితోమాత్రలను చేసి మూడుమాత్రలను చేసి గుదస్థానముల నుంచినచో మూలరోగములు దూర మగును. గేదెపెరుగును త్రాగినను మంచిదియే. ఉత్తరేణిచూర్ణములో హరిదళమును కలిపి లేపనముచేసిన లింగమునందుఁ బుట్టిన మూలరోగములఁ బోఁగొట్టును. కొండకరక్కాయ, నేలగుమ్మడు వీటి చూర్ణమును లేపముచేసిన లింగస్థానమూలరోగములఁ బోగొట్టును; వాతపుటతిసారరోగములవలెనే వివిధములగు మూలరోగములను గూడ నుపచరింపవలయును. ఉదావర్తప్రరీతిచొప్పున నే మాటిమాటికి చికిత్స చేయవలయును.

### మలబద్ధపు మూలరోగములకు చికిత్స.

శ్లో. విడ్విబద్ధే హితం తక్రం యమానీబిడసంయుతం, వాతశ్లేష్మార్శసాం తద్వత్పరం నాస్తీహ భేషజం. 11. శకృత్ప్రియోజ్యం యథా దోషం సస్నేహం రూక్షమేవవా, నవిరోహంతి గుదజాః పున స్తక్రస మాహితాః. 12. త్వచం చిత్రకమూలస్య పిష్ట్వా కుంభం ప్రలేపయేత్, తక్రం వా దధి వా తత్ర జాత మర్శోహరం పిబేత్. 13. పిత్తశ్లేష్మ ప్రశమనీ కచ్ఛూకండూరుజాపహా, గుదజా న్నాశయ త్యాశు యోజితా సగుడాభయా. 14. సగుడాం పిప్పలీయుక్తాం అభయాం ఘృతభర్జితాం, త్రివృద్దంతీయుతాం వాపి భక్షయే దానులోమికీం. 15. తిలారుష్కరసంయోగం భక్షయే దగ్నివర్ధనం, కుష్ఠరోగహరం శ్రేష్ఠ మర్శసాం నాశనం పరం. 16.

మలబద్ధకము కలిగిన మూలరోగములయందు వామును పేటుప్పుతో చేర్చిన మజ్జిగను భక్షింపవలెను. వాతకఫమువలన మూలరోగము గలవారలకు ఇంతకంటెను మంచియౌషధ మింకనొక్కటియు లేదు. కాబట్టి దోషము ననుసరించి నెయ్యియుతముగా గాని, రూక్షముగా గాని తక్రము నుపయోగింపవలయును ఈతక్రముచేత నశించినమూలరోగము మరల కనుపట్టదు. చిత్రమూలపు బెరడును నూరి కుండలోపలను రాచి దానియందు మజ్జిగను పోసి త్రాగుచున్న మూలరోగములు హరించును. బెల్లముతో చేర్చి కరక్కాయను భక్షించిన పిత్తశ్లేష్మములను పోగొట్టును. తీటలను, దురదల నడంచును. గుదరోగముల నన్నిటిని పోగొట్టును. పిప్పళ్లు, బెల్లమును నేతితో వేయించిన కరక్కాయలో చేర్చికొని భక్షించినను, కరకకాయలో తెల్లతెగడ దంతిచెట్టు బెరడులో బెల్ల

మును కలుపుకొని తినినయెడల గుదస్థానపు వాయువు ననులోమముగా చేయును. నల్లనూవులు, నల్లజీడివిత్తులు కలిపి తినినయెడల జఠరాగ్ని వృద్ధినొందును. కుష్ఠరోగము, మూలరోగమును నాశనము నొందును.

## తిలాదియోగములు.

శ్లో. తిలభల్లాతకం పథ్యా గుడ శ్చేతి సమాంశికం, దుర్నామ కాసశ్వాసఘ్నం ప్లీహపాండుజ్వరాపహం. 17. గోమూత్రవ్యుషితాం దద్యాత్సగుడాం వా హరీతకీం, పంచకోలకయుక్తం వా తక్ర మస్మై ప్రదాపయేత్. 18. మృల్లిప్తం సూరణం కందం పక్త్వాఽగ్నౌ పుటపాకవత్, అద్యాత్సతైలలవణం దుర్నామవినివృత్తయే. 19. స్విన్నం వార్తాకుఫలం ఘోషాయాః క్షారజేన సలిలేన, తద్ఘృతభృష్టం యుక్తం గుడేనాత్తృప్తితో యోఽత్తి. 20. పిబతి చ తక్రం నూనం తస్యాశ్వేవాతివృద్ధగుదజాని, యాంతి వినాశం పుంసాం సహజా న్యపి సప్తరాత్రేణ. 21. అసితానాం తిలానాం ప్రాక్ ప్రకుంచం శీతవారి యను, ఖాదతో ఽర్శాంసి నశ్యంతి ద్విజదార్ఢ్యాంగపుష్టిదం. 22.

నల్లనూవులు, నల్లజీడివిత్తులు, కరకకాయ, బెల్లము వీనిని సమానభాగములను గ్రహించి భక్షించినయెడల మూలరోగము, దగ్గు, శ్వాసము, ప్లీహ, పాండుజ్వరము మున్నగునవి నశించును. గోమూత్రములో రాత్రియంతయును నానవైచి యుంచఁబడిన కరకకాయను బెల్లముతో చేర్చి భక్షించినయెడలగాని, లేక చవ్యము చిత్రమూలము శొంఠి పిప్పళ్లు మోడి పంచకోలచూర్ణము వీటితోఁజేర్చిన మజ్జిగ గాని మూలరోగము గలవారి కియ్యవలయును. అడవికందను మట్టితో పూసి పుటపాకము బెట్టునట్లు పుటమువేసి తైలమును లవణమును కలిపికొని తినినయెడలను మూలరోగము నష్టమగును. చేదుబీరకాయలలో నీళ్లుపోసి పిసికి మంచిముదుకబట్టతో బాగుగా వడియకట్టి దానితో ములకపండు నుడుకబెట్టిగాని, వండిగాని నేతితో వేయించికొని బెల్లముతో కలుపుకొని సేవించినయెడల మూలరోగములు దూరము లగును. ఆవుమజ్జిగను త్రాగినయెడల మిక్కిలి వృద్ధిబొందిన గుదలును, శరీరముతో పుట్టిపెరిగిన మొలలును ఏడురోజులలో నశించును. ఒకపలము నల్లనువ్వులను మొదట తిని వెంటనే చల్లని నీరు త్రాగినయెడల మూలరోగములు అన్నివిధము లైనవియును నశించును. పండ్లు గట్టిపడును. అవయవములకు మంచి బలము వచ్చును.

## దంత్యారిష్టము.

శ్లో. దంతీచిత్రకమూలానాం ఉభయోః పంచమూలయోః, భాగా న్పలాంశా నాహోథ్య జలద్రోణే విపాచయేత్. 23. త్రిఫలం త్రిఫలాయా శ్చ దలానాం తత్ర దాపయేత్, రసే చతుర్థశేషే తు పూతశీతే ప్రదాపయేత్. 24. తులాం గుడస్య తత్తిష్ఠే న్మాసార్ధం ఘృతభోజనే, తన్మాత్రయా పిబే న్నిత్య మర్శోభ్యో విప్రముచ్యతే. 25 గ్రహణీపాండురోగఘ్నం వాతవర్చోనులోమనమ్, దీపనం చాఽరుచిఘ్నం చ దంత్యారిష్ట మిదం విదుః. పాత్రేఽరిష్టాదిసంధానం ధాతకీలోధ్ర లేపితే. 26.

తెల్లదింటెన నల్లదింటెన చిత్రమూలము దశమూలములు త్రిఫలములు వీటి నొక్కొక్క పలము చొప్పున తీసికొని నలియగొట్టి ద్రోణపునీటిలో పక్వముచేయవలయును. అందు త్రిఫలముల బెరడును 3 పలములును జాపత్రి 3 పలములు బెల్లము తులాప్రమాణమును ఆరెపువ్వులు వీటినన్నిటి నందుచేర్చి కలిపి నేతికుండలో నైచి పదునైదురోజు లుంచవలయును. తరువాత మాత్రల ననుసరించి ప్రతిదినమును సేవించుచున్నచో మూలరోగములు గ్రహణీరోగములు పాండురోగములు వీటిని నశింపజేయును. గుదస్థానమునందలి వాయువును మలమును అనుకూలముగా వెడలించుచుండును. ఇద్దానివలన జఠరాగ్ని దీపించును. అరుచి నశించును. దీనిని దంత్యారిష్ట మని యందురు.

## ప్రాణదగుటిక.

శ్లో. సనాగరారుష్కరవృద్ధదారుకం, గుడేన యో మోదకమత్త్యుదారకం. అశేషదుర్నామకరోగదారకం, కరోతి వృద్ధం సహసైవ దారకం. 27. చూర్ణే చూర్ణసమో జ్ఞేయః మోదకే ద్విగుణో గుడః, త్రిపలం శృంగబేరస్య చతుర్థం మరిచస్య చ. 28. పిప్పల్యాః కుడపార్థం చ చవ్యాయాః పల మేవ చ. 29. తాలీసపత్రస్య పలం పలార్థం కేసరస్య చ, ద్వే పలే పిప్పలీమూలా దర్ధకర్షం చ పత్రకాత్. 30. సూక్ష్మైలాకర్ష మేకం తు కర్షం చ త్వఙ్మృణాళయోః, గుడా త్పలాని తు త్రింశ చ్చూర్ణ మేకత్ర కారయేత్. 31. అక్షప్రమాణా గుటికా ప్రాణదేతి చ సా స్మృతా, పూర్వం భక్ష్యా తు పశ్చాత్తు భోజనస్య యథాబలం. 32. మద్యం మాంసరసం యూషం క్షీరం తోయం పిబే త్తథా, హన్యా దర్శాంసి సర్వాణి సహజా

న్యస్రజాని చ. 34. వాతపిత్తకఫోత్థాని సన్నిపాతోద్భవాని చ, పానాత్యయే మూత్రకృచ్ఛ్రే వాతరోగగళగ్రహే. 35. విషమజ్వరే చ మందేఽగ్నౌ పాండురోగే తథైవ చ, క్రిమిహృద్రోగిణాం చైవ గుల్మశూలార్తినాం తథా. 36. శ్వాసకాసపరీతానా మేషా స్యా దమృతోపమా, శుంఠ్యా స్థానేఽభయా దేయా విడ్గ్రహే పిత్తవాయుజే. 37. ప్రాణదేయం సితాం దత్వా చూర్ణమానా చ్చతుర్గుణామ్, ఆమ్లపిత్తాగ్నిమాంద్యాదౌ ప్రయోజ్యా గుదజాంకురే. 38. అనుపానం ప్రయోక్తవ్యం వ్యాధౌ శ్లేష్మభవే పలమ్, పలద్వయం త్వనిలజే పిత్తజే తు పలత్రయం. 39.

శొంఠి, నల్లజీడివిత్తులు, పెద్దమాను చెక్క, బెల్లము వీటిని మోదకములుగ చేసి తిననచో నన్నివిధములగు మూలరోగములును, మలలును నశించును. చూర్ణముతో సమానముగా బెల్లమును వాడవలయును. అల్లము 5 పలములు, మిరియములు ఒకపలము, పిప్పళ్లు 2 పలములు, చవ్యము 1 పలము, తాడిశపత్రి ఒకపలము, నాగకేసరములు అరపలము, మోడి 2 పలములు, జాజిపత్రి 6 మాషములు, చిన్నయేలకులు పావుపలము, లవంగపుపట్ట వట్టివేళ్లు ఒక్కొక్క అర్ధకర్షమును బెల్లము 50 పలములు వీటి నన్నిటిని చూర్ణముచేసి కలిపి ఒక్కొక్క తులమంత మాత్రలను కట్టవలయును. ఇయ్యది ప్రాణదగుటిక యనఁబడును. భుజించుటకు ముందుగ ఈమాత్రను సేవించి భోజనానంతరమున బలానుసారముగా మద్యము మాంసరసమును యూషమును పాలు నీరు వీనిని త్రాగవలయును. ఇదియన్ని తెగలగు మూలరోగములను శరీరముతో కూడఁ బుట్టిన మూలరోగమును, వాతపిత్తకఫముల నగు మూలరోగములను నశింపఁజేయును.

అతిపానము మూత్రకృచ్ఛ్రము వాతరోగము గళగ్రహము, విషమజ్వరము అగ్నిమాంద్యము పాండురోగము వీటిలో నిది హితకరము. జంతువాతము హృద్రోగము గుల్మరోగము శూలరోగము శ్వాసరోగము దగ్గు వీటితో కూడిన రోగికి ఈమాత్రలు అమృతతుల్యములు. పిత్తమువలన మూలరోగము కలిగినేని శొంఠి అల్లము వీటికి బదులు గాకరక్కాయను వేయవలయును, చూర్ణముకంటె నాలుగురెట్లు చక్కెరను కలిపి దీనిని తయారు చేయవలయును. ఆమ్లపిత్తము మందాగ్ని మున్నగువానియందును, గుదరోగములయందు నీమాత్రల నుపయోగింపవలయును. కఫరోగమునం దొకపలము అనుపానమును చేర్చవలయును. వాతరోగమునందు 2 పలముల అనుపానమును పిత్తరోగమునందు 3 పలముల అనుపానమును ఈయవలయును.

## కాంకాయనమోదకములు.

శ్లో. పథ్యాపంచపలా న్యేక మజాజ్యా మరిచస్య చ, పిప్పలీ పిప్పలీమూల చవ్య చిత్రక నాగరాః. 40. పలాభివృద్ధాః క్రమశః యవక్షారం పలద్వయమ్, భల్లాతకపలా న్యష్టౌ కందస్తు ద్విగుణో మతః. 41. ద్విగుణేన గుడేనైషాం వటకా నక్షసమ్మితాన్, కృత్వైనం భక్షయే త్ప్రాతః తక్రమంభోను వా పిబేత్. 42. మందాగ్నిం దీపయ త్యేష గ్రహణీపాండురోగవిత్, కాంకాయనేన శిష్యేభ్యః శస్త్రక్షారాగ్నిభి ర్వినా. 43. భిషగ్జిత మితి ప్రోక్తం శ్రేష్ఠ మర్శోవికారిణామ్,

కరక్కాయలు ఐదుపలములు, జీలకఱ్ఱ,మిరియములు ఒకపలము, పిప్పళ్లు ఒకపలము, మోడి మూడుపలములు, చవ్యము నాలుగుపలములు, చిత్రమూలముఅయిదుపలములు శొంఠి ఆరుపలములు, యవక్షారము రెండుపలములు, నల్లజీడివిత్తులు ఎనిమిదిపలములు, కందదుంప పదహారుపలములు వీటి యన్నింటికి రెండురెట్లు బెల్లము కలిపి పావుపావుపలము చొప్పున మాత్రలను కట్టవలయును. ప్రాతఃకాలమున ఒకమాత్రను తిని పైన మజ్జిగను కాని నీళ్లనుకాని త్రాగవలయును. ఇది అగ్నిమాంద్యమును పోగొట్టును. గ్రహణులను, పాండురోగమును నశింపచేయును. ఇది శస్త్రములు, క్షారపదార్థములు అగ్నితాపనములు మొదలగునవి లేకయే జయించు నని కాంకాయనమునిచేత శిష్యులకు చెప్పబడినది. మూలరోగముల కన్నిటికిని శ్రేష్ఠమైన ఔషధము.

## మాణిభద్రమోదకము.

శ్లో. విడంగసారామలకాభయానాం పలంపలం స్యాత్త్రివృత త్త్రయంచ. 44. గుడస్య షట్ ద్వాదశభాగయుక్తా మాసేన త్రింశ ద్గుటికా విధేయాః. నివారణే యక్షవరేణ సృష్టః, స మాణిభద్రః కిల శాక్యభిక్షవే. 45. అయం హి కాసక్షయ కుష్ఠనాశనం భగందరప్లీహ జలోదరార్శసామ్, యథేష్టచేష్టాన్నవిహారసేవీ అనేన వృద్ధ స్తరుణో భవే చ్చ. 46.

వాయువిడంగములు, దానిమ్మబెరడు, ఉసిరికకాయలు, కరక్కాయలు వీటి నొక్కొక్కపలమును, తెల్లతెగడ మూడుపలములు, బెల్లము ఆరుపలములు చొ॥ పన్నెండుభాగములను తీసుకొని ముప్పదియుండలను కట్టవలయును. ఈయుండలను మాణిభద్రుడను యక్షుడు సృజించెను. వీనివలన దగ్గులు, క్షయరోగములు, కుష్ఠులు భగం

దరములు, పాదలరోగములు, జలోదరములు, మూలరోగములు నశించును. యథేష్టముగా తిరుగుట, భుజించుట పనిచేయుట కలవాడు వీనిని సేవించుటచేత ముసలివాఁడైనను వయసువాఁడగును.

### లఘుసూరణమోదకములు.

శ్లో. మరిచమహౌషధచిత్రక సూరణభాగా యథోత్తరం ద్విగుణాః, సర్వసమో గుడభాగః సేవ్యోఽయం మోదకః ప్రసిద్ధఫలః. 47. జ్వలనంజ్వాలయతి జాఠరమున్మూలయతి శూలగుల్మగదాన్, నిశ్శేషయతి శ్లీపద మర్శాంస్యపి నాశయత్యాశు. 48.

మిరియము ఒకభాగము శొంఠి రెండుభాగములు, చిత్రమూలము నాలుగుభాగములు, అడవికంద యెనిమిదిభాగములు, వీటిని అన్నిటితో సమానముగా బెల్లము చేర్చి లడ్డులు చేసి సేవించవలయును. ఇది ప్రసిద్ధమగు ఫలము లిచ్చును. జఠరాగ్నిని వృద్ధి పొందించును. కడుపునొప్పి, బల్లలు మొదలగువానిని పోఁగొట్టును. శ్లీపదమును మూలరోగమును నశింపచేయును.

### బృహత్సూరణమోదకములు.

శ్లో. సూరణషోడశభాగా వహ్నేరష్టౌ మహౌషధస్యాతః, అర్ధేన భాగయుక్తిర్మరిచస్య తతోఽపి చార్ధేన. 49. త్రిఫలాకణాసమూలాతాలీశారుష్కరక్రిమిఘ్నానామ్, భాగా మహౌషధసమా దహనాంశా తాలమూలీ చ. 50. భాగః సూరణతుల్యో దాతవ్యో వృద్ధదారుకస్యాపి, భృంగైలే మరిచాంశే సర్వాణ్యేకత్ర సంచూర్ణ్య. 51. ద్విగుణేన గుడేన యుతః సేవ్యోఽయం మోదకః ప్రకామధనైః, గురువృష్యభోజ్యరహితే ష్వితరేషూపద్రవం కుర్యాత్. 52. భస్మకమనేన జనితం పూర్వం మగస్త్యస్య యోగరాజేన, భీమస్య మారుతేరపి యేన తౌ మహాశనౌ జాతౌ. 53. అగ్నిబల బుద్ధిహేతుర్న కేవలం సూరణో మహావీర్యః, ప్రభవతి శస్త్రక్షారాగ్నిభిర్వినాప్యర్శసా మేషః. 54. శ్వయథుశ్లీపదజిద్గ్రహణీమపి కఫవాతసంభూతామ్, నాశయతి బలీపలితం మేధాం కరుతే వృషత్వం చ. 55. హిక్కాం శ్వాసం కాసం సరాజయక్ష్మప్రమేహాంశ్చ, ప్లీహానాం చాత్యుగ్రం హన్తి సదైతద్రసాయనం పుంసాం. 56.

అడవికంద 16 భాగములు, చిత్రమూలము 8 భాగములు, శొంఠి నాల్గుభాగములు మిరియములు 2 భాగములు, కరక్కాయలు ఉసిరిక తాడి పిప్పళ్లు మోడి తాడిశపత్రి నల్లజీడివిత్తనములు వాయువిడంగములు వీనినన్నిటిని నాల్గునాల్గుభాగములును నేలతాడి 8 భాగములును పెద్దమ్రాను 16 భాగములును, ఏలకులు దాల్చినపట్ట రెండురెండు భాగములు వీటి నన్నిటిని ఒక్కచోట నొక్కమాఱుగా చూర్ణము రెండురెట్లు బెల్లము కలిపి సేవింపవలయును. ఇయ్యదికామదేవుని వృద్ధి నొందించును. ఈయోగరాజమును సేవించినందువలననే యగస్త్యునికి మొదట భస్మమగునట్లు జీర్ణశక్తి గలిగినది. అతరువాత భీమసేనునకు గలిగినది అగ్నిబలను వృద్ధియే ఇట్లగుటకు కారణము. ఇయ్యదికేవలము వీర్యమును వృద్ధి నొందించునది మాత్రమే కాదు. అగ్నికిని బలమునకును బుద్ధికిని కారణముగూడ నై యున్నది. శస్త్రములు క్షారచికిత్సలు అక్కఱలేకయే మూలరోగములను పోగొట్టును. శోఫ శ్లీపదము కఫము వాతము వీటివలన పుట్టిన గ్రహణిని పోగొట్టును. శరీరము ముడుతలుపడుట వెంట్రుకలు తెల్లపడుట నశించును. బుద్ధిని పుంస్త్వమును పుట్టించును. వెక్కిళ్లు శ్వాస దగ్గు రాజయక్ష్మము ప్రమేహము పాండురోగము వీటిని పోగొట్టును. ఇయ్యది పురుషులకు రసాయనముతో తుల్యమైనది.

## సూరణపిండి.

శ్లో. చూర్ణీకృతా షోడశ సూరణస్య
భాగా స్తతోఽర్ధేన చ చిత్రకస్య,
మహౌషధార్ధో మరిచస్య చైకో
గుడేన దుర్నామజయాయ పిండీ. 57

పిండిచేసినఅడవికంద 16 భాగములను, చిత్రమూలము 8 భాగములును, శొంఠి, మిరియములు వీటి నొక్కభాగమును కట్టింపు బెల్లములో కలిపి ముద్దచేసి సేవించి, మూలరోగములు నశించును. దీనిని పిండిగా చేయవలయును. అనినందున లడ్డువలెగాని కుడుముల వలె గాని చేయవలయు నని తెలియవలయును.

## వ్యోషాద్యచూర్ణము.

శ్లో. వ్యోషాగ్నిపుష్కరవిడంగతిలాభయానాం
చూర్ణం గుడేన సహితం తు సదోపయోజ్యం,
దుర్నామకుష్ఠగరశోథశకృద్విబంధా న
గ్నేర్జయ త్యబలతాం క్రిమిపాండుతాం చ. 58

తా. శొంఠి, మిరియములు, పిప్పళ్లు, చిత్రమూలము, నల్లజీడివిత్తనములు, వాయువిడంగములు, నల్లనువ్వులు, కరక్కాయలు వీటిని చూర్ణముచేసి బెల్లములో కలిపి యెల్లప్పుడు సేవింపవలయును. ఇయ్యది మూలరోగము, కుష్ఠు, విషము, వాపు, మలబద్ధకము, అగ్నిమాంద్యము, పాండురోగము, జంతువాతము వీటిని హరించును.

## సమశర్కరచూర్ణము.

శ్లో. శుంఠీకణామరిచ నాగదలత్వగేలం
చూర్ణీకృతం క్రమవివర్ధిత మూర్ధ్వ మంత్యాత్,
ఖాదే దిదం సమసితం గుదజాగ్నిమాంద్య
కాసారుచిశ్వసన కంఠ హృదామయేషు. 59

శొంఠి, పిప్పళ్లు, మిరియములు, తమలపాకులు, లవంగపుపట్ట, ఏలకులు వీటిని చూర్ణముచేసి యీచూర్ణముతో సమానముగా చక్కెరనందు కలుపుకొని తినిన యెడల మూలరోగము, అగ్నిమాంద్యము, శ్వాస, కంఠరోగము, హృద్రోగము వీటియందు హితమును కలిగించును.

## లవణోత్తమాదిచూర్ణము.

శ్లో. లవణోత్తమ వహ్నికలింగయవాన్
చిరబిల్వమహాపిచు మర్దయుతాన్,
పిబ సప్తదినం మథితాలులితాన్
యది మర్దితు మిచ్ఛసి పాయురుహాన్. 60

సైంధవలవణము చిత్రమూలము కొడిశపాలవిత్తనములు క్రానుగువేరు పెద్దవేము వీనిసమభాగకల్కము మజ్జిగలో నానవేసుకొని యేడుదినములు సేవించిన మూలరోగములు తొలంగిపోవును.

## నాగార్జునయోగము.

శ్లో. త్రిఫలా పంచలవణం కుష్ఠం కటుకరోహిణీ, దేవదారు విడంగాని పిచుమర్దఫలాని చ. 61. బలా చాతిబలాచైవ హరిద్రే ద్వే సువర్చలా, ఏత త్సంభృత్య సంభారం కరంజత్వగ్రసేన చ. 62. పిష్ట్వా చ గుటికాం కృత్వా బదరాస్థిసమాం బుధః, ఏకైకాం తాం సముద్ధృత్య రోగే రోగే పృథక్పృథక్. 63. ఉష్ణేన వారిణా పీతా శాన్త మగ్నిం ప్రదీపయేత్, అర్శాంసి హన్తి తక్రేణ గుల్మ మమ్లేన నిర్హరేత్. 64.

జంతుదష్టం తు తోయేన త్వగ్దోషం ఖదిరాంబునా, మూత్రకృచ్ఛ్రింతు తోయేన హృద్రోగం తైలసంయుతా. 65. ఇంద్రస్వరససంయుక్తా సర్వజ్వరవినాశినీ, మాతులుంగరసేనాథ సద్యశ్శూలహరీస్మృతా. 66. కపిత్థతిందుకానాం తు రసేన సహమిశ్రితా, విషాణి హన్తి సర్వాణి పానాశనప్రయోగతః. 67. గోశకృద్రససంయుక్తా హన్యా త్కుష్ఠాని సర్వశః, శ్యామాకషాయసహితా జలోదరవినాశినీ. 68. భక్తచ్ఛందం జనయతి భుక్తస్యోపరి భక్షితా, అక్షిరోగేషు సర్వేషు మధునా ఘృష్యతాం జయేత్. 69. లేహమాత్రేణ నారీణాం సద్యః ప్రదరనాశినీ, వ్యవహారే తథా ద్యూతే సంగ్రామే మృగయాదిషు. 70. ప్రమాలభ్య నరో హ్యేనాం క్షిప్రం విజయ మాప్నుయాత్.

కరక్కాయలు తాడి కుసిరిక పంచలవణములు చంగల్వకోష్ఠు కటుకరోహిణి దేవదారు వాయువిడంగము వేముపండ్లు ముత్తవపులగము తెల్లముత్తవపులగము పసుపు మానిపసుపు ఆదిత్యభక్తి ప్రొద్దుతిరుగుడు వీటినన్నిటిని క్రానుగురసముతోటి నూరి రేగుగింజలంత మాత్రలు చేసి ఒక్కొక్కమాత్రను ప్రతిరోగమునందు వేరువేరుగా వేడినీళ్ల అనుపానముతో సేవించిన యెడల జఠరాగ్నిని దీపింపఁజేయును. మూలరోగములను పోఁగొట్టును. గంజితో పుచ్చుకొనిన గుల్మరోగములను పోఁగొట్టును. చన్నీళ్ళతోనైన జంతువాయువును పోఁగొట్టును. కాచునీళ్లతోటి బుచ్చుకొనిన చర్మదోషములను పోఁగొట్టును. మంచినీళ్ళతో పుచ్చుకొనినయెడల మూత్రకృచ్ఛ్రములను పోగొట్టును. తిలతైలముతో బుచ్చుకొనిన హృద్రోగములను పోఁగొట్టును. కొడిసెపాలరసముతో బుచ్చుకొనిన అన్నివిధములయిన జ్వరమును పోఁగొట్టును. మాదీఫలరసము బుచ్చుకొనిన తాత్కాలిక శూలలను పోగొట్టును. కాచు తుమికరసములతో చేర్చి బుచ్చుకొనిన అన్నివిధములైన విషములు దిగిపోవును. ఆవుపేడరసముతో బుచ్చుకొనిన అన్నికుష్ఠులును, తెల్లతెగడకషాయముతో బుచ్చుకొనిన జలోదరములు నశించును. భోజనమైన తరువాత బుచ్చుకొనిన భోజనమందు రుచి కలిగించును. నేత్రరోగము లన్నిటికిని తేనెతో చాది కలికము వేయవలయును. స్త్రీలకు దీనిని సేవించినమాత్రమున ప్రదరరోగములు నశించును. వ్యవహారము జూదము యుద్ధము వేట మొదలైనవానియందు మనుజుఁడు దీనిని సేవించిన త్వరగా విజయము నొందును.

### విజయచూర్ణము.

శ్లో. త్రికత్రయవచా హింగు పాఠాక్షారనిశాద్వయం. 71

చవ్యతిక్తాకలింగాగ్ని శతాహ్వాలవణాని చ, గ్రంధిబిల్వాజమోదాచ గణోష్టావింశతి ర్మతః. 72. ఏతాని సమభాగాని శ్లక్ష్ణచూర్ణాని కారయేత్, తతో బిడాలపదకం పిబే దుష్ణేన వారిణా. 73. ఏరండతైలయుక్తం తు సదా లిహ్యా త్తతో నరః, కాసం హన్యాత్తదా శోథం అర్శాంసి చ భగందరం. 74. హృచ్ఛూలం పార్శ్వశూలం చ వాతగుల్మం తథోదరం, హిక్కాశ్వాసప్రమేహాం శ్చ కామలాన్ పాండు రోగతాం. 75. అమాన్వయ ముదావర్త మంత్రవృద్ధిం గుదక్రిమీన్, అన్యే చ గ్రహణీదోషాః యే మయా పరికీర్తితాః 76. మహాజ్వరోపసృష్టానాం భూతోపహతచేతసాం, అప్రజానాంతు నారీణాం ప్రజావర్ధన మేవ చ. 77. విజయో నామ చూర్ణోఽయం కృష్ణాత్రేయేణ పూజితః.

కరక్కాయలు, తాడి, ఉసిరిక, శొంఠి, మిరియములు, పిప్పళ్ళు, లవంగపట్ట, ఏలకులు, జాజిపత్రి, వస, ఇంగువ, విషబొద్ది, యవక్షారము, పసుపు, మ్రానుపసుపు, చవ్యము, కటుకరోహిణి, కొడిశపాలవిత్తనములు, నల్లజీలకర్రగింజలు, సదాప, పంచలవణములు, మోడి, మారేడువేళ్లు, వాము ఇవి అష్టావింశతిగణ మనఁబడును. వీనిని సమానభాగములుగా తీసికొని మెత్తగా చూర్ణము చేయవలయును. తరువాత ఆముదములో కలుపుకొని తులమంతను వేడినీళ్లతోఁగూడా త్రాగవలయును. దగ్గు, వాపు, మూలరోగము, భగందరము, కడుపునొప్పి, పార్శ్వశూల, వాతగుల్మము, ఉదరరోగము, వెక్కిళ్ళు, శ్వాస, ప్రమేహము, కామెరలు, పాండురోగము, ఆమవికారము, ఉదావర్తము, అంత్రవృద్ధి, ముడ్డినొప్పి అనువీటిని పోఁగొట్టును. ఇంకను నాచేత చెప్పఁబడిన యితరగ్రహణీరోగములనువర్తించును. పెద్దపెద్ద జ్వరములతో పీడింపఁబడినవారికిని దయ్యములవల్ల మతిపోయినవారికిని ఇది సుఖము నిచ్చును. బిడ్డలులేని స్త్రీలకు బిడ్డలను పుట్టించును. ఇవి విజయచూర్ణము. కృష్ణాత్రేయులవారిచేత పూజింపఁబడినది.

## బాహుశాలగుడము.

శ్లో. త్రివృత్తేజోవతీ దన్తీ శ్వదంష్ట్రాచిత్రకం శఠీ. 78. గవాక్షీ ముస్త విశ్వాహ్వ విడంగాని హరీతకీ, పలోన్మితాని చైతాని పలాన్యష్టా వరుష్కరాన్. 79. షట్పలం వృద్ధదారస్య సూరణస్య తు షోడశ, జలద్రోణద్వయే క్వాథ్యం చతుర్భాగావశేషితం. 80. పూతం తు తం రసం భూయః క్వాథ్యేభ్య స్త్రిగుణో గుడః, లేహం పచేత్తు తం తావత్ యావ ద్దర్వీప్రలేపనం. 81. అవతార్య తతఃపశ్చా చ్చూ

ర్ణానీమాని దాపయేత్, త్రివృత్తేజోవతీ కంద చిత్రకాన్ ద్విపలాంశి
కాన్. 82. ఏలాత్వఙ్మరిచం చాపి గజాహ్వాం చాపి షట్పలాం, ద్వా
త్రింశతం పలాన్యేవం చూర్ణం దత్వా నిధాపయేత్. 83. తతో మా
త్రాం ప్రయుంజీత జీర్ణే క్షీరరసాశనః, పంచగుల్మాన్ప్రమేహాంశ్చ పాం
డురోగం హలీమకమ్. 84. జయే దర్శాంసి సర్వాణి తథా సర్వోద
రాణిచ, దీపయే ద్గ్రహణీం మందాం యక్ష్మాణం చాపకర్షతి. 85. పీన
సే చ ప్రతిశ్యాయే ఆఢ్యవాతే తథైవ చ, అయం సర్వగదే ష్వేవ
కల్యాణో లేహ ఉత్తమః. 86. దుర్నామారి రయం చాశు దృష్టో వార
సహస్రశః, భవం త్యేనం ప్రయుంజానాః శతవర్షం నిరామయాః. 87.
ఆయుషో దైర్ఘ్యజననో పలీపలితనాశనః, రసాయనవర శ్చైష మేధా
జననఉత్తమః. 88. గుడ శ్శ్రీగాహుశాలోయం దుర్నామారిః ప్రకీర్తితః.

తెల్లతెగడ చవ్యము తెల్లదింటెన ఏనుగుపల్లేరు చిత్రమూలము కచ్చూరము పాపరబుడమ తుంగముస్తలు శొంఠి వాయువిడంగములు కరక్కాయలు వీటినన్నిటిని ఒక్కొక్కపలమును, జీడివిత్తులు ౮ పలములు, వెద్రమాని చెక్క 6 పలములు, అడవి కంద 16 పలములు వీటిని రెండుద్రోణముల నీటిలో వేసి కషాయము చేయవలయును. నాలుగవపాలు నీరు మిగిలియుండగా దింపి వాసెన కట్టి మరల పొయ్యిమీఁద పెట్టి మూడింతలు బెల్లము వేసి పక్వముచేయవలయును. (తీగెపాకమురాగానే) గరిటకు అంటుకొని లేచునపుడు దింపి యీ క్రింద చెప్పబోవు ఔషధముల చూర్ణములను కలపవలయును. తెల్లతెగడ జ్యోతిష్మతి అడవికంద చిత్రమూలము ఇవి రెండురెండు పలములును, ఏలకులు లవంగపుపట్ట ఏనుగుపిప్పళ్లు ఇవి ఆరుఆరుపలములు మొ॥ 32 పలములు తీసికొని చూర్ణముచేసి కలపవలయును. తరువాత మాత్రలను కట్టి తగునట్లుగా తినవలయును. ఔషధముజీర్ణమైనతరువాత పాలను త్రాగవలయును. ఇది అయిదువిధములగు గుల్మరోగములను ప్రమేహమును పాండురోగమును హలీమకమును అన్నివిధములైన మూలరోగములను ఉదరరోగములను పోఁగొట్టును. మందగ్రహణిని క్షయరోగమును పోఁగొట్టును. పీనసయందును ప్రతిశ్యాయమందును వాతరక్తమందును హితకరము. అన్ని విధములగు రోగములయందు యీలేహము ఉత్తమము హితకరము నగును. మూలరోగములను త్వరగా పోఁగొట్టును. ఇట్లు అనేక పర్యాయములు ఇది నిదర్శనము చూడబడ్డది. దీనిని సేవించినవారు నూరువర్షములు నీరోగులై జీవించెదరు. ఇది ఆయుష్యమును వృద్ధి పొందించునదియును, తలనెరియుటను పోఁగొట్టునదియును, తెలివిని పుట్టించునదియు

నగు ఉత్తమమైన రసాయనము. ఇది బాహుశాల మను పేరుగల గుడము, మూలరోగ ములను పోఁగొట్టు నని కొనియాడఁబడినది.

### గుడభల్లాతకము.

శ్లో. తోయపూర్ణే యదా పాత్రే క్షిప్తో న ప్లవతే గుడః. 89. క్షిప్తశ్చ నిశ్చల స్తిష్ఠేత్ పతిత స్తు న శీర్యతే, యదా దర్వీ ప్రలేప స్స్యాత్ యావద్వా తంతులీభవేత్. 90. ఏష పాకో గుడాదీనాం సర్వే షాం పరికీర్తితః, సుఖవర్ణ స్సుఖస్పర్శో గుడః పాక ముపాగతః. 91. పీడితో భజతే ముద్రాం గంధవర్ణరసాన్వితః, భల్లాతకసహస్రే ద్వే జ లద్రోణే విపాచయేత్. 92. పాదశేషే రసే తస్మి న్పచే ద్గుడతులాం భిషక్, భల్లాతకసహస్రార్ధం ఛిత్వా తత్రైవ దాపయేత్. 93. సిద్ధే స్మిం త్రిఫలావ్యోషయమానీము స్తసైంధవమ్, కర్షాంశసమ్మితం దద్యా త్త్వగేలాపత్రకేసరం. 94. ఖాదే దగ్నిబలాపేక్షీ ప్రాత రుత్థాయ మా నవః, కుష్ఠార్శః కామలామేహ గ్రహణీగుల్మపాండుతాః. 95. హన్యా త్ప్లీహోదరం కాసక్రిమిరోగభగంధరాన్, గుడభల్లాతకో హ్యేష శ్రేష్ఠ శ్చార్శోవికారిణాం. 96.

నీళ్ళతో నిండిన పాత్రలో వేసిన తేలక యుండినను, కదలకయుండినను, నీటిలో యున్నను, కరిగకుండినను, పాకసమయమున గరిటకు చుట్టుకొని తీగెలుపారినను, గుడా దులకు పాకము కలిగినదని తెలుసుకొనవలయును. చక్కగా పక్వమైనగుడము చూచు టకు స్వచ్ఛముగాను వాసన రంగు రుచి కలదిగను యుండును. రెండువేలనల్లజీడివిత్తు లను ముక్కలుచేసి నీళ్లలో పోసి వండి, ద్రోణపరిమాణపునీటిలో, నాల్గవపాలు నీరు మిగిలియున్నప్పుడు నూరుపలముల బెల్లమునుకలిపి పక్వము చేయవలయును. 500 నల్లజీడి విత్తులను ముక్కలనుచేసి ఆపాకమునందు కలపవలయును. త్రిఫలములు శొంఠి మిరియ ములు పిప్పళ్లు వాము తుంగముస్తలు సైంధవలవణము లవంగపుపట్ట ఏలకులు జాపత్రి నాగకేసరములు వీటిని ఒక్కొక్కపలము చొప్పున కలపవలయును. ఇట్లు సిద్ధ ముచేసిన యీలేహమును మనుజుఁడు ప్రాతఃకాలమున లేచి జఠరాగ్ని ననుసరించి భక్షిం పవలయును. ఇయ్యది కుష్ఠులను మూలరోగములను కామెర్లను మేహములను గ్రహ ణులను గుల్మరోగములను పాండురోగములను ప్లీహరోగములను దగ్గును జంతువాయు వులను భగంధరములను పోఁగొట్టును. గుడభల్లాతకము అను పేరుగల యీలేహము అన్నివిధము లగు మూలరోగములందును శ్రేష్ఠము అయిన దందురు.

భల్లాతకగుడము.

శ్లో. దశమూల్యమృతా భార్గీ శ్వదంష్ట్రా చిత్రకం శఠీ, భల్లాతక సహస్రం చ పలాం శం క్వాథయే ద్బుధః. 97. పాదశేషే జల ద్రోణే రసేతస్మి న్విపాచయేత్, దత్వా గుడతులా మేకాం లేహీ భూతం సముద్ధరేత్. 98. మాక్షికం పిప్పలీతైలం ఔరుబూకం చ దాపయేత్, కుడపం కుడపం చాత్ర త్వగేలామరిచం తథా. 99. అర్శః కాస ముదావర్తం పాండుత్వం శోధ మేవ చ, నాశయే ద్వహ్నిసాదం చ గుడభల్లాతక స్స్మృతః. 100.

దశమూలములు తిప్పతీగె గంటుభారంగి పెద్దపల్లేరు చిత్రమూలము కచ్చూరము వేయినల్లజీడివిత్తనములు వీటిని కషాయము పెట్టవలసినది. నాల్గవపాలు మిగిలియుండఁగా ఒక్క ద్రోణమాత్ర పురసములో నూరుపలముల బెల్లమును వేసి చక్కగా పక్వమును జేసి లేహముగా అయిన తరువాత దించవలయును. తేనె పిప్పళ్లు ఆముదము నీనిని నాలుగునాలుగు పలములను, ఏలకులు లవంగపుపట్ట మిరియములను నాలుగు నాలుగు పలములను అందు కలిపి పాకముచేసి భక్షించినయెడల మూలరోగము దగ్గు ఉదావర్తము పాండురోగము వాపు వీటిని పోఁగొట్టును. ఇది భల్లాతకగుడమని చెప్పఁబడును.

చవ్యాదిఘృతము.

శ్లో. చవ్యం త్రికటుకం పాఠాం క్షారం కుస్తుంబురూణి చ, యమానీ పిప్పలీమూల ముభే చ బిడసైంధవే. 101. చిత్రకం బిల్వ మభయాం పిష్ట్వా సర్పి ర్విపాచయేత్, శకృ ద్వాతానులోమ్యార్థం జాతే దధ్ని చతుర్గుణే. 102. ప్రవాహికాం గుదభ్రంశం మూత్రకృచ్ఛ్రం పరిస్రవమ్, గుదవంక్షణశూలం చ ఘృత మేత ద్వ్యపోహతి. 103.

చవ్యము, శొంఠి, మిరియములు, పిప్పళ్లు, ఆగరుశొంఠి, యవక్షారము, ధనియములు, ఓమము, దశమూలములు, బిడాలలవణము, సైంధవలవణము, మారేడువేళ్లు, కరక్కాయలు వీటిని నూరి నేతిలో పక్వము చేయువలయును. మలవాతముల యానులోమ్యమునకై పెరుగుకలిపి పక్వమును చేయవలయును. ప్రవాహిక గుదభ్రంశము మూత్రకృచ్ఛ్రము పరిస్రవము గుదశూలము అంగసంధిశూలము వీటిని ఈతైలము పోఁగొట్టును.

వ్యోషాదిఘృతము.

శ్లో. వ్యోషగర్భం పలాశస్య త్రిగుణే భస్మవారిణే,
సాధితం పిబతః సర్పిః పతం త్యర్శాంసి స్యసంశయమ్. 104

మోదుగకట్టెలను భస్మముచేసి మూడురెట్లునీటిలో కొంతి మిరియములు పిప్పళ్లు వీటికల్కము వేసి దానియందు సిద్ధముచేయఁబడిన ఘృతమును త్రాగిన గుదరోగములు నశించును. సందేహము లేదు.

## ఉదకషట్పలఘృతము.

శ్లో. సక్షారైః పంచకోలైస్తు పలికైః త్రిగుణోదకే.
సమక్షీరం ఘృతప్రస్థం జ్వరార్శః ప్లీహకాసనుత్. 105

యవక్షారము పంచకోలములు ఒక్కొక్కపలము తీసికొని మూఁడురెట్ల నీటిలో సమానముగా పాలును తీసికొని 16 పదహారుపలముల నేతిని పక్వము చేయవలయును. ఇయ్యది జ్వరమును మూలరోగమును ప్లీహరోగమును దగ్గును పోఁగొట్టును.

## సింహ్యామృతఘృతము.

శ్లో. పచేద్వారి చతుర్ద్రోణే కంటకార్యమృతా శతమ్,
తత్రాగ్ని త్రిఫలావ్యోషపూతి కత్వక్కలింగకైః. 106
సకాశ్మర్యవిడంగైస్తు సిద్ధం దుర్నామమేహనుత్,
ఘృతం సింహ్యామృతం నామ బోధిసత్త్వేన భాషితమ్. 107

నాలుగుద్రోణముల నీటిలో వాకుడును తిప్పతీగె కరకకాయలను ఏబదేసిపలము చొప్పున వేసి పక్వముఁజేసి అందు చిత్రమూలము త్రిఫలము త్రికటుకములు క్రానుగచెక్క లవంగపుపట్ట కొడిసెపాలవిత్తనములు గుమ్ముడు వాయువిడంగములు వీటిని కలిపి అందు సిద్ధముచేసిన నేతిని సేవించిన ప్రమేహములు నశించును. ఇయ్యది బోధిసత్త్వుండను ఋషి చేతఁ జెప్పఁబడిన ఘృతము.

## పిప్పల్యాద్యతైలము.

శ్లో. పిప్పలీం మధుకం బిల్వం శతాహ్వాం మదనం వచామ్, కుష్ఠం శఠీ పుష్కరాఖ్యం చిత్రకం దేవదారు చ. 108. పిష్ట్వా తైలం విపక్తవ్యం ద్విగుణక్షీరసంయుతం, అర్శసాం మూఢవాతానాం తచ్ఛ్రేష్ఠమనువాసనం. 109. గుదనిస్సరణం శూలం మూత్రకృచ్ఛ్రం ప్రవాహికాం, కట్యూరుపృష్ఠదౌర్బల్య మానాహం వంక్షణాశ్రయం. 110. పిచ్ఛాస్రావం గుదే శోథం వాతవర్చోవినిగ్రహం, ఉత్థానం బహుదోషం చ జయేచ్ఛీఘ్రమనువాసనాత్. 111. రక్తార్శసాముపేక్షేత రక్తమాదౌ స్రవేద్భిషక్, దుష్టాస్రే నిగృహీతే తు శూలానాహ వసృ

గ్గదాః. 112. లాజైః పేయా పీతా చుక్రీకదల కేసరోత్పలై స్సిద్ధా, హన్త్యస్రస్రావంసా తథా బలా పృశ్నిపర్ణీభ్యామ్. 113. శక్రాహ్వథ స్సవిశ్వోవా కింవా బిల్వశలాటవః, యోజ్యా రక్తార్శసాం తద్వ జ్జ్యోత్స్నికామూలలేపనం. 114. నవనీత తిలాభ్యాసాత్ కేసరనవనీతశర్కరాభ్యాసాత్, దధిసరమథితాభ్యాసాత్ గుదజా శ్శామ్యంతి రక్తవహాః. 115. సమంగోత్పలమోచాహ్వతిరీటతిలచందనైః, ఛాగక్షీరం ప్రయోక్తవ్యం గుదజే శోణతాపహమ్. 116.

పిప్పళ్లు యష్టిమధుకము మారేడుపిండెలు సదాపమంగకాయ వస చెంగల్వకోష్ఠు కచ్చూరము పుష్కరమూలము చిత్రమూలము దేవదారు వీటినినూరి రెండుగెట్లుపాలను కలిపితైలమునుపక్వముచేసి అనువాసనచేసినచో మూలరోగములకు శ్రేష్ఠము. గూదబయలు వెడలుట శూలమూత్రకృచ్ఛ్రిము ప్రవాహికమున్నగువాట్లయందును,పిచ్ఛాస్రావమున్నగు వాట్లయందు దీని నుపయోగింపవలయును. ఇయ్యది పిప్పలాద్యతైలము, రక్త గ్రహణి గలరోగులు దీనిని మొదల రక్తమును వెడలించిసేవించిన హితకరము. లాజలతో పేయను చేసికొనిగాని,పులిచింతాకు నాగకేసరములు నల్లకలువ వీటితో లాజపేయను చేసికొని దానిని త్రాగినచోగాని, కోలపొన్నము త్తవపులగము వీటితో సిద్ధముచేయబడిన లాజపేయముగానిఅస్రస్రావము నశింపజేయును. కొడిశపట్టకషాయమందు కొంచెముశొంఠిచూర్ణము చేర్చిగాని, మారేడుపిందెల రసమందు శొంఠిచూర్ణమునుచేర్చిగాని రక్తార్శస్సులందు నిస్సంశయముగ వాడవచ్చును. చేదుబీరవేరు అరగదీసి మొలలకు లేపనము చేసినను మేలగును. 1 నల్లనువ్వులు వెన్న; 2 తామరపూవులోని కేసరములు చక్కెర నవనీతము; 3 మీగడ పెరుగు తరిచినవెంటనే వేడిగనుండు మజ్జిగ వీనిలో దేనినైనను అభ్యాసమును జేయుచు వచ్చినచో, రక్తము స్రవించు మూలవ్యాధులు హరించును. ముత్తవపులగ నల్లకలువ బూరుగు లొద్దుగు నల్లనువ్వులు రక్తచందనము వీనిని చక్కగా నూరి మేకపాలలోకలిపి పిసికి వడియగట్టి లోపలి కిచ్చినయెడల రక్తార్శస్సులు హరించును.

## కుటజలేహము.

శ్లో. కుటజత్వక్పలశతం జలద్రోణే విపాచయేత్, అష్టభాగావశిష్టం తు కషాయ మవతారయేత్. 117. వస్త్రపూతం పునః క్వాథం పచే ల్లేహత్వ మాగతం, భల్లాతకం విడంగాని త్రికటు త్రిఫలా తథా. 118. రసాంజనం చిత్రకంచ కుటజస్య ఫలాని చ, వచా మతివిషాం బిల్వం ప్రత్యేకం చ పలం పలం. 119. త్రింశత్పలాని గుడస్య చూర్ణీ

కృత్య నిధాపయేత్, మధునః కుడపం దద్యా ద్ఘృతస్య కుడపం తథా. 120. ఏష లేహ శ్శమ యతి చాఽస్నోరక్తసముద్భవం, వాతికం పైత్తికం చైవ శ్లైష్మికం సాన్నిపాతికం. 121. యే చ దుర్నామజా రోగా స్తా న్సర్వా న్నాశయ త్యపి, అమ్లపిత్త మతీసారం పాండురోగమరోచ కమ్. 122. గ్రహణీమార్దవం కార్శ్యం శ్వయథుం కామలా మపి, అనుపానం ఘృతం దద్యా న్మధుతక్రం జలం పయః. 123. రోగానీక వినాశాయ కౌటజో లేహ ఉచ్యతే.

కొడిసెపట్టను 100పలములు తీసికొని ఒకద్రోణపు నీటిలో పక్వముచేసి ఎనిమిద వపాలు మిగిలినప్పుడు ఆకషాయమును దింపవలయును. తరువాత దానిని వడియకట్టి మఱల ప్రొయ్యిమీదం బెట్టి 30 పలములు బెల్లము వైచి లేహమువలె యుడికించి ముద్దకట్ట గనే నల్లజీడివిత్తనములు వాయువిడంగములు శొంఠి మిరియములు పిప్పళ్లు కరక్కా-య లు తాడియుసిరికలు రసాంజనము చిత్రమూలము కొడిసెపాపండ్లు వస అతివస మా రేడుపిందెలు వీటిని ఒక్కొక్క పలమును చూర్ణించి 4 పలములచొప్పున నెయ్యిని తేనెను కలిపి సేవింపవలయును. ఇయ్యది మూలరోగములు పైత్యరోగములు మున్నగువానిని పోగొట్టును. ఇయ్యది కుటజలేహము. దీనికి నెయ్యి తేనె మజ్జిగ నీళ్లు పాలు అనుపానము లు. రోగముల నన్నిటి నిది పోగొట్టును. ఇది అమ్లపిత్తము అతిసారము పాండురోగము అరోచకమును పోగొట్టును.

## కుటజరసక్రియా.

శ్లో. కుటజత్వచో విపాచ్యం శతపలమార్ద్రం మహేన్ద్రసలిలేన, యావ త్స్యా ద్రసం తద్ద్రవ్యం స్వరస స్తతో గ్రాహ్యః. 124. మోచారసః సమంగా ఫలినీ చ పలాంశిభ స్త్రిభి స్తై శ్చ, వత్సకబీజం తుల్యం చూర్ణీకృత మత్ర దాతవ్యమ్. 125. పూతోత్క్వథిత స్సాన్ద్రః సరసో దర్వీప్రలేపనో గ్రాహ్యః, మాత్రాకాలోపహితా రసక్రియైషా జయ త్యసృక్స్రావమ్ 126. ఛాగలీపయసా యుక్తా పేయా మండేన వా యథాగ్నిబలమ్, జీర్ణౌషధ శ్చ శాలీ న్పయసా ఛాగేన భుంజీత.127. రక్తగుదజాతిసారం శూలం సాసృగ్రుజో నిహన్త్యాశు, బలవచ్చ రక్త పిత్తం రసక్రియైషా హ్యుభయభాగమ్. 128.

పచ్చికొడిసెచెక్కను నూరుపలములు తెచ్చి ఆకాశము నుండిపడిన నీళ్లతో పక్వముచేసి నీరులేకుండా పోయినపిమ్మట అప్పుడు స్వరసమును తీసికొనవలయును. బూరుగువేరురసము మత్తవపులగరసము ప్రేంఖణరసము వీటి నొక్కొక్కపలమును కొడిసెపాలవిత్తనములను ఒకపలమును చూర్ణముచేసి పైదానిలో కలపవలయును. వస్త్రముతో వడియంగట్టి గట్టిపడిన పిమ్మట దానిని మాత్రను కాలమును అనుసరించి సేవింపవలయును. ఈరసక్రియ మూలరోగములను పోగొట్టును. మేకపాలలో చేర్చినదిగాని మంకముతో చేర్చినదిగాని అయినచో పేయను బలానుసారముగా నిందు త్రాగుట మంచిది. ఔషధము జీర్ణమైనపిమ్మట వరియన్నమును మేకపాలతో దినవలయును. రక్తాతిసారములు, అతిసారములు మున్నగునవన్నియును దీన నశించును.

### కుటజాదిఘృతము.

శ్లో. కుటజఫలవల్కల కేసర నీలోత్పలలోధ్రధాతకీకల్కైః, సిద్ధం ఘృతం విధేయం శూలే రక్తార్శసాం భిషజా. 129.

కొడిసెపాలపండుపట్ట నాగకేసరములు నల్లకల్వలు లొద్దుగ ఆరెపువ్వు వీటితో చేసిన కల్కముతో సిద్ధముచేసిన నేతిని రక్తార్శోరోగపు శూలలయందు వైద్యుడు ఉపయోగపెట్టవలయును.

### చాంగేరీఘృతము.

శ్లో. అవాక్పుష్పీ బలాదార్వీ పృశ్నిపర్ణీ త్రికంటకమ్, న్యగ్రోధోదుంబరాశ్వత్థ శృంగాశ్చ ద్విపలోన్మితాః. 130. కషాయ ఏష పేష్యస్తు జీవన్తీ కటురోహిణీ, పిప్పలీ పిప్పలీమూలం మరిచం దేవదారు చ. 131. కలింగం శాల్మలీపుష్పం వీరా చందనమంజనం, కట్ఫలం చిత్రకం ముస్తం ప్రియంగ్వతివిషే స్థిరా. 132. పద్మోత్పలానాం కింజల్కం సమంగా సనిదిగ్ధికా, బిల్వం మోచరసం పాఠా భాగాః స్యుః కార్షికాః పృథక్. 133. చతుఃప్రస్థశృతం ప్రస్థం కషాయమవతారయేత్, త్రింశత్పలాని తు ప్రస్థో విజ్ఞేయో ద్విపలాధికః. 134. సునిషణ్ణకచాంగేర్యోః ప్రస్థౌ ద్వౌ స్వరసస్య చ, సర్వైరేతై ర్యథోద్దిష్టైః ఘృతప్రస్థం విపాచయేత్. 135. ఏత దర్శస్స్వతీసారే త్రిదోషే రుధిరస్రుతౌ, ప్రవాహణే గుదభ్రంశే పిచ్ఛాసు వివిధాసు చ. 136. ఉత్థానే చాపి బహుశః శోథశూలగుదామయే,

అంత్రగ్రహే మూఢవాతే మందాగ్నా వరుచా వపి. 137. ప్రయోజ్యం విధివత్సర్పిః బలవర్ణాగ్నివర్ధనం, వివిధే ష్వన్నపానేషు కేవలం వా నిరత్యయం. 138.

బ్రహ్మదండి ముత్తవపులగము మ్రానిపసుపు కోలపొన్న త్రికటుకములు మట్టివేళ్లు మేడివేరు రావివేరు వీటిని రెండురెండు పలముల చొ॥ కషాయమును చేయవలయును. పిమ్మట లిప్పతీగె కటుకరోహిణి పిప్పళి మోడి మిరియములు దేవదారువు కొడిసెపాలవిత్తులు బూరుగుపువ్వు క్షీరకాకోలి రక్తచందనము రసాంజనము నేలగుమ్మడి చిత్రమూలము తుంగముస్తలు ప్రేంఖణము అతివస కరక్కాయ తామరకింజల్కములు నల్లకలువకింజల్కములు మంజిష్ఠము వాకుడువ్రేళ్లు మారేడుపిందెలు బూరుగురసము అగరుశొంఠి ఒక్కొక్కకర్షము చొప్పున గ్రహించి నాలుగుప్రస్థముల కషాయమును ఒకప్రస్థమునుగా దిగగాచి దించి పులిచెంచలము పులిచింతఆకుయొక్కరసమును రెండుప్రస్థములను కలిపి ఒకప్రస్థము నేతిని పక్వము చేయవలయును. ఈఘృతము మూలరోగములను త్రిదోషజము లగు రుధిరస్రావములను గదభ్రంశము పిచ్ఛ, మున్నగువానిని పోగొట్టి అగ్ని నుద్దీపింపఁ జేయును. అనేకవిధము లగు అన్నపానములయందు ఇయ్యది యొక్కటియే హితకర మగును.

## క్షారపాకము.

శ్లో. ప్రశస్తేఽహాని నక్షత్రే కృతమంగలపూర్వకమ్, కాలముష్కక మాహృత్య దగ్ధ్వా భస్మ సమాహరేత్. 139. ఆఢకం త్వేక మాదాయ జలద్రోణే పచే ద్భిషక్, చతుర్భాగావశిష్టేన వస్త్రపూతేన వారిణా. 140. శంఖచూర్ణస్య కుడపం ప్రక్షిప్య విపచే త్పునః, శనైశ్శనైస్తు మృద్వగ్నౌ యావ త్సాంద్రతను ర్భవేత్. 141. సర్జికాయవశూకాభ్యాం శుంఠీమరిచపిప్పలీ, వచాచాతివిషా చైవ హింగుచిత్రకయో స్తథా. 142. ఏషాం చూర్ణాని నిక్షిప్య పృథక్త్వేనాష్టమాషకమ్. దర్వ్యా సంఘట్టితం చాపి స్థాపయే దాయసే ఘటే. 143. ఏష వహ్నిసమః క్షారః కీర్తితః కాశ్యపాదిభిః. తోయే కాలకముష్కకస్య విపచే ద్భస్మాఢకం షడ్గుణే, పాత్రే లోహమయే దృఢే విపులధీర్దర్వ్యా శనై ర్ఘట్టనమ్. 144. దగ్ధ్వాగ్నౌ బహుశంఖనాభిశకలాన్ పూతావశేషే క్షిపేత్, యద్యేరండజ నాల మేష వహతి క్షారో

వరో వాశ్ఛతాత్. 145. ప్రాయస్త్రిభాగ శిష్టే స్మిన్ స్నుచ్ఛ్వపైచ్ఛిల్యరక్తతా, సంజాయతే తదా స్రావ్యం క్షారాంభో గ్రాహ్యమిష్యతే. 146. తుర్యేణాష్టమకేన షోడశభవేనాంశేన సంవ్యూహితో, మధ్యశ్శ్రేష్ఠ ఇతి క్రమేణ విహితః క్షారోదకాచ్ఛంఖకః. 147. నాతిసాంద్రో నాతితనుః క్షారపాక ఉదాహృతః, దుర్నామకాదౌ నిర్దిష్టః క్షారోయం ప్రతిసారణః. 148. వాసేయోయస్తు గుల్మాదౌ తం వారానేకవింశతిం, స్రావయేత్ షడ్గుణే తోయే కేచిదాహుశ్చతుర్గుణే. 149.

శుభవాసరమునందు నల్లపువ్వులమొక్కపుచెట్టు సమూలముగ నెండించి నువ్వుకంపతో తగులఁబెట్టి ఆభస్మమును తీసి యుంచికొనవలయును. ఒక ఆఢకమును ద్రవ్యమును ద్రోణపునీటిలో పక్వముచేసి నాలుగవపాలు మిగిలి యుండునప్పుడు వడియకట్టి ఒక ప్రస్థము శంఖచూర్ణమునందుపోసి చక్కగా నుడకబెట్టి సన్ననిసెగను గట్టిపడునంతవఱకు నుంచి సజ్జక్షారములను శొంఠిమిరియములు పిప్పళ్లు వస అతివస ఇంగువ చిత్రమూలము వీటిని చూర్ణములను ప్రత్యేకముగా నెన్మిదియెన్మిది మాషములచొప్పున వేసి కలియఁబెట్టి ఒక కుండలో నుంచి సేవింపవలయును. ఇయ్యది వహ్నిసమమగు క్షారము. కాశ్యపుఁడు మున్నగువారిచేత నిదికొనియాడఁబడినది.

పైని చెప్పఁబడిన మొక్కపుసమూలక్షారము ఒక ఆఢకప్రమాణము ఆరుఆఢకముల నీళ్లలోకలిపిధృడమయిన లోహపాత్రయందు కాచుచు తెడ్డుతోకలియపెట్టుచుండవలెను. అర్ధభాగము ఇగిరిన పిమ్మట వడియగట్టి అందు శంఖనాభులభస్మము చేర్చి దానిని కొంచెము ఆముదముతో కలిపి మొలలకు లేపనము చేసినయెడల యూడి పడిపోవును. దీనిని రెండునిమిషముల కాలముకన్న ఎక్కువ నుంచరాదు. సామాన్యముగ మూడవవంతు జలము మిగులునట్లు కాచిన క్షారోదకము గ్రహించతగినది. ఈక్షారోదకమునందు మూడవవంతు శంఖనాభుల చూర్ణము కలిపిన సంవ్యూహమనియు, ఎనిమిదవవంతు కలిపిన మధ్యమమనియు, పదహారవవంతు కలిపిన శ్రేష్ఠమనియు శంఖక్షారోదకమునకు పేరు. క్షారపాకము మిక్కిలి చిక్కగను మిక్కిలి పలుచగను నుండరాదు. దీనిని మూలరోగము యందు ప్రతిసారణక్షారముగ వాడనగును. గుల్మాదులందు క్షారోదకము వాడునెడల శంఖనాభుల చూర్ణము కలుపకుండ ఆరురెట్ల ఉదకము చేర్చి ఇరువదియొక్కమారులు వడపోసి ఇవ్వవలెను. కొందరు నాల్గురెట్లు నీళ్లు చేర్చవలె నని చెప్పుచున్నారు.

## క్షారసూత్రము.

శ్లో. భావితం రజనీచూర్ణైః స్నుహీచూర్ణం పునఃపునః, బంధనాత్సుదృఢం సూత్రం ఛినత్త్యర్శోభగందరం. 150. ప్రాగ్దక్షిణం తతో వామం పృష్ఠజం చాగ్రజం క్రమాత్, పంచతిక్తేన సంస్నేహ్య దహేత్ క్షారేణ వహ్నినా. 151. వాతజం శ్లేష్మజం చార్శః క్షారేణాస్రజపిత్తజే, మహంతి తనుమూలాని ఛిత్త్వైవ బలినో దహేత్. 152. చర్మకీలం తథా ఛిత్వా దహే దశ్వతరేణవా, పక్వజంబూపమో వర్ణః క్షారదగ్ధః ప్రశస్యతే. 153.

దారము నొకదానిని గాజుపాత్రలో నుంచి దానిపైని కొద్దిగా పసుపుచూర్ణమును వేసి కొండజెముడుపాలను దారము మునుగునట్లుగా పోయుచు ఏడుదినములు భావనచేయవలెను. ఇట్లు భావనచేయబడిన దారముతో మొలలను కట్టి బిగించవలెను. దీనివలన మొలలు తెగిపడిపోవును. ఇట్లు చేయునప్పుడు ముందుగా తూర్పువైపుననున్న మొలకును చివరను అండకోశమునకు ముందునుండు మొలకును దారము బిగించవలెను. ఒకటి తెగిపడి పిదప రెండవదానికి కట్టవలె గాని అన్నిమొలలకు ఒకేపర్యాయము కట్టకూడదని వృద్ధవైద్యమతము. వాతార్శస్సుకు శ్లేష్మార్శస్సుకు చికిత్స జేయునపుడు పంచతిక్తఘృతము ముందుగా కొన్నిదినములు సేవింపజేసి పిదపక్షారము, అగ్ని అనువానిచే చికిత్స జేయవలెను. రక్తార్శస్సునకు పిత్తార్శస్సునకు క్షారకర్మ యుక్తము. అగ్నికర్మ చేయరాదు. రోగి బలమందున్నయెడల మొలలను శస్త్రముచే ఛేదించి అగ్నికర్మను గాని క్షారకర్మను గాని ప్రయోగించనగును. క్షారముచే కాల్పబడిన మొలలు ఊడిపడిన తర్వాత పండిన నేరేడుపండుచాయ గలిగియున్నయెడల చక్కగా రోగము నివర్తియైనట్లు గ్రహించవలెను. లేనిచో మరల కొన్నిదినములవరకు క్షారలేపనముచేయుచుండవలెను. అండకోశమునకు ముందునుండు మొలలకు అగ్నికర్మచేసినయెడల షండత్వము తటస్థించును. గనుక దానికి క్షారాదికర్మలే యుక్తములు.

## ప్రతిసారణీయక్షారప్రయోగవిధి.

శ్లో. గోజీ శేఫాలికాపత్రైః రర్శ స్సంలిప్య లేపయేత్, క్షారేణ వాక్శతం తిష్ఠేత్ యంత్రద్వారం పిధాయ చ. 154. త చ్చాపనీయ వీక్షేత పక్వజంబూఫలోపమం, యది చ స్యా త్తతో భద్రం నోచేల్లింపే త్తథా పునః. 155. తత్తుషాంబు ప్లుతం సాజ్యం యష్టికల్కేన

లేపయేత్, స నిమ్నం తాళవర్ణాభం వహ్నిదగ్ధం స్థితాసృజం. 156 సిర్వాప్య మధుసర్పిభ్యాం వహ్నిసంజాతవేదనాం, సమ్యగ్దగ్ధేషు గోక్షీరీప్లక్ష చందనగైరికైః. 157. సామృతై స్సర్పిషా యుక్తై రాలేపం కారయే ద్భిషక్, ముహూర్త ముపవేశ్యా సౌ తోయపూర్ణేఽథభాజనే. 158. క్షార ముష్ణాం బునా పాయ్యం విబంధే సూత్రవర్చసోః, దాహే వస్తాదిజే లేపః శతధౌతేన సర్పిషా. 159. నవాన్నం మాషతక్రాది సేవ్యం పాకాయ జానతా, పిబే ద్వ్రణవిశుద్ధ్యర్థం వరాక్వాథం సగుగ్గులుం. 160. జీర్ణశాల్యన్న ముద్గాతిపథ్యం తిక్తాజ్యసైంధవం, రూఢసర్వవ్రణం వైద్యః క్షారం దత్వా చ వాసయేత్. 161. పిప్పల్యాద్యేన తైలేన సేవే ద్దీపనపాచనం,

బర్రెంక వావిలి ఆకులయొక్క రసముచేత మొలలను బాగుగా రుద్ది పైని క్షారమును లేపనము చేసి ఉన్నివస్త్రముచేత గుదస్థానము కప్పి నందునిమిషములకాల ముంచి తీసి వేయవలెను. అప్పుడా మొలలు పండిన నేరేడుపండుచాయ గలిగి యుండును. అట్లుండక భిన్నవర్ణముగా నున్నయెడల తిరిగి పైజెప్పినరీతిని క్షారప్రయోగము చేయవలెను. ఇట్లుచేయుటచేత మొలలు నల్లబడును. తరువాత మొలలందు మంట తగ్గుటకై యష్టిమధుకపుకల్కములో ఘృత కాంజికములు కలిపి పూయువలెను. దోషనివర్తియైన మొలలు నల్లనై యుండును. వానికి తేనె నెయ్యి పూసిన హరించును. లేక తపక్షీరి జువ్విపట్ట గైరిక రక్తచందనం తిప్పతీగ దీనికల్కమును నేతితో పూయవలెను. వేడిఅన్నమును మినుములు మజ్జిగ యివి ఇందు పథ్యములు. రోగము పూర్తిగ కుదిరినను మరకొంతకాలము పిప్పల్యాదితైలముతో అనువాసనవస్తి నిచ్చుచు దీపనపాచనాదులను సేవించుట యుక్తమని యందురు.

## అగ్నిముఖలోహము.

శ్లో. త్రివృ చ్చిత్రక నిర్గుండీ స్నుహీ ముండతికా జటాః, ప్రత్యేకశో ప్రపలికాం జలద్రోణే విపాచయేత్. 162. పలత్రయం విడంగస్య వ్యోషా త్కర్షత్రయం పృథక్, త్రిఫలాయాః పంచపలం శిలాజతుపలం న్యసేత్. 163. దివ్యౌషధిహతస్యాపి వైకంకతహతస్య వా, పలద్వాదశకం దేయ రుక్మం లౌహస్య చూర్ణితమ్. 164. పలై శ్చతుర్వింశతిభిః మధుశర్కరయో ర్యుతం, ఘనీభూతే సుశీతే చ దాపయే దవతారితే.

165. ఏత దగ్నిముఖం నామ చూర్ణమామాంతకరం పరం, సమమగ్నిం కరోత్యాశు కాలాగ్నిసమతేజసం. 166. పర్వతా అపి జీర్యంతి ప్రాశనాదస్య దేహినః, గురువృష్యాన్నపానాని పయోమాంసరసైః హితః. 167. దుర్నామపాండుశ్వయథు కుష్ఠప్లీహోదరాపహం, అకాలపలితం చైత దామవాత గుదామయం. 168. నస రోగోస్తి యం చాపి న నిహన్యాదిదం క్షణాత్, కరీరకాంజికాదీని కకారాదీని వర్జయేత్. 169. స్రవత్యతో న్యథాలోహం దేహాత్కిట్టం చ దుర్జరం.

తెల్లతెగడ చిత్రమూలము వావిలి జెముడు జటామాంసి ఎన్నిదెన్ని దిపలములు చొ|| ఒక ద్రోణము నీటిలో పక్వము చేయవలయును.

వాయువిడంగములు 3 పలములు శొంఠి మాషుకర్ణములు నల్లే మిరియములు పిప్పళ్ళు త్రిఫలములు అరపలము శిలాజిత్తు ౧ పలము నీటినికలిపి దివ్యౌషధులచేత హతముచేసిన రుక్మలోహచూర్ణమును 16 పలములును పైనీటిలోకలపవలయును. గట్టిపడిన పిమ్మట దింపి చల్లార్చి 24 పలముల తేనెను చక్కెరను కలిపి సేవింపవలయును.

ఇయ్యది అగ్నిముఖమను చూర్ణము. ఇది మూలరోగములను పోగొట్టును. అగ్నినుద్దీపింపచేయును. ఈచూర్ణమును సేవించినవారు రాళ్ళను భుజించినను జీర్ణముకాగల శక్తి నొందెదరు. బలకరములైన వృష్యములును అన్నపానములును పాలుమాంసము మున్నగునవి ఇందుహితములు. ఇయ్యది మూలరోగము పాండురోగము ప్లీహ కుష్ఠు అర్శ ఉదరరోగములు అసమయములలో తలనెరియుట, ఆమవాతము గుదామయము మున్నగు వానిని కూడ పోగొట్టును.

ఇంతయేల? దీనంగుదులని రోగమే లేదు. ఈయౌషధమును సేవించుకాలమునందు శరీరము కాంజికము మున్నగు కకారము మొదలుగల పదార్థములను త్యజింపవలయును. అట్లు త్యజింపనిచో దేహమునుండి లోహముయొక్క మైల స్రవింప నారంభించును. ఇయ్యది అత్యంతము దుర్భరమైనది.

## భల్లాతకలేహము.

శ్లో. చిత్రకం త్రిఫలా ముస్తం గ్రంధికం చవికా మృతా, హస్తిపిప్పల్యపామార్గ దండోత్పలకుశేరకాః. 170. ఏతాన్ చతుష్పలాన్ భాగాన్ జలద్రోణే విపాచయేత్, భల్లాతకసహస్రే ద్వే ఛిత్వా తత్రైవదాపయేత్. 171. తేన పాదావశేషేణ లోహపాత్రే పచే ద్భిషక్, తులార్థం తీక్ష్ణలోహస్య ఘృతస్య కుడపద్వయం. 172. తూత్రిషణం

త్రిఫలా వహ్ని సైంధవం బిడమౌద్భిదం, సౌవర్చలవిడంగాని పలికాం శాని కల్పయేత్. 173. కుడపం వృద్ధదారస్య తాలమూల్యా స్తథై వచ, సూరణస్య పలా న్యష్టౌ చూర్ణం కృత్వా వినిక్షిపేత్. 174. సిద్ధే శీతే ప్రదాతవ్యం మధునః కుడపద్వయం, ప్రాతరోభోజనకాలే చ తతః ఖాదే ద్యథాబలం. 175. అర్శాంసి గ్రహణీదోషం పాండురోగ మరో చకం, క్రిమిగుల్మాశ్మరీమేహాన్ శూలం చాశు వ్యపోహతి. 176. కరోతి శుక్రోపచయం వలీపలితనాశనం, రసాయన మిదం శ్రేష్ఠం సర్వరోగహ రం పరం, రసస్తు పాదిక స్తుల్యా విడంగ మరిచాభ్రకాః. 177. గంగాపా లంకజరసే ఖల్వయిత్వా పునఃపునః, ర క్తికమాత్రా గుదార్శోఘ్నీ వహ్ని రత్యర్థదీపనీ. 178. వేగావరోధ స్త్రీపృష్ఠయానముత్కటకాసనం, యథా స్వం దోషలం చాన్న మర్శసః పరివర్జయేత్. 179.

చిత్రమూలము త్రిఫలము తుంగముస్తలు చవ్యము తిప్పతీగె ఏనుగుపిప్పళ్లు ఉత్తరేణుము త్తవపులగము కమలములు తుమికి వీటిని నాల్గునాల్గు పలముల నొక్కద్రోణము నీటిలోపక్వము చేసి రెండువేల నల్లజీడివిత్తనములను ముక్కలు చేసి అందుపోసి నాలవపాలు మిగులునట్లుగా లోహపాత్రలో పక్వముఁ జేయవలయును. అందు అగస్థలా ప్రమాణము లోహభస్మము రెండుకుడపములు ఆవునెయ్యి త్రికటుకములు చిత్రమూలము సైంధవలవణబిడాలవణములు ఉద్భిదలవణము సౌవర్చలవణము వాయువిడంగములు ఇవిఒక్కొక్కపలము పెద్దమానుచెక్క నేలతాడి వీనిచూర్ణము ఒక్కొక్క కుడపముఅడవికందచూర్ణము 8 పలములు తేనె చేర్చి సేవించినచో సమస్తమూలరోగములు గ్రహణి పాండు అరోచకము క్రిమిగుల్మాశ్మరీమేహరోగములను హరించును. ఇది యుత్తమరసాయనము. శుద్ధియైన రసము 2 మాషములు వాయువిడంగములు మిరియాలు సిందూరము ఇవి ఆరేసిపలములు గంగరావియాకుల పసరులో నూరి ఏడుదినములు గుంజాప్రమాణము సేవించినచో అగ్నిదీపనము గల్గి మూలవ్యాధి హరించును. మలమూత్రాదుల వేగము నిరోధించుట, స్త్రీసంభోగము, స్వారిచేయుట, కఠినాసనములఁ గూర్చుండుట, విరుద్ధాహారసేవనము, ఇయ్యవిమూలవ్యాధిగలరోగికి పనికిరావని తెలియునది.

ఇది చక్రదత్తయందు అర్శోరోగాధికార ప్రకరణము ముగిసినది.



# ౬. అగ్నిమాంద్యాధికారము.



శ్లో. సమస్య రక్షణం కార్యం విషమే వాతనిగ్రహః,
తీక్ష్ణే పిత్తప్రతీకారో మందే శ్లేష్మవిశోధనమ్. 1

అవ. అగ్నిమాంద్యము నీప్రకరణమునఁ జెప్పుచున్నాఁడు.—

జఠరాగ్ని సమముగా నున్నయెడల తగ్గిపోకుండునట్లు రక్షణ సేయవలయును. హెచ్చుతక్కువలుగా నున్నయెడల వాతమును పోఁగొట్టవలయును. మిక్కిలి యధికముగా నున్నయెడల పిత్తమును పోఁగొట్టెడి చికిత్సలను చేయవలయును. మందముగా నున్నయెడల కఫమును పోఁగొట్టుటకు యత్నింపవలయును.

## హింగ్వష్టకచూర్ణము.

శ్లో. త్రికటుక మజమోదా సైంధవం జీరకే ద్వే,
సమధరణధృతానా మష్టమో హింగుభాగః. 2
ప్రథమకబలభుక్తం సర్పిషా చూర్ణమేతత్,
జనయతి జఠరాగ్నిం వాతరోగాం శ్చ హన్యాత్. 3

అవ. హింగ్వష్టకము చెప్పుచున్నాఁడు.—

శొంఠి, మిరియములు, పిప్పళ్లు, వాము, సైంధవలవణము, నల్లజీలకఱ్ఱ, తెల్లజీలకఱ్ఱలను సమానభాగములుగా తీసికొని ఎనిమిదవపాలు పొంగించిన ఇంగువను చేర్చికొని చూర్ణము చేయవలయును. ఈచూర్ణమును భోజనకాలమునందు మొదటిముద్దలో చేర్చికొని నేతితోఁగూడ భక్షించవలయును. ఇయ్యది జఠరాగ్నిని పుట్టించును. వాతరోగములను కూడ నశింపఁజేయును.

## శొంఠ్యాదిచూర్ణము.

శ్లో. సమయవశూక మహౌషధచూర్ణం లీఢం ఘృతేన గోసర్గే, కురుతే క్షుధాం సుఖోదకపీతం సద్యో మహౌషధం వైకమ్. 4. అన్నమండం పిబే దుష్ణం హింగుసౌవర్చలాన్వితమ్, విషమోఽపి సమస్తేన మందో దీప్యేత పావకః. 5. క్షుదోద్బోధనో వస్తివిశోధన శ్చ ప్రా

ణప్రద శ్శోణితవర్ధన శ్చ, జ్వరాపహారీ కఫపిత్తహంతా వాయుం జయే దష్టగుణో హి మండః. 6.

యవక్షారము, శొంఠి సమానభాగములు తీసికొని చూర్ణముచేసి ఆవునేతితో కలిపికొని ప్రాతఃకాలమునందు సేవించినయెడలగాని, కేవలము శొంఠిచూర్ణమును మాత్రమే తిని మంచితీర్థమును త్రాగినను గాని ఆకలి పుట్టును. పొంగించిన ఇంగువ, సౌవర్చలవణములను చేర్చిన అన్నపుగంజిని వేడివేడిగా త్రాగినయెడల హెచ్చుతగ్గులు గాను సమానముగాను మందముగాను నున్న జఠరాగ్ని నుద్దీపించును. (అనఁగా వృద్ధిపొందించు ననుట) ఈగంజికి ఈక్రింది ఎనిమిదిగుణములు కలవు. 1 ఆకలినిపుట్టించును, 2 వస్తులను నిర్మలము చేయును, 3 ప్రాణముల నిచ్చును, 4 రక్తమును వృద్ధిపొందించును, 5 జ్వరమును పోఁగొట్టును, 6 కఫమును పోఁగొట్టును. 7 పిత్తమును నశింపచేయును, 8 వాతమును జయించును.

## తీక్ష్ణాగ్ని చికిత్స.

శ్లో. నారీక్షీరేణ సంయుక్తాం పిబే దౌదుంబరీం త్వచమ్, ఆభ్యాం వా పాయసం సిద్ధం పిబే దత్యగ్ని శాంతయే. 7. యత్కించి ద్గురు మేధ్యం చ శ్లేష్మకారి చ భేషజమ్, సర్వం త దత్యగ్నిహితం భుక్త్వా ప్రస్వపనం దివా. 8. ముహుర్ముహు రజీర్ణేఽపి భోజ్య మస్యోపకల్పయేత్. నిరింధనోంతరం లబ్ధ్వా యథైనం న నిపాతయేత్. 9. విశ్వాభయాగుడూచీనాం కషాయేణ షడూషణమ్, పిబే చ్ఛ్లేష్మణి మందేగ్నౌ త్వక్పత్ర సురభీకృతమ్. 10. పంచకోలం సమరిచం షడూషణ ముదాహృతమ్.

మేడిచెక్కను కల్కప్రమాణముగ కల్కముచేసి చనుబాలతో కలిపి త్రాగవలెను. లేక మేడిచెక్కను చనుబాలు వీటితో తయారుచేయఁబడిన పాయసమునైనను త్రాగినయెడల అధికమగు జఠరాగ్ని తగ్గిపోవును. గురుత్వమును కల్గించునదియును, మేధ్యమును కఫమును కలిగించునదియు నగు నౌషధములు అన్నియును అత్యధికమగు జఠరాగ్నికి హితకరము లగును. ఇట్టులే భుజించి నిద్దురపోవుటయును హితకర మగును. జీర్ణముకాకయున్నప్పటికిని ఈరోగము గలవానికి మాటిమాటికి భోజనము పెట్టుచుండవలయును. ఇట్టిరోగులకు భోజనము సేయకున్నయెడల జఠరాగ్నికి తగినయాహుతిలేక, ప్రాణములనే హరింపఁజూచును. శొంఠి, కరకకాయ, తిప్పతీగ వీటిని కషాయము బెట్టి నాల్గవవంతు షడూషణ చూర్ణమువైచి త్రాగినయెడల శ్లేష్మము హరించి ఆకలిఁ బుట్టించును. దీనిని లవంగపుపట్ట, దాల్చినచెక్క వేసి పరిమళింపఁజేసి తీసికొనవచ్చును.

ఇట్లైన కఫముచే మందమైన అగ్ని దీపించును. పిప్పళ్లు, మోడి, చవ్యము నుద్రవ్యము, చిత్రమూలము, శొంఠి, మిరియములు ఇయ్యవి షడూషణము లని చెప్పఁబడును.

## హరీతక్యోగము.

శ్లో. హరీతకీ భక్ష్యమాణా నాగరేణ గుడేన వా, సైంధవోపహితా వాపి సాతత్యేనాగ్నిదీపనీ. 12. సింధూత్థపథ్యా మగధోద్భవ వహ్నిచూర్ణ ముష్ణాంబునా పిబతి యః ఖలు నష్టవహ్నిః, తస్యామిషేణ సఘృతేన పరం నవాన్నం భస్మీభవ త్యశనమాత్ర మిహా క్షణేన. 13. సింధూత్థ హింగుత్రిఫలాయమానీ వ్యోషై ర్గుడాంశై ర్గుడకా న్ప్రకుర్యాత్, తై ర్భక్షితై స్తృప్తి మివాప్నువన్నా భుంజీత మందాగ్ని రపి ప్రభూతమ్. 14. విడంగభల్లాతకచిత్రకామృడాః సనాగరా స్తుల్య గుడేన సర్పిషా, నిహంతి యే మందహుతాశనా నరాః భవంతి తే బాడబతుల్యవహ్నయః. 15. గుడేన శుంఠీ మథవోపకుల్యాం పథ్యాం తృతీయాం మథ దాడిమం వా, ఆమే ష్వజీర్ణేషు గుదామయేషు వర్చో విబంధేషు చ నిత్య మద్యాత్. 16. భోజనాగ్రే హితం హృద్యం దీపనం లవణార్ద్రకం, అగ్నిసందీపనం హృద్యం జిహ్వాకంఠవిశోధనమ్. 17.

అవ. అగ్నిదీపకములగు నౌషధములఁ జెప్పుచున్నాఁడు:—శొంఠితోగాని బెల్లముతోగాని సైంధవలవణముతోగాని కలిపిభక్షింపఁబడిన కరకకాయ ఎల్లప్పుడును జఠరాగ్నిని దీపింపఁజేయును. సైంధవలవణము కరకకాయ పిప్పళ్లు చిత్రమూలము వీటిని చూర్ణముచేసి దానిని వేఁడినీళ్లతో కూడ కలిపి అగ్నిమాంద్యము కలవాఁడు త్రాగినయెడల, నేయి మాంసములు చేర్చిన క్రొత్తయన్న మెనప్పటికిని ఒక్కక్షణములో భస్మమై పోవును. సైంధవలవణము, పొంగించిన ఇంగువ, కరకకాయ, తాడి, ఉసిరిక, ఓమము, శొంఠి, మిరియములు, పిప్పళ్లు వీని నన్నిఁటిని సమానభాగములను తీసికొని వీనియన్నిఁటితో సమానమగునట్లు బెల్లమును చేర్చి మాత్రలను చేయవలయును. ఈమాత్రల నగ్నిమాంద్యముగలరోగి భక్షించినయెడల మిక్కిలి ఆకలికలిగి భుజింపగలఁడు. వాయువిడంగములు నల్లజీడివిత్తనములు చిత్రమూలము తిప్పతీగ శొంఠియును పలముపలము తీసికొని వీనియన్నిఁటితో సమముగా బెల్లమును, నేతిలోకలిపి మాత్రలనుచేసి భక్షించినయెడల అగ్నిమాంద్యము గ రోగి బడబాగ్నితో సమమగు జఠరాగ్ని కలవాఁడగును. బెల్లముతో కూడ కలిపిన శొంఠినిగాని, లేక పిప్పళ్లనుగాని, కరకకాయచూర్ణమును గాని, దాడిమఫలమునుగాని, ఆమరోగములయందును, అజీర్ణరోగములయందును,

సైదస్థానపురోగములు కలిగినప్పుడును ప్రతినిత్యమును భక్షణచేయుచుండవలయును. భోజనమునకు ముందుగా వీనిని భుజింపవలయును. ఉప్పును, అల్లపుముక్కలును భోజనమునకు ముందుగాభక్షించిన జిహ్వాకంఠవిశోధనమును చేయును.

## శార్దూలకాంజికము.

శ్లో. కపిత్థబిల్వచాంగేరీ మరిచాజాజిచిత్రకైః, కఫవాతహరో గ్రాహీ ఖండో దీపనపాచనః. 18. పిప్పలీం శృంగబేరం చ దేవదారు సచిత్రకమ్, చవికాం బిల్వపేశీం చ అజమోదాం హరీతకీమ్. 19. మహౌషధం యమానీం చ ధాన్యకం మరిచం తథా, జీరకంచాపి హింగుం చ కాంజికం సాధయే ద్భిషక్. 20. ఏష శార్దూలకో నామ కాంజికోఽగ్నిబలప్రదః, సిద్ధార్థతైలసంభృష్టో దశరోగాన్ వ్యపోహతి. 21. కాసం శ్వాసమతీసారం పాండురోగం సకామలమ్, ఆమం చ గుల్మశూలం చ వాతగుల్మం సవేదనమ్. 22. అర్శాంసి శ్వయథుం చైవ భుక్తే పీతే చ సాత్మ్యతః, క్షీరపాకవిధానేన కాంజికస్యాపి సాధనమ్. 23.

వెలగపండు, బిల్వము, మజ్జిగ పులిచింత, మిరియములు, తెల్లజీలకఱ్ఱ, చిత్రమూలము వీటిని చూర్ణముగాచేసి సేవించిన జఠరాగ్ని నుద్దీపింపఁజేయును. అతిగా మలము వెడలుచున్న యెడల బంధించును. అన్నము నరిగించును. కఫమును వాతమును గూడ పోఁగొట్టును. పిప్పళ్లు, అల్లము, దేవదారు, చిత్రమూలము, చెవ్యము, మారేడుపిందెలు, వాము, కరకకాయలు, శొంఠి, అజామోదము, ధనియములు, మిరియములు, జీలకఱ్ఱ, ఇంగువ వీటితో గంజిని కాచవలయును. ఇయ్యది శార్దూలకకాంజికమని పిలువఁబడెడి గంజి. ఇది జఠరాగ్నిని వృద్ధిపొందించును. బలము నిచ్చును. తెల్లఆవనూనెతో కలిసినయెడల నీగంజి ఈక్రిందిపదిరోగములను పాఱఁదోలును. దగ్గు, ఉబ్బసము, అతిసారము, పాండురోగము, కామెరలు, ఆమము, గుల్మరోగము, శూల, వాతగుల్మము, మూలరోగము, శోఫ వీటిని దూరముగా పాఱద్రోలును, కాని రోగులు తమతమ శరీరప్రకృతుల ననుసరించి అన్నపానాదులను తీసికొనవలయును. పాలను పాకముచేయురీతితోనే గంజిని కూడ చేసికొనవలయును.

## అగ్నిముఖచూర్ణము.

శ్లో. హింగుభాగో భవే దేకో వచా చ ద్విగుణా భవేత్, పిప్పలీ త్రిగుణా చైవ శృంగబేరం చతుర్గుణమ్. 24. యమానికా పం

చగుణా షడ్గుణా చ హారీతకీ, చిత్రకం సప్తగుణితం కుష్ఠం చాష్టగుణం భవేత్. 25. ఏత ద్వాతహరం చూర్ణం పీతమాత్రం ప్రసన్నయా, పిబే ద్దధ్నా మస్తునా వా సురయా కోష్ణవారిణా. 26. సోదావర్త మజీర్ణం చ ప్లీహాన ముదరం తథా, అంగాని యస్య శీర్యంతే విషం వా యేన భక్షితమ్. 27. అర్శోహరం దీపనం చ శ్లేష్మఘ్నం గుల్మనాశనమ్, కాసం శ్వాసం నిహం త్యాశు తథైవ యక్ష్మనాశనమ్. 28. చూర్ణ మగ్నిముఖం నామ న క్వచి త్ప్రతిహన్యతే.

పొంగించిన ఇంగువ ఒకభాగము, వస రెండుభాగములు, పిప్పళ్లు 2 భాగములు, అల్లము నాల్గుభాగములు, వాము అయిదుభాగములు, కరకకాయ ఆరుభాగములు, చిత్రమూలము ఏడుభాగములు, చెంగల్వకోష్టు ఎనిమిదిభాగములు తెచ్చి చూర్ణముచేసి దీనిని మద్యములో కలిపి త్రాగినయెడల వాతరోగములు హరించును. లేకపోయినచో పెరుగు మీఁగడపైగలనీళ్లు, మద్యము, వేడినీళ్లు వీటిలో ఏదైన నొకదానితో చేర్చి త్రాగవలయును. ఉదావర్తమును, అజీర్ణము, పొడలరోగము, ఉదరరోగమును, కాళ్లు చేతులను ఎగలాగురోగమును, విషభక్షణమువలన వచ్చినరోగములను, మూలరోగమును నశింపఁజేయును. జఠరాగ్నిని పెంపొందించును. కఫమును వాతమును గుల్మములను పోఁగొట్టును. ఇయ్యది అగ్నిముఖమను పేరుగల చూర్ణము. ఎట్టి విషమ మగు స్థలమున నైనను దీనికి ఎదురు లేదు.

## పానీయ భక్త ఘుటిక.

రసోఽర్ధభాగిక స్తుల్యా ద్విడంగమరిచాభ్రకాః. 29
భక్తోదకేన సంమర్ద్య కుర్యా ద్గుంజాసమాం గుటీమ్,
భక్తోదకానుపానైకా సేవ్యా వహ్ని ప్రదీపనీ. 30
వార్యన్నభోజనం చాత్ర ప్రయోగే సాత్మ్య మిష్యతే.

పాదరసము సగభాగము, వాయువిడంగములు, మిరియములు, కృష్ణాభ్రకసింధూరము ఇవి సమానభాగములను తెచ్చి అన్నిఁటిని బియ్యపుకడుగుతో నూరి గురిగింజ లంతంతగా మాత్రను కట్టవలయును. బియ్యపుకడుగు అనుపానముతో వీనిని సేవించిన జఠరాగ్నిని వృద్ధిపొందించును. నీటిలోనుంచిన యన్నము ఈయౌషధము సేవించుకాలమున అత్యుత్తమ మని వైద్యు లందఱి యభిప్రాయము.

## బృహదగ్నిముఖచూర్ణము.

ద్వౌక్షారౌ చిత్రకం పాఠా కరంజలవణాని చ. 31. సూక్ష్మైలాపత్రకం భార్గీక్రిమిఘ్నం హింగుపౌష్కరం, శఠీ దార్వీ త్రివృన్ముస్తం వచా సేంద్రయవా తథా. 32. ధాత్రీ జీరకవృక్షామ్లం శ్రేయసీ చోపకుంచికా, అమ్లవేతస మమ్లీకా యమానీ సురదారు చ. 33. అభయాతివిషా శ్యామా హవుషారగ్వధం సమం, తిలపుష్కరశిగ్రూణాం కోకిలాక్షపలాశయోః. 34. క్షారాణి లోహకిట్టం చ తప్తం గోమూత్రసేచితం, సమభాగాని సర్వాణి సూక్ష్మచూర్ణాని కారయేత్. 35. మాతులుంగ రసేనైవ భావయే చ్చ దినత్రయం, దినత్రయం చ శుక్తేన చార్ద్రకస్వరసేన చ. 36. అత్యగ్నికారకం చూర్ణం ప్రదీప్తాగ్నిసమప్రభం, ఉపయుక్తవిధానేన నాశయ త్యచిరా ద్గదాన్. 37. అజీర్ణక మథో గుల్మాన్ ప్లీహానం గుదజాని చ, ఉదరా ణ్యంత్రవృద్ధిం చ అష్ఠీలాం వ తశోణితం. 38. ప్రణుద త్యుల్బణాన్ రోగాన్ నష్టం వహ్నిం చ దీపయేత్, సమస్తవ్యంజనోపేతం భక్తం దత్వా సుభాజనే. 39. దాపయే దస్య చూర్ణస్య బిడాలపదమాత్రకం, గోదోహ మాత్రాత్త త్సర్వం ద్రవీభవతి సోష్మకం. 40.

యవక్షారము సజ్జక్షారము చిత్రమూలము అగరుశొంఠి కానుగ పంచలవణములు చిన్నఏలకులు జాపత్రి గంటుభారంగి వావింట ఇంగువ పుష్కరమూలము కచ్చూరము మ్రానిపసపు తెల్లతెగడ తుంగముస్తలు వస కొడిశపాలవిత్తులు ఉసిరిక జీలకఱ్ఱ చింతపండు ఏనుగపిప్పళ్లు కరకకాయ పెద్దజీలకఱ్ఱ పుల్లప్రబ్బలి ఇలివింద ఓమము దేవదారు కరక అతివస నల్లతెగడ ప్రబ్బ రేలచెక్క వీటిని సమానభాగములనుగా తీసికొని నువ్వులు మొక్కపుచెక్క మునగచెక్క నీటిగొబ్బివిత్తులు మోదుగు వీటియొక్క క్షారమును చేర్చి వెచ్చపెట్టి ఆవుపంచితముతో శుద్ధిచేసిన సిద్ధమండూరము వీటిని సమానభాగములనుగా చేసికొని చూర్ణము చేసి, మాదీఫలపురసముతో మూడు రోజులు భావన కట్టవలయును. మూడురోజులు ముక్తసంజ్ఞకమను గంజితోను అల్లపురసముతోను మఱి మూఁడు రోజులును భావన చేయవలయును. ఇయ్యది అత్యగ్నికారకచూర్ణ మనంబడు. భగభగమని మండెడి యగ్నితో సమాన మైనది. క్రమముగా పక్వముచేసినచో రోగముల నతిశీఘ్రముగా పోఁగొట్టఁగలదు. అజీర్ణము, గుల్మ

వ్యాధి, పాదలరోగము, పీనస, మూలరోగము మున్నగు గుదస్థానజనితము లగురోగములను, ఉదరరోగము, అంత్రవృద్ధి, అష్ఠీల వాతరక్తము మున్నగు హెచ్చినరోగములను నశింపఁజేయును. జఠరాగ్నిని కూడ వృద్ధి నొందించును. అన్ని వ్యంజనములతోటి మంచిపాత్రలో నన్నము పెట్టి ఈచూర్ణము నొక్కతులము ప్రమాణము వేయవలయును. దీనిచేత ఆవును పాఁపితుకునంతసేపులో వెచ్చగా ద్రవముగా తిన్నయాహారమంతయును జీర్ణమగుచున్నది.

## భాస్కరలవణచూర్ణము.

శ్లో. పిప్పలీ పిప్పలీమూలం ధాన్యకం కృష్ణజీరకం, సైంధవం చ బిడం చైవ పత్రం తాలిసకేసరం. 41. ఏషాం ద్విపలికాన్ భాగాన్ పంచ సౌవర్చలస్య చ, మరిచాజాజిశుంఠీనా మేకైకస్య పలం పలం. 42. త్వగేలే చార్థభాగే చ సాముద్రా త్కుడపద్వయం, దాడిమా త్కుడపం చైవ ద్వే పలే చామ్లవేతసాత్. 43. ఏత చ్చూర్ణీకృతం శ్లక్ష్ణం గంధాఢ్య మమృతోపమం, లవణం భాస్కరం నామ భాస్కరేణ వినిర్మితం. 44. జగత స్తు హితార్థాయ వాతశ్లేష్మామయాపహం, వాతగుల్మం నిహ న్త్యేత ద్వాతశూలాని యాని చ. 45. తక్రమస్తుసురాసీధుశుక్తకాంజికయోజితం, జాంగలానాం తు మాంసేషు రసేషు వివిధేషు చ. 46. మందాగ్నే రశ్నత శ్శక్తో భవే దాశ్వేవ పావకః, అర్శాంసి గ్రహణీ దోష కుష్ఠామయ భగంధరాన్. 47. హృద్రోగ మామదోషాం శ్చ వివిధా నుదరస్థితాన్, ప్లీహాన మశ్మరీం చైవ శ్వాస కాసోదర క్రిమీన్. 48. విశేషత శ్శర్కరాదీన్ రోగా న్నానావిధాం స్తథా, పాండురోగాం శ్చ వివిధా న్నాశయ త్యశని ర్యథా. 99.

భాస్కరలవణమును చెప్పుచున్నాఁడు:—పిప్పళ్లు, ధనియములు, నల్లజీలకఱ్ఱ, సైంధవలవణము, బిడాలలవణము, ఆకుపత్రి, తాడిసపత్రి, నాగకేసరములు ఇవియన్నియును రెండురెండు పలములును, సౌవర్చలవణము అయిదుపలములును మిరియములు జీలకఱ్ఱ శొంఠి ఇవి ఒక్కొక్కపలములును, లవంగపుపట్ట ఏలకులు అర్ధపలముచొ॥ సముద్రలవణము ౨ కుడవములును, దానిమ్మబెరడు ఒకకుడవము, పులిప్రబ్బలి రెండుపలములును వీటిని కలిపి చూర్ణము చేసి పరిమళవంతముగా చేసిన యెడల అమృతముతో సమానమగుచున్నది. ఇత్యాది భాస్కరలవణము. భాస్కరుఁడు దీనిని నిర్మించెను. సమస్తలోకములకు శుభము లొదవుటకు వాతశ్లేష్మరోగముల హరించు దీనిని సృజించెను.

ఇయ్యది వాతముచేత నగు గుల్మరోగమును వాతశూలములను పోఁగొట్టును. ఆవుపాలు పెరుగుపై తేరినతేట మద్యము శుక్తము గంజి వీటిలో నైదైన నొకదాని నిందు చేర్చి కొనవలయును. అడవిజంతువులమాంసముతోటి నానావిధము లగు రసములయందు కలిపి భుజించినయెడలను అగ్నిమాంద్యముగల రోగికి బడబాగ్నివలె జఠరాగ్ని వృద్ధి పొందును. మూలరోగములు, గ్రహణులు, కుష్ఠు, భగందరవ్రణములు, కడుపునొప్పి, ఆమదోషము, పాదలరోగము, ఉదరరోగములును, ప్లీహ, దగ్గు, నులిపురుగులు పడుట మొదలగువానిని విశేషించి శర్కరమున్నగు ననేకవిధములగు రోగములను పిడుగువలె నశింపచేయును.

## అగ్నిఘృతము.

శ్లో. పిప్పలీ పిప్పలీమూలం చిత్రకో హస్తిపిప్పలీ, హింగు చ వ్యాజమోదా చ పంచైవ లవణాని చ. 50. ద్వౌక్షారౌ హాపుషా చైవ దద్యా దర్ధపలోన్మితాన్, దధికాంజికశుక్తాని స్నేహమాత్రసమాని చ. 51. ఆర్ద్రికస్వరసప్రస్థం ఘృతప్రస్థం విపాచయేత్, ఏత దగ్ని ఘృతం నామ మందాగ్నీనాం ప్రశస్యతే. 52. అర్శసాం నాశనం శ్రేష్ఠం తథా గుల్మోదరాపహం, గ్రంథ్యర్బుదా పచీకాసకఫమేదో౽నిలాం నపి. 53. నాశయే ద్గ్రహణీదోషం శ్వయథుం సభగంధరం, యే చ వస్తిగతారోగా యే చ కుక్షిసమాశ్రితాః. 54. సర్వాం స్తా న్నాశయ త్యాశు సూర్య స్తమ ఇ వోదితః.

పిప్పళ్లు, మోడి, చిత్రమూలము, ఏనుగపిప్పళ్లు, ఇంగువ, ఓమము, చవ్యము, అజామోదపువిత్తనములు, పంచలవణములు, యవక్షారము, సజ్జక్షారము, ప్రబ్బి ఇవియన్నియు అర్ధపలము చొప్పునను, పెరుగు గంజి శుక్లము కాంజికము ఇవి నేతితో సమభాగములుగాను చేర్పవలయును. తరువాత అల్లపురసము 16 పలములు నెయ్యిప్రస్థమును కలిపి వండవలయును. ఇయ్యది అగ్నిఘృత మనఁబడను. అగ్నిమాంద్యపు రోగుల కుత్తమ మగు మందు. మూలరోగములను పోఁగొట్టును. ఇయ్యది గుల్మములను, ఉదరరోగములను, గ్రంథులు, అర్బుదము, అజీర్ణము, దగ్గు, కఫము, వాతము, గ్రహణి, వాపు, భగందరము, వస్తిరోగమును, ఉదరరోగము మొదలగు నన్నింటిని సూర్యుఁడు చీకటులఁబోలె నాశనమును చేయును.

### ముస్తషట్పలకఘృతము.

శ్లో. పలికైః పంచకోలైస్తు ఘృతం ముస్తచతుర్గుణం. 55
సక్షారైః సిద్ధమల్పాగ్నిం కఫగుల్మం వినాశయేత్.

పిప్పళ్లు, మోడి, చెవ్యము, చిత్రమూలము, శొంఠి, యవక్షారము ఒక్కొక్కపలము చొ॥ ఇవితీసికొని నెయ్యి, పెరుగుపైదేట 16 పలములు చొ॥ చేర్చి నేతిని వండి సిద్ధముచేయవలసినది. ఈఘృతము అగ్నిమాంద్యమును కఫమును గుల్మరోగములను నాశనము చేయును.

### బృహదగ్నిముఖఘృతము.

శ్లో. భల్లాతకసహస్రం తు జలద్రోణే విపాచయేత్. 56. అష్టభాగావశేషం చ కషాయమవతారయేత్, ఘృతప్రస్థం సమాదాయ కల్కానీమాని దాపయేత్. 57. త్ర్యూషణం పిప్పలీమూలం చిత్రకో హస్తిపిప్పలీ, హింగుచవ్యాజమోదా చ పంచైవ లవణాని చ. 58. ద్వౌ క్షారౌ హపుషా చైవ దద్యాదర్ధపలోన్మితాన్, దధికాంజికశుక్తాని స్నేహమాత్రా సమాని చ. 59. ఆర్ద్రికస్వరసం చైవ శోభాంజనరసం తథా, తత్సర్వమేకతః కృత్వా శనైర్మృద్వగ్నినా పచేత్. 60. ఏతదగ్నిఘృతం నామ మందాగ్నీనాం ప్రశస్యతే, అర్శసాం నాశనం శ్రేష్ఠం మూఢవాతానులోమనం, 61. కఫవాతోద్భవే గుల్మే శ్లీపదే చ దకోదరే, శోథం పాండ్వామయం కాసం గ్రహణీం శ్వాసమేవ చ. 62. ఏతాన్వినాశయత్యాశు సూర్యస్తమ ఇవోదితః.

నల్లజీడివిత్తనములను శుద్ధిచేసి వానిని వైదువందలను తెచ్చి ఒకద్రోణపరిమితమగు నీటిలోవైచి వండవలయును. ఎనిమిదవపాలు నీరు మిగిలియుండఁగాఁ దూచి కషాయమును దిపవలయును. తరువాత ఒకప్రస్థము నేయిని తెచ్చి ఈక్రింద చెప్పఁబోవు నౌషధములతోఁ కలిపివండవలయును. శొంఠి, మిరియములు, పిప్పళ్లు, మోడి, చిత్రమూలము, ఏనుగుపిప్పళ్లు, ఇంగువ, చెవ్యము, అజామోదవిత్తనములు, పంచలవణములు, సజ్జక్షారము, యవక్షారము ప్రబ్బిలి నన్నింటిని అర్ధపలము చొ॥ చేర్పవలయును పెరుగు గంజి. కాంజికము శుక్తము, అల్లపురస్వరసము తైలముతో సమానమాత్రములనుగా చేర్పవలయును. అల్లపురసము, మునగచెక్కరసము తీసి అందు కలపవలయును. వీటిన న్నింటిని చేర్చి మెల్లగా సన్ననిసెగను వండవలయును. ఇది బృహదగ్నిముఖఘృతము.

అగ్నిమాంద్యమున కుత్తమౌషధము. మూలరోగములకు నాశకారి. మూఢవాతములలో ననుకూలమును గల్గించును. కఫవాతములవలనఁ బుట్టిన గుల్మములను శ్లీపదములను దకోదరములను వాపును పాండురోగమును దగ్గును గ్రహణిరోగములను శ్వాసమును ఇయ్యది మిగుల శీఘ్రముగా నుదయించినసూర్యుఁడు చీకటుల నశింపఁజేయునట్లు నశింపఁజేయును,

## క్షారగుడము.

శ్లో. ద్వే పంచమూలే త్రిఫలా మర్కమూలం శతావరీం. 63. దంతీం చిత్రక మాస్ఫోతాం రాస్నాం పాఠాం సుధాం శఠీం, పృథగ్దశ పలా న్భాగా న్దగ్ధ్వా భస్మ సమావపేత్. 64. త్రిస్సప్తకృత్వ స్తద్భస్మ జలద్రోణేన గాలయేత్, తద్రసం సాధయే దగ్నౌ చతుర్భాగావశేషితం. 65. తతో గుడతులాం దత్వా సాధయే న్మృదునాగ్నినా, సిద్ధం గుడం తు విజ్ఞాయ చూర్ణా నీమాని దాపయేత్. 66. వృశ్చికాలీం ద్వికాకోల్యా యవక్షారం సమావపేత్, ఏతే పంచకలా భాగాః పృథక్పంచ పలాని చ. 67. హరీతకీం త్రికటుకం సర్జికాం చిత్రకం వచాం, హింగ్వమ్లవేతసాఖ్యాం చ ద్వే పలే తత్ర దాపయేత్. 68. అక్షప్రమాణాం గుటికాం కృత్వా ఖాదే ద్యథాబలం, అజీర్ణం జరయత్యేష జీర్ణే సందీపయ త్యపి. 61. భుక్తం భుక్తం చ జీర్యేత పాండుత్వమపకర్షతి, ప్లీహార్శశ్శ్వయథుం చైవ శ్లేష్మకాస మరోచకం. 70. మందాగ్నివిషమాగ్నీనాం కఫే కంఠోరసిస్థితే, కుష్ఠాని చ ప్రమేహాంశ్చ గుల్మం చాశు నియచ్ఛతి. 71. ఖ్యాతః క్షారగుడో హ్యేష రోగయుక్తే ప్రయోజయేత్.

దశమూలములు, త్రిఫలములు, జిల్లేడువేఱు, పెద్దపిల్లిపీచర, తెల్లదింటెన, చిత్రమూలము, అనంతమూలము, సన్నరాష్ట్ర, అగరుశొంఠి, కాకజెముఁడు, కచూరములు వీటిని అన్నిఁటిని పదేసిపలములు తీసికొని కాల్చి బూడిదచేసి ఇరువదియొక్కమారు ఒకద్రోణము నీటిలోకలిపి వస్త్రకాళితము పట్టవలయును. ఆరసమును పొయిపై బెట్టి కాచి నాల్గవభాగము నీరు మిగిలియుండఁగా ఒకద్రోణపు బెల్లము నందుచేర్చి సన్నని సెగను వండవలయును, చక్కఁగా పక్వమైనపిమ్మట పైచూర్ణము నిందులో కలపవల

యును. తేలుమాడిచెట్టు కాకోలి క్షీరకాకోలి యవక్షారము వీటినిగూడ చేర్చి అన్నిం టిని ఐదైదుపలములను తీసికొనవలయును. కరక్కాయ శొంఠి మిరియములు పిప్పళ్లు సజ్జక్షారము చిత్రమూలము వస వీనిని అన్నింటిని 5 పలములు చొ|| ఇంగువ పుల్లప్రబ్బలి 2 పలములుతీసి కలపవలయును. ఇత్యాది అజీర్ణమును పోగొట్టును. జీర్ణమగుచున్న యెడల నగ్నిని పెంపొందించును. తినినమీఁదట నెయ్యిమొదలగు పదార్థముల భక్షించుచుండినను జీర్ణింపఁజేయును. పాండురోగములను పాణద్రోలును. సొడలు వాపు దగ్గు అరోచకము అగ్నిమాంద్యము విషమాగ్ని గొంతుకలోని కఫము, కండెలలోని కఫమును అన్నివిధము లైన కుష్ఠురోగములును, అన్నిතెగల మేహములును, కడుపులోని బల్లలును, దీనివలన నశించిపోవును. ఇయ్యది క్షారగుడ మని చెప్పఁబడును. దీనిని పైజెప్పినట్టిరోగికి మాత్ర మే ఇయ్యవలయును.

## నాసారోగములకు చిత్రకగుడము.

శ్లో. నాసారోగే విధాతవ్యా యోగా చిత్రకహరీతకీ. 72. వినా ధాత్రీరసం సోఽస్మిన్ ప్రోక్తశ్చిత్రగుడోఽగ్నిదః, వచా లవణతోయేన వాంతి రామే ప్రశస్యతే. 73. అన్నం విదగ్ధం హి నరస్య శీఘ్రం శీతాంబునా వై పరిపాక మేతి, తద్ధ్యస్య శైత్యేన నిహంతి పిత్తమాక్లేదిభావాచ్చ నయ త్యథస్తాత్. 74. విదహ్యతే యస్య తు భుక్తమాత్రం దహ్యేత హృత్కోష్ఠగలం చ యస్య, ద్రాక్షాసితామాక్షికసంప్రయుక్తాం లీఢ్వా భయాం వై స సుఖం లభేత. 75. హరీతకీధాన్యతుషోదసిద్ధాం సపిప్పలీసైంధవహింగుయుక్తాం, సోంగారధూమం భృశమప్యజీర్ణం విజిత్య సద్యో జనయేత్ క్షుధాం చ. 76. విష్టబ్ధే స్వేదనం పథ్యం పేయం చ లవణోదకం, రసశేషే దివాస్వప్నోలంఘనం వాతవర్జనం. 77. వ్యాయామప్రమదాధ్వవాహనరత క్లాంతానతీసారిణః, శూలశ్వాసవత స్తృషాపరిగతాన్ హిక్కామరుత్పీడితాన్. 78. క్షీణాన్ క్షీణకఫాన్ శిశూన్మదహతా న్వృద్ధా న్రసాజీర్ణినో, రాత్రౌ జాగరితాం స్తథా నిరశనా న్కామం దివా స్వాపయేత్. 79.

నాసారోగములను చెప్పునప్పుడు చిత్రకహరీతకి యని చెప్పఁబడినదానినే ఉసిరికరసములేకుండ సిద్ధముచేసినచో చిత్రకగుడ మనఁబడును. ఇయ్యది జఠరాగ్నిని దీపిం

పజేయును. వస కలిపిన ఉప్పునీటితో ఆమమునందు వాంతి చేయించుట శ్రేయము. మనుజునికి భక్షించిన అన్నము అరుగకపోయినచో చల్లని నీటిని త్రాగవలయును. ఇయ్యది శీఘ్రముగా జీర్ణింపఁజేయును. ఇయ్యది చల్లదనముచేత ఇట్టిరోగియొక్క పైత్యము నణంచును. శ్రమను కష్టములేక తగ్గించును.

అన్నము తినగానే అధికముగా దాహము గలిగెడివానికిని, గుండెలు కోష్ఠము గొంతు మండికొని పోవుచున్నట్లున్నవానికిని, ద్రాక్ష చక్కెర తేనె కరకకాయలను చేర్చి నూరికొని నాకినయెడల సుఖము కలుగును. ధనియములు యవలు వీటిగంజితో నుడకబెట్టఁబడిన కరక్కాయలో పిప్పళ్లు సైంధవలవణమును కలిపి భక్షించినయెడల వెక్కిళ్లు పొగవెడలినట్లుండెడి యజీర్ణమును నశించి, శీఘ్రముగా నాకలి యగును. అజీర్ణము స్థిరముగా నిలిచియున్నచో చెమటపట్టునట్లు చేయుట మంచిది. ఉప్పుకలిపికొని నీటిని త్రాగవలయును. రసశేష మగు నజీర్ణములకు పగలుపరుండుట, లంఘనముచేయుట, వాతమును విడిచిపెట్టుట యనునివి పథ్యములు. ఈయౌషధమును సేవించునపుడు పనిచేయుట, స్త్రీలపొందు, దారినడచుట, సవారిచేయుట అనువీటివలనఁ బడలిన అతిసారరోగులను శూలము, శ్వాస, దప్పిక, వెక్కిళ్లు, వాతము వీటివలన బాధపడువారలను, చిక్కిపోయినవారలను, కఫము క్షీణించినవారలను, పిల్లలను, మదముచేతఁగృశించినవారలను, ముదుసలులను, రసావశేషముగల అజీర్ణరోగులను రాత్రులు మేలుకొనువారలను, ఉపవాస మున్నవారలను వారి ఇష్టమువచ్చినంతసేపు పగలు నిద్రపోనీయవలయును.

## అజీర్ణమునకు ప్రతిక్రియ.

శ్లో. ఆలిప్య జఠరం ప్రాజ్ఞో హింగుత్ర్యూషణసైంధవైః, దివాస్వప్నం ప్రకుర్వీత సర్వాజీర్ణప్రణాశనమ్. 80. ధాన్యనాగరసిద్ధం తు తోయం దద్యా ద్విచక్షణః, ఆమాజీర్ణప్రశమనం దీపనం వస్తిశోధనం. 81. పథ్యాపిప్పలిసంయుక్తం చూర్ణం సౌవర్చలం పిబేత్, మస్తు నోష్ణోదకేనాథ బుద్ధ్వా తోషగతిం భిషక్. 82. చతుర్విధమజీర్ణం చ మందానిల మథా రుచిం, ఆధ్మానం వాతగుల్మం చ శూలం చాశు నియచ్ఛతి. 83. భవే దజీర్ణం ప్రతి యస్య శంకా స్నిగ్ధస్య జంతో ర్బలినో౽న్నకాలే, పూర్వం సశుంఠీ మభయా మశంకః సంప్రాశ్య భుంజీత హితం హితాశీ. 84. కించి దామేన మందాగ్ని రభ

యాగుడనాగరం, జగ్ధ్వా తక్రేణ భుంజీత యుక్తేనాన్నం షడూషణైః. 84.

ఇంగువ, శొంఠి, మిరియములు, పిప్పళ్లు, సైంధవలవణము వీటితో కడుపుపైని పట్టువేసికొని పగటివేళ పరుండినయెడల నన్ని తెఱఁగులగు నజీర్ణములును నశించును. ధనియములు శొంఠి వీటితో పక్వముచేయఁబడిన కషాయమును వైద్యుఁడొసఁగినయెడల ఆమసంబంధము లగు నజీర్ణములు హరించును. అగ్ని ఉద్దీపించును. వస్తిని అనగా పొత్తికడుపును చక్కగా శోధించును. కరక కాయ పిప్పళ్లు సౌవర్చలవణము వీటిని సమభాగములుగా చూర్ణముచేసి పెరుగుపైతేటతోటి గాని, లేక వేడినీళ్లతోగాని దోషానుసారముగా పుచ్చుకొనవలయును. ఇది అగ్నిమాంద్యము అరుచి గుడగుడమని ధ్వనిపుట్టుట వాతగుల్మములు అనువానిని నాలుగువిధములగు నజీర్ణములను కడుపునొప్పిని తొలగించును. బలిసియున్నవానికి బలవంతునికి భోజనము చేయునప్పుడు అజీర్ణము చేయుచున్న దని సందేహము కలిగినయెడల వాతఁడు శొంఠి కరకకాయలను తిని తనయిచ్ఛవచ్చిన పదార్థములను తినవచ్చును. కొంచెము ఆమము కలిగి అగ్నిమాంద్యము తటస్థించినయెడల కరకకాయ బెల్లము శొంఠి వీటిని తిని పిప్పళ్లు మోడి సవ్యము చిత్రమూలము శొంఠి మిరియములు వీటితో మిశ్రితమగు మజ్జిగను వేసికొని అన్నమును భక్షింపవలయును.

## విషూచికాచికిత్స.

శ్లో. విషూచికాయాం వమితం విరిక్తం సులంఘితం వా మనుజం విదిత్వా, పేయాదిభి ర్దీపనపాచనైశ్చ సమ్యక్ క్షుధార్తం సముపక్రమేత. 86. కుష్ఠసైంధవయోః కల్కం చుక్రతైలసమన్వితం, విషూచ్యాం మర్దనం కోష్ణం ఖల్లీశూలనివారణం. 87. కరంజనింబశిఖరీగుడూచ్యర్జకవత్సకైః, పీతః కషాయో వసనా ద్ఘోరాం హంతి విషూచికాం. 88. వ్యోషకం కరంజస్య ఫలం హరిద్రాం మూలం సమావాప్య చ మాతులుంగ్యాః, ఛాయావిశుష్కా గుడికాః కృతాస్తా హన్యు ర్విషూచీం నయనాంజనేన. 89. గుడపుష్పసారశిఖరీ తండులగిరికర్ణికాహరిద్రాభిః, అంజనగుటికా విలయతి విషూచికాం త్రికటుసనాథా. 90. త్వక్పత్రరాస్నాగురుశిగ్రుకుష్ఠై రమ్లేన పిష్టై స్సవచాశతాహ్వైః, ఉద్వర్తనం యద్ధి విషూచికాఘ్నం తైలం విపక్వం చ తదర్థకారి. 91.

విషూచికవిషయములలో వాంతి చేయఁబడినవానిని నొప్పిగలవానిని లంఘనముఁ బెట్టినవానిని చక్కగా పరికించి పానకములు మున్నగువానిచేతఁ గాని దీపనములు

పాచనములగు క్రియలచేతఁగాని చక్కఁగా నాకలికలుగునట్లుల చేయవలయును. చెంగల్వకోష్ఠు సైంధవలవణముల కల్కములో నువ్వుల తైలమును చక్రమును కలిపి కొంచెము వెచ్చచేసి రుద్దినయెడల ఖల్లీశూలము నివర్తించును. కానుగకాయ, ముదిరినవేప, ఉత్తరేణువిత్తులు, తిప్పతీగె, తెల్లగర్గర, కొడిసెవిత్తులు వీటితో కషాయముఁ బెట్టిత్రాగవలయును. ఇయ్యది వమనము చేయించుటచేత భయంకరము లగు విషూచికలను పోఁగొట్టును. శొంఠి,మిరియములు, పిప్పళ్లు, కానుగగింజలు, పసపు, మాదీఫలపువేళ్లు వీటిని మెత్తగానూరి మాత్రలనుకట్టి నీడలో నెండించిపెట్టుకొని తరువాతిచాదకాటుక వేసినయెడల విషూచికలునశించును. ఇప్పరసము ఉత్తరేణి తెల్లదిండైన పసుపు త్రికటుకములు వీటిని సమానభాగములుగ నూరి అంజనము వేసినచో విషూచి నివర్తించును. దాల్చె చెక్కజోతష్మతి పెద్దములక వస పిల్లపీచర వీటిని నిమ్మపులుసుతోఁటి నూరి కలియత్రిప్పి నలుగుపెట్టుకొనిన విషూచికలను నశింపఁజేయును. లేకున్న పైవానితో నూనెనుకాచి రుద్దినయెడల కూడను విషూచికలు నశింపచేయును.

దప్పికి చికిత్స.

శ్లో. పిపాసాయా మనుల్బణే లవంగస్యాంబు శస్యతే, జాతీఫలస్య వా శీతం శ్రుతం భద్రఘనస్య వా. 92. విషూచ్యా మతివృద్ధాయాం పార్ష్ణ్యో ర్దాహః ప్రశస్యతే, వమనం త్వాలసే పూర్వం లవణే నోష్ణవారిణా. 93. స్వేదో వర్తి ర్లంఘనం చ క్రమశ్చాతోఽగ్నివర్ధనః, సరుక్ చానద్ధ ముదర మమ్లపిష్టైః ప్రలేపయేత్. 94. దారుహైమవతీకుష్ఠ శతాహ్వా హింగుసైంధవైః. తక్రేణ చూర్ణం ముష్ణం సతైల మార్తిం జఠరే నిహన్యాత్, స్వేదోఘటై ర్వా బహుబాష్పపూర్ణై రుష్ణై స్తథా న్యై రపి పాణితాపైః. 95. తీవ్రార్తి రపి నాజీర్ణీ పిబే చ్ఛూలఘ్న మౌషధమ్, దోషచ్ఛన్నోఽ నలో నాలం పక్తుం దోషౌఘనాశనమ్. 96.

చాల దప్పిగలిగి బాధలేకున్నయెడల లవంగపుకషాయముగాని లేక జాజికాయకషాయముగాని లేక తుంగముస్తలతో సిద్ధముచేయఁబడి చక్కఁగాచారిన కషాయముగాని త్రాగుట శ్రేష్ఠము. మిక్కిలి పెరిగిన మహాచికములకు ప్రక్కలు వెచ్చచేయుట మంచిది. మాంద్యరోగములలో మొదట నుప్పుచేర్చిన వేడినీళ్లతో వాంతి కలిగించుట,

చెమటఁ బుట్టించుట, గుదస్థానమున గుడ్డల నుంచుట, లంఘనము చేయించుట, ననునివి క్రమముగా జఠరాగ్నిని వర్ధిల్లఁ జేయును. నొప్పి కలిగియుండినచో పొట్టకు దేవదారు చెక్క వస చెంగల్వకోష్ఠు సదాప ఇంగువ సైంధవలవణము వీటిని కాంజికముతో నూరి పట్టు వేయవలయును. యవలను పొడిచేసి ఆచూర్ణమును వెచ్చజేసి దానిలో యవక్షారము మజ్జిగ కలిపి త్రాగినయెడల కడుపులోని శూల తొలఁగి చనును. అజీర్ణరోగి ఎక్కువకడుపునొప్పిచేత బాధపడుచున్నను శూల నణగించు నౌషధములను త్రాగకూడదు. ఏలయనఁగా దోషములచేత గప్పివేయఁబడిన జఠరాగ్ని దోషములరాశిని పచనముచేయుటకు గాని నశింపఁజేయుటకు గాని సమర్థము కాదు.

ఇట్లు చక్రదత్తయందు అగ్నిమాంద్యాధికారప్రకరణము ముగిసెను.



# ౭. క్రిమిరోగాధికారము.



## క్రిమిరోగచికిత్స.

శ్లో. పారసీయ యమానికా పీతా పర్యుషితవారిణా ప్రాతః, గుడపూర్వా క్రిమిజాతం కోష్ఠగతం పాతయ త్యాశు. 1. పారిభద్రార్కపత్రోత్థం రసం క్షౌద్రయుతం పిబేత్, కేబుకస్య రసం వాపి ధత్తూరస్యాథవా రసమ్. 2. లిహ్యాత్ క్షౌద్రేణ వైడంగం చూర్ణం క్రిమివినాశనం, ముస్తాఖుపర్ణీ ఫలదారు శిగ్రు క్వాథః సకృష్ణా క్రిమి శత్రుకల్కః. 3. మార్గద్వయేనాపి చిరప్రవృత్తాన్ క్రిమీన్నిహంతి క్రిమిజాంశ్చ రోగాన్, ఆఖుపర్ణీదళైః పిష్టైః పిష్టకేన చ పూపికాం. 4. జగ్ధ్వా సౌవీరకం చాను పిబే త్క్రిమిహరం పరం, పలాశబీజస్వరసం పిబేద్వా క్షౌద్రసంయుతం. 5. పిబే త్తద్బీజకల్కం వా తక్రేణ క్రిమినాశనం, సురసాదిగణం వాపి సర్వథైవోపయోజయేత్. 6. విడంగసైంధవక్షార కాంపిల్లకహరీతకీః, పిబే త్తక్రేణ సంపిష్టాః సర్వక్రిమినివృత్తయే. 7.

ఖురాసాని వాము వాము వీనిని కషాయముగాచి మఱునాడు వడయకట్టియుంచి బెల్లముదిని ప్రాతఃకాలమునందు త్రాగినయెడల కోష్ఠములోనున్న పురుగులు కూడ నతిశీఘ్రముగా పడి నశించిపోవును. పారిజాతపుఆకు జిల్లేడుఆకురసముతీసి అందు తేనెను కలిపికొని త్రాగినను వక్కలరసమును త్రాగినను గాని ధత్తూరరసమును త్రాగినను గాని వాయువిడంగములచూర్ణమును తేనెలో కలిపికొని సేవించినను గాని పురుగులు నశించును. తుంగముస్తలు ఎలుకచెవిఆకు త్రిఫలములు దేవదారువు పెద్దములకవేరు వీటితో కషాయముఁ జేసి అందు పిప్పళ్లు వాయువిడంగములతో చేసిన కల్కమును కలిపి త్రాగినయెడల రెండువిధములగునవియు చిరకాలమునుండి యున్నవియు నగు క్రిమిరోగములను హరింపఁజేయును. ఎలుకచెవికూర ఆకులను నూరి పిండిలో కలిపి రొట్టెగా చేసికొని తినవలయును. తరువాత గంజిని త్రాగవలయును. ఇయ్యది క్రిములను హరించును. మోదుగఆకులను నూరికొని తేనెతో కలిపి సేవింపవలయును. లేకున్న వానిగింజలతో చేసిన కల్కమును మజ్జిగతో చేర్చికొని త్రాగినను జంతువులు నశించును. లేకపోయిన సురసాదిగణములో చెప్పఁబడిన యౌషధములను అయినను అన్నివిధముల నుపయోగింపవలయును. వాయువిడంగములు సైంధవలవణము యవక్షారము కాంపిల్లకమను ద్రవ్యము కరక

కాయ వీటినిసమభాగముగా మజ్జిగతో నూరి త్రాగినను అన్నివిధములగు జంతువులును (అనఁగా నులిపురుగులు మున్నగునవి) నశించిపోవును.

### విడంగఘృతము.

శ్లో. విడంగపిప్పలీమూల శిగ్రుభి ర్మరిచేన వా. 7. తక్రసిద్ధా యవాగూ స్స్యా త్క్రిమిఘ్న స్ససువర్చికా, పీతం బింబీఘృతం హంతి పక్వ మాశయగా న్క్రిమీన్. 8. త్రిఫలా త్రివృతా దంతీ వచా కాంపిల్లకం తథా, సిద్ధ మేభి ర్గవాం మూత్రే సర్పిః క్రిమివినాశనమ్. 9. త్రిఫలాయా స్త్రయః ప్రస్థా విడంగప్రస్థ ఏవ చ, ద్విపలం దశమూలస్య చ లాభత స్సముపానయేత్. 10. పాదశేషే జలద్రోణే శృతే సర్పి ర్విపాచయేత్, ప్రస్థోన్మితం సింధుయుతం తత్పలం క్రిమినాశనమ్. 11. విడంగఘృత మేత చ్చ లేహ్యం శర్కరయా సహ, సర్వా న్క్రిమీ న్ప్రణుదతి వజ్రం ముక్త మివాసురాన్. 12. రసేంద్రేణ సమాయుక్తో రసో ధత్తూరపత్రజః, తాంబూలపత్రజో వాపి లేపో యూకవినాశనః. 13. సవిడంగగంధకశిలాసిద్ధం సురభీజలేన కటుతైలమ్, ఆజన్మ నయతి నాశం లిక్షాసహితా స్తు యూకా శ్చ. 14.

వాయువిడంగములు మోడి పెద్దములకవిత్తులు మిరియములు సజ్జక్షారము వీటితోటిగాని మజ్జిగతోగాని సిద్ధముచేయఁబడిన గంజి, జంతువాతమును దూరముగా పారఁద్రోలును. త్రిఫలములు తెల్లతెగడ దింతెన వస కాంపిల్లక మను ద్రవ్యము వీటితోను గోమూత్రముతోను సిద్ధముజేయఁబడిన నేయి జంతువాతమును హరించును. మూడుప్రస్థములు త్రిఫలములు, వాయువిళంగము లొకప్రస్థము. [ప్రస్థమనగా 21 పలములు] రెండుపలములు దశమూలములు తీసికొని పక్వము చేయవలయును. ద్రోణపరిమాణము జలములో పక్వముచేసి నాలుగవపాలు నీరు మిగిలియుండఁగా పదియారుపలముల నేతిని చేర్చి కాచవలయును. తరువాత నందు సైంధవలవణమును చేర్చి నాలుగుతులములు త్రాగినయెడల జంతువులు హరించిపోవును. ఇయ్యది వాయువిడంగఘృత మనంబడును. దీనిని చక్కెరతో సేవింపవలయును. అన్నివిధము లగు కృముల నిది పోగొట్టును. ఇంద్రునివజ్రము అసురుల జంపినట్లు కృముల నశింపచేయును. నల్లఉమ్మెత్త ఆకుల రసములో పాదరసమును కలిపికాని, తాంబూలపత్రముల రసములో పాదరసమును కలిపిగాని పూసినయెడలను (కృములు) జంతువులు నశించి పోవును. వాయువిడంగములు, గంధకము, మణిశిల, గోమూత్రము వీటితో సిద్ధముచేయఁబడిన ఆవనూనెను రుద్దినయెడల బ్రదికియున్నంతవఱకు కృములు మఱి పుట్టక యుండునట్లు చేయును.

ఇట్లు చక్రదత్తయందు క్రిమిరోగాధికారప్రకరణము ముగిసెను.

---

# ౮. పాండురోగాధికారము.



[విరేచనార్థము త్రిఫలాతైలాదులు; వాతశ్లేష్మాది చికిత్స; త్రిఫలాక్వాథములు.]

శ్లో. సాధ్యంతు పాండ్వామయినం సమీక్ష్య స్నిగ్ధం ఘృతేనోర్ధ్వమధశ్చ శుద్ధం, సంపాదయేత్ క్షౌద్రఘృతప్రగాఢై ర్హరీతకీచూర్ణమయుప్రయోగైః. 1. పిబేద్ఘృతం వా రజనీవిపక్వం యత్త్రైఫలం తైలక మేవ చాపి, విరేచనద్రవ్యకృతాన్ పిబేద్వా యోగాంశ్చ వైరేచనికాన్ ఘృతేన. 2. విధి స్స్నిగ్ధోఽథ వాతోత్థే తిక్తశీతస్తు పైత్తికే, శ్లైష్మికే కటురూక్షోష్ణః కార్యో మిశ్రస్తు మిశ్రకే. 3. ద్విశర్కరం త్రివృచ్చూర్ణం పలార్ధం పైత్తికే పిబేత్, కఫపాండుస్తు గోమూత్రయుక్తాం క్లిన్నాం హరీతకీమ్. 4. నాగరం లోహ చూర్ణం వా కృష్ణాం పథ్యామథాశ్మజమ్, గుగ్గులుం వాఽథ మూత్రేణ కఫపాండ్వామయీ పిబేత్. 5. సప్తరాత్రం గవాం మూత్రే భావితం వాప్యయోరజః, పాండురోగప్రశాంత్యర్థం పయసా ప్రపిబేన్నరః. 6. ఫలత్రికామృతావాసా తిక్తాభూనింబ నింబజః, క్వాథః క్షౌద్రయుతో హన్యా త్పాండురోగం సకామలమ్. 7.

పాండురోగము గలవానిని చక్కగా పరీక్షచేసి సాధ్యముగా నుండినచో నేతితో పైనను క్రిందను శుద్ధముచేసి తరువాత తేనె నెయ్యి కలిపి పట్టించిన కరకకాయల చూర్ణము నుపయోగింపవలెను. లేకపోయిన పసపుతో వండిన నేతిని త్రాగవలయును. త్రిఫలములు లోధ్రకములతో చేసిన నేతినైనను త్రాగవలయును. లేక విరేచనకరములగు నోషధులచే సిద్ధముచేయఁబడిన విరేచనయోగ సంబంధ మగు నేతినైనను పుచ్చుకొనవలయును. వాతమువలన నగుపాండురోగములయందు తైలవిధులను చేయవలయును. పిత్తపాండురోగములయందు చేదును శీతలము నగు చికిత్సఁ జేయవలయును. కఫముచే నగు పాండురోగములయందు చేదును కారమును గలిగి వెచ్చనిదియు

నగుచికిత్సఁ జేయవలయును. ఒకదానితో నొకటి మిశ్రమములైన దోషములు గలపాం డురోగములను మిశ్రములగు చికిత్సల నొనర్పవలయును. పలముచక్కెర తెల్లతెగడ యొక్క చూర్ణముపలము వీటిని పిత్తపాండురోగములలో పుచ్చుకొనవలయును. కఫమునను గోమూత్రముతో కలిపిన కరక్కాయను సేవింపవలయును. శొంఠి, లోహచూర్ణమును, పాండురోగమునందును లేక పిప్పళ్లు కరక్కాయలను గాని శిలాజిత్తు గుగ్గిలము గో మూత్రముతో గూడ గాని కఫపాండురోగము గలవాఁడు త్రాగవలయును. త్రిఫల ములు తిప్పతీగె అడ్డసరము కటుకరోహిణి నేలవేము వేపచెక్క వీటిని కషాయము గా గాచి త్రాగినయెడల పాండురోగమును కామెరలును నశించిపోవును.

## అయశ్చూర్ణవటి; మండూరము; నవాయశ్చూర్ణము.

శ్లో. అయస్తిల త్ర్యూషణ కోలభాగై స్సర్వై స్సమం మాక్షి కధాతుచూర్ణమ్, తైర్మోదకః క్షౌద్రయుతో నుతక్రః పాండ్వామయే దూరగతేఽపి శస్తః. 8. అయోమలం తు సంతప్తం భూయో గోమూ త్రశోధితమ్, మధుసర్పిర్యుతం చూర్ణం సహ భక్తేన యోజయేత్. 9. దీపనం చాగ్నిజననం శోధపాండ్వామయాపహం, త్ర్యూషణ త్రిఫలా ముస్త విడంగాచిత్రకా స్సమాః. 10. నవాయోరజసో భాగా స్తచ్చూర్ణం మధుసర్పిషా, భక్షయే త్పాండుహృద్రోగకుష్ఠార్శఃకామలాపహమ్. 11 నవాయస మిదం చూర్ణం కృష్ణాత్రేయేణ భాషితమ్.

లోహభస్మము నల్లనూవులు శొంఠి మిరియములు పిప్పళ్లుఎండిన రేగుచెక్క వీని నన్నిఁటిని ఎన్నిదెన్నిదిమాషములును వీటియన్నిఁటియంత హేమాక్షికధాతువుల చూ ర్ణము వీటితో తేనెను కలిపి లడ్డుండలుగా చేసి తినవలయును. తరువాత మజ్జిగను త్రా గవలయును. ఇయ్యది పాండురోగములను పారద్రోలుటయం దత్యుత్తమ మైనది. ఇనుప చిట్టెమును నిప్పులో వైచి కాల్చి మాటిమాటికి ఆవుపంచితములో తడిపి శుద్ధిచేసి చూ ర్ణముచేసి ఆచూర్ణమునందు తేనెను నేతిని కలిపికొని యుపయోగించుకొనవలయును. ఇయ్యది దీపనము జఠరాగ్నిని పెంపొందించును. వాపు పాండురోగములను తొలగించు ను. శొంఠి మిరియములు పిప్పళ్లు కరకకాయ ఉసిరిక తాడి తుంగముస్తలు వాయువిడం గములు చిత్రమూలము వీనిని సమానముగా తీసికొని నవీనలోహభస్మ మన్నిటియంత తీసికొని అన్నింటిని తేనెలోను నేతిలోను కలిపి కొని భక్షింపవలయును. ఇయ్యది పాం డురోగములను హృద్రోగములను కుష్ఠు మూలరోగము కామెల వీటిని నశింపఁజేయును.

### యోగరాజమను రసాయనము.

శ్లో. త్రిఫలాయా స్త్రయో భాగా స్త్రయ స్త్రికటుకస్య చ. 12. భాగ శ్చిత్రకమూలస్య విడంగానాం తథైవ చ, పంచాశ్మజతునో భాగా స్తథా రూప్యమలస్య చ. 13. మాక్షీకస్య విశుద్ధస్య లోహస్య రజస స్తథా, అష్టౌ భాగా స్సితాయా శ్చ త త్సర్వం శ్లక్ష్ణచూర్ణితం. 14. మాక్షీకేణాప్లుతం స్థాప్యమాయసే భాజనే శుభే, ఉదుంబరసమాం మాత్రాం తతః ఖాదే ద్యథాగ్నినా. 15. దినేదినే ప్రయుంజీత జీర్ణే భోజ్యం యథేప్సితం, వర్జయిత్వా కులుత్థాం శ్చ కాకమాచీకపోతకాన్. 16. యోగరాజ ఇతిఖ్యాతో యోగో౽య మమృతోపమః, రసాయన మిదం శ్రేష్ఠం సర్వరోగహరం శుభమ్. 17. పాండురోగం విషం కాసం యక్ష్మాణం విషమజ్వరమ్, కుష్ఠా న్యజరకం మేహమ్ శ్వాసం హిక్కా మరోచకం. 18. విశేషా ద్ధ స్త్యపస్మారం కామలాం గుదజాని చ.

త్రిఫలములు 3 భాగములు మిరియములు పిప్పళ్లు 3 భాగములు చిత్రమూలము 1 భాగము వాయువిడంగములు 1 భాగము శిలాజిత్తు 5 భాగములు వెండిచిట్టెము హేమమాక్షికము లోహభస్మము అయిదు అయిదుభాగములును చక్కెర 8 భాగములును వీటి నన్నింటిని కలిపి చూర్ణముచేసి తేనెలోకలిపి లోహపుపాత్రలో పెట్టవలయును. తరువాత తమతమ జఠరాగ్ని ననుసరించి మేడిపండంత మాత్రలనుగా చేసికొని ప్రతిదినమును సేవించుచుండవలయును. తినినది జీర్ణమగుచున్నచో ఇచ్ఛను వచ్చినట్లు పదార్థములను భుజింపవచ్చును కాని ఉలవలును కపోతమాంసము కామంచి వీటిని వదలిపెట్టవలయును. యోగరాజ మని చెప్పబడు నీయోగ మమృతముతో తుల్యమైనది. ఇయ్యది ఉత్తమ మగు రసాయనము. సర్వరోగములను హరించును. పాండురోగమును విషమును దగ్గును క్షయరోగమును విషజ్వరమును కుష్ఠు అజీర్ణకము మేహము శ్వాసము మున్నగువానిని అరోచకమును ఎక్కుగా నపస్మారములను కుష్ఠును గుదరోగములను నశింపజేయును.

### విశాలాద్యచూర్ణము.

శ్లో. విశాలా కుటజా ముస్త కుష్ఠ దారు కలింగకాః. 19. కర్షాంశా ద్విపిచు ర్మూర్వా కర్షారా చ ఘనప్రియా, పీత్వా తచ్చూర్ణ మం

భోభి స్సుఖై ర్లిహ్యా త్తతో మధు. 20. పాండురోగం జ్వరం దాహం కాసం శ్వాస మరోచకమ్, గుల్మానాహామవాతాం శ్చ రక్తపిత్తం చ త జ్జయేత్. 21.

చేదుపుచ్చ లేక తెల్లదిం టైన కటుకరోహిణి తుంగముస్తలు చెంగల్వకోష్ఠు దేవదారు కొడిసెవిత్తులు వీని న్నిం టిని ఒక్కొక్క కర్షమును, నేలవేము వేపచెక్క చాగమట్ట ఇవి ఒక్కొక్క కర్షమును, తెల్లదింటైన అర్ధకర్షము వీటిని చూర్ణముచేసి నీళ్లలో కలిపికొని త్రాగవలయును. ఆపిమ్మట తేనెను నాకవలయును. ఇయ్యది పాండురోగమును జ్వరమును దగ్గును శ్వాసమును అరోచకము కడుపులోని బల్లలను అనాహములను ఆమవాతములను రక్తపిత్తములను జయింపగలదు.

పాండ్వాదులకు లోహక్షీరము.

శ్లో. లోహపాత్రే శృతం క్షీరం సప్తాహం పథ్యభోజనమ్. 22. పిబే త్పాండ్వామయీ శోషీ గ్రహణీదోషపీడితః, కల్యాణకం పంచగవ్యం మహాతిక్త మథాపి వా. 23. స్నేహనార్థం ఘృతం దద్యా త్కామలాపాండురోగిణే, రేచనం కామలార్తస్య స్నిగ్ధ స్యాదౌ ప్రయోజయేత్. 24. తతః ప్రశమనీ కార్యా క్రియా వైద్యేన జానతా.

లోహపుపాత్రలో కాచినపాలను త్రాగవలయును. ఈరీతిగా నేడురోజులు పథ్యమును పాండురోగియును వాపుగలవాఁడును అతిసారరోగియును చేయవలయును. కామెరలు పాండురోగము గలవానికి కల్యాణఘృతమును గాని, పంచగవ్యఘృతమును గాని, మహాతిక్తఘృతమును గాని, స్నేహన మగుటకొఱకు కీయవలయును. కామెరలు గలరోగికి మొదట స్నేహనమును చేసి తరువాత రేచనము నుపయోగించవలయును. అటుతరువాత చక్కగా తెలిసికొని వైద్యుఁడగువాఁడు నేర్పుతో ప్రశమనోపాధులను నొసంగవలయును.

కామెరలకు త్రిఫలాద్యౌషధములు.

శ్లో. త్రిఫలాయా గుడూచ్యా వా దార్వ్యా నింబస్య వా రసః. 25. ప్రాత ర్మాక్షికసంయుక్తః శీలితః కామలాపహః, అంజనం కామలార్తస్య ద్రోణపుష్పీరస స్స్మృతః. 26. నిశాగైరికధాత్రీణాం చూర్ణం వా. సం ప్రకల్పయేత్, నస్యం కర్కోటమూలం వా ఘ్రేయం వా జాలినీ ఫలమ్. 27. సశర్కరా కామలినాం త్రిభండీ హితాగవాక్షీసగుడాచ శుంఠీ, దార్వీసత్రిఫలావ్యోష విడంగా న్యయసో రజః. 28. మధుసర్పి ర్యు

తం లిహ్యాత్కామలాపాండురోగవాన్. 29. తుల్యా అయోరజః పథ్యా హారిద్రాః క్షౌద్రసర్పిషా, చూర్ణితాః కామలీ లిహ్యాద్గుడక్షౌద్రేణ వాఽభయాం. 30. ధాత్రీలోహరజోవ్యోష నిశాక్షౌద్రాజ్యశర్కరాః, లీఢ్వా నివారయత్యాశు కామలా ముద్ధతా మపి. 31. దగ్ధ్వాక్షకాష్ఠై ర్మలమాయసం తు గోమూత్రనిర్వాపిత మష్టవారాన్, విచూర్ణ్య లీఢం మధునా చిరేణ కుంభాహ్వయం పాండుగదం నిహంతి. 32. పాండురోగక్రియాం సర్వాం యోజయే చ్చ హలీమకే, కామలాయాం చ యా దృష్టా సాపి కార్యా భిషగ్వరైః. 33.

త్రిఫలముల రసముగాని తిప్పతీగెరసముగాని వేపచెక్కగాని తెచ్చి దానియందు తేనెను కలిపికొని ప్రాతఃకాలమున త్రాగినచో కామెరలు నశించును. కామెరలు గలవారికి తుమ్మిరసము నంజనముచేసి గాని, పసపు గైరికము ఉసిరిక వీటిని చూర్ణముచేసి గాని ఇయ్యవలయును. ఆగాకరచెట్టుపైబెరడును నస్యము చేసి యుపయోగింపవలయును. లేక ఆవఆకులను వాసనచూడవలయును. చక్కరతో కలిపిన తెల్లతెగడయైనను కొడిసెపాలవిత్తులు బెల్లము చేర్చిన శొంఠియైనను హితమొనర్చును. మ్రానిపసపు త్రిఫలములు శొంఠి మిరియములు పిప్పళ్లు వాయువిడంగములు లోహపు భస్మము వీటిని నూరి తేనెనేతులలో చేర్చికొని కామెరలు పాండురోగము గల రోగిత్రాగవలయును. లోహభస్మము కరకకాయ మ్రానిపసపు వీనిని సమానభాగములను తేనెనేతులలో కలిపి గాని, కరకకాయను బెల్లము తేనెతో కలిపిగాని, కామెరలు గలవాడు భక్షింపవలయును. ఉసిరిక ఇనుపచిట్టము శొంఠి మిరియములు పిప్పళ్లు పసపు తేనె నెయ్యి చక్కెర వీటిని కలిపికొని తినినయెడల నతిభయంకరము లగు కామెరలు కూడను తొలగిపోవును. పాతఇనుపచిట్టమును తాండ్రనిప్పులతో తగులబెట్టి గోమూత్రములో నెనిమిదిమారులు ముంచి పిమ్మట చూర్ణముజేసి తేనెలో కలిపికొని తినినట్లైన కుంభకామెరలు పాండు రోగములును నశించును. పాండురోగములో చెప్పబడిన చికిత్సలను హలీమకరోగవిషయమునగూడ నొనర్పవలయును. కామెరలకు చెప్పిన చికిత్సనే వైద్యుడు హలీమకమందు గూడ నుపయోగింపవలయును.

## విడంగాద్యలోహము.

శ్లో. విడంగ ముస్త త్రిఫలా దేవదారు షడూషణైః, తుల్యా మాత్ర మయశ్చూర్ణం గోమూత్రేఽష్టగుణే పచేత్. 34. తై రక్షమా

త్రాం గుడికాం కృత్వా ఖాదే ద్దినేదినే, కామలాపాండురోగార్తః సుఖమాపద్యతే ఒచిరాత్. 35.

వాయువిడంగములు తుంగముస్తలు త్రిఫలములు దేవదారు పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి మిరియములు వీని నన్నింటితో సమానముగా లోహభస్మమును చేర్చి ఇంతకు ఎనిమిదిరెట్లు ఆవుపంచితములో నుడకఁబెట్టవలయును. తరువాత అక్షుప్రమాణము చొప్పున మాత్రలను కట్టి ప్రతిదినమును తినుచుండినయెడల కామెరలు పాండురోగము వీటిచే పీడింపఁబడుచున్నరోగి సుఖమును శీఘ్రకాలములోనే పొందఁగలఁడు.

## త్ర్యూషణాదిమండూరము.

శ్లో. త్ర్యూషణా త్రిఫలా ముస్తా విడంగం చవ్యచిత్రకౌ, దార్వీ త్వఙ్మాక్షికో ధాతు ర్గ్రంథికం దేవదారు చ. 36. ఏషాం ద్విపలికా న్భాగాన్ చూర్ణం కృత్వా పృథక్పృథక్, మండూరం ద్విగుణం చూర్ణా చ్ఛుద్ధ మంజనసన్నిభం. 37. మూత్రే చాష్టగుణే పక్త్వా తస్మిం స్తు ప్రక్షిపే త్తతః, ఉదుంబరసమాన్ కుర్యా ద్వటకాం స్తాన్యథాగ్నితః. 38. ఉపయుంజీత తక్రేణ సాత్మ్యం జీర్ణే చ భోజనం, మండూరవటకా హ్యేతే ప్రాణదాః పాండురోగిణాం. 39. కుష్ఠా న్యజరకం శోథ మూరుస్తంభకఫామయాన్, అర్శాంసి కామలా మేహాన్ ప్లీహానం శమయన్తి చ. 40. నిర్వాప్య బహుశో మూత్రే మండూరం గ్రాహ్య మిష్యతే, గ్రాహయం త్వష్టగుణితం మూత్రం మండూరచూర్ణతః.

శొంఠి మిరియములు పిప్పళ్లు త్రిఫలములు తుంగముస్తలు వాయువిడంగములు చవ్యము చిత్రమూలము మ్రానిపసపు హేమమాక్షికము గ్రంథితగరము దేవదారు ఇవి యన్నియు రెండేసితులములచొప్పున చూర్ణము చేయవలయును. చూర్ణముకన్న బదిరెట్లెక్కువగా శుద్ధిచేసిన మండూరమును చేర్పవలయును. ఎనిమిదిరెట్లధికమగు నావు పంచితమును కాచి పైచూర్ణమునందు వేయవలయును. తరువాత మేడిపండంత గా వడలను చేసి తమతమ జఠరాగ్ని ననుసరించి వలయునంతవఱకు భుజింపవలయును. ఇది చక్కగా జీర్ణమైనపిమ్మట మజ్జిగతో తమతమ శరీరప్రకృతులకు తగిన ఆహారములను భక్షింపవలయు. ఇయ్యవి మండూరవటకములు. పాండు రోగులకు ప్రాణము నిచ్చునట్టివి. కుష్ఠు అజరకము వాపు వాతాదులవలననైన ఊరుస్తంభవాతము కఫరోగము అన్నితెగల మూలరోగములు, కామరలు మేహము లగుశోథలు వీటిని పోఁగొట్టును. గోమూత్ర

ములలో చాల పర్యాయములు శుద్ధిచేయఁబడిన మండూరముమాత్రమే ఇందు పుచ్చుకొ నతగినది. మండూరచూర్ణముతోకూడ నెన్నిదిరెట్లు ఎక్కువగా ఆవుపంచితమును పుచ్చు కొనవలయును.

## పునర్నవామండూరము.

శ్లో. పునర్నవా త్రివృ చ్ఛుంఠీ పిప్పలీ మరిచానిచ, విడంగం దేవ కాష్ఠం చ చిత్రకం పుష్కరాహ్వయం. 42. త్రిఫలాం ద్వే హరిద్రే చ దంతీం చ చవికం తథా. కుటజస్య ఫలం తిక్తాం పిప్పలీమూలము స్తక మ్. 43. ఏతాని సమభాగాని మండూరం ద్విగుణం తతః, గో మూత్రే ఒష్టగుణే పక్త్వా స్థాపయే త్స్నిగ్ధభాజనే. 44. పాండుశోథోదరానాహ శూలార్శః క్రిమిగుల్మనుత్.

శొంఠి తెగడ తెల్లగలిజేరు పిప్పళ్లు మిరియములు వాయువిడంగములు దేవదా రు మోడి చిత్రమూలము పుష్కరమూలము త్రిఫలములు పసపు మ్రానిపసపు దిం తెన చవ్యము కొడిసెపాలవిత్తులు కటుకరోహిణి తిప్పతీగెతుంగముస్తలు వీటిని సమభాగము లను చేసి అంతకంటె రెండురెట్లెక్కువ మండూరమును చేర్చి ఎనిమిది రెట్లెక్కు వయగు నావుపంచితములో చక్కగా వండి నేతితోమాగినపాత్రములో నుంచవల యును. ఇయ్యది పాండురోగము వాపు కడుపునొప్పులు మున్నగువానిని, అనాహము శూల మూలరోగము జంతువాతము గుల్మము వీనిని పోఁగొట్టును.

## మండూరవజ్రవటకము.

శ్లో. పంచకోలం సమరిచం దేవదారుఫలత్రికం. 45. విడంగము స్త యుక్తా శ్చ భాగా స్త్రిపలసంమితాః, యావం త్యేతాని చూర్ణాని మం డూరం ద్విగుణం తతః. 46. పక్త్వా చాష్టగుణే మూత్రే ఘనీభూతే తత దుద్ధరేత్, తతో క్షమాత్రా న్గుడకాన్ పిబే త్తక్రేణ తక్రభుక్. 47. పాండురోగం జయ త్యేష మందాగ్నిత్వ మరోచకమ్, అర్శాంసి గ్రహణీ దోష మూరుస్తంభ మథాపివా. 48. క్రిమిప్లీహాన ముదరం గరరోగం చ నాశయేత్, మండూరవజ్రనామాయం రోగానేకవినాశనః. 49.

పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి మిరియములు దేవదారు త్రి ఫలములు వాయువిడంగములు తుంగముస్తలు వీని నన్నింటిని మూడుభాగములు చొప్పున ను వీటి చూర్ణముకంటె రెండురెట్లెక్కువమండూరమును చేర్చి ఎన్నిదిరెట్ల గోమూ త్రములో వండవలయును. వండినయైనప్పుడు ముద్దగట్టగానే దింపి ఒక్కొక్క అక్షము ప్రమాణముగా మాత్రలనుకట్టి మజ్జిగలో పుచ్చుకొనుచుండవలయును. మజ్జిగనుకూడను

త్రాగవలయును. ఇయ్యది పాండురోగములను జయించును. అగ్నిమాంద్యమును అరోచకమును మూలరోగములను గ్రహణులను ఊరుస్తంభములను జంతువాతములను పాదలను ఉదరరోగములను విషభక్షణజనితములగు రోగములను నశింపఁజేయును. ఇయ్యదియే మండూరవజ్రవటక మనఁబడును. ఇయ్యది పెక్కులగు రోగములను నశింపఁజేయును.

ధాత్ర్యరిష్టము.

శ్లో. ధాత్రీఫలసహస్రే ద్వే పీడయిత్వా రసం భిషక్, క్షౌద్రాష్ట భాగం పిప్పల్యా శ్చూర్ణార్ధకుడ వాన్వితమ్. 50. శర్కరార్ధతులోన్మిశ్రం పక్వం స్నిగ్ధఘటే స్థితమ్, ప్రపిబే త్పాండురోగార్తిర్జీర్ణే హితమితాశనః. 51. కామలాపాండు హృద్రోగవాతాసృగ్విషమజ్వరాన్, కాసహిక్కారుచిశ్వాసా నేషోఽరిష్టః ప్రణాశయేత్. 52.

రెండువేల యుసిరికపండ్లను దెచ్చి తొక్కి రసముతీసి అం దెనిమిదవపాలు తేనెను పిప్పళ్లపొడి రెండుపలములును చక్కెర 50 పలములును వీని నన్నిఁటిని కలిపి వండవలయును. పిమ్మట (నేయిబోసి యుంచిన) చమురు పాత్రిలో పెట్టికొని పాండురోగి త్రాగుచుండవలయును. ఔషధము చక్కగా జీర్ణమైనపిమ్మట తగినట్లువలయునట్లు భోజనములు చేయవలయును. ఇయ్యది ధాత్ర్యరిష్ట మనఁబడును. ఇయ్యది కామెరలను పాండురోగములను హృద్రోగములను వాతరక్తమును విషమజ్వరములను దగ్గును వెక్కిళ్లను అరుచిని శ్వాసమును నశింపఁజేయును.

ద్రాక్షాఘృతము.

శ్లో. పురాణసర్పిషః ప్రస్థో ద్రాక్షార్ధప్రస్థసాధితః, కామలాగుల్మపాండ్వర్తి జ్వర మేహోదరాపహః. 52.

8 పలముల ద్రాక్షకల్కములో 16 పలముల ప్రాతనేతిని వండవలయును. ఇయ్యది ద్రాక్షాఘృతము. ఇది, కామెరలను గుల్మరోగములను పాండురోగములను జ్వరములను మేహరోగములను ఉదరరోగములను నశింపఁజేయును.

హరిద్రాఘృతము.

శ్లో. హరిద్రాత్రిఫలానింబ బలామధుకసాధితమ్, సక్షీరంమాహిషం సర్పిః కామలాహర ముత్తమమ్. 54.

పసపు త్రిఫలములు వేపచెక్క ముత్తువపులగము గేదెపాలు వీటితో తయారుచేయఁబడిన గేదెనేయి కామెరలను పోఁగొట్టుట కుత్తమౌషధము.

## మూర్వాద్యఘృతము.

శ్లో. మూర్వాతిక్తానిశాయాసకృష్ణాచందనపర్పటైః, త్రాయంతీ వత్సభూనింబ పటోలాంబుదదారుభిః. 55. అక్షమాత్రైర్ఘృతప్రస్థంసిద్ధం క్షీరం చతుర్గుణమ్, పాండుతా జ్వరవిస్ఫోట శోథార్శోరక్తపిత్తనుత్. 56.

చాగమట్ట కటుకరోహిణి పసపు దూలగొండి పిప్పళ్లు చందనము పర్పాటకము కలుత్రాయగు కొడిసెపండు నేలవేము చేదుపొళ్ల తుంగముస్తలు దేవదారు వీనినన్నిఁటిని అక్షప్రమాణము చొప్పున తెచ్చి నెయ్యి పదియారుపలములు పాలు నాల్గుప్రస్థములు పైవానితో కలిపి, వండి నేతిని సిద్ధము చేయవలయును. ఇయ్యది మూర్వాద్యఘృతము. ఇది, పాండురోగములను జ్వరములను స్ఫోటకములను వాపులను మూలరోగములను రక్తపిత్తమును పోఁగొట్టును.

## వ్యోషాద్యఘృతము.

శ్లో. వ్యోషం బిల్వం ద్విరజనీ త్రిఫలాద్వి పునర్నవా, ముస్తాన్యయోరజః పాఠా విడంగం దేవాదారు చ. 57. వృశ్చికారీచ భార్గీచసక్షీరైస్తైర్ఘృతం శృతమ్, సర్వాన్ప్రశమయత్యేత ద్వికారాన్మృత్తికాకృతాన్. 58.

శొంఠి మిరియములు పిప్పళ్లు బిల్వఫలము పసపు మ్రానిపసపు త్రిఫలములు తెల్లగలిజేరు నల్లగలిజేరు తుంగముస్తలు లోహభస్మము అగరుశొంఠి వాయువిడంగములు గంటుభారంగి వీటిని జేర్చి వీటియందు నేతిని పక్వము చేయవలయును. ఇది వ్యోషాద్యఘృత మనఁబడును. ఇయ్యది మన్నుతినుట వలన గలిగెడి యన్ని తెఱఁగులగు రోగములను పాఱఁదోలును.

ఇట్లు చక్రదత్తయందు పాండురోగాధికారప్రకరణము ముగిసెను.

# ౬. రక్తపిత్తాధికారము.

తర్పణాది.

శ్లో. నోద్రిక్త మాదా సంగ్రాహ్యం బలినోఽప్యశ్నత శ్చయత్, హృత్పాండుగ్రహణీదోష ప్లీహగుల్మ జ్వరాదికృత్. 1. ఊర్ధ్వం ప్రవృత్తదోషస్య పూర్వం లోహిత పిత్తినః, అక్షీణబలమాంసాగ్నేః కర్తవ్య మపతర్పణమ్. 2. ఊర్ధ్వగే తర్పణం పూర్వం కర్తవ్యం చ విరేచనమ్, ప్రాగధోగమనే పేయా వమనం చ యథాబలమ్. 3. తర్పణం సఘృతక్షౌద్రలాజచూర్ణైః ప్రదాపయేత్, ఊర్ధ్వగం రక్తపిత్తం త త్పీతంకాలే వ్యపోహతి. 4. బలం ఖర్జూరమృద్వీకా మధుకైస్సపరూషకైః, శృతశీతం ప్రయోక్తవ్యం తర్పణార్థం సశర్కరం. 5.

బలముగలరోగికిని పుష్టిగా భుజించుచున్నవానికిని ప్రవహించుచున్న రక్తమును మొదల కట్టివేయకూడదు. అట్లు రక్తమును బంధించినయెడల, హృద్రోగము పాండురోగము, గ్రహణి, పాదలరోగము, గుల్మము, జ్వరము మున్నగువానిని పుట్టించును. పైభాగమున పుట్టిన దోషము గల రోగికిని నశింపకయుండుబలము మాంసము జఠరాగ్ని కలవానికిని రక్తపిత్తము గలవానికిని మొదట లంఘనము చేయింపవలయును. పైభాగమున ప్రసరించిన రక్తపిత్తమునందు మొదట తర్పణమును విరేచనమును చేయింపవలయును. క్రిందిభాగమున ప్రసరించురక్తపిత్తమునందు మొదట బలానుసారముగా వాంతిని చేయింపవలయును. నెయ్యి, తేనె, పేలపిండి వీటితోటి తర్పణము చేయవలయును. ఇది పైభాగపురక్తపిత్తములను తగినసమయములో సేవించినయెడల పారద్రోలును. ఖర్జూరపు పండ్లు, ద్రాక్ష, యష్టిమధుకము, చిట్టీతకాయలు వీనిని కషాయము పెట్టుకొని చక్కెరను కలిపికొని తర్పణముకొఱకు ఉపయోగింపవలయును.

[రక్తపిత్తములలో విరేచనయోగము; వమనకల్పము; పథ్యములు; పానీయములు; విరేచనాదులకనర్హులు; వాశాకషాయము; వాశాస్వరసము; వాశాది క్వాథము, వాశామహిమము; బ్రహ్మమేడిరసము మొదలగునవి.]

శ్లో. త్రివృతా త్రిఫలా శ్యామా పిప్పలీ శర్కరా మధు, మోదకః సన్నిపాతోర్ధ్వం రక్తపిత్తజ్వరాపహః. 6. శాలిపర్ణ్యాదినా సిద్ధా పే

యా పూర్వ మధోగమే, వమనం మదనోన్మిశ్రో మన్థ స్సక్షౌద్రశర్కరః. 7. శాలిషష్టికనీవారకోరదూషప్రశాతికాః, శ్యామాకా శ్చ ప్రియంగు శ్చ భోజనం రక్తపిత్తినామ్. 8. మసూరముద్గచణకాః సముద్గా శ్చాఢకీఫలాః, ప్రశస్తా స్సూపయూషార్థం కల్పితా రక్తపిత్తినామ్. 9. శాకం పటోలవేత్రాగ్రతండులీయాదికం హితమ్, మాంసం లావకపోతాడిశశైణహరిణాదిజమ్. 10 వినా శుంఠీం షడంగేనసిద్ధం తోయం చ దాపయేత్, క్షీణమాంసబలం బాలంవృద్ధం శోషానుబంధినమ్. 11. అవమ్య మవిరేచ్యం చ స్తంభనైస్సముపాచరేత్, వృషపత్రాణి నిష్పీడ్య రసం సమధుశర్కరం. 12. పిబే త్తేనశమం యాతి రక్తపిత్తంసుదారుణం, అలరూషకనిర్యూహే ప్రియంగూమృత్తికాంజనే. 13. వినీయ లోధ్రం సక్షౌద్రంరక్తపిత్తహరంపిబేత్. వాసాకషాయోత్పలమృత్ప్రియంగులోధ్రాఞ్జనాంభోరుహకేసరాణి, పీత్వా సితా క్షౌద్రయుతాని హన్యుఃపిత్తాసృజో వేగ ముదీర్ణ మాశు. 14. తాలీసచూర్ణయుక్తః పేయః క్షౌద్రేణ వాసకస్వరసః, కఫవాత పిత్తతమక శ్వాస స్వరభేద రక్తపిత్తహరః. 15. ఆటరూషక మృద్వీకాపథ్యాక్వాథ స్సశర్కరః, క్షౌద్రాఢ్యః కసనఃశ్వాసరక్తపిత్తనిబర్హణః. 16. తాసాయాం విద్యమానాయా మాశాయాం జీవితస్య చ, రక్తపిత్తీ క్షయీ కాసీ కిమర్థ మవసీదతి. 17. సహరీతకీకః ఫల్గు ఫలోద్భవో వా పీతో రస శ్శోణిత మాశు హంతి, మధుయు త్యంఘ్రిజః క్వాథ స్తద్వ త్సమధుశర్కరః. 18. అతసీకుసుమసమంగా పాతారోహత్వగంభసా పీతా, ప్రశమయతి రక్తపిత్తం యది భుఙ్క్తే ముద్గయూషేణ. 19.

తెల్లతెగడ త్రిఫలములు నల్లతెగడ పిప్పళ్లు చక్కెర తేనె వీటిలో సిద్ధము చేయఁబడిన కుడుములు లేక మోదకములు సన్నిపాతములను పైకెగఁబ్రాకెడి రక్తపిత్తములను జ్వరములను నశింపఁజేయును. అధోగతమగు రక్తపిత్తము విషయమున మొట్టమొదట శాలిపర్ణ్యాదులచేత సిద్ధము చేయఁబడిన పేయనుగాని మంగకాయచూర్ణము తేనె కండచక్కెర వీటియొక్క మంథమునుగాని త్రాగించి వమనము చేయింపవలయును. శాలిధాన్యము షష్టకధాన్యము అనగా అరువదిరోజులకు పండు ధాన్యము నీవారధాన్యము అళ్లు ప్రశాతికమనుధాన్యము చేమలు, కొఱ్ఱలు మొదలగు ధాన్య

ములయొక్క భోజనము, రక్తపిత్తరోగులకు హితకర మగును. రక్తపిత్తరోగము గలవారలకు చిరుసెనగలు పెసలు సెనగలు కందులు అడవిపెసలు మొదలగునవి పప్పుకొఱకును గంజికిని శ్రేష్ఠము లని చెప్పఁబడినవి. పొట్లకాయ ప్రేంఖణము చిట్టికూర మొదలగుకూరలు హితకరములు. లావపిట్టలు పావురములు మున్నగువాటియొక్కయును కుందేలు జింక లేడి మున్నగువానియొక్కయును మాంసము హితకరము. శాంతిలేకుండునట్లు షడంగకషాయమును బెట్టి దీనిని మాంసముక్షీణించినవానికిని బలముగల పిల్లవానికిని వృద్ధులకును శోషిల్లువారికి (రోగులకు) ఇయ్యవలయును. వాంతి చేయింపఁ దగనివానిని విరేచనముల కీయకూడనివానిని స్తంభనములచేత చికిత్స చేయవలయును. ఋషభక మను గంధద్రవ్యముయొక్క ఆకులను పిండి తేనెను చక్కెరను ఆరసములో గలిసి త్రాగినయెడల నతిభయంకరమైన రక్తపిత్తము కూడ శాంతించును. అడ్డసరపుకషాయమునందు కొట్టుధాన్యములోని మట్టిని తైలమును గాని, లొద్దుగరసమునందు తేనెను కలిపికొనిగాని త్రాగినచో రక్తపిత్తములు హరించును. అడ్డసరపుకషాయమునందు తాళిసపత్రిచూర్ణమును కలిపి త్రాగినయెడల కఫము పిత్తములు స్వరభేదము రక్తపిత్తము హరించును. అడ్డసరపాకు, ద్రాక్ష, కరక్కాయల కషాయములో కండచక్కెరను తేనెను కలిపికొని త్రాగినయెడల దగ్గు శ్వాస రక్తపిత్తము తొలఁగించును. అడ్డసరపుటాకుండగా జీవించెనగాని ప్రాణములపై నాశయుండఁగా రక్తపిత్తరోగియును కాసరోగియును ఎందుకొఱకు దుఃఖితుఁడై యుండవలయును. బ్రహ్మమేడియాకుల రసమునందు తేనెను కలిపి త్రాగిన రక్తపిత్తములు నశించును. మల్లెవేరుతో చేసిన కషాయమునఁ దేనెను కండచక్కెరను కలిపికొని త్రాగినచో రక్తపిత్తరోగియు కాసరోగియు క్షయరోగియును సుఖము నొందును. అవిసెపూవులు ముత్తపుఁగము మట్టియూడలబెరడు వీటిని సమభాగములుగా నూరి త్రాగి పెసరగంజిని పుచ్చుకొనెనేని రక్తపిత్తము శమించిపోవును.

### రక్తపిత్తములు శమించు క్షీరాదులు.

శ్లో. కషాయయోగైర్వివిధైః దీప్తాగ్నౌ నిర్జితే కఫే, రక్తపిత్తంనచేచ్ఛామ్యేత్ తత్ర వాతోల్బణే పయః. 20. ఛాగం పయోథవా గవ్యం శృతం పంచగుణే జలే, అభ్యసే త్ససితాక్షౌద్రం పంచమూలీశృతంపయః.21.ద్రాక్షయా పర్ణినీభిర్వా కలయా మధుకేన వా, శ్వదంష్ట్రియాశతావర్యా రక్తజి త్సాధితం పయః. 22. పక్ష్మోదుంబరకాశ్మర్యపథ్యాఖర్జూరగోస్తనాః, మధునా ఘ్నంతి సంలీఢా రక్తపిత్తం పృథక్ పృక్. 23.

ముస్తా శాఖోట త్వగ్రస బిందుద్వితయయుగ్ద్విగుణితాజ్యః, భూనింబ కల్కఊర్ధ్వగపిత్తాస్రశ్వాసకాస హానికరః.24.ఖదిరస్య ప్రియంగూనాం కోవిదారస్య శాల్మలే, పుష్పచూర్ణంతు మధునా లీఢ్వా చారోగ్య మశ్నుతే. 25.అభయా మధుసంయుక్తా పాచనీ దీపనీ మతా, శ్లేష్మాణం రక్తపిత్తం చ హంతి శూలాతిసారనుత్.26.వాసకస్వరసే పథ్యాసప్తధా పరిభావితా, కృష్ణా వా మధునా లీఢా రక్తపిత్తం ద్రుతం జయేత్. 27. భావనాయాం ద్రవో దేయః సమ్యగార్ద్రిత్వకారకః.

నానావిధములైన కషాయములచేతను యోగములచేతను అగ్నిదీపనవిషయములో కఫముకట్టి ఒకవేళ రక్తపిత్తము శాంతినొందకయుండెనేని అప్పుడును వాత మధిక ముగానుండు రక్తపిత్తమునకును పాలను త్రాగింపవలయును. మేకపాలుగాని ఆవుపాలుగాని తెచ్చి అందైదురెట్లు నీరుకలిపి కాగఁబెట్టి దించి కండచక్కెర తేనెనుకలిపి అభ్యాసము చేసికొని త్రాగవలయును. లేకపోయిన పంచమూలములతో పక్వము చేయఁబడిన పాలనైనను త్రాగవలయును. ద్రాక్షచేతఁగాని కోలపొన్న ముయ్యాకుపొన్న కారుమినుము కారుపెసలు మున్నగువానిచేతగాని యష్టిమధుకములచేతఁగాని ఏనుగుపల్లేరు పిల్లిపీచర వీటితోగాని పక్వముచేయఁబడిన పాలు రక్తపిత్తమును హరించును. చక్కఁగా పండిన మేడిపండు గుమ్ముడు కరకకాయ ఖర్జూరపుపండు ద్రాక్ష వీటిని వేరువేరుగా తేనెలో కలిపికొని భక్షించినయెడల రక్తపిత్తము నశించును. తుంగముస్తలు లేతబత్తెంక రసము రెండురెండు బిందువులను చేర్చికొని రెండింతలు నేతిని నేలవేము కల్కమును కలిపి తినినయెడల ఊర్ధ్వము ప్రసరించు రక్తపిత్తములు దగ్గు శ్వాస ఇయ్యవి నాశనము నొందును. చంద్రపూవులు ప్రేంఖణపుపూవులు కాంచనపుపూవులు బూరుగపూవులు పొడి చేసి దీనిని తేనెతో కలిపి భక్షించినయెడల నారోగ్యమును పొందగలఁడు. తేనెతో కలిపిన కరకకాయ పాచనమును దీపనమును కలిగించును. కఫము రక్తపిత్తము శూల అతిసారము వీనిని పోఁగొట్టును. అడ్డసరపు రసమునందు ఏడుమార్లు భావనకట్టఁబడిన కరకకాయగాని తేనెతో కలిసిన పిప్పళ్లుగాని రక్తపిత్తము నతిశీఘ్రముగా నశింపఁజేయును. భావన చేయు నప్పుడు చక్కఁగా తడుపగలిగినట్టి రసమును వేయవలయును.

## ఏలాదిగుటికలు.

శ్లో. ఏలాపత్రత్వచోర్ధాక్షాః పిప్పల్యర్ధపలంతథా. 28.సితామధుక ఖర్జూర మృద్వీకా శ్చపలోన్మితాః, సంచూర్ణ్య మధునా యుక్తా గుటికాః కారయేద్భిషక్. 29. అక్షమాత్రాంతత శ్చైకాం భక్షయే చ్చ దినేదినే,

కాసం శ్వాసం జ్వరం హిక్కాం ఛర్దిం మూర్ఛాం మదం భ్రమం. 30. రక్తనిష్ఠీవనం తృష్ణాం పార్శ్వశూల మరోచకం, శోషప్లీహాఢ్యవాతాంశ్చ స్వరభేదం క్షతక్షయం.31. గుటికా తర్పణీ వృష్యా రక్తపిత్తం చ నాశయేత్.

ఏలకులు జాపత్రి లవంగపట్ట పీనిని అర్ధకర్షమును పిప్పళ్లు అరపలము, కలకండ యష్టిమధుకము ఖర్జూరము ద్రాక్ష ఇవి ఒక్కొక్కపలము తెచ్చి అన్నింటిని కలిపి చూర్ణముచేసి తేనెను కలిపి వైద్యుడు మాత్రలను కట్టవలయును. కర్షమంతేసి ప్రమాణముగల ఆమాత్రలను ప్రతిదినమును భక్షింపవలయును. ఇయ్యది దగ్గు శ్వాసము జ్వరము వెక్కిళ్లు దురద మూర్ఛ మత్తు భ్రమ నెత్తురునుమ్మట దప్పి పార్శ్వపునొప్పి అరోచకము వాపు పొడలరోగము వాతరక్తము స్వరభేదము క్షయ రక్తపిత్తము మున్నగువానిని నశింపచేయును. తృప్తి నొందించును. వీర్యమును వృద్ధి నొందించును.

## పృథ్వీకాప్రయోగములు.

శ్లో. లోహగంధిని నిశ్వాసే ఉద్గారే రక్తగంధిని.32. పృథ్వీకాం శాణమాత్రాం తు ఖాదే ద్ద్విగుణశర్కరాం, నాసాప్రవృత్తరుధిరంఘృతభృష్టం శ్లక్ష్ణపిష్టమామలకమ్, సేతురివ తోయవేగం రుణద్ధి మూర్ధ్నిప్రలేపేన. 33. ఘ్రాణప్రవృత్తే జలమేవ దేయం సశర్కరం నాసికయా పయోవా, ద్రాక్షారసం క్షీరఘృతం పిబేద్వా సశర్కరం చేక్షురసం హితంవా.35. నస్యం దాడిమపుష్పోత్థో రసో దూర్వాభవో థవా, ఆమ్రాస్థిజః పలాం డోర్వా నాసికాస్రుతరక్తజిత్. 35. మేఢ్రగేతి ప్రవృత్తే తు వస్తి రుత్తర సంజ్ఞితః, శృతం క్షీరంపిబే ద్వాపి పంచమూల్యా తృణాహ్వయా. 36.

ఇనుమువంటి వాసనగల నిట్టూర్పు గలిగినప్పుడును, నెత్తురువాసనవంటి వాసనగల త్రేపులు వచ్చినప్పుడును, నాల్గుమాషముల నల్లజీలకఱ్ఱచూర్ణమును రెండురెట్ల శర్కరతో చేర్చికొని తినవలయును. ఉసిరికకాయలను నూరి నేతితో వేయించి తలపైన పట్టువేయించినయెడల ముక్కున నెత్తురుగారుటను నీటిప్రవాహమును ఆనకట్టవలె నిల్పివేయును. ముక్కునుండి రక్తము కారుచుండినప్పుడు కండచక్కెర గలిపిన నీటినిగాని పాలనుగాని ద్రాక్షరసమునుగాని పాలతోచేసిన నేతినిగాని ముక్కుగుండా పీల్చవలయును. లేకపోయినచో చక్కెర గలిపిన చెఱకురసముగాని హితకరమగును. దానిమ్మపూవులరస

మును గాని గరికెరసమును గాని ఉసిరికకాయల రసమును గాని ఉల్లిగడ్డలరసమును గాని నస్యమునుగా చేసినయెడల ముక్కునుండి రక్తము కారుట నాపివేయును. శిశ్నముద్వారా ఎక్కువగా రక్తము స్రవించుచున్నయెడల ఉత్తరవస్తిని చేయవలయును. పంచమూలములు వట్టివేళ్లు వేసి కాచినపాలనైనను త్రాగవలయును.

### దూర్వాద్యమను ఘృతము.

శ్లో. దూర్వాసోత్పలకింజల్కా మంజిష్ఠా సైలవాలుకా, సితాశీతముశీరం చ ముస్తం చందనపద్మకౌ. 37. విపచేత్కార్షికై రేతైః సర్పిరాజం సుఖాగ్నినా, తండులాంబు త్వజాక్షీరం దత్వాచైవ చతుర్గుణమ్. 38. తత్పానం వమతో రక్తం నావనం నాసికాగతే, కర్ణాభ్యాం యస్య గచ్ఛేత్తు తస్య కర్ణౌ ప్రపూరయేత్. 39. చక్షుస్స్రావిణి రక్తే తు పూరయేత్తేన చక్షుషోః, మేఢ్రపాయుప్రవృత్తే తు తదభ్యంజగే ప్రయోజయేత్. 40. రోమకూపప్రవృత్తే తు వస్తికర్మసు యోజయేత్.

గరికవేళ్లు నల్లకమలములలోని కింజల్కములు మంజిష్ఠము కూతురుబుడమ విఱిగిచెక్క. వట్టివేళ్లు తుంగముస్తలు మంచిగంధపుపొడి కమలములు వీని నన్నిటిని ఒక్కొక్కకర్షము చొ॥ తీసికొని వచ్చి నేతిలో వైచి పొయిపైని బెట్టి సన్నని మంటవేసి వండవలయును. బియ్యపుకడుగు మేకపాలును నాలుగురెట్లెక్కువగా చేర్చి వండవలయును. ఇట్లుసిద్ధముచేసిన నేతిని నోటినుండి నెత్తురుపడుచున్నయెడల త్రాగవలయును. ముక్కునుండి పడుచుండినయెడల పీల్చవలయును. చెవులలోనుండి నెత్తురు పడువానికి చెవులలో పోయవలయును. కండ్లనుండి పడుచుండినచో గన్నులలో వేయవలయును. లింగమునుండి గాని గుదస్థానమునుండి గాని రక్తము పడుచుండిన నీనేతిని వస్తికర్మలలో ప్రయోగింపవలయును. రోమకూపములనుండి కారుచున్నచో నీనేతితో రుద్దుకొనవలయును.

### శతావరి ఘృతము.

శ్లో. శతావరీ దాడిమ తింతిడీకం కాకోలిమేదే మధుకం విదారీం, పిష్ట్వా చ మూలం ఫలపూరకస్య ఘృతం పచేత్ క్షీరచతుర్గుణం జ్ఞః. 41. కాసజ్వరానాహవిబంధశూలం తద్రక్తపిత్తంచ ఘృతం నిహన్యాత్.

పిల్లిపీచర దానిమ్మ చింతకాయ కారుగోలిమి మేధ మహామేధ యష్టిమధుకము నేలగుమ్మడి వీటిని తెచ్చి నూరి మాదీఫలమువేళ్లు నిందులో కలిపి ఇంత్తకు నాలుగురెట్ల

పాలం బోసి నేతిని వండవలయును. ఇయ్యది శతావరీఘృత మనఁబడును. ఇది దగ్గును జ్వరమును మలబంధమును శూలలను రక్తపిత్తరోగములను నశింపఁజేయును.

## రెండవదియగు శతావరీఘృతము.

శ్లో. శతావర్యా స్తు మూలానాం రసప్రస్థద్వయం మతమ్, తత్సమం చ భవేత్క్షీరం ఘృతప్రస్థే విపాచయేత్. 42. జీవకర్షభకౌ మేదా మహామేదా తథైవ చ, కాకోలీ క్షీరకాకోలీ మృద్వీకా మధుకం తథా. 43. ముద్గపర్ణీ మాషపర్ణీ విదారీ రక్తచందనమ్, శర్కరా మధుసంయుక్తం సిద్ధం విస్రావయే ద్భిషక్. 44. రక్తపిత్తవికారేషు వాతరక్తగదేషు చ, క్షీణశుక్రేషు దాతవ్యం వాజీకరణ ముత్తమమ్. 45. అంసదాహం శిరోదాహం జ్వరం పిత్తసముద్భవం, యోనిశూలం చ దాహంచ మూత్రకృచ్ఛ్రంచ పైత్తికమ్. 46. ఏతా న్రోగా న్నిహంత్యాశు ఛిన్నాభ్రాణీవ మారుతః, శతావరీసర్పిరిదం బలవర్ణాగ్నివర్ధనమ్. 47. స్నేహపాద స్స్మృతః కల్కః కల్కవ న్మధుశర్కరే, ఇతివాక్యబలాత్స్నేహ ప్రక్షిప్యం పాదికం భవేత్. 48.

పిల్లిపీచరరసము రెండుప్రస్థములును రెండుప్రస్థముల పాలలోకలిపి ఒకప్రస్థము నేతిని వండవలయును. జీవకము ఋషభకమను గంధద్రవ్యమును మేద మహామేదలను చేర్చి కాకోలి క్షీరకాకోలి ద్రాక్ష యష్టిమధుకము పిల్లిపెసర కారుమినుము నేలగుమ్మడి రక్తచందనముకండచక్కెరతేనెవీటినికూడ పైదానియందుకలిపి నేతినిపక్వముచేసి దింపవలయును. రక్తపిత్తవికారములయందునువాతరక్తరోగములయందునుక్షీణించిన వీర్యము గలవారిపట్లను ఈ నేతిని ఇచ్చినయెడల నత్యుత్తమ మగు వాజీకరణ మగును. భుజముల మంట తలమంట జ్వరము పిత్తజ్వరము యోనిశూల దప్పి మూత్రము కృచ్ఛ్రము నను నీరోగముల నియ్యది గాలి మేఘములఁ బాఱదోలినరీతి బాఱద్రోలును. ఇయ్యది శతావరీఘృతము. బలమును కాంతిని ఆకలిని పెంపొందించును. నేతిలో నాల్గవభాగము కల్కముతో సరిగా తేనెను చక్కెరను చేర్పవలయునను వాక్యముఁబట్టి నేతిలో నాలుగవభాగము కలుపుట మిగుల మంచిది.

## వాసాఘృతము.

శ్లో. వాసాం సశాఖాం సపలాశమూలాం కృత్వా కషాయం కుసుమాని చాస్యాః, ప్రదాయ కల్కం విపచే ద్ఘృతం తత్సక్షౌద్రమాశ్వేవ నిహంతి రక్తమ్. 49.

కొమ్మలు బెరడుతోఁగూడిన అడ్డసరమును కషాయమును కాచి యందులో అడ్డసరపుపూవుల కల్కమును కలిపి అంతట నేతిని పక్వముచేసి దానిలో తేనెను కలిపి తినినయెడల రక్తపిత్తముల నతిత్వరితముగా పోఁగొట్టును.

### కామదేవఘృతము.

శ్లో. శణస్యకోవిదారస్య వృషస్య కకుభస్య చ, కల్కాఢ్యత్వాత్పుష్పకల్కం ప్రస్థే పలచతుష్టయం. 50. అశ్వగంధాపలశతం తదర్ధం గోక్షురస్య చ, శతావరీ విదారీ చ శాలిపర్ణీ బలా తథా. 51. అశ్వత్థస్య చ శుంగాని పద్మబీజం పునర్నవా, కాశ్మరీఫల మేత త్తు మాషబీజం తథైవ చ. 52. పృథ గ్దశపలా న్భాగాన్ చతుర్ద్రోణేంభసః పచేత్, చతుర్భాగావశేషే తు కషాయ మవతారయేత్. 53. మృద్వీకా పద్మకం కుష్ఠం పిప్పలీ రక్తచందనం, బాలకం నాగపుష్పం చ ఆత్మగుప్తాపలం తథా. 54. నీలోత్పలం శారివే ద్వే జీవనీయం విశేషతః, పృథకర్షసమం చైవ శర్కరాయాః పలద్వయమ్. 55. రసస్య పౌండ్రకేక్షూణా మాఢకం తత్ర దాపయేత్, చతుర్గుణేన పయసా ఘృతప్రస్థం విపాచయేత్. 56. రక్తపిత్తం క్షతక్షీణం కామలాం వాతశోణితమ్, హలీమకం తథా శోథం వర్ణభేదం స్వరక్షయమ్. 57. అరోచకం మూత్రకృచ్ఛ్రం పార్శ్వశూలం చ నాశయేత్, ఏత ద్రాజ్ఞాం ప్రయోక్తవ్యం బహ్వన్తఃపురచారిణామ్. 58. స్త్రీణాం చైవానపత్యానాం దుర్బలానాం చ దేహినాం, క్లీబానా మల్పశుక్రాణాం జీర్ణానా మల్పరేతసామ్. 59. శ్రేష్ఠం బలకరం హృద్యం వృష్యం పేయం రసాయనం, ఓజస్తేజఃకరం చైవ ఆయుఃప్రాణవివర్ధనమ్. 60. సంవర్ధయతి శుక్రం చ పురుషం దుర్బలేంద్రియం, సర్వరోగవినిర్ముక్త స్తోయసిక్తో యథా ద్రుమః. 61. కామదేవ ఇతి ఖ్యాత స్సర్వరోగేషు శస్యతే,

మద్దిపూవులు కాంచనపుపూవులు జనుపపూవులు అడ్డసరముపూవులు వీటితో చేసిన కల్కమును నాలుగుపలములు తీసికొని పదహారు పలముల కషాయములో కలపవలయును. పెన్నేరుగడ్డ 100 పలములు పెద్దపల్లేరు 50 పలములు పిల్లపీచర నేలగుమ్ముడు కోలపొన్న

ముత్తువపులగము రావిచిగుళ్లు పద్మబీజములు తెల్లగల్జేరు గుమ్మడు తేగ మినుములు ఇవి యన్నియును పదేనిపలముల చొప్పున తీసికొని నాలుగుద్రోణముల నీటియందు పక్వము చేసి నాలుగవపాలు నీరు బాక్కీయుండునప్పుడు ఆకషాయమును దించి ద్రాక్ష పద్మాక్షము చెంగల్వకోష్ఠు పిప్పళ్లు రక్తచందనము కురువేరు నాగకేసరములు దూలగొండివిత్తులు నల్లకల్వలు పాలసుగంధి నల్లసుగంధి గరిక జీవకము ఋషభకముఋద్ధి కాకోలి క్షీరకాకోలి మేద మహామేద కారుమినుము కారుపెసర వీని నన్నిటిని ఒక్కొక్కకర్షమును కండచక్కెర రెండుపలములును చెరకురసము ఆఢకమును తీసికొనవలయును. మఱియు నిందు నాలుగురెట్లు పాలుబోసి పదియారుపలముల నేతిని బోసి వండవలయును. ఇయ్యది కామదేవఘృతము. రక్తపిత్తమును క్షతక్షీణము కామెర వాతరక్తము హాలీమకము వాపు రంగుమారుట మాటపడిపోవుట అరోచకము మూత్రకృచ్ఛ్రము పార్శ్వపుశూల వీటి నన్నిటిని నాశనముచేయును. ఈనేతిని రాజులకును ధనికులకునుఎక్కువగా నంతఃపురముల సంచరించు నృపులకును బిడ్డలులేని స్త్రీలకును దుర్బలులగు నరులకును నపుంసకులకును కొద్దిపాటి వీర్యము గలవారికిని ముదుసలివారికిని దీని నీయవలయును. ఇయ్యది శ్రేష్ఠమైనది. బలమును గలిగించును. మనోహరముగా నుండును. వీర్యము గలిగించును. రసాయనము. త్రాగతగినది. బలమును కాంతిని పెంపొందించును. ఆయుష్యమును ప్రాణమును వీర్యమును ఇచ్చును. దుర్బలవీర్యముగల పురుషుని వృద్ధి నొందించును. దీనిని సేవించినయెడల నీళ్లుపోసి పెంచిన వృక్షమువలె అన్నిరోగముల చేత వదలిపెట్టఁబడి వెలుగును. ఈకామదేవఘృత మన్నిరోగములను పోఁగొట్టుటయందు సమర్థమైనది.

## సప్తప్రస్థఘృతము.

శ్లో. శతావరీ పయో ద్రాక్షా విదారీ క్షౌద్రమైక్షవైః రసైః. 62. సర్పిషాసహ సంయుక్తైః స్సప్తప్రస్థం విపాచయేత్, శర్కరాపాదసంయుక్తం రక్తపిత్తహరం పిబేత్. 63. ఉరఃక్షతే పిత్తశూలే యోనివాతే వ్యసృగ్దరే, బల్య మూర్జస్కరం వృష్యం క్షుధాహృద్రోగనాశనమ్.64.

పిల్లిపీచరరసము పాలు ద్రాక్షరసము నేలగుమ్మడిరసము తేనె చెఱకురసము ఉసిరికకాయలరసము వీటితోకూడ ఒకప్రస్థము నేతినిపక్వము చేయవలయును. తరువాత నాల్గవపాలు కండచక్కెరను కలిపికొని త్రాగవలయును. ఇయ్యది రక్తపిత్తముల హరించును. రొమ్మునొప్పి పిత్తశూలము యోనివాతము ప్రదరరోగము వీటిని పోఁగొట్టును. బలము గలిగించును. పరాక్రమము నిచ్చును. వీర్యముఁ గలిగించును. ఆకలి కడుపునొప్పి మున్నగువానిని హరించును.

## ఖండకూష్మాండకము.

శ్లో. కూష్మాండకాత్పలశతం సుస్విన్నం నిష్కులీకృతమ్, పచేత్తప్తే ఘృతప్రస్థే శనైస్తామ్రమయే దృఢే. 65. యదా మధునిభః పాకస్తదా ఖండశతం న్యసేత్, పిప్పలీశృంగబేరాభ్యాం ద్వే పలే జీరకస్య చ. 66. త్వగేలాపత్రమరిచధాన్యకానాం పలార్ధకమ్, న్యసేచ్చూర్ణీకృతం తత్ర దర్వ్యా సంఘట్టయేన్ముహుః. 67. తత్పక్వం స్థాపయేద్భాండే దత్వా క్షౌద్రం ఘృతార్ధకమ్, అద్యథాగ్నిబలం ఖాదేద్రక్తపిత్తీ క్షతక్షయీ. 68. కాసశ్వాసతమచ్ఛర్ది తృష్ణాజ్వరనిపీడితః, వృష్యం పునర్నవకరం బలవర్ణప్రసాధనమ్. 69. ఉరస్సంధానకరణం బృంహణం స్వరబోధనమ్, అశ్విభ్యాం నిర్మితం సిద్ధం కూష్మాండకరసాయనం. 70. ఖండామలకమానానుసారాత్కూష్మాండకద్రవాత్, పాత్రం పాకాయ దాతవ్యం యవాన్వా తద్రసో భవేత్. 71. అత్రాపి ముద్రయా పాకో నిస్త్వచం నిష్కులీకృతమ్.

బూడిదగుమ్మడికాయను నూరుపలములు మెత్తగా చెక్కుతీసి ఒకశేరంచము నెయ్యి బోసి అందు వానిని పోసి గట్టి రాగిపాత్రలో మెల్లగా పక్వము చేయవలయును. తేనెలాగున పాకను కట్టినప్పుడు నూరుపలముల కండచక్కెర నందు వేయవలయును. పిప్పళ్లు శొంఠి జీలకఱ్ఱ రెండురెండుపలములును దాల్చినపట్ట ఏలకులు జాపత్రి మిరియములు ధనియములు ఇవి అన్నియును అర్ధపలము చొప్పునను చేర్చి చూర్ణముచేసి పైదానిలో పడవేసి గరిటెతో మాటిమాటికి కలియబెట్టవలయును. చక్కగా పక్వమైన పిమ్మట దానిని కేతిలో సగభాగము తేనెను పోసి కుండలో నుంచికొని రక్తపిత్తరోగము గలవాడు తనయాకలి ననుసరించి తినవలయును. దగ్గు శ్వాసము చీకట్లుగ్రమ్ముట ఛర్ది దప్పి జ్వరము వీటిచేత పీడింపబడినవాడు గూడ సేవింపవలయును. ఇయ్యది వీర్యమును వృద్ధి నొందించును. శరీరమును క్రొత్తదానినిగా చేయును. బలముకాంతిని చేకూర్చును. వక్షస్థలమును పెంపొందించును. ధాతుపుష్టి నిచ్చును. స్వరమును పెంపొందించును. ఈకూష్మాండకరసాయనమశ్వినీదేవతలచే సృజింపబడినది. ఇయ్యది సిద్ధౌషధము. కండచక్కెర ఉసిరికయున్నగువానిని ఫలాదిమానములననుసరించి వండుటకొఱకు ఇయ్యవలయును. దీనిని కూడను వండునప్పుడు మూసియే వండవలయును. గుమ్మడినితొఱిగి చెక్కులేకుండ ముక్కలుగా చేసి కలపవలయును.

విశేషాంశములు:—ఒక ప్రతిలో ఈ యోగమును వివరించునప్పుడు "యదామధునిభః" అన్నదానితర్వాత ఈ క్రిందిశ్లోకము అధికముగాగలదు. శ్లో. కూష్మాండపీడనాత్తోయే సాధకేన పునః పచేత్, యుక్తస్స్వాః యదాపశ్యే త్తదాసిద్ధేత్ర నిక్షిపేత్.

## వాసఖండకూష్మాండక రసాయనము.

శ్లో. పంచాశచ్చ పలం స్విన్నం కూష్మాండా త్ప్రిస్థ మాజ్యతః. 72. గ్రాహ్యం పలశతం ఖండం వాసా త్క్వథార్ధ కే పచేత్, ముస్తా ధాత్రీ శుభా భార్గి త్రిసుగంధై శ్చ కార్షికైః. 73. ఏలేయ విశ్వ ధాన్యాక మరిచై శ్చ పలాంశికైః, పిప్పలీకుడంప శ్చైవ మధుమానీం ప్రదాపయేత్. 74. కాసం శ్వాసం క్షయం హిక్కాం రక్తపిత్తం హాలీమకమ్, హృద్రోగ మమ్లపిత్తం చ పీనసం చ వ్యపోహతి. 75.

బూడిదె గుమ్మడికాయను చెక్కుతీసి ముక్కలుగాచేసి 50 పలములును, నేయి 16 పలములును, కండచక్కెర 100 పలములును తెచ్చి వీటిని 64 పలముల అడ్డసరపు కషాయములో పక్వము చేయవలయును. తుంగముస్తలు, ఉసిరికపప్పు, తవక్షీరి, గంటుభారంగి, జాజికాయ, లవంగములు, ఏలకులు, జాపత్రి ఇవి అన్నియు నొక్కొక్కపలమును, కొతుురుబుడమ శొంఠి ధనియములు మిరియములు ఇవి ఒక్కొక్కపలమును, పిప్పళ్లు నాల్గుపలములు యష్టిమధుకమును అందులో చేర్పవలయును. ఇయ్యది వాసఖండకకూష్మాండ మనఁబడును. దగ్గు శ్వాసను క్షయ వెక్కిళ్లు రక్తపిత్తను హాలీమకము హృద్రోగమును ఆమ్లపిత్తమును పీనస మున్నగువాని నన్నిఁటిని పోఁగొట్టును.

విశేషాంశములు:— ఈయోగములోగూడ "పిప్పలీ కుడపమ్" అన్నశ్లోకము తర్వాత నీక్రింది గ్రంథభాగ మధికముగా గలదు. శ్లో. ఏతచ్చూర్ణీకృతం తత్ర దార్వ్యసంఘట్టయేత్పునః, తద్యథాగ్నిబలంఖాదే ద్రక్తపిత్తక్షతక్షయీ, వృష్యం పునర్నవ కరం బలవర్ణకరంచ తత్.

## వాసాఖండరసాయనము.

తులా మాదాయ వాసాయాః పచే దష్టగుణే జలే, తేన పాదావశేషేణ పాచయే దాఢకం భిషక్. 76. చూర్ణానా మభయానాం చ ఖండా చ్ఛుద్ధం తథా శతమ్, ద్వే పలే పిప్పలీచూర్ణా త్సిద్ధశీతే చ మా

క్షీకాత్. 77. ఖండపం పలమాత్రం తు చాతుర్జాతం సుచూర్ణితమ్, క్షీ ప్త్వా విలోడితం ఖాదే ద్రక్తపిత్తీ క్షతక్షయీ. 78. కాసశ్వాసపరీత శ్చ యక్ష్మణా చ ప్రపీడితః,

నూరుపలముల అడ్డసరరసమును తెచ్చి ఎనిమిదిరెట్లు నీళ్లుపోసి వండి నాల్గవభాగము మిగులుండగా కరకకాయ 64 పలములు కలకండ 100 పలములు పిప్పళ్లు రెండు పలములు వీటిని కలిపి చూర్ణముచేసి పైదానియందు కలిపి పక్వమైన పిమ్మట చల్లార్చి తేనె 8 పలములు దాల్చినపట్ట ఏలకులు జాపత్రి నాగకేసరములు వీటిచూర్ణము ఒకపలమును వేసి కలిపి రక్తపిత్తరోగులును క్షతక్షయులును భక్షింపవలయును. దగ్గు శ్వాసలచేత బాధపడువాఁడును క్షయరోగియును కూడ భక్షింపవలయును.

## ఖండకాద్యలోహము.

శ్లో. శతావరీ చ్ఛిన్నరుహా వృషముండతికా బలాః. 79. తాలమూలీ చ గాయత్రీ త్రిఫలాయా వచ స్తథా, భార్గీ పుష్కరమూలం చ పృథ క్పంచపలాని చ. 80. జలద్రోణే విపక్తవ్యం అష్టమాంశావశేషితమ్, దివ్యౌషధహతస్యాపి మాక్షికేణ హతస్య వా. 81. పలద్వాదశకం దేయం రుక్మలోహస్య చూర్ణితమ్, ఖండతుల్యం ఘృతం దేయం పలషోడశికం బుధైః. 82. పచే త్తామ్రమయే పాత్రే గుడపాకో యథామతమ్, ప్రస్థార్ధం మధునో దేయం శుభాశ్మజతుకం త్వచం. 83. శృంగీ విడంగం కృష్ణా చ శుంఠ్యజాజీ పలంపలం, త్రిఫలా ధాన్యకం పత్రం ద్వ్యక్షం మరిచకేశరమ్. 84. చూర్ణం దత్వా సుమథితం స్నిగ్ధే భాండే నిధాపయేత్, యథాకాలం ప్రయుంజీత బిడాలపదకం తతః. 85. గవ్యక్షీరానుపానం చ సేవ్యం మాంసరసం పయః, గురువృష్యాన్నపానాని స్నిగ్ధం మాంసాదిబృంహణం. 86. రక్తపిత్తం క్షయం కాసం పక్తిశూలం విశేషతః, వాతరక్తం ప్రమేహం చ శీతపిత్తం వమిం క్లమం. 87. శ్వయథుం పాండురోగం చ కుష్ఠం ప్లీహోదరం తథా, ఆనాహం రక్తసంస్రావం చామ్లపిత్తం నిహంతి చ. 88.

చాక్షుషం బృంహణం వృష్యం మాంగల్యం ప్రీతివర్ధనం, ఆరోగ్యం పుత్రదం శ్రేష్ఠం కామాగ్నిబలవర్ధనం. 89. శ్రీకరం లాఘవకరం ఖండ కాద్యం ప్రకీర్తితమ్.

పెద్దపిల్లిపీచర, లిప్పతీగె, అడ్డసరము, ఋషభమను గంధద్రవ్యము, తెల్లబోడ తరము, ముత్తువపులగము, నేలతాడి, త్రిఫలములు, గంటుభారంగి, పుష్కరమూలము వీనిని 5 పలముల చొ॥ తెచ్చి ఒకద్రోణము నీటిలో నుంచి వండవలయును. ఆనీటిలో నెన్మిదవభాగము మిగిలియుండఁగా దివ్యౌషధములచే శుద్ధిచేసినది గాని మాక్షికముతో శుద్ధిచేయఁబడినది గాని యగు రుక్మలోహచూర్ణమును [అనగా నయస్కాంతమును, లేక ఉక్కుభస్మమును] 12 పలములును, కండచక్కెరతో సమానముగా 4 పలములు నేతిని పోయవలయును. ఆపిమ్మట రాగిపాత్రములో బెల్లమును పాకము పట్టురీతిగా పక్వము చేయవలయును. తేనె 8 పలములును తవక్షీరి, శిలాజిత్తు, లవంగపుపట్ట, వృషభ మను గంధద్రవ్యము, వాయువిడంగములు, పిప్పళ్లు, శొంఠి, జీలకఱ్ఱ వీటిని ఒక్కొకపల మును, త్రిఫలములు, ధనియములు, తాడిశపత్రి, మిరియములు, నాగకేసరము వీని నరర్ధ ఫలమును తెచ్చి కలిపి చూర్ణముచేసి చక్కగా వస్త్రకాళితమును పట్టి, సున్నినుండలో పెట్టి యుంచవలయును. పిదప కాలానుసారముగా తులమంత నుపయోగింపవలయును. దీనిపైని ఆవుపాలతోటి అనుపానమును మాంసరసము పాలు సేవింపవలయును. గొప్ప వియును బలకరము లగు ననుపానముల నీయవలయును. చమురుకల మాంసాదిపదార్థ ముల బెట్టవలయును. ఇయ్యది గక్తపిత్తమును క్షయను దగ్గును విశేషముగా పార్శ్వ పునొప్పిని మేహమును శీతపిత్తమును జిలపోటు ఆమ్లపిత్తమును వీనిని నశింపఁజేయు ను. కన్నులకు హితకరము. ధాతువుపు వృద్ధి పొందించును. వీర్యమును కలుగఁజేయును. సౌందర్యము నిచ్చును. సంతోషమును పెంచును. ఈఖండఖాద్యము ఆరోగ్యకరము. పుత్రులఁ గల్గించును. శ్రేష్ఠము. కామమును బలమును పెంపొందించును. శోభనిచ్చును. చులకదనము నిచ్చును అని కొనియాడఁబడినది.

## ఛాగమాంసాదిపద్యములు.

శ్లో. ఛాగం పారావతం మాంసం తిత్తిరిః కృకరా శ్శశాః. 90. కురంగాః కృష్ణసారా శ్చ తేషాం మాంసాని యోజయేత్, నారికేళప యఃపానం సునిషణ్ణకవాస్తుకం. 91. శుష్కమూలకజీరాఖ్యంపటో లం బృహతీఫలం, ఫలం వార్తాకుపక్వామ్రం ఖర్జూరం స్వాదు దాడి మం, 92. గకారపూర్వకం యచ్చ మాంసం చానూపసంభవం, వర్జ

నీయం విశేషేణ ఖండఖాద్యం ప్రకుర్వతా. 93. లోహాంతరవ దత్రాపి పుటనాదిక్రియేష్యతే, యచ్చ పిత్తజ్వరే ప్రోక్తం బహిః రన్తశ్చ భేషజం. 94. రక్తపిత్తే హితం తచ్చ క్షీణక్షతహితం చ యత్.

మేకమాంసము, పావురపుమాంసము, తిత్తిరిపిట్టమాంసము, గోరువంక, కుందేలు, లేళ్లు వీనియొక్క మాంసములును ఈయవచ్చును. కొబ్బరినీళ్లు, చెంచలికూర, చక్రవర్తికూర, ముల్లంగి, జీలకఱ్ఱ, పొట్లకాయ, పెద్దగుమ్మడి, వంకాయ, మామిడికాయ, ఖర్జూరము, తియ్యదానిమ్మపండ్లు, కషాయపూర్వకమగు నన్ని పదార్థములు, మెట్టప్రదేశములలోని జంతువుల మాంసము వీనిని ఖండకాద్యమును భక్షించువారలు ప్రయత్నపూర్వకముగా వదలిపెట్టవలయును. ఇతరలోహములకువలెనే ఇచ్చటకూడ పుటపాకము మున్నగువానిని జేయుట చాల మంచిది. పిత్తజ్వరముల కొఱకు పైకిని లోపలికిని చెప్పిన యౌషధములనే రక్తపిత్తజ్వరములచే బాధపడువారికి గూడ చేయవలయును. ఇట్లులే క్షీణక్షతరోగులకు గూడ నీయవలయును. ఇయ్యది హితము అగును.

ఇట్లు చక్రదత్తయందు రక్తపిత్తాధికారప్రకరణము ముగిసెను.

# ౧౦. రాజయక్ష్మాధికారము.



## క్షయరోగములందు శాల్యాది ప్రయోగములు.

శ్లో. శాలిషష్టిక గోధూమ యవముద్గాదయ శ్శుభాః, మద్యాని జాంగలాః పక్షిమృగా శ్శస్తా విశుష్యతాం. 1. శుష్యతాం క్షీణ మాంసానాం కల్పితాని విధానవిత్, దద్యాత్క్రవ్యాదమాంసాని బృంహణాని విశేషతః. 2. దోషాధికానాం వమనం శస్యతే సవిరేచనం, స్నేహస్వేదోపపన్నానాం స్నేహనం యన్న కర్షణమ్. 3. శుద్ధకోష్ఠస్య యుంజీత విధిం బృంహణదీపనమ్, శుక్రాయత్తం బలం పుంసాం మలాయత్తం హి జీవితమ్. 4. తస్మాద్యత్నేన సంరక్ష్యే ద్యక్ష్మిణో మలరేతసీ, సపిప్పలీకం సయవం సకులుత్థం సనాగరం. 5. దాడిమామలకోపేతం సిద్ధమాజరసం పిబేత్, తేన షడ్వినివర్తంతే వికారాః పీనసాదయః. 6 రసే ద్రవ్యాంబుపేయావ త్సూపశాస్త్రవశా దిహ, పలాని ద్వాదశ ప్రస్థే ఘనేథ తనుకే తు షట్. 7. మాంసస్య వటకం కుర్యాత్పల మచ్ఛతరే రసే, ధన్యాక పిప్పలీ విశ్వదశమూలీజలం పిబేత్. 8. పార్శ్వశూల జ్వరశ్వాస పీనసాదినివృత్తయే, అశ్వగంధామృతాభీరు దశమూలీ బలావృషాః. 9. పుష్కరాతివిషే ఘ్నంతి క్షయం క్షీరరసాశినః.

వరిబియ్యము, అరుమాసములకు పండెడిధాన్యము గోధుమలు యవలు పెసలు మున్నగు ధాన్యములును మద్యములు అడవిజాతులగు పక్షులు మృగములు మున్నగువాని మాంసములును విశేషముగా క్షయరోగికి ఉత్తమములగు పథ్యములు. క్షీణించుచున్న వారలకు ఎండిన మాంసము గలవారలు అగు క్షయరోగులకు మాంసము తినెడి జాతిలో చేరిన మృగముల మాంసమును వైద్యుఁడు ఇప్పించుచుండవలయును. విశేషముగా వీర్యకారకము లగు పదార్థముల నియ్యవలయును. దోషాధిక్యము గలవారలకు వాంతు లగుటకు విరేచనములకు మందు నీయవలయును. చమురు, చెమ్మట వీటిచేత కలిగిన రోగులకు స్నేహనము చేయింపవలయును. కాని వటిపిడి కలుగునట్లు చేయింపరాదు. కోష్ఠములు బిగిం

చినవారికి బృంహణదీపనములను గలిగించు క్రియలను చేయవలయును. ఏలయనఁగా పురుషులకు బలము వీర్యము ననుసరించి యుండును. జీవితము మలము ననుసరించి యుండును. ఈకారణమువలన క్షయరోగులకు ప్రయత్నపూర్వకముగా మలమును వీర్యమును కాపాడుచుండవలయును. పిప్పళ్లు కొడిసెపాల యవలు ఉలవలు శొంఠి దానిమ్మరసము ఉసిరిక వీటితోటి పక్వముచేయఁబడిన మేకమాంసపురసమును త్రాగింపవలయును. ఇద్దానిచేత పీనస మొదలగు నారువికారములు నశించును. రసమునందు ద్రవ్యములను నీటిని పానకములలోవలెనే సూపశాస్త్రము ననుసరించి ప్రస్థపరిమాణజలమునకు ౧-౨ పలములు చేర్పవలయును. గట్టిగా చేయవలసియున్న నిట్లు చేయవలయును. పల్చనగా చేయవలసినచో నారుపలములను మాత్రమే చేర్పవలయును. పరిశుద్ధము చేసిన రసములో ఒక పలమంతగా మాంసమునునూరి కలిపివేయవలయును. ధనియములు, పిప్పళ్లు, శొంఠి, దశమూలములు వీటియొక్క కషాయమును త్రాగవలయును. అశ్వగంధ (పెన్నేరు) తిప్పతీగె పిల్లపీచర దశమూలము ముత్తువపులగము వృషభక మనుగంధద్రవ్యము అడ్డసరము పుష్కరమూలము అతివస వీటియొక్క చూర్ణమును పాలను మాంసపురసమును సేవించినయెడల క్షయరోగములు నశించి పోవును.

## దశమూల సలలితాదిప్రయోగము.

శ్లో. దశమూల బలా రాస్నా పుష్కరసురదారు నాగరైః క్వథితమ్, పేయం పార్శ్వాంసశిరోరుక్ క్షయకాసాదిశాంతయే సలిలమ్. 10. కకుభత్వఙ్నాగబలా వానరబీజాని చూర్ణితం పయసి, పక్వం ఘృతమధుయుక్తం ససితం యక్ష్మాదికాసహరమ్. 11. పారావత కపిచ్ఛాగ కురంగాణాం పృథక్పృథక్, మాంసచూర్ణ మజాక్షీరం పీతం యక్ష్మహరం పరం. 12. ఘృతకుసుమసారలీఢం క్షయం క్షయం నయతి గజబలామూలం, దుగ్ధేన కేవలేన తు వాయసజంఘాని పీతైర్వా. 13. కృష్ణాద్రాక్షాసితాలేహః క్షయహా క్షౌద్రతైలవాన్, మధుసర్పిర్యుతో వాశ్వగంధా కృష్ణాసితోద్భవః. 14. శర్కరా మధుసంయుక్తం నవనీతం లిహన్ క్షయీ, క్షీరాశీ లభతే పుష్టి మశ్నతే చాజ్యమాక్షికే. 15.

దశమూలములు ముత్తువపులగము సన్నరాస్న పుష్కరమూలము దేవదారు శొంఠి వీటి నన్నిఁటిని కషాయమును కాచి త్రాగవలయును. ఇయ్యది పార్శ్వపునొప్పి తలనొప్పి క్షయ దగ్గు మొదలగువానిని శాంతి పొందించును. మద్దిపట్ట తీర నాగబల దూలగొండివిత్తులు వీటిని చూర్ణముచేసి పాలలో చక్కఁగా కాచి, నెయ్యి తేనె

వీనితో కలిపి కండచక్కెర కలిపి భక్షించినయెడల క్షయరోగము మున్నగు రోగము లను దగ్ధను నశింపచేయును. పావురము కోతి మేక లేడి వీటిమాంసమును వేరు వే రుగా చూర్ణము చేసి మేకపాలతో కలిపి పుచ్చుకొనవలయును. ఇందువలన క్షయ రోగము నశించును. నేయి జాజికాయ నాగకేసరములు నాగబల చూర్ణించి వీటిన న్నిఁటిని కలిపి నూరవలయును. లేకున్న నేరుగా కలిపి త్రాగినయెడల కాకజంఘ (క్షయరోగము) నశింపచేయును.

పిప్పళ్లు ద్రాక్ష కలకండ తేనె వీటితో చేసిన లేహము క్షయరోగములను నశింపచేయును. లేకపోయినచో అశ్వగంధ పిప్పళ్లు కలకండ నేయి వీటితో చేసిన లేహమైనను క్షయరోగములను నశింపఁజేయును. కండచక్కెరలోను తేనెలోను నవనీత మును కలిపికొని సేవనచేయుచు పాలతోటి యన్నమును తినువారగు క్షయరోగులు బలము నొందఁగలరు. ఇయ్యౌషధమునందు (అనఁగా దీనిని సేవించుకాలమునందు) నేతిని తేనెను ఎక్కువగా భక్షింపరాదు.

## సితోపలాదిలేహ్యము.

శ్లో. సితోపలా తు గోక్షీరీ పిప్పలీ బహులా త్వచః, అన్త్యా దూర్ధ్వం ద్విగుణితం లేహయేత్ క్షౌద్రసర్పిషా. 16. చూర్ణితం ప్రాశ యేదేత చ్ఛ్వాసకాసక్షయాపహమ్, సుప్తజిహ్వా రోచకిన మల్పాగ్నిం పార్శ్వశూలినమ్.17. హస్తపాదాంసదాహేషు జ్వరే రక్తే తథోర్ధ్వగే.

కండచక్కెర 16 భాగములు, తవక్షీరి 8 భాగములు, పిప్పళ్లు 4 భాగములు, ఏల కులు 2 భాగములు, లవంగపుపట్ట ఒకభాగము వీని నన్నిటిని కలిపి చక్కగా నూరి తే నెలోను కలిపి సేవింపవలయును. ఇయ్యది శ్వాసము, దగ్గు, క్షయరోగము నశింపఁజేయు ను. మఱియును నాలుక మొద్దుబారియుండుట, అరోచకము, అగ్నిమాంద్యము, పా ర్శ్వపునొప్పి, ఈరోగములను పోఁగొట్టి చేతులు, కాళ్లు, భుజములు మున్నగునవి మండు నప్పుడును జ్వరమునందును ఊర్ధ్వగత మగు రక్తపిత్తమునందును హితమును కలిగించును. ఇయ్యది సితోపలాదిలేహ మనఁబడును.

## లవంగాద్యచూర్ణము.

శ్లో. లవంగ తక్కోల ముశీర చందనం నతం సనీలోత్పలజీరకం స మమ్, త్రుటి స్సకృష్ణాగురుభృంగకేసరం కణాసవిశ్వానలదం సహాంబు దమ్. 18. అహీంద్రజాతీఫలవంశలోచనా సితాష్టభాగం సమసూక్ష్మ చూర్ణితమ్, సురోచనం తర్పణ మగ్నిదీపనం బలప్రదం వృష్యతమం

త్రిదోషనుత్, 19. ఉరోవిబంధం తమకం గళగ్రహం సకాససహిక్కా రుచియక్ష్మపీనసమ్, గ్రహ ణ్యతీసార భగందరార్బుదం ప్రమేహగుల్మాం శ్చ నిహంతి సజ్వరాన్. 20.

లవంగములు, తక్కోలములు, వట్టివేళ్లు, రక్తచందనము, నల్లగల్వలు, జీలకఱ్ఱ, ఏలకులు, నల్లజీలకఱ్ఱ, అగరు, దాల్చినపట్ట, నాగకేసరములు, జటామాంసి, పిప్పళ్లు, శొంఠి, తుంగముస్తెలు, నాగకేసరములు, జాజికాయ, కుంకుమపువ్వు, తవక్షీరి వీని నన్నిటిని సమానభాగములుగా తీసికొనవలయును. ఇందులో కలకండను ఎనిమిదిభాగములు చేర్చి అన్నిటినిచూర్ణము చేయవలయును. ఈచూర్ణము రుచిని పుట్టించును. తృప్తినిఁ గలిగించును. ఆకలిని పుట్టించును. బలము నిచ్చును. వీర్యమును వృద్ధినొందించును. మఱి యును త్రిదోషములను నశింపఁజేయును. ఱొమ్మునొప్పి తమకము శ్వాసము గళగ్ర హము దగ్గు వెక్కిళ్లు అరుచి క్షయరోగము పీనస గ్రహణి అతిసారము భగంధరరోగ ము అర్బుదరోగము మేహరోగము గుల్మవ్యాధులు జ్వరము మున్నగువానిని నశింపఁజే యును. ఇయ్యదియే లవంగాద్యచూర్ణ మని చెప్పఁబడును.

తాడిశచూర్ణము.

శ్లో. తాళీసపత్రం మరిచం నాగరం పిప్పలీ శుభా, యథోత్త రం భాగవృద్ధ్యా త్వగేలే చార్ధభాగికే. 21. పిప్పల్యష్టగుణా చాత్ర ప్ర దేయా సితశర్కరా, శ్వాసకాసారుచిహరం తచ్చూర్ణం దీపనం పరం. 22. హృత్పాండుగ్రహణీరోగ ప్లీహశోషజ్వరాపహం, ఛర్ద్యతీసారశూ లఘ్నం మూఢవాతానులోమనం. 23. కల్పయే ద్గుటికాం చైత చ్చూర్ణం పక్త్వా సితోపలం, గుటికాహ్యగ్నిసంయోగా చ్చూర్ణా ల్లఘుతరా స్మృ తాః. 24. పైత్తికే గ్రాహయం త్యేకే శుభయా వంశలోచనామ్.

తాడిశపత్రి ఒకభాగము, మిరియములు 2 భాగములు, శొంఠి 3 భాగములు, పిప్పళ్లు నాల్గుభాగములు, తవక్షీరి ౫ భాగములు, ఏలకులుదాల్చినపట్ట అర్థఅర్ధభాగము, పిప్పళ్లు 8 భాగములు మఱియు నిందులో తగినట్లు తెల్లచక్కెర కలిపి చూర్ణము చే యవలయును. ఈచూర్ణము శ్వాసము దగ్గు అరుచి వీటిని హరించును. చక్కగా జఠ రాగ్నిని దీపింపచేయును. హృద్రోగము పాండురోగము గ్రహణి పీనసరోగము శోషజ్వరములను పోఁగొట్టును. మఱియును ఛర్ది అతిసారము శూల వీనినిగూడ హరిం చును. మూఢవాతము ననుకూలముగా త్రిప్పును. కలకండను పాకముచేసి దానిలో నీచూర్ణమును కలిపి మాత్రలను కట్టవలయును. ఈమాత్రలు నిప్పుసెగ చూపినందువలన

చూర్ణముకంటెను తేలికవి యగుచున్నవి. అనేకులు వైద్యులు పిత్తమువలనఁ బుట్టిన క్షయరోగములలో నీచూర్ణమును వాడియున్నారు. మూలమునందు శుభయా అని చెప్పినందున వంశలోచన అని అర్థము చేసికొనవలయును. ఇయ్యదియే తాడిశచూర్ణ మనఁబడును.

## వింధ్యవాసియోగము.

శ్లో. శృంగార్జునాశ్వగంధా నాగబలా పుష్కరాభయా చ్ఛిన్న రుహాః, తాలీసాదిసమేతాః లేహ్యా మధుసర్పిభ్యాం యక్ష్మహారాః. 25. మధుతాప్య విడంగాశ్మ జతులోహ ఘృతాభయాః, ఘ్నంతి యక్ష్మాణ మత్యుగ్రం సేవ్యమానా హితాశినా. 26. వ్యోషం శతావరీ త్రీణి ఫలాని ద్వే బలే తథా, సర్వామయహరో యోగః సోయం లోహగ జోన్వితః. 27. ఏష వక్షఃక్షతం హంతి కంఠజాం శ్చ గదాం స్తథా, రాజయక్ష్మాణ మత్యుగ్రం బాహుస్తంభ మథార్దితం, 28.

కర్కాటకశృంగి, మద్దిపట్ట, పెన్నేరుగడ్డ, నాగబల, పుష్కరమూలము, కరకకాయ, తిప్పతీగె, తాడిశపత్రి, మిరియాలు, శొంఠి, పిప్పళ్లు, తవక్షీరి, దాల్చినచెక్క, ఏలకులు వీనిని చేర్చి చూర్ణించి కలిపి ఈయౌషధులయందు ముందు చెప్పిన తాడిశపత్రి చూర్ణముతో చేసిన ఔషధనికలిపి తేనె, నేయినికూడ నందు చేర్చి భక్షించినచో క్షయరోగములు నశించి పోగలవు. తేనె, వాయువిడంగములు, శిలాజిత్తు, లోహభస్మము, నేయి, కరకకాయ వీటిని లేహముచేసి భక్షించుచు హితకరముగా భోజనమును చేయవలయును. ఇట్లు చేసినయెడల అతిభయంకరము లైన క్షయరోగములను కూడ నశింపఁజేయును. శొంఠి, మిరియములు, పిప్పళ్లు, పిల్లిపీచర [దీనినే కొందఱు చల్లగడ్డ యందురు.] త్రిఫలములు నాగబల ముత్తవపులగము లోహభస్మము వీటితో చేయఁబడు యోగము అన్నివిధములైన రోగములను హరింపఁజేయును. ఇయ్యది ఱొమ్మునొప్పి గొంతుసంబంధము లగు నన్నిరోగములను పోఁగొట్టును. మఱియును మిక్కిలి భయంకరము లగు క్షయరోగములను చచ్చులను అర్దిత మను రోగమును హరించును. ఇయ్యది వింధ్యవాసియోగ మనఁబడును. దీనినే కొందఱు శృంగ్యర్జునాది యోగ మందురురట.

## రసేంద్రగుటిక.

శ్లో. కర్షః శుద్ధరసేంద్రస్య స్వరసేన జయార్ద్రయోః, శిలాయాం ఖల్వయే త్తావ ద్యావ త్పిండం ఘనం తతః. 29. జలకర్ణా కాకమాచీ రసాభ్యాం భావయే త్పునః, సౌగంధికఫలం భృంగస్వరసేన

విభావితం. 30. చూర్ణితం రససంయుక్త మజాక్షీర పలద్వయే, ఖల్వితం ఘనపిండం తు గుటీం స్విన్నకలాయవత్. 31. కృత్వాదౌ శివ మభ్యర్చ్య ద్విజాతీ స్పరితోష్య చ, జీర్ణాన్నే భక్షయే దేకాం క్షీరమాంసర సాశనః. 32. సర్వరూపం క్షయం కాసం రక్తపిత్త మరోచకం, అపి వైద్యశతై స్త్యక్త మమ్లపిత్తం నియచ్ఛతి. 33.

యథావిధిగా శుద్ధిచేసిన పాదరసము ఒకకర్షము తెచ్చి ఖల్వములో వేసి తక్కిలిరసము అల్లపురసముల నందుచేర్చి చక్కగా నూరవలయును. బాగుగా ముద్దగట్టువఱకిట్లు మర్దింపవలెను. చాగమట్టరసమునందు మఱల దానిని భావనచేయవలయును. తఱువాత ఏలకులు లవంగపట్ట జాపత్రి నాగకేసరములు వీటిని చూర్ణమును ఒకపలమునందు కలిపి గుంటకలగరాకురసమునందు భావన కట్టవలయును. ఆపిమ్మట చూర్ణమును చేసి మేకపాలు రెండుపలముల తెచ్చి వానితో చక్కగా మర్దింపవలయును. గట్టిగానై ఉండకట్టునంతవఱ కిట్లు మర్దించి సెనగగింజ లంతంత మాత్రలను చేసికొని మొదట నీశ్వరుని పూజించి, బ్రాహ్మణుల సంతోషపెట్టి అన్నము జీర్ణమైన పిమ్మట ఒకమాత్రను తినవలయును. పాలు మాంసపురసమును భుజింపవలయును. ఈమాత్రలు అన్ని విధము లగు క్షయ దగ్గు రక్తపిత్తము అరోచకము మున్నగువానిని వందలకొలఁబడి వైద్యులు చికిత్సచేసి సాధింపనేరక వదలివైచిన అమ్లపిత్తములను తొలగించును. ఇయ్యది రసేంద్రగుటిక యనఁబడును.

## ఏలాదిమంథము.

శ్లో. ఏలాజమోదామలకాభయాక్ష గాయత్రినింబాశనశాలసారాన్, విడంగభల్లాతకచిత్రకాం శ్చ కటుత్రికాంభోదసురాష్ట్రికా శ్చ. 34. పక్త్వా జలే తేన పచే త్తు సర్పి స్తస్మి న్సుసిద్ధే త్వవతారితే చ, త్రింశత్పలా న్యత్ర సితోపలాయా దద్యాత్తు గోక్షీరపలాని షట్చ. 35. ప్రస్థే ఘృతస్య ద్విగుణం చ దద్యాత్ క్షౌద్రం తతో మంథహాతం నిదధ్యాత్, పలంపలం ప్రాత రతో లిహే చ్చ పశ్చాత్పిబేత్ క్షీర మతంద్రిత శ్చ. 36. ఏత ద్ధి మేధ్యం పరమం పవిత్రం చక్షుష్య మాయుష్య తమం తథైవ, యక్ష్మాణ మాశు వ్యపహంతి శూలం పాండ్వామయం చాపి భగందరం చ. 37. న చాత్ర కించి త్పరివర్జనీయం రసాయనం చైత దుపాస్యమానం.

ఏలకులు, వామము, ఉసిరిక, కరక, తాడి, చంద్రచెక్క, వేపచేవ, వేగిస చేవ, మద్దిచేవ వీటియొక్కరసమున్ను, వాయువిడంగములు, జీడివిత్తనములు, చిత్రమూలము, శొంఠి, మిరియములు, పిప్పళ్లు, తుంగముస్తలు, తొవరిమన్ను వీనిన్నింటి కషాయము చేసి ఆకషాయమునందు నేతిని పోసి పక్వముచేసి నేయి పరిశుద్ధముగా సిద్ధమైనప్పుడు పొయినుండి దింపి 30 పలముల కలకండనందులో చేర్చి 6 పలముల తవక్షీరిని కూడనందు వేయవలయును. 16 పలముల ప్రమాణములో రెండురెట్లు తేనెను కలిపి పిష్టట కవ్వముతో చిలుకవలయును. ఇట్లు సిద్ధముచేసిన ఈయౌషధమును ప్రాతఃకాలములలో లేచి పలము చొప్పున సేవింపవలయును. తరువాత మెల్లగా పాలనుకూడ త్రాగుచుండవలయును. ఈమంథము పరిశుద్ధమైనదియును మిగుల పవిత్రమైనదియు నైయున్నయది. ఇది నేత్రములకు దివ్యామృతము. ఆయుష్యమును పెంపొందించును. క్షయరోగమును శూలరోగమును పాండురోగమును తత్క్షణమే నశింపఁజేయును. భగందరరోగములఁ గూడ నపహరించును. ఈగంధములో పరిహరింపఁదగిన (అనగా పాఱవేయఁదగు) పదార్థమేదియును లేదు. ఈరసాయనము సేవింప తగినది. ఇయ్యది ఏలాదిమంథము రసాయన మనఁబడును.

## సర్పిర్గుడము.

శ్లో. బలా విదారీ హ్రస్వా చ పంచమూలీ పునర్నవా, పంచానాం క్షీరవృక్షాణాం శుంగా ముష్ట్యంశికాః పృథక్. 38. ఏషాం కషాయే ద్విక్షీరే విదార్యా జరసాంశికే, జీవనీయైః పచేత్కల్కై రక్షమాత్రైః ఘృతాఢకం. 39. సితాపలాని పూతే చ శీతేద్వాత్రింశ దావపేత్, గోధూమపిప్పలీవాంశీ చూర్ణం శృంగాటకస్య చ. 40. సమాక్షికం కౌడవికం తత్సర్వం ఖజమూర్ఛితం, స్త్యానం సర్పిర్గుడాన్కృత్వా భూర్జపత్రేణ వేష్టయేత్. 41. తాన్జగ్ధ్వా పలికాన్ క్షీరం మద్యం చాను పిబేత్కఫే, శోషే కాసే క్షతక్షీణే శ్రమస్త్రీభారకర్శితే. 42. రక్తనిష్ఠీవనే తాపే పీనసే చోరసి స్థితే, శస్తాః పార్శ్వశిరశ్శూలే భేదే చ స్వరవర్ణయోః. 43. క్వాథ్యే త్రయోదశపలే ద్రవ్యాల్పత్వాభయా జ్జలం, అష్టగుణం క్వాథసమో విదార్యాజరసో పృథక్. 44. కేచిద్యథోక్తక్వాథ్యే తు క్వాథం ఘృతసమం జగుః.

ముత్తవపులగము నేలగుమ్మడు లఘుపంచమూలనులు శొంఠి గజ్జెరుక్షీరవృక్షపంచకము, అనఁగా జువ్వి మఱ్ఱి రావి మేడిదిరిసెలు వీటిచిగుటాకులు మొగ్గలు వీటిని ఒక్కొక్క

టియునొక్కొక్క పిడికెడు చొప్పున వేఱువేఱుగా తీసికొనవలయును. పిమ్మట వీనిని కషాయముపెట్టి ఆకషాయమునందు రెండురెట్లు పాలుకలిపి నేలగుమ్ముడుయొక్కయును మేకమాంసముయొక్కయు రసమును కలిపి దానియందు మేద మహామేద కాకోలి మొదలగువానిని ఒక్కొక్కకర్షము చొ॥ తీసికొని కల్కముచేసి కలిపి 64 పలముల నేతిని అందుపక్వము చేయవలయును. చక్కగా పక్వమైనపిమ్మట ద.సి చల్లార్చి వడియకట్టి అందులో 32 పలముల కలకండను కలిపి తరువాత గోధుమలు పిప్పళ్లు తవక్షీరి వీటిని చూర్ణమును చేసి ఆచూర్ణమును తేనెను 14 పలములచొప్పున కలపవలయును. తరువాత వీని నన్నింటిని చక్కగా చిలికి ఒక్కొక్కపల మంత కుడుములను చేసి భుజపత్రపుటాకులో చుట్టి పెట్టవలయును. ఇట్టి కుడుములలో నొక్కొక్కటి చొప్పున ప్రతిదినమును తిని ఆమీదట పాలను గాని మద్యమును గాని త్రాగుచుండవలయును. కఫరోగమునందును శోషము అనగా క్షయయందును క్షతక్షీణములయందును పరిశ్రమలు బరువుమోయుట స్త్రీసంగమము ఇట్టివానిచేత నాకర్షింపఁబడిన వానియందును రక్తచ్ఛర్దులలోను జ్వరమునందును పీనసయందును ఎదురురొమ్ములోని శూలలయందును పార్శ్వపునొప్పులవిషయమునను తలనొప్పియందును స్వరభేదము మాటల మార్పు మున్నగువానియందును ఈకుడుము లత్యుత్తమముగా గుణము నిచ్చునని చెప్పఁబడినవి. పదమూఁడుపలముల కషాయపు వస్తువులు స్వల్పముగు నేమొ? యనుశంక యున్నచో వీటి నెన్నిదిరెట్లుగా గ్రహింపవలయును. కషాయముతో సమముగా నేలగుమ్ముడు రసమును మేకమాంసపు రసమును వేరు వేరుగా తీసికొనవలయును. కొందఱు వైద్యులు పై చెప్పిన కషాయవస్తువులలో నేతితో సమముగా కషాయముగూడ నుండవలయు నని చెప్పిరి.

## చ్యవనప్రాశము.

శ్లో. బిల్వాగ్నిమంథస్యోనాక కాశ్మర్యః పాటలీ బలా. 45. పర్ణ్యశ్చతస్రః పిప్పల్యః శ్వదంష్ట్రా బృహతీద్వయం, శృంగీతామలకీ ద్రాక్షా జీవంతీ పుష్కరాగురు. 46. అభయా సామృతా ఋద్ధిర్జీవకర్షభకా శఠీ, ముస్తం పునర్నవా మేదా సూక్ష్మే లోత్పలచందనే. 47. విదారీ వృషమూలాని కాకోలీ కాకనాసికా, ఏషాం పలోన్మితాన్భాగాన్ శతాన్యామలకస్య చ. 48. పంచ దద్యాత్తదైకథ్యం జలద్రోణే విపాచయేత్, జ్ఞాత్వా గతరసా న్యేతా న్యౌషధా న్యథతం రసం. 49. తచ్చామలక మృద్ధృత్య నిష్కులం తైలసర్పిషోః.

పలద్వాదశకే భృష్ట్వా దత్వా చార్ధతులాం భిషక్. 50. మత్స్యండి కాయాః పూతాయాః లేహవ త్సాధు సాధయేత్, షట్పలం మధున శ్చాత్ర సిద్ధశీతే ప్రదాపయేత్. 51. చతుష్పలం తు గోక్షీర్యాః పిప్ప ల్యా ద్విపలే తథా, పల మేకం నిదధ్యా చ్చ త్వగేలాపత్ర కేసరాత్. 52. ఇ త్యయం చ్యవనప్రాశః పర ముక్తో రసాయనః, కాసశ్వాసహార శ్చైవ విశేషేణోపదిశ్యతే. 53. క్షీణక్షతానాం వృద్ధానాం బాలా నాం చాంగవర్ధనమ్, స్వరక్షయ మురోరోగం హృద్రోగం వాతశోణి తమ్. 54. పిపాసాం మూత్రశుక్ర స్థాన్ దోషాం శ్చై వాపకర్షతి, అస్య మాత్రాం ప్రయుంజీత యో పరుంధ్యా న్నభోజనం. 55. అస్య ప్రయో గా చ్చ్యవనః సువృద్ధో భూ త్పున ర్యువా, మేధాం స్మృతిం కాంతి మనామయత్వం వపుః ప్రకర్షం బల మింద్రియాణాం, స్త్రీషు ప్రహర్షం పర మగ్నివృద్ధిం వర్ణప్రసాదం పవనానులోమ్యం. 56. రసాయన స్యాస్య నరః ప్రయోగా ల్లభేత జీర్ణోఽపి కుటీప్రవేశాత్, జరాకృతం పూర్వ మపాస్య రూపం బిభర్తి రూపం నవయౌవనానాం. 57. సితామత్స్యండి కాలాభే ధాత్ర్యా శ్చ మృదుభర్జనం, చతుర్భాగజలే ప్రాయః ద్రవ్యం గతరసం పిబేత్. 58.

బిల్వము కూరనెల్లి పాదిరివేళ్లు నేలగుమ్ముడు చిట్టాముట్టి కారుమినుము కారుపెసర కోలపొన్న ముయ్యాకుపొన్న పిప్పళ్లు పల్లేరు వాకుడు పెద్దములక కర్కాటకశృంగి నేలయుసిరిక ద్రాక్ష మనుబాల పుష్కరమూలము అగరు కరకకాయ తిప్పతీగె ఋద్ధి జీవక మను ద్రవ్యము ఋషభక మను గంధద్రవ్యము కచ్చూరము తుంగముస్తెలు కొంతి మేద చిన్నఏలకులు గలిజేరు నల్లకలువ చందనము నేలగుమ్ముడు అతివస కాకోలి కాకిదొండ వీనినన్నింటిని ఒక్కొక్కపలముగా తీసికొనివచ్చి ఉసిరిక 100 పలములను తీసికొనవలయును. అన్నింటిని కలిపి ద్రోణపునీరుబోసి చక్కగా వండ వలయును. అందలి రస మంతయు నౌషధములకు నిశ్శేషముగా పట్టిన తరువాత అరస మును ఉసిరికకాయలను తీసి పొట్టుతీసి తైలము నెయ్యి 12 పలములు తెచ్చి దానిలో వేసి వేయించి అపిమ్మట చక్కగా నన్నింటిని కలియఁబెట్టి లేహమువలె సిద్ధము చేయ వలయును. ఇట్లుచేసిన దీనిలో 6 పలముల తేనెను చల్లారినపిమ్మట వేసి తవక్షీరిని నాలు గుపలములు, పిప్పళ్లు 2 పలములు లవంగపుపట్ట ఏలకులు జాపత్రి నాగకేసరములు ఇవి అన్నియును ఒక్కొక్కపలము చొప్పునను వేయవలయును. ఇట్లు చేయఁబడినరసాయ

నమును చ్యవనప్రాశమని యందురు. ఇయ్యది విశేషముగా దగ్గులను శ్వాసరోగములను పోగొట్టును. బలముడిగినవారలు, ముదుసళ్ళు, పసిపిల్లలు వీరికి అవయవములకు బలము నిచ్చును. స్వరక్షయము బొమ్మునొప్పి కడుపునొప్పి వాతరక్తము దాహము మూత్రదోషము వీర్యదోషము వీనినిపోగొట్టును. ఈయౌషధమును సేవించునప్పుడు అన్నమునునిల్పుదల చేయరాదు. దీనిని సేవించుటచేత ముదుసలియైన చ్యవనమహాముని ప్రాయపువాఁడయ్యెను. ఇయ్యది బుద్ధిని, జ్ఞాపకశక్తిని, కాంతిని, ఆరోగ్యమును, దేహమునకు లాఘవమును, ఇంద్రియములకు బలమును, సంతోషమును, అగ్నివృద్ధిని, చక్కని కాంతినిచ్చి వాయువుయొక్క క్రిందుమీఁదులను పోగొట్టి వృద్ధిపొందించును. ఈరసాయనమును సేవించుటచేత ముసలివాఁడును యౌవనమునొందును. కాని కుటీప్రవేశము మాత్ర మవశ్యకార్యము. మఱియును ముసలితనము గల తనపూర్వపురూపును తొలగించికొని క్రొత్తదియగు యౌవనరూపమును ధరింపఁగలుగును. ఈరసాయములోనికి అనుపానము అగు చెఱకుపాకు దొరకనియెడల చక్కెరను వేసికొనవలయును. మఱియును లేతయుసిరికలను వేయించి వేయవలయును. మఱియును సామాన్యముగా నాల్గవభాగము నీటిలో వస్తువులరసము చేరుచున్నది. ఇయ్యదియే చ్యవనప్రాశ మనఁబడును.

## జీవంత్యాదిఘృతము.

శ్లో. జీవంతీం మధుకం ద్రాక్షాం ఫలాని కుటజస్య చ, శఠీ పుష్కరమూలం చ వ్యాఘ్రీం గోక్షురకం బలాం. 59. నీలోత్పలం తామలకీం త్రాయమాణాం దురాలభాం, పిప్పలీం చ సమం పిష్ట్వా ఘృతం వైద్యో విపాచయేత్. 60. ఏత ద్వ్యాధిసమూహస్య రోగేశస్య సముత్థితం, రూప మేకాదశవిధం సర్పి రగ్ర్యం వ్యపోహతి. 61.

పాలకూర యష్టిమధుకము ద్రాక్ష కొడిసెపండ్లు కచ్చూరము పుష్కరమూలము నేలములక పల్లేరు చిట్టాముట్టి నల్లకల్వలు నేలయుసిరిక అగరుశొంఠి దులదగొండిలేక తీటకసింద పిప్పళ్ళు ఇవి యన్నియు సమానభాగములుగా తెచ్చి వానియందు నేయిపోసి పక్వము చేయవలయును. ఇయ్యది శ్రేష్ఠమైన ఘృతము. రోగముల గుంపుల నన్నిటిని నశింపఁజేయును. పదునొకండు తెఱఁగులగు క్షయరోగములను కూడ నీజీవంత్యాదిఘృతము నాశనము నొందించును. ఇయ్యది జీవంత్యాదిఘృత మనంబడును.

## పిప్పలీఘృతము.

శ్లో. పిప్పలీగుడసంసిద్ధం ఛాగక్షీరయుతం ఘృతం, ఏత దగ్నివివృద్ధ్యర్థం సర్పి శ్చ క్షయకాసినాం. 62.

పిప్పళ్ళు బెల్లము మేకపాలు వీటితో పక్వము చేయఁబడిన నేయి క్షయ దగ్గ కలవారలకు జఠరాగ్ని నుద్దీపింపఁజేయును. ఇయ్యది పిప్పలీఘృతము.

పారాశరఘృతము.

శ్లో. యష్టీ జలా గుడూ చ్యల్పపంచమూలీ తులాం పచేత్, శూర్పే ఽపా మష్టభాగస్థే తత్ర పాత్రం పచే ద్ఘృతం. 63. ధాత్రీవి దారీస్వరసే త్రిపాత్రే పయసోర్మణే, సుపిష్టై ర్జీవనీయైశ్చ పారాశర మిదం ఘృతం. 64. సస్సైన్యం రాజయక్ష్మాణా మున్మూలయతి శీలితం,

యష్టిమధుకము ముత్తవపులగను తిప్పతీగె లఘుపంచమూలములు వీటిని అన్నిటిని కలిపి తులాప్రమాణము తెచ్చి రెండుద్రోణముల నీటిలో వేసి పక్వము చేయుచు ఎనిమిదవ పాలు నీరు మిగు లుండగా 64 పలముల నేతి నందులో బోసి పక్వము చేయవలయును. ఈఘృతము సేనలతో కూడి దండెత్తివచ్చిన రాజయక్ష్మల నైనను (అనఁగా పరివారవ్యాధులతోఁగూడిన క్షయము నైనను) మొదలంటునట్లు నశింపజేయును. ఇయ్యది పారాశరఘృత మనఁబడును.

ఛాగలాద్యఘృతము.

శ్లో. ఛాగమాంసతులాం గృహ్య సాధయే న్నవణేంభసి. 65. పాదశేషేణ తేనైవ ఘృతప్రస్థం విపాచయేత్, ఋద్ధిర్వృద్ధీ చ మేదే ద్వే జీవకర్షభకౌ తథా. 66. కాకోలీ క్షీరకాకోలీ కల్కైః పృథ క్పలోన్మితైః, సమ్యక్సిద్ధే త్వవతార్య శీతే తస్మి న్ప్రదాపయేత్. 67. శర్కరాయాః పలా న్యష్టౌ మధునః కుడపం క్షిపేత్, పలం పలం పిబే త్ప్రాతః యక్ష్మాణం హంతి దుర్జయం. 68. క్షతక్షయం చ కాసం చ పార్శ్వశూల మరోచకం, స్వరక్షయ మురోరోగం శ్వాసం హన్యా త్సుదారుణం. 69.

మేకమాంసము తులాప్రమాణమును తెచ్చి ద్రోణపు నీటిలో వైచి పక్వము చేయవలయును. నాల్గవభాగము నీరు బాకీయుండగా 16 పలముల నేతిని గూడ చేర్చి వండవలయును. కాని పక్వము అగుసమయమునందు ఋద్ధి వృద్ధి మేద మహామేదము తిప్పతీగ ఋషభమను గంధద్రవ్యము కాకోలి క్షీరకాకోలి వీటినన్నిఁటిని వేరు వేరుగా కల్కము చేసి ఒక్కొక్కపలము చొప్పున తీసికొనవలయును. ఇయ్యది దుర్జయ మగు రాజయక్ష్మను పోగొట్టును. క్షతక్షయము కాసను పార్శ్వశూలము అరోచకము స్వరక్షయము ఉదరరోగము శ్వాసము వీనిని పోగొట్టగల్గును.

## ఛాగఘృతము.

శ్లో. తోయద్రోణద్వితయే మాంసం ఛాగస్య పలశతం పక్త్వా, జల మష్టాంశం సుకృతం తస్మి న్విపచే ద్ఘృతం ప్రస్థమ్. 70. కల్కేన జీవనీయానాం కుడవేన తు మాంససర్పి రిదమ్, పిత్తానిలం నిహన్యా త్తజ్జానపి రసకయోజితం పీతమ్. 71. కాసశ్వాసా వుగ్రౌ యక్ష్మాణం పార్శ్వహృద్రుజం ఘోరామ్, అధ్వ వ్యవాయ శోషం శమయతి చైవాపరం కించిత్. 72.

రెండుద్రోణముల నీటిలో మేకమాంసము నూరుపలములను పక్వము చేసి ఎనిమిదవభాగము నీరు బాకీయుండగా దానిలో 16 పలముల నేతిని వండవలయును. చక్కగా పక్వమగు సమయమున బుద్ధి వృద్ధి జీవకము ఋషభమను గంధద్రవ్యము మేద మహామేదము కాకోలి క్షీరకాకోలి వీటిని 4 పలముల కల్కమును సిద్ధము చేయవలయును. రసములో కూర్చిన యీమాంసఘృతమును త్రాగినయెడల పిత్తవాతములను పిత్తవాతములవలనఁ బుట్టిన రోగములను నశింపఁజేయును. మఱియును భయంకర మగు శ్వాసము దగ్గు క్షయరోగము పార్శ్వపునొప్పి హృదయశూలము దారి నడచినందువలనఁ గలుగు శోషము స్త్రీలవలన గలుగు క్షయను మఱియు నితరవిధములగు రోగములను నశింపచేయును.

## అజాపంచకఘృతము.

శ్లో. ఛాగశకృద్రసమూత్ర క్షీరై ర్దధ్నా చ సాధితం సర్పిః, సక్షారం యక్ష్మహరం కాసశ్వాసోపశాంతయే పరమమ్. 73.

మేక పెంటికలరసము పాలు మూత్రము పెరుగు వీటితో సిద్ధము చేయఁబడిన నేతిలో యవక్షారము చేర్చి పక్వముచేసి భక్షించినయెడల శ్వాసము తగ్గిపోవును. ఇయ్యది అజాపంచక మను ఘృత మనఁబడును.

## బలాగర్భఘృతము.

శ్లో. ద్విపంచమూలస్య పచే త్కషాయే ప్రస్థద్వయే మాంసరసస్య చైకే, కల్కం బలాయా స్సునియోజ్యగర్భం సిద్ధం పయః ప్రస్థయుతం ఘృతం చ. 74. సర్వాభిఘాతోత్థితయక్ష్మశూల క్షతక్షయోత్కాసహరం ప్రదిష్టమ్.

దశమూలములయొక్క 2 ప్రస్థాల పరిమితకషాయములో మేకమాంసరసము ఒక ప్రస్థము ముత్తువపులగము కల్కము 16 పలములు, పాలు 16 పలములు ఈరీతిగా ఘృత

మును సిద్ధము చేయవలసినది. ఈఘృతము అన్నివిధము లగు అభిఘాతములవలనఁ బుట్టిన క్షయరోగములు కూల క్షతక్షయము మఱియు భయంకర మగు దగ్గు వీటిని నశింపఁ జేయును.

## నాగబలాఘృతము.

శ్లో. పాదశేషే జలద్రోణే పచే న్నాగబలా తులామ్, తేన క్వాథేన తుల్యాంశం ఘృతం క్షీరం చ సాధయేత్. 75. పలార్ధికై శ్చాతిబలా బలాయష్టిపునర్నవా, ప్రపౌండరీక కాశ్మర్యప్రియాల కపికచ్ఛుభిః. 76. అశ్వగంధాసితాభీరు మేదాయుగ్మ త్రికంటకైః, మృణాలబిసశాలూకశృంగాటక కశేరుకైః. 77. ఏత న్నాగబలా సర్పి రక్తపిత్తక్షతక్షయం, హంతి దాహం భ్రమం తృష్ణాం బలపుష్టికరం పరం. 78. బల్యం మోజస్య మాయుష్యం వలీపలితనాశనం, ఉపయుంజీత షణ్మాసా న్వృద్ధోఽపి తరుణాయతే. 79.

ద్రోణపరిమాణములనీటిని ప్రాయిమీదఁ బెట్టి 64 పలములుగా దిగగాచి నూరు పలముల జిబిలికను పక్వము చేయవలయును. ఈకషాయ మన్ని పాళ్లున్నదానితో సమానముగా కలిపి అంతే నేతిని కూడను కలిపి పక్వము చేయవలయును. తరువాత అతిబల ముత్తవపులగము యష్టిమధుకము గలేరు కమలము నేలగుమ్మడు పాలచెట్టు దురద గొండి పల్లేరు వంశలోచనము పిల్లపిచ్చర లేక చల్లగడ్డ రెండుతెఱగులగు మేదలు పల్లేరు వట్టివేళ్ళు మృణాళము కమలపుగడ్డ గొట్టిపువ్వు తుంగముస్తెలు అను వీటి నన్నిఁటిని అర్ధపలము చొప్పున వేసి పక్వము చేయవలయును. ఇది నాగబలాఘృత మనంబడును. ఇయ్యది రక్తపిత్తములను క్షతక్షయరోగములను పోగొట్టును. దాహము భ్రమ దప్పులను కూడ నశింపఁజేయును. బలము నిచ్చును. తేజస్సు నిచ్చును. ఆయుష్యమును పెంచును. ముడుతలు నెఱియుట వీటిని పోగొట్టును. ఇద్దానిని ఆరుమాసములు సేవింపవలయును. ఈయౌషధసేవవలన ముదుసలికూడ ప్రాయపువాఁడు అగును.

## నిర్గుండీఘృతము.

శ్లో. సమూలఫలపత్రాయాం నిర్గుండ్యా స్స్వరసైః ఘృతం,
సిద్ధంపీత్వా క్షయక్షీణః నిర్వ్యాధి ర్భాతి దేవవత్. 80.

వేళ్ళు ఆకులు కాయలతో కూడకల వావిలిరసముతో నేతినివండి పుచ్చుకొనిన యెడల క్షయరోగముచేత కృశించినమనుజుఁడు దేవునివలెరోగములేనివాడుగా ప్రకాశింప గలుగుచున్నాడు.

### బలాద్యఘృతము.

శ్లో. బలాశ్వదంష్ట్రా బృహతీ కలశీ ధావనీ స్థిరాం, నింబం పర్పటకం ముస్తం త్రాయమాణాం దురాలభాం. 81. కృత్వా కషాయం పేష్యార్థం దద్యాత్త్వామలకీం శఠీం, ద్రాక్షాం పుష్కరమూలం చ మేదా మామలకాని చ. 82. ఘృతం పయశ్చ తత్సిద్ధం సర్పి ర్జ్వరహరం పరం, క్షయకాసప్రశమనం శిరఃపార్శ్వరుజాపహం. 83. చరకోదిత వాసాద్యఘృతానంతర ముక్తితః, వదంతీహ ఘృతా త్క్వాథం పయశ్చ ద్విగుణం పృథక్. 84.

ముత్తువపులగము, పల్లేరు, పెద్దములక, కోలపొన్న, నక్కతోకపొన్న, ముయ్యాకుపొన్న, వాకుడు, రేలచెక్క, పర్పాటకము, తుంగముస్తెలు, కలుగ్రానుగ, చిన్నదూలగొండి వీటిని కషాయమును బెట్టికొని ఉసిరిక, కచోరము, ద్రాక్ష, పుష్కరమూలము, మేద, ఉసిరికకాయలు, నేయి, పాలు చేర్చి పక్వము చేయవలయును. ఇట్లు సిద్ధము చేసిన ఘృతము జ్వరములను పోగొట్టును. క్షయ దగ్గులను తగ్గించును. తలనొప్పి పార్శ్వపునొప్పి వీని నపహరించును. ఇయ్యది చరకఋషిచే చెప్పఁబడిన వాసాద్యఘృతము తరువాత చెప్పుటచేత కొందరు నేతికంటెను కషాయమును పాలును రెండురెట్లుగా తీసికొనవలయు నని చెప్పెదరు.

### చందనాద్యతైలము.

శ్లో. చందనాంబునఖం వాప్యం యష్టీశైలేయపద్మకం, మంజిష్ఠా సరలం దారు శఠ్యేలాపూతికేసరం. 85. పత్రం తైలం మురామాంసీ తక్కోలం వనితాంబుదం, హరిద్రే శారివే తిక్తా లవంగాగురుకుంకుమం. 86. త్వగ్రేణులలికా చైభి స్తైలం మస్తు చతుర్గుణం, లాక్షారససమం సిద్ధం గ్రహఘ్నం బలవర్ణకృత్. 87. అపస్మారజ్వరోన్మాద కృత్యాలక్ష్మీవినాశనం, ఆయుఃపుష్టికరం చైవ వశీకరణ ముత్తమం. 88.

మంచిగంధము కురువేరు నఖమను గంధద్రవ్యము కోష్ఠు యష్టిమధుకము అడవిసదాపసెమలి అడుగుచెట్టు కమలముమంజిష్ఠము సరళదేవదారురసము దేవదారురసము కచ్చూరము ఏలకలు జవ్వాజి కస్తూరి నాగకేసరములు శిలాజిత్తు జాపత్రిమురయనుగంధద్రవ్యము జటామాంసితక్కోలపుచెట్టుపసపు మ్రానిపసపు సుగంధిపాలవేళ్ళు కటుకరోహిణి లవంగములు అగురు కుంకుమపూవు లవంగపుపట్ట రేణుకగింజలు నలిక వీటితోటి జేయఁబడిన కషాయములో తైలముకంటె నాల్గురెట్లధికముగా పెరుగుపైనీరు ఇంతే ప్రమాణముగా

లాక్షారసము వీటిని అన్నిటిని కలిపి తైలమును సిద్ధము చేయవలయును. ఈతైలము గ్రహదోషములను పోగొట్టును. బలమును కాంతిని పెంపొందించును. అపస్మారము జ్వరముపిచ్చి కృశ్య అలక్ష్మి మున్నగువానిని నశింపజేయును. ఆయుష్యమును బలమును ఇచ్చును. మఱియు నిది యుత్తమ మగు వశీకరణము కూడనై యున్నయది.

బలానాగబలాద్యఘృతము.

శ్లో. ఛాగం మాంసం పయశ్ఛాగం ఛాగం సర్పిస్సశర్కరం, ఛాగోపసేవాశయనం ఛాగమధ్యే తు యక్ష్మనుత్. 89. ఉరో మత్వా క్షతం లాక్షాం పయసా మధుసంయుతాం, సద్యఏవ పిబే జ్జీర్ణే పయసాద్యా త్సశర్కరం. 90. ఇక్ష్వాలికా బిసగ్రంధి పద్మకేసర చందనైః, శృతం పయోమధుయుతం సంధానార్థం పిబే త్క్షతీ. 91. బలాశ్వగంధా శ్రీపర్ణీ బహుపుత్రీ పునర్నవాః, పయసా నిత్య మభ్యస్తాః క్షపయంతి క్షతక్షయం. 92. ఘృతం బలా నాగబలార్జునాంబు సిద్ధం సయష్టీమధుకల్కపాదిం, హృద్రోగ శూల క్షతరక్తపిత్త కాసానిలాసృక్ శమయ త్యుదీర్ణం. 93.

మేకమాంసము చక్కెరవేసిన మేకపాలు మేకనేయి మేకలకు కాయుట మేకలనడుమను పరుండుట ఇవి యన్నియును క్షయరోగములను పోగొట్టును. ఉరఃక్షతరోగి వెంటనే లక్క కషాయమును తేనెతో కలిపి పాలతో త్రాగవలయును. జీర్ణమైనవెనుక పాలతో చక్కెరను కలిపికొని తినవలయును. చెఱకుముక్క తామరతూడు పద్మములలోనికింజల్కము మంచిగంధము వీటితో పాలను కాచి వాటియందు తేనెను వేసికొని ఉరఃక్షతముకై త్రాగవలయును. ముత్తువపులగము, అశ్వగంధ, కోలపొన్న, ఊగు, పిల్లిపీచర, తెల్లగలిజేరు వీటితో చేసిన కషాయమునందు యష్టిమధుకముల కల్కము నాల్గవభాగమునుకలిపి నేతిని పక్వము చేయవలయును. ఈఘృతము హృద్రోగమును, శూలలను, క్షయరోగములను, రక్తపిత్తములను వాతములను వాతరక్తములను వీటిచేత పెంపొందిన ఇతరరోగములను నశింపజేయును.

ఇది చక్రదత్తయందు క్షయరోగాధికారప్రకరణము ముగిసినది.

# ౧౧. కాసరోగాధికారము.

---

**కాసరోగమునందు సామాన్యోపాయములు.**

శ్లో. వాస్తూకో వాయసీశాకం మూలకం సునిషణ్ణకం, స్నేహ స్తైలాదయో భక్ష్యాః క్షీరేక్షురసగౌడికాః. 1. దధ్యారనాలామ్లఫలం ప్రసన్నాపాన మేవ చ, శస్యతే వాతకాసేషు స్వాద్వమ్లలవణాని చ. 2. గ్రామ్యానూపోదకైః శాలియవగోధూమ షష్టికాన్, రసైర్మాషాత్మగుప్తానాం యూషైర్వా భోజయేద్ధితాన్. 3. పంచమూలీకృతః క్వాథః పిప్పలీచూర్ణసంయుతః, రసాన్న మశ్నతా పీత్వం వాతకాస ముదస్యతి. 4.

చక్రవర్తికూర కామంచికూర ముల్లంగి చెంచలకూర నూనె మొదలగు తైలపదార్థములును, పాలు, చెఱకురసము బెల్లపువస్తువులును తినఁదగిన పథ్యపదార్థములు వాతమువలనఁ గలుగు దగ్గుల విషయమై పెరుగు గంజి పులిబచ్చలి మద్యపానము పుల్లనిపదార్థములు మధురపదార్థము ఉప్పువస్తువులు ఉత్తమములగు పథ్యములని చెప్పఁబడినవి గ్రామములయందలి నీళ్లు కరగని చెరువులున్నగు ప్రదేశములలోని యుదకములచేత పరిబియ్యమును యవలను గోధుమలను షష్ఠిధాన్యములను వండికొని గాని మినుములు దురదగొండి వీనియూషములు గాని పక్వముచేసి భుజింపవలయును. పంచమూలపు కషాయములో పిప్పలి చూర్ణమును వేసికొని త్రాగవలయును. మాంసరసముతో గూడ నన్నమును తినవలయును. ఇట్లు చేసినయెడల వాతమువలన గలిగిన దగ్గు నశించిపోవును.

**అపరాజితాలేహము.**

శ్లో. శృంగీశఠీకణాభార్గీ గుడవాదద యాసకైః, సతైలై ర్వాతకాసఘ్నః లేహోఽయ మపరాజితః. 5.

అతివస గంటుకచోరము పిప్పళ్ళు గంటుభారంగి బెల్లము తుంగముస్తెలు తీటకసింద తైలము వీటితో లేహమును చేసి సేవించిన వాతరోగములను దగ్గును పోగొట్టును. ఇయ్యది అపరాజిత మను లేహము.

### శొంఠి; లేహము మున్నగునవి.

శ్లో. చూర్ణితా విశ్వదుస్పర్శ శృంగీ ద్రాక్షా శఠాసితాః, లీఢ్వా తైలేన వాతోత్థం కాసం జయతి దారుణమ్. 6. భార్గీ ద్రాక్షా శఠీ శృంగీ పిప్పలీవిశ్వభేషజైః, గుడతైలయుతో లేహః హితో మారుతకాసినాం. 7. పిత్తకాసే తనుకఫే త్రివృతాం మధురైర్యుతాం, దద్యాద్ఘనకఫే తిక్తైః విరేకార్థం యుతాం భిషక్. 8. మధురైర్జాంగలరసైః శ్యామాకయవకోద్రవాః, ముద్గాదియూషైః శాకైశ్చ తిక్తకైర్మాత్రయా హితాః. 9. బలా ద్విబృహతీ వాసా ద్రాక్షాభిః క్వథితం జలం, పిత్తకాసాపహం పేయం శర్కరామధుయోజితం. 10. శరాదిపంచమూలస్య పిప్పలీద్రాక్షయో స్తథా, కషాయేణ శృతం క్షీరం పిబేత్సమధుశర్కరం. కాకోలీ బృహతీ మేదా యుగ్మైస్సవృషనాగరైః, పిత్తకాసే రసక్షీరయూషాం శ్చాప్యుపకల్పయేత్. 12. ద్రాక్షామలకఖర్జూరం పిప్పలీ మరిచాన్వితమ్, పిత్తకాసాపహం హ్యేత ల్లిహ్యా న్మాక్షికసర్పిషా. 13. ఖర్జూర పిప్పలీ ద్రాక్షా సితాలాజా స్సమాంశికాః, మధుసర్పిర్యుతో లేహః పిత్తకాసహరః పరః. 14. శఠీ హ్రీబేరబృహతీ శర్కరావిశ్వభేషజమ్, పిష్ట్వా రసం పిబే త్పూతం సఘృతం పిత్తకాసనుత్. 15. మధునా పద్మబీజానాం చూర్ణం పైత్తికకాసనుత్, బలినం వమనేనాదౌ శీలితం కఫకాసినమ్. 16. యవాన్నైః కటురూక్షోష్ణైః కఫఘ్నైశ్చాప్యుపాచరేత్, పిప్పలీ క్షారకైర్యూషైః కౌలత్థైర్మూలకస్య చ. 17. లఘూ న్యన్నాని భుంజీత రసైర్వా కటుకాన్వితైః.

శొంఠి, యవక్షారము, అతివస, ద్రాక్ష, కచ్చూరము, కలకండ వీట్లను తైలముతో లేహమునుగా చేసి భక్షించిన మిగుల భయంకర మైనదైనను వాతముచేఁ బుట్టెడు దగ్గు నశించును. గంటుభారంగి ద్రాక్ష కచ్చూరము కర్కాటకశృంగి పిప్పళ్లు శొంఠి బెల్లము తైలము వీటిని లేహముగు చేసికొని భక్షించిన దగ్గుగలవారికి హితకర మగును. పైత్యసంబంధము లగు దగ్గుల విషయమునను కొద్దిగా కళ్లె పడువానియందును తీపిపదార్థములతో కలిపి తెల్లతెగడ నీయవలయును. కళ్లె జాస్తిగా వచ్చుచున్న యెడల కటుపదార్థములతోకలిపి తెల్లతెగడను విరేచనము లగుటకొఱకు ఇయ్యవలయును. మధురము లగు పదార్థములు అడవిజంతువుల మాంసరసము వీటిలో కూడను, చామలు యవలు కొఱ్ఱలు మొదలగువాని నాహారముగా నేర్పఱుపవలెను. మఱియును

పెసర (గంజి) కట్టును చేదుకూరలును హితకరము లగును. ముత్తువపులగము, చిన్నముల్లక, పెద్దముల్లక, ద్రాక్ష, వీటితో కషాయము పెట్టిన నీరు పైత్యరోగములను దగ్గులను పోగొట్టును. ఇందు తేనె కలకండయును చేర్పవలయును. కాకివెదురు మొదలగు పంచమూలములయొక్కయు ద్రాక్షయొక్కయు కషాయముచేత కాచినపాలు తేనె చక్కెరను కలిపికొని త్రాగవలయును. కాకోలి చిన్నముల్లక మేద మహామేద అడ్డసరము శొంఠి ద్రాక్ష వీటితో కాచిన కషాయోదకములో చక్కెర తేనెను కలిపికొని త్రాగినయెడల పిత్తసంబంధము లగు దగ్గులు నశించును. ద్రాక్ష ఉసిరిక ఖర్జూరఫలము పిప్పళ్లు మిరియములు వీటిని చూర్ణమునుచేసి అందు తేనెను నేతిని కలిపికొని సేవించిన పైత్యపుదగ్గులుతగ్గును. ఖర్జూరము, రేకపిప్పళ్ళు, ద్రాక్ష, కలకండ, ఏలాలు వీటినిసమానభాగములనుచేర్చి తేనెలోను నేతిలోనుకలిపికొని సేవించినయెడల పిత్తసంబంధములగు దగ్గులను తగ్గించును. కచ్చూరము కురువేరు నేలములక కలకండ శొంఠి వీటిగసమును తీసి వడియకట్టి దానిలో నేతిని కలిపికొని త్రాగిన పిత్తకాసములు తొలగిచును. తామరగింజల చూర్ణములో తేనెను కలిపి సేవించిన పిత్తసంబంధములగు దగ్గులను పాఱద్రోలును. కఫసంబంధ మగు దగ్గుల రోగి బలముగలవాఁడై యుండినయెడల మొదల నతనికి వమనమును చేయింపవలయును. కొంచెము చేదుగాను వెచ్చగాను నున్నట్టి అన్నమును కఫనాశకములగు వస్తువులను భుజింప నీయవలయును. పిప్పళ్లు, క్షారపదార్థములు, ఉలవలు, దుంపలు వీనితో చేయఁబడిన గంజితోఁగాని, కటువుగల రసములతోఁగాని తేలికయగు నన్నములను భుజింపవలయును.

పైశ్లోకములతర్వాత కొన్నిటిలో నీక్రిందిశ్లోకము గలదు. శ్లో. పంచకోలైశ్శృతంక్షీరం కఫఘ్నంలఘుశస్యతే, శ్వాసకాసజ్వరహరం బలవర్ణాగ్ని వర్ధనమ్.

—— పుష్కరమూలాదిక్వాథము. ——

శ్లో. పౌష్కరం కట్ఫలం భార్గీ విశ్వపిప్పలసాధితమ్. 18 పిబేత్క్వాథం కఫోద్రేకే కాసే శ్వాసే చ హృద్గ్రహే, స్వరసం శృంగబేరస్య మాక్షికేణ సమన్వితమ్ 19. పాయయేచ్ఛ్వాసకాసఘ్నం ప్రతిశ్యాయకఫాపహమ్, ముద్గామలాభ్యాం యవదాడిమాభ్యాం కర్కంధునా మూలకశుంఠకేన. 20. శటీకణాభ్యాం చ కులుత్థకేన యూషో నవాంగః కఫరోగహంతా, పార్శ్వశూలే జ్వరే శ్వాసే కాసే శ్లేష్మసముద్భవే. 21. పిప్పలీచూర్ణ సంయుక్తం దశమూలీజలం పిబేత్,

పుష్కరమూలము, నేలగుమ్ముడు, గంటుభారంగి, శొంఠి, పిప్పళ్లు వీటితో సిద్ధముచేయఁబడిన కషాయమును, కఫ మెక్కుడుగా గలిగిన కాస(దగ్గు)రోగమునందును, శ్వాసమునందును,హృదయరోగమునందును త్రాగవలయును. అల్లపురసములో తేనెను వేసికొని త్రాగవలయును. శ్వాసకాసముల నిది యణంచును. పీనసదగ్గులను పోఁగొట్టును. పెసలు, ఉసిరిక, యవ, దానిమ్మపిందెలు, రేగు, కురువేరు, శొంఠి, కచ్చూరము, పిప్పళ్లు, మఱియును ఉలవలు వీటితోఁడ నవాంగయూషమను గంజి సిద్ధము చేయఁబడును. ఇయ్యది కఫరోగముల నణంచి వైచును. పార్శ్వప్రశూలల విషయములోను, జ్వరము శ్వాసము కాసము శ్లేష్మమువలన గలుగుదగ్గులు వీటివిషయములలో, పిప్పళ్లచూర్ణమును కలిపికొని దశమూలముల కషాయమును త్రాగవలయును.

## కట్ఫలాదిక్వాథము.

శ్లో. కట్ఫలం కత్తృణం భార్గీ ముస్తం ధాన్యం వచా భయా. 22. శృంగీ పార్పటకం శుంఠీ సురాహ్వా చ జలే శృతమ్, మధుహింగుయుతం పేయం కాసే వాత కఫాత్మకే. 23. కంఠరోగే క్షయేశూలే శ్వాసహిక్కాజ్వరేషు చ.

నేలగుమ్ముడు, కామంచి, గంటుభారంగి, తుంగముస్తలు, ధనియములు,వస, కరక కాయలు, కర్కాటకశృంగి, పర్పాటకము,శొంఠి, దేవదారు వీటిని కషాయము పెట్టి అందు తేనెయును, ఇంగువయును చేర్చి త్రాగవలయును. ఇయ్యది వాతమువలన, కఫమువలనఁ గలిగెడి దగ్గులయందును, కంఠరోగములయందును, క్షయయందును, శూలలయందును, శ్వాసము, వెక్కిళ్లు, జ్వరము వీనియందును హితకరము అగుచున్నది.

## వాకుడు మొదలగు కషాయములు.

శ్లో. కంటకారీకృతఃక్వాథః సకృష్ణః సర్వకాసహా. 24. విభీతకం ఘృతాభ్యక్తం గోశకృత్పరివేష్టితమ్, స్విన్నమగ్నౌ హరేత్కాసం ధ్రువ మాస్యవిధారితమ్.25. వాసకస్వరసః పేయో మధుయుక్తో హితాశినా, పిత్తశ్లేష్మకృతే కాసే రక్తపిత్తే విశేషతః. 26. పిప్పలి మధుకం ద్రాక్షా లాక్షా శృంగీ శతావరీ, ద్విగుణా చ తుగాక్షీరీ సితా సర్వైశ్చతుర్గుణా.27.తం లిహ్యాన్మధుసర్పిర్భ్యాం క్షతకాసనివృత్తయే, పిప్పలీ పద్మకం లాక్షా సంపక్వం బృహతీఫలమ్. 28. ఘృతక్షౌద్రయుతో లేహః కాసశ్వాసనిబర్హణః, హరీతకీనాగరముస్తచూర్ణం గుడేన

తుల్యం గుటికా విధేయా. 29. నివారయత్యాస్యవిధారి తేయం శ్వాసంప్రవృద్ధం ప్రబలం చ కాసమ్.

నేలములక కషాయములో పిప్పళ్లను చేర్చికొని త్రాగిన నన్నివిధము లగు దగ్గులు తగ్గిపోవును, తాడికాయలను నేతిలో నూరవైచి, ఆవుపేడలో పొదివి కుసుల్లో నుడుకఁ బెట్టి పుక్కిట నుంచికొనుచుండినయెడల దగ్గును హరింపఁజేయును. అడ్డసరపుటాకురసములో తేనెను కలిపికొని పిత్తశ్లేష్మములచేత నగు దగ్గులు కలిగినపుడు త్రాగవలయును. విశేషముగా నిద్రానిని రక్తపిత్తములచేత బుట్టెడి దగ్గులయందు సేవింపవలయును. పిప్పళ్లు, యష్టిమధుకము ద్రాక్ష లక్కపుడకలు కర్కాటకశృంగి పిల్లిపిచ్చర వీనిని సమానభాగములుగాను, తవక్షీరి నన్నిఁటికంటె ద్విగుణముగాను, చక్కెర నన్నిఁటికంటె చతుర్గుణముగాను తీసికొని వీని నన్నిఁటిని నేతిలోను తేనెలోను కలిపి భక్షించినయెడల క్షయసంబంధము లగు దగ్గులు నివర్తించును. కరకకాయలు, శొంఠి, తుంగముస్తలు వీటిచూర్ణములో సమానముగా బెల్లమును కలిపి మాత్రలను కట్టి సేవింపవలయును. ఈమాత్రలు పుక్కిటిలో నుంచికొనినయెడల ప్రబలిన శ్వాసమును దగ్గులును పోఁగొట్టును.

## మరీచాద్యచూర్ణము.

శ్లో. కృష్ణః కర్షార్ధ మక్షో పలం పలద్వయ మథార్ధకర్షశ్చ, మరిచస్య పిప్పలీనాం దాడిమగుడయావశూకానాం. 30. సర్వౌషధైరసాధ్యా యే కాసా స్సర్వవైద్యవివర్జితాః, అపి పూయం ఛర్దయతాం తేషా మిద మౌషధం పథ్యమ్. 31.

మిరియములు ఒకకర్షము, పిప్పళ్లు అర్ధకర్షము, దానిమ్మగింజలు 1 పలము, బెల్లము రెండుపలములు, యవక్షారము అర్ధకర్షము వీటి నన్నిఁటిని చేర్చి చూర్ణమును చేయవలయును. అన్నిఔషధము లగు మందులచేతను కుదురనివియును వైద్యులెల్లరును కుదుర్పజాలక నిరాశచేసికొని వదిలిపెట్టఁబడినవియును, దుర్గంధము వచ్చునట్టివియు నగు దగ్గుల కియ్యది అమూల్యమును పథ్యము నగు నౌషధము.

## సమశర్కర చూర్ణము.

శ్లో. లవంగజాతీఫలపిప్పలీనాం భాగా న్ప్రకల్ప్యాక్ష యుతా నమీషాం, పలార్ధ మేకం మరిచస్య దద్యా త్పలాని చత్వారి మహౌషధస్య. 32. సితాసమం చూర్ణ మిదం ప్రసహ్యా రోగా నిమా నాశు

బలా న్నిహన్యాత్. కాసజ్వరారోచక మేహగుల్మ శ్వాసాగ్నిమాంద్య గ్రహణీప్రదోషాన్. 33.

లవంగములు జాజికాయ పిప్పళ్లు ఇవి యన్నియును అక్షప్రమాణమును మిరియములు అరపలమును, శొంఠి నాలుగుపలములను చేర్చి వీటిని చూర్ణముచు చేయవలసినది. ఆచూర్ణముతో సమానముగా చక్కెరను చేర్చవలయును. ఇయ్యది మిగుల బలవంతము లగు దగ్గులను జ్వరమును అరోచకమును మేహమును గుల్మరోగములను శ్వాసములను అగ్నిమాంద్యమును గ్రహణులను నశింపజేయును.

## హరీతకీమోదకము మున్నగునవి.

శ్లో. హరీతకీ కణా శుంఠీ మరిచం గుడసంయుతమ్, కాసఘ్నో మోదకః ప్రోక్తః తృష్ణారోచకనాశనః. 34. తాలీసపత్ర చిత్రక చవికా శుంఠ్యమ్లవేతస వ్యోషైః, తుల్యైః త్రిసుగంధియుతై ర్గుడేన గుటికా ప్రకర్తవ్యా. 35. కాసశ్వాసారోచక పీనసహృత్కంఠవాఙ్నిరోధేషు, గ్రహణీగుదోద్భవేషు గుటికా వ్యోషాంతికా నామ. 36. మనశ్శిలాల మధుక మాంసీము స్తేంగుదైః పిబేత్, ధూమం త్ర్యహం చ తస్యాను సగుడం చ పయః పిబేత్. 37. ఏవ కాసా న్పృథగ్ద్వంద్వ సర్వదోష సముద్భవాన్, శక్తై రపి ప్రయోగాణాం సాధయే దప్రసాధితాన్. 38. మనశ్శిలాలి ప్తదలం బదర్యా ఘర్మశోషితమ్, సక్షీరం ధూమపానా త్తు మహాకాసనిబర్హణమ్. 39. అర్కచ్ఛల్లీ తుల్యే తతో ర్ధేవ కటుత్రికమ్, చూర్ణితం వహ్నినిక్షిప్తం పిబే ద్ధూమం తు యోగవిత్. 40. భక్షయే దథ తాంబూలం పిబే ద్దుగ్ధ మథాంబు వా, కాసాః పంచవిధా యాంతి శాంతి మాశు న సంశయః. 41.

కరకకాయలు పిప్పళ్లు శొంఠి మిరియములు బెల్లము వీనిని చూర్ణము చేసి, కుడుములుగా జేసి భక్షించినయెడల దప్పిక, అరోచకములను నశింపజేయును. తాడిశపత్రి చిత్రమూలము ఓమను చెవ్యము శొంఠి అమ్లవేతసము మిరియములు పిప్పళ్లు లవంగపుపట్ట ఏలకులు జాపత్రి వీని నన్నింటిని సమానముగా చేర్చి బెల్లముతో మాత్రలు కట్టి సేవింపవలయును. ఈమాత్రలను వ్యోషాంతికము లని యందురు. ఈమాత్రలు దగ్గు శ్వాసము అరోచకము పీనస హృద్రోగము మాటపడిపోవుట గ్రహణి ఈరోగముల యందు మిక్కిలి హితమును చేయును. ఈమాత్రలలో లవంగపుపట్ట ఏలకులు జాపత్రి వీని నన్నింటిని నాల్గుమాషములయెత్తు కలపవలయును. మణిశిల హరిదళము య

ష్టిమధుకము జటామాంసి, తుంగముస్తలు గారకాయలు వీనిని చూర్ణముచేసి, చుట్టగా కాల్చి, ఈపొగను మూఁడుదినములు త్రాగుచు ఆపైని పాలను త్రాగుచుండినయెడల మిక్కిలి భయంకరము లగు దగ్గులుకూడను దూరముగా తొలఁగిపోవును. జిల్లేడుఆకులు మణిశిల సమానభాగములుగా చేర్చికొని, శొంఠి మిరియములు పిప్పళ్లు సగభాగమును చేర్చి చూర్ణముచేసి చుట్టచుట్టి కాల్చి పొగను యోగవేత్త యగువాడు త్రాగవలయును. తరువాత తాంబూలమును వేసికొనవలయును. లేకున్న పాలను గాని నీళ్లనైనను గాని త్రాగవలయును. ఇందుచేత అయిదుతెఱఁగులగు దగ్గులును నిస్సంశయముగా తొలఁగిపోవును.

## దశమూలఘృతము,

శ్లో. మరిచశిలార్కక్షీరై ర్వార్తాకీం త్వచ మాశు భావితాం శుష్కామ్, కృత్వా విధినా ధూమం పిబతః కాసా శ్శమం యాంతి. 42. దశమూలీకషాయేన భార్గీకల్కం పచే ద్ఘృతమ్, దక్షతిత్తిరిని ర్యూహే తత్పరం వాతకాసనుత్. 43.

మిరియములు మణిశిల జిల్లేడుపాలు వీటితోడ ములకచెట్టుతొక్కను నానవైచి. తరువాత దానిని ఎండించి యథావిధిగా పొగను త్రాగెడివాని కిచ్చిన దగ్గు లన్నియును తగ్గిపోవును. దశమూలముల కషాయముతో గంటుభారంగి కల్కమును కలిపి దానియందు నేతిని చేర్చి వండవలయును, లేక కోడి తిత్తిరిపక్షుల నిర్యూహమునందు ఘృతమును గాని పక్వము చేయవలయును. ఇయ్యది సేవించినచో విశేషముగా వాతసంబంధము లగు దగ్గులను పొఁడ్రోలును.

## దశమూలాద్యఘృతము.

శ్లో. దశమూలాఢకే ప్రస్థం ఘృతస్యాక్షసమైః పచేత్, పుష్కరాహ్వ శఠీ బిల్వ సురా సవ్యోష హింగుభిః. 44. పేయానుపానం తద్దేయం కాసే వాతకఫాధికే, శ్వాసరోగేషు సర్వేషు కఫవాతాత్మకేషు చ. 45.

అరువదినాల్గుపలముల దశమూలపు కషాయమునందు పుష్కరమూలము కచ్చూరములు బిల్వపువేరు నల్లతెగడ శొంఠి మిరియములు ఇంగువ వీని నన్నిటిని ఒక్కొక్కఅక్షము చొప్పునను తీసికొని వానియందు పదియారుపలముల నేతిని పోసి పక్వము చేయవలయును. దీనిని పేయానుపానముగా వాతము కఫము మొదలగువానివలనఁ బుట్టిన

దగ్గులయందును శ్వాసరోగములయందును కఫమువాతము వీనివలన కలిగినవాటియందును ఈయవలయును.

### దశమూలషట్పలఘృతము.

శ్లో. దశమూలీచతుఃప్రస్థే రసే ప్రస్థోన్మితం హవిః, సక్షారైః పంచకోలైస్తు కల్కితం సాధు సాధితమ్. 46. కాసహృత్పార్శ్వశూలఘ్నం హిక్కాశ్వాసనిబర్హణమ్, కల్కం షట్పల మేవాత్ర గ్రాహయంతి భిషగ్వరాః. 47.

నాలుగుప్రస్థముల దశమూలకషాయములో పదియారు పలముల నేతిని యవక్షారము పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి వీటియొక్క కల్కమును కలిపి నేతిని సిద్ధము చేయవలయును. ఇయ్యది దగ్గు హృదయశూలము పార్శ్వపునొప్పి వెక్కిళ్లు శ్వాసము వీటిని నశింపఁజేయును. ఇచ్చట నుత్తమవైద్యులు 6 పలముల కల్కమునే గ్రహింపవలయు నందురు.

### కంటకారీఘృతము.

శ్లో. కంటకారీగుడూచీభ్యాం పృథక్ త్రింశత్పలాద్రసే, ప్రస్థస్సిద్ధో ఘృతాద్వాతకాసనుద్వహ్నిదీపనః, 49 స్నుఠీం రాస్నాబలావ్యోష శ్వదంష్ట్రాకల్కపాచితమ్, కంటకారీరసే సర్పిః పంచకాసనిషూదనం. 49.

వాకుడు తిప్పతీగ వీటిలోచేసిన ముప్పదిపలముల కషాయముతో నేతిని పక్వము చేయవలయును. ఇయ్యది వాతసంబంధము లగు దగ్గులను పోఁగొట్టును. అగ్ని నుద్దీపింపఁజేయును. సన్నరాష్ట్ర ముత్తువపులగము శొంఠి మిరియములు పిప్పళ్లు పల్లేరు వీటికల్కములోను వాకుడురసములోను పక్వముచేయఁబడిన ఘృతము అయిదువిధములగు దగ్గులను నశింపఁజేయును.

### బృహత్కంటకారీ ఘృతము.

శ్లో. సపత్రమూలశాఖాయాః కంటకార్యా రసాఢకే, ఘృతప్రస్థం బలావ్యోష విడంగశఠిచిత్రకైః. 50. సౌవర్చల యవక్షార బిల్వామలక పుష్కరైః, వృశ్చీర బృహతీ పథ్యా యమానీదాడిమర్ధిభిః. 51. ద్రాక్షా పునర్నవా చవ్య ధన్వయాసామ్లవేతసైః, శృంగీతామలకీ భార్గీ రాస్నా గోక్షురకైః పచేత్. 52. కల్కైస్తు సర్వకా

సేషు హిక్కాశ్వాసే చ శస్యతే, కంటకారీఘృతం సిద్ధం కఫవ్యాధివి
నాశనమ్. 53.

ఆకులు వేళ్లు కొమ్మలుతో గూడిన నేలములక రసమును ఆఢక ప్రమాణము సిద్ధము చేసి దానియందు పదియారుపలముల నేతినితీసికొని, ముత్తువపులగము శొంఠి మిరియములు పిప్పళ్లు వాయవిడంగములు కచ్చూరము చిత్రమూలము సౌవర్చలవణము యవక్షారము బిల్వపువేళు ఉసిరిక పుష్కరమూలము వృశ్చీరము ములక కరకకాయ ఓమము దాని మ్మ బుద్ధి ద్రాక్ష శొంఠి చెవ్యము యవాసము గజ్జేరు వ్యాఘ్రనఖమను ద్రవ్యము నేల తాడి గంటుభారంగి సన్నరాష్ట్ర పల్లేరు వీటితో కల్కమునుచేసి ఆకల్కముతో నేతిని పక్వము చేయవలయును. ఇయ్యది కంటకారీఘృతము. ఇది అన్నివిధము లగు దగ్గులను వెక్కిళ్లను శ్వాసమును పోగొట్టుటయందు దత్యుత్తమము. మఱియును కఫరోగములను నశింపఁజేయును. ఇయ్యదియే బృహత్కంటకారీఘృతమనియు ననంబడును.

## రాస్నాద్యఘృతము.

శ్లో. ద్రోణేఽపాం సాధయేద్రాస్నాం దశమూలీం శతావరీమ్,
ఫలికాం మాసికాంశాం స్త్రీన్ కులుత్థాన్ బదరాన్ యవాన్.
54. తులార్ధం చాజమాంసస్య తదశేషేణ తేన చ, ఘృతాఢకం పచు
క్షీరం జీవనీయైః పలోన్మితైః. 55. సిద్ధం తద్దశభిః కల్కైః నస్యపానా
నువాసనైః, సమీక్ష్య వాతరోగేషు యథావస్థం ప్రయోజయేత్. 56.
పంచకాసాన్ క్షయం శ్వాసం పార్శ్వశూల మరోచకమ్, సర్వాంగ
రైకాంగరోగాం శ్చ సప్లీహోర్ధ్వానిలం జయేత్. 57. జీవకర్షభకౌ
మేదే కాకోల్యౌ శూర్పపర్ణికే, జీవంతీ మధుక శ్చైవ దశకో జీవకో
గణః. 58.

ద్రోణపరిమితమగు నుదకములో సన్నరాష్ట్రను దశమూలమును పిల్లిపిచ్చరను ఒక్కొక్కపలము చొప్పునను, ఉలవలు రేగుపండ్లు యవలును మూడు మూడు మాని కలు చొప్పుననున్ను, మేకమాంసము 50 పలములు, జీవనీయగణములో చెప్పిన యౌషధములు ఒక్కొక్కపలమును, నేయి 64 పలములును వీని నన్నిఁటిని చేర్చి నేతిని పక్వముచేయవలయును. దీనితో వాతరోగముల విషయములలో నస్యము పానము అనువా సనలను తగుమాత్రముగా ప్రయోగింపవలయును. ఇయ్యది అయిదు తెఱఁగులగు దగ్గుల ను క్షయ శ్వాసము పార్శ్వశూల అరోచకము సర్వాంగరోగము ఏకాంగరోగము ప్లీహ ఊర్ధ్వ వాతము వీటిని జయించును. జీవకము ఋషభకము మేద మహామేద

కాకోలి క్షీరకాకోలి ఋద్ధి వృద్ధి జీవంతి జేష్ఠమధుకము ఇవి పదియౌషధులుజీను వం తీగణ మని చెప్పఁబడును.

### అగస్త్యహారీతకి.

శ్లో. దశమూలీంస్వయంగుప్తాంశంఖపుష్పీంశఠీంబలామ్. హస్తిపిప్పల్య పామార్గ పిప్పలీమూల చిత్రకాన్. 59. భార్గీ పుష్కరమూలం చ ద్విపలాంశం యవాఢకమ్, హారీతకీశతం చైకం జలే పంచాఢకే పచేత్ 60. యవైస్స్విన్నైః కషాయం తం పూతం తచ్చాభయాశతమ్, పచేద్గుడతులాం దత్వా కుడపం చ పృథగ్ఘృతాత్. 61. తైలా త్సపిప్పలీచూర్ణాత్ సిద్ధశీతే చ మక్షికాత్, లిహ్యాద్ద్వేచాభయే నిత్యమతః ఖాదే ద్రసాయనమ్ 62. తద్వలీపలితంహన్యా ద్బలాయుర్మలవర్ధనమ్, పంచకాసాన్ క్షయం శ్వాసం హిక్కా స్సవిషమజ్వరాన్. 63. హన్యా త్తథా గ్రహణ్యర్శోహృద్రోగారుచిపీనసాన్, అగస్త్యవిహితం ధన్య మిదం శ్రేష్ఠం రసాయనమ్. 64.

దశమూలములు పెద్దదూలగొండి శంఖపుష్పి కచ్చూరము ముత్తవపులగము ఏనుగుపిప్పళ్లు ఉత్తరేణి మోడి చిత్రమూలము గంటుభారంగి పుష్కరమూలము వీని నన్నిఁటిని రెండురెండు పలములును, యవలు 64 పలములును, 100 కరకకాయలు వీటి నన్నిఁటిని అయిదు ఆఢకముల ప్రమాణపు నీటిలో పక్వము చేయవలయును. యవలు మెత్తఁబడగానే ఆకషాయమును వడియగట్టి 25 పలముల కరక్కాయలయందు 100 పలముల బెల్లము 4 పలముల నేయిని కలిపి వండవలయును, తైలమును పిప్పలీచూర్ణమును నాలుగునాలుగు పలములచొప్పున చేర్పవలయును. పక్వమైపిమ్మట చల్లారిన తరువాత 4 పలముల తేనెను కలిపి మరల ప్రతినిత్యమును రెండురెండు కరక్కాయల చొప్పున రసాయనములను భక్షించుకొలని భక్షింపవలయును. ఇయ్యది ముడుతలుపడుట తలనెరియుటలను పోఁగొట్టును. బలమును ఆయుష్యమును మలమును వృద్ధి నొందించును. అయిదు తెఱఁగు లగు దగ్గులను క్షయరోగములను శ్వాసరోగమును వెక్కిళ్లను విషమజ్వరములను గ్రహణులను మూలరోగములను హృదయరోగములను అరుచినిపీనసను పోఁగొట్టును. ఇయ్యది అగస్త్యమహాముని చేత నిర్మింపఁబడియెను. ధన్యమును శ్రేష్ఠము నగు రసాయనము కావున దీనిని అగస్త్యహారీతకి యందురు.

### వ్యాఘ్రహారీతకి.

శ్లో. సమూలపుష్పచ్ఛద కంటకార్యా, స్తులాం జలద్రోణపరిప్లుతాం చ, హారీతకీనాం చ శతం నిదధ్యా దథాత్ర పక్త్వా చరణావశే

షమ్. 65. గుడస్య దత్త్వా శతమేత దగ్నౌ విపక్వ ముత్తీర్య తత స్సు శీతే, కటుత్రికం చ ద్విపల ప్రమాణం పలాని షట్ పుష్పరసస్య తత్ర 66. క్షిపే చ్చతుర్జాతపలం యథాగ్ని ప్రయుజ్యమానో విధినాఽవలేహః, వాతాత్మకం పిత్తకఫోద్భవం చ ద్విదోషకాసా నపి యాం త్రిదోషాన్. 67. క్షయోద్భవం చ క్షతజం చ హన్యాత్ సపీనసశ్వాస మురఃక్షతం చ, యక్ష్మాణ మేకాదశరూప ముగ్రం భృగూపదిష్టం హి రసాయనం స్యాత్. 68.

వేళ్ళు, పూవులు ఆకులు వీటితో కూడిన వాకుడుచెట్టును 100 పలముల తెచ్చి 231 పలములనీటితో చేర్చవలయును. మఱియునుకరకకాయలు ఒకవందయునుకలిపి పక్వము చేయవలయును. నీరు నాల్గవభాగము మిగులు గలుగునప్పుడు 100పలముల బెల్లమునందు చేర్చి వండవలయును. ఆపిమ్మట దించి చక్కగా చల్లారినపిమ్మట శొంఠి, మిరియములు పిప్పళ్ళు రెండుపలములును పూదేనె 6పలములును లవంగపుచెక్క ఏలకులు జాపత్రి నాగకేసరములు వీటిచూర్ణము నొకపలమును చేర్చి కలియబెట్టి లేహమునుగా చేసికొని జఠరాగ్ని ననుసరించి సేవించు చుండవలయును. ఇయ్యది వాతపు దగ్గులను పైత్యపు దగ్గులను ద్విదోషములచేత నగు దగ్గులను త్రిదోషములవలన నగు దగ్గులను క్షయదగ్గులను పీనసశ్వాసములను ఱొమ్ము బద్దలగుచుండుటను పదునొకండు తెఱంగులగు క్షయరోగములను నశింపచేయును. దీనిని భృగుమహర్షి చెప్పెను. ఇయ్యదియే వ్యాఘ్రహారీతకి యనంబడును.

ఇట్లు చక్రదత్తయందు కాసరోగాధికార ప్రకరణము ముగిసెను.



# ౧౨. హిక్కాశ్వాసాధికారము.

శ్లో. హిక్కాశ్వాసాతురే పూర్వం తైలాక్తే స్స్వేద ఇష్యతే, స్నిగ్ధై ర్లవణయోగై శ్చ మృదు ర్వాతానులోమనమ్. 1. ఊర్ధ్వాధ శ్శోధనం శక్తే దుర్బలే శమనం మతమ్, కోలమజ్జాంజనం లాజాతిక్తా కాంజనగైరికమ్. 2. కృష్ణాధాత్రీ సితా శుంఠీ కాసీసం దధినామ చ, పాటల్యా స్సఫలం పుష్పం కృష్ణాఖర్జూర మస్తకమ్. 3. ష డేతే పాదికా లేహాః హిక్కానాం మధుసంయుతాః, మధుకం మధుసంయుక్తం పిప్పలీశర్కరాన్వితా. 4. నాగరం గుడసంయుక్తం హిక్కాఘ్నం నావనత్రయం, స్తన్యేన మక్షికావిష్ఠా నస్యం వా లక్తకాంబునా. 5. యోజ్యం హిక్కాభిభూతాయ స్తన్యం వా చందనాన్వితమ్, మధుసౌవర్చలోపేతం మాతులుంగరసం పిబేత్. 6. హిక్కార్తస్య పయ శ్ఛాగం హితం నాగరసాధితమ్, కృష్ణామలకశుంఠీనాం చూర్ణం మధుసితాయుతమ్. 7. ముహు ర్ముహుః ప్రయోక్తవ్యం హిక్కాశ్వాసనివారణమ్, హిక్కాశ్వాసీ పిబే ద్భార్గీ సవిశ్వా ముష్ణ వారిణా. 8. నాగరం వా సితా భార్గీ సౌవర్చలసమన్వితమ్. శృంగీ కటుత్రిక ఫలాత్రయకంటకారీ భార్గీ సపుష్కరజటాలవణాని పంచ, చూర్ణం పిబే దశిశిరేణ జలేన హిక్కా శ్వాసోర్ధ్వవాతకసనారుచిపీనసేషు.9. అభయానాగరకల్కం పౌష్కరయవశూకమగిచకల్కం వా, తోయే నోష్ణేన పిబేత్ శ్వాసీ హిక్కీ చ తచ్ఛాన్త్యై. 10. అమృతానాగరభార్గీ వ్యాఘ్రీపర్ణాశసాధితః క్వాథః, పీత స్సకణాచూర్ణః కాసశ్వాసౌ జయత్యాశు. 11.

వెక్కిళ్ళు శ్వాస గలిగి బాధపడెడు రోగివిషయమున ముందుగా నూనెను చరిమిన పదార్థములచేత గాని, మృదువు లగు లవణయోగములచేత గాని చెమటను పుటించుట యుత్తమము, వాతమును అనుకూలముగా వర్తింపచేయుటయును మంచిదే

యగును. రోగి బలముగలవాఁడై యున్నయెడల, వమనమునకును జులాబువకు అనఁగా ప్రవర్తులకు నిచ్చుచుండవలయును. దుర్బలుఁడైనయెడల శమనమగు నట్టులుం శాంతి నొందించు నౌషధముల నుపయోగింపవలయును. రేగుచెక్క, సౌవీరాంజనము, ఏలాలు, కటుకరోహిణి, ఉమ్మెత్త, పిప్పళ్ళు, ఉసిరికపప్పు, కలకండ, శొంఠి, అన్నభేది, వెలగకాయ, కలిగొట్టుచెట్టు, పువ్వులు, ఫలములు, పిప్పళ్ళు, ఖర్జూరము తుంగముస్తలు ఈయాఱు అవలేహములను తేనెతో కలిపి సేవించిన వెక్కిళ్లను పోఁగొట్టును. తేనెతో కలిపిన యష్టిమధుకము కలకండతో చేర్చినపిప్పళ్ళు, బెల్లముతో కలిపిన శొంఠి, ఈమూఁడు నాసికావిధులును వెక్కిళ్లను పోఁగొట్టును. చనుబాలలో ఈగవిష్టను (అనఁగా మైనమును) కలిపి యుపయోగించిన నస్యముగాని చనుబాలలో చందనముకలిపియుపయోగించిన నస్యముగాని వెక్కిళ్లనుపోఁగొట్టును. తేనె సౌవర్చలవణము వీటితో కూడిన మాదీఫలరసముగాని, శొంఠిచాదికలిపిన మేకపాలుగాని వెక్కిళ్ళు రోగముగలవారికి హితమునుగలిగించును. పిప్పళ్ళు ఉసిరిక శొంఠి వీటిచూర్ణమును తేనెతోను కలకండతోను కలిపి మాటిమాటికి ఇచ్చుచున్నయెడల వెక్కిళ్ళు శ్వాసయును తొలఁగి చనును. గంటుభారంగి శొంఠినిగాని, శొంఠి గంటుభారంగి సౌవర్చలవణము వీట్లను గాని వేడినీటితో కూడా సేవించినయెడల వెక్కిళ్ళు శ్వాసయును తగ్గును. శృంగి శొంఠి మిరియములు పిప్పళ్ళు కరక్కాయ తాడికాయ ఉసిరికపప్పు వాకుడు గంటుభారంగి పుష్కరమూలము యవలు శూకధాన్యము పంచలవణములు వీటిని చూర్ణము చేసి వేడినీళ్లతో గూడ చేర్చికొని వెక్కిళ్ళు శ్వాస ఎగఊపిరి దగ్గు అరుచి పీనస ఈరోగములు కలిగినప్పుడు త్రాగవలయును. కరక్కాయలను శొంఠిని కల్కముచేసిగాని పుష్కరమూలము యవక్షారము మిరియములు వీనికల్కముగాని వేడినీళ్లతో గూడను శాంతికలుగుకొఱకు శ్వాసము వెక్కిళ్ళు కలవారు త్రాగవలయును. తిప్పతీగ శొంఠి బ్రహ్మదండి నేలములక నల్లగగ్గెర వీటితో సిద్ధము చేయఁబడిన కషాయములో పిప్పళ్లచూర్ణమును వేసికొని త్రాగినయెడల కాసశ్వాసములను జయింపఁగలడు.

దశమూల క్వాథము.

శ్లో. దశమూలీకషాయ స్తు పుష్కరేణ విచూర్ణితః, శ్వాసకాసప్రశమనః పార్శ్వహృచ్ఛూలనాశనః. 12. కులుత్థనాగరవ్యాఘ్రీవాసాభిః క్వాథితం జలమ్, పీతం పుష్కరసంయుక్తం హిక్కాశ్వాసనిబర్హణమ్. 13. గుడం కటుకతైలేన మిశ్రయిత్వా సమం లిహేత్, త్రిసప్తాహప్రయోగేణ శ్వాసం నిర్మూలతో జయేత్. 14. శృంగీమహౌషధకణాఘన పుష్కరాణాం, చూర్ణం శఠీమరిచశర్కరయా సమే

తమ్, క్వాథేన పీత మమృతావృషపంచమూల్యాః, శ్వాసం త్ర్యహేణ శమయే దతిదోష ముగ్రమ్. 15. హరిద్రా మరిచం ద్రాక్షాం గుడం రాస్నాం కణాం శఠీమ్, జహ్యా త్తైలేన విలిహన్ శ్వాసా న్ప్రాణహరా నపి. 16. హిక్కాం హరతి ప్రబలాం ప్రబలం శ్వాసం చ నాశయ త్యాశు, శిఖిపుచ్ఛభూతిపిప్పలి చూర్ణం మధుమిశ్రితం లీఢమ్. 17. కర్షం కలిఫలచూర్ణం, లీఢం చాత్యంతమిశ్రితం మధునా, అచిరాద్ధరతి శ్వాసం ప్రబలా ముద్ధంసికాం చైవ. 18.

దశమూలముల కషాయములో పుష్కరమూలముల చూర్ణమును వేసికొని త్రాగినయెడల శ్వాసము దగ్గు పార్శ్వపుపోటు హృదయశూలము వీటిని నశింపఁజేయును. ఉలవలు శొంఠి నేలములక అడ్డసరము వీటితోటి సిద్ధముచేయఁబడిన కషాయోదకమును, పుష్కరమూలమును చేర్చికొని త్రాగినయెడల వెక్కిళ్ళను శ్వాసమును నశించును. బెల్లమును కటుకతైలముతో సమానభాగమునుగా గ్రహించి రెండింటిని కలిపి సేవింపుచుండవలయును. ఇద్దాని నిరువదియొక్క రోజు సేవించినయెడల శ్వాసము నిర్మూలముగా నశించును.

తిప్పతీగె, అడ్డసరము, పిప్పళ్లు, తుంగముస్తలు, పుష్కరమూలము, కచ్చూరము, మిరియములు వీటిని చూర్ణముచేసి కండచక్కెర నందునఁ గలిపి, తిప్పతీగ అడ్డసరములలో పెట్టిన కషాయమును చేర్చి మూఁడురోజులు త్రాగినయెడల మిక్కిలి భయంకరములగు శ్వాసములు కూడ నష్టములు కాఁగలవు. పసపు, మిరియములు, ద్రాక్ష, బెల్లము, సన్నరాష్ట్ర, పిప్పళ్లు, కచ్చూరము వీటిని నూనెలో కలిపి సేవించిన ప్రాణముల నపహరించునంతవియైన వగు శ్వాసములు నాశనమునొందును. నెమలి వెన్నులు గాల్చి చేసిన బూడిదను పిప్పళ్లచూర్ణములో కలిపి అందు తేనెను చేర్చి భక్షించినయెడల వెక్కిళ్లు భయంకరములగు శ్వాసములు నష్టము లగును. పదిమాషములయెత్తు తాడిచూర్ణమును చేసి స్వచ్ఛమగు తేనెలో చేర్చి సేవించిన భయంకరము లైన వెక్కిళ్లను శీఘ్రముగా నశించును.

## హింస్రాద్యఘృతము.

శ్లో. హింస్రా విడంగ పూతీక త్రిఫలా వ్యోష చిత్రకైః, ద్విక్షీరం సర్పిషః ప్రస్థం చతుర్గుణజలాన్వితం. 19. కోలమాత్రైః పచే త్తద్ధి కాసశ్వాసం వ్యపోహతి, అర్శాం స్యరోచకం గుల్మం శకృద్భేదం క్షయం తథా. 20.

హింస్ర యను ద్రవ్యము [అనఁగా నల్లఉప్పియఁట] వాయువిడంగములు, కానుగుచెక్క, కరకకాయలు, శొంఠి, తాడి, ఉసిరిక, మిరియములు, పిప్పళ్ళు, చిత్రమూ

లము వీని నన్నిఁటిని ఎన్నిదిఎన్నిదిమాషముల చొప్పునను, పాలు 32 పలములు, నేయి 16 పలములు, నీరు 64 పలములు వీని నన్నిఁటినికలిపి నేతిని కాఁచవలయును. ఈనేయి దగ్గులను శ్వాసములను మూలరోగములను అరోచకములను గుల్మవ్యాధులను విడ్భేదమును క్షయను నశింపఁజేయును. ఇయ్యది హింస్రాద్యఘృత మనఁబడును.

## తేజోవతీఘృతము.

శ్లో. తేజోవత్యభయా కుష్ఠం పిప్పలీ కటురోహిణీ, భూతికం పౌష్కరం మూలం పలాంశం చిత్రకం శఠీ. 21. సౌవర్చలం తామలకీ సైంధవం బిల్వపేషికా, తాలీసపత్రం జీవంతీ వచా తై రక్షసం సంమితైః. 22. హింగుపాదై ర్ఘృతం ప్రస్థం పచే త్తోయచతుర్గుణే, ఏత ద్యథాబలం పీత్వా హిక్కా-శ్వాసౌ జయే న్నరః. 23. శోథానిలార్శో గ్రహణీ హృత్పార్శ్వరుజ ఏవ చ.

చవ్యము, కరకకాయలు, చెంగల్వకోష్ఠు, పిప్పళ్ళు, కటుకరోహిణి, కామంచి, పుష్కరమూలము, మోదుగమాడ, చిత్రమూలము, కచ్చూరము, సౌవర్చలవణము, నేలతాడి, సైంధవలవణము, మారేడుచెక్క, తాడిశపత్రి, జీవంతియనుద్రవ్యము, వస వీని నన్నిఁటిని ఒక్కొక్కకర్షము చొప్పున తీసికొని మూఁడు మాషములయెత్తు ఇంగువను కలిపి నాలుగురెట్లనీళ్లలో 16 పలముల నేతిని వండవలయును. ఈనేతిని బలానుసారముగా త్రాగిన మనుష్యుఁడు వెక్కిళ్లను, శ్వాసమును, శోఫను, మూలరోగములను, గ్రహణులను, ఱొమ్మునొప్పి, పార్శ్వపునొప్పులను జయించును.

## భార్ఙీగుడము.

శ్లో. శతం సంగృహ్య భార్గ్యాస్తు దశమూల్యా స్తథా పరం. 24 శతం హరీతకీనాం చ పచే త్తోయచతుర్గుణే, పాదావశేషే తస్మింస్తు రసే వస్త్రపరిస్రుతే. 25. ఆలోడ్య చ తులాం పూతాం గుడస్య త్వభయాం తతః, పునః పచేత్తు మృద్వగ్నౌ యావ ల్లేహత్వ మాగతం. 26. శీతేషు మధున శ్చాత్ర షట్పలాని ప్రదాపయేత్, త్రికటు త్రిసుగంధం చ పలికాని పృథక్పృథక్. 27. కర్షద్వయం యవక్షారం సంచూర్ణ్య ప్రక్షిపే త్తతః, భక్షయే దభయా మేకాం లేహ స్యార్ధపలం లిహేత్. 28. శ్వాసం సుదారుణం హంతి కాసం పంచవిధం తథా, స్వరవర్ణప్రదో హ్యేష జఠరాగ్నే శ్చ దీపనః 29. పలోల్లేఖాగతే మానే న ద్వైగుణ్య మిహేష్యతే, హరీతకీశతస్యాత్ర ప్రస్థత్వాదాఢకంజలమ్.

గంటుభారంగి నూరుపలములును, దశమూలములు 100పలములును, కరకకాయలు నూరు వీటినినాలుగు రెట్లధికముగా నీటిలో వండి చక్కగా నుడికిన తరువాత నాల్గవభాగము నీరు మిగిలియుండగా దించి ఆరసమును వడియకట్టి, అందులో 100పలముల బెల్లమును కలిపి, మఱియును చక్కగా కలియునట్లు కలియఁబెట్టి కరకకాయల చూర్ణము నందు వైచి సన్నని మంటపైనుడకఁబెట్టి లేహపు పాకమునకు వచ్చునంతవఱకు నుంచి పిమ్మట చల్లార్చి 6పలముల తేనె నందు కలుపవలయును. శొంఠి, మిరియములు, పిప్పళ్ళు, లవంగపుపట్ట, ఏలకులు, జాపత్రి వీటిని వేర్వేరుగా పలముచొ॥ తెచ్చి యవక్షారమును 20మాషముల యెత్తు తెచ్చి చూర్ణముచేసి కలుపవలయును. పిమ్మట నొక్కొక్క కరకకాయను తినుచు ఒకపలమును లేహమును సేవించుచు వచ్చినయెడల భయంకర మగు శ్వాసము పంచవిధము లగు దగ్గులును నశించును. ఇయ్యది స్వరమును, కాంతి నిచ్చును. జఠరాగ్నిని కూడ దీపింపఁజేయును. పలమని వ్రాయుటచేత కొలతలో రెట్టింపు అవసరము లేదు. నూరుకరకకాయ లొకప్రస్థము అగుచున్నవి. కావున నాఢకము అనగా 64పలముల ప్రమాణమునే నీటిని గ్రహింపవలయును. ఇయ్యదియే భార్గీగుడ మనఁబడును.

## కులుత్థగుడము.

శ్లో. కులత్థం దశమూలం చ తత్థైవ ద్విజయష్టికా, శతం శతం చ సంగృహ్య జలద్రోణే విపాచయేత్. 31. పాదావశేషే తస్మింస్తు గుడస్యార్థతులాం క్షిపేత్, శీతీభూతేచ పక్వేచ మధునోఽష్టౌ పలానిచ. 32. షట్పలాని తుగాక్షీర్యాః పిప్పల్యా చ ఫలద్వయం, త్రిసుగంధిక యుక్తం తత్ఖాదే దగ్నిబలం ప్రతి. 33. శ్వాసం కాసం జ్వరం హిక్కాం నాశయే త్తమకం తథా, ప్రతిశతంద్రోణనియమూత్ జ్ఞేయం ద్రోణత్రయంత్విహ. 34.

ఉలవలు దశమూలములు బ్రహ్మదండి వీటినన్నిటిని 100పలముల చొప్పున తెచ్చి ద్రోణపరిమిత మగు నీటిలో వండి కాలుభాగము నీళ్ళుండగా 50పలముల బెల్లమును వేయవలయును. చక్కగా పాకమై చల్లారిన పిమ్మట తవక్షీర 6పలములు పిప్పళ్ళు 3పలములు, లవంగపుపట్ట, ఏలకులు, జాపత్రియును కలిపి జఠరాగ్ని ననుసరించి భక్షింపవలయును. ఇయ్యది శ్వాసమును దగ్గును జ్వరమును వెక్కిళ్లను తమకమును నశింపఁజేయును. నూరుపలములు ద్రోణ మను నియమముతో నీపాకమునందు మూడుద్రోణముల నీటిని గ్రహింపవలయును.

ఇట్లు చక్రదత్తయందు హిక్కాశ్వాసాధికార ప్రకరణము ముగిసెను.

# ౧౩. స్వరభేదాధికారము.



## స్వరభేదమునందు కొన్ని యుపాయములు.

శ్లో. వాతే సలవణం తైలం పిత్తే సర్పిస్సమాక్షికమ్, కఫే సక్షారకటుకం క్షౌద్రం కుడవ ఇష్యతే 1. గళే తాలుని జిహ్వాయాం దంతమూలేషు చాశ్రితః, తేన నిష్క్రమ్యతే శ్లేష్మా స్వరశ్చాస్య ప్రసీదతి. 2. ఆద్యే కోష్ణం జలం పేయం దగ్ధ్వా ఘృతగుడౌదనమ్, క్షీరాన్నపానం పిత్తోత్థే పిబే త్సర్పి రతంద్రితః. 3. పిప్పలీ పిప్పలీమూలం మరిచం విశ్వభేషజమ్, పిబే న్మూత్రేణ మతిమా న్కఫజే స్వరసంక్షయే. 4. స్వరోపఘాతే మేదోజే కఫవ ద్విధి రిష్యతే, క్షయజే స్వరజే చాపి ప్రత్యాఖ్యాయ సమాచరేత్. 5.

వాతమువలన నగు స్వరభేదమునందు యవక్షారమును తైలముతోను పిత్తస్వరభేదమునందు తేనెకలిపిన నేతిని, కఫస్వరభేదమునందు ఉప్పు కారము తేనెగల కబళమును యుపయోగించుట యుత్తమము. గొంతుక దవడలు నాలుక దంతమూలములు వీటిని ఆశ్రయించికొనిన కఫము, ఈ ప్రయోగమువలన బయలుపడును. ఇట్టిరోగముగలవానిస్వరము చక్కగాకూడనగును. వాతస్వరభేదమునందు బెల్లమును చేర్చిన నేతిని బియ్యమును భక్షించి కొంచెము వేడినీరును త్రాగుట మంచిది. పిత్తస్వరభేదమునందు నెయ్యి పాలతోటి యన్నమును తినినపిమ్మట సావకాశముగా నేతిని త్రాగవలయును. పిప్పళ్లు, మోడి, మిరియములు, శొంఠి వీనిని చూర్ణముచేసి ఆవుపంచితముతో త్రాగుట, కఫస్వరభేదమునకు మంచిది. మేదస్సు అతిశయించుటచేతఁ బుట్టిన స్వరభేదమునందు కఫస్వరభేదమునందు వలెనే చికిత్స చేయవలయును. క్షయవలనఁ గాని సన్నిపాతమువలనఁ గాని పుట్టిన స్వరభేదమునందు సాధ్యము కాదను నమ్మకముతోనే చికిత్స చేయవలయును.

## చవ్యాదిచూర్ణము.

శ్లో. చవ్యామ్లవేతః కటుత్రికతింతిడీక తాలీసజీరకతుగాదహనైస్సమాంశైః, చూర్ణం గుడప్రముదితం త్రిసుగంధియుక్తం వైస్వర్యపీనసకఫారుచిషు ప్రశస్తమ్. 6. తైలాక్తం స్వరభేదే వా ఖదిరం ధారయే న్ముఖే, పథ్యాం పిప్పలియుక్తాం వా సంయుక్తాం నాగరేణ

వా. 7. అజమోదాం నిశాం ధాత్రీం క్షారం వహ్నిం విచూర్ణ్య చ, మధుసర్పిర్యుతం లీఢ్వా స్వరభేదం వ్యపోహతి. 8. కలితరుఫలసింధు కణా చూర్ణం తక్రేణ లీఢ మపహరతి, స్వరభేదం గోపయసా పీతం వా ఒమలకచూర్ణం చ.9. బదరీపత్రకల్కం వా ఘృతభృష్టం స సైంధవం, స్వరోపఘాతే కాసే చ లేహ మేనం ప్రయోజయేత్. 10. శర్కరామధుమిశ్రాణి శృతాని మధురై స్సహ, పిబే త్పయాంసి యస్యోచ్చై ర్వదతో ఒభిహత స్స్వరః. 11.

చవ్యము, అమ్లవేతసము, శొంఠి, మిరియములు, పిప్పళ్లు, ఉసిరిక, తాడిశపత్రి, జీలకఱ్ఱ, వంశలోచనము, చిత్రమూలము వీనిని సమానభాగములను తెచ్చి చూర్ణముచేసి, బెల్లమునందు కలిపి, పిమ్మట లవంగపుపట్ట, ఏలకులు, జాపత్రి వీటిని చూర్ణముచేసి పై దానిలోనం జేర్చి భక్షించినయెడల స్వరభేదమునందును, పీనస, కఫము అరుచి మున్నగువానియందును శ్రేష్ఠము. లేనిచో స్వరభేదము కలిగినప్పుడు నూనెలో వానవైచిన కాచును బుగ్గయం దుంచుకొనవలయును. ఇదియును కానిచో శొంఠితో కరకకాయను పుక్కిటిలో నుంచికొనవలయును. వామము, పసపు, ఉసిరిక, యవక్షారము, చిత్రమూలము వీటిని చూర్ణము చేసి తేనెను నేతిని యందు చేర్చుకొని భక్షించినయెడల స్వరభేదములు నశించును. తాడికాయ, సైంధవలవణము, పిప్పళ్లు వీటిచూర్ణమును మజ్జిగలో కలిపి సేవించినను కాని, ఆవుపాలతో ఉసిరికచూర్ణమును సేవించినను కాని స్వరభేదములు నశించును. లేకున్న రేగు ఆకు కషాయమును నేతితో చేర్చి సైంధవలవణమునందు కలిపి స్వరభేదమునందును, దగ్గుయందును ప్రయోగింపవలయును. పెద్దగా నఱచి మాటలాడుటచేత నెవ్వనికి స్వరము పడిపోవునో వాడు చక్కెర, తేనెను కలిసిన కషాయములను మధురపదార్థములతోటి త్రాగవలయును.

## కంటకారీఘృతము.

శ్లో. వ్యాఘ్రీస్వరస విపక్వం రాస్నావాట్యాలగోక్షురవ్యోషైః, సర్పి స్స్వరోపఘాతం హన్యా త్కాసం చ పంచవిధం. 12. శుష్కద్రవ్య ముపాదాయ స్వరసానా మసంభవే, వారిణ్యష్టగుణే సాధ్యం గ్రాహ్యం పాదావశేషితం. 13.

వాకుడురసములో సన్నరాస్న, ముత్తవపులగము, పల్లేరు, శొంఠి, మిరియములు, పిప్పళ్ళు వీటిని కల్కముచేసి దానిలో నేతిని పక్వము చేయవలయును. ఇయ్యది స్వర

భేదములను, అయిదువిధము లగు దగ్గులను నశింపఁ జేయును. స్వరసము లేనిచో ఎండి నదానినైనను గ్రహింపవచ్చును. అప్పుడు ఎనిమిదిరెట్ల నీటిలో వండవలయును. నాలుగవభాగము నీరు మిగిలియుండినప్పుడు దించి సేవింపవలయును. ఇయ్యది కంటకారీ ఘృత మన బడును.

## భృంగరాజఘృతము.

శ్లో. భృంగరాజామృతావల్లీ వాసకదశమూలకాసమర్దరసైః
సర్పిస్సపిప్పలీకం సిద్ధం స్వరభేదకాసజిన్మధునా. 14.

గుంటకలగరాకు, తిప్పతీగ, అడ్డసరము, దశమూలములు, కసిగందవేరు వీటిరసమును తెచ్చి యందులో నేతిని పోసి వండవలయును. పక్వమైన పిమ్మట నందులోన పిప్పళ్లచూర్ణమును కలిపి, తేనెతో సేవించినయెడల స్వరభేదమును దగ్గులను నశించిపోవును. ఇయ్యది భృంగరాజఘృత మనఁబడును.

ఇట్లు చక్రదత్తయందు స్వరభేదాధికారప్రకరణము ముగిసెను



# ౧౪. అరోచకాధికారము.



### అరోచకమునకు సాధారణములగు నుపాయములు.

శ్లో. వాంతిం సమీరణే పిత్తే విరేకం వమనం కఫే, కుర్యా ద్ధృద్యానుకూలాని హర్షణం చ మనోఘ్నజే. 1. వాంతో వచాద్భి రనిలే నిధివత్పిబేత్తు స్నేహాంషతోయ మదిరాన్యతమేన చూర్ణం, కృష్ణావిడంగ యవభస్మక రేణుభార్గీ రాస్నైలహింగులవణోత్తమనాగరాణాం. 2. పైత్తే గుడాంబుమధురై ర్వమనం ప్రశస్తం లేహ స్ససైంధవ సితామధుసర్పిరిష్టం, నింబాంబుభద్దితవతః కఫజే తు పానం రాజద్రుమాంబు మధునా సహ దీప్యకాఢ్యం. 3. చూర్ణం యదుక్త మథవా నిలజే తదేవ, సర్వై శ్చ సర్వకృత మేవ ముపక్రమేచ్చ.

వాతముచేత నగు నరోచకమున వాంతికి తీసికొనవలయును. పిత్తారోచకమునందు ప్రవర్తికి తీసికొనవలయును. కఫారోచకమునందు వాంతికి తీసికొనవలయును. మనోవ్యాకులతచేతనగు నరోచకములకు మనస్సంతుష్టి కలిగించి కొనవలయును. వాతారోచకమునందు వసను కషాయముగా గాచియును, వమనముతైన రోగి చమురుపదార్థములు, వేడినీరు, కల్లు వీటిలో దేనిసైన నొకదానిని చేసికొని గాని పిప్పళ్లు, వాయువిడంగములు, యవలక్షారములు, రేణుకలు, గంటుభారంగి, సన్నరాస్న, ఏలకులు, ఇంగువ, సైంధవలవణము, శొంఠి వీటిచూర్ణమున కలిపికొని త్రాగవలయును. పిత్తారోచకమునందు బెల్లపుపానకమును, మధురపదార్థములను పుచ్చికొని వాంతిచేసికొనుట యుత్తమము. సైంధవలవణము, చక్కెర, తేనెయును నుత్తమములే. నిమ్మపండ్లరసముతో వాంతికి తీసికొనువారలకును,కఫారోచకమునందును రేలచెక్కకషాయములో తేనెబోదసరపుచూర్ణమును కలిపి త్రాగినను, వాతారోచకమునందుఏయేచూర్ణములువెనుక చెప్పఁబడెనో, వానినిసేవించినగానిహితకరమగును. సన్నిపాతరోచకమునందు అన్నియౌషధములచేతను చికిత్స చేయవలయును.

### అరోచకమును పోఁగొట్టు నుపాయములు.

శ్లో. కుష్ఠ సౌవర్చలా జాజీ శర్కరా మరిచం బిడమ్, ధాత్ర్యేలాపద్మకోశీర పిప్పలీచందనోత్పలమ్. 4. లోధ్రం తేజోవతీ పథ్యాత్ర్యూషణం సయవాగ్రజం, ఆర్ద్రదాడిమనిర్యాస శ్చాజాజీశర్కరాయుతః. 5. సతైలమాక్షికా శ్చైతే చత్వారః కుడవగ్రహాః, చతురో

రోచకా న్హన్యు ర్వాతాద్యైకజసర్వజాన్. 6. త్వఙ్ముస్త మేలాధాన్యాని ముస్త మామలకానిచ, త్వక్చ దార్వీయవాన్యా శ్చ పిప్పల్య స్తేజవ త్యపి. 7. యమానీ తింతిడీకం చ పంచైతే ముఖశోధనాః, ఆమ్లికాగుడతోయం చ త్వగేలామరిచాన్వితం. 8 శ్లోకపాదై రభిహితాః సర్వారోచక నాశనాః, ఆమ్లికా గుడతోయం చ త్వగేలామరిచాన్వితం. 9. అభక్తచ్ఛందరోగేషు శస్తం కబలధారణం, కారవ్యజాజీమరిచం ద్రాక్షా వృక్షామ్లదాడిమం. 10. సౌవర్చలం గుడం క్షౌద్రం సర్వారోచకనాశనం. త్రియూషణాని త్రిఫలా రజనీద్వయంచ చూర్ణీకృతాని యవశూకవిమిశ్రితాని, క్షౌద్రాన్వితాని వితరే న్ముఖధారణార్థమన్యాని తిక్తకటుకాని చ భేషజాని. 11. విటూచ్చూర్ణ మధుసంయుక్తో రసో దాడిమసంభవః, అసాధ్యా మపి సంహన్యా దరుచిం వక్త్రధారితః.

1 కోష్ఠు, సౌవర్చలవణము, జీలకఱ్ఱ, కలకండ, మిరియములు, వాయువిడంగములు; 2 ఉసిరిక, ఏలకులు, పద్మాక్షి, వట్టివేళ్లు, పిప్పళ్లు, చందనము, కమలములు; 3 లొద్దుగ, తేజోవతి, కరకకాయలు, శొంఠి, మిరియములు; 4 యవక్షారము, అల్లము, దానిమ్మకాయలజిగురు, జీలకఱ్ఱ, కండచక్కెర, తైలము, తేనె. ఇట్లు నాలుగుభాగములుగా చెప్పఁబడిన నాలుగుయోగములును కబలగ్రహములు, వాతములు మున్నగు అనేకదోషజములు ద్విదోషజములు త్రిదోషజములు నగు అరోచకములను పోఁగొట్టును. 1 లవంగపుపట్ట, తుంగముస్తలు, ఏలకులు, ధనియములును; 2 ఉసిరిక, లవంగిపుపట్ట, మ్రానిపసపు, తుంగముస్తలును; 3 మ్రానిపసపు, యమానియును. 4 పిప్పళ్ళు, తేజోవతియును; 5 ఓమము, బచ్చలి ఈయైదువర్గములును ముఖమును చక్కగా శుద్ధముగా చేయును. అరోచకమును పోఁగొట్టును. ఉసిరిక బెల్లము వీనితో చేసిన పానకములో లవంగపుపట్ట, ఏలకులు, మిరియములు కలపి యుండఁగా చేసికొని ముఖమునం దుంచికొనవలయును. ఇయ్యది పీడతీసి చికిత్సచేయ నలవిగాని రోగములయందు హితమును చేయును. నల్లజీలకఱ్ఱ తెల్లజీలకఱ్ఱ ద్రాక్ష చింతపండు దానిమ్మగింజలు సౌవర్చలవణము బెల్లము తేనె వీటినినూరి ముద్దచేసి పుక్కిటనుంచికొనిన నన్నివిధములగు నరోచకములునునశించును. శొంఠిమిరియములు పిప్పళ్లు కరకకాయలు తాడికాయలు ఉసిరిక పసపు మ్రానిపసపు యవక్షారము వీటిని చూర్ణముఁజేసి తేనెలోకలిపి నాకినయెడలను, చేదు కారముగల ఇతరవస్తువులనుగాని నోటిలోనుంచుకొనుట కుపయోగించికొనినను అరోచకములు నశించును. బిడాలలవణమును తేనెలో కలిపి దానిమ్మరసముచేర్చి నోటియందుంచికొనిన మిక్కిలి నసాధ్యము లగు నరోచకములు నశించును.

## యమానీషాడబము.

శ్లో. యవానీ తింతిడీకం చ నాగరం చామ్లవేతసం, దాడిమం బదరం చామ్లం కార్షికా ణ్యుపకల్పయేత్. 13. ధాన్యసౌవర్చలాజాజీ వరాంగం చార్ధకార్షికం, పిప్పలీనాం శతం చైకం ద్వే శతే మరిచస్య చ. 14. శర్కరాయా శ్చ చత్వారి పలా న్యేకత్ర చూర్ణయేత్, జిహ్వావిశోధనం హృద్యం తచ్చూర్ణం భక్తరోచనం. 15. హృత్పీడాపార్శ్వశూలఘ్నం విబంధానాహనాశనం, కాసశ్వాసహరం గ్రాహి గ్రహణ్యర్శో వికారనుత్. 16.

వామము చింతపండు శొంఠి ఆమ్లవేతసము దానిమ్మ రేగు ఉసిరిక వీటి నన్నిటిని ఒక్కొక్కకర్షము చొప్పున తీసికొనవలయును. ధనియములు సౌవర్చలవణము జీలకఱ్ఱ త్రిఫలములు వీటిని కర్షముచొప్పునను, పిప్పళ్ళు 100 పలములు, 200 పలములు మిరియములు, చక్కెర నాలుగుపలములు నొకటిగా చేర్చి చూర్ణముచేయవలయును. ఈ చూర్ణము నాలుకను శుద్ధముగా చేయును. సుందరముగా నుంచును. అరోచకము హృదయపీడ పార్శ్వశూల నొప్పి విబంధము ఆనాహము దగ్గు గ్రహణి సంగ్రహణి మూలరోగము మున్నగువానిఁ బోఁగొట్టును. మలమును గట్టిపఱచును. ఇయ్యది యమానిషాడబ మనఁబడును.

## కలహంసక లేహము.

శ్లో. అష్టాదశ శిగ్రుఫలా న్యథ దశమరిచాని వింశతిశ్చ పిప్పల్యః, ఆర్ద్రికపలం గుడపలం ప్రస్థత్రయ మారనాళపృక్షస్య. 17. ఏతద్విడలవణయుతం ఖజాహతం సురభిగంధాఢ్యం, వ్యంజనసహస్రఘాతి జ్ఞేయం కలహంసకం నామ. 18.

మునగవిత్తులు 18 పలములు, మిరియములు 10 పలములు, పిప్పళ్ళు 20 పలములు అల్లము 1 పలము, బెల్లము పలము, గంజి మూడుమానికలు వీటితో బిడాలలవణముచేర్చి తెడ్డుతో చక్కగా మంచివాసన వచ్చు వరకు కలియఁబెట్టి వండుచులవంగపుపట్ట ఏలకులు జాపత్రి వీటిచూర్ణమును వేసి సేవించిన యెడలను వేలకొలది వ్యంజనము లనుగూడ నశింపఁజేయును. ఇయ్యది కలహంసక మనులేహము.

ఇట్లు చక్రదత్తయందు అరోచకాధికారప్రకరణము ముగిసెను.

# ౧౫. ఛర్ద్యధికారము.

---

శ్లో. ఆమాశయోత్క్లేశభవా హి సర్వా శ్ఛర్ద్యో మతా లంఘన మేవ తస్మాత్, ప్రాక్కారయే న్మారుతజాం విముచ్య సంశోధనం వా కఫపిత్తహారి. 1. హన్యా త్క్షీరోదకం పీతే ఛర్దిం పవనసంభవాం, ససైంధవం పిబే త్సర్పిః వాతచ్ఛర్దినివారణం. 2. ముద్గామలకయూషం వా ససర్పిష్కం ససైంధవం, యవాగూం మధుమిశ్రాం వా పంచమూలీకృతాం పిబేత్. 3.

సమస్తము లగు ఛర్దిరోగములును ఆమాశయములో వేదన కలుగుటవల్లనే పుట్టుచున్నవి. కావున, ఒక్క వాతమువలన నగు ఛర్దిని వదలిపెట్టి తక్కిన యన్నిఁటికిని లంఘనమును గాని, కఫమును పిత్తమును అణఁచెడి శోధనను గాని చేయవలయును. పాలను నీటిలో కలిపి కొని త్రాగినయెడల పవనఛర్దులు నివారించును. సైంధవలవణమును చేర్చికొని నేయిని త్రాగినయెడల వాతముచేత నగు ఛర్దులు నివారించును. పెసర ఉసిరిక నీటితో గంజిని కాచికొని సైంధవలవణమును చేర్చికొని త్రాగినను, తేనెను చేర్చికొని గంజిని త్రాగినను, పంచమూలకషాయమును త్రాగినను ఛర్దులు నశించును.

### పిత్తఛర్దికి ఉపాయములు.

శ్లో. పిత్తాత్మికాయాం త్వనులోమనార్థం ద్రాక్షావిదారీక్షురసై స్త్రివృ త్స్యాత్, కఫాశయస్థం త్వతిమాత్రవృద్ధం పిత్తం జయే త్స్వాదుభి రూర్ధ్వమేవ. 4. శుద్ధస్య కాలే మధుశర్కరాభ్యాం లాజై శ్చ మంథం యది వా పి పేయాం, ప్రదాపయే న్ముద్గరసేన వాపి శాల్యోదనం జాంగలజై రసై ర్వా. 5. చందనే నాక్షమాత్రేణ సంయోజ్యామలకీరసం, పిబే న్మాక్షికసంయుక్తం ఛర్ది స్తేన నివర్తతే. 6.

పిత్తఛర్దులలో అనులోమనము కొఱకు ద్రాక్ష నేలగుమ్మడి చెఱకు వీటి రసములో తెల్లతెగడను వైచి త్రాగినయెడల కఫాశయములో నున్నదియును, మిక్కిలి పెఱిగినదియును నగు నూర్ధ్వపిత్తమును జయించును. కాని దీనిని స్వాదుపదార్థములతో చేర్చి సేవింపవలయును. మనుష్యుఁడు నిర్మలుఁడుగా నుండిన వానికి తేనె కలకండ పేలాలు

వీటితో మంథమును పేయము చేసి ఈయవలయును. లేదన్న పెసరకట్టుతోగాని అడవిప్రదేశములలోని జంతువుల మాంసరసముతో గాని పరిబియ్యపుటన్నమును పెట్టింపవలయును. ఒకఅత్తిమెత్తు మంచిగంధమును ఒకపలము ఉసిరికరసములో కలిపి తేనెను అందు చేర్చుకొని త్రాగినచో ఛర్ది నివర్తించును.

### చందనకల్కమును ముద్గాదికషాయమును.

శ్లో. చందనం చ మృణాళం చ బాలకం నాగరం వృషం, సతండులోదకక్షౌద్రం పీతః కల్కో వమిం జయేత్. 7. కషాయో భృష్టముద్గస్య సలాజమధుశర్కరః, ఛర్ద్యతీసారతృడ్దాహ జ్వరఘ్న స్సంప్రకాశితః. 8. హరీతకీనాం చూర్ణం తు లిహ్యా న్మాక్షికసంయుతం, అధోభాగీకృతే దోషే ఛర్దిః క్షిప్రం నివర్తతే. 9. గుడూచీత్రిఫలారిష్టపటోలైః క్వథితం పిబేత్, క్షౌద్రయుక్తం నిహంత్యాశు ఛర్దిం పిత్తామ్లసంభవాం. 10. క్వాథః పర్పటజః పీతః సక్షౌద్ర శ్ఛర్దినాశనః.

చందనము, వట్టివేళ్లు, కురువేరు, శొంఠి, అడ్డసరము వీటిని బియ్యపుకడుగుతో నూరి కల్కమును చేసి తేనె నందు చేర్చుకొని త్రాగినయెడల ఛర్ది నశించిపోవును. వేయించిన పెసల కషాయములో పేలాలు చక్కెర చేర్చుకొని త్రాగినయెడల ఛర్ది, అతిసారము, దప్పి, గొంతెండుట, జ్వరము మొదలగునవి నశించును. కరక కాయల పొడిలో తేనెను కలిపికొని త్రాగినయెడల దోషము క్రిందికిదిగి అనగాతగ్గి ఛర్ది శీఘ్రముగా తొలగిపోవును. తిప్పతీగె, త్రిఫలములు, చేదుపొట్ల వీటితో కషాయమును కాచి తేనెనందు వైచికొని త్రాగినయెడల పిత్తామ్లజనిత మగు ఛర్ది నశించిపోవును.

### కఫఛర్దికి కషాయములు.

శ్లో. కఫాత్మికాయాం వమనం తు శస్తం సపిప్పలీసర్షపనింబతోయైః, పిండీతకై స్సైంధవసంప్రయుక్తైః ఛర్ద్యాం కఫామాశయశోధనార్థం. 11. విడంగత్రిఫలావిశ్వ చూర్ణం మధుయుతం పిబేత్, విడంగప్లవశుంఠీనా మథవా శ్లేష్మజాం వమిం. 12. సజాంబవం వా బదరస్య చూర్ణం ముస్తాయుతాం కర్కటకస్య శృంగీం, దురాలభాం వా మధుసంప్రయుక్తాం లిహ్యా త్కఫచ్ఛర్దివినిగ్రహార్థం. 13.

కఫఛర్దియందు పిప్పళ్లు, ఆవాలు, వేపచెక్క, మంగచూర్ణము వీటికషాయములతో వాంతి చేయించుట యుత్తమము. మరువము సైంధవలవణము వేసిన కషాయములతో నామాశయమును శోధించు నిమిత్తమై వాయువిడంగములు, త్రిఫలములు, శొంఠి వీ

టిచూర్ణమును కలిపి త్రాగిన ఛర్దిని జయించును. వాయువిడంగములు తుంగముస్తలు శొంఠి వీటిచూర్ణములో తేనెను కలిపికొని సేవించిన కఫఛర్ది నాశన మగును. లేకున్న నేరేఁడుచూర్ణము రేగుచూర్ణము వీటిలో తుంగముస్తల కర్కాటకశృంగి చూర్ణములు గాని, సమూలముగా చేసిన దూలగొండి చూర్ణము గాని, తేనెను వైచికొని సేవించిన యెడల కఫసంబంధము లగు ఛర్దులు నశించును.

త్రివిధ ఛర్దులకు ఉపాయములు.

శ్లో. తర్పణం వా మధుయుతం తిస్రణా మపి భేషజమ్, కృతం ఘ్నంచ్యా విధివత్కషాయం హిమసంజ్ఞితం. 14. తిస్రృష్వపి భవే త్పథ్యం మాక్షికేణ సమాయుతం, ద్రవ్యా దాపోథితా త్తోయే ప్రతప్తే నిశి సంస్థితాత్. 15. కషాయో యోభినిర్యాతి సశీత స్సముదాహృతః, షడ్భిః పలై శ్చతుర్భి ర్వా సలిలా చ్ఛీతఫాంటయోః. 16. ఆప్లుతం భేషజపలం రసాఖ్యాయాం పలద్వయం, శ్రీఫలస్య గుడోచ్యా వా కషాయో మధుసంయుతః. 17. పేయ శ్ఛర్దిత్రయే శీతో మూర్వా వా తండులాంబునా. జంబ్వామ్రపల్లవగవేధుకధాన్యసేవ్య హ్రీబేరవారిమధునా పిబతో ఒల్పమల్పం, ఛర్దిః ప్రయాతి శమనం త్రిసుగంధియుక్తా లీఢా నిహంతి మధునా ఒథ దురాలభావా. 18. జాతీరసః కపిత్థస్య పిప్పలీమరిచాన్వితః, క్షౌద్రేణ యుక్త శ్శమయే ల్లేహో యం ఛర్దిముల్బణాం. 19. పిష్ట్వా ధాత్రీఫలం ద్రాక్షాం శర్కరాం చ పలోన్మితామ్, దత్వా మధుపలం చాత్ర కుడవం సలిలస్య చ. 20. వాససా గాలితం పీతం హంతి ఛర్దిం త్రిదోషజాం.

తిప్పతీగెను హిమసంజ్ఞక కషాయమును చేసి తేనెకలిపి త్రాగిన ఛర్దులు నశించును. వేడినీటిలో యౌషధులను రాత్రిపూట నానవైచిన ప్రాతఃకాలమున చల్లఁబడినది హిమసంజ్ఞక మనఁబడును.

హిమసంజ్ఞక, ఫాంటసంజ్ఞక కషాయములలో ఆరుపలములు, లేక 4 పలముల నీటిని పోసి యౌషధులను నానవేయవలయును. రసములోకూడ 2 పలములను నీరు చేర్చుకొనవలయును. మారేఁడుచెక్క తిప్పతీగెల కషాయములో తేనెను చేర్చికొని త్రాగినయెడల కాని చాగపండ్లును బియ్యపుకడుగుతో గాని త్రాగినయెడల ముత్తెఱఁగు లగు ఛర్దులు నశించును. నేరేఁడు మామిడిఇగుళ్ళు అడవిగోధుమలును, ధనియములు ఎప్పళ్ళు వట్టివేరు వీటిని రసముతీసి నీళ్లలో కలిపి తేనె నందులో వేసికొని కొంచెము

కొంచెముగా త్రాగుచున్నయెడల ఛర్దులు శాంతించును. లవంగపుపట్ట, ఏలకులు, జాపత్రి వీటితోచేర్చిన జాజికాయల రసమునందు తేనెను కలిపికొని సేవించినయెడల భయంకరము లగు ఛర్దులు కూడను నాశనము లగును. ఉసిరిక ద్రాక్ష నూరి దాని యందు ఒకపలము కండచక్కెరను తేనెను కొంచెమును నీళ్లను నాల్గుపలములను కలిసి వడియకట్టి త్రాగినయెడల త్రిదోషజము లగు ఛర్దులును నశించును.

### ఏలాదిచూర్ణము.

శ్లో. ఏలాలవంగ గజకేసర కోలమజ్జా లాజా ప్రియంగు ఘన చందన పిప్పలీనాం, చూర్ణాని మాక్షికసితాసహితాని లీఢ్వా ఛర్దిం నిహంతి కఫమారుతపిత్తజాం చ. 21.

ఏలకులు లవంగములు నాగకేసరములు రేగుగుజ్జు పేలాలు కొఱ్ఱలు తుంగ ముస్తలు చందనము పిప్పళ్ళు వీటిచూర్ణములలో తేనెను చక్కెరను కలిపికొని నాకిన యెడల త్రిదోషములవలన నగు ఛర్దులును నశించును. ఇయ్యది ఏలాదిచూర్ణ మనఁబడును.

### కోలాదిలేహము.

శ్లో. కోలామలకమజ్జాని మక్షికవిట్సితామధు, సకృష్ణాతండులో లేహ శ్ఛర్దిమాశు నియచ్ఛతి. 22. అశ్వత్థవల్కలం శుష్కం దగ్ధ్వా నిర్వాపితం జలే, తజ్జలం పానమాత్రేణ ఛర్దిం జయతి దుస్తరామ్. 23 యష్ట్యాహ్వం చందనోపేతం సమ్యక్ క్షీరప్రపేషితమ్, తేనైవాలోడ్య పాతవ్యం రుధిరచ్ఛర్దినాశనం. 24. లాజాకపిత్థమధుమాగధికోషణానాం క్షౌద్రాభయాత్రికటుధాన్యక జీరకాణాం, పథ్యామృతామరిచ పిప్పలమాక్షికానాం లేహాస్త్రయ స్సకలవమ్యరుచిప్రశాంత్యై. 25.

రేగుపండు ఉసిరికపండు తేనె మైనము చక్కెర తేనె పిప్పళ్ళు బియ్యము వీటి తోటి చేసిన లేహము చర్దిని శీఘ్రముగా హరించును. రావిచెక్కను తెచ్చి తగుల బెట్టి నీటితో చల్లార్చి ఆయుదకమును త్రాగిన పోఁగొట్ట నలవికాని ఛర్దులనుకూడ నశింపఁజేయును. యష్టిమధుకమును చందనమును పాలతో నూరి పాలతోనే కలిపి త్రాగిన యెడల రక్తసంబంధములగు ఛర్దులు నశించిపోఁగలవు. పేలాలు కపిత్థము అనగా వెల గపండు తేనె పిప్పళ్లు మిరియములును, తేనె కరకకాయలు శొంఠి మిరియములు పిప్పళ్లు

ధనియములు జీలకఱ్ఱయును కరక్కాయలు తిప్పతీగె మిరియములు తేనె పిప్పళ్లును ఈ మూటితో చేయఁబడిన లేహ మన్నిరిధము లగు ఛర్దులను అరోచకములను శాంతి నొందించును.

### పద్మకఘృతము.

శ్లో. పద్మకామృతనింబానాం ధాన్యచందనయోః పచేత్, కల్కే క్వాథే చ హవిషః ప్రస్థం ఛర్దినివారణమ్, తృష్ణారుచిప్రశమనం దాహజ్వరహరం పరమ్. 26.

కమలములు తిప్పతీగె వేప ధనియములు చందనము వీటితో చేయఁబడిన కషాయములోను కల్కములోను 16 పలముల నేతిని పోసి వండి సిద్ధముచేసి త్రాగినయెడల ఛర్దులు నశించును. మఱియును దప్పి అరుచి దాహము జ్వరము వీనిని ఎక్కువగా పోఁగొట్టును. ఇయ్యది పద్మకఘృత మనఁబడును.

ఇట్లు చక్రదత్తయందు ఛర్ద్యధికారప్రకరణము ముగిసెను.

---

# ౧౬. తృష్ణాధికారము.



### వాతమువలన నగుతృష్ణలు.

శ్లో. తృష్ణాయాం పవనోత్థాయాం సగుడం దధి శస్యతే, రసాశ్చ బృంహణా శ్శీతా గుడూచ్యా రస ఏవ చ. 1. పంచాంగకాః పంచ గణాయ ఉక్తాః తే ష్వంబుసిద్ధం ప్రథమే గణే వా, పిబే త్సుఖోష్ణం మనుజోఽల్పమాత్రం తృష్ణోపరోధం న కదాపి కుర్యాత్. 2. పిత్తోత్థితం పిత్తహరై ర్ద్విపక్వం నిహంతి తోయం పయ ఏవ చాపి. కాశ్మర్య శర్కరాయుక్తం చందనోశీరపద్మకమ్, ద్రాక్షామధుకసంయుక్తం పిత్తతర్షే జలం పిబేత్. 3.

వాతమువలన నగు తృష్ణారోగమునందు బెల్లముకలిపిన పెరుగు మిక్కిలి మంచిది. వీర్యమునువృద్ధి పొందించు చల్లనికషాయములును తిప్పతీగకషాయములు నుత్తమములు. వేళ్లు పండ్లు పూవులు చెక్క ఆకులు అను పంచాంగములును గల చిన్నవాకుడు కోల పొన్న పల్లేరు మొదలగు పంచగణములును, ఏవి చెప్పఁబడినవో వానిని కషాయమును గా గాచి నులివెచ్చగా త్రాగినయెడల మఱల నెప్పటికిని తృష్ణ కలుగదు. పిత్తహరము లగు నౌషధములచే కాచఁబడిన కషాయము గాని పాలు గాని పిత్తతృష్ణలను హరించును. నేలగుమ్ముడు చందనము వట్టివేళ్ళు పద్మాక్షము ద్రాక్ష యష్టిమధుకము వీటితో కషాయమును చేసి కండచక్కెరను చేర్చి త్రాగినయెడల పిత్తతృష్ణలు నశించిపోవును.

### పిత్తతృష్ణలు.

శ్లో. పిత్తజాతాయాం తు తృష్ణాయాం ఃక్వోదుంబరజో రసః, తత్క్వాథో వా హిమ స్తద్వత్ చ్ఛారివాంబుగణాది వా. 4. స్యా జ్జీవనీయసిద్ధం క్షీరఘృతం వాతపిత్తజే తర్షే, తద్వ ద్రాక్షాచందన ఖర్జూరోశీరమధుయుతం తోయం. 5. సశారివాదా తృణపంచమూలే తథోత్పలాదా మధురే గణే వా, కుర్యా త్కషాయాం స్తు తథైవ యుక్తా మధూకపుష్పాదిషు చాపరేషు. 6. బిల్వాటకీనాతకిపంచకోల దర్భేషు సిద్ధం కఫజాం నిహంతి, హితం భవే చ్ఛర్దన మేవ చాత్ర తప్తేన నింబ

ప్రసవోఽదకేన. 8. సజీరకాణ్యార్ద్రక శృంగబేర సౌవర్చలా న్యర్ధజలాప్లుతాని, మద్యాని హృద్యాని చ గంధవంతి పీతాని సద్య శ్శమయంతి తృష్ణామ్. 9. క్షయోత్థితాం రుగ్వినివారణేన జయే ద్రసానామసృజ శ్చ పానైః, క్షయోత్థితాం క్షీరజలం నిహన్యాత్ మాంసోదకం వాథ మధూదకం వా. 10. గుర్వన్నజా ముల్లిఖనై ర్జయేత్తు క్షయాదృతే సర్వకృతాం చ తృష్ణామ్, లాజోదకం మధుయుతం శీతం గుడవిమర్దితమ్, కాశ్మర్యశర్కరాయుక్తం పిబే త్తృష్ణార్దితో నరః. 11.

పిత్తజనిత మగు తృష్ణయందు పండిన మేడిపండురసము గాని దాని కషాయముగాని శారివాదిగణపఠితము లగు నౌషధములతో జేయఁబడిన కషాయముగాని హితకర మగును. వాతపిత్తజ మగు తృష్ణయందు జీవనీయగణోక్తము లగు నౌషధులచే కాచఁబడిన పాలతో సిద్ధముచేయఁబడిన నేయి యుత్తమము. అట్లే ద్రాక్ష చందనము ఖర్జూరము వట్టివేళ్ళు వీటికషాయమున తేనెను జేర్చి సేవించిన హితమగును. శారివాదిగణము, తృణాదిపంచమూలములు ఉత్పలాదిగణము లేక మధురగణము మధూకపుష్పాదిగణము నను వీటిచేత సిద్ధముచేయఁబడిన కషాయము హితముఁ గలిగించును. మారేడుచెక్క అడ్డసరము ఆరెపువ్వు పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి దర్భ వీటికషాయముగాని, వేపచిగుళ్ల కషాయముతో వాంతిచేసికొనుట గాని హితకర మగును. జీలకఱ్ఱ పిప్పళ్లు అల్లము శొంఠి సౌవర్చలవణము వీటిని కొలఁదినీటిలో వైచి కషాయముఁ జేసి త్రాగినను, సుగంధములును మనోహరములగు మద్యముల నుపయోగించినను తృష్ణను పోఁగొట్టును. క్షయజనిత మగు దప్పిని రోగనివారణచేసి మాంసరసము రక్తమును పెంచి జయించును. పాలుగలిసిన నీరుగాని మాంసరసముగాని లేక తేనెపై తేటగాని క్షయ తృష్ణలను హరించును. బెల్లపుపాకమును నేలగుమ్మడిరసములో చక్కెరకలిపి కొని తృషితుఁడు త్రాగవలెను.

### ఛర్దితృష్ణలకు చికిత్స.

శ్లో. అతిరూక్షదుర్బలానాం తర్షం శమయే న్నృణా మిహాశు పయః, ఛాగో వా ఘృతభృష్టః శీతో మధురో రసో హృద్యః. 12. ఆమ్రజంబూకషాయం వా పిబే న్మాక్షికసంయుతమ్, ఛర్దిం సర్వాం ప్రణుదతి తృష్ణాం చై వాపకర్షతి. 13. వటశృంగసితాలోధ్ర దాడిమం మధుకం మధు, పిబే త్తండులతోయేన ఛర్దితృష్ణానివారణమ్. 14. గో

స్తనేక్షురసక్షీరయష్టీమధుమధూత్పలైః, నియతం నస్యతః పానైః తృష్ణా శామ్యతి దారుణా. 15.

మిక్కిలి పరుసముగాను దుర్బలుడుగానున్న మనుజునకు గలిగిన తృష్ణను పాలు మిక్కిలిత్వరగా హరించును. లేక మేకమాంసరసమును నేతితోచేయించి చల్లార్చి త్రాగవలయును. అదియును గానిచో మామిడి నేరేడు కషాయములో తేనెను చేర్చిత్రాగిన యెడల అన్నివిధములగు ఛర్దులను తృష్ణలును తొలఁగిపోవును. మఱియుగుళ్ళు చక్కెర లొద్దుగ దాడిమ యష్టిమధుకము తేనె వీటిని బియ్యపుకడుగుతో నూరి త్రాగినయెడల ఛర్దులను తృష్ణలును నశించును. ద్రాక్షచెఱకురసము పాలుయష్టిమధుకము కమలములు వేసి చేసిన నస్యమువలనగాని కషాయమును త్రాగుటవలననుగాని అతిభయంకరమైన తృష్ణరోగములును శమించును.

## తాలుశోషలకు చికిత్స.

శ్లో. క్షీరేక్షురసమాధ్వీకైః క్షౌద్రశీధుగుడోదకైః, వృక్షామ్లామ్లైశ్చ గండూషస్తాలుశోష నివారణః. 16. తాలుశోషే పిబేత్సర్పిఘృతమండ మథాపి వా, మూర్ఛాఛర్దితృషాదాహ స్త్రీమద్యభృశకర్శితాః. 17. పిబేయు శ్శీతలం తోయం రక్తపిత్తే మదాత్యయే, ధాన్యామ్లమాస్యవైరస్యమలదౌర్గంధ్యనాశనమ్. 18. తదేవాలవణం శీతం ముఖశోషహరం పరమ్, నైర్వ్యం జనయత్యాస్యే సందధాతి ముఖే వ్రణాన్. 19. దాహతృష్ణాప్రశమనం మధుగండూషధారణం.

పాలు చెఱకురసము ఇప్పపూవులు తేనె మద్యము బెల్లపుపానకము చింతపండు రసము వీటిరసములను సేవించిన దవడ లెండకొనిపోవుట నశించును. తాలుశోషమునందు నేతిని త్రాగవలయును. లేనిచో నేతితో చేసిన మండమునైనను త్రాగవలయును. మూర్ఛలు చర్ది తృష్ణ దప్పి స్త్రీలు మద్యము మున్నగు కారణములచేత శుష్కించిన వాడు చల్లనినీటిని త్రాగవలయును. రక్తపిత్తమునందును, మదాత్యయమునందునుగంజిని త్రాగవలయును. ముఖమువాడుట మలము దుర్గంధముగావెడలుట మున్నగునవి ఇద్దాన నశించును. ఉప్పులేనిగంజిని త్రాగినయెడల ముఖశోషలను హరించును. సౌందర్యము నిచ్చును. వ్రణములను మాన్చును. దాహమును దప్పిని పోఁగొట్టును.

## తృష్ణలకు సామాన్యచికిత్స.

శ్లో. కోలదాడిమవృక్షామ్ల చుక్రికా చుక్రకారసః. 20. పంచామ్లకో ముఖాలేప స్సద్య స్తృష్ణాం నియచ్ఛతి, వారిశీతం మధుయుత

మాకంఠా ద్వా పిపాసితమ్. 21. పాయయే ద్వామయే చ్చాపి తేన తృష్ణా ప్రశామ్యతి, వటశృంగామయక్షౌద్ర లాజనీలోత్పలైర్ద్రఢా. 22. గుటికా వదనన్యస్తా క్షిప్రం తృష్ణాం నియచ్ఛతి, ఓదనం రక్తశాలీనాం శీతం మాక్షికసంయుతం. 23. భోజయేత్తేన శామ్యే త్తు ఛర్ది స్తృష్ణా చిరోత్థితా, పూర్వామయాతుర స్సన్ దీన స్తృష్ణార్దితో జలం యాచన్. 24. న లభేత చే దాశ్వేవ మరణ మాప్నోతి దీర్ఘరోగం వా, తృషితో మోహ మాయాతి మోహాత్ప్రాణా న్విముంచతి. 25. తస్మా త్సర్వా స్వవస్థాసు న క్వచి ద్వారి వార్యతే.

రేగుపండ్లు దానిమ్మపండ్లు చింతపండు పులిచెంచలి వీటిరసమును ముఖమున పట్టుగా వేసినయెడల శీఘ్రముగా దాహములు నశించును. చల్లని నీరు తేనెయును కలిపి తృషితులకు ఇచ్చినయెడలను కంఠమువఱకు నీళ్లను త్రాగించి కక్కించినను దప్పి శాంతించును. మఱ్ఱిఇగుళ్లు చెంగల్వకోష్ఠు తేనె పేలాలు నల్లగల్వలు వీటితో చేయఁబడిన యుండలను పుక్కిట నుంచుకొనిన దప్పి తొలఁగిపోవును. ఎఱ్ఱబియ్యపు టన్నమును చల్లార్చి అందు తేనెను చేర్చికొని భుజించినచో మిక్కిలి ప్రాచీనములైనను ఛర్దులును తృష్ణలును నశించును. మొదట రోగపీడితుఁడై యుండి నిలువలేని రోగి దీనముగా తృషితుఁడై నీటి నడిగినచో ఈయవలయును. అట్లు కానివాఁడు మరణించును. లేకున్న దీర్ఘరోగి యగును. దప్పిగల మనుజుఁడు మూర్ఛ నొందును. మూర్ఛవలన మరణించును. కావున నెట్టి యవస్థలో నున్నను రోగికి దాహము నిచ్చుటను మానుకొనరాదు.

ఇట్లు చక్రదత్తయందు తృష్ణాధికారప్రకరణము ముగిసెను.

# ౧౭. మూర్ఛాధికారము.

---

### మూర్ఛలయందు ఉపాయములు.

శ్లో. సేకావగాహా మణయ స్సహారాః శీతాః ప్రదేహా వ్యజనానిలా శ్చ, శీతాని పానాని చ గంధవంతి సర్వాసు మూర్ఛాసు నివారితాని. 1 సిద్ధాని వర్గే మధురే పయాంసి సదాడిమా జాంగలజా రసా శ్చ, తథా యవాలోహితశాలయ శ్చ మూర్ఛాసు శస్తా శ్చ సతీనముద్గాః. 2.

అన్నివిధములగు మూర్ఛలయందును పైని నీటిని చిలకరించుచుండుట, శీతలజలముల స్నానము చేయించుట, చంద్రకాంతము మున్నగు మణులు, చల్లని కమ్మని వీవనల గాడ్పులును, శీతలములగు పానకములును, పరిమళవంతము లగు పానకములును నివారణోపాయము లగుచున్నవి. మధురగణోక్తము లగు నౌషధులచేత కాచఁబడిన పాలును దానిమ్మరసముతో సిద్ధముచేయఁబడిన యడవిజంతువుల మాంసరసమును, యవలు ఎఱ్ఱనియ్యము గంద్ర పెసలు మున్నగువాని రసములును మూర్ఛ లన్నిటికిని హితకరములు.

### కషాయములను ప్రయోగింపవలసిన తెఱఁగులు.

శ్లో. యథాదోషం కషాయాణి జ్వరఘ్నాని ప్రయోజయేత్, రక్తజాయాంతు మూర్ఛాయాం హిత శ్శీతక్రియావిధిః. 3. మద్యజాయాం వమే న్మద్యం నిద్రాం సేవే ద్యథాసుఖమ్, విషజాయాం విషఘ్నాని భేషజాని ప్రయోజయేత్. 4. కోలమజ్జోషణోశీర కేసరం శీతవారిణా, పీతం మూర్ఛాం జయే ల్లీఢ్వా తృష్ణాంవా మధుసంయుతామ్. 5. మహౌషధామృతాక్షుద్రా పౌష్కరగ్రంథికోద్భవం, పిబే త్కణాయుతం క్వాథం మూర్ఛాదిషు మదేషు చ. 6. శతావరీబలామూలద్రాక్షాసిద్ధం పయః పిబేత్, ససితం భ్రమనాశాయ బీజం వాట్యాలకస్య చ. 7. పిబే ద్దురాలభాక్వాథం సఘృతం భ్రమశాంతయే, త్రిఫలాయాః ప్రయోగో వా ప్రయోగః పయసో పి వా. 8. రసాయనానాం కౌంభస్య సర్పిషో వా ప్రశస్యతే.

దోషముల ననుసరించియే జ్వరనాశము లగు కషాయముల నుపయోగింపవలయును. రక్తమువలనఁ బుట్టెడి మూర్ఛలయందు శీతక్రియలను చేయుట హితకరము. మద్యపానమువలనఁ గలిగెడి మూర్ఛలకు మద్యమును క్రక్కింపవలయును. విషభక్షణములచేత గలుగుమూర్ఛలకు విషనాశకము లగు నౌషధముల నుపయోగింపవలయును. రేగు మిరియములు వట్టివేళ్లు నాగకేసరములు వీటితో చేయఁబడిన కషాయము త్రాగినను గాని, పిప్పళ్లు చూర్ణమును తేనెలో కలిపికొని భక్షించినను గాని, మూర్ఛలు నశించును. శొంఠి తిప్పతీగ నేలములక పుష్కరమూలము పిప్పలమూలము వీటితో చేయఁబడిన కషాయములో పిప్పలిచూర్ణమును కలిపికొని త్రాగవలయును. మూర్ఛ లన్నింటియందును మదనునందును పిల్లపిచ్చర ముత్తువపులగము ద్రాక్ష వీటితో నగు కషాయమున చక్కెరను వైచికొని త్రాగవలయును.

లేనిచో చిట్టాముదపుగింజలనునూరి చక్కెరతో కలిపికొని త్రాగవలయును. దూలగొండి కషాయములో నేతిని వైచికొని త్రాగిన భ్రమలు శాంతించును. లేనియెడల త్రిఫలముల నుపయోగింపవలయును. అథవా పాలను త్రాగించిన భ్రమనశించును. రసాయనములను గాని నూరేండ్లనాటి ఘృతమును గాని సేవించిన హితకరమగును.

### భ్రమలయందు త్రిఫలముల ప్రయోగము.

శ్లో. మధునా హంత్యుపయుక్తా త్రిఫలా రాత్రౌ గుడార్ద్రకం
ప్రాతః, సప్తాహా త్పథ్యభోజీ మదమూర్ఛాకాస కామలోన్మాదాన్. 9.
అంజనా న్యవపీడాశ్చ ధూమాః ప్రధమనాని చ, సూచీభి స్తోదనం
శస్త్రం దాహః పీడా నఖాంతరే. 10. లుంఛనం కేశరోమ్ణాం చ దంతై
ర్దశన మేవ చ, ఆత్మగుప్తావఘర్ష శ్చ హితా స్త స్యావరోధనే. 11.

రాత్రులయందు తేనె కలిపిన త్రిఫలములును, ప్రాతఃకాలములయందు బెల్లమును, అల్లమును, ఏడుదినములు పథ్యముగా భుజించినవాడు మదమూర్ఛలను దగ్గులను కామెరలను పిచ్చిని జయింపగలుగును. మూర్ఛల నడ్డుపెట్టి నశింపజేయుటలో అంజనములును అవపీడలును పొగవేయుటయును కొట్టుటయును సూదులతో పొడుచుటయును గోళ్లలోపల కాల్చుటయును వెంట్రుకలను త్రెంచుటయును పండ్లతోటి కొఱుకుటయును దురదగొండితో నల్చుటయును మిక్కిలి హితకరము లగు నౌషధములు.

ఇట్లు చక్రదత్తీయమున మూర్ఛాధికారప్రకరణము ముగిసెను.

---

# ౧౭. మదాత్యయాధికారము.



## త్రిదోషమునందు ఖర్జూరాదిమంథము.

శ్లో. మంథః ఖర్జూర మృద్వీకా వృక్షామ్లామ్లీక దాడిమైః, పరూషకైః సామలకై ర్యుక్తో మద్యవికారనుత్. 1. జలే చతుష్పలే శీతే క్షుణ్ణద్రవ్యపలం క్షిపేత్, మృత్పాత్రే మర్దయే త్సమ్యక్ తస్మాచ్చ ద్విపలం పిబేత్. 2. సతీనముద్గమిశ్రాన్ వా దాడిమామలకాన్వితాన్, ద్రాక్షామలకఖర్జూర పరూషకరసేన వా, 3. కల్పయే త్తర్పణా న్యూషాన్ రసాంశ్చ వివిధాత్మకాన్.

ఖర్జూరపుపండ్లు ద్రాక్ష చింతపండు చిట్టీతపండు దానిమ్మఫలములు వీటితో చేసిన మంథము మదము వలన నగు వికారములను పోగొట్టును. నాలుగుపలముల నీటిలో పొడిచేసిన యౌషధద్రవ్యములను పలమువేయవలయును. దీనిని మట్టిపాత్రలో చక్కగా వండి 2 పలములు త్రాగవలయును. గుండ్రపెసలు లేక దానిమ్మ ఉసిరికలు ఖర్జూరఫలములు ఉసిరికకాయలు నీటిరసమును తీసి తర్పణములుగాను, యూషమును గాను అనేకవిధము లగు రసములుగాను చేసి యుపయోగింపవలయును.

## వాతమువలనను త్రాగుడువలనను కలిగిన మదదోషములకు చికిత్సలు.

శ్లో. మద్యం సౌవర్చలవ్యోషయుక్తం కించి జ్జలాన్వితమ్. 4. జీర్ణమద్యాయ దాతవ్యం వాతపానాత్యయాపహం, ముద్గయూష స్సితాయుక్తః స్వాదు ర్వా పైశితో రసః. 5. పిత్తపానాత్యయే యోజ్యాః సర్వతశ్చ క్రియా హిమాః, పానాత్యయే కఫోద్భూతే లంఘనం చ యథాబలమ్. 6. దీపనీయౌషధోపేతం పిబే న్మద్యం సమాహితః, సర్వజే సర్వ మేవేదం ప్రయోక్తవ్యం చికిత్సితం. 7. ఆభిః క్రియాభి ర్మిశ్రాభిః శాంతిం యాతి మదాత్యయః.

సౌవర్చలవణము శొంఠి మిరియములు పిప్పళ్లు కొంచెముగా నీళ్లు వీటితో చేయఁబడిన మద్యము జీర్ణమద్యము గలరోగములకు ఇవ్వవలయును. ఇయ్యది వాతపు త్రాగుడుదోషమును పోగొట్టును. చక్కెరవేసిన పెసలగంజిని కాని చక్కెరకలిపిన మాంసరసము గాని పిత్తపానదోషమునందు ఇవ్వవలయును. కాని యన్నివిధము లగు శైత్యోపచారములను చేయుట మంచిది. కఫపానాత్యయమునందు బలానుసారముగా లంఘనము చేయుట హితము. సావధానముగా బోడసరపు విత్తనములతో చేయఁబడిన

మద్యమును త్రాగవలయును. సన్నిపాతపు మదాత్యయరోగమునందు ఈచికిత్స నంతయును చేయవలయును. ఈ క్రియలను చేసిననే మదాత్యయము శాంతించును.

—— దుగ్ధాది ప్రయోగములు. ——

శ్లో. న చేన్మద్యక్రమ ముక్త్వా క్షీర మస్య ప్రయోజయేత్. 8. లంఘనాద్యైః కఫే క్షీణే జాతదౌర్బల్యలాఘవే, ఓజ స్తుల్యగుణం క్షీరం విపరీతం చ మద్యతః. 9. క్షీర ప్రయోగం మద్యం వా క్రమేణాల్పాల్ప మాచరేత్.

మదాత్యయరోగికి మద్యక్రమమునువదలిపెట్టి పాలను ప్రయోగింపరాదు. లంఘనము మున్నగువాని వలన కఫము క్షీణింపఁగా దుర్బలము చులకదనముకలుగ అప్పుడు మద్యము నిచ్చుటకు బదులుగా ఓజస్సునకు (అనగా బలమునకు) తగినట్లు క్షీరము నీయవలయును. క్షీరము నిచ్చుట గాని, మద్యమును గాని కొద్దికొద్దిగా క్రమానుసారము ప్రయోగింపవలయును.

—— పునర్నవాదిఘృతము. ——

శ్లో. పయః పునర్నవాక్వాథ యష్టీకల్క ప్రసాధితమ్. 10. ఘృతం పుష్టికర పానాత్ మద్యపానహతౌ జనః.

పాలు తెల్లగలిజేరు రసము యష్టిమధుకపుకల్కము వీటితో సిద్ధము చేయఁబడిన నేయి మద్యపానము చేత నశించిన బలము గలవానికి గూడను పుష్టిని గలుగఁజేయును.

—— అష్టాంగలవణము. ——

శ్లో. సౌవర్చల మజాజ్యం చ వృక్షామ్లం సామ్లవేతసమ్. 11. త్వగేలామరిచార్ధాంశం శర్కరాంభాగయోజితమ్, హితం లవణ మష్టాంగం అగ్నిసందీపనం పరమ్. 12. మదాత్యయే కఫప్రాయే దద్యా త్స్రోతోవిశోధనమ్.

సౌవర్చలవణము తెల్ల జీలకఱ్ఱ చింతపండు ఆమ్లవేతసము తవక్షీరి లేక లవంగపు పట్టఏలకులు మిరియములు వీటినన్నిటిని కలకండతో గూడ ఏడేడు భాగములును, ఉప్పు ఎనిమిదవ భాగమును కలిపి చూర్ణముచేసి సేవింపవలయును. ఇయ్యది జఠరాగ్నిని వృద్ధిబొందించును. దీనిని కఫజమగు మదాత్యయమునందియ్యవలయును. ఇయ్యది రక్తనాడులను పరిశోధించును. దీనినే అష్టాంగలవణ మందురు.

—— చవ్యాదులగు నుపాయములు. ——

శ్లో. చవ్యం సౌవర్చలం హింగు పూరకం విశ్వదీప్యకమ్. 13. చూర్ణం మద్యేన దాతవ్యం పానాత్యయరుజాపహం. జలాప్లుత శ్చందన

భూషితాంగ స్స్రగ్వీ సభక్తాం పిశితోపదంశాం, పిబ న్సురా న్నై
వ లభేత రోగాన్, మనోమతిఘ్నం చ మదం న యాతి. ద్రాక్షాకపిత్థ
ఫలదాడిమపానకంయ త్తత్పానవిభ్రమహరం మధుశర్కరాఢ్యమ్. ప
థ్యాక్వాథేన సంసిద్ధం ఘృతం ధాత్రీరసేనవా, సర్పిః కల్యాణకం వాపి
మదమూర్ఛాపహరం పిబేత్. 15. సచ్ఛర్దిమూర్ఛాతిసారం మదం పూగ
ఫలోద్భవమ్, సద్యః ప్రశమయే త్పీతం ఆతృప్తే ర్వారి శీతలమ్. 16. వ
శ్యకరీషఘ్రాణా జ్జలపానా ల్లవణభక్షణా ద్వాపి, శామ్యతి పూగఫల
మదః చూర్ణగుడాశర్కరాశకబలాత్. శంఖచూర్ణజో ఘ్రాణం స్వల్పం
మద మపోహతి కూష్మాండకరస స్సగుడః, శమయతి మదనకోద్భవజమ్
ధాత్తూరం చ సదుగ్ధం సశర్కరం పానయోగేన. 18.

చవ్యము సౌవర్చలవణము పొంగించిన ఇంగువ మాదీఫలము శొంఠి అజామోదవిత్తనములు నీటిచూర్ణమును మద్యములతో చేర్చి ఈయవలయును. ఇయ్యది మద్యపానముచేతనగు మదములను పోగొట్టును. మనుజుఁడు చక్కగా స్నానము చేసినవాఁడై మంచి గంధము నలఁదికొని పూలమాలికల ధరించి మాంసరసము గల యన్నమును తినుచున్నవాఁడై, తగుసాటిగా మద్యమును త్రాగెనేని అద్దాన రోగములను పొందఁడు. మతి పోఁగొట్టగల మదమును కూడ నొందఁడు. ద్రాక్ష వెలఁగపండ్లు దానిమ్మ వీటితో చేసిన పానకములో తేనెను చక్కెరను మిక్కుటముగా వైచికొని సేవించినయెడల మద్యపానముచే నగు మదముల నణంచును. కరకకాయ కషాయముచేతఁగాని ఉసిరికరసముచేతఁ గాని సిద్ధముచేయఁబడిన ఘృతము, లేక కల్యాణఘృతము గాని మదమును మూర్ఛలను పోఁగొట్టును. శంఖచూర్ణముగాని పిరుపిడకల చూర్ణముగాని పీల్చుటచేతనున్ను చాలినంతవఱకు త్రాగినచో చల్లనినీరుసయితము త్రాగుటచేతను, ఛర్ది మూర్ఛ అతిసారము పోకచెక్క వీటివలనఁ బుట్టిన మదమును శీఘ్రముగా శాంతిపఱచేయును. అడవిదానిమ్మ నస్యమును జలమును పీల్చినయెడలకాని, ఉప్పు తినుటచేతఁగాని, వక్కలు నములుటచే నగు సొక్కు (మదము) అణగును. సున్నమును చక్కెరలో మాటి భక్షించుటవలన, కొద్దిపాటి మదాత్యయము లణఁగును. బూడిదగుమ్మడిరసములో బెల్లముఁ జేర్చి త్రాగిన, యుమ్మెత్తదినుటవలన నగు మదములు నశించును. చక్కెర వేసికొని పాలను త్రాగిన యుమ్మెత్తవలని మదము నశించును.

ఇట్లు చక్రదత్తయందు మదాత్యయాధికార ప్రకరణము ముగిసెను.

# ౧౬. దాహాధికారము.



## దాహశమనోపాయములు.

శ్లో. శతధౌతఘృతాభ్యక్తం లిహ్యాద్వా యవసక్తుభిః, కోలామలకయుక్తై ర్వా ధాన్యామ్లై రపి బుద్ధిమాన్. 1. ఛాదయే త్తస్య సర్వాంగ మారనాలార్ద్రవాససా, లామజ్జేనాథ శుక్తేన చందనేనానులేపయేత్. 2. చందనాంబుకణాస్యంది తాలవృంతోపవీజితః, సుప్యా ద్దాహార్దితో ఒంభోజకదలీదలసంభవే. 3. పరిషేకావగాహేషు వ్యజనానాం చ సేవనే, శస్యతే శిశిరం తోయం తృష్ణాదాహోపశాంతయే. 4. క్షీరైః క్షీరికషాయై శ్చ సుశీతై శ్చందనాన్వితైః, అంతర్దాహం ప్రశమయే ద్దేతై శ్చాన్యై శ్చ శీతలైః. 5.

నూరుమారులు వడియకట్టఁబడిన నేతితో మాటినరసమును నాకవలయును. యవల సత్తుపిండిచేతఁగాని, రేగు ఉసిరికలు కలిపిచేసిన గంజిచేతగాని బుద్ధిమంతుఁడగువాఁడు పిపాసాపీడుతుని సర్వాంగములను రుద్దవలయును. లేక తడిబట్టతో కప్పవలయును. కురువేరు రసముతోగాని శుక్తమను గంజివిశేషముతోగాని మంచిగంధముతోగాని లేపనమును చేయవలయును. కమలములు అరఁటియాకులు దొరకినయెడల వాటిపై పరుండవలయును. చందనోదకమును చిలికిన విసనకఱ్ఱతో వీచుకొనవలయును. మీద చల్లుటయో గాని స్నానమునందు గాని వీసనలతో విసరించుకొనుటప్పుడు గాని చల్లనీటి నుపయోగించిన దప్పి గొంతెండి పోవుటలు నిల్చిపోవును. పాలు పాలచెట్లుతో బెట్టిన కషాయమును మంచిగంధముతో చేర్చిగాని ఇతరశీతల క్రియలను చేసినగాని లోపలిదాహమును పోఁగొట్టవలయును.

## కుశాది తైలమును; ఘృతమును.

శ్లో. కుశాదిశాలపర్ణీభి ర్జీవకాద్యేన సాధితం,
తైలం ఘృతం వా దాహఘ్నం వాతపిత్తవినాశనమ్. 6.

కుశాది గణపఠితము లగు నౌషధములును అనగా తృణపంచమూలములు, ముయ్యాకుపొన్న కోలపొన్న కారుమినుము కారుపెసర జీవకాదిగణము వీటితో

సిద్ధము చేయఁబడిన తైలముగాని నేయిగాని దాహమును పోఁగొట్టును. వాతపిత్తములను గూడ నశింపఁజేయును.

## ఫలిన్యాదిలేపము.

శ్లో. ఫలినీలోధ్రసేవ్యాంబు హేమపత్రం కుటన్నటం, కాలీయ కరసోపేతం దాహే శస్తం ప్రలేపనమ్. 7. హ్రీబేర పద్మకోశీరం చందన క్షోదవారిణా, సంపూర్ణా మవగాహేత ద్రోణీం దాహార్దితో నరః. 8.

ప్రేంకణపుటాకులు లొద్దుగ వట్టివేరు కురువేరు నాగకేసరములు వీటితో నాన్చిన యుదకమును దుండిగపుచెట్టు పద్మకము తుంగముస్తలు వీటిని చందనపురసముతో జేర్చి లేపము చేయుట దాహములయందు శ్రేష్ఠము. కురువేరు పద్మకము వట్టివేళ్లు చందనము వీటిచూర్ణము కలిపిన నీటితో పూర్తిగా గొంతువఱకు మునిగినట్లైన దాహము శమించును.

ఇట్లు చక్రదత్తయందు దాహాధికారప్రకరణము ముగిసెను.



# ౨౦. ఉన్మాదాధికారము

### వాతము వలననగు పిచ్చికి యుపాయములు.

శ్లో. ఉన్మాదే వాతికే పూర్వం స్నేహపానం విరేచనమ్, పిత్తజే కఫజే వాంతిః పరే వస్త్యాదికః క్రమః. 1. యచ్చోపదిశ్యతే కించి దపస్మారచికిత్సితే, ఉన్మాదే తచ్చ కర్తవ్యం సమానా ద్దోషదూష్యయోః. 2. సబ్రాహ్మీ కూష్మాండీ షడ్గ్రంధా శంఖపుష్పికా స్వరసాః, ఉన్మాదహృతో దృష్టాః పృథగేతే కుష్ఠమధుమిశ్రాః. 3. దశమూలాంబుసఘృతం యుక్తం మాంసరసేన వా, ససిద్ధార్థకచూర్ణం వా పురాణం వైకకం ఘృతమ్ 4. ఉగ్రగంధం పురాణం స్యా ద్దశవర్షస్థితం ఘృతమ్, లాక్షారసనిభం శీతం ప్రపురాణ మతఃపరమ్. 5. శ్వేతోన్మత్తోత్తరదిఙ్మూలసిద్ధస్తు పాయసః, గుడాజ్యసంయుతో హంతి సర్వోన్మాదాంస్తు దోషజాన్. 6.

వాతమువలన గలిగిన పిచ్చియందు మొదట తైలమును త్రాగుటయును పిత్తజ మగునున్మాదమున విరేచనములను తీసికొనుటయును కఫజ మగు నున్మాదమున వాంతి చేయించుటయును, తక్కిన యున్మాదములయందు వస్తికర్మ మున్నగునవి చేయుటయును మంచిది. అపస్మారవ్యాధులలో చికిత్సనెయ్యది చెప్పఁబడియెనో పిచ్చియందుకూడ దానినే చేయవలయును. ఏలయనగా దోషమును దూష్యమును ఈరెండిటియందు తుల్యములు. మండూకబ్రాహ్మి గుమ్మడి శంఖపుష్పిక వస వీటిరసమును వేర్వేరుగాతీసి చెంగల్వకోష్ఠు యష్టిమధుకము తేనెయును చేర్చికొని సేవించినచో నున్మాదములనుహరించును. దశమూలముల క్వాథమును నేతితో కలిపి కాని మాంసరసముతో చేర్చికొని గాని ఆవాలు పొడి చేసి చేర్చిగాని పురాణపు నేతిని గాని సేవించిన యున్మాదములు నశించును. పురాణపు నేయి యనగా — ఘాటగు వాసన కలదియును, పదివర్షములు మాగినదియును, లత్తుకవంటి రంగు కలదియును, చల్లగా నున్నదియునగు నేయి యని యందురు. తెల్లయుమ్మెత్త యొక్క యుత్తరపు దిక్కు వేరు వేసి పాయసముచేసి బెల్లము నేతిని చేర్చి సేవించిన సమస్తము లగు నున్మాద దోషములును నశించును.

### సర్షపతైలాదులు.

శ్లో. ఉన్మాదే సమధుః పేయః శుద్ధో వా తాలశాఖజః. 7.

రసో నస్యేఽభ్యంజనే చ సార్షపం తైల మిష్యతే, అపక్వచటకీక్షీర పీతోన్మాదవినాశినీ. 8. బద్ధం సార్షపతైలాక్త ముత్తానం చాతపే న్యసేత్. సిద్ధార్థకో హింగువచా కరంజో దేవదారు చ. 9. మంజిష్ఠా త్రిఫలా శ్వేతా కటభీత్వ క్కటుత్రికమ్, సమాంశాని ప్రియంగు శ్చ శిరీషో రజనీద్వయం. 10. బస్తమూత్రేణ పిష్టోయ మగదః పాన మంజనమ్. నస్య మాలేపనం చైవ స్నాన ముద్వర్తనం తథా. 11. అపస్మారవిషోన్మాదం హృత్వా లక్ష్మీజ్వరాపహః, భూతేభ్య శ్చ భయం హంతి రాజద్వారే చ శస్యతే. 12. సర్పి రేతేన సిద్ధం వా సగోమూత్రం తదర్ధకృత్.

ఉన్మాదమునందు తాటిచెట్టునుండి గీయఁబడిన కల్లులో తేనెను చేర్చికొని త్రాగుట మంచిది. నస్యక్రియలయందును తలంటుకొనుటయందును ఆవనూనె మిక్కిలి మంచిది. చక్కగా పండని చిరిసెనగలను, పాలను త్రాగిన యున్మాదములు నశించును. ఉన్మాదముగలరోగిని కట్టివైచి ఆవనూనెతో తలనంటి ఎండలో వెల్లికల బరుండబెట్టిన యున్మాదము నశించును. తెల్లఆవాలు, ఇంగువ, వస, కానుగుపట్ట, దేవదారు, మంజిష్ఠను, త్రిఫలములు, దెల్లదింటెన, మద్దిపట్ట, శొంఠి, పిప్పలి, మిరియములు, ప్రేంకణము, దిరిసెన, పసపు, మ్రానిపసపు వీటిని సమానభాగములను చేర్చి మేకమూత్రముతో నూరి దీనిని త్రాగినను, అంజనముగా నుపయోగించినను నశ్యముగను, ఆలేపనముగను, స్నానసమయమున నలుగుపిండిగాను నుపయోగించినను అపస్మారములను విషములను పోఁగొట్టి అలక్ష్మిని (బీదతనమును) జ్వరమును నశింపఁజేయును. మఱియును భూతప్రేతాదుల నగు భయములను పోఁగొట్టును. రాజద్వారములయందు శుభదము అగును. ఈయౌషధమే గోమూత్రముచే సిద్ధముచేసిన, నేయితో సిద్ధముచేసినను పైచెప్పఁబడిన ఫలముల నన్నింటి నిచ్చును.

### త్ర్యూషణములవర్తులు.

శ్లో. త్ర్యూషణం హింగులవణం వచా కటుకరోహిణీ. 13. శిరీషనక్తమాలానాం బీజం శ్వేతా శ్చ సర్పిషాః, గోమూత్రపిష్టై రేతై ర్వా వర్తి ర్నేత్రాంజనే హితా. 14. చాతుర్థక మపస్మార మున్మాదం చ నియచ్ఛతి.

శొంఠి మిరియములు పిప్పళ్లు ఇంగువ సైంధవలవణము వస కటుకరోహిణి దిరిసెనవిత్తులు కానుగచెక్క తెల్లయావాలు వీటిని గోమూత్రముతో నూరి వత్తిచేసి

నేత్రములకు కాటుకగా నుపయోగించినచో హితము కలిగించును. చాతుర్థికజ్వరము లును అపస్మారములును పిచ్చిని నశింపఁజేయును.

అంజన తాడనాదులగు నుపాయములు.

శ్లో. శుద్ధస్యాచారవిభ్రంశే తీక్ష్ణం నావన మంజనమ్. 15. తాడనం చ మనోబుద్ధి స్మృతిసంవేదనం పరం, తర్జనం త్రాసనం దానం సాంత్వనం హర్షణం భయం. 16. విస్మయో విస్మృతే ర్హేతో ర్నయంతి ప్రకృతం మనః, కామశోకభయక్రోధహర్షేర్ష్యాలోభసంభవాన్. 17. పరస్పర ప్రతిద్వంద్వై రేభిరేవ శమం నయేత్, ఇష్టద్రవ్యవినాశాత్తు మనో యస్యోపహన్యతే. 18. తస్య తత్సదృశప్రాప్త్యా శాంత్యాశ్వాసైశ్చ తాం జయేత్.

పరిశుద్ధుఁడగువాఁ డున్మాదమున ఆచారమునుండి భ్రష్టుఁడైనచో తీక్ష్ణములగు నస్యక్రియలును అంజనములును తాడనములును మనస్సు బుద్ధి పూర్వవిషయముల సంస్మరణము మున్నగువానిఁ దెలుపు నుపాయములును హితకరములు. బెదిరించుట, భయపెట్టుట, అడిగినదాని నిచ్చుట, ఊరడించుట, సంతసపెట్టుట, భయము, ఆశ్చర్యము ఇయ్యాది విస్మృతిజనకము లగుటచేత మనస్సును పూర్వమువలె నుంచును. కామము దుఃఖము భయము కోపము సంతసము పిసినిగొట్టుతనము వీటిచేత బుట్టిన యున్మాదములను ఒకదానికొక్కటి విరుద్ధములగు పనులవలన శాంతించును. ప్రియవస్తువినాశనము వలన గలుగు మనోవిభ్రమములయందు ఆవస్తువుతో సమానము లగు వస్తువుల నిచ్చుట చేతను ఊరడింపు మున్నగువానిచేతను స్వస్థత కలుగును.

లేపమును ఘృతపానమును.

శ్లో. ప్రలేపోత్సర్జనాభ్యంగ ధూమాః పానం చ సర్పిషః. 19. ప్రయోక్తవ్యం మనోబుద్ధిస్మృతిసంజ్ఞా ప్రబోధనం, కల్యాణకం మహాద్వాపి దద్యాద్వా చైతసం ఘృతం. 20. తైలం నారాయణం చాపి మహానారాయణం తథా.

నేతితో లేపనము నలుగు అంటికొనుట పొగవేసికొనుట త్రాగుట మున్నగు వానిని చేయవలయును. మనస్సు బుద్ధి జ్ఞాపకము తెలివి వీటివి గలిగించు క్రియలను చేయవలయును. కల్యాణఘృతమునైనను మహాకల్యాణఘృతమునైనను చైతసఘృతమునైనను ఉపయోగింపగావలయును.

## కల్యాణఘృతము - క్షీరకల్యాణఘృతము.

శ్లో. విశాలా త్రిఫలా కౌంతీ దేవదార్వేలవాలుకం. 21. స్థిరానతం రజన్యౌ ద్వే శారివే ద్వే ప్రియంగుకాః, నీలోత్పలైలామంజిష్ఠా దంతీదాడిమకేసరం.. 22. తాలీశపత్రం బృహతీ మాలత్యాః కుసుమం నవం, విడంగం పృశ్నిపర్ణీ చ కుష్ఠం చందనపద్మకౌ. 23. అష్టావింశతిభిః కల్కై రేతై రక్షసమన్వితైః, చతుర్గుణం జలం దత్వా ఘృతప్రస్థం విపాచయేత్. 24. అపస్మారే జ్వరే కాసే శోషే మందానిలే క్షయే, వాతరక్తే ప్రతిశ్యాయే తృతీయకచతుర్థకే. 25. వమ్యర్శోమూత్రకృచ్ఛ్రే చ విసర్పోపహతేషు చ, కండూపాండ్వామయోన్మాదే విషమేహగరేషు చ. 26. భూతోపహతచిత్తానాం గద్గదానామరేతసాం, శస్తం స్త్రీణాం చ వంధ్యానాం ధన్య మాయుర్బలప్రదం. 27. అలక్ష్మీపాపరక్షోఘ్నం సర్వగ్రహనివారణం, కల్యాణక మిదం సర్పి శ్శ్రేష్ఠం పుంసవనేషు చ. 28. ద్విజలం సచతుః క్షీరం క్షీరకల్యాణకం త్విదం.

పాపరబుడమ త్రిఫలములు రేణుకలు దేవదారువు కూతురుబుడమ వాలుకము తగరము పసపు మ్రానిపసపు శ్వేతకృష్ణసుగంధపుచెక్క నల్లకల్వలు ఏలకులు మంజిష్ఠము దానిమ్మ నాగకేసరములు తాడిశపత్రి పెద్దవాకుడు సంపెంగపూవులు (క్రొత్తవి) వాయువిడంగములు కోలపొన్న చెంగల్వకోష్ఠు చందనము పద్మాక్షము వీటిని 28 మిది యౌషధములను ఒక్కొక్కకర్షము చొ॥ తీసికొని కల్కముచేసి, ఒకద్రోణము నీళ్లలో 16పలముల నేతిని పోసి దీనిని పక్వముచేయవలయును. అపస్మారములు జ్వరములు శ్వాసకాసములు శోష అగ్నిమాంద్యము క్షయ వాతరక్తములు పీనస మూడునాల్గురోజులకు వచ్చు వరుసజ్వరములు ఛర్ది మూలరోగము మూత్రకృచ్ఛ్రము చలిదిబిల పాండురోగము పిచ్చి విషము మేహరోగము వీటియందును భూతములవలన భయపడినవారికిని డగ్గుత్తుక వీర్యనష్టము లందును గొడ్డుబోతు లగుస్త్రీలకును శ్రేష్ఠము. ఇయ్యది ఆయుర్బలములను పెంపొందించును. దారిద్ర్యమును పాపమును పోగొట్టును. గ్రహబాధల నశింపఁజేయును. ఇయ్యది కల్యాణఘృతము. పురుషుల కత్యంతోపకారి యగునది. మఱియు నిందు నాల్గురెట్లు పాలను రెండురెట్లు నీటిని పోసి పక్వముచేసిన నిదియే క్షీరకల్యాణకఘృత మనఁబడును.

### మహాకల్యాణకఘృతము.

శ్లో. ఏభ్య ఏవ స్థిరాదీని జలే పక్త్వైకవింశతిమ్, రసే తస్మిన్పచేత్సర్పిః గృష్టిక్షీరచతుర్గుణమ్. 29. వీరాద్ద్విమాషకాకోలీ స్వయంగుప్తర్షభర్ద్ధిభిః, మేదయా చ సమైః కల్కైః త త్స్యాత్కల్యాణకం మహత్. 30. బృంహణీయం విశేషేణ సన్నిపాతహరం పరం.

వెనుక చెప్పఁబడిన యౌషధముల భాగముల ప్రకారమే పాపర మొదలగు నిరువదియొక్క ఔషధములను నీటిలో పక్వముచేసి ఆరసములో తొలుచూరి యీనిన ఆవుపాలను నాల్గురెట్లును, పిల్లపిచ్చరి మినుము అడవిమినుము కాకోలి దూలగొండి వి త్తనములు బుషభమను గంధద్రవ్యము బుద్ధి మేద ఈయౌషధముల నన్నిఁటిని సమానభాగములుగా తీసికొని కల్కమును చేసి కలిపి సేవింపవలయును. ఇయ్యది మహాకల్యాణఘృత మనఁబడును. విశేషముగా వీర్యమును వృద్ధి నొందించును. సన్నిపాతజ్వరములను పోఁగొట్టును.

### చైతస ఘృతము.

శ్లో. పంచమూల్యశ్చ కాశ్మర్యో రాస్నైరండత్రివృద్బలా. 31. మూర్వాశతావరీ చేతి క్వాథైర్ద్విపలకైరిమైః, కల్యాణకస్య చాంగేన తద్ఘృతం చైతసం ఘృతమ్. 32. సర్వచేతోవికారాణాం శమనం పరమం మతం, ఘృతప్రస్థ ఉత్ర పక్తవ్యః క్వాథో ద్రోణాంభసా ఘృతాత్. 33. చతుర్గుణోఽత్ర సంపాద్యః కల్కః కల్యాణకేరితః.

పంచమూలములు గుమ్ముడు సన్నరాస్న ఆముదపువేరు తెల్లతెగడ ముత్తువపులగము చాగ పిల్లపీచర వీటి నన్నిటిని రెండేసిపలముల చొ॥ తీసికొని కషాయమును చేసిన కల్యాణఘృతమున కంగముగా చైతసఘృత మనఁబడును. ఇయ్యది అన్నివిధములగు చిత్తవికారములను పోఁగొట్టును. దినియందు (అనగా దీనిని సిద్ధముచేయుటలో) 16 పలముల నెయ్యి ద్రోణమునీళ్లతో కాచిన 64 పలముల కషాయములో కల్యాణఘృతకల్కము నాల్గింతలును తీసికొని పక్వము చేసి సేవింపవలయును.

### మహాపైశాచిక ఘృతము.

శ్లో. జటిలా పూతనా కేశీ చారటీ మర్కటీ వచా. 34. త్రాయమాణా జయావీరా చోరకః కటురోహిణీ, వయస్థా శూకరీ ఛత్రా సాతిచ్ఛత్రా పలంకషా. 35. మహాపురుషదంతా చ వయస్థా నాకులీద్వయమ్,

కటుంభరా వృశ్చికాలీ స్థిరా చైవ చ తైర్ఘృతం. 36. సిద్ధం చాతుర్థికోన్మాదగ్రహాపస్మారనాశనమ్, మహాపైశాచికం నామ ఘృత మేత ద్యథామృతం. 37. మేధాబుద్ధిస్మృతికరం బాలానాం చాంగవర్ధనమ్,

జటామాంసి కరక కాయలు మెట్టతామర దూలగొండి వస కలుక్రాసుగ పచ్చ మినుము పిల్లిపిచ్చర ఖురాసానివామము గడ్డిదవనము కటుకరోహిణి బ్రాహ్మి వారాహి కంద వట్టివేళ్లు మెంతులక్క పెద్దపీచర క్షీరకాకోలి రెండువిధము లగు ములకలును, చాగఫలమును శాలిపర్ణి వీటితో నేతిని పక్వముచేయవ యును. ఇయ్యది చాతుర్థికజ్వరములను పిచ్చ గ్రహదోషము అపస్మారములనును నశింపజేయును. ఇయ్యది మహాపైశాచిక మను ఘృతము. అమృతముతో సమానము. మతియును నిర్మలమగు బుద్ధినిచ్చును. స్మృతిని కలిగించును. బలమును అవయవములను పెంచును.

## హింగ్వాదిఘృతము.

శ్లో. హింగుసౌవర్చలవ్యోషైః ద్విపలాంశైః ఘృతాఢకం, చతుర్గుణే గవాం మూత్రే సిద్ధ మున్మాదనాశనమ్. 38.

ఇంగువ సౌవర్చలవణము శొంఠిమిరియములు పిప్పళ్లు వీటిని రెండుపలములచొ|| తీసికొని ఒక ఆఢకము నేతిని అంతకు నాలుగురెట్లు గోమూత్రమును చేర్చి ఘృతమును పక్వము చేయవలయును. ఇయ్యది యున్మాదములను పోగొట్టును.

## లశునాద్య ఘృతము.

శ్లో. లశునస్యాపనష్టస్య తులార్ధం నిస్తుషీకృతమ్, తదర్ధం దశమూల్యాస్తు ద్వ్యాఢకేఽపాం విపాచయేత్. 39. పాదశేషే ఘృతప్రస్థం లశునస్య రసం తథా, కోలమూలక వృక్షామ్ల మాతులుంగార్ద్రకై రసైః. 40. దాడిమాంబు సురామస్తు కాంజికామ్లైః తదర్ధికైః, సాధయేత్త్రిఫలాదారులవణవ్యోష దీప్యకైః. 41, యమానీ చవ్య హింగ్వామ్ల వేతసైశ్చ పలార్ధకైః, సిద్ధమేత త్పిబే చ్ఛూలగుల్మార్శోజఠరాపహం. 42. బ్రధ్న పాండ్వామయప్లీహ యోనిదోష క్రిమిజ్వరాన్, వాతశ్లేష్మామయాం శ్చాన్యాన్ ఉన్మాదాం శ్చాపకర్షతి. 48.

50 పలములు ఉల్లి గడ్డలను తెల్లగడ్డలనుగా తెచ్చి, పొట్టునొలిచి 25 పలముల దశమూలములను చేర్చి, రెండాఢకముల నీటిలో పక్వము చేయవలయును. నాల్గ

వభాగము నీరు మిగిలియుండగా 16 పలముల ఘృతమును 16 పలముల నుల్లిగడ్డల రసమును రేగు కురువేరు చింతపండు అల్లము వీటి రసమును దానిమ్మరసము మద్యము మజ్జిగ గంజి వీటిని 5పలములు తీసి పైదానియందు చేర్చి ఘృతమును పక్వము చేయవలయును. ఇయ్యది శూలములను గుల్మములను మూలరోగములను ఉదరరోగములను పోఁగొట్టును. బ్రధ్నరోగమును పాండురోగమును ప్లీహరోగమును యోనిదోషములను జ్వరములను వాతకఫరోగములను అన్నివిధము లగు నున్మాదములను తొలఁగఁద్రోయును.

## పైశాచపు పిచ్చికి మంత్రాదులు.

శ్లో. సర్పిః పానాది రాగంతో ర్మంత్రాది శ్చేష్యతే విధిః, పూజాబల్యుపహారేష్టి హోమమంత్రాంజనాదిభిః 44. జయే దాగంతుమున్మాదం యథావిధి శుచి ర్భిషక్, కృష్ణామరిచసింధూత్థ మధు గోపిత్తనిర్మితమ్.45.అంజనంసర్వభూతోత్థమ హోన్మాదవినాశనం, దార్వీమధుభ్యాం పుష్పాభ్యాం కృతం చ గుడికాంజనమ్. 46. మరిచం వాతపే మాంసం ససిత్తం స్థిత మంజనం, వైకృతం పశ్యతః కార్యం దేవభూతహతస్మృతేః. 47. నింబపత్రవచాహింగు సర్పనిర్మోకసర్షపైః, ఢాకిన్యాదిహరో ధూపో భూతోన్మాదవినాశనః.48.కార్పాసాస్థిమయూరపిచ్ఛబృహతీ నిర్మాల్యపిండీతకై, స్త్వగ్వాంసీ విషదంశ విట్తృషవచా కేశాహినిర్మోకకైః, గోశృంగద్విపదంత హింగుమరిచై స్తుల్యైస్తుధూపః కృతః, స్కందోన్మాదపిశాచరాక్షససురావేశ జ్వరఘ్నః స్మృతః. 49. బ్రహ్మరాక్షసజి న్నస్యం పక్వైవం ద్రిఫల మూత్రజం,సాజ్యం భూతహరం నస్యం శ్వేతాజ్యేష్ఠాంబుసర్పితం. 50. దేవర్షి పితృగంధర్వై రున్మత్తస్యచ బుద్ధిమాన్, వర్జయేదంజనాదీని తీక్ష్ణాని క్రూర మేవ చ. 51.

ఆగంతుకమగు నున్మాదములయందు ఘృతపానము మున్నగునవిమంత్రము దేవపూజ బలికానుకలు ఇష్టి చేయుట హోమముచేయుట మున్నగువానితోను చికిత్స చేయవలయును. పిప్పళ్లు మిరియములు సైంధవలవణము తేనె గోరోచనము వీటిగో చేయఁబడిన యంజనము భూతజ మగు నున్మాదములను పోఁగొట్టును. మ్రానిపసపు యష్టిమధుకము తేనె వీటితో జిల్లేడుతో చేసిన యంజనము పైనిచెప్పఁబడిన ఫలములనిచ్చును. మ్రానిపసపు

చూర్ణమును నెలగోజాలు మిరియములతో నుంచి దానిని, వికారముగా చూచువారికి దేవతలవలన భూతములవలన మతిపోయిన వారికిని ఇచ్చిన, దోషములను హరించి మేలుకలిగించును. వేపాకు వస ఇంగువ పాముకుబుసము ఆవాలు వీటితో ధూపము వేసిన ఉన్మాదములు నశించును. ప్రతివిత్తులు నెమలిపింఛము తిప్పతీగె గంగోదకము మరువము లవంగపుపట్ట వంశలోచనము యవలపైనిపొట్టు వస పాముకుబుసము ఆవుకొమ్ము ఏనుగదంతము ఇంగువ మిరియములు వీటిని సమానభాగములుగా గైకొని పొడిచేసి పొగవేసిన స్కంధగ్రహదోషములను, ఉన్మాదము పిశాచములు దేవతలు రాక్షసులు మొ॥ ఆవేశముల జ్వరము వీనిని నశింపజేయును. పాపరబుడమపండును ఆవుపంచితములో నూరి నస్యవిధి చేసిన బ్రహ్మరాక్షసజనిత మగు ఉన్మాదము నశించును. శ్వేతజ్యేష్ఠ వీటినీటితో నస్యవిధిచేసిన భూతదోషములు నశించును. దేవతలు ఋషులు గంధర్వులు మున్నగువారిదర్శనముచే గలుగునున్మాదము గలవారలకు తీక్ష్ణములగు నంజనములను చేయరాదు.

ఇట్లు చక్రదత్తయందు ఉన్మాదాధికార ప్రకరణము ముగిసెను.



# ౨౧. అపస్మారాధికారము.

---

### అపస్మారమునందు సామాన్యములగు నుపాయములు.

శ్లో. వాతికం వస్తిభిః ప్రాయః పైత్తం ప్రాయో విరేచనైః, శ్లైష్మికం వమనప్రాయై రపస్మార ముపాచరేత్. 1. సర్వత స్సువిశుద్ధస్య సమ్యగాశ్వాసితస్య చ, అపస్మారవిమోక్షార్థం యోగా న్సంశమనా చ్ఛృణు. 2.

సాధారణముగా వాతపు టపస్మారములలో వస్తికర్మలచేతను పిత్తపుటపస్మారములలో విరేచనములచేతను శ్లేష్మాపస్మారములలో వాంతులచేతను చికిత్స చేయవలయును. అన్నివిధములను పరిశుద్ధుండు నగువానికి, చక్కగా నూపిరి వెడలెడివానికిని అపస్మారరోగమును తొలగించుట కుపాయములను చెప్పుచున్నాను వినుము.

### అపస్మారమున కంజనాదులు.

శ్లో. మనోహ్వా తార్క్ష్యజం చైవ శకృత్పారావతస్య చ, అంజనం హంత్యపస్మార మున్మాదం చ విశేషతః. 3. యష్టీహింగువచావక్ర శిరీషలశునామయైః, సాజమూత్రై రపస్మారే సోన్మాదే నావనాంజనే. 4. పుష్యోద్ధృతం శునః పిత్త మపస్మారఘ్న మంజనమ్, తదేవ సర్పిషా యుక్తం ధూపనం పరమం స్మృతమ్. 5.

మణిశిల రసాంజనము పావురపుపెంట వీటిని కాటుకచేసి నేత్రములం బెట్టుకొనినచో నపస్మారమును ఎక్కువగా పిచ్చిని పోగొట్టును. యష్టిమధుకము ఇంగువ వస గ్రంథితగరము శిరీషఫలము (అనగా దిరిసెనపండు) ఉల్లిగడ్డ చెంగల్వకోష్ఠు వీటిని మేకయుచ్చతో నూరి నస్యమును గాను అంజనము గాను ఉపయోగించినచో అపస్మారములును ఉన్మాదములును దూరము లగును. పుష్యనక్షత్రమునాడు కుక్కయొక్క పిత్తమును తెచ్చి, కనులకు కాటుకగా నుపయోగించినచో నపస్మారములు నష్టము లగును. లేకున్న ఆపిత్తమునందే నేయిని కలిపి ధూపమును వేసినయెడలను అపస్మారములు నష్టము లగును.

### అపస్మారమునకు ధూపనవర్తులు.

శ్లో. నకులోలూక మార్జార గృధ్రకీటాహి కాకజైః, తుండైః

పక్షైః పురీషైశ్చ ధూపనం కారయే ద్బుధః. 6. కాయస్థాన్ శారదాన్ ముద్గాన్ ముస్తోశీరయవాం స్తథా, సవ్యోషా న్బస్తమూత్రేణ పిష్ట్వా వర్తీః ప్రకల్పయేత్. 7. అపస్మారే తథోన్మాదే సర్పదంష్ట్రే గరార్దితే, విషపీతే జలమృతే చైతా స్స్యు రమృతోపమాః. 8. అపేతరాక్షసీకుష్ఠపూతనాకేశిచోరకైః, ఉత్సాదనం మూత్రపిష్టైః మూత్రైరేవావసేచనమ్. 9.

ముంగిస గ్రద్దగూబ పిల్లి గ్రద్ద సర్పము కాకి వీటియొక్క ముక్కులు రెక్కలు మలము వీటిచేత ధూపనమును చేయింపవలయును. నల్లతులసి శరదృతువులోని పెసలు తుంగముస్తలు వట్టివేళ్లు యవలు శొంఠి మిరియములు పిప్పళ్లు వీటిని మేకయుచ్చతో నూరి ధూపనవర్తుల చేయవలయును. ఈవర్తులు అపస్మారమునందును ఉన్మాదమునందును పాముకాటునందును విషపానమునందు కృత్రిమవిషముల వల్ల నగు పీడలయందును నీళ్లలో చనిపోవుటయందును అమృతతుల్యములు. అనగా ప్రాణమిచ్చి బ్రదుకజేయునవి. తెల్లతులసి చెంగల్వకోష్టు [illegible]కాయలు కచ్చూరగములు వీటిని గోమూత్రముతో నూరికాని మేకలయొక్క గోమూత్రముతో గాని నలుగుపెట్టి ఆమూత్రములతో స్నానము చేయింపవలయును.

## అపస్మారమునకు లేపనములు మున్నగునవి.

శ్లో. జతుకాశకృతా తద్వ ద్దగ్ధై ర్వా బస్తరోమభిః, అపస్మారహరో లేపః మూత్రసిద్ధార్థశిగ్రుభిః. 10. యః ఖాదే త్క్షీరభక్తాశీ మాక్షికేణ వచారజః, అపస్మారం మహాఘోరం సుచిరోత్థం జయే ద్ధ్రువమ్. 11. ఉల్లుంభితనరగ్రీవా పాశం దగ్ధ్వా కృతామసీ, శీతాంబునా సమం పీతా హ న్త్యపస్మార ముద్ధతమ్. 12. ప్రయోజ్యం తైలలశునం పయసా వా శతావరీ, బ్రాహ్మీరస శ్చ మధునా సర్వాపస్మారభేషజమ్. 13. నిర్దహ్య నిర్ద్రవాం కృత్వా [illegible]గికా మారనాలికామ్, తాం మస్తుసాధికాం ఖాద న్నపస్మార ముదస్యతి. 14. హృత్పార్శ్వకోక్షిరుజా యస్య స్వేదో హస్తాదిశీతతా, దశమూలీజలం తస్య కల్యాణాజ్యం ప్రయోజయేత్. 15.

శిలాజిత్తు లక్క మేక వెంట్రుకలతో దగ్ధముచేసి వీటితో చేయబడిన వర్తి ను పయోగించిన సైఫలము నిచ్చును. ఆవాలు మునగచెక్క వీటిని గోమూత్రముతో నూరి

యైనను లేపనము చేయవలయును. పాలుత్రాగు స్వభావము గలవాడు తేనెతో వసపొడిని తినినచో భయంకరములును పురాణములునగు అపస్మారములు నిశ్చయముగా జయించును. ఉరిపోసికొని చచ్చిన మనుష్యుని ఉరిత్రాటిని దగ్ధముచేసి చేసినమసిచల్లనినీటితో సేవించినచో మిక్కిలి భయంకరము లగు నపస్మారములును నష్టములగును. తైలముతో నుల్లిగడ్డను గాని పాలలో పిల్లపీచరను గాని తేనెతో మండూకబ్రాహ్మిని గానిసేవించిన అపస్మారములను అన్నింటినిపోగొట్టును. మేకపాలలో ఆరనాళికల రసమును తీసి నిప్పులో వెచ్చచేసి పులుపు ఎక్కువగలుగు నట్లుగా చేసి సేవించిన యపస్మారములు తొలంగును. హృదయము వడకుట నేత్రములలో పోటు చెమ్మటకారుట కాళ్లుచేతులు చల్లబారుట కలరోగికి దశమూలముల క్వాథమును గాని కల్యాణఘృతమును కాని ఈయవలయును.

## స్వల్పపంచగవ్యఘృతము.

శ్లో. గోశకృద్రసదధ్యమ్లక్షీరమూత్రైస్సమైర్ఘృతం, సిద్ధం చాతుర్థికోన్మాదగ్రహాపస్మారనాశనమ్. 16.

ఆవుపేడరసము ఆవుపెరుగు ఆవుపాలు ఆవుపంచితము వీటిని సమాన భాగములను తెచ్చి ఆవునేతితో సిద్ధముచేసి సేవించినచో చాతుర్థికజ్వరములను ఉన్మాదములను గ్రహరోగములను అపస్మారరోగములను నశింపజేయును.

## బృహత్పంచమూలఘృతము.

శ్లో. ద్వే పంచమూలే త్రిఫలారజన్యౌ కుటజత్వచమ్, సప్తపర్ణమపామార్గం నీలినీం కటురోహిణీం. 17. సంపాకం ఫల్గుమూలం చ పౌష్కరం సదురాలభమ్, ద్విపలాని జలద్రోణే పక్త్వా పాదావశేషితే. 18. భార్గీ పాఠా త్రికటుకం త్రివృతా నిచులాని చ, శ్రేయసీ మాఢకీం మూర్వాం దంతీ భూనింబచిత్రకౌ. 19. ద్వే శారివే రౌహిషం చ భూతికం మదయంతికామ్, క్షిపే త్పిష్ట్వా ౽క్షమాత్రాణి తైః ప్రస్థం సర్పిషః పచేత్. 20. గోశకృద్రసదధ్యమ్లక్షీరమూత్రైశ్చ తత్సమైః, పంచగవ్య మితి ఖ్యాతం మహత్తదమృతోపమం. 21. అపస్మారే జ్వరే కాసే శ్వయథా వుదరేషుచ, గుల్మార్శః పాండురోగేషు కామలాయాం హలీమకే. 22. అలక్ష్మీగ్రహరక్షోఘ్నం చాతుర్థకవినాశనమ్,

దశమూలములు త్రిఫలములు మానిపసపు పచ్చిపసపు కొడిసెపట్ట ఏడాకుల యరటి ఉత్తరేణువేళ్లు పుష్కరమూలము నీలికటుకరోహిణి రేలచెక్క బ్రహ్మమేడి వీటిని రెండురెండు పలముల చొప్పున తీసికొని ద్రోణము నీటిలో వండి నాల్గవపాలు నీరు మిగిలియున్నప్పుడు గంటుభారంగి అగరుశొంఠి శొంఠి మిరియములు పిప్పళ్లు తెల్లతెగడ నీటిప్రబ్బలి కరక్కాయలు చాగ దంతి నేలవేము చిత్రమూలము మనుబాల రోహిషమను కసవు వాము అడవిమల్లె వీనినన్నిటిని ఒక్కొక్కకాలపలము చొప్పున నూరి 16 పలముల నేతితో పక్వము చేయవలయును కాని ఘృతమును సిద్ధము చేయునప్పుడు ఆవుపేడరసము పెరుగు పాలు గోమూత్రము వీటిని సమానభాగములను తీసికొని సిద్ధము చేయవలయును. ఇయ్యది బృహత్పంచగవ్య ఘృత మనఁబడును. అపస్మారములను జ్వరములను దగ్గులను శోఫలను ఉదరరోగములను బల్లలను మూలరోగములను పాండురోగములను కామెరలను హలీమక మను రోగమును దరిద్రమును గ్రహబాధలను పిశాచబాధలను చాతుర్థికజ్వరములను పోఁగొట్టును.

### మహాచైతసఘృతము.

శ్లో. శణ త్రివృత్తథైరండో దశమూలీ శతావరీ. 24. రాస్నా మాగధికా శిగ్రు క్వాథ్యం ద్విపలికం భవేత్, విదారీమధుకం మేదే ద్వే కాకోల్యౌ సితా తథా. 25. ఏభిః ఖర్జూరమృద్వీకా భీరు యుంజాతి గోక్షురైః, చైతసస్య ఘృతస్యాంగైః పక్తవ్యం సర్పిరుత్తమం. 26. మహాచైతససంజ్ఞం తు సర్వాపస్మారనాశనమ్, గరోన్మాదప్రతిశ్యాయ తృతీయకచతుర్థకాన్. 27. పాపాలక్ష్మ్యౌ జయే దేత త్సర్వగ్రహనివారణమ్, కాసశ్వాసహరం చైవ శుక్రార్తవవిశోధనం. 28. ఘృతమానః క్వాథవిధి రిహ చైతసవన్మతః, కల్కశ్చైతసకలోక్త ద్రవ్యైస్స్యార్థం చ పాదికః. 29. నిత్యం యుంజాతకాప్రాప్తా తాలమస్తక మిష్యతే.

జనుపవిత్తులు తెల్లతెగడ చిట్టాముదము దశమూలములు పిల్లపిచ్చర సన్నరాస్న పిప్పలి మునగ వీటితో చేసినకషాయములో యష్టిమధుకము మేద మహామేద నేలగుమ్మడు కాకోలి క్షీరకాకోలి చక్కెర ఖర్జూరపుపండ్లు ద్రాక్ష పెద్దపీచర మల్లేరు వీటిని రెండు రెండుపలములను చైతసఘృతములో చెప్పఁబడిన ఔషధములను చేర్చి నేతిని బాగుగ పక్వము చేయవలయును. ఇది మహాచైతసఘృత మనఁబడును.

అన్నివిధములైన అపస్మారములను పోఁగొట్టును. విషమును పిచ్చిని పీనసను మూఁడేసి నాలుగేసిరోజులకు వచ్చువరసజ్వరములను పాపమును దారిద్ర్యమును పోఁగొట్టును.

దగ్గును శ్వాసను తొలఁగించును. వీర్యమును ఆర్తవమును శుద్ధము చేయును. దీనియందు నెయ్యి చేయువలసిన క్రమము, కషాయములు చేయురీతి చైతసఘృతములలోవలెనే.

## కూష్మాండకఘృతము.

శ్లో. కూష్మాండకరసే సర్పిః అష్టాదశగుణే పచేత్, యష్ట్యాహ్వ కల్కం తత్పానం అపస్మారవినాశనమ్. 30.

పదునెనిమిదిరెట్లు గుమ్మడిరసములో యష్టిమధుకకల్కమును కల్పి నేతిని సిద్ధము చేయువలయును. దీనిని సేవించినచో అపస్మారములు నశించును.

## బ్రాహ్మీఘృతము.

శ్లో. బ్రాహ్మీరసే వచా కుష్ఠ శంఖపుష్పీభి రేవచ, పురాణం మేధ్య మున్మాదగ్రహాపస్మారను ద్ఘృతమ్. 31.

మండూకబ్రాహ్మిరసములో వస కోష్ఠు యెర్రశిబినిక వీటికల్కమును వేసి మిక్కిలి ప్రాచీనమైన నేతిని చేర్చి పక్వము చేయవలయును. ఇది బుద్ధిని నిర్మలమునుగాచేయును. పిచ్చి గ్రహదోషము అపస్మారము వీటిని పోఁగొట్టును.

## పలంకషాద్యతైలము.

శ్లో. పలంకషా వచా పథ్యా వృశ్చికాల్యర్కసర్షపైః, జటిలాపూతనా కేశీ లాంగలీహింగుచోరకైః. 32. లశునాతిరసా చిత్రా కుష్ఠైర్విడ్భిశ్చ పక్షిణామ్, మాంసాశినాం [illegible] ధాలాభం బస్తమూత్రే చతుర్గుణే. 33. సిద్ధమభ్యం జనే తైల మపస్మారవినాశనమ్.

లక్క, వస, కరక్కాయలు, యర్రగలిజేరు, జిల్లేడాకులు, ఆవాలు, జటామాంసి, కోలవస, ఇంగువ, మయ్యూకుపొన్న, వురలగడ్డ, నాగఫలము, చిత్రమూలము, చెంగల్వకోష్ఠు, పక్షులరెట్టలు వీటితో దొరికినంతవరకు నాలుగురెట్లు మేకమూత్రములో తైలమును చేర్చి సిద్ధము చేయవలయును. దీనినిఅంటుకున్నయెడల అపస్మారములునశించును.

## తలంటులు.

శ్లో. అభ్యంగ స్సార్షపం తైలం బస్తమూత్రే చతుర్గుణే, సిద్ధం స్యా ద్గోశకృన్మూత్రైః పానోత్సాదన మేవ చ. 34.

నాలుగుపాళ్లు మేకమూత్రములో ఆవుపేడను, ఆవుపంచితమును కలిపి దాని యందు పక్వము చేయఁబడిన ఆవనూనెను అంటుకొనినయెడల మేలు గలిగించును.

ఇట్లు చక్రదత్తయందు అపస్మారాధికారప్రకరణము ముగిసెను.

# ౨౨. వాతవ్యాధ్యధికారము.

---

### వాతవ్యాధిలో సామాన్యోపాయము.

శ్లో. స్వాద్వమ్లలవణై స్స్నిగ్ధై రాహారైర్వాతరోగిణః, అభ్యంగస్నేహ వస్త్యాద్యై స్సర్వా నేవోపపాదయేత్. 1. విశేషతస్తు కోష్ఠస్థే వాతే క్షారం పిబే న్నరః, ఆమాశయస్థే శుద్ధస్య యథా దోషహరీ క్రియా. 2. ఆమాశయగతే వాతే ఛర్దితాయ యథాక్రమం, దేయ ష్షడ్ధరణో యోగ స్సప్తరాత్రం సుఖాంబునా. 3. చిత్రకేంద్రయవాః పాఠా కటుకాతివిషాభయాః, మహావ్యాధిప్రశమనో యోగ ష్షడ్ధరణ స్స్మృతః. 4. పలదశమాంశో ధరణం, యోగోయం సౌశ్రుత స్తస్య, మాషేణ పంచగుంజక మానేన ప్రత్యహం సుయుక్తేయః.

మధురము ఆమ్లము ఉప్పు గల చిక్కగానుండు ఆహారపదార్థముల నిచ్చియును, అభ్యంగనస్నానము తైలవస్తులు మున్నగువాని చేతను వాతరోగులకు చికిత్స సేయవలయును. కోష్ఠమున వాతము చేరినయెడల విశేషముగా మనుష్యుడు యవక్షారపదార్థములను చేర్చి త్రాగవలయును. ఆమాశయమునందు వాత ముండినయెడల ప్రవర్తులు మున్నగువాని ద్వారా శుద్ధునిగా నొనర్చి దోషమును పోగొట్టు క్రియల నాచరింపవలయును. ఆమాశయములో చేరియున్న వాతమునందు మొదల రోగికి ఛర్దిని చేయించి క్రమము ననుసరించి షడ్ధరణయోగమును గలివెచ్చనగు నీటితో చేర్చి ఏడు రాత్రులవఱకు ఇచ్చుచుండవలయును. చిత్రమూలము, కొడిసెపాలవిత్తులు, అగరు శొంఠి, కటుకరోహిణి, అతివస, కరక్కాయలు అను నీయోగమే షడ్ధరణయోగమని చెప్పఁబడును. ఇయ్యది గొప్పవ్యాధులను శమింపఁజేయును. పలములో పదియవభాగము ధరణ మనంబడును. ఇయ్యది సుశ్రుతమతానుసారమగు మానము. ముప్పదిరెండు గురిగింజలయెత్తు చొ. ప్రతిదినమును ఇచ్చుచుండవలయును.

### స్నేహన విరేచనములు, వస్తిశోధనాదులు.

శ్లో. పక్వాశయగతే వాతే హితం స్నేహవిరేచనమ్, వస్తయః శోధనీయాశ్చ ప్రాశ్యాశ్చ లవణోత్తరాః. 6. స్నుహీంలవణవార్తాకు స్నేహం శ్ఛన్నే ఘటే దహేత్, గోమయైః స్నేహలవణం తత్పరం వాతనా

శనం. 7. కార్యో వస్తిగతేచాపి విధిర్వస్తివిశోధనః, త్వఙ్మాంసాసృక్ శిరాప్రాప్తే కుర్యాచ్చాసృగ్విమోక్షణం. 8. స్నేహోపనాహాగ్నికర్మ బంధనోన్మర్దనాని చ, స్నాయుసంధ్యస్థిసంప్రాప్తే కుర్యాద్వాతే విచక్షణః. 9. స్వేదాభ్యంగావగాహాంశ్చ హృద్యం చాన్నం త్వగాశ్రితే, శీతాః ప్రదేహా రక్తస్థే విరేకో రక్తమోక్షణమ్. 10. విరేకో మాంసమేదఃస్థే నిరూహాః శమనాని చ, బాహ్యాభ్యంతరతః స్నేహైరస్థిమజ్జగతం జయేత్. 11.

పక్వాశయమును పొందిన వాతరోగమునందు తైలము నిచ్చి ప్రవర్తని చేయింపవలయును. వస్తికర్మలచేత శుద్ధి నొందింపవలయును. ఉప్పు మాటు వెట్టుకొని భోజనమును ముందుగా తినుచుండవలయును. పంచలవణములు జనుములు పాలు నేలమునుక చమురు వీనిని వాసెనగట్టిన కుండలో నుంచి తగులబెట్టి ఆచమురు కలిసిన ఉప్పును సేవించిన వాతములను పోగొట్టును. వస్తిగతమగు వాతరోగమునందు వస్తులను శోధించు విధినే చేయవలయును. చర్మము మాంసము రక్తము నాడులు వీటిలో నున్న వాతరోగమునందు అభ్యంగస్నానములను గాని, అవగాహనములను గాని చేయింపవలయును. చర్మము విషయమున ప్రాప్తించిన వాతరోగమున చక్కని యన్నమును పెట్టింపవలయును. రక్తమునందు చేరిన వాతరోగవిషయమున శీతలలేపనములను ప్రవస్త్రల కప్పించుటలను రక్తమును వెడలించుటను చేయవలయును. మాంసమునందును మెదడునందును గలవాతము విషయములో ప్రవర్తించుటయును వెళ్లగ్రక్కించుటయును శాంతించు వస్తువుల నుపయోగించుటయు నుత్తమములు. ఎముకలు మజ్జ వీని విషయములో కలిగిన వాతరోగములయందు వెలుపలను లోపలను తైలము నుపయోగించవలయును.

## విరేచనాదులు.

శ్లో. హర్షోన్నపానం శుక్రస్థే బలశుక్రకరం హితం, విబద్ధమార్గం శుక్రంతు దృష్ట్వా దద్యాద్విరేచనం. 12. గర్భే శుష్కేతు వాతేన బాలానాం చాపి శుష్యతాం, సితామధుక కాశ్మర్యైః హితముత్థాపనే పయః. 13. శిరోగతేనిలే వాత శిరోరోగహరీ క్రియా, వ్యాదితాస్యే హనుం స్విన్నా మంగుష్ఠాభ్యాం ప్రపీడ్య చ. 14. ప్రదేశినీభ్యాం చోన్నమ్య చిబుకోన్నామనం హితం, అర్దితే నవనీతేన ఖాదేన్మాషేండరీం నరః. 15. క్షీరమాంసరసైర్భుక్త్వా దశమూలీరసం పిబేత్, స్నేహాభ్యంగశిరోవస్తిః పానస్యపరాయణః. 16. అర్దితం స జయేత్సర్పిః

పిబే త్క్షీర భక్తకం, పంచమూలీ కృతః క్వాథో దశమూలీ కృతోఽథవా. 17. రూక్షస్వేద స్తథానస్యం మన్యాస్తంభే ప్రశస్యతే, వాతాద్వ్యాగ్ధమనీ దుష్టౌ స్నేహగండూషధారణమ్. 18.

వీర్యమును పోయిన వాతమునందు సంతోషమును బలమును వీర్యమును పుట్టించు నన్నపానములనీయవలయును. విశేషముగా వీర్యము వడలుద్వారా ఉబికిసికొనియున్నచో పరీక్షించి విరేచనములు చేయవలయును. వాతమువలన గర్భము ఎండియున్నను పిల్లలు కుష్ఠించుపోవుచున్నను వాపిలి నేలగుమ్మడు వీటితో సిద్ధము చేయఁబడిన పాల నీయవలయును. శిరస్సునందు గల వాతరోగమునందు శిరోరోగమును పోగొట్టు క్రియలను చేయవలయును. ముఖము వంకర పోయినయెడల మోకాలిని చెమటను బుట్టించి బొటనవ్రేళ్లతో ఒత్తి ప్రవేశించి వ్రేలిచేత ఎత్తిపట్టి క్రిందికి పెనపిని ఎత్తియుంచుట మంచిది. వాతరోగముచేత పీడింపఁబడినవానికి మినపసున్ని నేతితో వండి తినిపింపవలయును. పాలు మాంసరసమును త్రాగనిచ్చుట దశమూలముల కషాయమును త్రాగవలయును. తలంటించుకొనుట, శిరోవస్తి చేయించుట, కషాయమును త్రాగుట, నస్యవిధి కలిపాచనముగాను నేతిని త్రాగుచుండినచో వాతపీడితులు అయినను బ్రదికెదరు. పంచమూలముల కషాయము గాని దశమూలముల కషాయము గాని తీక్ష్ణమై వేడిచేసి చెమటఁ బుట్టించు నస్యమును గాని మన్యాస్తంభమునకు ఇచ్చుట మంచిది. వాతమువలన మాటలు నాపిలును చెడిపోయిన యెడల నీనితోనే స్నేహగండూషముల నిప్పింపవలయును.

## కల్యాణకలేహము.

శ్లో. సహరిద్రా వచా కుష్ఠం పిప్పలీ విశ్వభేషజం, అజాజీ చాజమోదా చ యష్టిమధుక సైంధవం. 19. ఏతాని సమభాగాని శ్లక్ష్ణచూర్ణాని కారయేత్, తచ్చూర్ణం సర్పిషాలోడ్య ప్రత్యహం భక్షయే న్నరః. 20. ఏకవింశతి రాత్రేణ భవే చ్ఛ్రుతిధరో నరః, మేఘదుందుభినిర్ఘోషో మత్తకోకిలనిస్స్వనః. 21. జడగద్గదమూకత్వం లేహః కల్యాణకో జయేత్, రుక్షస్త్రీకస్పందగతం వాయుం మన్యాగతం తథా. 22. వమనం హన్తి నస్యం చ కుశలేన ప్రయోజితః.

పసపు, వస, చెంగల్వకోష్టు, పిప్పళ్లు, శొంఠి, నల్లజీలకఱ్ఱ, వాము. ముల్లంగి, యష్టిమధుకము, సైంధవలవణము వీటిని సమానభాగములుగా తీసికొని మెత్తగా పొ

డిచేసి దానిని నేతిలో పోసి చక్కగాఁ గలియఁబెట్టి ప్రతినిత్యమును భక్షింపవల యును. దీనిని ఇరువదియొక్క రోజు సేవించినవాడు శ్రుతధరుఁడు (అనఁగా విన్నదాని నెల్లను జ్ఞాపక ముంచికొనెడి వాఁడు) గా కాఁగలఁడు. మేఘముల బోలి గర్జన గల వాడుగను, మత్తకోకిలవలె మనోహరముగా మాటలాడగా గలవాడుగను అగును. మొద్దుబారుట, డగ్గుత్తికపడుట, నోట మాట వెడలకుండుట వీనిని ఈకల్యాణకలే హము పోఁగొట్టును. కటిప్రదేశములో వ్యాపించినదియును కంఠప్రదేశమునఁ గల దియు నగు వాతములను నశింపఁజేయును. మన్యాగతము లగు వాతములను నేర్పరియగు వైద్యుఁ డిచ్చిన నస్యవిధియును వమనమును నశింపచేయఁ గలుగును.

## మాషబలాదిలేహము.

శ్లో. మాషబలా శూకశింబీ కత్తృణరాస్నాశ్వగంధోరుబూ కాణాం, క్వాథోనస్యనస్కనిపీతో రామఠలవణాన్వితః కోష్ణః. 23. అపహరతి పక్షవాతం మన్యాస్తంభం సకర్ణనాదరుజం, దుర్జయమర్దిత వాతం సప్తాహా జ్జయతి చావశ్యం. 24.

కారుమినుములు ముత్తువపులగము దురదగొండి కామంచి సన్నరాస్న అశ్వగంధ ఆముదపువిత్తనములు వీటితో కషాయమును చేసి దానిలో ఇంగువ ఉప్పు నువేసి కొద్దిగా వెచ్చచేసి త్రాగిన యెడల పక్షవాతము మన్యాస్తంభము చెవిపోటు వాతబాధ వీటి నేడురోజులలో నిశ్చయముగా పోఁగొట్టును. దీనిని మాషబలాదిలేహ మందురు.

## అపతంత్రక దశమూలాదిక్వాథము.

శ్లో. దశమూలీ బలా మాష క్వాథం తైలాజ్యమిశ్రితం, సాయం భుక్త్వా పిబే న్నక్తం విశ్వాచ్యా మపబాహుకే. 25. మూలం బలాయా స్త్వథ పారిభద్రా త్తథాత్మగుప్తా స్వరసం పిబేద్వా, నస్యం తు యో మాంసరసేన దద్యా న్మాంసాదసౌ వజ్రసమానబాహుః. 26. మాషాత్మగుప్తకైరండ వాట్యాలకశృతం పిబేత్, హింగుసైంధవసం యుక్తం పక్షాఘాతనివారణం. 27. బాహుశోషే పిబేత్సర్పిః భుక్త్వా కల్యాణకం మహత్, హృది ప్రకుపితే వాతే చాంశుమత్యాః పయో హితం. 28. హరీతకీ వచా రాస్నా సైంధవం చామ్లవేతసం, ఘృతమా త్రాసమాయుక్త మపతంత్రకనాశనం. 29.

దశమూలములు ముత్తువపులగము మినుము వీటితో చేసిన కషాయములో నూనెను నేతిని కలిపి భోజనమైన పిమ్మట సాయంకాలసమయమున నస్యమునుగా పీల్చిన యెడల ఒడలంతయు వ్యాపించునదియును, అపవాహకమను పేరు గలదియు నగువాతము నష్టమగును. చిట్టిఆముదపు చెక్క దేవదారుచెక్క దూలగొండి వీటిరసమును త్రాగినను, మాంసపురసమును నస్యవిధి చేసినను గాని ఇట్లు ఒకమాసము రోజులు సేవించిన యెడల వజ్రసమానము లగుబాహువులు కలవాడు అగును. మినుములు చిట్టిఆముదపు విత్తులు ఆముదపువిత్తులు ముత్తువపులగము వీటికషాయములో ఇంగువ సైంధవలవణమును చేర్చి త్రాగినపక్షవాతములునశించును. బాహుశోషములయందుభోజనమైన పిమ్మట బృహత్కల్యాణ ఘృతమును త్రాగవలయును. గుండెలలో వాతప్రకోపము గలిగిన యెడల ముయ్యాకుపొన్న క్వాథమును త్రాగినయెడల హితమగును. కరక్కాయలు వస సన్నరాష్ట్ర సైంధవలవణము ఆమ్లవేతసము వీటిని నేతితో చేర్చికొని సేవించిన యెడల అపతంత్రకమను వాతరోగము నశించును.

## స్వల్పరసోనపిండము.

శ్లో. పలమర్ధం పలంచైవ రసోనస్య సుకుట్టితం, హింగుజీరక సింధూత్థ సౌవర్చల కటుత్రయైః. 30. చూర్ణితై ర్మాషకోన్మానై రవ చూర్ణ్య విలోడితం, యథాగ్ని భక్షితం ప్రాత రుబూకక్వాథనుపానతః. 31. దినేదినే ప్రయోక్తవ్యం మాస మేకం నిరంతరం, వాతరోగం నిహన్త్యాశు అర్దితం సాపతంత్రకం. 32. ఏకాంగరోగిణశ్చైవ తథా సర్వాంగ రోగిణే, ఊరుస్తంభే చగృధ్రస్యాం క్రిమికోష్ఠే విశేషతః.33. కటీపృష్ఠామయం హన్యా దుదరం చ విశేషతః.

పొట్టుడదీసిన వెల్లుల్లిరసము ఒకటిన్నరపలము ప్రమాణము చొప్పునగాని, ఒకపలముచొప్పున గాని తీసికొని ఇంగువ జీలకఱ్ఱ సైంధవలవణము సౌవర్చలవణము శొంఠి మిరియములు పిప్పళ్ళు వీటిని చూర్ణముచేసి ఒక్కొక్కమాషము చొప్పున మైదానియందుకలిపి కలియబెట్టవలయును. ఆపిమ్మట జఠరాగ్ని ననుసరించి ప్రాతఃకాలమున భక్షింపవలయును. ఆముదపువేళ్లకషాయమును అనుపానముగా చేసికొని దినదినము పుచ్చుకొనవలయును. ఇట్లొకమాసమువఱకు ఉపయోగించుచుండవలయును. ఇది వాతరోగమును అర్దితవాతమును శీఘ్రముగా పోగొట్టును. ఏకాంగరోగులకు సర్వాంగవాతరోగులకు ఊరుస్తంభము గృధ్రసి యను రోగమునందును జంతువాతమునందును

మిక్కిలి హితకరము. కటిరోగము పృష్ఠరోగము ఉదరరోగము వీటిని ఎక్కువగా పోగొట్టును. దీనినే స్వల్పరసోనపిండ మనియెదరు.

## దధ్యమ్లాది ప్రయోగము.

శ్లో. హన్తి ప్రాగ్భోజనా త్పీతం దధ్యమ్లం సవచోషణం. 34. అపతానక మన్యోపి వాతవ్యాధిక్రమో హితః, వాతఘ్నై ర్దశమూల్యా చ నవం కుబ్జ ముపాచరేత్. 35. స్నేహై ర్మాంసరసై ర్వాపి ప్రవృద్ధం తం వివర్జయేత్, పిప్పల్యాదిరజస్తూణీప్రతితూణ్యోః సుఖాంబునా. 36. పిబే ద్వా స్నేహలవణం సఘృతం క్షారహింగు వా, ఆధ్మాన లంఘనం పాణితాప శ్చ ఫలవ ర్తయః. 37. దీపనం పాచనం చైవ వస్తి శ్చాప్యత్ర శోధనః, ప్రత్యాధ్మానే తు వమనం లంఘనం దీపనం తథా. 38. ప్రత్యష్ఠీలాష్ఠీలికయో రంత ర్విద్రధిగుల్మవత్.

దధ్యమ్లమునందు వస మిరియములు కలిపి అన్నము తినుటకు ముందుగా సేవింపవలయును. ఇయ్యది అపతానకమును పోగొట్టును. మఱియు నితరములగు వాతరోగములకును హితకరము. వాతము పోగొట్టు మందులచేతను, దశమూలముల చేతను, నూతన కుబ్జరోగములకు చికిత్స చేయవలయును. తైలముల చేతను మాంసరసముల చేతను చికిత్స చేయవలయును. ముఱిగిన కుబ్జరోగములను వదలి పెట్టవలయును. తూణి ప్రతితూణి వాతములయందు పిప్పల్యాది గణముల యౌషధముల చూర్ణమును గోరువెచ్చనినీళ్లతో గూడ తీసికొనవలయును. లేకపోయిన తైలములో యవక్షారమును కలుపుకొని కాని ఇంగువను యవక్షారమును నేతిలో కలిపికొని కాని త్రాగవలయును. ఆధ్మానవాతమునందు లంఘనము చేయుట చేతులతో కాచుట ఫలవర్తు నుంచుట ఇయ్యది మిక్కిలి హితకరములు. ప్రత్యాధ్మానవాతమునందు వమనము చేయించుటయును లంఘనము చేయించుటయును దీపనము చేయించుటయును హితములు. ప్రత్యష్ఠీల అష్ఠీల అనువాతరోగములయందును అంతర్విద్రధి గుల్మరోగములయందు వలెనే చికిత్సను చేయవలయును.

## గృధ్రస్యాదులకు దశమూలాదిక్వాథములు.

శ్లో. దశమూలీ బలా రాస్నా గుడూచీ విశ్వభేషజం. 39. పిబే దేరండతైలేన గృధ్రసీఖంజపంగుషు. శేఫాలికాదళైః క్వాథో మృద్వగ్నిపరిసాధితః. 40. దుర్వారం గృధ్రసీరోగం పీతమాత్రం సముద్ధరేత్, పంచమూలీ కషాయం తు రుబూతైలం త్రివృద్ఘృతం. 41. త్రివృతై ర్వాథవా యుక్తం గృధ్రసీగుల్మశూలనుత్, ఘృతం వార్ధ్రికమాతు

న్యేప హరతి ర్యథా. 49. గృధ్రస్యార్తస్య జంఘాయాః స్నేహ స్వేదేకృతే భృశమ్, పదాభ్యాం నిర్మథితాయాశ్చ సూక్ష్మమార్గేణ గృధ్రసీ. 50.

గృధ్రసి చేత బీడింపఁబడిన మనుష్యుని చక్కగా పాచనముమన్న గు వానిచేత శోధించి జఠరాగ్ని చక్కగా నుండినవాఁడైనచో బస్తికర్మలను చేయవలయును. ఊర్ధ్వ భాగము శుద్ధ మగువఱకును వస్తికర్మను చేయరాదు. చేసిన యెడల బూదిలో పోసిన నేయివలె నిష్ఫల మగును. గృధ్రసీపీడితుఁ డగువానికి పిక్కలను మిక్కిలి చెమట కలిగింపవలయును. కాళ్లను చక్కగా మర్దింపవలయును.

## గృధ్రసికి దాహాదిక్రియలు.

శ్లో. అవతాఙ్గ్యంగులౌ సమ్య క్కనిష్ఠాయాం శనై శ్శనైః, జ్ఞాత్వా సమున్నతం గ్రంథిం కండరాయాం వ్యవస్థితం. 51. తం శస్త్రేణ విదార్యాశు ప్రవాళాంకురసన్నిభం, సముద్ధృత్యాగ్నినా దగ్ధ్వా లింపేద్య ష్ట్యాహ్వాచందనైః. 52. విధ్యే చ్ఛిరా మింద్రవస్తే రధస్తా చ్చతురంగులేః, యది నోపశమం గచ్ఛే ద్దహే త్పాదకనిష్ఠికాం. 53.

చిటికెనవ్రేలియందు మెల్లమెల్లగా దించి కండరమునందున్న గుడిని ఎత్తుగానున్నయెడల శస్త్రముచేసి తీసివేయవలయును. పిమ్మట లేతచిగురుతో సమానముగా నొత్తిపెవెచి నిప్పులో కాల్చిన యష్టిమధుకను మంచిగంధములతో పూయవలయును. ఇంద్రవస్తికొఱకు క్రింద నాలుగు అంగుళముల నరమును వ్యధనము చేయవలయును. ఇట్లైనను కుదురనియెడల కాలిచిటికెనవ్రేలిని కాల్పవలయును.

## కటిశూలలయందు సామాన్యోపాయములు.

శ్లో. తగరస్య శిఫా మార్ద్రాం, పిష్ట్వాతక్రేణ యః పిబేత్. వంక్షణానిలరోగార్తః సక్షణా దేవ ముచ్యతే. 54. దశమూలీకషాయేణ పిబే ద్వా నాగరాంభసా, కటుశూలేషు సర్వేషు తైలమేరండ సంభవమ్. 55. విశ్వాచ్యాం ఖంజపఙ్గ్వోశ్చ దాహే హర్షే చ పాదయోః, క్రోష్టుశీర్షవికారే చ వికారే వాతకంటకే. 56. శిరాం యథోక్తాం నిర్వ్యధ్య చికిత్సా వాతరోగనుత్.

గ్రంధిగరము చెట్టుయొక్క వేళ్ళనుతీసికొని మజ్జిగతో నూరి అండసంధియందు వాతరోగముకలవాఁడు సేవింపవలయును. ఇయ్యది వాతబాధను తక్షణమే యుపశమిం

పజేయును. అన్నివిధము లగు నడుముల పోటులయందును ఆముదమును దశమూలముల కషాయముతో గాని శొంఠి కషాయముతో గాని సేవింపవలయును. విశ్వాచిఖంజము పంగురోగము దాహము పాదహర్షము క్రోష్టుశిరోవికారము వాతవికారము వీటి యందు పైనిచెప్పఁబడిన చోట్లను శిరలను వ్యధించి చికిత్సను చేసిన వాతరోగములు నశించును.

ఆదిత్యపాకగుగ్గులువటకము.

శ్లో. గుగ్గులుం క్రోష్టు శీర్షంతు గుడూచీ త్రిఫలాంభసా. 57. క్షీరేర్వైరండతైలం వా పిబేద్వా వృద్ధదారుకం, రక్తావసేచనం కుర్యా దభీక్ష్ణం వాతకంటకే. 58. పిబే దేరండతైలం వా దహేత్సూచీభి రేవ వా, ఖల్ల్యాం స్నిగ్ధామ్లలవణైః స్వేదమర్దోపనాహనం. 59. పృథక్ప లాంశా త్రిఫలా పిప్పలీచేతి చూర్ణితం, దశమూలాంబునా భావ్యం త్వగేలార్ధపలాన్వితం. 60 దత్వా పలాని పం చైవ గుగ్గులో ర్వటకీకృ తః, ఏష మాంసరసాభ్యా సాద్వాతరోగా న్విశేషతః. 61. హన్తి సం ధ్యస్థి మధ్యస్థా న్వృక్షు మింద్రాశని ర్యథా, భావ్యద్రవ్యసమం క్వా థ్యం క్వాథోన్నస్తాంశోస్తు తేన చ. 62. అర్ప్తిం యావద్దినం భావ్యం స ప్తాహం భావనావిధిః,

క్రోష్టువాతమునందు తిప్పతీగె త్రిఫలములు వీటికషాయముతో గుగ్గులమును గాని ఆముదపువేళ్లకషాయముతో గాని విదారికందపాలతో గలిపి కాని త్రాగవలయును. లేనిచో సూదులతో కాల్పవలయును. ఖల్లీవాతమునందు తైలము పులుపు ఉప్పు వీటి స్వేదనమును చేయుట కాని మర్దనము చేయుట కాని పిసుకుట కాని చేయవలయును. కరక్కాయలు తాడి ఉసిరిక పిప్పళ్లు ఇవి యన్నియును ఒకపలము తీసికొని చూర్ణము ను చేసి దశమూలముల కషాయముతో తడిపి పిమ్మట దాల్చినచెక్క ఏలకులు జాపత్రి వీటి నన్నిటిని అర్ధపలముచొప్పున కలిపి 5పలముల శుద్ధమహిసాక్షిగుగ్గిలమును కలిపి ఉండ లు కట్టవలయును. ఈయుండలను మాంసరసముతోకూడ అభ్యసించి వాతరోగములలో సేవించిన వాతములు నశించును. కీళ్ళు ఎముకలు మెదడు వీనిలోనున్న వాతమును పోఁ గొట్టును. ఇంద్రుఁడు వృక్షముల నతికినట్లే భావనచేయుదగు ద్రవ్యముతో సమానముగా నీకషాయమును పెట్టవలయును. ఎనిమిదిపాళ్లకషాయములోనాన వైచిబాగుగానాన్చి ఇట్లు ఏడు రాత్రులు భావన చేయవలయును. ఇయ్యది ఆదిత్యపాక గగ్గులువటకము అనఁబడును.

దీనితరువాత గొన్ని ప్రతులలో నీ క్రిందిగీతి నధికపాఠమున్నది.

శ్లో. కుష్టసైంధవయోః కల్కః చుక్రతైలసమన్వితః,
సుఖోష్ణో మర్దనే యోజ్యః ఖల్లీశూలనివారణః.

ఇది 'ఖల్యాం సిద్ధామ్లలవణైః' అన్నశ్లోకమునకు పైనఁగలదు.

## త్రయోదశాంగ గుగ్గులము.

శ్లో. ఆభాశ్వగంధాహపుషా గుడూచీ, శతావరీ గోక్షుర వృద్ధ దారకం, రాస్నా శతాహ్వా సశఠీ యమానీ సనాగరాశ్చేతి సమైశ్చ చూర్ణమ్. 63. తుల్యం భవేత్కౌశిక మత్ర మధ్యే దేయం తథా సర్పి రతోర్ధభాగం, అర్ధాక్షమాత్రం త్వథ తత్ప్రయోగాత్ కృత్వా నుపానం సురయాథయూషైః. 64. మద్యేన వా కోష్ణజలేన వాథ క్షీరేణ వా మాంసరసేన వాపి, కటిగ్రహే గృధ్రసి బాహుపృష్ఠే హనుగ్రహే జానుని పాదయుగ్మే. 65. సంధిస్థితే చాస్థిగతే చ వాతే మజ్జాగతే స్నాయుగతే చ కుష్ఠే, రోగాన్ జయేద్వాతకఫానువిద్ధాన్ వాతేరితాన్ హృద్గ్రహయోనిదోషాన్. 66. భగ్నాస్థివిధ్వేషు చ ఖంజవాతే త్రయోదశాంగం ప్రవదన్తి తజ్జ్ఞాః.

పెన్నేరు నిప్పతీగ బోడతరము పిల్లపీచర పల్లేరు పెద్దదేవదారు సన్నరాష్ట్ర సోంపు వట్టివేళ్లు కచ్చూరము యవాని శొంఠి ఇవి యన్నియును సమాన భాగములుగా తీసికొని చూర్ణము చేయవలయును. ఈచూర్ణముతో సమానముగా గుగ్గులమును గుగ్గులములో నర్ధభాగమును నేయిని కలిపి ఆపిమ్మట 5 మాషముల యెత్తు ప్రతిదినమును తినవలయును. ఇంకు మద్యమును అనుపానముగా గ్రహింపవలయును. లేకున్నచో కల్లుతో గాని వెచ్చని నీటితోగాని పాలతో గాని మాంసరసముతో గాని కటిగ్రహమునందును గృధ్రసియందును బాహుమూలములయందలి వాతమునందును పృష్ఠగ్రహము హనుగ్రహము జానుగ్రహము పాదగ్రహము సంధిగతవాతము అస్థిగతవాతము మజ్జాగతవాతము స్నాయువాతము కుష్ఠము మున్నగు వాతకఫముల వృద్ధిచేత నగు రోగములయందును మేలుకలిగించును. వాతప్రేరితములగు హృద్రోగములలోను యోనిదోషములలో ఖంజవాతములలోను ఈత్రయోదశాంగగుగ్గులము ఉత్తమ మగు గుణము నిచ్చునని వైద్యులు చెప్పుచున్నారు.

పెన్నేరు ముత్తువపులగము దశమూలములు శొంఠి నల్లయుప్పి తెల్లయుప్పి సన్నరాష్ట్ర ఇయ్యవి వాతనాశకములు.

## కోలాదిప్రదేహము.

శ్లో. కోలం కుళుత్థం సురదారు రాస్నా మాషా ఉమాతైలఫలా నికుష్ఠం, వచాశతాహ్వా యవచూర్ణ మమ్లముష్ణాని వాతామయినాం ప్రదేహః, అనూపవేశవారోష్ణ ప్రదేహో వాతనాశనః. 75.

రేగులు, ఉలవలు, దేవదారు, సన్నరాష్ట్ర, మినుములు, కోష్ఠు, వస, పిల్లపీచర, యవలు వీటిని చూర్ణమును చేసి లేపనచేసిన శ్రేష్ఠము. జలప్రదేశములయందుండు జీవముల మాంసముతో సంభారమును చేసి వెచ్చచేసి లేపముచేసిన వాతరోగములు నశించును.

## సాల్వనస్వేదః.

శ్లో. నిరస్థిపిశితంపిష్టం స్విన్నం గుడఘృతాన్వితం. కృష్ణామరిచసంయుక్తం వేశవార ఇతి స్మృతః. 76. కాకోల్యాది స్స వాతఘ్న స్సర్వామ్లద్రవ్యసంయుతః, సానూపమాంసః సుస్విన్నః సర్వస్నేహసమన్వితః. 77. సుఖోష్ణః స్పష్టలవణః సాల్వనః పరికీర్తితః, తేనోపనాహం కుర్వీత సర్వదా వాతరోగిణాం. 78. వాతఘ్నో భద్రదార్వాద్యః కాకోల్యాది స్తు సుశ్రుతః, మాంసే నాత్రౌషధం తుల్యం యావ దాస్నేన చామ్లతా. 79. పట్టీ స్యా త్స్వేదనార్థం చ కాంచికా ద్యమ్ల మిష్యతే, చతుస్స్నేహా త్రతావా న్స్యత్ సుస్విన్నత్వం యతో భవేత్. 80. సమస్తం వర్గ మర్థం వా యథాలాభ మథాపి వా, ప్రయుంజీతేతి వచనం సర్వత్ర గణకర్మణి. 81.

ఎముకలులేని మాంసమును నూరి వెచ్చఁజేసి బెల్లమును నేతిని కలిపి, పిప్పళ్లు మిరియములు చేర్చినయెడల వేశవారము అగును (అనగా కూరలలో వేయు సాంబారు అనఁబడును). అన్నివిధము లగు పులివస్తువులతో చేర్చిన కాకోల్యాదిగణము వాతమును పోఁగొట్టును. నీటిప్రదేశపు జంతువుల మాంసమును బాగుగా వండి దానిలో తైలమును కలిపి ఉప్పు కలిపినయెడల నయ్యది సాల్వన మనఁబడును. ఈసాల్వనముచేత వాతరోగులకు చెమ్మటపట్టునట్లు కాచవలయును. భద్రదారువు మొదలగు వస్తువులు కాకోల్యాదిగణ మని సుశ్రుతుని యభిప్రాయము. ఇయ్యది వాతమును పోఁగొట్టును. ఈసాల్వనమందు మాంసముతో సమానముగా నౌషధమును వాడవలయును. పుల్లవాని

తో కూడినంతవఱకు పుల్లనియ వలయును. ఇట్టిది స్నేహమునకై తగినది. ఇందులో గంజి మొదలగునది అమ్లమని తెలియఁదగినది. ఈసాల్వనమునందు చక్కగా తడియు నంత తైలము నుపయోగింపవలయును. గణములయందు సంపూర్ణవస్తువులు గాని సగము వస్తువులుగాని ఎంతదొఱికిన నంతవఱకు గాని చేకొనవలయు నని శాస్త్రసంప్రదాయా నుసార మగు మాట కలదు.

## అశ్వగంధాఘృతము.

శ్లో. అశ్వగంధాకషాయే చ కల్కే క్షీరచతుర్గుణం,
ఘృతం పక్వం తు వాతఘ్నం వృష్యం మాంసవివర్ధనం. 92

పెన్నేరు గడ్డలతో చేసినకషాయములో గాని కల్కములోఁగాని నాలుగురెట్ల పాలను కలిపి అందు పక్వముచేసిన నేతిని సేవించిన వాతరోగములు నశించును. బలము కలుగును. కండలను పెంచును.

## దశమూలఘృతము.

శ్లో. దశమూలస్య నిర్యూహే జీవనీయైః పలోన్మితైః, క్షీరేణ చ ఘృతం పక్వం తర్పణం పవనార్తినుత్, క్వాథోఽత్ర త్రిగుణః సర్పిః ప్రస్థః సాధ్యః పయ స్సమః. 93.

దశమూలముల కషాయములో జీవనీయగణము యొక్క ఔషధములను ఒక్కొక్కపలము చొప్పునతీసికొని పాల వంటు జేర్చి దానిలో నేతిని పోసి పక్వము చేయవలయును. ఈఘృతము తృప్తిని కలిగించును. వాతరోగములను పోఁగొట్టును. ఈఘృతము చేయునప్పుడు మూడురెట్లు కషాయములో ఒకప్రస్థము నేయిని పాలను కలిపి పక్వము చేయవలయును.

## ఛాగలాదిఘృతము.

శ్లో. ఆజం చర్మవినిర్ముక్తం త్యక్తశృంగఖురాదికం, పంచమూలీద్వయం చైవ జలద్రోణే విపాచయేత్. 94. తేన పాదావశేషేణ ఘృతప్రస్థం విపాచయేత్, జీవనీయై స్సకట్యాహ్వైః క్షీరం చైవ శతావరీం. 95. ఛాగలాద్య మిదం నామ్నా సర్వవాతవికారనుత్, అర్దితే కర్ణశూలే చ బాధిర్యే మూకమిన్మనే. 96. జడగద్గదపంగూనాం ఖంజే గృధ్రసి కుబ్జయోః, అపతానేఽపతంత్రే చ సర్పి రేత త్ప్రశస్యతే.97. ద్రోణే ద్రవ్యతులాశ్రుత్యా స్యా చ్ఛాగదశమూలయోః, పృథక్తులార్ధం యష్ట్యాహ్వద్వయం దేయం ద్విధోక్తితః. 98.

ముత్తువపులగపు కషాయము కల్కము వీనిలోపాలను కలిపి అందు చమురును పోసి వండవలయును. ఇయ్యది అన్ని తెఱఁగులగు వాతవికారములను పోఁగొట్టును. ఈరీతిగనే ముల్లుగోరంట తైలమును కూడ చేయుదురు. ఇయ్యది బలాతైలము అని, శైరీయతైలము లనియనఁబడును.

## బలామహాబలాతైలములు.

శ్లో. బలామూలకషాయస్య దశమూలీకృతస్యచ, యవ కోల కులుత్థస్య క్వాథస్య పయసా తథా. 92. అష్టావష్టౌ శుభా భాగా స్తైలం దేక స్తదేకతః, పచే దావాప్య మధురం గణం సైంధవసంయుతం. 93. తథా గురుసర్జరసం సరలం దేవదారు చ, మంజిష్ఠాం చందనం కుష్ఠ మేలాం కాలానుశారిబాం. 94. మాంసీ శైలేయకం పత్రం తగరం శారిబాం వచాం, శతావరీ మశ్వగంధాం శతపుష్పాం పునర్నవాం 95. తత్సాధుసిద్ధం సౌవర్ణే రాజతే మృణ్మయేఽపి వా, ప్రక్షిప్య కలశే సమ్య క్సునిగుప్తం నిధాపయేత్. బలాతైల మిదం నామ్నా సర్వవాతవికారనుత్, యథాబల మయో మాత్రాం సూతికాయై ప్రదాపయేత్. 96. యాచ గర్భార్థినీ నారీ క్షీణశుక్రశ్చ యః పుమాన్, క్షీణ వాతే మర్మహతేఽభిహతే మథితేఽథవా. 97. భగ్నే శ్రమాభిపన్నే చ సర్వథా వాపయోజయేత్, సర్వా నాక్షేపకాదీంశ్చ వాతవ్యాధీ న్వ్యపోహతి. 98 హిక్కాకాస మధిమంథం గుల్మశ్వాసం సుదుస్తరం, షణ్మాసా నుపయుజ్యైత ద న్త్రవృద్ధి మపోహతి. 99. ప్రత్యగ్రధాతుః పురుషో భవేచ్చ స్థిరయౌవనః, పార్థివా రాజ్ఞాకర్తవ్యం రాజమాత్రాశ్చ యే నరాః. 100 సుఖినఃసుకుమారాశ్చ బలిన శ్చాపి యే నరాః.

ముత్తువపులగము వేళ్లతో చేసిన కషాయముతో గాని దశమూలముల కషాయముతో గాని యెర్రగుపంటు యవలు ఉలవలు వీనితో పెట్టిన కషాయముతో గాని సమముగా పాలు నింతకంటె నెన్నిదిగట్లుగా పోసి ఒకపాలు నూనెను సైంధవలవణము మధురాది గణౌషధములు అగురు సరళరసము దేవదారు జాపత్రి మంజిష్ఠము చందనము చెంగల్వ కోష్టు ఏలకులు గ్రంధితగరము శిలాజిత్తు జటామాంసి ఆకుపత్రి వస పిల్లపీచ్చర అశ్వగంధ సదాప తెల్లగన్నేరు వీటి నన్నిటి నొకభాగము తీసికొని బంగారము వెండి మట్టి వీటితో దేనితో నైనను చేసిన యొకపాత్రమునందు సిద్ధముచేసి తర్వాత కలశములో పోసి బాగుగా మూతపెట్టి యుంచవలయును. ఇద్దానికి బలాతైలమని పేరు, సమస్తవాత

వికారములనుపోఁగొట్టును. ఈమాత్రలను బలానుసారముగా ప్రసవించిన స్త్రీకి ఈయవలెయును. దీనిని గర్భముకాఁగోరు స్త్రీలును వీర్యముక్షీణించిన పురుషులును క్షీణవాతమునందును మర్మస్థానమునఁ గల దెబ్బలయందును అభిహత మధిత భద్రము లగు పరిశ్రమలయందును ఉపయోగింపవలయును. వెక్కిళ్లు దగ్గు అధిమంథము గుల్మము భయంకరమగు శ్వాసము అండవృద్ధి వీటినిఆరుమాసములు సేవించిన నశింపఁజేయును. దీనిని సేవించిన ధాతువృద్ధి గలవాఁడును స్థిరమగు యౌవనము కలవాఁడును అగును. రాజులు రాజసేవకులు సుఖవంతులు సుకుమారులు బలవంతులు నగువారును సేవింపవలయును.

## విష్ణుతైలము.

శ్లో. శాలపర్ణీ పృశ్నిపర్ణీ బలా చ బహుపుత్త్రికా. 101. ఏరండస్య చ మూలాని బృహత్యోః పూతికస్య చ, గవేధుకస్య మూలాని తథా సహచరస్య చ. 102. ఏషాం తు పలికైః భాగైః తైలప్రస్థం విపాచయేత్, ఆజం వా యది వా గవ్యం క్షీరం దద్యా చ్చతుర్గుణమ్. 103. అస్య తైలస్య పక్వస్య శృణు వీర్యమతః పరమ్, అశ్వానాం వాతభగ్నానాం కుంజరాణాం తథా నృణామ్. 104. తైల మేతత్ప్రయోక్తవ్యం సర్వవ్యాధినివారణమ్, ఆయుష్మాంశ్చ నరః పీత్వా నిశ్చయేన దృఢో భవేత్. 105. గర్భ మశ్వతరీ వింద్యాత్ న చ మృత్యువశం వ్రజేత్, హృచ్ఛూలం పార్శ్వశూలంచ తథైవార్ధావభేదకమ్. 106. కామలా పాండురోగఘ్నం శర్కరాశ్మరినాశనం, క్షీణేంద్రియా శ్శుక్రనష్టా జరయా జర్జరీకృతాః. 107. యేషాం చైవ క్షయోవ్యాధి రంత్రవృద్ధిశ్చ దారుణా, అర్దితం గలగండం చ వాతశోణిత మేవ చ. 108. స్త్రియో యా న ప్రసూయంతే తాసాం చైవ ప్రయోజయేత్, ఏత దజ్గం పరం తైలం విష్ణునా పరికీర్తితం. 109.

తైలము 1 ప్రస్థము, మేకపాలు లేక ఆవుపాలు 4 ప్రస్థములు, ముయ్యాకుపొన్న కోలపొన్న ముత్తవపులగము పెద్దపీచర ఆముదపువేళ్లు నేలములకవేళ్లు పెద్దములకవేళ్లు క్రానుగచెక్క గోధుమవేళ్లు ములిగోరింటవేళ్లు వీనికల్కములు ప్రత్యేకము 11 పలములు చేర్చి సిద్ధపఱచిన ఘృతము వాతరోగముగల మనుష్యులకు గుఱ్ఱములకు ఏనుగులకు గూడా శ్రేష్ఠమయినది. ఇది వంధ్యాదోషమును హరించును. ఆయువునిచ్చును. వలీపలితములను హృచ్ఛూలపార్శ్వశూల అర్ధావభేదకము కామిలపాండువు అశ్మరి ఇంద్రియనష్టము అంత్రవృద్ధి అర్దితవాతము గలగండము వాతరక్తములను హరిం

చును. ఆవుల కిచ్చినచో పుట్టిన దూడలు బ్రదుకును. ఇది విష్ణువుచే చెప్పఁబడిన దివ్య యోగము.

### నారాయణతైలము.

శ్లో. బిల్వాగ్నిమంథ స్యోనాక పాటలీ పారిభద్రకాః, ప్రసార ణ్యాశ్వగంధాచ బృహతీకంటకారికా. 110. బలాచాతిబలా చైవ శ్వదం ష్ట్రా సపునర్నవా, ఏషాం దశపలాం భాగాం శ్చతుర్ద్రోణేంభసః పచే త్. 111. పాదశేషం పరిస్రావ్య తైలపాత్రం ప్రదాపయేత్, శతపుష్పా దేవదారు మాంసీ శైలేయకం వచా. 112. చందనం తగరం కుష్ఠ మేలాపర్ణ చతుష్టయం, రాస్నా తురగగంధా చ సైంధవం సపునర్న వం. 113. ఏషాం ద్విపలికా న్భాగా న్పేషయిత్వా వినిక్షిపేత్, శతా వరీరసం చైవ తైలతుల్యం ప్రదాపయేత్. 114. అజం వా యదివా గవ్యం క్షీరం దత్వా చతుర్గుణం, పానే బస్తౌ తథాఽభ్యంగే భోజ్యే చైవ ప్రశస్యతే. 115. అశ్వోవా వాతసంభగ్నో గజోవా యదివానరః, పంగులః పీఠసర్పీచ తైలేనానేన సిధ్యతి. 116. అధోభాగే చ యే వాతాః శిరోమధ్యగతా శ్చ యే, దంతశూలే హనుస్తంభే మన్యా స్తంభే గలగ్రహే. 117. యస్య శుష్యతి చైకాంగం గతిర్యస్య చ విహ్వలా, క్షీణేంద్రియా నష్టశుక్రా జ్వరక్షీణాశ్చ యేనరాః.118. బధి రా లల్లజిహ్వాశ్చ మందమేధస ఏవచ, అల్పప్రజాచ యా నారీ యా చ గర్భం న విందతి. 119. వాతార్తా వృషణౌ యేషా మన్త్రి వృద్ధిశ్చ దారుణా, ఏత త్తైలవరం తేషాం నామ్నా నారాయణం స్మృ తమ్ 120. తగరం నతి మత స్యా దభావే శీతలీజటా.

మారేడు నాగి నెల్లి పెద్దమాను పుస్పాగ పాడిప గంతెనుగోరు చెక్క పెన్నేరు పెద్దములక చిన్నములక ముత్తువపులగము పెద్దముత్తువపులగము పల్లేరు గలిజేరు వీటినిపది పదిపలములచొ తెచ్చి నాల్గుద్రోణముల నీటిలో పక్వము చేయవలయును. నాల్గవపాలు నీరు మిగిలియుండఁగా 4 పలములనూనెనందు చేర్పవలయును. తరువాత సదాప దేవదా రు జటామాంసి రసాంజనము వస చందనము గ్రంథితగరము చెంగల్వకోష్టు ఏలకులు ముయ్యాకుపొన్న కారుమినుము కారుపెసర సన్నరాస్న పెన్నేరు సైంధవలవణము తెల్ల గలిజేరు వీటి నన్నిటిని రెండురెండుపలములు తీసికొని నూరి కలపవలయును. మఱియు ను 48 పలముల పిల్లిపిచ్చర రసమునుకూడ చేర్పవలయును. మేకపాలు లేక ఆవుపాలు

లుగాని నాలుగుకొట్లు పోసి తైలమును సిద్ధమును చేయవలయును. తరువాత దానిని త్రాగుటకుగాని తలంటునకుగాని భోజనమందుగాని యుపయోగించిన శ్రేష్ఠము. వాతము చేత పడిపోయిన వాఁడుగాని గుజ్జము ఏనుగు మున్నగు నవిగాని పంగువు [ముడ్డితో దోగియాడెడువాఁడు] గాని ఈతైలమును సేవించినచో బాగుపడును. శరీరపు అధోభాగమునందలి వాతములను తలమధ్యములో నుండు వాతములును దంతశూల మోకాళ్లు పట్టుకొనుట మన్యాస్తంభము గళగ్రహము అవయము లెండిపోవుట నడకపడిపోవుట ఇంద్రియను క్షీణించుట జ్వరముచేతక్షీణించుట మున్నగుగుణములును, చెవుడు నాలుకనుచొంగగారుట మేధస్సు మందగించుటయనునవియు నశించును. కొఁదిమంది (అనగా అల్పసంతానము) బిడ్డలుగల స్త్రీయును గర్భము నిలువని చిన్నదియును దీనిని సేవింపవలెను. వాతమువలన అండవృద్ధియును అంత్రవృద్ధియును కలిగిన వారలకును నీ నారాయణతైలము శ్రేష్ఠమైన దని చెప్పఁబడినది.

## మహానారాయణతైలము.

శ్లో. శతావరీ చాంశుమతీ పృశ్నిపర్ణీ శఠీ వరా. 121. ఏరండస్య చ మూలాని బృహత్యోః పూతికస్యచ, గవేధుకస్య మూలాని తథా సహచరస్యచ. 122. ఏషాం దశపలా న్భాగాన్ జలద్రోణే విపాచయేత్, పాదావశేషే పూతే చ గర్భం చైవం సమావపేత్.123. పునర్నవా వచాదారు శతాహ్వ చందనాగురు, శైలేయం తగరం కుష్ఠ మేలామాంసీస్థిరా బలా. 124. అశ్వాహ్వ సైంధవం రాస్నా పలార్ధాని చ పేషయేత్, గవ్యాజపయసః ప్రస్థౌ ద్వాద్వా వత్ర ప్రదాపయేత్. 125. శతావరీరసప్రస్థం తైలప్రస్థం విపాచయేత్, అస్య తైలస్య సిద్ధస్య శృణువీర్య మతఃపరం. 126. అశ్వానాం వాతభగ్నానాం కుంజరాణాం నృణాం తథా, తైల మేతత్ప్రయోక్తవ్యం సర్వవాతనివారణం. 127. ఆయుష్మాంశ్చ నరః పీత్వా నిశ్చయేన దృఢీభవేత్, గర్భ మశ్వతరీ విందే త్కింపున ర్మానుషీ తథా. 128. హృచ్ఛూలం పార్శ్వశూలం చ తథైవార్ధావభేదకం, అపచీం గండమాలాం చ వాతరక్తం హనుగ్రహం. 129. కామలాం పాండురోగం చ హ్యశ్మరీం చాపి నాశయేత్, తైల మేత ద్భగవతా విష్ణునా పరికీర్తితం, నారాయణమితి ఖ్యాతం వాతాన్తకరణం వరం. 130.

పిల్లిపీచర ముయ్యాకుపొన్న కోలపొన్న కచ్చూరము త్రిఫలములు ముత్తువపులగము ఆముదపువేళ్లు చిన్నములక పెద్దములక వేళ్లు గానుగవేళ్లు ముల్లుగోరింట వ్రేళ్లు వీటి నన్నిటిని పదిపదిపలములు తీసికొని ఒకద్రోణపరిమిత మగు నీటిలో పక్వముచేసి నాలుగవపాలు నీరు మిగిలియుండఁగాచి వడియఁగట్టి గలిజేరు వస దేవదారువు శతపుష్ప రక్తచందనము అగరు రసాంజనము గ్రంథితగరము చెంగల్వకోష్ఠు ఏలకులు జటామాంసి, ముత్తువపులగము శాలిపర్ణి పెన్నేరు సైంధవలవణము సన్నరాష్ట్ర వీటి నన్నిటిని అర్ధపలముచొప్పున నూరి ఆవుపాలు 32 పలములు మేకపాలు 32 పలములు తెచ్చి తరువాత శతావరిరసము 16 పలములును నూనెను 16 పలములును చేర్చి పక్వముచేసి తైలమును సిద్ధముచేయవలయును. ఇట్లు సిద్ధముచేసిన నీతైలమున కున్న ప్రభావమును వినుము. — వాతముచేత పడిపోయిన గుఱ్ఱములకును ఏనుగులకును మనుజులకును ఈతైలము నుపయోగించిన అన్నివిధము లగు వాతములఁ బోఁగొట్టును. దీనిని త్రాగినవాఁడు నిజముగా నాయుష్మంతుఁ డగును. దార్ఢ్యము గలవాఁడునునగును. కన్నర స్త్రీలు సేవించినను గర్భవంతు లగుదురనిన మనుష్యస్త్రీని గురించి చెప్పవలసిన దేమి? హృదయశూలము పార్శ్వపునొప్పి అర్ధావభేదకము అపచి గండమాల వాతరక్తము మోకాళ్ళుపట్టుట కామెల పాండురోగము మూత్రకృచ్ఛ్రమును పోఁగొట్టును. ఇయ్యది భగవానుఁ డగు విష్ణువుచేత నిర్మింపఁబడినది. మహానారాయణమను తైలము. వాతరోగములకు మృత్యుప్రాయమైనది.

## అశ్వగంధాతైలము.

శ్లో. శతం పక్త్వాశ్వగంధాయా జలద్రోణేంఽశశేషితం. 131. విస్రావ్య విపచే త్తైలం క్షీరం దత్వా చతుర్గుణం, కల్కై ర్మృణాల శాలూక బిస కింజల్క మాలతీ. 132. పుష్పై ర్హ్రీబేర మధుక శారివా పద్మకేసరైః, మేదా పునర్నవా ద్రాక్షా మంజిష్ఠా బృహతీ ద్వయైః. 133. ఏలైలవాలు త్రిఫలా ముస్తచందనపద్మకైః, పక్వం రక్తాశ్రయం వాతం రక్తపిత్త మసృగ్దరం. 134. హన్యా త్పుష్టిబలం కుర్యా త్కృశానాం మాంసవర్ధనం, రేతోయోనివికారఘ్నం ఘ్రాణశోషాపకర్షణమ్. 135. షండానపి వృషాన్కుర్యాత్పానాభ్యంగానువాసనైః.

నూరుపలముల యశ్వగంధను అనగా పెన్నేరు గడ్డలను దెచ్చి ఒకద్రోణము నీటిలో వండి నాల్గవపాలు నీరు మిగిలియుండఁగా గుడ్డను వాసెనఁగట్టి నాలుగురెట్లు

పాలు పోసి తైలమును చేర్చి పక్వము చేయవలయును. తామర దుంప గింజలు దార కింజల్కము మాలతీపూవులు కురువేరు యష్టిమధుకము సుగంధిపాల కమలకేసరము లు మేద గలిజేరు ద్రాక్ష మంజిష్ఠము ములక నేలములక ఏలకులు నాగుదోస త్రిఫలము లు తుంగము స్తలు చందనము పద్మాక్షము వీటిని కల్కము చేసి కలిపి తైలమును సిద్ధము చేయవలయును. ఇయ్యది రక్తవాతములను రక్తపిత్తములను ప్రదరరోగములను నశింపఁ జేయును. శరీరమునకు పుష్టిని గలిగించును. ఎండిపోయిన వారికి కండలు పెట్టును. వీర్యవికారములను యోనివికారములను నశింపఁజేయును. నాసికాదోషములను నశింపఁ జేయును. ఈతైలము త్రాగుట తలంటికొనుట తలకు రాచుకొనుట వీటినిచేయు వత్స పుంసకులకునయితము పుంస్త్వము నిచ్చును.

## మూలకాద్య తైలము.

శ్లో. మూలకస్వరసం తైలం క్షీరదధ్యమ్లకాంజికం. 136.
తుల్యం విపాచయేత్కల్కైః బలాచిత్రకసైంధవైః, పిప్పల్యతివిషా రాస్నా చవికాగురుచిత్రకైః. 137. భల్లాతకవచాకుష్ఠశ్వదంష్ట్రావిశ్వ భేషజైః, పుష్కరాహ్వశటీబిల్వ శతాహ్వానతదారుభిః. 138. తత్సిద్ధం పీత మత్యుగ్రాన్ హన్తి వాతాత్మకాన్ గదాన్.

ముల్లంగి గడ్డ స్వరసమును నూనెను పాలను పెరుగు అమ్లకాంజికము వీటి నన్నిటిని సమానభాగములుగా చేసికొని వానియందు ముస్తువపులగము చిత్రమూలము సైంధవలవణము పిప్పళ్లు అతివస సన్నరాస్న చవ్యము అగరు ఆముదపువేళ్లు నల్లజీడిపిత్తనము లు, వస చెంగల్వకోష్ఠు పల్లేరు శొంఠి పుష్కరమూలము కచ్చూరము మారేడు వేళ్లు సదాప తగరము దేవదారువు వీటితో చేసిన కల్కమునందు తైలమును పక్వము చేసి త్రాగిన యెడల భయంకరములగు వాతరోగములను నశింపఁజేయును.

## రసోన తైలము.

శ్లో. రసోనకల్కస్వరసేనపక్వం తైలం పిబేద్య స్త్వనిలామయార్తః, తస్యాశు నశ్యన్తి హి వాతరోగాః గ్రంథా విశాలా ఇవ దుర్గృహీతాః. 139.

ఉల్లిగడ్డలతో చేసినకల్కమును ఉల్లిరసమును చేర్చి పక్వము చేసిన తైలమును వాత రోగముచేత పీడింపఁబడువారు సేవింపవలయును. సమస్తవాతరోగములును చికిత్స చేయనలవికాని గ్రంథులునుకూడ దీని సేవించుటచేత నశించును.

## కేతక్కి తైలము.

శ్లో. కేతకీనాగబలాతిబలానాం యద్బహులేన రసేన విపక్వం, తైల మనల్పతుషోదకసిద్ధం మారుత మస్థిగతం వినిహన్తి. 140. అనల్పవచనాత్తత్ర తుల్యే క్వాథతుషోదకే, అకల్కోఽపి భవే త్స్నేహో యః స్సాధ్యః కేవలే ద్రవే. 141.

కేతకి నాగబల అతిబల వీటిని చాలరసముతో పక్వముచేసి తుషోదకమును కలిపి తైలమును సిద్ధముచేసి సేవించినయెడల అస్థిగత మగువాతముల కూడను నశింపఁజేయును. మూలమునందు అనల్పరసేన యనినందున కషాయమును తుషోదకమును సమానముగా తీసికొనుచుండవలయును. కేవలరసముతోనే సిద్ధముచేయునెడల కల్కము లేకనే చేయవలయును.

## సైంధవాద్య తైలము.

శ్లో. ద్వే పలే సైంధవాత్పంచ శుంఠ్యా గ్రన్థికచిత్రకాత్, ద్వే ద్వే భల్లాతకాస్థీని వింశతి ర్ద్వే తథాఢకే, ఆరనాలం త్పచే త్ప్రస్థం తైలమేతత్ కఫాపహం, గృధ్రస్యూరుగ్రహో రోగ్యఘ్నం సర్వవాతవికారనుత్.

సైంధవలవణము రెండుపలములు, అయిదుపలములు శొంఠి, మోడి చిత్రమూలము రెండురెండుపలములు కలిసి నల్లజీడివిత్తనములలోని పప్పు 21 ద్రోణముగంజి వీటియందు 16 పలముల తైలమును పక్వము చేయవలయును. ఇయ్యది గృధ్రసి ఊరుగ్రహము మూలరోగము మొదలగు సమస్తవాతవ్యాధులను పోఁగొట్టును.

## స్వల్పమాష తైలము.

శ్లో. తైలం సంకుచితేఽభ్యంగే మాషసైంధవసాధితం, బాహుశీర్షగతే నస్యం పానం చోత్తరభక్తికం, క్వాథోఽత్ర మాషనిష్పాద్యః సైంధవం కల్క మేవ చ. 143.

మినుములు సైంధవలవణము వీటిలో సాధించిన తైలమును తెచ్చి వాతమువలన పట్టుకొని పోయిన అవయవములకు మర్దన చేయవలయును. చేతులు తల వీటియందు గల వాతములయందు అన్నము తినుటకంటె ముందుగా నీతైలమును త్రాగవలయును. నస్యవిధిని చేయవలయును. ఈతైలములో మినుములతో సిద్ధము జేయఁబడిన సైంధవలవణపు కల్కమునుకూడ కలపవలయును.

## మాషతైలము.

శ్లో. మాషాత్మగుప్తాతివిషోరుబూక రాస్నాశతాహ్వాలవణైః సుపిష్టైః, చతుర్గుణే మాషబలాకషాయే తైలం కృతం హన్తి చ పక్షవాతం.

మినుములు దురదగొండి యష్టిమధుకము ఆముదపువేళ్లు సన్నరాష్ట్ర సదాప సైంధవలవణము వీటికల్కములో నాలుగురెట్లు మినుములను ముత్తవపులగపుకషాయమునుచేర్చి యందు తైలమును పక్వము చేయవలయును. ఈతైలమును సేవించినచో పక్షవాతములును నశించును.

## ఇంకనొకవిధమగు మాషతైలము.

శ్లో. మాషప్రస్థం సమావాప్య పచే త్సమ్యగ్జలాఢకే, పాదశేషేరసే తస్మిన్ క్షీరం దద్యా చ్చతుర్గుణమ్. 145. ప్రస్థం చ తిలతైలస్య కల్కం దత్వాఽక్షసమ్మితం, జీవనీయాని యాన్యష్టౌ శతపుష్పాం ససైంధవం. 146. రాస్నాత్మగుప్తా మధుకం బలావ్యోషం త్రికంటకం, పక్షాఘాతార్దితే వాతే కర్ణశూలే సుదారుణే. 147. మందశ్రుతౌ చాశ్రవణే తిమిరే చ త్రిదోషజే, హస్తకంపే శిరఃకంపే విశ్వాచ్యా మపబాహుకే. 148. శస్తం కళాయఖంజేచ పానాభ్యంజనవస్తిభిః, మాషతైల మిదం శ్రేష్ఠ మూర్ధ్వజత్రుగదాపహమ్. 149.

16 పలముల మినుములను తెచ్చి ఒకద్రోణము నీటిలో వండి నాల్గవపాలు నీరు మిగిలియుండఁగా నందు నాలుగురెట్లు పాలను కలపవలయును. పిమ్మట పదియారుపలముల నువ్వులనూనెను ఒక్కొక్కకర్షము (అనఁగా పావుపలము) జీవనీయగణపు ఔషధములను సదాప సైంధవలవణము సన్నరాష్ట్ర దురదగొండి యష్టిమధుకము ముల్లంగి ముత్తవపులగము శొంఠి మిరియములు పిప్పళ్లు పల్లేరు వీటిని కల్కముచేసి అందు కలిపి ఆకల్కమునందు సిద్ధము చేయఁబడిన తైలము పక్షపాతములను అర్దితవాతములను భయంకరము లగు కర్ణశూలలను వినిపింపకపోవుట చెవుడు త్రిదోషములవలనఁ బుట్టిన తిమిరరోగములను కంపరోగములను శిరఃకంప హస్తకంపములను బాహుశోషములు అపబాహుకము బధిరరోగము మున్నగువానిని కలిగియున్నయెడల దీనిని త్రాగుటయును రుద్దుకొనుటయును వస్తికర్మముల నుపయోగించుటయును మంచిది. ఇయ్యది మాషతైలము. ఇది పైభాగములయందు కలిగిన వాతరోగముల నన్నిటిని పోఁగొట్టును.

### మూఁడవవిధపు మాషతైలము.

శ్లో. మాషాతసీ యవకురుంటక కంటకారీ గోకంటటుండుక జటాకపి కచ్ఛుతోయైః, కార్పాసకాస్థి శణబీజ కులుత్థకోలక్వాథేన బస్తపిశితస్య రసేన చాపి. 150. శుంఠ్యా సమాగధికయా శతపుష్పయా చ, సైగండమూల సపునర్నవయా సరణ్యా, రాస్నాబలామృతలతాకటుకైర్విపక్వం, మాషాఖ్య మేతదపబాహుహరం చ తైలమ్. 151. అర్ధాంగశోష మపతానక మాఢ్యవాత, మాక్షేపకం సభుజ కంపశిరఃప్రకంపమ్, నస్యేన వస్తివిధినా పరిషేచనేన, హన్యాత్కటీజ ఘనజానురుజశ్చ సర్వాః. 152.

మినుములు, అవిసె, యవలు, గోరంట, నేలములక, పల్లేరు, జిల్లేడు, దురదగొండి, ప్రత్తివిత్తులు, ఉలవలు, జనుములు వీటితో కషాయమును చేసి మేకమాంసపురసమును శొంఠి, పిప్పళ్లు, సదాప, ఆముదపువేళ్లు, సిల్లపిచ్చర సన్నరాస్న ముత్తవపులగము తిప్పతీగె కటుకరోహిణి వీటిని చేర్చి, పక్వముచేసిన తైలము మాషతైలమనఁబడును. ఇయ్యది అపబాహుకవాతమును పోఁగొట్టును. సగము శరీరములో చచ్చుపుట్టుట, అపతానకము, ప్రూర్ణవాతమును, వాతరక్తము, భుజశిరఃకంపములు మున్నగువాని నస్యమిని వస్తికర్మములు, పరిషేకము మున్నగుచికిత్సలమూలమున నశింపఁజేయును.

### బృహన్మాష తైలము.

శ్లో. మాషక్వాథే బలాక్వాథే రాస్నాయా దశమూలజే, యవకోలకులత్థానాం ఛాగమాంసం భవేత్పృథక్. 153. ప్రస్థే తైలస్య చ ప్రస్థం క్షీరం దత్వా చతుర్గుణమ్, రాస్నాత్మగుప్తాసింధూత్థ శతాహ్వైరండముస్తకైః. 154. జీవనీయై ర్బలాయోషైః పచేదక్షసమై ర్భిషక్, హస్తకంపే శిరఃకంపే బాహుశోషేఽపబాహుకే. 155. బాధిర్యే కర్ణశూలేచ కర్ణనాదేచ దారుణే, విశ్వాచ్యా మర్దితే కుబ్జే గృధ్రస్యామపతానకే. 156. వస్త్యభ్యంజనపానేషు నావనే చ ప్రయోజయేత్, మాషతైల మిదం శ్రేష్ఠ మూర్ధ్వజత్రుగదాపహమ్. 157 క్వాథప్రస్థాః షడే వాత్ర విభక్త్యం తేన కీర్తితాః,

మినుములకషాయము, ముత్తవపులగపు కషాయము, సన్నరాస్న కషాయము, దశమూలముల కషాయము, యవలు, రేగుపండ్లు ఉలవలు వీటికషాయము, మేక

మాంసపు రసము వీటి నన్నిటిని ప్రత్యేక ప్రత్యేకముగా 16 పలములు తీసికొనవల యును. అందు 16 పలముల తైలమును 64 పలముల పాలను సన్నరాష్ట దూలగొండి సైంధవలవణము పిల్లపిచ్చర, ఆముదపువేళ్లు తుంగముస్తెలు, జీవనీయగణపు ఔషధ ములును మత్తువపులగము మిరియములు పిప్పళ్లు వీటి నొక్కపాలును, చేర్చి కల్క మును చేసి పైదానియందు కలిపి సిద్ధముచేసి సేవింపవలయును. ఇయ్యది, హస్తశిరః కంపములను, బాహుశోషము, అపబాహుకములను పోఁగొట్టును. చెవుడు చెవిపోటు చెవిదిమ్ము మున్నగువానియందును విశ్వాచీరోగమునందును, అర్దితవాతము కుబ్జవాతము గృధ్రసి అపతానకము వీటియందును, వస్తికర్మ రుద్దుట త్రాగుట నస్యవిధి మున్నగు వాని ద్వారా ఉపయోగింపవలయును. ఇది ఊర్ధ్వజత్రురోగములను పోఁగొట్టును. ఇయ్యది బృహన్మాషతైలము అనఁబడును.

## మహామాషతైలము.

శ్లో. మాషస్యార్ధాఢకం దత్వా తులార్ధం దశమూలతః. 158. పలాని ఛాగమాంసస్య త్రింశ ద్ద్రోణేంభసః పచేత్, పూతశీతేకషాయే చ చతుర్థాంశావతారితే. 159. ప్రస్థం చ తిలతైలస్య పయో దద్యా చ్చతుర్గుణమ్, ఆత్మగుప్తోదుబూకశ్చ శతాహ్వాలవణత్రయమ్. 160. జీవజీయాని మంజిష్ఠాచవ్యచిత్రకకట్ఫలమ్, సవ్యోషం పిప్పలీమూలం రాస్నామధుకసైంధవమ్. 161. దేవదార్వమృతాకుష్ఠం వాజిగంధా వచా శఠీ, ఏతై రక్షసమైః కల్కైః సాధయే న్మృదునాగ్నినా. 162. పక్షాఘాతార్దితే వాతే బాధిర్యే హనుసంగ్రహ, కర్ణనాదే శిరఃశూలే తిమిరే చ త్రిదోషజే. 163. పాణిపాదశిరోగ్రీవాభ్రమణే మందచంక్రమే, కలాయఖంజే పాఙ్గుల్యే గృధ్రస్యా మపబాహుకే. 164. పానే వస్తౌ తథాభ్యంగే నస్యే కర్ణాక్షిపూరణే, తైల మేతత్ప్రశంసన్తి సర్వవాతరుజాపహమ్. 165.

మినుములు 32 పలములు దశమూలములు 50 పలములు మేకమాంసము 30 పల ములు వీటిని ఒకద్రోణము నీటిలో వైచి వండవలయును. తరువాతను వడియకట్టి చక్కగా చల్లార్పవలయును. ఈకషాయమును వడియకట్టుటను దింపినప్పుడు నాల్గవపా లు నీరు మిగిలియుండవలెను. పిమ్మట ఒకప్రస్థము నూవులనూనెను అంతకు నాలుగు రెట్లు పాలను దూలదగొండి ఆముదపువేళ్ళు సదాప సైంధవలవణము సౌవర్చలవణము బి డాలలవణము ఈమూడింటిని జీవనీయగణమునందు చెప్పఁబడిన యౌషధములను

మంజిష్ఠ చిత్రమూలము గస్తుడు శొంఠి మిరియములు పిప్పళ్లు మోడి సన్నరాస్న యష్టిమధుకము దేవదారువు తిప్పతీగె చెంగల్వకోష్ఠు పేన్నేరు వస కచ్చూరము వీటినన్ని ఒక్కొక్కపావుపలముచొప్పున వేసి కల్కమును చేసి ఈకల్కమును పైదానియందు కలిపి సన్నని నిప్పుసెగపై నుంచి పక్వముచేసి దింపవలయును. ఇయ్యది పక్షవాతము, తలనొప్పి త్రిదోషములవలన గలిగెడి తిమ్మిరులు కాలుచేతులు తల మెడ వడకుచుండుట మందముపడుట పంగువాతము గృధ్రసి అపబాహుకము వీటియందు త్రాగించుట వస్తులనుచేయుట రుద్దుట నస్యవిధి నొసర్చుట చెవులలో పోయుట, కంటిలో వేయుట మున్నగువాని ద్వారా యుపయోగించిన యపూర్వగుణము నిచ్చునని వైద్యులు ప్రశంసించెదరు.

## గండవ మహామాష తైలము.

శ్లో. ద్విపంచమూలీం నిఃక్వాథ్య తైలాత్ షోడశభి ర్గుణైః, మాషాఢకం సాధయిత్వా తస్మిన్యూహం చతుర్గుణమ్. 166. గ్రాహయిత్వా తేషు విపచే త్తైలప్రస్థం పయఃసమమ్, కల్కార్థం చ సమావాప్య భిష గ్ద్రవ్యాణి బుద్ధిమాన్. 167. అశ్వగంధాం శఠీం దారుబలాం రాస్నాం ప్రసారణీం, కుష్ఠం పరూషకం భార్గీం ద్వే విదార్యౌ పునర్నవాం, మాతులుంగఫలాజాజ్యౌ ంమరం శతపుష్పకాం. 168. శతావరీంగోక్షురకం పిప్పలీమూలచిత్రకమ్, జీవనీయగణం సర్వం సంహృత్యైవ ససైంధవమ్. 169. తత్సాధుసిద్ధం విజ్ఞాయ మాషతైలమిదం మహత్, వస్త్యభ్యంజనపానేషు నావనే చ ప్రయోజయేత్. 170. పక్షాఘాతే హనుస్తంభే అర్దితే సాపతన్త్రికే, అపబాహుకవిశ్వాచ్యోః ఖంజపఙ్గుయోరపి. 171. హనుమన్యాగ్రహే చైవ మధిమంథే చ వాతికే, శుక్రక్షయే కర్ణనాదే కర్ణశూలే చ దారుణే. 172. కలాయఖంజశమనే భైషజ్యమిద మాదిశేత్, దశమూలాఢకం ద్రోణే నిఃక్వాథ్య పాదికో భవేత్. 173. క్వాథ శ్చతుర్గుణః తైలా న్మాషక్వాథే ప్యయం విధిః,

దశమూలముల కషాయమును తైలమున కన్న పదియారురెట్లు తీసికొని, మినుముల కషాయమును ఒకఆఢకపరిమితిని సిద్ధముచేసి, దానియందు 16 పలముల తైలమును, 16 పలములపాలను కలిపి కల్కము చేయుటకు బుద్ధిమంతు డగు వైద్యుడు పిన్నేరు, కచ్చూరము, దేవదారు, ముత్తవపులగము, సన్నరాస్న, సదాప, చెంగల్వ

కోష్ఠ గంటుభారంగి నేలగుమ్ముడు పాలగుమ్ముడు కొండ తెల్లగలిజేరు మాదీఫలము జీలకఱ్ఱ ఇంగువ పదాప పిల్లపిచ్చర పల్లేరు వోడి చిత్రమూలము జీవనీయగణము లోని అన్ని మూలికలు సైంధవలవణము వీని నన్నిటిని కలిపి ఈమహామాషతైలమును సిద్ధము చేసి వస్తికర్మముద్వారా తలంటు నస్యవిధులద్వారా ప్రయోగింపవలయును. పక్షఘాతము, మోకాళ్లుపట్టుకొనిపోవుట, అర్దితవాతము, అపతంత్రకము, అపబాహుకము, విశ్వాచి, పంగువాతము. మన్యాగ్రహము, అధిమంథము శుక్రక్షయము, చెవిదిమ్ము, భయంకరమగు చెవిపోటు, కలాయఖంజములు వీటిని పోగొట్టుటయందు దీనిని ఉపయోగింపవలయును. ఆఢకపరిమిత మగు దశమూలముల కషాయమును, ఒకద్రోణము నీటిలో పోసి పక్వముచేసి నాలుగవభాగము మిగిలియుండగా నింతకునాలుగురెట్లు తైలముతో పక్వము చేయవలయును. మాషకషాయములయందు ఇదియే నిర్మాణవిధి యని యెఱుంగఁదగినది.

## మజ్జస్నేహము.

శ్లో. గ్రామ్యానూపోదకానాం తు భిన్నాస్థీని పచేజ్జలే. 174. తం స్నేహం దశమూలస్య కషాయేణ పునః పచేత్, జీవకర్షభకాస్ఫోతావిదారీకపికచ్ఛుభిః. 175. వాతఘ్నైర్జీవనీయైశ్చ కల్కైర్ద్విక్షీరభాగికం, తత్సిద్ధంనావనాభ్యంగాత్తథా పానానువాసనాత్. 176. శిరఃపార్శ్వాస్థికోష్ఠస్థం ప్రణుదత్యాశు మారుతమ్, యేస్యుః ప్రక్షీణమజ్జానః క్షీణశుక్రౌజసశ్చ యే. 177. బలపుష్టికరం తేషామేతత్స్యాదమృతోపమమ్.

గ్రామ్యజంతువులు నీటిపట్టులనుండు జంతువులు నీటిజంతువులు వీటియొక్క ఎముకలను నీటిలో వేసి వండవలయును. ఇట్లు వండినదానిని దశమూలముల కషాయముతో మరల వండవలయును. జీవకము ఋషభకము విష్ణుక్రాంత నేలగుమ్ముడు దురదగొండి వాతనాశకము లగు జీవనీయగణములోని యౌషధులు పీటితో కల్కము చేసి 2 భాగములను వీనినికలిపి సిద్ధముచేసి నస్యవిధిఅభ్యంగనముల ద్వారాను పానము వస్తికర్మములమూలముగాను ప్రయోగించిన శిరోవాతము పక్షవాతము అస్థివాతము కోష్ఠవాతము మున్నగువానిని పోగొట్టును. ఇయ్యది క్షీణమజ్జ గలవారలకును, క్షీణించిన శుక్రము బలము కలవారలకును బలమును పుష్టిని గలిగించును. అమృతముతో సమానముగా నిది పనిచేయును.

## చతుస్స్నేహము.

శ్లో. ప్రస్థ స్స్యా త్త్రిఫలాయా స్తు కులుత్థకుడపద్వయమ్. 178. కృష్ణగంధాత్వగాఢకయో: పృథ క్పంచపలం భవేత్, రాస్నాచిత్రకయో ర్ద్వేద్వే దశమూలం పలోన్మితం. 179. జలద్రోణే పచే త్పాదశేషం ప్రస్థోన్మితం పృథక్, సురారనాలదధ్యమ్లసౌవీరకతుషోదకం. 180. కోలదాడిమవృక్షామ్లరసం తైలం ఘృతం వసామ్, మజ్జానం చ పయ శ్చైవ జీవనీయపలాని షట్. 181. కల్కం దత్వా మహాస్నేహం సమ్య గేనం విపాచయేత్, శిరామజ్జాస్థిగే వాతే సర్వాంగైకాంగరోగిషు. 182. లేపనాభ్యంజనాలేషు తమభ్యంగం ప్రదాపయేత్.

త్రిఫలములు 16 పలములు, ఉలవలు 8 పలములు, మునగచెక్క 5 పలములు, తువరిమన్ను 5 తులములు, సన్నరాస్న చిత్రమూలము 2 పలములు, దశమూలములు 1 పలము నీటి నన్నిటిని 16 పలముల నీటిలోవైచి కషాయముగాఁ గాచి నాల్గవపాలు మిగిలియున్నప్పుడు కల్లు గంజి మజ్జిగపైతేట సౌవీరమనుగంజి తుషోదకము రేగు దానిమ్మ మాదీఫలము వీటియొక్కరసము తైలము నేయి క్రొవ్వు మజ్జ పాలు వీటిని 16 పలముల చొప్పున చేర్చి జీవనీయగణపు మూలికలను 6 పలములను చేర్చి వీటితో కల్కమును చేసి తైలమును చక్కగా పక్వము చేయవలయును. ఇయ్యది నాడులలోని వాతమును మజ్జావాతమును అస్థివాతమును సర్వాంగవాతమును ఏకాంగవాతములను కంపము శూలమున్నగు రోగములను పోగొట్టును. దీనిని పైరోగములయందు మర్దనము చేయవలయును.

## కుబ్జాప్రసారణీతైలము.

శ్లో. ప్రసారిణీశతం క్షుణ్ణం పచే త్తోయార్మణేశుభే. 183. పాద శిష్టే సమం తైలం దధి దద్యా త్సకాంజికం, ద్విగుణం చ పయో దత్వా కల్కా న్ద్విపదికాం స్తథా 184. చిత్రకం పిప్పలీమూలం మధుకం సైంధవం వచామ్, శతపుష్పాం దేవదారు రాస్నాం వారణపిప్పలీం. 185. ప్రసారణ్యా శ్చమూలాని మాంసీభల్లాతకానిచ, పచే న్మృ ద్వగ్నినా తైలం వాతశ్లేష్మామయాన్ జయేత్. 186. అశీతిం నరనారీణాం స్వాతరోగా నపోహతి, కుబ్జం స్తిమితపఙ్గుత్వం గృధ్రసీఖుడుకార్దితమ్, హనుపృష్ఠశిరోగ్రీవా స్తంభం వాపి నియచ్ఛతి. 187.

నూరుపలముల గొంతిమగోరు తెచ్చి ద్రోణపరిమాణముల నీటిలో వైచి పక్వము ను చేసి నాల్గవపాలు నీరు మిగిలియుండునప్పుడు తైలము పెరుగు గంజి నీటిని సమాన భాగములుగాను పాలు రెండురెట్లును రెండురెండు పలములు చిత్రమూలము మోడి యష్టిమధుకము సైంధవలవణము వస సదాప దేవదారువు సన్నరాష్ట్ర ఏనుగుపిప్పళ్ళు గొంతిమగోరువేళ్లు జటామాంసి నల్లజీడివిత్తనములు వీటి నన్నిటిని కలిపి సన్నని సెగలో పక్వము చేయవలయును, ఇయ్యది వాతకఫరోగములను జయించును. స్త్రీపురుషులకు సాధారణముగా గలిగెడి వాతరోగములను పోగొట్టును. గూని తిమ్మిరి పంగవాతము గృధ్రసి ఖుడుకవాతము అర్దితవాతము హనుస్తంభము పృష్ఠస్తంభము గ్రీవాస్తంభము మున్నగునవియును దీనివలన తొలంగును.

## త్రిశతీప్రసారణీ తైలము.

ప్రసారణ్యా స్తులా మశ్వగంధాయా దశమూలతః, తులాం తులాం పృథక్ వారి ద్రోణే పాదాంశ శేషితే. 188. తైలాఢకం చతుః క్షీరం దధితుల్యం ద్వికాంజికమ్, ద్విపలైర్గ్రంధిక క్షార ప్రసారణ్యబ్దసైంధవైః. 189. సమంజిష్ఠాగ్ని యష్ట్యాహ్వాః పలికైర్జీవనీయకైః, శుంఠ్యాః పంచ పలం దత్వా త్రింశ ద్భల్లాతకాని చ. 190. పచే ద్వస్త్యాదినా వాతం హన్తి సంధిసిరాస్థితమ్, పుంస్త్వోత్సాహ స్మృతి ప్రజ్ఞా బలవర్ణాగ్నివృద్ధయే. 191. ప్రసారణీయం త్రిశతీ అక్షుంసోవర్చలం త్విహ.

నూరుపలముల గొంతిమగోరుచెక్క దశమూలములు 100 పలములును తెచ్చి వీటి నన్నిటిని ద్రోణమునీటిలో వేసి పక్వము చేసి నాల్గవపాలు మిగిలియుండగా, 64 పలముల నూనెను, ద్రోణము పెరుగును, 321 పలముల గంజిని, 512 పలములును మోడి యవక్షారము గొంతిమగోరు సైంధవలవణము, మంజిష్ఠ చిత్రమూలము ములంగి జీవనీయగణపు ఎనిమిది యౌషధులును, వీని నన్నిటి నొక్కొక్క పలమును శొంఠి 5 పలములు జీడివిత్తనములు 30 పలములు వీటిని కల్కమును చేసి తైలమును పక్వము చేయవలయును. దీనిని వస్త్యాదుల మూలమున సంధులయందును శిరోగతము లగు వాతములయందు నుపయోగింపవలయును. మఱియు నియ్యది పుంస్త్వము ఉత్సాహము స్మృతి ప్రజ్ఞ బలము వర్ణము అగ్నివర్ధనము మున్నగు గుణములను గలిగించును. ఇయ్యదియె త్రిశతీప్రసారిణీతైలమని చెప్పంబడును.

## సప్తశతీప్రసారణీ తైలము.

శ్లో. సమూలపత్రాముత్పాట్య శరత్కాలే ప్రసారణీం. 192. శతం గ్రాహ్యం సహచరా చ్ఛతావర్యాః శతం తథా, బలాత్మగుప్తాశ్వగంధా కేతకీనాం శతం శతం. 193. పచే చ్ఛతగుణే తోయే ద్రవై స్తైలాఢకం భిషక్, మస్తు మాంసరసం శుక్తం పయ శ్చాఢక మాఢకం. 194. దధ్యాఢకసమాయుక్తం పాచయే న్మృదునాగ్నినా, ద్రవ్యాణాం చ ప్రదాతవ్యా మాత్రా చార్ధపలాంశికా. 195. తగరం మదనం కుష్ఠం కేసరం ముస్తకం త్వచం, రాస్నాసైంధవపిప్పల్యో మాంసీ మంజిష్ఠయష్టికా. 196. తథా మేదా మహామేదా జీవకర్షభకౌ పునః, శతపుష్పా వ్యాఘ్రనఖం శుంఠీ దేవాహ్వమేవ చ. 197. కాకోలీక్షీరకాకోలీ వచా భల్లాతకం తథా, పేషయిత్వా సమానేతా న్సాధనీయా ప్రసారణీ, నాతిపక్వం న హీనం చ సిద్ధం పూతం నిధాపయేత్. 198. యత్ర యత్ర ప్రదాతవ్యా తన్మే నిగదతః శృణు, కుబ్జానా మథ పఙ్గూనాం వామనానాం తథైవ చ. 199. యస్య శుష్యతి చైకాంగం యే చ భగ్నాస్థిసంధయః, వాతశోణితదుష్టానాం వాతోపహతచేతసామ్. 200. స్త్రీషు ప్రక్షీణశుక్రాణాం వాజీకరణ ముత్తమం, వస్తౌ పానే తథాభ్యంగే నస్యే చైవ ప్రదాపయేత్. 201. ప్రయుక్తం శమయ త్యాశు వాతజా న్వివిధాన్గదాన్,

శరత్కాలమునందు వేళ్లు ఆకులతోటి గంధొంతిమగోరును తెచ్చి నూరుపలములు గోరంటను నూరుపలముల చిప్పిచ్చరిను ముత్తువపులగమును దురదగొండివిత్తనములు పెన్నేరు మొగలిదళములు వీటి నన్నిటిని నూరునూరు పలములును తీసికొనవలయును. వీటిని నాలుగుపట్లనీటితోను ద్రవములతోను తైలమును పక్వము చేయువలయును. పెరుగుపైతేట మాంసరసము పులికడుగు పాలు పెరుగు వీనిని ప్రత్యేకముగా నొక్కొక్క యాఢకము చొప్పున చేర్చి సన్నని మంటపైని పక్వము చేయవలయును. ఈతైలమునం దీక్రిందచెప్పంబోయెడి ఔషధములను అరపలముఅరపలము చొ చేర్పవలయును. తగరము ఉమ్మెత్త చెంగల్వకోష్టు కేసరి తుంగముస్తెలు లవంగపుపట్ట సన్నరాష్ట్ర సైంధవలణము పిప్పళ్లు జటామాంసి మంజిష్ఠము యష్టిమధుకము మేద మహామేద జీవకము ఋషభకము సదాప జెముడుపాలు శొంఠి దేవదారు కాకోలి క్షీరకాకోలి వస జీడివిత్తనములు వీటి నన్నింటిని సమానముగా చేకొని నూరి కల్కమును చేసి పైవానిలో క

లిపి ప్రసారిణి తైలమును సిద్ధము చేయవలయును. ఈతైలమునుజాగ్రత్తగా పక్వమును చేయవలయును. ఎక్కువగా దిగఁద్రాగరాదు. తక్కువ కాపుపనికిరాదు. ఉచితముగా పక్వమైన పిమ్మట వాసెనఁగట్టి వడియఁగట్టిగింపవలయును, ఈతైలము నేయే రోగము లయం దుపయోగింపవలయునో చెప్పుచున్నానువినుము. గూనివారలకు కుంటివారలకు పొట్టివారలకు ఒకఅంగము మాత్రము క్షయ గలవారలకు అస్థిసంధులు పోయినవారల కు వాతరక్తరోగదూషితులకు వాతముచేత కొట్టువడిన చిత్తము గలవారలకు స్త్రీల యందు నష్టమైనవీర్యము గలవారలకు ఇయ్యది యుత్తమమగు వాజీకరణ మగుచున్నది. ఈ తైలమును వస్తులయందును పానమునందును తలంటుకొనుటయందును నస్యవిధి యందును ప్రయోగింపవలయును. దీని నుపయోగించిన వాతప్రకోపమువలన గలిగిన వివిధము లగు రోగములు సైతము శమించును.

## ఏకాదశశతిక ప్రసారణీ తైలము.

శ్లో. శాఖామూలదలైః ప్రసారణితులా స్తిస్రః కురుంటాత్తులే, ఛిన్నాయాశ్చ తులే తులే చ బుకతో రాస్నాశిరీ సాత్తులా, దేవాహ్వా చ్చ సకేతకా ద్ఘటశతే నిఃక్వాథ్య కుంభాంశికే, శేషే తైలఘటం తు సాంబుకలసౌ దత్వా ఘటం మస్తునః. 202. శుక్తాచ్చాఖరసాదథేక్షు రసతః క్షీరాచ్చడత్వాఢకం, స్పృక్కాకర్కటజీవకాద్య వికసాకాకోలి కాకచ్ఛురా సూక్ష్మైలాఘనసారకుందసరలా కాశ్మీర మాంసీనఖైః, కాలే యోత్పలపద్మకాహ్వయ సిహా కక్కోలక గ్రంధికైః. 203. చాంపేయాం భయ చోజ పూంగ కటుకా జాతీఫలాభీరుభిః, శ్రీవాసామరదారు చందనవచా శైలేయసింధూద్భవైః, తైలాంభోదకటంభరాంఘ్రిపలికా వృశ్చీరకచోరకైః, కస్తూరీదళమూల కేతకనతధ్యామాశ్వగంధాంబు భిః. 204. కాంతీతార్క్ష్యజశల్లకీఫలలఘుశ్యామాగతాహ్వాంశుమ్యై,ర్భల్లాత త్రిఫలాబ్జకేసరమహాశ్యామాలవంగాన్వితైః, సమాంశైః స్త్రిఫలై ర్మహీ యసి పచే న్మందేన పాత్రేఽగ్నినా, పానాభ్యంజనవస్తినస్యవిధినా తన్మా రుతం నాశయేత్. 205. సర్వాంగార్ధగతం తథావయవగం సంధ్యస్థిమ జ్జాన్వితం శ్లేష్మోత్థానథ పైత్తికాంశ్చ శమయే న్నానావిధా నామయా న్, ధాతూ న్బృంహయతి స్థిరం చ కురుతే పుంసాం నవం యౌవనం వృద్ధస్యాపి బలం కరోతి సుమహ ద్వంధ్యాసు గర్భప్రదం. 206. పీ త్వా తైల మిదం జరత్యపి సుతం సూతే ఽమునా భూరుహాః, సిక్తాః

శోష ముపాగతాశ్చ ఫలిన స్స్నిగ్ధా భవన్తి స్థిరాః, భగ్నాంగా స్సుదృఢా భవన్తి మనుజా గావో హయాః కుంజరాః. 207.

కొమ్మలు వేళ్లు ఆకులతోగూడ గొంతెనగోరు 300 పలములును, గోరంట 200 పలములును, తిప్పతీగె 200 పలములు, చిట్టాముదము 200 పలములును సన్నరాస్న శిరీషము 100 పలములు, దేవదారు మొగలివేళ్లు 100 పలములు, వీటినన్నిటిని నూరుద్రోణముల నీటిలో పక్వము చేయవలయును. ఈ నీళ్లన్నియును రెండుద్రోణములుగా దిగంగ్రాగిన తరువాత తైలము నొకద్రోణమును, యవగంజి నొకద్రోణమును, మజ్జిగ 64 పలములు, చెఱకురసము 64 పలములు, పాలు 64 పలములు, శుక్తమును 64 పలములును మేకమాంసరసమును 64 పలములును స్పృక్క జీవకాదిగణములోని యౌషధులను మంజిష్ఠ కాకోలి దూలగొండి చిన్నయేలకులు కర్పూరము మల్లెమొగ్గలు దేవదారువు కేసరి గుస్తుడి జటామాంసి నఖము సుగంధద్రవ్యము మ్రానిపసుపు కమలములు పద్మాక్షము పసపు కంకోలము మోడి సంపెంగ నల్లకురువేరు లవంగపుపట్ట పోక కటుకరోహిణి జాజికాయ పిల్లిపిచ్చర శ్రీవాసధూపము దేవదారు చందనము వస సైంధవలవణము రసాంజనము తుంగముస్తెలు. గొంతెనగోరువేళ్లు శొంఠి ఖురాసానివాము వాము కస్తూరి వసమూలములు మొగలిపట్ట గ్రంధితగరము కానుంచి పెన్నేరు రేణుకలు కరక్కాయలు ఉసిరిక తాండి రేణుక శల్లకి అగరు ప్రేంఖణము పెద్దపిల్లిపీచర నల్లముగధి సరాప జీడిపిత్తనములు కమలకేసరములు కొడిసెపాలవిత్తనములు లవంగములు శొంఠి మిరియములు పిప్పళ్లు వీటి నన్నిటిని మూండుమూండు పలముల చొప్పున తెకొని కల్కమును చేసి మిక్కిలి పెద్దపాత్రలో వైచి సన్నని సెగలో పక్వము చేయవలయును. దీనిని పానము వస్తికర్మ నస్యము వీటియందు యథావిధిగా నుపయోగించిన వాతములను నశింపజేయును. సర్వాంగవాతము అర్ధాంగవాతము అంగగతవాతము సంధిగతవాతము అస్థిగతవాతము మజ్జాగతవాతము కఫరోగము పిత్తరోగము మున్నగు ననేకవిధము లగు రోగములను నశింపజేయును. ధాతుపుష్టిని కలుగజేయును. పురుషులకు నూత్నయౌవనము స్థిరపఱచును. ముదుసలికిని మిగులబలకరము అగును. గొడ్రాలికి గర్భము నిలుపును. ఈతైలమును త్రాగనేని వృద్ధురాలును పుత్రుని కనును. ఎండిపోయిన చెట్టునకు ఈతైలోదకమును చల్లినయెడల ఫలపుష్పసహితముగా పెమ్ముకొనును. భగ్నాంగుడు దృఢకాయుండగును. ఎద్దులు గుఱ్ఱములు ఏనుగులు మున్నగువానివలె బలియును.

### అష్టాదశశతిక ప్రసారిణీతైలము.

శ్లో. సమూలదలశాఖాయాః ప్రసారణ్యాః శతత్రయమ్, శతమేకం శతావర్యా అశ్వగంధాశతం తథా. 208. కేతకీనాం శతం చై

కం దంశమూలాచ్ఛతం శతం, శతం వాట్యాలకస్యాపి శతంసహా చరస్య చ. 209. జలద్రోణశతం దత్వా శతభాగావశేషితం, తతస్తేన కషాయేణ కషాయద్విగుణేన చ. 210. సువ్యక్తేనారనాలేన దధిమండాఢకేన చ, క్షీరశుక్తైక్షురిద్యాసచ్ఛాగమాంసరసాఢకైః. 211. తైలం ద్రోణం సమాయుక్తం దృఢే పాత్రే నిధాపయేత్, ద్రవ్యాణియాని పేష్యాణి తాని ప్రక్ష్యామ్యతఃపరం. 212. భల్లాతకం నతం శుంఠీ పిప్పలీ చిత్రకం శఠీ, వచా పృక్కా ప్రసారణ్యాః పిప్పల్యామూలమేవ చ. 213. దేవదారుశారాహ్వా చ సూక్ష్మైలాత్వచవాలుకం, కుంకుమం మదమంజిష్ఠా తురుష్కం నఖికాగురు. 214. కర్పూరకుందురునిశాలవంగధ్యామచందనం, కక్కోలనలికాముస్తం కాలీయోత్పలపత్రకం. శఠీహ రేణుశైలేయశ్రీవాసం చ సకేతకం, త్రిఫలా కచ్ఛురాభీరు సరలాపద్మకేశరం, ప్రియంగూశీర నలదం జీవకాద్యం పునర్నవా. 215. దశమూల్యశ్వగంధే చ నాగపుష్పం రసాంజనం, కటుకాజాతిపూగానాం ఫలాని శల్లకీరసం. 216. భాగాంస్త్రిఫలికాన్దత్వా శనైర్మృద్వగ్నినా పచేత్, విస్తీర్ణే సుదృఢే పాత్రే పాక్యైషా తు ప్రసారణీ. 217. ప్రయోగః షడ్విధశ్చాత్ర రోగార్తానాం విధీయతే, అభ్యంగాత్త్వగ్గతంహన్తిపానాత్కోష్ఠగమంతథా. 218.భోజనాత్తూస్త్రనాడీస్థాన్నస్యాదూర్ధ్వగతం తథా, పక్వాశయగతే వస్తిః నిరూఢః సార్వకాయకే. 219. ఏతద్ధి బడబాశ్వానాం కిశోరాణాం యథామృతం, ఏతదేవ మనుష్యాణాం కుంజరాణాం గవామపి. 220. అనేనైవ చ తైలేన శుష్యమాణా మహాద్రుమాః, సిక్తాః పునః ప్రరోహన్తి భవన్తి ఫలశాఖినః. 221. వృద్ధోఽప్యనేన తైలేన పునశ్చ తరుణాయతే, నప్రసూతే చ యా నారీ సాపి పీత్వా ప్రసూయతే. 222. అప్రజః పురుషో యస్తు సోపి పీత్వా లభేత్సుతమ్, అశీతిం వాతజాన్రోగాన్ చత్వారింశత్పైత్తికాన్ శ్లేష్మికానపి. 223.సన్నిపాతసముత్థాంశ్చనాశయేత్

క్షిప్రమేవతు, ఏతేనాంధకదృష్టీనాం కృతం పుంసవనం మహత్. 224. కృత్వా విష్ణో ర్బలిం చాపి తైలమేత త్ప్రయోజయేత్, క్వాథే తులా ర్ధంరాస్నాయాః కిలిమస్యచ దీయతే. 225. భల్లాతకాసహ త్వేతు తత్స్థానే రక్తచందనం, త్వక్పత్రం పత్రముధురీ కుష్ఠచంపకగ్గైరికాః. 226. గ్రంధికోశామురువకమథికత్వేనదీయతే, కర్పూరమదదానంచ శుక్తిర్గంధోదకక్రియా. 227. ద్రవ్యశుద్ధిః పాకవిధిర్వ్యాఖ్యాప్రసారణీపమః.

వేళ్లు కొమ్మలు ఆకులతో గూడిన గొంతెమగోరు 500 పలములును, పిల్లపీచర నూరుపలములును, పెన్నేరు నూరుపలములును, మొగలివేళ్లు 100 పలములును, దశమూలములు, 100 పలములును, సుస్థవపులగము, నూరుపలములును, గోరింట, 100 పలములును వీటిని ఒకద్రోణము నీటిలో పక్వముచేసి, నాల్గవపాలు నీరు మిగిలియుండగా దించి ఆకషాయమును, అందునకు రెండుగట్లు, గంజిని మజ్జిగ 64 పలములపాలు, శుక్తము ఇక్షురసము, మాంసరసము, వీటినన్నిటిని ఒక్కొక్క ఆఢకముచొప్పున చేర్పవలయును. తైలము ఒకద్రోణమును, అందు కలిపి, గట్టిపాత్రములో నుంచవలయును. ద్రవ్యములను, కల్కముచేయదగిన వానిని ఇకమీద చెప్పెదను. నల్లజీడివిత్తనములు, గంధతగరము, శొంఠి, పిప్పళ్లు, చిత్రమూలము, కచ్చూరము, వస, స్పృక్కయను గంధద్రవ్యము, గొంతెమగోరు పిప్పలిమూలము, దేవదారువు, పిల్లపిచ్చర చిన్నయేలకులు లవంగపుపట్ట, కురువేరు, కేసరి కస్తూరి మంజిష్ఠము, శిలాజిత్తు నఖము అగరు కర్పూరము, పసపు, లవంగము, వట్టివేళ్లు, చందనము, కంకోలము, పాలకము, కుంకుమపువ్వు మ్రానిపసపు కమలము, జాపత్రి కచ్చూరము, రేణుక యను ద్రవ్యము మంచిగంధపు ధూపము, మొగలి త్రిఫలములు వట్టివేళ్లు పిల్లపిచ్చర దేవదారు నూపము కమలకేసరము ప్రేంఖణము వట్టివేరు, జనకాదిగణపుఔషధములును దశమూలములు పెన్నేరు, నాగకేసరములు, రసాంజనము, కటుకరోహిణి, జాపత్రి పోక, అందుగురసము వీటి నన్నిటిని మూడుమూడు పలములను చేర్చి, సన్నని మంటపైని పక్వము చేయవలయును. గట్టిదియును వెడల్పుఅయినదియు నగు పాత్రమునందు ఈప్రసారిణితైలమును, పక్వము చేయవలయును. ఇచ్చట నారువిధము లగు ప్రయోగములు, ఈతైలముతో నొనర్పవలయును. దీనితో తలంటుకొనిన త్వగ్గతమగు వాతము నశించును. పానమువలన కోష్ఠగత మగు వాతమును పోగొట్టును. భుజించుటవలన సూక్ష్మనాడులయందు గల వాతమును నశింపజేయును. నస్యవిధివలన ఊర్ధ్వభాగమునందున్న వాతమును పోగొట్టును.

జీర్ణకోశమునందున్న వాతమునకు, వస్తివిధుల నొనర్పవలయును. శరీరమునంతను వ్యాపించుకొనిన వాతమునందు నిర్వ్యూహము నొనర్పవలయును. ఈతైలము వయోవస్థలోనున్న ఆడుగుఱ్ఱములకు మొగగుఱ్ఱములకు అమృతతుల్యమైనది. ఈతైలమే మనుజులకును ఏనుగులకును గోవులకును అమృతముతో సమానము అయినది. ఎండిపోయిన మ్రాకులీతైలముతో చల్లఁబడినయెడల (సేచనము చేయఁబడినయెడల) మరల మొలకలెత్తును. ఫలవృక్షములు నగును. ఈతైలసేవనముచేత వృద్ధుఁడును తరుణుఁడగును. గొడ్డుబోతు బిడ్డలను కనును. సంతానము లేనిపురుషుఁడు దీనిని సేవించి సుతుని బడయఁగలుగును. ఎనుబదివిధము లగు వాతరోగములను పిత్తరోగములను, శ్లేష్మరోగములను పోగొట్టును. సన్నిపాతమువలనఁ బుట్టెడి రోగములను మిగుల శీఘ్రముగా నశింపఁజేయును, దీనివలన కన్నులు మసకలుగలవారికి దృష్టి గలుగును. గొప్పదృష్టి నిచ్చునదియునైయిది యున్నయది, ముందుగా విష్ణు నారాధించి పిమ్మట ఈతైలము నుపయోగింపవలయును. కషాయములో దేవదారువు దొరకనియెడల సన్నరాష్ట్రను పలములును జీడివిత్తనములు దొరకనిచో దానిస్థానమునందు రక్తచందనము లవంగపుపట్ట జాపత్రి తాడిశపత్రి ఉసిరిక కోష్ఠు జాజి పిప్పళమూలము మైనఫలము వీటివన్నిటి నెక్కువగా వేయుచుండవలయును. శుక్తమునందు గంధకపునీటిని చేర్పవలయును. ద్రవ్యశుద్ధి పాకవిధి మున్నగునవి ముందు చెప్పఁబోయెడి పరిసారిశైతైలముతో సమానముగా తెలుసుకొనవలయును.




శ్లో. శతపత్రం ప్రసారణ్యా ద్వేచ పీతసహాచరాత్. 228. అశ్వగంధైరండబలావరీరాస్నాపునర్నవా, కేతకీదశమూలంచ పృథక్స్యాత్ క్వాథభద్రకః. 229. ప్రత్యేక మేషాం తు తులా తులార్ధం కిలిమాత్ స్మృతః, తులార్ధం స్యాచ్ఛిరీషాచ్ఛలాత్ఫాయాఃపంచవింశతిః. 230. పలానిలోధ్రాచ్చ తథా సర్వ మేకత్ర సాధయేత్, జలపంచాఢకశేషే సపాదే తత్ర శేషయేత్. 231. ద్రోణద్వయం కాంజికంచ షడ్వింశత్యాఢకోన్మితం, క్షీరదధ్నోః పృథక్ప్రస్థాన్ దశమం త్వాఢకం తథా. 232. ఇక్షురసాఢకాంచైవ ఛాగమాంసతులాత్రయే, జలపంచచత్వారింశత్ప్రస్థాన్ పక్త్వా తు శోషయేత్. 233. సప్తదశరసప్రస్థా స్కంజిష్టాక్వాథ ఏవ చ, కుడవోనాఢకోన్మానద్రవైరేతైస్తు సాధయేత్. 234. సుశుద్ధతిలతైలస్య

ద్రోణం ప్రస్థేన సంయుతం, కాంజికం మూనతో ద్రోణం శుక్తేనాత్ర విధీయతే. 235. ఆద్యపభి ర్ద్రవైః పాకః కల్కో భల్లాతకం కణా, నాగరం మరిచం చైవ ప్రత్యేకం షట్పలోన్మితం. 236. భల్లాతకాసహత్వేతు రక్తచందన ముచ్యతే, పథ్యాక్షధాత్రీ సరళం శతాహ్వా కర్కటీ వచా. 237. చోరపుష్పీ శఠీ ముస్తం ద్వయం పద్మంచ సోత్పలమ్, పిప్పలీమూలమంజిష్ఠా సాశ్వగంధా పునర్నవా. 238. దశమూలం సముదితం చక్రమర్దో రసాంజనం, గంధతృణం హరిద్రా చ జీవనీయో గణ స్తథా. 239. ఏషాం త్రిపలికై ర్భాగై రాద్యః పాకో విధీయతే, దేవపుష్పీ బోలపత్రం శల్లకీరస శైలజే. 240. ప్రియంగూశీరమధుర మాంసీ దారు బలానిలమ్, శ్రీవాస నలికా ఖోటిసూక్ష్మైలా కుందురు స్తురా. 241. నఖత్రయం చ త్వక్పత్ర మపరాపూతిచంపకం, మదనం రేణుకాస్పృక్కా మురువం చ ఫలత్రయం. 242. ప్రత్యేకం గంధతోయేన ద్వితీయః పాక ఇష్యతే, గంధోదకం తు త్వక్పత్ర పత్రకోశీరముస్తకం. 243. ప్రత్యేకం సబలామూలం పలాని పంచవింశతిః, కుస్థార్ధభాగోత్ర జలప్రస్థా స్తు పంచవింశతిః. 244. అర్ధావశిష్టాః కర్తవ్యాః పాకే గంధాంబుకర్మణి, గంధాంబుచందనాంబుభ్యాం తృతీయః పాక ఇష్యతే. 245. కల్కోత్ర కేశరం కుష్ఠం త్వక్కాలీయక కుంకుమం, భద్రశ్రియం గ్రంథిపర్ణం లతాకస్తూరికా తథా. 246. లవంగాగురుకక్కోల జాతీకోశఫలాని చ, ఏలాలవంగం ఛల్లీ చ ప్రత్యేకం త్రిపలోన్మితం. 247. కస్తూరీషట్పలా చంద్రా త్పలం సార్ధం చ గృహ్యతే, వేదార్ధం చ పునః చంద్రమసో దేయా తథోన్మితౌ. 248. మహాప్రసారణీ సేయం రాజభోగ్యా ప్రకీర్తితా, గుణా న్ప్రసారణీనాం తు వహత్యేషా బలోత్తమాత్. 249. అత్ర శుక్తిపిధి ర్వంశః ప్రస్థః పంచాఢకోన్మితం, కాంజికం కుడవం దధ్నో గుడప్రస్థామ్లమూలకాత్. 250. ఫలా న్యష్టౌశోధితార్ద్రాత్పలం షోడశకం తథా, కణాజీరకసింధూత్థ హరిద్రామరిచం పృథక్. 251. ద్విపలం భావితే భాండే ఘృతేనాష్టదిన

స్థితం, సిద్ధం భవతి తచ్చ్ఛుక్తం యదా వర్తార్యగృహ్యతే. 252. తదా దేయం చతుర్జాతం పృథక్కర్షత్రయోన్మితం, పంచపల్లవతోయేన గంధానాం క్షాళనం తథా. 253. శోధనం చాపి సుస్పష్టో విశేష శ్చాత్ర వక్ష్యతే, ఆమ్రజంబూకపిత్థానాం బీజపూరకబిల్వయోః. 254. గంధకర్మణి సర్వత్ర పత్రాణి పంచపల్లవం, చండీగోమయతోయేన యది వా తింత్రిణీజలైః. 255. నఖం సక్వాథయే దేభిరంభాభే వ్పృణ్మయేన తు, పునరుద్ధృత్య సంక్షాళ్య భర్జయిత్వా నిషేచయేత్. 256. గుడపథ్యాంబునా హ్యేవం శుధ్యతే నాత్ర సంశయః.

గొంతిమనోరుచెక్క 300 పలములును పస్పుగోరంట 200 పలములును అశ్వగంధ (పెన్నేరు) చిట్టాముదము ముత్తవపులగము పిల్లపిచ్చర పస్నగాస్త్ర శొంఠి మొగలిపూవు దశమూలములు లవంగపుపట్ట దేవదారువు వీటినన్నిటిని ఒక్కొక్కటిలను చొప్పునను (అనగా నూరునూరుపలములను) పెద్దదేవదారువు 50పలములును దిరిసెనపుప్వములు 50 పలములును లక్క 25పలములును లొద్దుగ 50 పలములును వీటినన్నిటిని కలిపి 50 ఆఢకముల నీళ్లలో పక్వము చేసి నాల్గవపాలు నీరు మిగిలియుండగా దించి గంజి 512 పలములు 16 పలములు పాలు పెరుగు 16 పలములును ఇక్షురసము 123 పలములు మాంసరసము 300పలములు 45 ప్రస్థములనీటిని పక్వము చేసి ఎండింపవలయును. మంజిష్ఠకషాయము 17 ప్రస్థములు పాలు తలము 272 పలములగను ఒక ద్రోణము శుక్తము చేర్చి పెద్దవములను చేర్చి మొట్టమొదట పక్వము చేయవలయును. కల్కము చేయుటకొరకు జీడిపిత్తనములు పిప్పళ్లు శొంఠి మిరియములు వీటినన్నిటిని 6 పలములచొప్పున తీసికొనవలయును. జీడిపిత్తనములు లేకపోయెనేని రక్తచందనము నందులకు బదులుగా చేకొనవలయును. కరకకాయలు ఉసిరిక తాడి సగలరసము పిల్లపిచ్చర కాకడాశింగి పస శంఖిని కచ్చూరము తుంగముస్తెలు నీటితామర మెట్టతామర తెల్లతామర పిప్పలిమూలము మంజిష్ఠ అశ్వగంధము శొంఠి దశమూలములు రాతిపుప్వము కురువేరు పసపు జీవనీయగణపుటౌషధములను మూడు మూడు పలములచొప్పున తీసికొనివచ్చి పాకము చేయవలయును. లవంగములు తేజపత్రి సల్లకీరసము శిలాజిత్తుఉసిరిక దేవదారువు ముత్తవపులగము చిత్రమూలము శ్రీవాసధూపము బోలపత్రము చన్నయేలకులు ఊదుచెట్టు వట్టివేళ్లు మురయను గంధద్రవ్యము ముత్తెలంగులగు నఖములు, తిప్పతీగ నెమలియడ్డు చెక్క జాజి ఉమ్మెత్తకాయ రేణుకయను ద్రవ్యము పృక్క తెల్లమరువము వీటినన్నిటిని మూడుమూడు పలములను తీసికొని గంధోదకమునందు గండవపాకమును చేయవలయును.

జలై ర్భావయే చ్ఛేతి శుధ్యతి. 260. కాంచికే క్వథితం శైలం భృష్టాపథ్యా గుడాంబునా, సించే దేవం పునః పుష్పై ర్ద్వివిధై రధివాసయేత్. 261. యథాలాభ మపామార్గ స్నుహ్యాది క్షారలేపితం, భాష్పస్వేదేన సంస్వేద్య పూతి నిర్లోమతాం నయేత్. 262. డోలాపక్వం పచే త్పశ్చా త్పంచపల్లవవారిణి, ఖలః సాధు మిహోత్పద్య తతో నిఃస్నేహతాం నయేత్. 263. ఆజశోభాంజనజలై ర్భావయే చ్చ పునః పునః, శిగ్రుమూలేచ కేతక్యాః పుష్పపత్రపుటేచ తమ్. 264. పచే దేనం విశుద్ధ స్స్యా న్మృగనాభిసమో భవేత్, తురుష్కం మధునా భావ్యం కాశ్మీరం చాపి సర్పిషా. 265. రుధిరేణాయసం ప్రాజ్ఞై ర్గోమూత్రై ర్గంధిపర్ణకమ్, మధూదకేన మధురీం ఘృతకం తండులాంబునా. 266. ఈషత్ క్షారానుగంధా తు దగ్ధా యాతి న భస్మతాం, పీతా కేతకగంధా చ లఘుస్నిగ్ధా మృగోత్తమా. 267. పక్వా త్కర్పూరతః ప్రాహు రపక్వం గుణవత్తరం, తత్రాపి స్యా ద్యది క్షుద్రం స్ఫటికాభం త దుత్తమం. 268. పక్వం చ సదలం స్నిగ్ధం హారితద్యుతి చోత్తమం, భంగే మనాగపి నచే న్నిపత న్తి తతః కణాః. 269. మృగశృంగోపమం కుష్ఠం చందనం రక్తపీతకం, కాచతుండాకృతిః స్నిగ్ధో గురు శ్చోత్తమో గురుః. 270. స్నిగ్ధాల్పకేశరం హ్రస్వం శాలిజో వృత్తమాంసలః, ముఁరా పీతా వరా ప్రోక్తా మాంసీ పింగజటాకృతిః. 271. రేణుకాముద్గసంస్థానా శస్త మానూపజం ఘనమ్, జాతీఫలం సశబ్దం చ స్నిగ్ధం గురు చ శస్యతే. 272. ఏలాసూక్ష్మఫలా శ్రేష్ఠా ప్రియఙ్గుః శ్యామపాండురా, నఖ మశ్వఖురం హ స్తికర్ణం చైవాత్ర శస్యతే. 273. ఏతేషా ముపగేహాం చ నవతా ప్రబలో గుణః.

గోమూత్రము లజ్జావంతికషాయము పంచపల్లవముల కషాయము వీటితో పక్వము చేసి గోమూత్రముతోను ఆవిరితోను పచనము చేసిన రొండల వసయును పసపును శుద్ధములగుచున్నవి. మొదట తుంగెనుస్తెలచూర్ణమును గంజిలో మూడుదినములు నాన్చి పెట్టుకొనవలయును. తరువాత పంచపల్లవకషాయమున స్వేదనముచేసి నర్చి ఎండలో నెండింపవలయును. తరువాత బెల్లపునీళ్లను దానిపైనిచల్లి వేయించి చూర్ణమును చేసి పెట్టుకొనవలయును. ఈచూర్ణమును మేకమాంసపు రసమును మునగవేళ్ల కషాయము

తో భావనచేసినయెడల శుదమగును. గంజిలో శుద్ధిచేయఁబడిన శిలాజిత్తుతోను వేచిన కరక్కాయ, బెల్లపుపాకముతో కలిపి చల్లవలయును. పిమ్మట ననేకవిధములగు పుష్పములతో వాసెన కట్టవలయును. ఆవిరివలన చెమటను పుట్టించి దుర్గంధము తొలగింపవలయును. మేకమాంసపు రసమునందును మునగరసమునందును మాటి మాటికి భావన చేయవలయును. మునగవేళ్లతోను కేతకీదళసంపుటములతోను, చక్కగా పక్వము చేయవలయును. ఇట్లుచేసినయెడల శుదమై కస్తూరితో సమానమైనది యగును. శిలాజిత్తును తేనెలో భావన చేయవలయును. కేసరిని ఘృతములో భావన చేయవలయును. లోహములను రక్తముతోను భావన చేయవలయును, కచోరమును గోమూత్రముతోను సదాపను మధూదకముతోను భావన చేయవలయును. బియ్యపుకడుగుతో తేజపత్రిని భావన చేయవలయును. కొంచెమంత క్షారపదార్థముతో కలసిన సదాపను తగులఁబెట్టినయెడల బూడిదగాఁజాలదు. పచ్చనిదియును మొగలిరేకుతో సమానముగా పరిమళించునదియును కొంచెము తక్కిసిదియు నగునది యత్యుత్తమమైనది. వండినకర్పూరముకంటెను పచ్చకర్పూరము మిక్కిలి గుణమును కలిగించును. దానియందు కూడను క్షుద్రముగాక స్ఫటికమువలె తెల్లనైనది యత్యంతయుత్తమము. మఱియును దళములు దళములుగా పక్వమై నునుపు తేలి పచ్చని రంగుగల కర్పూరము నుత్తమమైనది అగును. విడిపోయినప్పటికిని కణములు పడనిది మిక్కిలిశ్రేష్ఠము. లేడికొమ్ములవలె కొమ్ములుగానుండు కోష్ఠు ఉత్తమమైనది, ఎఱుపుపచ్చగలిగిన చందనము శ్రేష్ఠమైనది. కాకిముక్కువలె స్నిగ్ధమై బరువుగనున్న యగురుత్తమమైనది. చిక్కగా నుండి కొద్ది పాటి కింజల్కములు గల కేసరి యుత్తమమైనది. గుండ్రముగను లావుగనుండు బియ్యముత్తమము. పచ్చనిమరువము శ్రేష్ఠమైనది. జటామాంసి పచ్చనై జడవలె పెనవేసికొనినది యుత్తమము. పెసరగింజలవలె పలుకులుగానుండిన రేణుకయను ద్రవ్యము శ్రేష్ఠము. నీటిపట్టుల మొలచెడి తుంగముస్త శ్రేష్ఠము. మోగునదియును నున్ననైనదియు నగు జాజికాయ శ్రేష్ఠము. చిన్నగింజలుగల ఏలకులు శ్రేష్ఠములు. నల్లగను పచ్చగనుండు కోష్టులు శ్రేష్ఠములు. రెండుతెలుగు లగు నఖమను ద్రవ్యములను గవ్వపుగిట్టలువలె నుండినవియును ఏనుగుచెవివలె నుండునవియును శ్రేష్ఠములు. ఈపైనిచెప్పఁబడిన వస్తువులలోగాని యితరవస్తువులలోగాని నవత్వము (అనఁగా క్రొత్తదనము) మిక్కిలియును గుణకరము అగుచున్నది.

### మహాసుగంధితైల లక్ష్మీవిలాసతైలము.

శ్లో. జింగీ పోరక దేవదారుసరలం వ్యాఘ్రీనఖాచోలక, త్వక్పత్ర స్పృహాగంధపత్రకశఠీ పథ్యాక్షధాత్రీఘనైః, ఏతైః శోధితసంస్కృతైః పలయుగే ర్వ్యాఖ్యాతయా సంఖ్యయా, తైలప్రస్థ మవస్థితైః స్థిరమితి కల్కైః పచే ద్గాంధికమ్. 274. మాంసీమురాదమనచంపకసుందరీత్వక్, గ్రన్థ్యంబురుడ్మురువకైః ద్విపశైః స్వపృక్కైః శ్రీవాసకుందురున

ఖినలికామిషీణాం, ప్రత్యేకతః పల ముపాయ్య పునః పచేత్తు. 275. ఏలాలవంగచలచందనజాతిపూతిః, కక్కోలకాగురులతాఘుసృణైః పలార్ధైః, కస్తూరికాక్షసహితామలదీప్తియుక్తైః పక్వాతు మందశిఖినైవ మహాసుగంధమ్, పంచద్వికేన చార్ధేన మదా త్కర్పూర మిష్యతే, కర్పూరమదయో రర్ధం పత్రకల్కాది హేష్యతే. 277. పక్వపూతే ఫుష్ణవవ సమ్యక్ప్రేషణ వర్తితమ్, దీయతే గంధవృద్ధ్యర్థం పత్రకల్కం త దుచ్యతే. 278. ప్రాగుక్తాశుద్ధసంస్కారౌ గంధానా మిహ తైః పునః, ద్విగుణై ర్లక్ష్మీవిలాస స్స్యాదయం తైలసత్తమః. 279. పంచపత్రాంబునా చాద్యో ద్వితీయం గంధవారిణా, తృతీయోపి చ తేనైవ పాకో వా ధూపితాంబునా. 280.

మంజిష్ట చిన్నకచోరము దేవదారువు సరళద్రవము వాకుడు వస చేలకము తాడిశపత్రి, చందనము తేజపత్రి కచ్చూరము, కరక్కాయలు, తాడి, ఉసిరిక, తుంగముస్తలు వీటినన్నిటిని శుద్ధిచేసి సంస్కరించి, రెండురెండు పలములంతంత తీసికొని కల్కముచేసి అందు పదహారు పలముల తైలమునుచేర్చి స్థిరబుద్ధి గలవాడైన వైద్యుడు పక్వముచేయవలయును. గ్రంథితగరము మురామాంసి దమనము సంపెగ లఘుకాబలియును సోంపును లవంగపుపట్ట మోడి కురువేరు కోష్ఠు మాచిపత్రి పృక్కగోరింట వీటిని రెండు రెండుపలముల చొప్పునను శ్రీవేష్టధూపము కుందురుష్కము (క్రీకసగడ్డియనెదరట) నఖమును గంధద్రవ్యము నాలిక సోంపు వీటినన్నిటిని పలము పలము చొప్పునను తీసికొని కల్కముచేసి కలిపి వండవలయు.

ఏలకులు లవంగములు నఖమను గంధద్రవ్యము చందనము జాపత్రి నెమలియడుగువేరు కంకోలము అగరు కుంకుమ పువ్వు కేసరములు కస్తూరి తాడియుసిరిక బోడసరపువిత్తనములు వీటినన్నిటిని అర్ధపలము చొప్పునను తీసికొని మహాసుగంధతైలమును పక్వము చేయవలయును. కస్తూరి కంటెను పదిరెట్లు కర్పూరమును కర్పూర కస్తూరులకంటె సర్ధము పత్రికల్కము మున్నగు వానిని తీసికొనవలయును. చక్కగా పక్వము చేసి వాసెనగట్టి వేడిగానున్నప్పుడే నూరఁబడినట్టిది వాసన హెచ్చుగా నుండునట్టిదియే పత్రకల్కమనఁబడును. గంధముల కన్నిటికిని శుద్ధిసంస్కారములొనర్చెడి రీతులిదివఱకే చెప్పబడినవి. వాటినిరెట్టింపుగా చేసిన లక్ష్మీవిలాసతైలము సిద్ధమగును. ఇయ్యది తైలములన్నిటికంటె నుత్తమమైనది. పంచపల్లవముల కషాయముతో సాద్యపాకమును గంధోదకముతో రెండవపాకమును మఱల నాగంధోదకముతో గాని ధూపక్రియచేత గాని మూడవ పాకమును చేయవలయును.

ఇట్లు చక్రదత్తయందు వాతవ్యాధ్యధికార ప్రకరణము ముగిసెను.

## ౨౩. వాతరక్తాధికారము.



వాతరక్తమునందు సామాన్యోపాయములు.

శ్లో. బాహ్యం లేపాభ్యంగసేకో పానాహై ర్వాతశోణితమ్, విరేకస్థాపనస్నేహపానై ర్గంభీర మాచరేత్. 1. ద్వయో ర్ముంచే దసృక్ శృంగ శూచ్యలాబూజలౌకసా, దేశాద్దేశం వ్రజే త్స్రావ్యం సిరాభిః ప్రచ్ఛనేన వా. 2. అంగగ్లానౌ చ న స్రావ్యం రూక్షే వాతోత్తరే చ యత్, అమృతానాగరధన్యాక కర్షత్రయేణ పాచనం సిద్ధం. 3. జయతి సరక్తం వాతం సామం కుష్ఠా న్యశేషాణి, వత్సాద న్యుద్భవః క్వాథః పీతో గుగ్గులుసంయుతః. 4. సమీరణ సమాయుక్తం శోణితం సంప్రసాదయేత్, వాసా గుడూచి చతురంగులానా మేరండ తైలేన పిబే త్కషాయం, క్రమేణ సర్వాంగజ మప్య శేషం జయే దసృగ్వాతభవం వికారమ్. 5. లీఢ్వా ముండితికాచూర్ణ మధుసర్పిః సమన్వితం, ఛిన్నాక్వాథం పిబన్ హన్తి వాతరక్తం సుదుస్తరం. 6. త్రిఫలా పంచగుడేన పథ్యా, జగ్ధ్వా పిబే చ్ఛిన్నరుహాకషాయమ్. 7. తద్వాతరక్తం శమయ త్యుదీర్ణ, మాజానుసంభిన్న మపి హ్యపశ్యం. 8. ఘృతేన వాతం సగుడా విబద్ధం, పిత్తం సితాఢ్యా మధునా కఫం చ, వాతాసృగుగ్రం రుబుతైలమిశ్రా శుంఠ్యామవాతం శమయే ద్గుడూచీ.9.

బహిర్గతమగు వాతరక్తమును లేపనములు అభ్యంగములు సేకములు ఉపనాహములు వీటితోటి తొలగింపవలయును. అంతర్గతవాతరక్తమును విరేచనము స్థాపన వర్తి తైలపానము మున్నగువాని నాచరించి గంభీరముగా తొలగింపవలయును. రెండువిధములగు వాతరక్తములయందును కొమ్ము సూది జలగ మున్నగు వాని ద్వారా రక్తమును వెడలింప వలయును. లేక పోయిన యెడల నాడుల ద్వారా గాని ప్రచ్ఛనము వలన గాని శరీరమునుండి రక్తమును స్రవింప జేయవలయును. అంగములకు గ్లాని కలుగుట రూక్షత వాతాధిక్యము మున్నగునవి కలిగినపట్టుల రక్తము స్రవింపచేయరాదు. ఉసిరిక తుంగముస్తెలు కొతిమెర వీటిని పావుపావు చొప్పున తెచ్చి పాచనము చేసి సేవించిన యెడల వాతరక్తములను ఆమవాతములను సమస్తకుష్ఠరోగములను జయింపగలదు.

తిప్పతీగె తో పెట్టఁబడినకషాయములో గుగ్గిలమును కలిపికొని త్రాగినయెడల వాతరక్త రోగమును సాధించును. అడ్డసరము తిప్పతీగె అమ్లవేతసను నీటికషాయములో ఆముద మును కలిపికొని త్రాగవలయును. ఇయ్యది క్రమముగా సర్వాంగసంభవమగు వాతర క్తవికారములను జయించును. బోడతరము చూర్ణములో నేతిని తేనెనుకలిపి నాకి ఆపి మ్మట తిప్పతీగె కషాయమును త్రాగినయెడల సుదుస్తరమగువాతరక్తము నైనను పోగొ ట్టును. మూడుగాని లేక అయిదు గాని కరక్కాయలను బెల్లముతో చేర్చి తిని పిమ్మట తిప్పతీగె కషాయమును త్రాగినయెడల మోకాళ్లవఱకును వ్యాపించియున్నను వాతరక్త రోగమును అవశ్యముగా పోగొట్టును. నేతిలోచేర్చి తిప్పతీగెను సేవించినయెడల వాత రోగమును బెల్లముతో చేర్చి సేవించిన పట్టుకొనిపోవుటను చక్కెరతో చేర్చి సేవించిన పిత్తమును తేనెతో సేవించిన కఫమును ఆముదముతో సేవించిన నతిభయంకరమగు వాత రక్తరోగములను శొంఠితో చేర్చి సేవించిన ఆమవాతములను పోగొట్టును.

## గుడూచీస్వరసాదులు.

శ్లో. గుడూచ్యాః స్వరసం కల్కం చూర్ణం వా క్వాథమేవ వా, ప్రభూతకాల మాసేవ్య ముచ్యతే వాతశోణితాత్. 10. దశమూలీశృతం క్షీరం సద్యః శూలనివారణమ్, పరిషేకో నిలప్రాయే తద్వ త్కోష్ణేన సర్పిషా. 11. పటోలకటుకాభీరు త్రిఫలామృతసాధితమ్, క్వాథం పీత్వా జయే జ్జంతుః సదాహం వాతశోణితమ్. 12. గోధూమచూర్ణాజపయోఘృతం చ, సచ్ఛాగదుగ్ధోరుబుబీజకల్కః, లేపే విధేయం శతధౌతసర్పిః సేకే పయశ్చావిక మేవ శస్తమ్. 13. లేపః పిష్టా స్తిలా స్తద్వ, ద్భృష్టాః పయసి నిర్వృతాః కటుకామృతయష్ట్యాహ్వాంశుంఠీ కల్కం సమాక్షికమ్. 14. గోమూత్రపీతం జయతి సకఫం వాతశోణితమ్, ధాత్రీహరిద్రాముస్తానాం కషాయో వా కఫాధికే. 15. కోకిలాక్షామృతాక్వాథే పిబేత్కృష్ణాం కఫాధికే,పథ్యాభోజీ త్రిసప్తాహాన్ముచ్యతేవాతశోణితాత్. 16. కఫరక్తప్రశమనం హృద్యంగుడఘృతంస్మృతం, సంసర్గేషు యథోద్రేకం మిశ్రం వా ప్రతికారయేత్. 17. సర్వేషు సగుడాం పథ్యాం గుడూచీక్వాథ మేవ వా, పిప్పలీవర్ధమానంవా శీలయే త్సుసమాహితః. 18.

తిప్పతీగెరసమును గాని కల్కమును గాని చూర్ణమును గాని కషాయమును గా ని సేవించుటవలన వాతరక్తరోగమునుండి మనుజుఁడు విడివడును, దశమూలకషాయ

ములో పక్వముచేసినపాలు శూలలను పోగొట్టును. వాతాధిక్యముచేత నగు శూలలయం దు కొంచెము వెచ్చజేసి నేతిని పరిషేకము చేయవలయును. చేదుపొట్ల కటుకరోహిణి పిల్లపీచర త్రిఫలములు తిప్పతీగె వీటితో సిద్ధము చేయఁబడిన కషాయమును త్రాగి నేని దాహసహితమగు వాతరక్తము నుపశమింపగలుగును. గోధుమపిండి మేకపాలు మేకనేయి మేకపాలతో చేసిన ఆముదపుకల్కము ఇయ్యది వాతరక్తములయందు పథ్యములు. నూరుమారులు కాచి వడియకట్టిన నెయ్యి లేపమునకు హితకరము అగును. సేకమునందు మేకపాలు హితకరముఅగును. నువ్వులను నూరిగాని, వేయించి నీటిలో నాన్చిగాని లేపన చేయుటయును మంచిదే.

కటుకరోహిణి తిప్పతీగె యష్టిమధుకము మల్లంగి శొంఠి వీటికల్కములో తేనెను కలిపి ఆవుపంచితముతో త్రాగిన యెడల కఫసహితమగు వాతరక్తములను జయించును. లేనిచో ఉసిరిక పసపు తుంగముస్తెలు వీటికషాయమైనను వాతరక్తములయందు హితమును కలిగించును.

గొబ్బిగింజలు తిప్పతీగె వీటికషాయములో పిప్పళ్లను కలిపి వాతరక్తములయందు త్రాగవలయును. ఇరువది గింజలవఱకును కరక్కాయను సేవించిన మనుజుఁడు వాతరక్తమునుండి ముక్తుఁడగును. బెల్లముతో చేర్చిన నేతిని త్రాగిన కఫరక్తములు శాంతినొందును. సంసర్గములయందు వ్యాధియొక్క యుద్రేకము ననుసరించి గాని కలిపి గాని చికిత్స చేయవలయును. అన్నివిధములగు వాతరక్తములలోను గుడసహితముగా కరక్కాయను గాని తిప్పతీగె కషాయమును గాని పిప్పళ్లకషాయమును గాని సమాహితచిత్తుఁడై సేవింపవలయును.

## నవకార్షికక్వాథము.

శ్లో. త్రిఫలా నింబమంజిష్ఠా వచా కటుకరోహిణీ. 19. వత్సాదనీ దారునిశా కషాయో నవకార్షికః, వాతరక్తం తథాకుష్ఠం పామానం రక్తమండలమ్. 20. కుష్ఠం కాపాలికా కుష్ఠం పానాదేవాపకర్షతి, పంచరక్తికమాషేణ కార్యోయం నవకార్షికః. 21. కింత్వేవం సాధితే క్వాథే యోగ్యమాత్రా ప్రదీయతే,

త్రిఫలములు వేపచెక్క మంజిష్ఠము వస కటుకరోహిణి తిప్పతీగె మ్రానిపసపు వీటినన్నిటిని ఒక్కొక్క కర్షమంత తీసికొని కషాయమును చేయవలయును. వాతరక్తములు కుష్ఠరోగము పాము (అనగా) గజ్జి రక్తమండలకుష్ఠము, కపాలకుష్ఠము వీటిని ఈకషాయము పానమాత్రమున నే తొలగించును. ఇయ్యది నవకార్షకమను కషాయము. దీనిని

అయిదురతుల ప్రమాణముతో సగుమాషము చొప్పున చేయవలయును. ఈరీతిగా కాచిన కషాయమును వాతరక్తమునందు తగునన్ని మోతాదులు నిచ్చుచుండవలయును.

గుడూచీ ఘృతము

శ్లో. గుడూచీక్వాథకల్కాభ్యాం సపయస్కం శృతం ఘృతమ్, హన్తి వాతం తథా రక్తం కుష్ఠం జయతి దుస్తరమ్. 22.

తిప్పతీగెతోనైన కషాయము కల్కములతో పాలను నేతిని కలిపి పక్వము చేయవలయును. ఇది వాతరక్తములను భయంకరములగు కుష్ఠరోగములను జయించును.

శతావరీ ఘృతము.

శ్లో. శతావరీకల్కగర్భం రసే తస్యా శ్చతుర్గుణే, క్షీరతుల్యం ఘృతం పక్వం వాతశోణితనాశనమ్. 23.

పిల్లపీచరకల్కములో నాలుగురట్లు పిల్లపీచరరసములో పాలను నేయిని సమానభాగములనుగా కలిపి నేతిని పక్వము చేయవలయును. ఇయ్యది వాతరక్తములను నశింపఁజేయును.

అమృతాద్య ఘృతము.

శ్లో. అమృతా మధుకం ద్రాక్షా త్రిఫలా నాగరం బలా. 24. వాసాగ్వధవృశ్చీర దేవదారు త్రికంటకం, కటుకా సవరీకృష్ణా కాశ్మర్యస్య ఫలాని చ. 25. రాస్నాక్షురకగంధర్వ వృద్ధదారు ఘనోత్పలైః కల్కై రేభి స్సమైః కృత్వా సర్పిః ప్రస్థం విపాచయేత్. 26. ధాత్రీరససమం దత్వా వారి త్రిగుణసంయుతం, సమ్యక్సిద్ధం తు విజ్ఞాయ భోజ్యే పానే చ శస్యతే 27. బహుదోషాన్వితం వాతం రక్తేన సహమూర్ఛితమ్, ఉత్తానం చాపి గంభీరం త్రికజంఘోరుజానుజమ్. 28. క్రోష్టుశీర్షే మహాశూలే చామవాతే సుదారుణే, వాతరోగోపసృష్టస్య వేదనాం చాపి దుస్తరమ్. 29. మూత్రకృచ్ఛ్ర ముదావర్తప్రమేహం విషమజ్వరమ్, ఏతా స్సర్వా న్నిహం త్యాశు వాతపిత్తకఫోత్థితాన్. 30. సర్వకాలోపయోగేన వర్ణాయుర్బలవర్ధనమ్, అశ్విభ్యాం నిర్మితం శ్రేష్ఠం ఘృత మేత దనుత్తమమ్. 31.

తిప్పతీ యష్టిమధుకము ద్రాక్ష త్రిఫలములు శొంఠి ముత్తువపులగముఅడ్డసరము ఆకచెక్క శొంఠి దేవదారువు పల్లేరు కటుకరోహిణి కసివింద పిల్లపీచర పిప్పళ్లు

గుమ్మడి పన్నరాష్ట్ర పల్లేరు తెల్లఅముదపువేళ్లు తుంగముస్తెలు తెల్లకమలములు వీటిని సమానభాగములుగా తెచ్చి కల్కము చేసి 16 పలముల నేతిని పక్వము చేయవలయును కాని ఉసిరికరసము 16పలములును నీళ్లు 48పలములును చేర్చి బాగా పాకముఅయిన పిమ్మట పరీక్షించి అన్నము తినునప్పుడును త్రాగెడి నప్పుడు నుపయోగింపవలయును. అనేక దోషములతో గూడిన వాతరోగములను రక్తముతో కలిసిన వానిని ఉత్తానవాతమును కటిస్థలములయందును పిక్కలయందును తొడలయందును పుట్టెడివాతములను పోఁగొట్టును.

క్రోష్టు శీర్షములయందును శూలలయందును భయంకరములగు నామవాతములయందును వాతరోగములగలవానికిని సహింపరాని వేదనను పోఁగొట్టి గుణమును కలిగించును. మూత్రకృచ్ఛ్రము ఉదావర్తము ప్రమేహము విషమజ్వరము వాతపిత్తకఫములవలనఁ గలిగెడి జ్వరములను పోఁగొట్టును. దీనిని అన్నిసమయములందు నుపయోగించిన మంచికాంతిని వయస్సును బలమును వృద్ధినొందించును. ఇయ్యది అశ్వినీదేవతలచేత నిర్మింపఁబడిన యత్యుత్తమమగు ఘృతము శ్రేష్ఠమైనది.

### దశపాకబలాతైలము.

శ్లో. బలాకషాయకల్కాభ్యాం తైలం క్షీరచతుర్గుణమ్, దశపాకం భవే దేత ద్వాతాసృ గ్వాతపిత్తజిత్. 32. ధన్యం పుంసవనం చైవ నరాణాం శుక్రవర్ధనమ్, రేతో యోని వికారఘ్న మేత ద్వాతవికారనుత్. 33.

ముత్తువపులగమును కషాయమునుగాను కల్కమును గాను చేసి అంతకు నాలుగురెట్లు తైలమును పాలను కలిపి పక్వము చేయవలయును. ఇట్లు ఇది దశపాకమైన ముత్తువపులగపు తైలమగును. ఇయ్యది వాతరక్తములను వాతపిత్తములనుపోఁగొట్టును. ధన్యమగు పుంస్త్వము నిచ్చును. రేతస్సును వృద్ధి నొందించును. వీర్యవికారములను యోనివికారములను పోఁగొట్టును. మఱియు నియ్యది వాతవికారములను పోఁగొట్టును.

### గుడూచ్యాదితైలము.

శ్లో. గుడూచీక్వాథదుగ్ధాభ్యాం తైలం లాక్షారసేన వా, సిద్ధం మధుకకాశ్మర్యరసై ర్వా వాతరక్తనుత్. 34.

తిప్పతీగె కషాయము పాలు గాని లక్కరసమునుగాని యష్టిమధుకము గుమ్ముడు రసమునుగాని చేర్చి సిద్ధము చేసినతైలము వాతరక్తములను పోఁగొట్టును.

### ఖుజ్జాకపద్మకతైలము.

శ్లో. పద్మకోశీరయష్ట్యాహ్వా రజనీ క్వాథసాధితమ్, స్యాత్పిష్టైః సర్జమంజిష్ఠా వీరా కాకోలి చందనైః. 35. ఖుజ్జాకపద్మక మిదం తైలం వాతాస్రదోషనుత్.

పద్మాక్షము వట్టివేళ్లు యష్టిమధుకము పసపు వీటికషాయములో మద్ది చెక్క మంజిష్ఠము కాకోలి చందనము వీటికల్కమును కలిపి తైలమును సిద్ధము చేయవలయును. ఇయ్యది వాతరక్తదోషములను పోఁగొట్టును. ఇది ఖుజ్జాకపద్మకతైల మనఁబడును.

### పెద్దముత్తువపులగపుతైలము.

శ్లో. శుద్ధాం పచే న్నాగబలాతులాం తు, విస్రావ్య తైలాఢక మత్ర దద్యాత్, అజాపయస్తుల్యవిమిశ్రితం తు, న తస్య యష్టీమధుకస్య కల్కమ్. 36. పృథక్పచే త్పంచపలం విపక్వం, తద్వాతరక్తం శమయ త్యుదీర్ణమ్, వస్తిప్రదానా దిహ సప్తరాత్రా, త్పీతం దశాహా త్ప్రకరో త్యరోగమ్, తులా ద్రవ్యే జలద్రోణో ద్రోణే ద్రవ్యతులా మతా.

పెద్దముత్తవపులగమును శుద్ధిచేసి 400 తులములు తెచ్చి రసము తీసి దానిలో 64 పలముల నూనెను కలిపి 64 పలముల మేకపాలను తెచ్చి తగరమును ముత్తువపులగమును వేరువేరుగా అయిదైదు పలముల కల్కమును చేసి పక్వము చేసి సేవించవలయును. ఇయ్యది పెచ్చుపెరిగిన వాతరక్తములను కూడ శాంతి నొందించును. వస్తులమూలముగా దీనిని ఉపయోగపెట్టుటవలన ఏడురాత్రులలోను త్రాగుటవలన పదిదినములలోను రోగములను తొలఁగించివైచును. ఇచ్చట తులపరిమితమగు ద్రవ్యమునందు ఒక ద్రోణమునీరును ద్రోణము నీటిలో నొక తులద్రవ్యమును చేర్చదగునని సంప్రదాయము.

### పిండతైలము.

శ్లో. సమధూచ్ఛిష్ట మంజిష్ఠం ససర్జరసశారివమ్, పిండతైలం తదభ్యంగా ద్వాతరక్తరుజాపహమ్. 38.

తేనెమైనము మంజిష్ఠము సజ్జరసము సుగంధిపాల వీటిలో తైలమును పక్వము చేయవలయును. ఇయ్యది పిండతైలమనఁబడును. దీనిని రుద్దినయెడల వాతరక్తపు దోషము లన్నియును నశించిపోఁగలవు.

### మహాపిండతైలము.

శ్లో. శారివా సర్జ మంజిష్ఠా యష్టీసిక్థైః పయోన్వితైః, తైలం పక్వం విముంచేత్తు రుభోర్వా వాతరక్తనుత్.

సుగంధిపాల సర్జరసము మంజిష్ఠ యష్టిమధుకము మైనము వీటిలోగాని మంజిష్ఠ లేకుండ తక్కినవానిలో ఆముదపువిత్తనములను చేర్చిగాని పాలను గలిపి తైలముం బోసి పక్వము చేసి యుపయోగించిన వాతరక్తగులు తొలంగి పోవును. ఇయ్యది మహాపిండతైలము.

### కైశోరకగుగ్గులము.

శ్లో. వరమహిషలోచనోదర సన్నిభవర్ణస్య గుగ్గులోః ప్రస్థమ్, ప్రక్షిప్య తోయరాశౌ త్రిఫలాం చ యథోక్త పరిమాణామ్. 40. ద్వాత్రింశచ్ఛిన్నరుహా పలాని దేయాని యత్నేన, విపచేత్తదప్రమత్తో దర్వ్యా సంఘట్టయన్ముహుర్యావత్. 41. అర్ధక్షయితం తోయం జాతం జ్వలనస్య సంపర్కాత్, అవతార్య వస్త్రపూతం పునరపి సంపాదయేత్పాత్రే. 42. సాంద్రీభూతే తస్మిన్నవతార్య హిమోపలే ప్రస్థే, త్రిఫలాచూర్ణార్ధపలం త్రికటోశ్చూర్ణం షడక్షపరిమాణమ్. 43. క్రిమిరిపుచూర్ణార్ధపలం కర్షంకర్షం త్రివృద్దంత్యోః, పల మేకం చ గుడూచ్యాః, దత్వా సంమూర్ఛ్య యత్నేన. 44. ఉపయుజ్య చానుపానం యూషం తోయంసుగంధి సలిలేన, ఇచ్ఛాహారవిహారీ భేషజ ముపయుజ్య సర్వకాలమిదం. 45. తనురోధివాతశోణిత మేకజ మథ ద్వంద్వజం చిరోత్థం చ, జయతి స్రవతం పరిశుష్కం స్ఫుటితంచాజానుజంచాపి. 46. వ్రణకాసకుష్ఠగుల్మం శ్వయథూదర పాండు ప్రమేహాంశ్చ, మందాగ్నించ విబద్ధం ప్రమేహపిడకాశ్చ నాశయత్యాశు. 47. సతతం నిషేవ్యమాణః కాలవశాద్ధన్తి సర్వగదాన్, అభిభూయ జరాదోషం యాతిహి కైశోరకం రూపమ్. 48. ప్రత్యేకం త్రిఫలా ప్రస్థో జలం తత్ర షడాఢకం, గుడవద్గుగ్గులోః పాకః సుగంధస్తు విశేషతః. 49.

మంచి గేదెకన్నువలెను పొట్టవలెను మిసమిసలాడెడు గుగ్గిలమును 16పలములు తేవలయును. 64 పలములనీటిలో నాగుగ్గులమును త్రిఫలములును పడవేయవలయును.

మఱియు నందు 32 పలముల తిప్పతీగెరసమును చేర్చి సావధానముగా గూర్చుండి యప్రమత్తుఁడై కలియఁబెట్టుచు పక్వము చేయవలయును. అగ్నిసంపర్కమున సగమునీళ్లు ఇనికినపిమ్మట దింపి వడియగట్టి మఱల పాత్రలోవైచి నుడుక బెట్టవలయును. బాగుగా గట్టిపాఁకనపిమ్మట 16 పలముల కర్పూరమ్మును కలిపి అందు త్రిఫలముల చూర్ణమును అర్థపలమును శొంఠి మిరియములు పిప్పళ్లు పీటిచూర్ణము నొకటిన్నర పలమును వాయువిడంగముల చూర్ణమును అరపలమును తెల్లతెగడను కాలుపలమును దంతిద్వయమును పావుపలమును తిప్పతీగె నొకపలమును కలిపి చక్కగా పక్వము చేసి సుగంధము గల నీళ్ళను గంజిని అనుపానముగా నుంచి యుపయోగింపవలయును. ఈయౌషధమును సేవించి ఇచ్ఛవచ్చినట్లు ఆహార విహారముల ననుభవింపవలెను. ఇయ్యది శరీరము నడ్డగించెడి వాతరక్తరోగమును ఏకజద్వంద్వజము లగురోగములను చిరకాలమునుండి పుట్టినరోగమును స్రవించునట్టివియును ఎండినట్టివియును బద్ధలైనట్టివియును జానువుల వఱకు గలిగినట్టివియునగు వాతరక్తములనుపోఁగొట్టును. గాయములు దగ్గు కుష్ఠు గుల్మము వాపు ఉదరరోగము పాండురోగము మేహరోగము అగ్నిమాంద్యము వంధ్యాత్వము మేహాప్లీడ పీటిని పోఁగొట్టును. నిరంతరమును సేవించెదరేని అన్నిరోగముల నియ్యది పోఁగొట్టగలదు. ముసలితనమును తొలఁగించి కిశోరరూపము నొసంగును. కరక్కాయలు 16 పలములును ఉసిరిక 16 పలములును తాడి 16 పలములను 434 పలముల నీటిలో బెల్లమునువలెనే గుగ్గులమునుకూడ పక్వముచేయవలయును. విశేషమిందు సుగంధవస్తువుల చేర్చుటమాత్రమే.

## అమృతాద్యగుగ్గులము.

శ్లో. ప్రస్థమేకం గుడూచ్యాస్తు అర్ధప్రస్థం చ గుగ్గులోః, ప్రత్యేకం త్రిఫలాయా శ్చ తత్ప్రమాణం వినిర్దిశేత్. 50. సర్వ మేకత్ర సంక్షుద్య సాధయే త్త్వర్మణేఽమ్భసి, పాదశేషం పరిస్రావ్య పున రగ్నావధిశ్రయేత్. 51. తావ త్పచే త్కషాయం తు యావ త్సాంద్రత్వమాగతమ్, దంతీవ్యోషవిడంగాని గుడూచీ త్రిఫలాత్వచః. 52. తత శ్చార్ధపలం పూతం గృహ్ణీయా చ్చ ప్రతిప్రతి, కర్షం తు త్రివృతాయా స్తు సర్వ మేకత్ర కారయేత్. 53. తస్మి న్సుసిద్ధం విజ్ఞాయ కవోష్ణే ప్రక్షిపే ద్బుధః, తత శ్చాగ్నిబలం జ్ఞాత్వా తస్యమాత్రాం ప్రదాపయేత్. 54. వాతరక్తం తథా కుష్ఠం గుదజా న్యగ్నిసాదనం, దుష్టవ్రణ ప్రమేహాం శ్చ సామవాతం భగందరం, 55, నాడ్యాఢ్యవాతశ్వయ

ధూర్ణాన్సర్వాన్ నేతాన్వ్యపోహతి, అశ్విభ్యాం నిర్మితః పూర్వ మమృతాఖ్యో హి గుగ్గులుః. 56. అర్ధప్రస్థం త్రిఫలాయాః ప్రత్యేక మిహ గృహ్యతే.

తిప్పతీగె 16 పలములును గుగ్గులము 8 పలములును కరక్కాయలు 8 పలములును తాడి 8 పలములును ఉసిరిక 8 పలములును వీటిని తెచ్చి ఒకటిగాచేర్చి నూరి 231 పలముల నీటిలో పక్వము చేయవలయును. నాల్గవపాలునీరు మిగిలి యున్నప్పుడు పడియకట్టి మరల నానీటిని నిప్పుపైపెట్టి గట్టిపడునంతవఱకును కాచి దంతీద్వయము శొంఠి మిరియములు పిప్పళ్లు వాయువిడంగములు తిప్పతీగె త్రిఫలముల బెరడు వీటినన్నిటిని అర్ధ పలము చొ. తెల్లతెగడ పావుపలము తెచ్చి అన్నిటిని నొకటిగా చేయవలయును. శుద్ధిచేసి పిమ్మట కొద్దిపాటివెచ్చన యుండగా వేయవలయును. తరువాత జఠరాగ్ని కనుసారముగా మాత్రలను గట్టి ఇచ్చుచుండవలయును. ఇయ్యది వాతరక్తమును కుష్ఠురోగమును ఉదరరోగములను అగ్నిమాంద్యమును దుష్టవ్రణములను ప్రమేహములను ఆమవాతములను భగందరములను నాడివాతమును ఆఢ్యవాతమును వాపును మఱియు నన్నివిధములగు రోగములను పోగొట్టును. ఈయమృతాదిగుగ్గులుముపూర్వము అశ్వినీదేవతలచేతను సృజింపఁబడినయది. ఈగుగ్గులము నిర్మాణకాలమునందు వేర్వేరుగా త్రిఫలములను అర్ధప్రస్థమును గ్రహింపవలయును.

## అమృతగుగ్గులము.

శ్లో. అమృతాయాశ్చ ద్విప్రస్థం ప్రస్థమేకం చ గుగ్గులోః, ప్రత్యేకం త్రిఫలాప్రస్థం వర్షాభూప్రస్థ మేవ చ. 57. సర్వ మేకత్ర సంక్షుద్య క్వాథయే ల్లవణేంభసి, పునఃపచే త్పాదశేషం యావ త్సాంద్రత్వ మాగతం. 58. దంతీచిత్రకమూలానాం కణావిశ్వఫలత్రికం, గుడూచీ త్వగ్విడంగానాం ప్రత్యేకార్ధపలోన్మితం. 59. త్రివృతాకర్ష మేకం తు సర్వ మేకత్ర చూర్ణయేత్, సిద్ధే చోష్ణే క్షిపే త్తత్ర త్వమృతా గుగ్గులోః పరం. 60. యథావహ్ని బలం ఖాదే దమ్లపిత్తే విశేషతః, వాతరక్తం తథా కుష్ఠం గుదజా న్యగ్నిసాదనం. 61. దుష్టవ్రణప్రమేహాంశ్చ సామవాతం భగందరం, నాడ్యాఢ్యవాత శ్వయథూన్ హన్యా త్సర్వామయా నయం. 62. అశ్విభ్యాం నిర్మితో హ్యేషో ఽమృతాఖ్యో గుగ్గులుః పురా.

తిప్పతీగె రెండుప్రస్థములు గుగ్గిలమొక ప్రస్థము వేర్వేరుగా త్రిఫలను లో కొక్కొక్క ప్రస్థము గలిజేరు ఒక ప్రస్థము వీటినన్నిటిని చూర్ణముచేసి ఉప్పునీటిలో వైచి కాచవలయును. నాలవపాలు మిగిలియుండునంతవఱకును గట్టిపడునంతవఱకును పక్వముచేయుచునే యుండవలయును. దంతీద్వయము చిత్రమూలము మునగచెక్క పిప్పళ్లు శొంఠి కరక్కాయలు తాడి యుసిరికలు తిప్పతీగె లవంగపుపట్ట వాయువిడంగ ములు వీటినన్నిటిని అర్థపలము చొప్పునను తెల్లతెగడ పావుపలము చొప్పునను కలిపి చూర్ణముచేసి సిద్ధమైన పిమ్మట కొంచెము వెచ్చఁజేసి అమృతాగుగ్గులు కల్కమును ఇందు కలపవలయును. ఆపిమ్మట జఠరాగ్ని ననుసరించి దీనిని భక్షించుచుండవలయును. అమ్లపిత్తముగలవాఁడధికముగా దీని భక్షింపవలయును. ఇయ్యది వాతరక్తమును కుష్ఠును అగ్నిమాంద్యమును దుష్టవ్రణములను మేహములను ఆమవాతములను భగందరములను నాడీవాతమును ఆఢ్యవాతమును వాపును మున్నగు నన్నిరోగములను నశింపజేయును. ఇయ్యది అమృతగుగ్గులము. పూర్వ మిది అశ్వినీకుమారులచేత రచింపఁబడినది ఉత్తమ మైనది.

## యోగసారామృతము.

శ్లో. శతావరీ నాగబలా వృద్ధదారక ముచ్చటాః. 63. పునర్నవా మృతా కృష్ణా వాజిగంధా త్రికంటకమ్, పృథక్ద్విపలా న్యేషాం శ్లక్ష్ణం చూర్ణాని కారయేత్. 64. తదర్థం శర్కరాయుక్తం చూర్ణం సమ్మర్దయే ద్బుధః, స్థాపయే త్సుదృఢే భాండే మధ్వాఢకసంయుతం. 65. ఘృతప్రస్థే సమాలోడ్య త్రిసుగంధిపలేన తు, తం ఖాదే ద్దిష్టచేష్టాన్నో యథావహ్నిబలం నరః. 66. వాతరక్తం క్షయం కుష్ఠం కార్శ్యం పిత్తాస్రసంభవం, వాతపిత్తకఫోత్థాం శ్చ రోగా నన్యాం శ్చ తద్విధాన్. 67. హత్వా కరోతి పురుషం వలీపలితవర్జితం, యోగసారామృతో నామ లక్ష్మీకాంతివివర్ధనః. 68. దివాస్వప్నాగ్నిసంతాపం వ్యాయామం మైథునం తథా, కటూష్ణగుర్వభిష్యంది లవణామ్లాని వర్జయేత్. 69.

పిల్లపీచర పెద్దముత్తవపులగము పెద్దకచోరము నేలయుసిరిక గలిజేరు తిప్పతీగె పిప్పళ్లు పెన్నేరు పల్లేరు వీనిని ప్రత్యేకముగా పదిపలములచొ॥ తెచ్చి చూర్ణము నుచేసి అందులో సగమును కండచక్కెరతోకలిపి మర్దనమును చేయవలయును. పిమ్మట అర్థాఢకము తేనెనుపోసి గట్టిపాత్రలోవైచి యుంచవలయును. తరువాత 16 పల

ముల నేతిలో వైచి కలియఁబెట్టి లవంగపుపట్ట ఏలకులు జాపత్రి వీటినొక్కొక్కపల ముచొ॥ కలిపి జఠరాగ్ని ననుసరించి భుజింపవలయును. ఇది వాతరక్తము కుష్ఠు క్షయ కృశించుట రక్తపిత్తజనితములగు రోగములు వాతరోగములు పిత్తరోగములు కఫరోగములు ఇతర రోగములు వీటినిపోఁగొట్టును. మనుజుని ముసలితనమును తలనెఱుపును లేని వానినిగా జేయును. ఇయ్యది యోగసారామృతమను పేరుగలది. ఈగుగ్గులువు లక్ష్మిని కాంతిని పెంపొందించును. దీనినిసేవించునప్పుడు పగలుపరుండుట పెగనుకూర్చుండుట కసరతుచేయుట మైథునముచేయుట చేదు వేడి బలువు పులుపు గలపదార్థములను తినుట వీటిని వర్జింపవలెను.

ఇట్లు చక్రదత్తయందు వాతరక్తాధికారప్రకరణము ముగిసెను.

---

# ౨౮. ఊరుస్తంభాధికారము.

ఊరుస్తంభమునందు సామాన్యోపాయములు.

శ్లో. శ్లేష్మణః క్షపణం యత్స్యాన్న చ మారుతకోపనం, తత్సర్వం సర్వదా కార్య మూరుస్తంభస్య భేషజం. 1. తస్య న స్నేహనం కార్యం న వస్తి ర్నచ రేచనం, సర్వోరూక్షః క్రమః కార్యస్తత్రాదౌ కఫనాశనః. 2. పశ్చాద్వాతవినాశాయ కృత్స్నః కార్యః క్రియాక్రమః, శిలాజతుం గుగ్గులుం వా పిప్పలీ మథ నాగరమ్. 3. ఊరుస్తంభే పిబేన్మూత్రైర్దశమూలీరసేన వా, భల్లాతకామృతాశుంఠీ దారు పథ్యా పునర్నవాః. 4 పంచమూలీద్వయోన్మిశ్రా ఊరుస్తంభనిబర్హణాః, పిప్పలీపిప్పలీమూల భల్లాతక్వాథ ఏవ వా. 5. కల్కో వా సమధుర్దేయః ఊరుస్తంభవినాశనః, త్రిఫలా చవ్య కటుక గ్రంథికం మధునా లిహేత్. 6. ఉరుస్తంభవినాశాయ పురం మూత్రేణ వా పిబేత్, లిహ్యాద్వా త్రిఫలాచూర్ణం క్షౌద్రేణ కటుకాయుతం. 7. సుఖాంబునా పిబేద్వాపి చూర్ణం షట్ధరణం నరః, పిప్పలీవర్ధమానం వా మాక్షికేణ గుడేన వా. 8. ఊరుస్తంభే ప్రశంసన్తి గండీరారిష్ట మేవ వా, చవ్యాభయాగ్నిదారూణాం సమధుస్స్యాదూరుసంగ్రహే. 9. కల్కాదిహేచ్చమూ

త్రాఢ్యైః కరంజఫలసర్షపైః, క్షౌద్రసర్షపవల్మీక మృత్తికాసంయుతం భిషక్. 10. గాఢ ముత్సాదనం కుర్యా దూరుస్తంభే ప్రలేపనం, కఫక్షయార్థం వ్యాయామే ష్వేనం శక్త్యేషు యోజయేత్. 11. స్థలా న్యాక్రామయే త్కల్కం ప్రతిస్రోతో నదీం తరేత్, పలాభ్యాం పిప్పలీమూల నాగరా దష్టకట్వరః. 12.

శ్లేష్మమును పోఁగొట్టునదియును, వాయువును ప్రకోపింపఁజేయనిదియు నగు యథాపథ్యమునంతను ఊరుస్తంభమునకు ప్రయోగింపవలయును. ఊరుస్తంభనగల రోగికి స్నేహనము గాని వస్తికర్మ గాని రేచనము గాని చేయరాదు. రూక్ష చికిత్సలనే యన్నిటిని చేయుచుండవలయును. అందునను కఫనాశక చికిత్సలను చేయవలయును. ఆపిమ్మట వాతము నశించుటకై క్రియా క్రమము నంతయును జతిపింపవలసినదియే. శిలాజిత్తు గుగ్గులుము పిప్పళ్లు శొంఠి వీటిని ఆవుపంచితములో గాని దశమూలముల రసముతో గాని ఊరుస్తంభముగలవాడు సేవింపవలయును. నల్లజీలకర్ర చిత్రమూలము శొంఠి దేవదారువు కరక్కాయలు గలిజేరు దశమూలములు వీటితో కషాయము చేసి పుచ్చుకొనిన యూరుస్తంభములు నశించును. పిప్పళ్లు మోడి నల్లజీడివిత్తనములు వీటికషాయము నందు గాని కల్కమునందుగాని తేనెను కలిపి యిచ్చినయెడల ఊరుస్తంభములు నశించును. నెమలియడుగువేళ్లు త్రిఫలములు ఆవాలు వీటిని ఆవుపంచితముతో నూరి పట్టువేసినను సేకము చేసినను ఊరుస్తంభములు నశించిపోగలవు. తేనెయును ఆవాలును పుట్టమట్టియును వీటితో లేపనమును చేసిన ఊరుస్తంభములు తగ్గిపోవును. కఫము తగ్గిపోవుట కొఱకై కసరతులయం దీరోగిని ప్రవేశపెట్టవలయును. ఏటికెదురుగా నీదింపవలయును.

## అష్టకట్వర తైలము.

శ్లో. తైలప్రస్థః సమోదధ్నా గృధ్రస్యాగుగ్రహాపహః, అష్టకట్వర తైలేఽత్ర తైలం సార్షప మిష్యతే. 13. కుష్ఠశ్రీవేష్ట కోదీచ్యం సరళం దారు కేసరం, అజగంధా ఽశ్వగంధా చ తైలం తై స్సార్షపం పచేత్. 14. సక్షౌద్రం మాత్రయా తస్మా దూరుస్తంభార్దితః పిబేత్, సైంధవాద్యం హితం తైలం వర్షాభ్వమృతగుగ్గులుః. 15.

పిప్పలి మోడి శొంఠి ఒక్కొక్క పలమును పెరుగు 8 పలములును తైలము నెన్నిదిపలములును కలిపి ఈతైలమును సిద్ధము చేసి యుపయోగించినచో గృధ్రసియును ఊరుస్తంభమును నశించును. ఈయష్టకట్వరతైలమునందు ఆవనూనెనే పోయవలయును.

కోష్ఠ శ్రీవేష్టధూపము తుంగముస్తలు సరళము దేవదారువు కేసరి తులసి పెన్నేరు వీటియొక్కకల్కముతో ఆవనూనెను పక్వము చేయవలయును. తేనెతోకలిపిన మాత్రలతో నూరుస్తంభరోగము గలవాడు త్రాగవలయును. లేకపోయినచో సైంధవాద్యతైలమునుగాని పుర్ణవాతైలమునుగాని అమృతగుగ్గులునుగాని సేవించిన హితమగును.

ఇట్లు చక్రదత్తయందు ఊరుస్తంభాధికారప్రకరణము ముగిసెను.

## ౨౫. ఆమవాతాధికారము.

రాస్నాదశమూలకము.

శ్లో. లంఘనం స్వేదనం తిక్తం దీపనాని కటూని చ, విరేచనం స్నేహపానం వస్తయ శ్చామమారుతే. 1. సైంధవాద్యే నానువాస్య క్షారవస్తిః ప్రశస్యతే, ఆమవాతే పంచకోలసిద్ధం పానాన్న మిష్యతే. 2. రూక్షః స్వేదో విధాతవ్యో వాలుకాపుటకై స్తథా, శఠీశుంఠ్యభయా చోగ్రా దేవాహ్వాతివిషాఽమృతా. 3. కషాయ మామవాతస్య పాచనం రూక్షభోజనం, శఠీవిశ్వౌషధీకల్కం వర్షాభూకాథసంయుతమ్. 4. సప్తరాత్రం పిబే జ్జంతు రామవాత వినాశనమ్, దశమూలామృతైరండ రాస్నానాగరదారుభిః. 5. క్వాథోగుబూకతై లేన సామం హ న్త్యనిలం గురుమ్.

లంఘనము చెమట పట్టుట కటుపదార్థసేవనము దీపనపదార్థములు కటువులగు నౌషధములు విరేచనములు తైలసేవనములు ఇవియన్నియును ఆమవాతమునందు హితకరములు. సైంధవాదితైలముచేత ననువాసితమగు క్షారవస్తి యుత్తమము. ఆమవాతమునందు పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి నీటితో చేయఁబడిన కషాయపానమును అన్నమును హితములు. ఆమ్లవాతమునందు ఇసుకపొట్లముల వలన చెమట పట్టించుట యుత్తమము. శొంఠి కరక్కాయలు వస దేవదారు అతివస తిప్పతీగె వీటి కషాయమును రూక్షభోజనమును ఆమవాతమును అణగించును. కచ్చూరము శొంఠి వీటి కల్కమును శొంఠి కషాయములో కలిపి 7రోజులు సేవించిన ఆమవాతము పక్వమగును. దశమూలములు తిప్పతీగె ఏరండము సన్నరాస్న శొంఠి దేవదారు వీటికషాయమును ఆముదముతో కలిపి త్రాగినయెడల భయంకరములగు నామవాతములును నశించిపోఁగలవు.

### రాస్నాపంచకము.

శ్లో. దశమూలీకషాయేణ పిబే ద్వా నాగరాంభసా. 6. కుక్షి వస్తి కటీశూలే తైల మేరండసంభవమ్, రాస్నాం గుడూచీ మేరండం దేవదారు మహౌషధమ్. 7. పిబే త్సర్వాంగికే వాతే సామే సంధ్యస్థిమజ్జగే.

ఆముదమును దశమూలముల కషాయముతో గాని శొంఠి కషాయముతో గాని సేవించిన కుక్షి వస్తిశూలసంబంధములగు శూలలయందు హితకరము. సన్నరాస్న తిప్పతీగ దేవదారు వీటికషాయమును సంధులు ఎముకలు మజ్జ వీటియందు గలవాతరోగము లందును ఆమవాతము నందును సర్వాంగవాతము నందును సేవింపవలయును.

### రాస్నాసప్తకము.

శ్లో. రాస్నామృతారగ్వధ దేవదారు త్రికంటకైరండ పునర్ణవానాం, క్వాథం పిబే న్నాగరచూర్ణమిశ్రం జంఘోరుపృష్ఠత్రికపార్శ్వశూలీ. 8.

సన్నరాస్న తిప్పతీగ దేవదారువు త్రికంటకములు ఆముదము గలిజేరు కషాయమునందు శొంఠిచూర్ణమును కలిపి జంఘావాతము పృష్ఠవాతము ఊరువాతము నడుము ప్రక్కలనొప్పులు వీటియందు త్రాగవలయును.

### వైశ్వానర చూర్ణము.

శ్లో. శుంఠీగోక్షురకక్వాథః ప్రాతః ప్రాత ర్నిషేవితః, సామవాతే కటీశూలే పాచనో రుక్ప్రణాశనః. 9. ఆమవాతే కణాయుక్తం దశమూలరసం పిబేత్, ఖాదే ద్వా పృథయా విశ్వం గుడూచీం నాగరేణ వా. 10. ఏరండతైలసంయుక్తాం హరీతకీం భక్షయే న్నరో విధివత్, ఆమానిలార్తియుక్తో గృధ్రసీవృద్ధిపీడితో నిత్యమ్. 11. కర్షం నాగరచూర్ణస్య కాంజికేన పిబే త్సదా, ఆమవాతప్రశమనం కఫవాతహరం పరం. 12. పంచకోలకచూర్ణం చ పిబే దుష్ణేన వారిణా, మందాగ్నిశూలగుల్మామ కఫారోచకనాశనమ్. 13. అమృతానాగరగోక్షుర ముండతికావరుణకైః కృతం చూర్ణమ్, మస్తూ రనాలపీత మామానిలనాశనం ఖ్యాతం. 14. మణిమంథస్య భాగౌ ద్వౌ యమాన్యా

స్తద్వ దేవ తు, భాగా స్త్రయోజమోదాయా నాగరా ద్భాగపంచ
కం. 15. దశ గ్ద్వ చ హరీతక్యాః శ్లక్ష్ణచూర్ణీకృతాః శుభాః, మస్త్వ
రనాలతక్రేణ సర్పిషోష్ణోదకేన వా. 16. పీతః జయ త్యామవాతగు
ల్మం హృ ద్వస్తిజా న్గదాన్, ప్లీహానం హ న్తి శూలాదీ. నానాహం గు
దజాని చ. 17. విబంధం జాఠరా న్రోగాం స్తథా వై హ స్తపాదజాన్,
వా తానులోమన మిదం చూర్ణం వైశ్వానరం స్మృతమ్. 18.

శొంఠి గలిజేరు వీటికషాయమును ప్రాతఃకాలమునందు సేవించినయెడల నామవా
తము కటిశూల వీటినిపచనము నకు తెచ్చి పోగొట్టును. ఆమవాతమునందు పిప్పళ్లతో
దశమూలముల రసమును త్రాగవలయును. కరక్కాయ శొంఠిని గాని తిప్పతీగెను
శొంఠనిగాని తినవలయును. ఆముదములో కరక్కాయను చేర్చి యథావిధిగా ఆమ
వాతము గృధ్రసీ వీటిచేత పీడితుడైనవాడు సేవింపవలయును. ఒకతులము శొంఠి
పొడిని గంజిలో వేసికొని త్రాగిన ఆమవాతములు శాంతించును. కఫవాతములు తప్పక
పోవును. పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి వీటిచూర్ణమును వేడి
నీళ్లతో త్రాగిన అగ్నిమాంద్యము శూలరోగము ఆమవాతము కఫము అరోచకమును
నశించును. తిప్పతీగె శొంఠి గలిజేరు బోడసరము, ఉలిమిరి వీటిచూర్ణమును మజ్జిగ తే
టతో గాని గంజితో గాని కలిపి త్రాగిన ఆమవాతములు నశించునందురు. సైంధవలవ
ణము రెండు భాగములును కరక్కాయలు 12 భాగములును కలిపి చూర్ణముచేసి
మజ్జిగతేట మంచినీరు గంజి వేడినీళ్లు వీటితో త్రాగవలయును. ఇట్లుచేసిన ఆమవాతము
గుల్మరోగము హృద్రోగము వీటిని నశింపజేయును. వంధ్యారోగము వస్తిగతరోగము
హస్తరోగము పక్షిరోగము మున్నగు వానిని పోగొట్టును. ఈవైశ్వానరచూర్ణము వాత
మును వంచివేయును.

## అలంబుషాచూర్ణము.

శ్లో. అలంబుషాం గోక్షురకం గుడూచీం వృద్ధదారకమ్. 19.
పిప్పలీం త్రివృతాం ముస్తం వరుణం సపునర్నవమ్, త్రిఫలాం నాగరం
చైవ సూక్ష్మచూర్ణాని కారయేత్. 20. మస్త్వారనాలతక్రేణ పయో
మాంసరసేన వా, ఆమవాతం సిహ న్త్యాశు శ్వయథుం సంధిసం
స్థితమ్. 21.

అలంబుష- అనగా బోడతరము- పల్లేరు తిప్పతీగె వీటిని కలిపి తెగడ పిప్పళ్లి
తుంగముస్తలు ఉలిమిరి గలిజేరు త్రిఫలములు శొంఠి వీటిచూర్ణమును గంజి మజ్జిగతేట

పాలు మున్నగువానిలో దేనితోనైన గాని సేవించిన ఆమవాతము సంధులలోని వాపు నశించిపోవును.

## హింగ్వాదిచూర్ణము.

శ్లో. శతపుష్పావిడంగ శ్చ సైంధవం మరిచం సమమ్, చూర్ణ ముష్ణాంబునా పీత మగ్నిసందీపనం పరమ్. 22. హింగు చవ్యంబిడం శుంఠీ కృష్ణాజాజీ సపౌష్కరమ్, భాగోత్తర మిదం చూర్ణం పీతం వా తామజి ద్భవేత్. 23.

పెద్దసదాప వాయువిడంగములు సైంధవలవణము మిరియములు వీటిని చూర్ణము చేసి వేడినీళ్లతో త్రాగిన జఠరాగ్ని యుద్దీపించును. ఇంగువ 1 భాగము, చవ్యము 2 భాగములు, పేటుప్పు 3 భాగములు, శొంఠి 4 భాగములు, పిప్పళ్లుఅయిదుభాగములు, జీలకఱ్ఱ 6 భాగములు, పుష్కరమూలము ఏడుభాగములును వీటిని చూర్ణము చేసి త్రాగిన ఆమవాతములు నశించును.

## యోగరాజగుగ్గులము.

శ్లో. చిత్రకం పిప్పలీమూలం యమానీం కారవీం తథా, విడంగాన్యజమోదాశ్చ జీరకం సురదారు చ.24 చవ్యైలాం సైంధవం కుష్ఠం రాస్నా గోక్షుర ధాన్యకమ్, త్రిఫలాముస్తకం వ్యోషం త్వగుశీరం యవాగ్రజం. 25. తాలీసపత్రం పత్రం చ సూక్ష్మచూర్ణాని కారయేత్, యావన్త్యేతాని చూర్ణాని తావన్మాత్రం తు గుగ్గులుం. 26. సమర్ద్య సర్పిషా గాఢం స్నిగ్ధే భాండే నిధాపయేత్, తతో మాత్రాం ప్రయుంజీత యథేష్టాహారవా నపి. 27. యోగరాజ ఇతి ఖ్యాతో యోగోయ మమృతోపమః, ఆమవాతాఢ్య వాతాదీన్ క్రిమిదుష్ట వ్రణానపి. 28. ప్లీహగుల్మోదరానాహ దుర్నామాని వినాశయేత్, అగ్నిం చ కురుతే దీప్తం తేజోవృద్ధిబలం తథా. 29. వాతరోగాన్ జయ త్యేష సంధిమజ్జగతానపి.

చిత్రమూలము మోడి వాముము పేటుప్పు వాయువిడంగములు అజామోదము జీలకఱ్ఱ దేవదారుచెక్క చవ్యము ఏలకులు సైంధవలవణము చెంగల్వకోష్టు సన్నరాస్న పల్లేరు ధనియములు త్రిఫలములు తుంగముస్తలు శొంఠి మిరియములు పిప్పళ్లు లవంగపుపట్ట వట్టివేళ్లు యవక్షారము తాడిశపత్రి తేజపత్రి వీటిని చూర్ణము చేసి చూర్ణమంత గుగ్గులము నిందు కలిపి నేతితో మర్దించి చమురుకుండలో పెట్టి దినమును ఒక్కొక్క

మాత్రచొప్పున సేవింపవలయును. యథేష్టముగా భుజించుచు నుండవలయును. ఇయ్యది అమృతతుల్యము. ఆమవాతము ఆఢ్యవాతము నున్నవానిని క్రిములు గల వ్రణములను ప్లీహము గుల్మము నున్నవానిని పోఁగొట్టును. అగ్నినిదీపింపఁజేయును. తేజమును బలమును వృద్ధి నొందించును. సంధివాతము మజ్జావాతము నున్నవానిని పోఁగొట్టును.

## సింహనాదగుగ్గులము.

శ్లో. పలత్రయం కషాయస్య త్రిఫలాయాస్సుచూర్ణితమ్ 30. సౌగంధికపలం చైకం కౌశికస్య పలం తథా, కుడవం చిత్రతైలస్య సర్వమాదాయ యత్నతః. 31. పాచయేత్పాకవిద్వైద్యః పాత్రే లోహమయే దృఢే, హన్తి వాతం తథా పిత్తం శ్లేష్మాణం ఖంజపంగుతాం. 32. శ్వాసం సుదుర్జయం హన్తి కాసం పంచవిధం తథా, కుష్ఠాని వాతరక్తం చ గుల్మశూలోదరాణి చ. 33. ఆమవాతం జయేదేతద్దపి వైద్యవివర్జితం, ఏతదభ్యాసయోగేన జరాపలితనాశనమ్. 34. సర్పిః తైలరసోపేత మశ్నీయాచ్ఛాలిషష్టికమ్, సింహనాద ఇతి ఖ్యాతో రోగవారణదర్పహా. 35. వహ్నివృద్ధికరః పుంసాం భాషితో దండపాణినా.

త్రిఫలములకషాయము 3 పలములు, ఎవంగిపపట్ట యేలకులు జాపత్రి నాగకేసరములు వీటిచూర్ణమును 1 పలము, గుగ్గులము 1 పలము, చిత్రమూలతైలము 4 పలములు (కుడపము) వీటినితెచ్చి పాకమును కనిపెట్టుచుగట్టిపాత్రలో పక్వముచేయవలయును. ఇయ్యది వాతపిత్తకఫములను ఖంజ పంగు వాతములను శ్వాసరోగమును అయిదు విధములగు దగ్గులను నశింపఁజేయును. కుష్ఠము వాతరక్తము గుల్మము శూలము ఉదరరోగము అసాధ్యమగు ఆమవాతము వీనినిపోఁగొట్టును. దీనిఁభ్యసించుటచేత ముసలితనమును తలనెరియుటయును నశించును. నేయి నూనె మాంసరసములతో వరియన్నమును తినవలయును. ఇది సింహనాదగుగ్గులము. రోగములనెడి ఏనుగులను హరించునట్టిది. పురుషులకు అగ్నిదీపకము. ఇయ్యది నందపాణిచేతఁ జెప్పఁబడినయోగము.

## అలంబుసాదిచూర్ణము.

శ్లో. అలంబుసా గోక్షురకా త్రిఫలా నాగరామృతాః. 36. యథోత్తరం భాగవృద్ధ్యా శ్యామాచూర్ణం చ తత్సమం, పిబే న్మస్తుసురాతక్ర కాంజికోష్ణోదకేన వా. 37. పీతం జయత్యామవాతం సశోథం వాతశోణితమ్, త్రికజానూరుసన్ధిస్థం జ్వరారోచకనాశనమ్. 38.

బోడసరము 1 భాగములు పల్లేరు 1 భాగము త్రిఫలములు 3 భాగములు శొంఠి 4 భాగములు తిప్పతీగె 5 భాగములు వీటి అన్నిటి తో సమానముగా తెల్లతెగడ చూర్ణము కలిపి పొడిచేసి దీనిని మజ్జిగ పై తేట కల్లు మజ్జిగ వేడినీళ్లు వీటిలో దేనితోనైనను కలిపి సేవించినచో ఆమవాతము శోఫవాతరక్తము నశించును. కటి ప్రాంతములు గల వాతము జానువాతము ఊరువాతము సంధివాతము జ్వరము అరోచకము మొ॥ నశించు.

## అజమోదాద్యవటకము

శ్లో. పథ్యాక్షధాత్రీ త్రిఫలాభాగం వృద్ధవయః క్రమః, పథ్యా విశ్వయమానీభిః తూల్యాభిశ్చూర్ణితం పిబేత్. 39. తక్రే ణోష్ణోదకే నాథ అథవా కాంజికేన చ, ఆమవాతం నిహన్త్యాశు శోథం మన్దాగ్నితామపి. 40. అజమోదా మరిచపిప్పల విడంగసురదారుచిత్రకగతాహ్వాః, సైంధవపిప్పలిమూలం భాగా నవకస్య పలికాః స్యుః. 41. శుంఠీ దశపలికాస్యాత్ పలాని తావన్తి వృద్ధదారస్య, పథ్యాపంచపలాని సర్వాణ్యేకత్ర కారయే చ్చూర్ణమ్. 42. సమగుడవటకిం ఖాదత శ్చూర్ణం వాప్యుష్ణవారిణా పిబతః, నశ్యం త్యామానిలజాః సర్వే రోగాస్తు కష్టాస్తు. 43. విశ్వాచికా ప్రతితూణీ తూణీహృద్రోగా శ్చగృధ్రసీ చోగ్రా, కటివస్తిగుదస్ఫుటనం, చైవా స్థిజంఘయో స్తీవ్రం. 44. శ్వయథు స్తథాంగసంధిషు యేచాన్యే ప్యామహివాతసంభూతాః, సర్వే ప్రయాన్తి నాశం తిమఇవ సూర్యాంశు విధ్వస్తమ్. 45.

కరక్కాయ ఉసిరిక తాడి వీటిని భాగవృద్ధితో తీసికొని కరక్కాయ వాము శొంఠి వీటిని కలిపి చూర్ణము చేసికొని సేవింపవలయును. ఇయ్యది ఆమవాతమును పోగొట్టును. మజ్జిగ వేడినీళ్ళలో నేదైన నొకటి యిందులకు అనుపానము. అజామోదము మిరియములు పిప్పళ్లు వాయువిడంగములు దేవదారు చిత్రమూలము పిల్లిపీచర సైంధవలవణము పిప్పళ్లు మోడి వీటినిఒక్కొక్క పలమును శొంఠి 10 పలములును కరక్కాయఅయిదు పలములు దేవదారు 10 పలములును కలిపి చూర్ణము చేసి సమానముగా బెల్లమునుకలిపి ఉండలను చేసికొని భక్షింపవలయును. అథవా ఈచూర్ణమును నేతిని వేడినీట త్రాగవలయును. ఆమవాతజములగురోగములు దీననశించును. విశ్వాచికా ప్రతితూనీ తూనీ హృద్రోగము, భయంకరమగు గృధ్రసి కటివస్తి గుదలు బ్రద్దలగుటఎముకలుమోకాళ్లు సిక్కులు వీటియందుగల నొప్పి శోఫ ఆమవాతమువలన బుట్టెడు నన్నిరోగములును సూర్యకిరణములవలన చీకట్లు నశించునట్లు నశించిపోవును.

### శుంఠీఘృతము.

శ్లో. నాగరక్వాథకల్కాభ్యాం ఘృతప్రస్థం విపాచయేత్, చతుర్గుణేన తేనాథ కేవలే నోదకేన వా. 46. వాతశ్లేష్మప్రశమన మగ్నిసందీపనం పరమ్, నాగరం ఘృత మిత్యుక్తం కట్యా మశూలనాశనమ్. 47.

నాలుగురెట్లు శొంఠి కషాయము కల్కము వీటితో 16 పలముల నేతిని పక్వము చేసి గాని నీటితో పక్వము చేసి గాని సేవించిన వాతకఫము లడంగును. అగ్ని యుద్దీపించును. కటివాతామవాతములు నశించును.

### గుడూచీఘృతము.

శ్లో. అమృతాయాః కషాయేణ కల్కేన చ మహౌషధాత్, మృద్వగ్నినా ఘృతప్రస్థం వాతరక్తహరం పరమ్. 48. ఆమవాతాఢ్యవాతాదీ న్క్రిమిదుష్టవణా న్సహ, అర్శాంసి గుల్మశూలం చ నాశయత్యాశు యోజితమ్. 49.

తిప్పతీగకషాయము శొంఠి కల్కములయందు 16 పలముల నేతిని సన్ననిమంటపైని పక్వము చేసి సేవించిన వాతరక్తములు తప్పక నశించును. ఆమవాతము ఆఢ్యవాతము మున్నగువియును క్రిమిరోగము దుష్టవ్రణములు మూలరోగము శూల వీటిని నశింపఁజేయును.

### కాంజికషట్పలఘృతము.

శ్లో. హింగుత్రికటుకం చవ్యం మాణిమన్థం తథైవ చ, కల్కాన్కృత్వా చ పలికాన్ ఘృతప్రస్థం విపాచయేత్. 50. ఆరనాలాఢకం దత్వా తత్సర్పి ర్జఠరాపహం, శూలం విబంధ మానాహ మామవాతం కటిగ్రహమ్. 51. నాశయే ద్గ్రహణీదోషం మందాగ్నే ర్దీపనం పరమ్.

ఇంగువ శొంఠి మిరియములు పిప్పళ్ళు చవ్యము సైంధవలవణము వీటినన్నిటి నొక్కొక్కపలముచొప్పున తెచ్చి కల్కమును చేసికొని 16 పలముల నేతిలో పక్వమును చేయవలయును. మఱియును గంజి 64 పలములను కలిపి నేతిని సిద్ధముచేసి సేవింపవలయును. ఇయ్యది ఉదరరోగము శూల విబంధము ఆనాహము ఆమవాతము కటిగ్రహము అతిసారము మందాగ్ని వీటిని నశింపఁజేయును.

## శుంఠీఘృతము.

శ్లో. పుష్ట్యర్థం పయసా సాధ్యం దగ్ధవి ట్భ్రాతిసంగ్రహే. 52. దీపనార్థం మతిమతా మస్తునా చ ప్రకీర్తితమ్, సర్పిర్నాగర కల్కేన సౌవీరక చతుర్గుణమ్. 53. సిద్ధ మగ్నికరం శ్రేష్ఠ మామవాతహరం పరమ్.

బలము కొఱకైనచో పాలతోను, మలము మూత్రము కొఱకైన పెరుగుతోను, దీపనము కొఱకైన మండము చేతను సిద్ధము చేసిన శొంఠి కల్కమునందు నాలుగునట్లు గంజినికలిపి అందు సిద్ధముచేసిన ఘృతమును సేవించిన అగ్నిదీపనమును గల్గించును. ఆమవాతమును హరించును.

## రసోన పిండము.

శ్లో. రసోనస్యపలశతం తిలస్య కుడపం తథా. 54. హింగుత్రికటుకం క్షారౌ పంచైవ లవణాని చ, శతపుష్పా తథా కుష్ఠం పిప్పలీ మూల చిత్రకౌ. 55. అజమోదాయమానీ చ ధాన్యకం చాపబుద్ధిమాన్, ప్రత్యేకం తు పలం చైషాం సూక్ష్మచూర్ణాని కారయేత్. 56. ఘృతభాండే దృఢే చైతత్ స్థాపయే ద్దినషోడశ, ప్రక్షిప్య తైలమానించ ప్రస్థార్థం కాంజకస్య చ. 57. ఖాదే త్కర్షప్రమాణం తు తోయం మద్యం పిబే దను, ఆమవాతే తథా వాతే సర్వాంగైకాంగసంశ్రితే. 58. అపస్మారేఽనలే మందే కాసశ్వాస గరేషు చ, సోన్మాదవాతభంగే చ శూలే జంతుషు శస్యతే. 59.

ఉల్లిగడ్డలు 100 పలములు నువ్వులు 4 పలములు ఇంగువ శొంఠి పిప్పలి మిరియములు పిప్పళ్లు సజ్జికాక్షారము పంచలవణములు సోపు కోష్ఠు పిప్పళ్లు మోడి వాముము ధనియములు వీటిని ఒక్కొక్కపలమును తెచ్చి చూర్ణముచేసి నేతిపాత్రలో పదహారు దినములుంచి 8 పలముల తైలము 8 ప॥ గంజి వీటిని కలిపి ఒకతులముచొప్పున ప్రతిదినము తిని మంచి నీళ్లను గాని మద్యముగాని త్రాగవలయును. అమవాతము సర్వాంగవాతము ఏకాంగ వాతము. మృగీరోగము మందాగ్ని దగ్గు శ్వాస విషకృత్రిమము పిచ్చ వాయువుపోట్లు శూల ఈరోగములయందు ఇది యుత్తమము.

## ప్రసారిణీ సంధానము.

శ్లో. ప్రసారణ్యాఢక క్వాథే ప్రస్థో గుడరసోనతః, పకిప్వః పంచోషణరజః పాద స్స్యా దామవాతహా. 60.

ప్రసారిణీ 64 పలముల తెచ్చి కషాయముచేసి యందు 16 పలముల బెల్లము ఉల్లిగడ్డలను చేర్చి పక్వముచేసి అందు పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి వీటి చూర్ణమును కలిపి సేవించినచో ఆమవాతరోగములు నశించును.

### రసోనసురా.

శ్లో. బహుళాయాః సురాయాస్తు సుపక్వాయాః శతం ఘటే, తత్తోయేన రసోనస్య సంశుద్ధం కుట్టితం క్షిపేత్ 61. పిప్పలీ పిప్పలీమూల మజాజీ కుష్ఠచిత్రకమ్, నాగరం మరిచం చవ్యం చూర్ణితం చాక్షసమ్మితమ్. 62. సప్తాహం త్వన్యతః పేయా వాతరోగాపనాశినీ, క్రిమికుష్ఠక్షయానాహగుల్మార్శః ప్లీహమేహనుత్. 63. అగ్నిసందీపనీ చైవ పాండురోగవినాశినీ.

కల్లును బాగుగా మరగించెడు 100 పలములు ఒక పాత్రములో వైచి అందర్ధ ప్రమాణము ఉల్లిగడ్డలను పోసి నిలిచి కలుపవలయును. పిమ్మట పిప్పళ్లు మోడి జీలకఱ్ఱ కోష్ఠు చిత్రమూలము శొంఠి మిరియములు చవ్యము వీటిని పదిపదిమాషములయెత్తు తెచ్చి చూర్ణముచేసి కలిపియుంచి ఏడురోజులయినపిమ్మట ఈపేయము త్రాగవలయును. వాతరోగములు ఆమము క్రిమిరోగములు కుష్ఠు క్షయ ఆనాహము గుల్మము మూలరోగము పొడలు ప్రమేహము వీటిని నశింపజేయును. అగ్నిని దీపింపజేయును. పాండురోగములను పోగొట్టును.

సిద్ధార్థకతిలప్రస్థం సుధౌతం నిస్తుషం జలే. 64. మండప్రస్థం వినిక్షిప్య స్థాపయేద్దివసత్రయం, ధాన్యరాశౌ తతో దద్యాత్ సుచూర్ణ్య పలికాని చ. 65. అలంబుషా గోక్షురకం శతపుష్పా పునర్నవే, ప్రసారణీ వరుణత్వక్ శుంఠీ మదన మేవ చ. 66. సమ్యక్ క్వాథం తు విజ్ఞాయ సిద్ధా తండులముక్రితా, మృష్టా సర్షపతైలేన హింగుసైంధవసంయుతా. 67. భక్షితా లవణోపేతా జయే దామం మహాజ్వగమ్, ఏకజం ద్వంద్వజం సాధ్యం సాన్నిపాతిక మేవ చ. 68. కట్యూరువాతమానాహ జానుజం త్రిక మాగతామ్, ఉదావర్తహరీ పేయా బలవర్ణాగ్నికారిణీ. 69.

నల్లఆవాలను 16 పలములు తెచ్చి పొట్టు తీసి కడిగి 16 పలముల మండములో మూఁడురోజులు అన్నముతో నుంచి పిమ్మట పైకితీసి చూచి చూర్ణముచేసి బోడసరము పల్లేరు సోంపు లవంగపుపట్ట శొంఠి ప్రసారిణీ ఉలిమిరి ఉమ్మెత్త వీటినిఒక్కొక్కపలము చొప్పునఁ దీసికొని ఇందు పక్వముచేసి పాకమును బాగుగాతెలిసికొని బియ్యమును చేర్చి సిద్ధముచేయువలయును. ఆవనూనెతో సిద్ధముచేసిన ఇంగువ సైంధవలవణము నిందు కలిపి సేవించిన ఆమవాతములను జయించును. ఏకదోషజములు ద్విదోషజములు అసాధ్యములగు సన్నిపాతములు ఇట్టివగుజ్వరములు కటివాతామవాతములు ఆనాహము మోకాళ్లవాతము కటిప్రాంతవాతము ఉదావర్తము అనెడి వీనిని పోఁగొట్టును. బలమును తేజమును అగ్నిని దీపింపచేయును.

## సిధ్మల.

శ్లో. త్వగాదిహీనాః సంశుష్కాః ప్రత్యగ్రా స్సకులాదయః, శ్లక్ష్ణచూర్ణీకృతం తేషాం శీతే పలశతత్రయమ్. 70. శతేన కిట్టుమలే స్య వ్యోష రామఠ ధాన్యకైః, క్రిమిఘ్నదీప్యక నిశా చవికా గ్రన్థి కార్ద్రకైః. 71. జీరకద్వయ వృశ్చీర సురసార్జక శిగ్రుకైః, దశమూలాత్మగుప్తాభ్యాం మార్కవైర్లవణై స్త్రిభిః. 72. చూర్ణికైః పలికై స్సార్ధమారనాళపరిప్లుతైః, విన్యసే త్స్నుహపాత్రే చ ధాన్యరాశౌ పునర్న్యసేత్. 73. సప్తరాత్రా త్సముద్ధృత్య పానభక్షణభోజనైః, సిధ్మలేయం ప్రయోక్తవ్యా సామే వాతే విశేషతః. 74. భగ్నరుగ్నాభ్యుపహతాః కంపినః పీఠసర్పిణః, గృధ్రసీ మగ్నిసాదం చ శూలగుల్మోదరాణి చ, వలీపలితఖాలిత్యం హన్యా స్స్యురమలేంద్రియాః. 75.

పొట్టులేని ఎండిన కోష్ఠను క్రొత్తదానిని తెచ్చి చూర్ణముచేసి 300 పలములు తీసి చల్లని కషాయమును చేయవలయును. ఆవనూనె 100 పలములు శొంఠి మిరియములు పిప్పళ్లు ఇంగువ ధనియములు వాయువిడంగములు కొడిసెపాలవిత్తులు పసపు చెవ్యము మోడి అల్లము జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ తెల్లగజ్జేరు తులసి మునగ దశమూలము క్రౌంచవిత్తనములు దురదగొండి పంచలవణములు వీటినిపలము చొప్పునను కలిపి చూర్ణము చేసి గంజిలో తడిపి చక్కనిపాత్రములో నుంచి అన్నరాశిలో నుంచవలయును. ఏడురోజులయినపిమ్మటతీసి భక్షించుచుండవలయును. ఇయ్యది సిధ్మలయనఁబడును. ఆమవాతమునందు భగ్నరుగ్నములగు వాతములయందునుహితకరము. మఱియును గృధ్రసీమందాగ్ని

శూలము ఉదరరోగము శరీరము మఁడుతలుపడుట నెత్తియుట తల బట్టగట్టుట మున్నగు వాటిని పోఁగొట్టి నిర్మలేంద్రియుఁనుగా నొనర్చును.

ఆమవాతమునకు అపథ్యములు.

శ్లో. దధిమత్స్యగుడక్షీర పోతకీ మాషపిష్టకమ్, వర్జయే దామ వాతార్తో గుర్వభిష్యంద కారి చ. 79

పెరుగు, చేపలు, బెల్లము, పాలు, పోతకియనుకూర [అనఁగా బచ్చలి] మినపసున్ని అనువీనినిన్నీ భారములును అభిష్యందమును పుట్టించు పదార్థములును వదలి పెట్టవలయును.

ఇట్లు చక్రదత్తయందు ఆమవాతాధికారప్రకరణము ముగిసెను.

---

# ౨౬. శూలాధికారము.

శూలయందు వమనాద్యుపాయములు.

శ్లో. వమనం లంఘనం స్వేదః పాచనం ఫలవర్తయః, క్షారచూర్ణాని గుడికాః శస్యంతే శూలశాంతయే. 1. పుంసః శూలాభిపన్నస్య స్వేదఏవ సుఖావహః, పాయసైః కృశరైః పిష్టైః స్నిగ్ధై ర్వాపి సితోత్కటైః. 2. వాతాత్మకం హన్త్యచిరేణ శూలం, స్నేహేన యుక్తస్తు కులుత్థయూషః, ససైంధవో వ్యోషయుతః సలావః సహింగుసౌవర్చలదాడిమాఢ్యః. 3. బలాపునర్నవైరండ బృహతీద్వయగోక్షురైః, సహింగు లవణం పీతం సద్యో వాత రుజాపహమ్. 4. శూలీవిబంధకోష్ఠోద్భి గుష్ణాభి శ్చూర్ణితాః పిబేత్, హింగుప్రతివిషా వ్యోష వచా సౌవర్చలాభయాః. 5. తుంబురూణ్యభయా హింగు పౌష్కరం లవణత్రయమ్, పిబే ద్యవాంబునా వాతశూలగుల్మాపతంత్రకే. 6. శ్యామా విడం శిగ్రుఫలాని పథ్యా, విశల్ల కంపిల్లక మశ్వమూత్రీ, కల్కం సమం మద్యయుతం చ పీత్వా, శూలం నిహన్యా దనిలాత్మకం తు. 7.

వాంతి లంఘనము స్వేదవిధి పాచనము ఫలవర్తులు క్షారచూర్ణములు గుటికలును, ఇవి యన్నియును శూలను పోగొట్టుటలో శ్రేష్ఠములు. శూలగలవానికి చెమ్మటను పుట్టించుట యుత్తమము. పాయసము పులగము పిండి పిండివంటలు వీటివలన శూల రోగములందు సుఖము కలుగును. వాతశూలలందు చమురు వేసిన ఉలవలయూష ములో సైంధవలవణము శొంఠి మిరియములు పిప్పళ్లు వీటిచూర్ణమును కలిపికొని, లావయను పక్షిమాంసపు యూషమునందు, ఇంగువ సౌవర్చలవణము దానిమ్మగింజలు కలిపికొని త్రాగినయెడల హితము కలుగును. ముల్లంగి శొంఠి ఆముదపుపిత్తనములు వాకుడు పల్లేరు వీటియూషమునందు, ఇంగువ సైంధవలవణములను కలిపికొని త్రాగిన వాతశూలలు శీఘ్రముగా హరించును. శూలరోగియును, బంధకోష్ఠముగలరోగియును, వేడినీళ్లతో ఇంగువ, అతివస, శొంఠి, మిరియములు, పిప్పళ్లు, వస, సౌవర్చలవణము, కరక్కాయలు వీటిచూర్ణమును కలిపి త్రాగవలయును. ధనియములు కరక్కాయలు ఇంగువ పుష్కరమూలము సైంధవలవణము సౌవర్చలవణము సముద్రలవణము వీటి చూర్ణమును, యవోదకముతో కలిపి త్రాగిన వాతశూలలు గుల్మములు అపతంత్రములు నశించిపోవును. తెల్లతెగడ పేటుప్పు ముస్తె వాయువిడంగములు కంపిల్లపువేళ్లు పెన్నే రు వీటిని సమానభాగములను చేర్చి కల్కముచేసి, మద్యముతోచేర్చి త్రాగినచో వాతశూలలు నశించును.

## యామినీసురామండాద్యుపాయములు.

శ్లో. యామినీ హింగు సింధూత్థ క్షార సౌవర్చలాభయాః, సు రామండేన పాతవ్యాః వాతశూలనిషూదనాః. 8. విశ్వ మేరండజం మూలం క్వాథయిత్వా జలం పిబేత్, హింగుసౌవర్చలోపేతం సద్య శ్శూలనివారణం. 9. హింగుపుష్కరమూలాభ్యాం హింగుసౌవర్చలేన వా, విశ్వైరండయవక్వాథః సద్యశ్శూలనివారణః. 10. తద్వద్బిల్వ యవక్వాథో హింగుసౌవర్చలాన్వితః, హింగ్వమ్ల కృష్ణా లవణాం య మానీ క్షారాభయా సైంధవతుల్యభాగం. 11. చూర్ణం పిబే ద్వార ణమ డమిశ్రం శూలే ప్రవృద్ధే నిలజే శివాయ. 12.

పసపు, ఇంగువ, సైంధవలవణము, యవక్షారము, సజ్జక్షారము, సౌవర్చలవణము, కరక్కాయలు వీటిని పొడిచేసి మద్యముతో కూడ కలిపి త్రాగినచో వాతశూలములు నశించును. శొంఠి మిరియములు ఆముదపుగింజలు వీటిని కషాయముగాచేసి, ఇంగువ సౌవర్చలవణమును అందు వైచి త్రాగిన వాతశూలములు తక్షణమే నశించిపోవును.

ఇంగువ పుష్కరమూలములతో గాని, ఇంగువ సౌవర్చలవణములతో గాని, సిద్ధముచేసిన శొంఠి, యవముపపుష్కరములకషాయము శూలలను వెంటనే హరింపఁజేయును. ఏరండ యవల కషాయములో ఇంగువ సౌవర్చలవణములను వైచికొని త్రాగినను సుఖమే యగును. ఇంగువ మాచిపత్రి పిప్పళ్లు ఉప్పు వాము కరక్కాయలు యవక్షారము వీటిని సమానభాగములుగా చూర్ణము చేసి, వారుణీ మండముతో చేర్చి త్రాగిన మొదల వృద్ధిపొందిన వాతశూలలు హరించి సుఖము కలుగును.

## సౌవర్చలాదిగుటిక.

శ్లో. సౌవర్చలామ్లికా జాజీ మరిచై ర్ద్విగుణోత్తరైః, మాతులుంగరసైః పిష్ట్వా గుటికానిలశూలనుత్. 13. హింగ్వమ్లవేతసవ్యోష యమానీలవణత్రికైః, బీజపూరరసోపేతై ర్గుటికా వాతశూలనుత్. 14. బీజపూరకమూలం చ ఘృతేన సహ పాయయేత్, జయే ద్వాతభవం శూలం కర్షమేకం ప్రమాణతః. 15. బిల్వమూలతిలై రండం పిష్ట్వా చామ్లతుషాంభసా, గుడికాం గ్రాసమనుష్ణాం నానాశూలవినాశినీం. 16. తిలైశ్చ గుడికాం కృత్వా భ్రామయే జ్జఠరోపరి, గుటికా శమయ త్యేషా శూలం చైవాతిదుస్సహం. 17. నాభిలేపా జ్జయే చ్ఛూలం మదనః కాంజికాన్వితః, జీవన్తిమూల కల్కో వా సతైలః పార్శ్వశూలనుత్. 18.

సౌవర్చలవణము 1 భాగము, చింతపండు 2 భాగములు, జీలకఱ్ఱ 4 భాగములు, మిరియములు 8 భాగములు వీటిని మాదీఫలరసముతో నూరి మాత్రలనుకట్టి సేవించిన వాతశూలములు నశించును. ఇంగువ ఆమ్లవేతసము శొంఠి మిరియములు పిప్పళ్లు ఓమము త్రిలవణములు వీటిని మాదీఫలరసముతో నూరి మాత్రలనుచేసి యిచ్చిన వాతశూలములను హరించును. మాదీఫలరసమును నేతితో చేర్చికొని త్రాగిన సంవత్సరమునుండి యుండిన వాతశూలలును నశించును. మారేడు తిలలు ఆముదపువిత్తనములు వీటిని పుల్లనియుదలగంజిలో కలిపి నూరి మాత్రలను చేసి వెచ్చజేసి పొట్టపైరుద్దినచో వాతశూలముల నశించును. తిలలను ఉండలను చేసి కడుపుపై నుంచిన మిక్కిలియును భయంకరములగు వాతరోగములైనను నశించును. ఉమ్మెత్తకాయను గంజితోనూరి బొడ్డుపై పట్టువేసిన శూలలు నశించును. సుష్టగ్రమను బాలబెండుతో నైన కల్కమునందు తైలమునుకలిపి లేపనముచేసినను పార్శ్వశూలలు నశించును.

## పిత్తశూలలకు గుడచికిత్స.

శ్లో. గుడః శాలి ర్యవాః క్షీరం సర్పిః పానం విరేచనం, జాంగలాని చ మాంసాని భేషజం పిత్తశూలినాం. 19. పైత్తే తు శూలే వమనం పయోభీ రసై స్తథేక్షో స్సపటోలనింబైః, శీతావగాహాః పులినా స్సవాతా కాంస్యాదిపాత్రాణి జలప్లుతాని. 20. విరేచనం పిత్తహరం చ శస్తం రసాశ్చ శస్తాః శశలావకానాం, సంతర్పణం లాజమధూపపన్నం యోగ్యా స్సుశీతామనుసంప్రయుక్తాః. 21. ఛర్ద్యాం జ్వరే పిత్తభవేపి శూలే, ఘోరే విదాహే త్వతితర్షితే చ, యవస్య పేయాం మధునా విమిశ్రాం, పిబే త్సుశీతాం మనుజ స్సుఖార్థీ. 22. ధాత్ర్యా రసం విదార్యా వా త్రాయస్తి గోస్తనాంబు వా, పిబే త్సశర్కరం సద్యః పిత్తశూలనిషూదనం. 23. శతావరీరసం క్షౌద్రయుతం ప్రాతః పిబే న్నరః, దాహశూలోపశాన్త్యర్థం సర్వపిత్తామయాపహం. 24. బృహత్యౌ గోక్షురైరండ కుశకాశేక్షుబాలికాః, పీతాః పిత్తభవం శూలం సద్యో హన్యుః సుదారుణం. 25.

బెల్లము వరిబియ్యము యవలు పాలు నేయి వీటిని త్రాగుట విరేచనమునకు తీసికొనుట అడవిజంతువుల మాంసమును తినుట ఇవియన్నియును, పిత్తశూలముల కుత్తమములగు నౌషధములు. పిత్తశూలమునందు పాలనిచ్చి వాంతిచేయించుట చెఱుకుపాలు చేదుపొట్ల నిమ్మపండ్లరసము వీటితో వమనములు చేయించి చల్లనీటితో చల్లుటయును, నదీపులినములపైఁ గూర్చుండబెట్టుటయును, చల్లనిగాలిని విసరుటయును, చల్లనీటితో పెట్టినకంచుపాత్రము తగుల్చుటయును హితకరములు. విరేచనము పిత్తశూలములను హరించును. కుందేలు లావుక వీటిమాంసరసపానముత్తమము. పేలాలలో తేనెను కలిపికొని తర్పణక్రియ చేయవలయును. ఛర్ది జ్వరము పిత్తశూలము వీటియందును, విదాహమునందును యవలను పేయఁగాచేసికొని తేనెనుకలిపికొని చల్లార్చికొని త్రాగిన సుఖము నొందఁగలఁడు. ఉసిరికరసమును నేలగుమ్మడురసమును గాని కలు కానుగురసము గాని ద్రాక్షారసముగాని చక్కెరగలిపి త్రాగిన పిత్తశూలములను పోఁగొట్టును. పిల్లిపీచర రసమును తేనె కలిపికొని ప్రాతఃకాలముననే లేచి దాహము శూల యడగుటకై త్రాగవలయును. వాకుడు పల్లేరు ఆముదము కుశలు చెఱకు వీటిస్వరసమును సేవించిన పిత్తశూలలు నశించును.

### శతావరీసంస్కృతోదకము.

శ్లో. శతావరీ సయష్ట్యాహ్వా పాట్యాల కుశ గోక్షురైః, శృత శీతం పిబే త్తోయం సగుడక్షౌద్రశర్కరం. 26. పిత్తాసృగ్వాతశూల ఘ్నం సద్యో దాహజ్వరాపహమ్, త్రిఫలా నింబయష్ట్యాహ్వా కటుకా రగ్వధైః కృతమ్. 27. పాయయే న్మధుసంమిశ్రం దాహశూలోపశా న్తయే, తైల మేరండజం వాపి మధుకక్వాథసంయుతమ్. 28. శూలం పిత్తోద్భవం హన్యా ద్గుల్మం పైత్తిక మేవ చ, త్రిఫలారగ్వధం క్వాథం సక్షౌద్రం శర్కరాన్వితమ్. 29. పాయయే ద్రక్తపిత్తఘ్నం దాహశూ లనివారణమ్, ప్రలిహ్యా త్పిత్తశూలఘ్నం ధాత్రీచూర్ణం సమాక్షి కమ్. 30.

పిల్లిపిచ్చర యష్టిమధుకము సుత్తువపులగము కుశలు పల్లేరు వీటికషాయముతో బెల్లమును తేనెను కంపచక్కెరను కలిపికొని త్రాగినయెడల రక్తపిత్తము దాహము శూ ల దాహజ్వరము శీఘ్రముగా నశించును. త్రిఫలములు నిబము యష్టిమధుకము కటుక రోహిణి ఆర్గువేతసము వీటికషాయములో తేనెను వైచికొని త్రాగిన దాహసహితముల గు శూలలును శాంతించును. లేనిచో ఆముదములో యష్టిమధుకపు కషాయమును వై చి త్రాగిన పిత్తశూలలు పిత్తగుల్మములు నశించిపోవును. త్రిఫలగులు ఆర్గువేతసము వీటి కషాయములో తేనెను కంపచక్కెరను కలిపిత్రాగిన రక్తపిత్తము దాహము శూలలు న శించును. ఉసిరికచూర్ణములో తేనెకలిపి సేవించిన పిత్తశూలలు హరించును.

### శ్లేష్మాధిక్యమునకు ధర్మాదులు.

శ్లో. శ్లేష్మాధికే చర్దన లంఘనాని శిరోవిరేకం మధుశీధుపానం, మధూని గోధూమ యవా నరిష్టాన్ సేవేత రూక్షా న్కటుకాం శ్చస ర్వాన్. 31. పిప్పలీ పిప్పలీమూల చవ్య చిత్రక నాగరైః, యవాగూ ర్దీపనీయా స్యా చ్ఛూలఘ్నీ తోయసాధితా. 32. లవణత్రయసంయుక్తం పంచకోలం సరామఠమ్, సుఖోష్ణేనాంబునా పీతం కఫశూలవినాశ నమ్. 33. బిల్వమూల మథైరండం చిత్రకం విశ్వభేషజమ్, హింగు సైంధవసంయుక్తం సద్య శ్శూలనివారణమ్. 34.

కఫాధిక్యముగల శూలరోగమునందు వమనము లంఘనము శిరోవిరేకము కల్లు తేనె త్రాగుట, గోధుమలు యవలు అరిష్టములు వీటినన్నిటిని, రూక్షములు కటుకములు

నగు పదార్థములను సేవించుట వీనిని చేయవలయును. పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి వీటితో చేసినగుడము (గుడాయణియనునది) దీపనమును అయినది, శూలలు నశించును. దీనిని నీటిలో నాన వేయవలయును. సైంధవలవణము మున్నగు లవణత్రయము పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి ఇంగువ వీటిచూర్ణము వెచ్చజేసి గోరువెచ్చనినీళ్లతో త్రాగిన కఫశూలములు నశించును. మారేడుచెక్క ఆముదపుగింజలు చిత్రమూలము శొంఠి ఇంగువ సైంధవలవణము ఇవియును తత్కాలముః శూలలను నశింపజేయును.

శూలామపాచనమునకు ముసాములు.

శ్లో. ముస్తం వచాం తిక్తకరోహిణీంచ తథాభయాం నిర్దహనీం చ తుల్యామ్, పిబేత్తు గోమూత్రయుతాం కఫోత్థే శూలే తథామస్య చ పాచనార్థమ్. 35. వచాబ్దాగ్న్యభయాతిక్తా చూర్ణం గోమూత్రసంయుతమ్, సక్షారం వా పిబేత్క్వాథం బిల్వాదేః కఫశూలనుత్. 36. మాతులుంగరసో వాపి శిగ్రుక్వాథో [illegible], సక్షారో మధునా పీతః పార్శ్వహృద్బస్తిశూలనుత్. 37. ఆమజే తు క్రియాం కార్యాం కఫశూలవినాశినీ, సేవ్యమామహరం సర్వం యదగ్నిబలవర్ధనమ్. 38. సహింగుతుంబురువ్యోషయవానీ చిత్రకాభయాః, సక్షారలవణాశ్చూర్ణం పిబేత్తృప్తిస్సుఖాంబునా. 39. [illegible]శూలఘ్నం పాచనం వహ్నిదీపనమ్, చిత్రకం గ్రంథికైరండ శుంఠీధాన్యం జలైః శృతం. 40. శూలానాహవిబంధేషు సహింగు బిడదాడిమం, దీప్యకం సైంధవం పథ్యా నాగరం చ చతుస్సమం. 41. భృష్టం శూలం జయత్యాశు మందస్యాగ్నేశ్చ దీపనం, సమాక్షికం బృహత్యాది పిబేత్పిత్తానిలాత్మకే. 42. వ్యామిశ్రం వా విధిం కుర్యాచ్ఛూలే పిత్తానిలాత్మకే, పిత్తజే కఫజే వాపి యా క్రియా కథితా పృథక్. 43. ఏకీకృత్య ప్రయుంజీత తాం క్రియాం కఫపిత్తజే, పటోల త్రిఫలారిష్ట క్వాథం మధుయుతం పిబేత్. 44 పిత్తశ్లేష్మజ్వరచ్ఛర్దిదాహశూలోపశాంతయే, రసోనం మధుసంమిశ్రం పిబేత్ప్రాతః ప్రకాంక్షితః. 45. వాతశ్లేష్మభవం శూలం నిహంత్యం వహ్నిదీపనం.

తుంగముస్తలు వస కటుకరోహిణి కరక్కాయలు నల్లజీడివిత్తులు వీటిని సమభాగములను గోమూత్రముతో నూరికొని త్రాగిన కఫశూలలయందును ఆమము పక్వము అగుటయందును హితకరము అగును. వస తుంగముస్తలు చిత్రమూలము కటుకరోహిణి వీటిచూర్ణములో గోమూత్రమును కలిపికొని త్రాగినను బిల్వాదిగణపు ఔషధముల కషాయములో యవక్షారమును కలిపికొని త్రాగినను కఫశూలములు నశించును. మాచిపత్రి రసములోగాని మునగ కషాయములోగాని యవక్షారమును కలిపి తేనెను చేర్చి త్రాగిన పార్శ్వశూలలు హృచ్ఛూలలు వస్తిశూలలును నశించును. ఆమశూలను కఫశూలనాశకములగు పదార్థములనే ఈయవలయును. ఆమమును హరించునట్టి అగ్నిని దీపింపజేయునట్టి క్రియలను పూర్ణముగా సేవింపవలయును. ఇంగువ ధనియములు శొంఠి మిరియములు పిప్పళ్లు వామును చిత్రమూలము కరక్కాయలు యవక్షారము సైంధవలవణము వీటిచూర్ణమును వేడినీళ్లతో ప్రొద్దుననే లేచి త్రాగవలయును. ఇయ్యది వాతశూలలను హరించును. చిత్రమూలము మోడి పిప్పళ్లు ఆముదము శొంఠి ధనియములు వీటికషాయమును కాచి అందులో ఇంగువ సైంధవలవణముదానిమ్మవిత్తనములు వేసి త్రాగిన శూలలు ఆనాహములును నశించును. ఇది శూలబాధలయందు హితకరము. కోడిసెపాలవిత్తులు సైంధవలవణము కరక్కాయలు శొంఠి వీటినిసమానభాగములనుగా తీసికొని సేవించినబలముగు శూలలు శీఘ్రముగా నశించి అగ్ని దీపించును. త్రిదోషశూలలయందు బృహత్యాదిగణౌషధములలో తేనె కలిపి సేవింపవలయును. చేదుపొట్ల త్రిఫలములు వేప వీటికషాయమునందు తేనెను కలిపి త్రాగిన పిత్తకఫములు జ్వరము ఛర్ది దాహము శూలము నశించును. ఉల్లిగడ్డలను తేనెతో సేవించిన వాతకఫశూలలునశించి అగ్నిదీపనమగును.

### బృహద్ద్విక్షారాదిచూర్ణము.

శ్లో. ?శో? గోక్షురాః దశమూల యవాగ్రజం తు, ద్విక్షార హింగు లవణత్రయ పుష్కరాఖ్యాన్, చూర్ణం పిబేద్ధృదయ పార్శ్వకటీగ్రహామ, ప? ?శ్రి ?? గుల్మ ?. 46. క్వాథేన చూర్ణపానం యదుక్తం క్వాథప్రధానతా, ప్రవృత్తిస్తేన తేనాత్ర చూర్ణాపేక్షా చ ??. 47.

శొంఠి ఆముదపుగింజలు దశమూలములు యవలు వీటికషాయములో యవక్షారము సజ్జక్షారము ఇంగువ సైంధవలవణముసౌవర్చలవణము సాముద్రలవణము పుష్కరమూలము వీటిచూర్ణమును కలిపి త్రాగిన హృదయము పార్శ్వము కటీగ్రహము ఆమము

జీర్ణశోషము బుజము మున్నగువానియందుగల రోగములను గుల్మములను శూలములను నశించును. కషాయముతో చూర్ణమును సేవించునప్పుడు కషాయము ముఖ్యము. కావున చూర్ణాపేక్షగలచో నాల్గురెట్లు ద్రవద్రవ్యములు నిందు ప్రవర్తించును.

## రుచకాదులు.

శ్లో. చూర్ణం సమం రుచకహింగు మహౌషధానాం, శుంఠ్యాంబునా కఫసమీరణ సంభవాసు, హృత్పార్శ్వపృష్ఠ జఠరార్తి విషూచికాసు, పేయం తథా యవరసేన తు విడ్విబంధే. 49. సమం శుంఠ్యాంబు నేత్యేవం యోజనా క్రియతే బుధైః, తేనాల్పమాన మేవాత్ర హింగు సంపరిదీయతే. 50.

సౌవర్చలవణము సైంధవలవణము వీటిని సమానభాగములను చూర్ణము చేసి శొంఠినీళ్లతో కఫవాతపుబాధలయందు త్రాగవలయును. ఇయ్యది హృదయము పార్శ్వము పృష్ఠము కుక్షి వీటిశూలలను విషూచికలను పోగొట్టును. మలబద్ధమునందును పని చేయును. అప్పుడు యవలరసముతో దీనిని తీసికొనవలెను.

## హింగ్వాదిచూర్ణము.

శ్లో. హింగు సౌవర్చలంపథ్యాబిడసైంధవ తుంబురు, పౌష్కరం చ పిబేచ్చూర్ణం దశమూలయవాంభసా. 51. పార్శ్వహృత్కటిపృష్ఠాంస శూలే తంత్రాపతానకే, శోధే శ్లేష్మామసేకేచ కర్ణరోగేచ శస్యతే. 52. ఏరండబిల్వ బృహతీ ద్వయమూత్రులుంగ, పాషాణభిత్త్రికటుమూల కృతః కషాయః, సక్షారహింగులవణోరుబు తైలమిశ్రః, శ్రోణ్యంసమేఢ్ర హృదయస్తనరుక్షు పేయః. 53.

ఇంగువ సౌవర్చలవణము కరక్కాయలు అంటుప్పు సైంధవలవణము ధనియములు పుష్కరమూలము వీటిచూర్ణమును దశమూలకషాయముతో త్రాగిన పార్శ్వపృష్ఠశూలలు హృచ్ఛూలములు కటిశూలములు పృష్ఠశూలములు అంసశూలములు అపతంత్రము అపతానకము వాపు కఫప్రసేకము కర్ణరోగము వీటియందు శ్రేష్ఠమగు గుణమునిచ్చును. ఆముదపుగింజలు మారేడు వాకుడుపెద్దములక చిన్నములక మాచిపత్రి నాభిశొంఠి మిరియములు పిప్పళ్లు మునగ వీటికషాయములో యవక్షారము సైంధవలవణము ఏరండతైలముకలిపిత్రాగిన కటిప్రదేశము మెడ లింగము హృదయము స్తనములు వీటియందైన శూలమునందు త్రాగుట యోగ్యము.

## ద్వితీయహింగుచూర్ణము.

శ్లో. హింగు త్రికటుకం కుష్ఠం యవక్షారోథ సైంధవం, మాతులుంగరసోపేతం ప్లీహశూలాపహం రజః. 54. దగ్ధ మనిర్గతధూమం మృగశృంగం గోఘృతేన సహ పీతమ్, హృదయనితంబజశూలం హరతి శిఖీ దారునివహ మివ. 55. క్రిమిరిపుచూర్ణం లీఢం స్వరసేన తువంగసేనస్య, క్షపయత్యచిరాన్నియతం లేహోఽజీర్ణోద్భవం శూలమ్. 56. విదారీదాడిమరసః సవ్యోషలవణాన్వితః, క్షౌద్రయుక్తో జయత్యాశు శూలం దోషత్రయోద్భవం. 57.

ఇంగువ శొంఠి మిరియములు పిప్పళ్లు కోష్ఠు యవక్షారము సైంధవలవణము వీటిలో మాచిపత్రి రసమును చేర్చుకొని సేవించిన ప్లీహము శూలము నశించును. లేడికొమ్ములను పొగరానీయకుండ కాల్చి ఆభస్మమును ఆవునేతితో త్రాగవలయును. హృదయము పిఱుదలు వీటిలోని శూలల నిది హరించును. అవిసెఆకురసములో వాయువిడంగముల చూర్ణమును కలిపి సేవింపవలయును. ఈలేహము శీఘ్రముగా అజీర్ణజములగు శూలలను నశింపజేయును. నేలగుమ్ముడు దానిమ్మ వీటిరసములో శొంఠి మిరియములు పిప్పళ్లు సైంధవలవణము వీటిచూర్ణమును కలిపి తేనెను వైచి త్రాగినచో త్రిదోషములను హరించును.

## ఏరండద్వాదశకము.

శ్లో. ఏరండఫలమూలాని బృహతీద్వయగోక్షురమ్, పర్ణిన్యః సహదేవీచ సింహపుచ్ఛీక్షురాలికా. 58. తుల్యై రేతైః శృతం తోయం యవక్షారయుతం పిబేత్, పృథగ్దోషభవం శూలం హన్యాత్సర్వభవం తథా. 59.

ఆముదపుకాయలు వేళ్లు వాకుడు పల్లేరు కోలపొన్న ముయ్యాకుపొన్న సహదేవాకు మున్నగువానిని సమానభాగములుగా కషాయము చేసి యవక్షారమును కలిపి త్రాగిన సమస్తశూలలును నశించును.

## గోమూత్రమండూరము.

శ్లో. గోమూత్రసిద్ధం మండూరం త్రిఫలాచూర్ణసంయుతం, విలిహన్మధుసర్పిర్భ్యాం శూలం హన్తి త్రిదోషజమ్. 60. శంఖచూర్ణం సలవణం సహింగువ్యోష సంయుతమ్, ఉష్ణోదకేన తత్పీతం శూలం హన్తి త్రిదోషజమ్. 61. తీక్ష్ణాయశ్చూర్ణసంయుక్తం త్రిఫలాచూర్ణ ముత్తమమ్, ప్రయోజ్యం మధుసర్పిర్భ్యాం సర్వశూలనివారణమ్. 62. మూ

త్రాన్తః పాచితాం శుద్ధాం లోహచూర్ణసమన్వితాం, సగుడా మభ యా మద్యా త్సర్వశూలప్రశాంతయే. 63.

గోమూత్రములో మండూరమును శుద్ధిచేసి త్రిఫలములచూర్ణమును కలిపి తేనె నేయి చేర్చి సేవించిన త్రిదోషజములగు శూలలు నశించును. శంఖచూర్ణము సైంధవ లవణము ఇంగువ శొంఠి మిరియములు పిప్పళ్లు వీటిచూర్ణమును వేడినీళ్లతో త్రాగిన త్రిదోషజములగు శూలలు నశించును. అయఃకాంతచూర్ణమును త్రిఫలములచూర్ణమును తేనెతో నేతితో రంగరించి నాకిన అన్నివిధములగు శూలలునశించును. కరక్కాయలు ఆవుమూత్రముతో వండి శుద్ధిచేసి మండూరము బెల్లము కలిపి సేవించిన అన్నిశూల లును నశించును.

## దాధికఘృతము.

శ్లో. పిప్పలీనాగరం బిల్వం కారవీ చవ్యచిత్రకమ్, హింగు దా డిమ వృక్షామ్లం వచా క్షారామ్లవేతసమ్ 64. వర్చాభూ కృష్ణలవణ మజా జీ బీజపూరకమ్, దధి త్రిగుణితం సర్పి స్తత్సిద్ధం దాధికం స్మృతమ్.65. గుల్మార్శః ప్లీహహృత్పార్శ్వశూలయోని రుజాపహం. 65. దోషసంశ మనం శ్రేష్ఠం దాధికం పరమం స్మృతం. 66.

పిప్పళ్లు శొంఠి మారేడు నల్లజీలకఱ్ఱ చవ్యము చిత్రమూలము ఇంగువ దానిమ్మ చింతపండు వస అమ్లవేతసము శొంఠి సౌవర్చలవణము జీలకఱ్ఱ మాచికాయ వీటికల్క మును పుల్లనిపెఱుగుతో నేతిని సిద్ధముచేసి సేవించిన గుల్మము మూలరోగము ప్లీహ పార్శ్వపునొప్పి యోనిబాధ మున్నగు వానిని పోగొట్టును.

## ధూపాదులు.

శ్లో. కంబలావృతగాత్రస్య ప్రాణాయామం ప్రకుర్వతః, కటుతై లాక్తసక్తూనాం ధూపః శూలహరః పరః. 67. వ్యాయామం మైథునం మద్యం లవణం కటువైదలం, వేగరోధం శుచం క్రోధం వర్జయే చ్ఛూ లవా న్నరః. 68.

కంబడి కప్పుకొన్నవానికి, ప్రాణాయామము చేయువానికి కటుతైలములతో తడిపిన సత్తువులను ధూపము వైచినచో శూలలు నశించును. వ్యాయామము మైథునము కల్లు ఉప్పు చేదు వెదురుబియ్యపు అన్నము మలమూత్రవేగరోధము దుఃఖము కోపము వీటిని శూలరోగి వదలిపెట్టవలయును.

ఇట్లు చక్రదత్తయందు శూలరోగాధికారప్రకరణము ముగిసెను.

# ౨౭. పరిణామశూలాధికారము.

---

### పరిణామశూలల కుపాయములు.

శ్లో. వమనం తిక్తమధురై ర్విరేకశ్చాపి శస్యతే, వస్తయశ్చ హితాః శూలే పరిణామసముద్భవే. 1. విడంగతండులవ్యోషం త్రివృద్దన్తీ సచిత్రకం, సర్వాణ్యేతాని సంస్కృత్య సూక్ష్మచూర్ణాని కారయేత్. 2. గుడేన మోదకం కృత్వా భక్షయేత్ప్రాత రుత్థితః, ఉష్ణోదకానుపానం తు దద్యా దగ్నివివర్ధనం. ౩. జయే త్త్రిదోషజం శూలం పరిణామసముద్భవం.

చేదు తీపి రసములతో వాంతి చేయించుటయును, విరేచనమును వస్తికర్మలను చేయించుటయును, పరిణామశూలలకు హితములు. వాయువిడంగపుపత్తనములను శొంఠి మిరియములు పిప్పళ్లు తెల్లతెగడ దంతిచెక్క చిత్రమూలము వీటిని చూర్ణము చేసి బెల్లముతో ఉండలను చేసి ప్రొద్దున లేచి వేడినీళ్లతో సేవించిన పరిణామశూలలను త్రిదోషజములగు శూలలను పోగొట్టును.

### నాగరకాది కల్కము.

శ్లో. నాగరతిలగుడకల్కం పయసా సంసాధ్య యః పుమానద్యాత్, ఉగ్రం పరిణతిశూలం తస్యాపైతి త్రిసప్తరాత్రేణ. 4. శంబూకజం భస్మపీతం జలేనోష్ణేన తత్క్షణాత్, పక్తిజం వినిహన్త్యేవ శూలం విష్ణు రివాసురాన్. 5. అక్షధాత్ర్యభయాం కృష్ణాచూర్ణం మధుయుతం లిహేత్, దధ్నా లూనసరేణాద్యా త్సతీనయవశక్తుకాన్. 6. అచిరా న్ముచ్యతే శూలా న్నరోఽనుపరివర్తనాత్, తిలనాగరపథ్యానాం భాగం శంబూకభస్మనాం. 7. ద్విభాగం గుడసంయుక్తం గుడీకృత్వా ఒక్షభాగికాం, శీతాంబుపానాం పూర్వాహ్ణే భక్షయే త్క్షీరభోజనః. 8. సాయాహ్నే రసకం పీత్వా నరో ముచ్యేత దుర్జయాత్, పరిణామసముత్థా చ్చ శూలా చ్చిరభవా దపి. 9. శంబూకం త్ర్యూషణం చైవ పంచైవ లవణాని చ, సమాంశాం గుడికాం కృత్వా కలంబకరసేన వా. 10. ప్రాత

ర్భోజనకాలే వా భక్షయే త్తు యథాబలం, శూలా ద్విముచ్యతేజంతుః సహసా పరిణామజాత్. 11. యఃపిబతి సప్తరాత్రం సక్తూ నేతా న్కలాయయూషేణ, సజయతి పరిణామరుజం చిరజా మపి కిముత నూతనజాం. 12.

శొంఠి తిలలు బెల్లము వీటికల్కమును, పాలతో సిద్ధముచేసి తినిన భయంకరములగు పరిణామశూలలైనను 21 రోజులలో నశించును. శంఖభస్మమును వేడినీళ్లతో త్రాగిన శీఘ్రముగా పరిణామశూలలు హరించును. నేయి లేకుండ పెఱుగుతో యవల సత్తువును తినవలయును. త్రిఫలములచూర్ణమును తేనెతో తినవలెను. తిలలు శొంఠి కరక్కాయలు 1 భాగము, శంఖభస్మము 2 భాగములు వీటిలో బెల్లమును వైచి ఒక్కొక్కతులము చొ॥ మాత్రలను కట్టి చల్లనీటితో పీటిని మధ్యాహ్నమునకు లోపల తిని పాలయన్నమును భుజింపవలయును. సాయంకాలమునందు రసకము త్రాగిన భయంకరమైన పురాణపరిణామశూలలైనను నశించును. శంఖము శొంఠి మిరియములు పిప్పళ్లు పంచలవణములు వీటిని సమముగా చేర్చి నూరి మాత్రలుగా చేసికొని గాని తీగెబచ్చలిరసముతో మాత్రలుగాగట్టిగాని ప్రాతఃకాలపు భోజనమునందు బలానుసారముగా తినిన పరిణామశూలలనుండి ముక్తుడగును. లంకలగంజితో సత్తువును ఏడురోజులు త్రాగిన పురాణములగు పరిణామశూలలే నశించుచుండినవనిచో క్రొత్తగ గలిగిన శూలలు తొలగుటకు సందియమే లేదు.

### లోహచూర్ణాది ప్రయోగములు.

శ్లో. లోహచూర్ణం వరాయుక్తం విలీఢం మధుసర్పిషా, పరిణామశూలం శమయే త్తత్పలం వా ప్రయోజితం. 13. కృష్ణాభయాలోహచూర్ణం గుడేన సహ భక్షయేత్, పక్తిశూలం నిహన్త్యేత జ్జరణా న్యగ్నిమందతాం. 14. ఆమవాతవికారాంశ్చ స్థౌల్యం చైవాపకర్షతి, పథ్యాలోహరజః శుంఠీ చూర్ణం మాక్షికసర్పిషా, పరిణామరుజం హన్తి వాతపిత్తకఫాత్మికాం. 15.

లోహచూర్ణము త్రిఫలములు వీటియందు తేనెను నేతిని కలిపికొని తినినను మండూరమును తినినను పరిణామశూలలు శాంతించును. పిప్పళ్లు కరక్కాయలు లోహచూర్ణము వీటిలో బెల్లమును వేసికొని తినిన పరిణామశూలలు హరించును. అగ్ని దీపించును. ఆమవాతవికారములు తొలగును. కరక్కాయలు మండూరము శొంఠి చూర్ణము వీటిని నేతిలో కలిపి తినిన వాతపిత్తకఫజములగు పరిణామశూలలు నివర్తించును.

## సాముద్రాద్యచూర్ణము.

శ్లో. సాముద్రం సైంధవం క్షారో రుచకం రౌమకం బిడం, దన్తీలోహరజః కిట్టం త్రివృచ్చూర్ణకం సమం. 16. దధిగోమూత్రపయసా మందపావకపాచితం, తద్యథాగ్ని బలం చూర్ణం పిబే దుష్ణేన వారిణా. 17. జీర్ణేజీర్ణే తు భుంజీత మాంసాది ఘృతసాధితం, నాభిశూలం యకృచ్ఛూలం గుల్మప్లీహాకృతం చ యత్. 18. విద్రధ్యష్ఠీలికాం హన్తి కఫవాతోద్భవాం తథా, శూలానా మపి సర్వేషా మౌషధం నాస్తి తత్పరం, పరిణామసముత్థస్య విశేషేణాన్తకృన్మతం. 19.

సాముద్రలవణము మున్నగు పంచలవణములు దంతి లోహచూర్ణము తెల్లతెగడ అడవికంద వీటిని సమానభాగములుగ తెచ్చి, పెరుగు గోమూత్రము పాలు వీటితో సన్ననిసెగపై పక్వము చేసి అగ్నిబలము ననుసరించి ఆచూర్ణమును వేడినీళ్లతో త్రాగవలయును. జీర్ణించిన పిమ్మట నేతితో గాల్చిన మాంససారమును భక్షింపవలయును. ఇయ్యది నాభిశూలము యకృచ్ఛూలము గుల్మము ప్లీహము విద్రధి అష్ఠీలికారోగము కఫశూల వాతశూలములను పోగొట్టుటను సాటిలేని దివ్యమగు నౌషధము. అన్ని విధములగు శూలలను నివారించుట కింతకంటె మంచిమందు లేదు. ఇయ్యది పరిణామశూలలను విశేషముగా పోగొట్టును.

## సప్తామృతతైలము.

శ్లో. నారికేళం సతోయం చ లవణేన ప్రపూరితం, విపక్వ మగ్నినా సమ్యక్పరిణామజశూలనుత్. 20. వాతికం పైత్తికం చైవ శ్లైష్మికం సాన్నిపాతికం, మధుకం త్రిఫలాచూర్ణ మయోరజఃసమం లిహేత్. 21. మధుసర్పిర్యుతం సమ్యగ్గవ్యం క్షీరం పిబే దను, ఛర్దిః సతిమిరాం శూల మమ్లపిత్తం జ్వరం క్లమం. 22. ఆనాహం మూత్రబాధం చ శోథం చైవ నిహన్తి సః.

కొబ్బరికాయలో నీళ్లలో సైంధవలవణమునై బెట్టి మూసి నిప్పుపై కాచి పక్వము చేసి సేవించిన పరిణామశూలలు నశించును. వాతపిత్తకఫసన్నిపాతములవలన నగు పరిణామశూలల నియ్యది పోగొట్టును. యష్టిమధుకము త్రిఫలములచూర్ణము లోహచూర్ణము సమానభాగములుగా గ్రహించి తేనెను నేతిని కలిపి సేవించుచు ఆవుపాలను త్రాగవలయును. ఛర్ది తిమ్మిరి శూలలను అమ్లపిత్తము జ్వరము గ్లాని ఆనాహము మూత్రబంధము వాపు మున్నగు వానిని పోగొట్టును.

### గుడపిప్పలీఘృతము.

శ్లో. సపిప్పలీగుడం సర్పిః పచేత్ క్షీరచతుర్గుణే. 23. వినిహన్త్యమ్లపిత్తం చ శూలం చ పరిణామజం,

పిప్పళ్లు బెల్లము నెయ్యి వీటిని నాలుగురెట్లపాలలో పక్వముచేసి సేవించిన ఆమ్లపిత్తము పరిణామశూలలు నశించును.

### పిప్పలీఘృతము.

శ్లో. క్వాథేన కల్కేన చ పిప్పలీనాం, సిద్ధం ఘృతం మాక్షికసంప్రయుక్తం, క్షీరాన్నభక్షస్య నిహన్త్యవశ్యం శూలం ప్రవృద్ధం పరిణామసంజ్ఞం. 24.

పిప్పళ్లకషాయముకల్కములతో నేతిని సిద్ధము చేసి తేనెను చేర్చి త్రాగుచు పాలయన్నమును తినవలయును. ఇయ్యది హెచ్చుపెరిగిన పరిణామశూలనైనను హరించును.

### కోలాదిమండూరము.

శ్లో. కోలాగ్రంథిక శృంగబేర చపలా క్షారైః సమం చూర్ణితమ్, మండూరం సురబీజతేష్టగుణితే పక్త్వాథ సాంద్రీకృతమ్. 25. తం ఖాదే ద్దశనాదిమధ్యవిరతౌ ప్రాయేణ ముద్గాన్నభుక్, జేతుం వాతకఫామయౌ త్వరితం శూలం చ శూలాని చ. 26.

చవ్యము మోడి గంధకము అల్లము పిప్పళ్లు యవక్షారము వీటిని సమానభాగములనుగ చూర్ణముచేసి మండూరమును ఎనిమిదిరెట్ల గోమూత్రములో పక్వముచేసికలిపి గట్టిగామాత్ర చేయవలయును. దీనిని భోజనమధ్యమునందు తిని పాలను త్రాగిన వాతకఫములవల్లనైన పరిణామశూలలన్నిటిని హరించును.

### భీమవటకమండూరము.

శ్లో. కోలాగ్రంథికసహితైస్త్రివృచ్ఛ్యోషధమాగధీయవక్షారైః, ప్రస్థమయోరజసామపి పలికాంశైశ్చూర్ణితైర్యుక్తైః. 27. అష్టగుణమూత్రయుక్తం క్రమపాకాత్పిండితాం నయేత్సర్వం, కోలప్రమాణా గుటికాస్తిస్రో భోజ్యాదిమధ్యవిరతౌ చ. 28. దనసర్పిర్యూషపయోమాంసై రశ్నన్నరో నివారయతి, అన్నవివర్తన మంతే గుల్మం ప్లీహాగ్నిసాదాంశ్చ. 29.

చవ్యము మోడి శొంఠి పిప్పళ్లు యవక్షారము ఇవి ఒక్కొక్కపలము మండూరము 16 పలములును నాలుగురెట్లు గోమూత్రములో కలిపి క్రమముగా పక్వముచేసి గట్టిపడిన పిమ్మట మాత్రలను కట్టవలయును. పిమ్మట వీనిని భోజనమున మొదలను నడుమను చివరలను మూడుమాత్రలచొప్పున తీసికొనవలయును. రసము నేయి యూషము పాలు మాంసము వీటిని భుజించుచున్న అన్నవిద్రధియు గుల్మము ప్లీహరోగము మందాగ్ని వీటిని తొలగించును.

### క్షీరమండూరము.

శ్లో. లోహకిట్టపలా న్యష్టౌ గోమూత్రార్ధాఢకే పచేత్, క్షీరప్రస్థేన తత్సిద్ధం పక్తిశూలహరం నృణామ్. 30.

మండూరము 8పలములను అర్ధాఢకపు గోమూత్రములో పక్వముచేసి 16పలముల పాలలో సిద్ధముచేసి సేవించిన పరిణామశూలలను పాఱదోలును.

### చవికాది మండూరము.

శ్లో. లోహకిట్టపలా న్యష్టౌ గోమూత్రేష్టగుణే పచేత్, చవికానాగర క్షార పిప్పలీమూలపిప్పలీః. 31. సంచూర్ణ్య సిక్షిపే త్తస్మిన్ పలాంశాః సాంద్రతాం గతే, గుడికాః కల్పయే త్తేన పక్తిశూలనివారిణీః. 32.

మండూరము 8పలములను ఎనిమిదిరెట్లగోమూత్రములో పక్వముచేసి, చవ్యము శొంఠి యవక్షారము మోడి పిప్పళ్లు వీటిచూర్ణములను ఒక్కొక్కపలము కలిపి గట్టిపడిన పిమ్మట సేవించిన పరిణామశూలలు హరించును.

### శతావరీమండూరము.

శ్లో. మండూరం శోధితం పత్రం లోహజం వా గుడేన తు, భక్షయే న్ముచ్యతే శూలా త్పరిణామసముద్భవాత్. 33. సంశోధ్యం చూర్ణితం కృత్వా మండూరస్య పలాష్టకమ్, శతావరీరస స్యాష్టౌ దధ్నస్తు పయస స్తథా. 34. పలా న్యాదాయ చత్వారి తథా గవ్యస్య సర్పిషః, విపచే త్సర్వ మేకత్వం యావ త్పిండత్వ మాగతం. 35. సిద్ధం తు భక్షయే న్మధ్యే భోజన స్యాగ్రతో పి వా, వాతాత్మకం పిత్తభవం శూలం చ పరిణామజం, 36. నిహన్త్యేవ హి యోగోయం మండూరస్య న సంశయః.

శుద్ధిచేసిన మండూరమును బెల్లముతోతినిన పరిణామశూలలు హరించును. శుద్ధిచేసిన మండూరను 8పలములు పిల్లిపీచరగసము 8పలములు పెరుగు పాలు 32పలముల చొ॥ ఆవునెయ్యి 4 పలములును కలిపి పక్వముచేసి మాత్రలను జేట్టి భోజనము ముందఱను నడుమను భుజించినచో వాత పిత్త పరిణామజనితములగు శూలలు హరించును.

## తారామండూరము.

శ్లో. విడంగం చిత్రకం చవ్యం త్రిఫలా త్ర్యూషణాని చ. 37. నవ భాగాని చైతాని లోహకిట్టసమాని చ, గోమూత్రం ద్విగుణం దత్వా మూత్రార్ధక గుడాన్వితం. 38. శనై ర్మృద్వగ్నినా పక్త్వా సుసిద్ధం పిండతాం గతం, స్నిగ్ధే భాండే వినిక్షిప్య భక్షయే త్కోల మాత్రయా. 39. ప్రాఙ్మధ్యాదిక్రమే ణైవ భోజనస్య ప్రయోజితం, యోగోయం శమయ త్యాశు పక్తిశూలం సుదారుణం 40. కామలాం పాండురోగం చ శోథం మందాగ్నితా మపి, అర్శాంసి గ్రహణీదోషం క్రిమిగుల్మోదరాణి చ. 41. నాశయే దమ్లపిత్తం చ స్థౌల్యం చైవాపకర్షతి, వర్జయే చ్ఛుష్కశాకాని విదాహ్యమ్లకటూని చ. 42. పక్తిశూలాన్తకో హ్యేష గుడో మండూరసంజ్ఞకః, శూలార్తానాం కృపాహేతో స్తారయా పరికీర్తితః. 43.

వాయువిడంగములు చిత్రమూలము చవ్యము త్రిఫలములు శొంఠి మిరియములు పిప్పళ్లు ఇవి ఒక్కొక్కపాలును, మండూరమును సమముగాను గోమూత్రము ద్విగుణముగాను గోమూత్రములో సగముపాలు బెల్లమునుచేర్చి మెల్లగా సన్నని మంట పైఁబక్వము చేసి ముద్దబాఱిన పిమ్మట మాత్రలనుచేసి నేతికుండలో బెట్టి భోజనమునకు ముందుగను ప్రారంభమునను మధ్యను భుజింపవలయును. ఇయ్యదిపరిణామశూలలను కామెల పాండురోగము వాపు అగ్నిమాంద్యము మూలరోగము గ్రహణి క్రిమిరోగము గుల్మము ఉదరరోగము ఆమ్లపిత్తము వీటిని నశింపఁజేయును. స్థౌల్యమును పోఁగొట్టును. ఎండినకూరలు, దాహము పులుపు కారము బుట్టించు పదార్థములు ఇందు అపథ్యములు. ఇయ్యది శూలరోగుల హితమునకై తారచేతఁ జెప్పంబడినది.

## రామమండూరము.

శ్లో. వశిరం శ్వేతవాట్యాలం మధుపర్ణీ మయూరకం, తండులీయం చ కర్షార్ధం దత్వా థ శ్చేర్ధవ మేవచ. 44. పాక్యం సుజీర్ణం మండూరం గోమూత్రేణ దినద్వయం, అన్తర్బాష్ప మదగ్ధం చ తథా

స్థాప్యం దినత్రయం. 44. విచూర్ణ్య ద్విగుణేనైవ గుడేన సువిమర్దితం, భోజన స్యాదిమధ్యాన్తే భక్ష్యం కర్షం త్రిభాగతః. 45. తక్రానుపానం వర్జ్యంచ వార్త్ష్య మమ్లక మత్ర తు, అమ్లపిత్తేచ శూలే చ హిత మేత ద్వ్యధామృతం. 46.

చవ్యము తెల్లగుత్తువపులగము ముల్లంగి మయూరకము తండులీయము వీటిని అరయరతులముక్రిందను మీదను పోసి పురాణమండూరము గోమూత్రములో రెండుగోజులు పక్వము చేయవలయును. కంచుపాత్రములో నిట్లుచేసిన తగులవడదు. ఇట్లులు మూడురోజులుంచి చూర్ణమును గంతుకట్టు బెల్లమునుకలిపి మర్దనచేసి గుటికలు చేసి భోజనమునకు ఆదిమధ్యాంతముల భక్షింపవలయును. మజ్జిగను అనుపానముగాచేసి కొని చింతపండు మొ॥ పులుపును వదలవలయును. ఇయ్యది అమ్లపిత్తము శూలముల యందు హితకరము.

## రసమండూరము.

శ్లో. పథ్యాచూర్ణం ద్విపలం గంధకసారం చ, లోహాకిట్టం చ శుద్ధరసస్యార్ధపలం భృంగస్య రసం చ కేశరాజస్య. 47. ప్రస్థాన్మితం చ దత్వా లోహ పాత్రేఽథ దండసంఘృష్టమ్, శుష్కం ఘృత మధు యుక్తం మృదితం స్థాప్యం చ భాండకే స్నిగ్ధే. 48. ఉపయుక్త మేత దచిరా న్నిహన్తి కఫపిత్తజా న్రోగాన్, శూలం తథామ్లపిత్తం గ్రహణీమపి కామలా ముగ్రామ్. 49.

కరక్కాయలపొడి గంధకము మండూరము వీటిని రెండుపలములు, శుద్ధిచేసిన పాదరసము అర్ధపలము గుంటగలగర నల్లగుంటగలగర రసము 16 పలములు పోసి ఇనుప పాత్రములో రొయ్యతో మర్దనచేసి ఎండిన పిమ్మట నెయ్యి తేనె చేర్చి చమురు పాత్రములోపోసి యుంచి యుపయోగించినచో సిద్ధి కఫపిత్తజనరోగములను శూలలను అమ్లపిత్తములను గ్రహణులను కామెరలను నశింపజేయును.

## త్రిఫలాలోహము.

శ్లో. అక్షామలకశివానాం క్వాథైః పక్త్వా సులోహజం చూర్ణమ్, సగుడం యద్యుపభుఙ్క్తే ముంచతి సద్యః త్రిదోషజం శూలమ్. 50.

త్రిఫలములకషాయములో లోహచూర్ణమును పక్వముచేసి బెల్లముచేర్చి సేవించిన త్రిదోషజములగు శూలలు నశించును.

## లోహగుటిక.

శ్లో. లోహస్యరజసోభాగః త్రిఫలాయాః తథా త్రయః, గుడస్యాష్టౌ తథా భాగా గుడాన్మూత్రం చతుర్గుణమ్. 51. ఏతత్సర్వం చ విపచేత్ గుడపాకవిధానవిత్, లిహేచ్చ తద్యథాశక్తి క్షయే శూలే చపాకజే. 52.

లోహచూర్ణము 1భాగము త్రిఫలములు 3 భాగములు బెల్లము 8 భాగములు నాలుగురెట్లు గోమూత్రము వీటిని బెల్లమును పాకుపట్టెడి విధమున పక్వముచేసి శక్తి ననుసరించి భక్షించినచో శూలలును క్షయరోగములును నశించును.

## ధాత్రీలోహము.

శ్లో. ధాత్రీచూర్ణస్యాష్టౌ పలాని చత్వారి లోహచూర్ణస్య, యష్టీమధుకరజశ్చ ద్విపలం దద్యాత్సదోపలే ఘృష్టమ్. 53. అమృతాక్వాథే నైతచ్చూర్ణ్యం భావ్యం చ సప్తాహమ్, చండాతపేషు శుష్కం భూయః పిష్ట్వా నవేఘటే స్థాప్యం. 54. ఘృత మధునా సహాయుక్తం భక్తాదౌ మధ్యత స్తథాన్తే చ, త్రీనపి వారా న్ఖాదేత్పథ్యం దోషానుబంధేన. 55. భుక్తస్యాదౌ నాశయతి వ్యాధీన్పిత్తానిలోద్భవా న్సద్యః, మధ్యేన్న విష్టంభం జయతి నృణాం సంవిదహ్యాతే నాన్నమ్. 56. పానాన్నకృతా న్రోగా ద్భుక్తస్యాన్తే శీలితం జయతి, ఏవం జీర్యతి చాన్నే నిహన్తి శూలం నృణాం సుకష్ట మపి. 57. హరతి సహసా యుక్తో యోగశ్చాయం జరత్పిత్తం, చక్షుష్యః ఫలితఘ్నః కఫపిత్తసముద్భవాం జయేద్రోగాన్. 58. ప్రసాదయత్యపి రక్తం పాండుత్వం కామలాం జయతి.

ఉసిరికకాయలచూర్ణము 8 పలములు లోహచూర్ణము 4 పలములు యష్టిమధుకము 2 పలములు కోష్టు వీటిని పొడిచేసి ఏడురోజులు తిప్పతీగెకషాయములో భావనచేసి కటుకు యెండలో నెండించి మఱలనూరి క్రొత్తకుండలో నుంచి నేయి తేనెలతో చేర్చి భోజనమునకుఆదిమధ్యావసానముల ముమ్మారును సేవించి దోషానుసారమగు పథ్యము నొనర్చునది. ఇది భోజనాదిని భక్షించిన పిత్తవాతరోగములను నడుమనైనచో అన్న విష్టంభములను పోఁగొట్టును. చివఱ నన్నజములగు రోగములను నశింపఁజేయును. ఇట్లుభక్షించినయన్నము జీర్ణమయ్యోనేని ఆమనుష్యునికి కష్టతరమగు శూలలైనను హరించును. పిత్తమును యోగబలమున క్షీణింపఁజేయును. నేత్రములకు హితము. వెంట్రుకలు నెఱ

యుట మానును. కఫపిత్తజములగు రోగములను నశింపజేయును. రక్తమును శుభ్రపఱచును. పాండురోగమును కామెలను పోగొట్టును.

### లోహామృతము.

శ్లో. తనూని లోహపత్రాణి తిలోత్సేధసమాని చ. 59. కాశికామూలకల్కేన సంలిప్య సర్షపేణ వా, విశోష్య సూర్యకిరణైః పునరేవావలేపయేత్. 60. త్రిఫలాయా జలే ధ్మాతా వాపయేచ్చ పునః పునః, తతః సంచూర్ణితం కృత్వా కర్పటేన తు ఛానయేత్. 61. భక్షయేన్మధుసర్పిర్భ్యాం యథాగ్నేర్యత్ప్రయోగతః, మాషకం త్రిగుణం వాథ చతుర్గుణమథాపి వా. 62. ఛాగస్య పయసః కుర్యాదనుపానమభావతః, గవాం ఘృతేన దుగ్ధేన చతుష్షష్టిగుణేన చ. 63. పంక్తిశూలం నిహన్త్యాశు నాస్త్యనేకేన నిశ్చితమ్, లోహామృతమిదం శ్రేష్ఠం బ్రహ్మణా నిర్మితం పురా. 64. కకారపూర్వకం యచ్చ యచ్చామ్లం పరికీర్తితం, సేవ్యం తన్న భవేత్తత్ర మాసం చానూపసంభవం. 65.

నువ్వులంతంత లోహపత్రములను కాశికామూలకల్కముతో పూసి ఎండకు ఎండించి మఱలపూసి నిప్పులో నెండించి త్రిఫలముల కషాయములో మాటిమాటికి ముంచవలయును. పిమ్మట చూర్ణము చేసి వస్త్రగాళితము చేసి నేయి తేనెలు జేర్చికొని జఠరాగ్ని ననుసరించి భక్షింపవలయును. ఇట్లు ఒక నెలగాని రెండు నెలలుగాని నాలుగు నెలలుగాని ఈయౌషధమును భక్షించి మేకపాలను అనుపానముగా గ్రహింపవలయును. 64 రెట్లు ఆవునేతితో గాని ఆవుపాలతో గాని ఈయోగమును చేయవలయు. దీనిని ఒక నెల సేవించిన పరిణామశూలలు నశించును. దీనిని బ్రహ్మ సృజించెను. కకారమాదిగల పదార్థములను పులుపువస్తువులును నీటిపట్టులలోని జంతువులమాంసమును దీని సేవనకాలమందు రోగి వర్జింపవలయును.

### ఖండామలకీ.

శ్లో. స్విన్నపీడితకూష్మాండాత్తులార్ధం మృష్ట మాజ్యతః, ప్రస్థార్ధే ఖండతుల్యం తు పచేదామలకీరసాత్. 66. ప్రస్థే సుస్విన్నకూష్మాండరసప్రస్థే విఘట్టయన్, దర్వ్యా పాకం గతే తస్మిం చూర్ణీకృత్య వినిక్షిపేత్. 67. ద్వే ద్వే పలే కణాజాజీశుంఠీనాం మరిచస్య చ, పలం తాళీసధన్యాక చాతుర్జాతక ముస్తకం. 68. కర్షప్రమాణం ప్రత్యేకం ప్రస్థార్ధం మాక్షికస్య చ, పక్తిశూలం నిహన్త్యేతద్దోషత్రయభవం

చ యత్. 69. ఛర్ద్యమ్లపిత్తమూర్ఛా శ్చ శ్వాసకాసావరోచకం, హృచ్ఛూలం రక్తపిత్తం చ పృష్ఠశూలం చ నాశయేత్, రసాయన మిదం శ్రేష్ఠం ఖండామలకసంజ్ఞికం. 70.

స్విన్నములు పీడితములునగు గుమ్మడికాయను 50 పలములు తెచ్చి 16 పలముల నేతితో వేయించి కండచక్కెర యుసిరికరసము 8 పలముల చొ॥ పైదానిలో కలిపి గరిటెతో మర్దనచేయుచు నుడికించి, పాకమైన పిమ్మట ఈక్రింది యౌషధముల నందు వేయవలయును. పిప్పళ్లు జీలకఱ్ఱ శొంఠి 2 పలముల చొ॥ మిరియములు 1 పలము చొప్పున తాడిశపత్రి ధనియములు ఏలకులు తేజపత్రి నాగకేసరములు తుంగముస్తలు ఇవి కాలుపలముచొ॥ తేనె 16 పలముల చొప్పున చేర్పవలయును. ఇయ్యది త్రిదోషజములగు పరిణామశూలలను ఛర్ది ఆమ్లపిత్తము మూర్ఛ శ్వాసము కాసము అరోచకము హృచ్ఛూలము రక్తపిత్తము మున్నగు వానిని పోగొట్టును.

### నారికేళఖండము.

కుడవమితి మిహ స్యా న్నారికేలం సుపిష్టం, పలపరినామితే సర్పిషి పాచితం ఖండతుల్యం. 71. నిజపయసి తదేతి త్పక్వసమాత్రే విపక్వం, గుడవ దథ సుశీతే శాణభాగాన్ క్షిపేచ్ఛ. 72. ధన్యాకపిప్పలీ యోరమ్ తుగా ద్విజీరాం శాణం త్రిజాత మిభకేసరక ద్విచూర్ణ్య. 73. హ స్త్య మ్లపిత్త మరుచిం క్షయ మస్రపిత్తం శూలం వమిం సకలపౌరుషకారం హారి. 74.

కొబ్బెరను చక్కగా నూరి 8 పలములును నేతిని 10 పలములు కండచక్కెర ఆవుపాలు 4 పలము చొ॥ను అందు కలిపి పక్వము చేసి చల్లారిన పిమ్మట ధనియములు పిప్పళ్లు తుంగముస్తలు వంశలోచనము జీలకఱ్ఱ లవంగిపుపట్ట ఏలకులు తేజపత్రి నాగకేసరములు వీటిని శాణప్రమాణము చూర్ణము చేసి అందు కలిపి తినిన ఆమ్లపిత్తము అరుచి క్షయ రక్తపిత్తము శూల ఛర్ది నశించును.

### కలాయచూర్ణాదులు.

శ్లో. కలాయచూర్ణభాగా ద్వౌ లోహచూర్ణస్య చాపరః, కారవేల్ల పలాశానాం రసే నైవ విమర్దితః. 75. కర్షమాత్రాం తత శ్చైకాం భక్షయే ద్గుటికాం నరః, మండానుపానా త్సా హన్తి జరత్పిత్తం సుదారుణం. 76. లిహ్యా ద్వా త్రైఫలం చూర్ణ మయసాచ్ఛన్న

సమన్వితం, యష్టిచూర్ణేన వా యుక్తం లిహ్యాత్ క్షౌద్రేణ తద్గదే. 77. పిత్తాన్తం వమనం కృత్వా కఫాన్తం చ విరేచనం, అన్నద్రవే చ తత్కార్యం జరత్పిత్తే యదీరితం. 78. ఆమపక్వాశయే శుద్ధే గచ్ఛే దన్నద్రవః శమం, మాషేండరీ సతుషికా స్విన్నా సర్పిర్యుతా హితా. 79. గోధూమమండకం తత్ర సర్పిషా గుడసంయుతం, ససితం శీతదుగ్ధేన మృదితం వా హితం మతం. 80. శాలితండులమాంసం వా కవోష్ణం సిక్థవర్జితం, వాట్యం క్షీరేణ సంసిద్ధం ఘృతపూరం సశర్కరం. 81. శర్కరాం భక్షయిత్వా వా క్షీరం ముత్క్వథితం పిబేత్, పటోలపత్రయూషేణ ఖాదే చ్ఛణకసక్తుకాన్. 82. అన్నద్రవే జరత్పిత్తే వహ్ని ర్మందో భవే ద్యతః, తస్మా దత్రాన్నపానాని మాత్రాహీనాని కల్పయేత్. 83.

బోడసెనగల చూర్ణమును 1 భాగమును లోహచూర్ణమును 1 భాగమును కాకర మోదుగ రసములతో మర్దించి మాత్రలచేసి రోజు కొక్క దానిని తిని మండపు అను పానము చేసిన భయంకరములగు జ్వరపిత్తములు నశించును. త్రిఫలచూర్ణములో లోహచూర్ణమును కలిపి తినినను, యష్టిమధుక చూర్ణములో తేనె కలిపి తినినను జ్వరపిత్తములు నశించును. పిత్తము పోవువఱకును వమనమును, కఫము పోవువఱకును విరేచనమును చేయించి జ్వరపిత్తవిధమందలి అన్నవిధానమును చేయవలయును. ఆమాశయపక్వాశయములు శుద్ధములైనచో అన్నద్రవము శాంతించును. దీనికి పొట్టుతోగూడ నేయితో వేచిన మాషేండరికి హితము. అంత గోధుమగంజిని నేతితో బెల్లముతో చేర్చిగాని చక్కెరతో చేర్చిగాని చల్లనిపాలతోగాని మర్దనము హితము. నూకలు లేనివరిబియ్యపుగంజి వెచ్చచేసి యిచ్చినను పాలతోచేసిన వాట్యముగాని చక్కెరతోచేసినపూరిగాని హితముంజేయును. కండచక్కెరను తిని కాచిన పాలనుగాని చేనపొల్లగంజిలో సెనగపిండి చేర్చికొనిగాని సేవించిన అన్నద్రవమునందును జ్వరపిత్తమునందును అయిన అగ్నిమాంద్యము శమించును. కావున నీవిధియందు అన్నపానములను మాత్రాహీనములుగా చేయవలయును.

ఇట్లు చక్రదత్తయందు పరిణామశూలాధికారప్రకరణము ముగిసెను.



# ౨౮. ఉదావర్తాధికారము.

## నారాచ చూర్ణము.

శ్లో. త్రివృత్సుధాపత్రతిలాదిశాకగ్రామ్యౌదకానూపరసైర్యవాన్నం, అన్యైశ్చ సృష్టానిలమూత్రవిడ్భిరద్యాత్ప్రసన్నాగుడసీధుపాయీ. 1. ఆస్థాపనం మారుతజే స్నిగ్ధస్విన్నస్య శస్యతే, పురీషజే తు కర్తవ్యో విధిరానాహికశ్చ యః. 2. క్షారాన్నైతైలాన్నా వస్తే యుంజ్యాత్తత్ర చికిత్సకః, శ్యామా దంతీ ద్రవంతీ చ మహాశ్యామా స్నుహీ త్రివృత్. 3. సప్తలా శంఖినీ శ్వేతా రాజవృక్షః సతిల్వకః, కంపిల్లకం కరంజశ్చ హేమక్షీరీత్యయం గణః. 4. సర్పిస్తైలరజః క్వాథకల్కేష్వన్యతమేషు చ, ఉదావర్తోదరానాహవిషగుల్మవినాశనః. 5. త్రివృత్కృష్ణాహరీతక్యో ద్విచతుఃపంచభాగికాః, గుడికా గుడతుల్యాస్తా విడ్విబంధగదాపహాః. 6. హరీతకీయవక్షారపీలూని త్రివృతా తథా, ఘృతైశ్చూర్ణమిదం పేయముదావర్తవినాశనమ్. 7. హింగుకుష్ఠవచాసర్జిబిడం చేతి ద్విరుత్తరమ్, పీతం మద్యేన తచ్చూర్ణముదావర్తహరం పరమ్. 8. ఖండపలం త్రివృతాసమముపకుల్యాః కర్షచూర్ణితం శ్లక్ష్ణం, ప్రాగ్భోజనే చ సమధు, బిడాలపదకం లిహేత్ప్రాజ్ఞః. 9. ఏతద్గాఢపురీషే పిత్తే సకఫే చ వినియోజ్యమ్, స్వాదుః నృపయోగ్యోయం చూర్ణో నారాచకో నామ్నా. 10.

తెల్లతెగడ సుధాపత్రము నూవుకూర మొ॥ గ్రామ్యౌదకములు అనూపదేశపు మాంసము వీటితో యవాన్నమును గాని అధోవాతము విష్ఠమూత్రము వీనిని పుట్టించెడి పదార్థముతో బెల్లము సారాయమును గాని సేవింపవలయును. వాతోదావర్తమునందు చెమ్మటపట్టించు చికిత్స చేయవలయును. విష్ఠజమగు నుదావర్తమునందు ఆనాహాము నకువలె చికిత్సలను క్షారవైతరణరూపములగు వస్తులను చేయింపవలయును. ప్రేంకణము చెక్క వావిలి దింటెన ఎలుకచెవికూర తెల్లవావిలి శంఖపుష్పము గోకర్ణి అమ్లవేతసము లొద్దుగ నెమలియడుగుచెక్క ఈ గణముతో నైనను గానీ, నేయి తైలము చూర్ణము కషాయము కల్కము మున్నగు వానిలో తేనెతో నైనను సేవించిన యుదావర్తము ఉదరరోగము మున్నగునవి నశించును. తెల్లతెగడ 2 భాగములు పిప్పళ్ళు

మతః, రమయేయుః ప్రియా నార్యః శుక్రోదావర్తినం నరం. **23.** అ
త్రాభ్యంగావగాహాశ్చ మదిరా శ్చరణాయుధాః, శాలిః పయోనిరూ
హాశ్చ శస్తం మైథున మేవ చ. **24.** క్షుద్విఘాతే హితం స్నిగ్ధ ముష్ణ
మల్పం చ భోజనం, తృష్ణాఘాతే పిబే న్మంథం యవాగూం వా పి
శీతలాం. **25.** రసే నాద్యా త్సువిశ్రాన్తః శ్రమః శ్వాసాతురో
నరః, నిద్రాఘాతే పిబేత్ క్షీరం స్వప్యాః సంవాహనాని చ, ఉదావర్త
క్రియానాహే సామే లంఘనపాచనం. **26.**

ఉల్లిగడ్డను కల్లుతో చేర్చుకొని ప్రాతఃకాలమునందు త్రాగిన ఉదావర్తము గుల్మము శూల ఇయ్యవి నశించును. ఇయ్యది దీపనము బలవర్ధకము నగును. ఇంగువ తేనె సైంధవలవణము వీటిని వత్తిచేసి పక్వముచేసి నేతితో మాటి గుదస్థానమున నుంచవలయును. ఉమ్మెత్త పిప్పళ్లు కోష్ఠు వస తెల్లఆవాలు బెల్లము యవక్షారము వీటితో ఫలవర్తి శ్రేష్ఠము. ఇంటిబూజు సైంధవలవణము తైలము పులుపు వీటితో చేర్చిన గుళ్లిగ గాని వావిలిని నలిచి గాని గుదస్థానమున నుంచవలయును. మూత్రము వెడలనిచో సౌవర్చలవణముతో సిధుచేసిన కల్లును త్రాగవలయును. ఏలకులను కల్లుతో గాని, నీటితో పాలను గాని త్రాగవలయును. వాకుడుఆకు రసమునైనను మద్దిచెట్టు రసమును గాని నక్కదోసగింజల రసమును గాని సైంధవలవణముతో త్రాగవలయును. పంచమూలముతో పక్వము చేసిన పాలను గాని ద్రాక్షారసమును గాని మూత్రకృచ్ఛ్రమందు ప్రయోగింపవలయును. జృంభజమగు నుదావర్తమునందు స్నేహస్వేదములు చేయవలయును. అశ్రూత్థమగు దానికి కన్నీరు గార్పించునది. నిద్ర మద్యపానము కథాశ్రవణము హితకరములు. తుమ్మువలన గలిగెడి యుదావర్తమునకు క్షుతపత్రముల ముక్కులోనుంచి తుమ్ములను వెడలింపవలయును. వాతజమగు నేతి మద్యమును నేయియును హితకరములు. ఉద్గారపుటుదావర్తమునందు క్రమానుసారముగా ధూమాదులను చేయవలయును. ఛర్దిజములకు దోషానుసారాముగా నస్యాదులను చేయవలయును. భోజనమైన పిమ్మట ప్రచ్ఛర్దమును పొగవేయుట లంఘనము రక్తస్రావము రూక్షాన్నము శరీరవ్యాయామము విరేచనము హితకరములు. వస్తిశుద్ధిని చేయువాడు వాల్గుగట్ల నీటిలో పాలను పోసికొని ఇగిరిపోవువఱకు కాచి త్రాగిన యుదావర్తములు నశించును. దీనియందు నభ్యంగనము స్నానము మద్యము కోడిమాంసము వరియన్నమును హితకరములు. ఆకలివలనవగు ఉదావర్తమునకు స్నిగ్ధమగు నాహారమును చేకొనవలయును. తృష్ణాఘాతమునందు మండమును గాని చల్లని గంజినిగాని త్రాగవలయును. ఆయసజమగు శ్వాసముచేత పీడితుడగువాడు విశ్రాంతిని

గైకొని మాంసరసముతో భుజింపవలయును. నిద్రాఘాతమునందు పాలను త్రాగవలయును. పరుండుట కాళ్లుపిసికించుకొనుట మంచిది. ఆనాహమునకు ఉదావర్తమునకువలెనే చికిత్సను చేయవలయును. ఆమజమగు నానాహమునందు లంఘనమును పాచనమును హితకరములు.

### హింగ్వాదిగుటికలు.

శ్లో. ద్విరుత్తరా హింగువచా సకుష్ఠా సువర్చికా చేతి విడంగచూర్ణం, సుఖాంబునా౽నాహ విషూచికార్తి హృద్రోగగుల్మోర్ధ్వ సమీరణఘ్నం. 27. వచాభయాచిత్రకయావశూకాన్ సపిప్పలీకాతివిషాన్ సకుష్ఠాన్, ఉష్ణాంబునానాహ విమూఢవాతాన్ పీత్వాజయేద్దాశు హితౌదనాశీ. 28. త్రివృద్ధరీతకశ్యామాః స్నుహీక్షీరేణ భావయేత్, వటుకా మూత్రపీతాస్తాః శ్రేష్ఠాశ్చానాహభేదికాః. 29. ఫలం చ మూలం చ విరేచనోక్తం హింగ్వర్కమూలం దశమూలమగ్ర్యం, స్నుక్చిత్రకౌ చైవ పునర్నవా చ తుల్యాని సర్వైర్లవణాని పంచ. 30. స్నేహైస్సమూత్రైస్సహ జర్జరాణి శరావసంధౌ విపచేత్సులిప్తే. పక్వం సుపిష్టం లవణం తదన్నైః పానైస్తథానాహరుజాఘ్నమగ్ర్యం. 31. వాటఘూముపిష్ట్వాపిగుడమూత్రైర్వా పాచితా, గుదే౽ంగుష్ఠసమా వర్తిర్దేయానాహశాంతయే. 32. శ్యామాత్రికటుసైంధవసర్షపగృహధూమకుష్ఠమదనఫలైః, మధుని గుడే వా కృత్వా పాయూ౽ంగుష్ఠమానికో వర్తిః, వర్తిరియం దృష్టఫలా గుదే నిహితా ప్రణశ్యత్యాశ్వానాహం, ఆనాహోదావర్తప్రశమనీ జఠరగుల్మవిదారిణీ. 34.

ఇంగువ ఒక భాగము వస 4 భాగములు చెంగల్వకోష్టు 2 భాగములు సజ్జక్షారము 8 భాగములు విడాలవణము 16 భాగములు చూర్ణముచేసి గోరువెచ్చనినీటితో త్రాగిన ఆనాహము విషూచి హృద్రోగము గుల్మము ఊర్ధ్వవాతము నశించును. వస కరక్కాయలు చిత్రమూలము యవక్షారము పిప్పళ్లు అతివస కోష్టు వీటిచూర్ణములతో సేవించిన ఆనాహము మూఢవాతములు నశించును. కాని మంచివరిబియ్యపుఅన్నమును తినవలయును. తెల్లతెగడ కరక్కాయలు నల్లతెగడ జెముడుపాలతో నాన్చి నూరి మాత్రలను చేసి గోమూత్రముతో సేవించిన ఆనాహము నశించును. విరేచనమునకై చెప్పిన పండ్లు వేళ్లు ఇంగువ అర్కమూలము దశమూలములు జెముడుపాలు కొంత చిత్రమూలము వీటిని సమానభాగములును వీటియన్నిటియంత పంచలవణములను పొడిచేసి తైలగో

మూత్రములతోఁ గలగార్చి మూకుఁడులో పెట్టి మూసికట్టిపెట్టి పక్వము చేసి పిమ్మట నూరి సైంధవలవణముఁ గలిపి అన్నపానములతోఁ దినిన ఆనాహములు నశించును. పుష్కరమూలము ఇంటిబూజు అంటుప్ప శొంఠి మిరియములు పిప్పళ్ళు బెల్లము గోమూత్రము వీటిని నూరి అంగుష్ఠ మంతలావువత్తిచేసి కాచి గుదస్థానములో నుంచిన ఆనాహములు శూలలు నశించును. శొంఠి మిరియములు పిప్పళ్ళు సైంధవలవణము ఆవాలు కోష్ఠు ఉమ్మెత్త వీటితో అంగుష్ఠమంత వత్తిని చేసి గుదస్థానమున నుంచవలెను. ఇది ఆనాహోదావర్తములను పోఁగొట్టును. గుల్మరోగములను నశింపఁజేయును.

### శుష్కమూలాద్య ఘృతము.

శ్లో. మూలకం శుష్క మార్ద్రం చ వర్షాభూః పంచమూలకం, ఆరేవతఫలం చాపి పిష్ట్వా తేన పచే ద్ఘృతం, తత్పీయమానం శమయే దుదావర్త మసంశయం. 35.

ఎండినముల్లంగిని పచ్చి కప్పగంతుఆకును పంచమూలములు ఆమ్లవేతసము వీటిని నూరి ఇందులో నేతిని పక్వముచేసి త్రాగిన ఉదావర్తము నశించును. సందేహములేదు.

### స్థిరాద్యఘృతము.

శ్లో. స్థిరాదివర్గస్య పునర్నవాయాః సంపాకపూతీకకరంజయోశ్చ, సిద్ధః కషాయే ద్విపలోన్మితానాం ప్రస్థో ఘృతా త్స్యా త్ప్రతిరుద్ధవాతే. 36.

స్థిరాదిగణపుఔషధములు శొంఠి ఆమ్లవేతసము నెమలియడ్గుచెక్క వీటిని 2 పలములు చొ కషాయము చేసి 16 పలముల నేయిని సిద్ధముచేసి ప్రతిరుద్ధవాతము నందు సేవించిన హితకరము.

ఇట్లు చక్రదత్తయందు ఉదావర్తాధికార ప్రకరణము ముగిసెను.

---

## ౨౯. గుల్మాధికారము.

### గుల్మరోగుల భోజనపద్ధతి.

శ్లో. లఘ్వన్నం దీపనం స్నిగ్ధ ముష్ణం వాతానులోమనం, బృంహణం య ద్భవే త్సర్వం తద్ధితం సర్వగుల్మినాం. 1. స్నిగ్ధస్య భిషజా

స్వేదః కర్తవ్యో గుల్మశాన్తయే, స్రోతసాం మార్దవం కృత్వా జిత్వా మారుత ముల్బణం. 2. భిత్వా విబద్ధం స్నిగ్ధస్య స్వేదో గుల్మ మపోహతి, కుంభీపిండేష్టకాస్వేదా న్కారయే త్కుశలో భిషక్. 3. ఉపనాహాశ్చ కర్తవ్యాః సుఖోష్ణాః శాల్వణాదయః, స్థానావసేకో రక్తస్య బాహుమధ్యే శిరావ్యధః. 4. స్వేదానులోమనం చైవ ప్రశస్తం సర్వగుల్మినాం, పేయా వాతహరైః సిద్ధాః కౌలత్థాధన్వజా రసాః. 5. ఖడాః సపంచమూలాశ్చ గుల్మినాం భోజనే హితాః.

తైలికయుక్తము లీహనము స్వేదనము నిచ్చి నున్నయు వాతమును పోఁగొట్టును. బృంహణమగు అన్నమును గుల్మరోగులకు హితకరములు. గుల్మములు పోవుటకొఱకు స్నిగ్ధభోజనము చేయవలయును. స్వేదనములను చేయింపవలయును. ఇట్టి స్వేదము స్రోతస్సులను మృదువుగా చేసి వాతప్రకోపమును అణఁచి గుల్మములఁ బోఁగొట్టును. వైద్యుఁడు కుంభీపిండేష్టకలు మున్నగువానివలన చెమ్మటను పుట్టింపవలయును. ఉపనాహము స్వేదము శాల్వణము మున్నగు వాని చేయింపవలయును. అన్నిగుల్మరోగములకును స్వేదానులోమనములు హితకరములు. వాతహర పదార్థముల చేయును ఉలవలకషాయమును సేవించుట త్రాగుట మంచిది. పంచమూలములతోఁ గదగ్గిన తినుటయును హితకరమే యగును.

ఘృతకథనములు.

శ్లో. మాతులుంగరసో హింగు దాడిమం బిడసైంధవమ్. 6. సురామండేన పాతవ్యం వాతగుల్మరుజాపహం, నాగరార్ధపలం పిష్టం ద్వేపలే లుంచితస్య చ. 7. తిలస్యైకం గుడపలం క్షీరేణోష్ణేన పాయయేత్, వాతగుల్మ ముదావర్తం యోనిశూలం చ నాశయేత్. 8. పిబేదేరండతైలం వా వారుణీమండమిశ్రితమ్, తదేవ తైలం పయసా వాతగుల్మీ పిబే న్నరః. 9. సాధయే చ్ఛుద్ధశుష్కస్య లశునస్య చతుఃపలమ్, క్షీరోదకేష్టగుణితే క్షీరశేషం చ పాయయేత్. 10. వాతగుల్మ ముదావర్తం గృధ్రసీం విషమజ్వరం, హృద్రోగం విద్రధిం శోషం శమయత్యాశు తత్పయః. 11. ఏవం తు సాధితే క్షీరే స్తోక మప్యత్ర దీయతే, సర్జికాకుష్ఠసహితః క్షారః కేతకిజోఽపివా. 12. తైలేన పీతః శమయే ద్గుల్మం పవనసంభవం.

మాతులుంగరసము ఇంగువ దానిమ్మ పేటుప్పు సైంధవలవణము వీటిని సురా మండముతో త్రాగిన వాతగుల్మములబాధ యుపశమిల్లును. శొంఠి, అరపలము గోధుమ చూర్ణము అరపలము తిలలుపలము బెల్లముపలము వీటినిచూర్ణముచేసి వెచ్చనిపాలతో త్రాగిన వాతగుల్మములు ఉదావర్తములు యోనిశూలలు నశించును. వారుణీమండముతో కలిపిగాని పాలలో ఆముదమును వైచికొనిగాని త్రాగిన వాతగుల్మములు నశించును. శుద్ధిచేసిన యుల్లిగడ్డను 4 పలములను ఎనిమిదిరెట్లు పాలలో కలిపి పక్వముచేసి పాలను మిగిల్చికొని త్రాగవలయును. ఇది వాతగుల్మములు ఉదావర్తము గృధ్రసి విషమజ్వరము హృద్రోగము విద్రధి శోఫ వీటిని పోగొట్టును. ఈపాలలో సజ్జక్షారము శొంఠి యవక్షారములను గాని మొగలిరసమును గాని వెచ్చచేసి ఆముదముతో త్రాగిన వాతగుల్మములు నశించును.

—◎ వాతిగుల్మముల కుపాయములు. ◎—

శ్లో. వాతిగుల్మే కఫే వృద్ధే వాన్తి శూర్చణాది రిష్యతే, 13. పైత్తే తు రేచనం స్నిగ్ధం రక్తే రక్తస్య మోక్షణం, స్నిగ్ధోష్ణే నోదితే గుల్మే పైత్తికే స్రంసనం హితం. 14. రూక్షోష్ణేన తు సంభూతే సర్పిః ప్రశమనం పరం, కాకోల్యాదిమహాతిక్త వాసాద్యైః పిత్తగుల్మినం. 15. స్నేహానం స్రంసయే త్పశ్చా ద్యోజయే ద్వస్తికర్మణా, స్నిగ్ధోష్ణజే పిత్తగుల్మే కంపిల్లం మధునా లిహేత్. 16. రేచనార్థే రసంవాపి ద్రాక్షాయాః సగుడం పిబేత్, దాహశూలాని లక్షభ స్వప్ననాశారుచి జ్వరైః. 17. విదహ్యమానం జానీయా గ్గుల్మం త ముపనాహయేత్, పక్వేతు వ్రణవ త్కార్యం వ్యధశోధనరోపణమ్. 18. స్వయ మూర్ధ్వ మధోవాపి సచే ద్దోషః ప్రపద్యతే, ద్వాదశాహ ముపేక్షేత రక్ష న్నన్యా నుపద్రవాన్. 19. పరంతు శోధనం సర్పిః శుద్ధం సమధుతిక్తకమ్, రోపణే కటుకానింబం మధుక త్రిఫలా త్వచః. 20. కర్షాంశా స్త్రియమాణా చ పటోలత్రివృతాపలే, ద్విపలం చ మసూరాణాం సాధ్య మష్టగుణేం భసి. 21. ఘృతా చ్ఛేషం ఘృతసమం సర్పిష శ్చ చతుఃపలమ్, పిబే త్సమ్మూర్ఛితం తేన గుల్మః శామ్యతి పైత్తికః 22. జ్వర స్తృష్ణా చ శూలం చ భ్రమ మూర్ఛా రతి స్తథా, దీప్తాగ్నయో మహాకాయాః స్నేహసాత్మ్యాశ్చ

యే నరాః. 23. గుల్మినః సర్వ ఏవైతా శ్చ విసర్పోపహతాశ్చ యే, జ్యేష్ఠాం మాత్రాం పిబేయు స్తే పలాన్యష్టౌ విశేషతః. 24.

వాతగుల్మములకును కఫవృద్ధికిని వాంతులు చూర్ణములు మున్నగునవి హితకరములు. రక్తగుల్మములకు రక్తస్రావము హితకరము. స్నిగ్ధోష్ణజనితమగు దానికి పిత్తజమగు దానికి స్రంసనము త్తమము. కాకోలీయున్నగు గణప్రోక్తౌషధములతో పిత్తగుల్మరోగులకు స్నేహవిధి చేయవలయును. పిమ్మట వస్తివిధిని చేయవలయును. స్నిగ్ధోష్ణజమగు పిత్తగుల్మరోగమునకు కంపిల్లమును తేనెతో సేవింపవలయును. రేచనార్థియగువాఁడు ద్రాక్షారసములో బెల్లమును నైచుకొని త్రాగవలయును. దాహంశూలములు వాతక్షోభము స్వప్ననాశము అరుచి జ్వరము వీటిచే బాధపడువానిని గుల్మరోగిగా తెలిసికొని ఉపనాహముఁ జేయవలయును. పక్వమైన వ్రణశోధనాదులను వ్రణమునకువలెనే చికిత్స చేయవలయును. తనంతనది పైనగాని క్రిందగాని పుట్టినయెడల పండ్రెండుదినాలవఱకు నుపేక్ష చేయవలయును. అయినను శోధనము చేయు నేతినిచ్చి నెలవేము నేతిని పిమ్మట త్రాగింపవలయును. కటుకరోహిణి నింబము యష్టిమధుకము త్రిఫలములు వీటిని రెండు రెండు పలములను చెనకాయ త్రాయ తెగడ ఒక్కొక్కపలమును మసూరము రెండుపలములను నీటిని ఎనిమిదిరెట్లు నీటిలో పక్వముచేసి 4 పలముల నేతిని కలిపి సిద్ధముచేసి నేయి మాత్రము మిగిలియుండఁగా దించి దానిని త్రాగినచో జ్వరము దప్పి శూల భ్రమ మూర్ఛలు నశించును. దీప్తాగ్నికలవారును మహాకాయులును స్నేహసాధ్యులును గుల్మరోగులును సర్వవ్యాధులును విసర్పిరోగులును ఎనిమిదిపలముల మానముగల పెద్దమాత్రగ నేతిని సేవింపవలయును.

## కఫగుల్మమునకు ఘృతాదులు.

శ్లో. లంఘనోల్లేఖనే స్వేదే కృతే గ్నౌ సంప్రధుక్షితే, ఘృతం సక్షారకటుకం పాతవ్యం కఫగుల్మినామ్. 25. మందోగ్ని ర్వేదనాపూర్వం దా గురు స్తిమితకోష్ఠతా, సోత్క్లేశారుచి ర్యస్య సగుల్మో వమనోపగః. 26. మందాగ్ని వనిలే మూఢే జ్ఞాత్వా సస్నేహ మాశయం, గుటికా శ్చూర్ణనిర్యూహాః ప్రయోజ్యాః కఫగుల్మినాం. 27. క్షారారిష్టగణ శ్చాపి దాహశోషే విధీయతే, పంచమూలీకృతం తోయం పురాణం వారుణీరసం. 28. కఫగుల్మీ పిబే త్కాలే జీర్ణం మాధ్వీకమేవ వా, తిలైరండాతసీబీజ సర్షపైః పరిలిప్య వా. 29. శ్లేష్మగుల్మమయః పాత్రైః సుఖోష్ణైః స్వేదయే ద్భిషక్, యవమాన చూర్ణితం తక్రం

బిడేన లవణీకృతం. 30. పిబే త్సందీపనం వాతమూత్రవర్చోనులోమనమ్, వ్యామిశ్రదోషే వ్యామిశ్రః సర్వఏవ క్రియాక్రమః. 31.

లంఘనమునం దుల్లేఖనములను స్వేదములను చేయింపవలయును. కఫగుల్మరోగులకు యవక్షారకటుకరోహిణులతో నేతిని సిద్ధముచేసి త్రాగింపవలయును. మందాగ్ని కలవాఁడు అల్పబాధకలిగిన తిమ్మిరిగలగుల్మరోగి కఫగుల్మరోగులను చేసి మాత్రలనుపొడి చేసి యుపయోగింపవలయును. క్షారములు అరిష్టగణౌషధములును దాహశోషలయందు వినియోగింపవలయును. పంచమూలపుకషాయమును ప్రాతపడ్డమద్యమును గాని ప్రాతగిలిన ద్రాక్షసారాయమునుగాని యుపయోగింపవలయును. నువ్వులు ఆముదపుగుంజులు అవిసి విత్తులు వీటి సినుపపాత్రములో వేయించి గుల్మమునకు స్వేదక్రియను చేయింపవలయును. బోడసరపువిత్తుల చూర్ణము మజ్జిగ అంటుప్పు వీటిని కలిపి త్రాగిన అగ్నిదీపకమగును. వాతమును మూత్రమును విష్ఠను అనులోమితమును చేయును. మిశ్రదోషముల గుల్మములకు మిశ్రమనుగు చికిత్సనే చేయవలయును.

## సన్నిపాతగుల్మమునకు చికిత్స.

శ్లో. సన్నిపాతోద్భవే గుల్మే త్రిదోషఘ్నో విధి ర్హితః, వచాబిడాభయాశుంఠీ హింగుకుష్ఠాగ్ని దీప్యకాః. 32. ద్విత్రిషట్చతురేకాష్టసప్తపంచాశికాః క్రమాత్, చూర్ణం మద్యాదిభిః పీతం గుల్మానాహోదరాపహం. 33. శూలార్శ్వః శ్వాసకాసఘ్నం గ్రహణీదీపనం పరం, యమానీహింగుసింధూత్థ క్షారసౌవర్చలాభయాః. 34. సురామండేన పాతవ్యా గుల్మశూలనివారణాః.

సన్నిపాతగుల్మమునకు త్రిదోషనాశకమగు విధి నాచరింపవలయును. వస 2 భాగములు, అంటుప్పు 3 భాగములు, కరక్కాయలు 6 భాగములు, శొంఠి నాలుగు భాగములు ఇంగువ ఒకభాగము కోష్ఠు 8 భాగములు చిత్రమూలము 7 భాగములు వాము 5 భాగములు ఇవిక్రమముగా చూర్ణముచేసి మద్యముతో త్రాగిన గుల్మాదులునశించు. వామము ఇంగువ సైంధవలవణము యవక్షారము సౌవర్చలవణము కరక్కాయలు వీటిని మద్యమండముతో త్రాగిన గుల్మములు శూలలు నశించును.

## హింగ్వాదిచూర్ణము.

శ్లో. హింగు త్రికటుకం పాఠాం హపుషా మభయాం శఠిం. 35. అజమోదాజగంధే చ తిన్త్రిడీకామ్లవేతసౌ, దాడిమం పౌష్కరం

ధాన్య మజాజీం చిత్రకం వచాం. 36. ద్వౌ క్షారౌ లవణే ద్వే చ చవ్యం చైకత్ర చూర్ణయేత్, చూర్ణ మేత త్ప్రయోక్తవ్య మన్నపానే ష్వనత్యయం. 37. ప్రాగ్భక్త మథవా పేయం మద్యే నోష్ణోదకేన వా, పార్శ్వహృద్వస్తిశూలేషు గుల్మే వాతకఫాత్మకే. 38. ఆనాహే మూత్రకృచ్ఛ్రే చ గుదే యోనిరుజాసు చ, గ్రహణ్యర్శో వికారేషు ప్లీహ్ని పాండ్వామయే ఒరుచౌ 39. ఉరోవిబంధే హిక్కాయాం శ్వాసే కాసే గళగ్రహే, భావితం మాతులుంగస్య చూర్ణ మేత ద్రసేన వా. 40. బహుశో గుళికాః కార్యాః కార్ముకాః స్యు స్తతోధికం.

ఇంగువ శొంఠి మిరియములు పిప్పళ్లు అగరుశొంఠి బోడతరము కరక్కాయలు కచ్చూరము అజామోదము కురంజివాము చింతపండు అమ్లవేతసము దానిమ్మ పుష్కరమూలము ధనియములు జీలకఱ్ఱ చిత్రమూలము వస యవక్షారము మున్నగువానిని త్రిలవణములు చవ్యము వీటినికలిపి పొడిచేసి అన్నపానాదులలో సేవించిన హితకరము. ప్రాతఃకాలపుభోజనమునకు ముందు మద్యముతోను వేడినీళ్లతో దీని త్రాగవలయును. పార్శ్వశూలము హృచ్ఛూలము వస్తిశూలము వాతకఫగుల్మములు ఆనాహము మూత్రకృచ్ఛ్రము గుదయోనిబాధలు మూలరోగములు ప్లీహరోగము పాండురోగము అరుచి రొమ్ముపట్టుట వెక్కిళ్లు శ్వాసము దగ్గు గళగ్రహము మొదలగువానికి హితకరమగును. లేనిచో ఈ చూర్ణమును మాదీఫలరసముచే భావనచేసి ఒక్కొక్కగోలపుమాత్రనుచేసి ధరించిన మేలగును.

హింగ్వాదిప్రతీవాపము.

శ్లో. ప్రాతీః పతగంధిచిత్రకటి చవ్య పిప్పల్యో వ్యోషం చ సంస్తరచితం లవణోపధానం, దగ్ధ్వా పిచూర్ణ్య దధిమండయుతం ప్రయోజ్యం గుల్మోదరశ్వయథు పాండుగదోద్భవేషు. 41. హింగుపుష్కరమూలాని తుంబురూణి హరీతకీం, శ్యామాం బిడం సైంధవం చ యవక్షారం మహౌషధం. 42. యవక్వాథోదకే నైతి ద్ఘృతభృష్టం తు పాయయేత్. 43. తేనాస్య భిద్యతే గుల్మః సశూలః సపరిగ్రహః,

వచా హరీతకీ హింగు సైంధవరసాల్మవేతసం. 44. యవక్షారం యమానీం చ పిబే దుష్ణేన వారిణా, ఏతద్ధి గుల్మనిచయం సశూలం సపరిగ్రహం. 45. భినత్తి సప్తరాత్రేణ వహ్నేర్దీప్తిం కరోతి చ, పిప్పలీపిప్పలీమూల చిత్రకాజాజిసైంధవైః. 46. యుక్తా పీతా సురా హన్తి గుల్మమాశు సుదుస్తరం, నాదేయీ కుటజార్క శిగ్రుబృహతీ స్నుగ్బిల్వభల్లాతక, వ్యాఘ్రీకింశుకపారిభద్రకజటాపామార్గనీపాగ్నికం, వాసా ముష్కకపాటలాః సలవణా దగ్ధ్వా జలే పాచితం, హింగ్వాది ప్రతివాపమేతదుదితం గుల్మోదరాష్ఠీలిషు. 47. హింగూగ్రగంధాబిడశుంఠ్యజాజీ హరీతకీపుష్కరమూలకుష్ఠం, భాగోత్తరం చూర్ణిత మేతదిష్టం గుల్మోదరాజీర్ణవిషూచికాసు. 48.

నెమలియడ్గుచెక్క జాజిపత్రి నాగకేసరములు రక్తచందనము చవ్యము చిత్రమూలము శొంఠి మిరియములు పిప్పళ్లు వీటిని సైంధవలవణముతోఁ గూడి పాత్రలోఁ వైచి కాల్చిచూర్ణముచేసి పధిమండముతో సేవించిన గుల్మములు ఉదరరోగములు వాపు పాండురోగము మున్నగునవి నశించును. ఇంగువ పుష్కరమూలము తుంబురులు కరక్కాయలు సౌవర్చలాదిలవణత్రయము శొంఠి వీటిని నేతితోవేయించి యవక్షారయముతో త్రాగవలయును. పీనశ్శూలములు గుల్మములు నశించును. వస కరక్కాయలు ఇంగువ సైంధవలవణము ఆమ్లవేతసము యవక్షారము వాము వీటిని వేడినీళ్లతో త్రాగవలయును. ఇది ఏడుదినములలో శూలలను జడసహితములగు గుల్మములను పోఁగొట్టి అగ్నిని దీపింపఁజేయును. పిప్పళ్లు మోడి చిత్రమూలము జీలకఱ్ఱ సైంధవలవణము వీటిని చేర్చిన మద్యము భయంకరములగు గుల్మరోగములను నశింపఁజేయును. నీటిప్రబ్బలి కోష్ఠు జిల్లేడు మునగ పెద్దములక జెముడుచెక్క మారేడు నల్లజీడిపిత్తనములును దేవదారుచెక్క వేళ్లు కసిమి చిత్రమూలము వాసపాటలిపుష్పము వీటిని ఉప్పువేసి తగులఁబెట్టి నీటితో పక్వముచేసి ఇంగువ మున్నగు వానిని ప్రతివాపమును చేయవలయును. గుల్మము ఉదరరోగము అష్ఠీలవాతరోగము వీటికి హితమగును. ఇంగువ 1 భాగము వస 1 భాగము పేటుప్పు 3 భాగములు శొంఠి 4 భాగములు జీలకఱ్ఱ 5 భాగములు కరక్కాయలు 6 భాగములు పుష్కరమూలము 7 భాగములు చెంగల్వకోష్ఠు 8 భాగములు వీటిచూర్ణము గుల్మములను ఉదరరోగములను అజీర్ణములను విషూచికలను పోఁగొట్టును.

## కాంకాయనగుటిక.

శ్లో. త్రిఫలా కాంచనక్షీరీ సప్తలా నీలినీ వచాః, త్రాయన్తీ హపుషా తిక్తా త్రివృత్సైంధవపిప్పలీః. 51. పిబేత్సంచూర్ణ్య మూత్రోష్ణవారిమాంసరసాదిభిః, సర్వగుల్మోదరప్లీహ కుష్ఠార్శః శోథ భేదితః. 52. శఠీం పుష్కరమూలం చ దన్తీం చిత్రక మాఢకీం, శృంగబేరం వచాం చైవ పలికాని సమాహరేత్. 53. త్రివృతాయాః పలం చైవ కుర్యాత్ త్రీణి చ హింగునః, యవక్షారపలే ద్వే చ ద్వేపలే చామ్లవేతసాత్. 54. యమాన్యజాజీమరిచం ధాన్యకం చేతి కార్షికం, ఉపకుంచ్యజమోదాభ్యాం తథా చాష్టమికా మపి. 55. మాతులుంగరసేనైవ గుటికాః కారయేద్భిషక్, తాసామేకాం పిబేద్ద్వే చ తిస్రో వాపి సుఖాంబునా. 56. అమ్లైశ్చ మద్యైర్యూషైశ్చ ఘృతేన పయసాథవా, ఏషా కాంకాయనేనోక్తా గుడికా గుల్మనాశినీ. 57. అర్శోహృద్రోగశమనీ క్రిమీణాం చ వినాశినీ, గోమూత్రయుక్తా శమయేత్కఫగుల్మం చిరోత్థితమ్. 58. క్షీరేణ పిత్తగుల్మం చ మద్యైరమ్లైశ్చ వాతికమ్, త్రిఫలారసమూత్రైశ్చ నియచ్ఛేత్సాన్నిపాతికమ్. 59. రక్తగుల్మే చ నారీణా ముష్ట్రక్షీరేణ పాయయేత్.

త్రిఫలములు రేనుడు సాంబ్రాణిచెట్టు సప్తల నీలి వస కలుత్రానుగ బోడతరము కటుకరోహిణి తెల్లతెగడ సైంధవలవణము పిప్పళ్లు వీనిని చూర్ణము చేసి ఆవుమూత్రమును వేడినీళ్లను మాంసరసమును కలిపి త్రాగిన సమస్తములగు గుల్మములు ప్లీహాలు కుష్ఠులు వాపులు మూలరోగములు నశించును. కచ్చూరము పుష్కరమూలము దంతి చిత్రమూలము ఆఢకి (తొవరిమన్ను) కందులు శొంఠి వస వీటిని ఒకొక్క పలమును తెల్లతెగడ 1 పలము ఇంగువ 3 పలములు యవక్షారము 2 పలములు ఆమ్లవేతసము 2 పలములు వాము అజమోదము అర్ధపలము చొప్పునను తీసికొని వీటిని చూర్ణము చేసి మాత్రలను మాదీఫలరసముతో కట్టవలయును. ఈమాత్రలలోఒకటిగాని రెండిటినిగాని సేవించుచున్న మూలరోగము హృద్రోగము క్రిమిరోగములు వీటినిపోగొట్టును. గోమూత్రముతో సేవించిన పాతగిలిన గుల్మములనైనను పోగొట్టును. పిత్తగుల్మములకు

పాలతోను వాతగుల్మములకు మద్యము మున్నగుపులు పుపదార్థములతోను సేవింపవలయును. త్రిఫలములరసమును గోమూత్రముతో సేవించినచో పన్నిపాతగుల్మములు నశించును. స్త్రీలు రక్తగుల్మములయందు జెముడుపాలతో దీనిని సేవింపవలయును.

## హపుషాద్యఘృతము.

శ్లో. హపుషా వ్యోష పృథ్వీకా చవ్యచిత్రక సైంధవైః, సాజాజీ పిప్పలీమూలీ దీప్యకై ర్విపచే ద్ఘృతమ్. 60. సకోలమూలకరసం సక్షీరం దధిదాడిమం, తత్పరం వాతగుల్మఘ్నం శూలానాహవిబంధనుత్. 61. యోన్యర్శో గ్రహణీదోష శ్వాసకాసాఽరుచిజ్వరమ్, పార్శ్వ హృద్వస్తిశూలం చ ఘృత మేత ద్వ్యపోహతి. 62.

బోడతరము త్రిఫలములు చవ్యము చిత్రమూలము సైంధవలవణము జీలకఱ్ఱ మోడి అజమోదము వీటితో నేతినిపక్వముచేసి రేగుముల్లంగులరసమును పాలు పెరుగు మండము దానిమ్మ వీటిని కలిపి పక్వముచేసి ఘృతమును చేసి సేవించిన వాతగుల్మములు శూలలు ఆనాహములు విబంధములు యోనిరోగములు మూలరోగములు శ్వాస దగ్గు అరుచి జ్వరము పార్శ్వశూలము హృచ్ఛూలము వస్తిశూలము వీటిని పోఁగొట్టును.

## పంచపలకఘృతము.

శ్లో. పిప్పల్యాః పిచురర్ధార్ధో దాడిమా ద్విపలం పలమ్, ధాన్యాత్ పంచఘృతా చ్ఛుంఠ్యాః కర్షః క్షీరం చతుర్గుణమ్. 63. సిద్ధమేతైః ఘృతం సద్యో వాతగుల్మం చికిత్సతి, యోనిశూలం శిరః శూల మర్శాంసి విషమజ్వరాన్. 64.

పిప్పళ్లు అర్ధతులము దానిమ్మ 2 పలములు ధనియములు ఒకపలము నెయ్యి 5 పలములు శొంఠి కాలుపలము వీటికి నాలుగురెట్లు పాలు కలిపి నేతిని సిద్ధము చేసి సేవించిన వాతగుల్మములు యోనిశూలలు శిరశ్శూలలు మూలరోగములు విషమజ్వరములు నశించును.

## త్ర్యూషణాదిఘృతము.

శ్లో. త్ర్యూషణత్రిఫలా ధాన్య విడంగం చవ్యచిత్రకైః, కల్కీకృతైః ఘృతం సిద్ధం సక్షీరం వాతగుల్మనుత్. 65.

త్రికటుకములు త్రిఫలములు వాయువిడంగములు చవ్యము చిత్రమూలము వీటిని కల్కముచేసి పాలుపోసి దీనియందు నేతిని సిద్ధముచేసి సేవించిన వాతగుల్మములు నశించును.

### త్రాయమాణఘృతము.

శ్లో. జలే దశగుణే సాధ్యం త్రాయమాణా చతుఃపలమ్, పంచభాగస్థితం పూతం కల్కైః స్సంయోజ్య కార్షికైః. 66. రోహిణీ కటుకా ముస్తా త్రాయమాణా దురాలభాః, కల్కైః స్తామలకీవీరా జీవన్తీ చందనోత్పలైః. 67. రసస్యామలకీనాం చ క్షీరస్య చ ఘృతస్య చ, పలాని పృథగష్టాష్ట దత్వా సమ్యగ్విపాచయేత్. 68. పిత్తగుల్మం రక్తగుల్మం విసర్పం పైత్తికం జ్వరమ్, హృద్రోగం కామలాం కుష్ఠం హన్యాదేతత్ ఘృతోత్తమమ్. 69. పలోల్లేఖాగతే మానే న ద్వైగుణ్య మిహేష్యతే, చత్వారింశత్పలం తేన తోయం దశగుణం భవేత్. 70.

పదిగట్లనీటిలో 4 పలముల కలుకొనుగను సిద్ధము చేసి అయిదవపాలునీరు మిగులగలయప్పుడు వడియకట్టి ఒక్కొక్క తులము కరక్కాయ కటుకరోహిణి తుంగముస్తె కలుకొనుగ యవాస క్షీరకాకోలి జీవంతి చందనము తెల్లకల్వ వీటికల్కమును ఉసిరికరసమును నేతిని పాలను 8పలములచొ పోసిచక్కగా పక్వము చేసి సేవించినపిత్తవాతగుల్మములను విసర్పి పిత్తజ్వరము హృద్రోగము కామిల కుష్ఠు ఇయ్యవి నశించును. ఈవిధిలో పలముపలమనిన రెండుగెట్లుగా చేకొనరాదు. కావున 44 పలముల నీరు పది గెట్లుగా నగును.

### ద్రాక్షాఘృతము.

శ్లో. ద్రాక్షా మధుక ఖర్జూరం విదారీం సశతావరీమ్, పరూషకాణి త్రిఫలాం సాధయే త్పలసమ్మితామ్. 71. జలాఢకే పాదశేషే రస మామలకస్య చ, ఘృత మిక్షురసం క్షీర మభయాకల్కసాధితమ్. 72. సాధయే త్తు ఘృతం సిద్ధం శర్కరాక్షౌద్రపాదికం, యోజయే త్పిత్తగుల్మఘ్నం సర్వపిత్తవికారనుత్. 73. సాహచర్యా దిహ పృథగ్ఘృతాదేః క్వాథతుల్యతా.

ద్రాక్ష యష్టిమధుకము ఖర్జూరము విదారికంద పిల్లపీచర చేదువుళ్ళ త్రిఫలములు వీటిని ఒక్కొక్కపలము చొ సాధింపవలయును. పిమ్మట నొకయాఢకపు నీటిలో వైచి వండి నాలుగవపాలు మిగిలినప్పుడు ఉసిరికరసము నెయ్యి చెఱకుపాలు నాలుగవపాలు కరక్కాయకషాయము నీటిని కలిపి ఘృతమును సిద్ధము చేసి కండచక్కెరను

తేనెను కలిపి సేవించిన పిత్తగుల్మములు పిత్తవికారములు నశించును. ఈవిధిలో సాహచర్యమును బట్టినేయ మొదలగు వానికి క్వాథతౌల్యము గ్రహింపదగును.

**ధాత్రీషట్పలఘృతము.**

శ్లో. ధాత్రీఫలానాం స్వరసే షడంగం పాచయేద్ఘృతం. 74.
శర్కరాసైంధవోపేతం తద్ధితం సర్వగుల్మినామ్.

ఉసిరికరసములో షడంగఘృతమును పక్వముచేసి కండచక్కెర సైంధవలవణమును కలిపి త్రాగిన గుల్మరోగములు నశించును.

**భార్గీషట్పలకఘృతము.**

శ్లో. షడ్భిః పలైః స్నిగ్ధజాః ఫలమూల చవ్య విశ్వౌషధజ్వలనయానజకల్కపక్వమ్, ప్రస్థం ఘృతస్య దశమూల్యురుబూకభార్గీ క్వాథే పృథక్ పయసి దధ్ని చ షట్పలాఖ్యమ్. 75. గుల్మోదరారుచి భగందర వహ్నిసాద కాసజ్వర క్షయశిరోగ్రహణీ వికారాన్, సద్యః శమం నయతి యే చ కఫానిలోత్థాన్ భార్గ్యాఖ్యషట్పల మిదం ప్రవదన్తి తజ్జ్ఞాః. 76.

పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి యవక్షారము కటినిపలము చొ. తీసికొని కల్కముచేసి నెయ్యి 16 పలములు దశమూలములు ఆముదము భార్గి వీని కషాయములలో పాలలో పెరుగులో కలిపి సిద్ధముచేసి సేవించిన గుల్మము ఉదరరోగము అరుచి భగంధరము మందాగ్ని కాసజ్వరము క్షయ శిరోరోగము మూలరోగము మిక్కిలి త్వరగా నశించును.

**క్షీరషట్పలకఘృతము.**

శ్లో. పిప్పలీ పిప్పలీమూల చవ్యచిత్రక నాగరైః, పలికైః సయవక్షారైస్సర్పిషః ప్రస్థం విపాచయేత్. 77. క్షీరప్రస్థేన తత్సర్పి ర్హన్తి గుల్మంకఫాత్మకమ్, గ్రహణీ పాండురోగఘ్నం ప్లీహ కాస జ్వరాపహమ్. 78.

పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి యవక్షారము వీటిని ఒక్కొక్క పలము చొ॥ ను 16 పలముల నేయిని చేర్చి 16 పలముల పాలలో పక్వముచేసి సిద్ధముచేసి సేవించిన కఫగుల్మములు గ్రహణిరోగములు పాండురోగము ప్లీహ కాసజ్వరములు నశించును.

### భల్లాతకఘృతము.

శ్లో. భల్లాతకానాం ద్విపలం పంచమూలం పలోన్మితమ్, సాధ్యం విదారిగంధాఖ్య మాపోత్థసలిలాఢకే 79. పాదావశేషే పూతే చ పిప్పలీం నాగరం వచామ్, విడంగం సైంధవం హింగు యావశూకం బిడం శటీమ్. 80. చిత్రకం మధుకం రాస్నాం పిష్ట్వా కర్షసమాన్భిషక్, ప్రస్థం చ పయసో దత్వా ఘృతప్రస్థం విపాచయేత్. 81. ఏతద్భల్లాతకం నామ కఫగుల్మహరం పరమ్, ప్లీహపాండ్వామయశ్వాసగ్రహణీకాసగుల్మనుత్. 82.

నల్లజీడిపిత్తులు 2 పలములు, లఘుపంచమూలములు పిదారికంద చెండనయు పీటి నొక ఆఢక పునీటిలో వైచి కాచి నాల్గవపాలు మిగిలియున్నప్పుడు వడియగట్టి దానియందు శొంఠి వస వాయువిడంగములు సైంధవలవణము ఇంగువ యవక్షారము చవ్యము చిత్రమూలము మధుకము రాస్న వీటిని తులము తులము పలము తీసి నూరి కలిపి 16 పలముల పాలుపోసి 16 పలముల నేయి నిండు పక్వముచేసి సేవించిన కఫగుల్మములు ప్లీహపాండు శ్వాసరోగములు గ్రహణులు దగ్గులు గుల్మములు నశించును.

### రసోనాద్యఘృతము.

శ్లో. రసోనస్య రసే సర్పిః పంచమూలరసాన్వితం, సురారనాల దధ్యమ్ల మూలకస్వరసైస్సహ. 83. వ్యోషదాడిమవృక్షామ్ల యమానీచవ్యసైంధవైః, హింగ్వమ్లవేతసాజాజీదీప్యకైశ్చ కలాంశకైః. 84. సిద్ధం గుల్మగ్రహణ్యర్శః శ్వాసోన్మాద క్షయజ్వరాన్, కాసాపస్మార మందాగ్ని ప్లీహశూలానిలాన్ జయేత్. 85.

ఉల్లిరసమును పంచమూలములరసమును మద్యము గంజి పెరుగు ముల్లంగి రసము మునగరసము శొంఠి మిరియములు పిప్పళ్లు దానిమ్మ జెవడు మామిడికాయ ఓమము చవ్యము సైంధవలవణము ఇంగువ అమ్లవేతసము జీలకర్ర కొడిసెపాలపిత్తులు ఇవి పలము చొప్పున కలిపి ఘృతమును సిద్ధముచేసి సేవించిన గుల్మము గ్రహణులు మూలరోగములు శ్వాస పిచ్చి క్షయ జ్వరము దగ్గు మందాగ్ని ప్లీహ శూలలు వాతరోగములు మృగీరోగములు మొదలగునవన్నియు నశించును.

### దంతీహరీతకీగుడములు.

శ్లో. జలద్రోణే విపక్తవ్యా వింశతిః పంచ చాభయాః, దన్త్యాః పలాని తావన్తి చిత్రకస్య తథైవచ. 85. తేనాష్టభాగశేషేణ పచే

ద్దన్తీసమం గుడం, తా శ్చాభయా స్త్రివృ చ్చూర్ణా త్తైలా చ్చాపి చతుఃపలం. 87. పల మేకం కణాశుంఠ్యోః సిద్ధే లేహే చ శీతలే, క్షౌద్రం తైలసమం దద్యా చ్చతుర్జాతపలం తథా. 88. తతో లేహ పలం లీఢ్వా జగ్ధ్వా చైకాం హారీతకీం, సుఖం విరిచ్యతే స్నిగ్ధో దోష ప్రస్థ మనామయః.89. ప్లీహాశ్వయథు గుల్మార్శో హృత్పాండుగ్రహణీ గదాః, శామ్య న్త్యక్లైబ్యవిషమజ్వరకుష్ఠా న్యరోచకాః. 90.

25 కరక్కాయలను ద్రోణపునీటిలో పక్వముచేసి దంతి చిత్రమూలము వీటిని 25 పలములచొప్పైచి పాకముచేసి 25 పలముల బెల్లమునందుచేర్చి పక్వముచేసి తెల్లతెగడ చూర్ణము 3 పలములును తైలము 3 పలములు పిప్పళ్లు శొంఠి పలముచొప్పైచి లేహమును చేసి చల్లపడిన పిమ్మట 4 పలముల తేనె లవంగపట్ట జాపత్రి ఏలకులు నాగకేసరములు వీటిచూర్ణమును 1 పలముకలిపి ఒకపలము లేహమునుచొప్పున సేవింపవలయును. పిమ్మట ఒకకరక్కాయను తినిన సుఖముగా విరేచనము కలుగును. అనేక దోషము లుపశమిల్లును. ప్లీహ వాపు గుల్మరోగము హృద్రోగము పాండురోగము గ్రహణిరోగము గ్లాని విషమజ్వరము కుష్ఠము అరోచకము ఇవియన్నియును శాంతించును.

## వృశ్చీరాద్యరిష్టము.

శ్లో. వృశ్చీర మురుబూకం చ వర్షాహ్వాం బృహతీద్వయం, చిత్రకంచ జలద్రోణే పచే త్పాదావశేషితం. 91. మాగధీ చిత్రక క్షౌద్ర లిప్తకుంభే నిధాపయేత్, మధునః ప్రస్థ మావాప్య పథ్యా చూర్ణార్ధసంయుతం. 92. వ్యుషోషితం దశాహం చ జీర్ణభుక్తః పిబే న్నరః, అరిష్టోయం జయే ద్గుల్మ మవిపాకం సుదుస్తరమ్. 93.

తెల్లగలిజేరు ఆముదపుచెక్క గలిజేరు వాకుడు చిత్రమూలము వీటిని ఒకద్రోణమునీటిలో పాకముచేసి నాల్గవపాలునీరు మిగిలియున్నప్పుడుపిప్పళ్లు చిత్రమూలము తేనె వీటితోపూసిన కలశములో దానిని పోసియుంచి 16 పలముల కరక్కాయపొడి కలిపి పదిరోజులుంచి జీర్ణించెడియన్నముగలవాడు సేవింపవలయును. ఇయ్యది పక్వముకాని గుల్మములనైనను జయించును.

## రక్తగుల్మోపాయములు.

శ్లో. రౌధిరస్య తు గుల్మస్య గర్భకాలవ్యతిక్రమే, స్నిగ్ధస్విన్న శరీరాయై దద్యాత్ స్నిగ్ధం విరేచనమ్. 94. శతాహ్వాచిరిబిల్వత్వ

ద్దారుభార్గీకణోద్భవః, కల్కః పీతో హరేద్గుల్మం తిలక్వాథేన రక్త
జమ్. 95. తిలక్వాథో గుడవ్యోష హింగుభార్గీయుతో భవేత్, పానం
రక్తభవే గుల్మే నష్టపుష్పే చ యోషితామ్. 96. సక్షారం త్ర్యూషణం
మద్యం ప్రపిబేదస్రగుల్మినీ, పలాశక్షారతోయేన సిద్ధం సర్పిః పిబేచ్చ
సా. 97. ఉష్ణైర్వా భేదయేద్భిన్నే విధిరాసృగ్దరో హితః, న ప్రభి
ద్యేత యద్యేవం దద్యాద్యోని విశోధనమ్. 98. క్షారేణ యుక్తం
పలలం సుధాక్షీరేణ వా పునః, రుధిరేఽతిప్రవృత్తే తు రక్తపిత్తహరీ
క్రియా. 99. భల్లాతకా త్వక్కల్కకషాయ పక్వం సర్పిః పిబేచ్ఛ
ర్కరయా విమిశ్రమ్, తద్రక్తపిత్తం వినిహన్తి పీతం బలాసగుల్మం
మధునా సమేతం. 100. వల్లూరం మూలకం మత్స్యాం శుష్కశా
కాని వేదనం, న ఖాదేచ్చాలుకం గుల్మీ మధురాణి ఫలాని చ. 101.

గర్భకాలపు వ్యతిక్రమమునందలి రక్తగుల్మములకు తైలము చెమ్మట మున్నగు వానిద్వారమున విరేచనమును కల్పింపవలయును. పిల్లిపీచర నెమలిఅడుగు దేవదారువు భారంగి పిప్పళ్లు వీటినికల్కము చేసి తిలలకషాయముతో కలిపికొని త్రాగిన రక్తగుల్మములు హరించును. తిలల కషాయములో బెల్లము శొంఠి, మిరియములు పిప్పళ్లు ఇంగువ గంటుభారంగి వీటిచూర్ణమును కలిపి స్త్రీలను త్రాగించిన రక్తగుల్మములను ముట్టుడిగిపోవుటను పోగొట్టును. యవక్షారము శొంఠి మిరియములు పిప్పళ్లు మద్యము వీటిని రక్తగుల్మపురోగి త్రాగవలయును. మోదుగరసముతో సిద్ధముచేసిన ఘృతమును సేవింపవలయును. లేనిచో ఉష్ణవస్తువులద్వారా గుల్మములను పగుల్పగావలయును. పగిలినపిమ్మట ప్రదరరోగములకువలెనే చికిత్సను చేయవలయును. చాలరక్తము స్రవించుచుండినచో పిత్తరోగపుచికిత్సలను చేయవలయును. జీడికల్కములోను కషాయములోను సిద్ధముచేసిన నేతిని కండచక్కెరతో సేవించిన రక్తగుల్మములు నశించును. తేనెతో నైనచో కఫగుల్మములు హరించును. గుల్మరోగులు ఎండుమాంసము ముల్లంగి చేపలు ఎండినకూరలు బియ్యపుఅన్నము ఆలుగడ్డ తియ్యనిపండ్లు వీనిని భక్షింపగారాదు.

ఇట్లు చక్రదత్తయందు గుల్మాధికారప్రకరణము ముగిసెను.

---

# ౩౦. హృద్రోగాధికారము.

**వాతికహృద్రోగోపాయములు.**

శ్లో. వాతోపసృష్టే హృదయే వామయే త్స్నిగ్ధ మాతురం, ద్విపంచ మూలీ క్వాథేన సస్నేహలవణేన చ. 1. పిప్పల్యేలా వచా హింగు యవక్షారోథ సైంధవం, సౌవర్చల మథో శుంఠీ మజమోదాచ చూర్ణితమ్. 2. ఫలధాన్యామ్లకౌలుత్థ దధిమద్యాసవాదిభిః, పాయయే చ్ఛుద్ధదేహం చ స్నేహేనాన్యతమేన వా. 3. జాగరం వా పిబే దుష్ణం కషాయం చాగ్నిసంధనమ్, కాసశ్వాసానిలహరం శూలహృద్రోగ నాశనమ్. 4. శ్రీపర్ణి మధుకక్షౌద్ర సితాగుడజలై ర్వమేత్, పిత్తోపసృష్టే హృదయే సేవేత మధురైః శ్రుతమ్. 5. ఘృతం కషాయాం శ్చోద్దిష్టా న్పిత్తజ్వరవినాశనాన్.

వాతపుహృద్రోగమునందు వాంతి చేయింపవలయును దశమూలముల కషాయముతో తైలమును ఉప్పును వేసి ఈయవలయును. పిప్పళ్లు ఏలకులు వస ఇంగువ యవక్షారము సైంధవలవణము సౌవర్చలవణము శొంఠి అజామోద వీటిచూర్ణముతో లేక నచేసిన ఫలములను గంజి అన్నపుగంజి ఉలవలగంజి పెరుగు మద్యము మున్నగు వానిలో దేనినైనను పానమును చేయింపవలయును. శొంఠి కషాయమును వేడిగా త్రాగుటయును మంచిది. ఇది అగ్నిదీపనము కలిగించును. దగ్గు శ్వాసము మందాగ్నిశూల హృద్రోగము వీటిని పోగొట్టును. శ్రీపర్ణి మధుకము తేనె చక్కెర బెల్లపునీరు వీటితో వమనములు చేయించినచో, పిత్తపు హృద్రోగములను నశింపచేయును.

**ఇతరములగు శీతప్రదేహాద్యుపాయములు.**

శ్లో. శీతాః ప్రదేహాః పరిషేచనాని తథా విరేకో హృది పిత్తదుష్టే. ద్రాక్షా సితా క్షౌద్ర పరూషకై స్స్యా చ్ఛుద్ధే చ పిత్తాపహ మన్నపానం. 6. పిష్ట్వా పిబే ద్వాపి శితాజలేన యష్ట్యాహ్వయం తిక్తకరోహిణీం చ, అర్జునస్య త్వచా సిద్ధం క్షీరం యోజ్యం హృదామయే,

సితయా పంచమూల్యా వా బలయా మధుకేన వా, ఘృతేన దుగ్ధేన
గుడాంభసా వా పిబన్తి చూర్ణం కకుభత్వచో యే. 8. హృద్రోగజీర్ణ
జ్వరరక్తపిత్తం హత్వా భవేయు శ్చిరజీవిన స్తే.

శీతలప్రదేహములు శీతలములగు పరిషేకములు విరేచనము ఇవియన్నియును పిత్తహృద్రోగములకు హితకరములు. ద్రాక్ష తేనె చక్కెర పర్పాటకము వీటితో చేసిన అన్నపానములను శుద్ధుఁడైనమనుష్యునకు ఈయవలసినది. మధుకము కటుకరోహిణి నూరి కలకండ పానకము చేసికొని త్రాగవలసినది. మద్దిచెక్కతో తయారు చేసిన పాలను హృద్రోగములకుపయోగింపవలసినది. పంచదారతోగాని పంచమూలములతోగాని ముత్తువపులగముతోగాని యష్టిమధుకముతోగాని నేయి పాలతోగాని బెల్లపుపానకముతో గాని మద్దిచెక్కను చూర్ణముచేసి కలిపి త్రాగినచో హృద్రోగము జీర్ణజ్వరము రక్తపిత్తము వీటిని పోఁగొట్టి చిరజీవనము నిచ్చును.

## పిప్పల్యాదిచూర్ణము.

శ్లో. వచానింబకషాయాభ్యాం వాన్తం హృది కఫోత్థితే. 9.
వాతహృద్రోగ హృచ్ఛూర్ణం పిప్పల్యాది చ యోజయేత్, త్రిదోషజే
లంఘన మాదితః స్యా దన్నం చ సర్వేషు హితం విధేయమ్. 10.
హీనాదిమధ్యత్వ మవేక్ష్య చైవ కార్యం త్రయాణా మపి కర్మ శస్తమ్,
చూర్ణం పుష్కరజం లిహ్యా న్మాక్షికేణ సమాయుతమ్. 11. హృచ్ఛూ
లకాసశ్వాసఘ్నం క్షయహిక్కానివారణం, తైలాజ్యగుడవిపక్వం గో
ధూమం వాపి పార్థజం చూర్ణమ్. 12. పిబతి పయోఽనుచయం స భవతి
జితసకలహృద్రుజః పురుషః, గోధూమకకుభచూర్ణం ఛాగపయోగ
వ్యసర్పిషా పక్వం. 13. మధుశర్కరాసమేతం శమయతి హృద్రోగ
ముద్ధతం పుంసామ్.

వచకషాయము వేపకషాయములతో చేర్చి కఫహృద్రోగములయందు వాంతి చేయింపవలయును. వాతజహృద్రోగనివారణమునకై పిప్పల్యాది చూర్ణమును వాడవలయును. త్రిదోషపుహృద్రోగమందు మొదల లంఘనము చేయించుటయును తక్కినవానికి హితమగు నన్నమును పెట్టించుటయు నుత్తమములు. పుష్కరమూలచూర్ణమును తేనెతో కలిపి నాకిన హృచ్ఛూలము కాస శ్వాస క్షయ వెక్కిళ్లు నశించును. తైలము నేయి బెల్లము వీటితో పక్వముచేయఁబడిన గోధుమలనుగాని మద్దిచెక్కనుగాని చూర్ణముఁజేసి త్రాగినచో హృద్రోగములు నశించును. గోధుమలు మద్దిచెక్క వీటిచూర్ణ

మును మేకపాలు ఆవునెయ్యి వీటితో పక్వముచేసి చక్కెరను కలిపి త్రాగినచో హృద్రోగములన్నియు హరించును.

నాగబలాదిచూర్ణములు.

శ్లో. మూలం నాగబలాయాస్తు చూర్ణం దుగ్ధేన పాయయేత్. 41. హృద్రోగశ్వాసకాసఘ్నం కకుభస్య చ వల్కలమ్, రసాయనం పరం బల్యం వాతజి న్మాంసయోజితమ్. 15. సంవత్సరప్రయోగేణ జీవే ద్వర్షశతద్వయం, హింగూగ్రగంధాబిడవిశ్వకృష్ణా కుష్ఠాభయాచిత్రక యావశూకమ్, పిబే చ్ఛ సౌవర్చలపుష్కరాఢ్యం యవాంభసా శూలహృ దామయేషు. 16. శఠీమూలీకషాయం తు లవణక్షారయోజితం, కాసంశ్వాసం చ హృద్రోగం గుల్మం శూలం చ నాశయేత్. 17. పాఠాం వచాం యవక్షార మభయా మమ్లవేతసం, దురాలభాం చిత్రకం చ త్ర్యూషణం చ పలత్రికం. 18. శఠీం పుష్కరమూలం చ తింతిడీకం సదాడిమం, మాతులుంగస్య మూలాని శ్లక్ష్ణచూర్ణాని కారయేత్. 19. సుఖోదకేన మద్యైర్వా చూర్ణా న్యేతాని పాయయేత్, అర్శఃశూలాని హృద్రోగం గుల్మం చాశు వ్యపోహతి. 20. పుటదగ్ధ మశ్మపిష్టం హరిణవిషాణం తు సర్పిషా పిబతః, హృత్పృష్ఠశూల ముపశమ ముపయా త్యచిరేణ కష్టమపి. 21.

పెద్దముత్తువపులగపుచూర్ణమును పాలతో కలిపి త్రాగినను మద్దిచెక్కచూర్ణమును పాలతో త్రాగినను హృద్రోగములు శ్వాస దగ్గు నశించును. ఇయ్యది ఉత్తమమగు రసాయనము. దీనిని మాంసముతో సేవించిన వాతమును హరించును. దీనిని ఒకసంవత్సరము సేవించిన మనుజుండు నూరేండ్లు బ్రదుకును. ఇంగువ వస శొంఠి పిప్పళ్లు కోష్ఠు కరక్కాయలు చిత్రమూలము త్రిలవణములు పుష్కరచూర్ణము వీటిని చూర్ణముచేసి యవగంజితో సేవించిన శూలలు హృద్రోగములకు సుఖకరము. వస యవక్షారము కరక్కాయలుఆమ్లవేతము చిత్రమూలము శొంఠి మిరియములు పిప్పళ్లు త్రిఫలములు కచ్చూరము పుష్కరమూలము తింత్రిణిదళములు దానిమ్మ మాచిపత్రి వీటినిచూర్ణముచేసి దానినివేడినీళ్లతో గాని మద్యముతో గాని సేవించిన మూలరోగము శూల హృద్రోగము గుల్మము వీటిని పోఁగొట్టును. లేడికొమ్ములను పుటపాకము చేత తగులఁబెట్టి నూరి నేతితో చేర్చి సేవించిన హృచ్ఛూలను పృష్ఠశూలమును మిక్కిలి శీఘ్రముగా నశించును.

### మాంసాశనమును, వల్లభఘృతమును.

శ్లో. క్రిమిహృద్రోగిణాం స్నిగ్ధం భోజయే త్పిశితౌదనం, దధ్నా చ పలలోపేతం త్ర్యహం పశ్చా ద్విరేచయేత్. 22. సుగంధిభిః సలవణై ర్మూత్రైః సాజాజిశర్కరైః, విడంగగాఢం ధాన్యామ్లం పాయయే ద్ధిత ముత్తమం. 23. క్రిమిజే చ పిబే న్మూత్రం విడంగామయసంయుతం, హృది స్థితా పత న్త్యేవ మధస్తా త్క్రిమయో నృణాం. 24. యవా న్నం వితరే చ్చాస్మై సవిడంగ మతఃపరం. ముఖ్యం శతార్ధం చ హరీతకీనాం సౌవర్చల స్యాపి పలద్వయం చ, పక్వం ఘృతం వల్లభ కేతి నామ్నా హృచ్ఛ్వాసశూలోదరమారుతఘ్నం. 25.

క్రిమిరోగమును హృద్రోగమును కలవానిని మాంసపుటన్నమును తినిపింపవలయును. పెరుగుమాంసములతో మూడురోజులిట్లు తినిపింపవలయును. గుమగుమ పరిమళించుచున్న జీలకఱ్ఱ చక్కెరయుఁ గలసిన యోగములచేత నుప్పువేసియును వాయువిడంగములతోఁ గూడికొనిన బియ్యపుఁగంజిని త్రాగింపవలయును. క్రిమిజమగు హృద్రోగమునందు వాయువిడంగములు కోష్ఠుఁగ చేర్చిన గోమూత్రమును త్రాగవలయును. ఇట్లైన మనుజునిహృదయములోని నన్నపురుగులుపడిపోవును. మంచికరక్కాయలు 50 సౌవర్చలవణము 2 పలములు వీటిలో నేతినిపక్వముచేసి పుచ్చుకొనవలయును. ఇయ్యది వల్లభఘృతము. హృద్రోగములను శ్వాసమును శూలలను ఉదరరోగములను వాతరోగములను నశింపఁజేయును.

### శ్వదంష్ట్రాదిఘృతము.

శ్లో. శ్వదంష్ట్రోశీర మంజిష్ఠా బలాకాశ్మర్యకత్తృణాం, దర్భమూలం పృథక్పర్ణీ పలాశర్షభకౌ స్థిరా. 26 పలికా న్సాధయే త్తేషాం రసే క్షీరే చతుర్గుణే, కల్కైః స్వగుప్తర్షభక మేదాజీవ న్తిజీరకైః. 27. శతావ ర్యృద్ధి మృద్వీకా శర్కరాశ్రావణీబిసైః, ప్రస్థః సిద్ధో ఘృతా ద్వాతపిత్తహృద్రోగశూలనుత్. 28. మూత్రకృచ్ఛ్ర ప్రమేహార్శః శ్వాసకాసక్షయాపహః, ధనుస్త్రీమద్యభారాధ్వ క్షీణానాం బలమాంసదః.

పల్లేరు వట్టివేరు మంజిష్ఠను ముత్తవపులగము గుమ్ముడి గోహింపమను తృణము కొఱ్ఱదుంపలు పృష్ఠపర్ణి పలాశము ఋషభకమను గంధద్రవ్యము జీవంతి జీలకఱ్ఱ పిల్లిపీచర బుద్ధి ద్రాక్ష కండచక్కెర బోడసగము అగరుశొంఠి వీటియొక్క కల్కములో

16 పలముల నేతిని సిద్ధముచేసి సేవించిన వాతపిత్తహృద్రోగము శూల మూత్రకృచ్ఛ్రము ప్రమేహము మూలరోగము శ్వాసము దగ్గు క్షయ వీటిని నశింపఁజేయును. ధనుస్సు స్త్రీలు కల్లు భారము దారినడక వీటివలన క్షీణించినవారికి బలమునిచ్చి కండరముల వృద్ధినొందించును.

### బలాఘృతమును, నర్జునఘృతమును.

శ్లో. ఘృతం బలానాగబలార్జునానాంబు సిద్ధం సయష్టిమధుకల్కపాదం, హృద్రోగశూలక్షతరక్తపిత్త కాసానిలాసృక్ శమయత్యుదీర్ణం. 30. పార్థస్య కల్కస్వరసేన సిద్ధం శస్తం ఘృతం సర్వహృదామయేషు.

ముత్తవపులగము పెద్దముత్తవపులగము మద్దిచెక్కరసము వీటిలో యష్టిమధుకపుకల్కమును నాలవపాలుగా గలిపి ఘృతమును సిద్ధముచేసి సేవించిన హృద్రోగము శూల క్షయ రక్తపిత్తము దగ్గు హెచ్చుహెచ్చిగిన వాతరక్తము ఇయ్యవి శాంతించును. అర్జునవృక్షపుచెక్క కల్కమును రసమును వీటితో సిద్ధముచేసిన నీఘృతము అన్నివిధములగు హృద్రోగములందును ప్రశస్తమని చెప్పఁబడినది.

ఇట్లు చక్రదత్తయందు హృద్రోగాధికారప్రకరణము ముగిసెను.

## ౩౦. మూత్రకృచ్ఛ్రాధికారము.

### అభ్యంగాద్యుపాయములు.

శ్లో. అభ్యంజన స్నేహ నిరూహవస్తి స్వేదోపనాహోత్తరవస్తిసేకాన్, స్థిరాదిభి ర్వాతహరైశ్చ సిద్ధాన్ దద్యాద్రసాంశ్చానిలమూత్రకృచ్ఛ్రే. 1. అమృతాం నాగరం ధాత్రీం వాజిగంధాం త్రికంటకాన్, ప్రపిబే ద్వాతరోగార్తః సశూలీ మూత్రకృచ్ఛ్రవాన్. 2. సేకావగాహాః శిశిరాః ప్రదేహా గ్రైష్మోవిధిర్వస్తిపయోవికారాః, ద్రాక్షావిదారీక్షురసైః ఘృతైశ్చ కృచ్ఛ్రేషు పిత్తప్రభవేషు కార్యాః. 3. కుశః కాశః శరో దర్భ ఇక్షుశ్చేతి తృణోద్భవం, పిత్తకృచ్ఛ్రహరం పంచమూలం వస్తివిశోధనం, ఏతత్సిద్ధం పయః పీతం మేఢ్రగం హన్తి శోణితం. 4.

అభ్యంజనము స్నేహము నిరూహవస్తి స్వేనకర్మ ఉపనాహము ఉత్తర వస్తి సేకము మున్నగువానిని వాతనాశకములును స్థిరాదిగణపతితములైనవియు నగు రసములను మూత్రకృచ్ఛ్రమున నుపయోగింపవలయును. తిప్పతీగె శొంఠి ఉసిరిక అశ్వగంధ పల్లేరు వీటిని వాతరోగులు శూలలు మూత్రకృచ్ఛ్రరోగులును త్రాగవలయును. సేకము అవగాహనము శీతలములగు లేపములు గ్రీష్మరువిధానములు వస్తులు పాలపదార్థములు ద్రాక్ష నేలగుమ్మడు చెఱకురసము నేయి ఇయ్యవి పిత్తరోగమునకు చికిత్సలు పంచమూలములు మూత్రకృచ్ఛ్రములను హరించును. వస్తులను శోధించును. వీటితో సిద్ధము చేసిన పాలను త్రాగిన లింగజములగు రక్తరోగములు నశించును.

## శతావర్యాది క్వాథములు.

శ్లో. శతావరీకాశకుశాశ్వదంష్ట్రావిదారిశాలీక్షుకశేరుకాణాం, క్వాథం సుశీతం మధుశర్కరాక్తం పిబన్ జయేత్ పైత్తికమూత్రకృచ్ఛ్రం. 5 హరీతకీగోక్షురరాజవృక్షపాషాణభిద్ధన్వయవాసకానాం, క్వాథం పిబేన్మాక్షికసంప్రయుక్తం కృచ్ఛ్రే సదాహే సరుజే విబంధే. 6. గుడేనామలకం వృష్యం శ్రమఘ్నం తర్పణం పరం, పిత్తాసృగ్దాహశూలఘ్నంమూత్రకృచ్ఛ్రనివారణం. 7. ఏర్వారుబీజం మధుకం సదార్వ్యం పైత్తే పిబేత్తండులధావనేన, దార్వీం తథైవామలకీరసేన సమాక్షికాం పైత్తికమూత్రకృచ్ఛ్రే. 8. క్షారోష్ణతీక్ష్ణౌషధమన్నపానం స్వేదో యవాన్నం వమనం నిరూహః, తక్రం సతిక్తౌషధసిద్ధతైలాన్యభ్యంగపానం కఫమూత్రకృచ్ఛ్రే. 9. మూత్రేణ సురయా వాపి కదలీస్వరసేన వా, కఫకృచ్ఛ్రవినాశాయ శ్లక్ష్ణం పిష్ట్వా త్రుటిం పిబేత్. 10. తక్రేణ యుక్తం శితిమారకస్య బీజం పిబేత్కృచ్ఛ్రవినాశహేతోః, పిబేత్తథా తండులధావనేన ప్రవాళచూర్ణం కఫమూత్రకృచ్ఛ్రే, శ్వదంష్ట్రావిశ్వతోయం వా కఫకృచ్ఛ్రవినాశనం. 11.

శతావరి రెల్లు దర్భవేళ్లు పల్లేరు నేలగుమ్మడు శాలి చెఱకువేళ్లు కశేరు వీటి కషాయమునందు కండశర్కరను చేసికొని త్రాగిన దాహము శూలము మలబద్ధము కల మూత్రకృచ్ఛ్రములు నశించును. బెల్లముతో కలిపి యుసిరికను తినిన వీర్యవృద్ధి యగును. శ్రమను పోగొట్టును. మూత్రకృచ్ఛ్రమును తొలగించును. కర్బూజగింజలు యష్టిమధుకము మానిపసపు వీటిని కడుగుతో పిత్తమూత్రకృచ్ఛ్రములందు త్రాగవలయును. ప్రాని

పసపు తేనె ఉసిరికరసము కలిపిత్రాగిన పిత్తమూత్రకృచ్ఛ్రములు హరించును. క్షారము నుష్ణముగల అన్నపానాదులను స్వేదాదులను మూత్రకృచ్ఛ్రములందు చేయవలయును. గోమూత్రమద్యములతోను కదళీరసముతోగాని ఏలకులను నూరి త్రాగిన మూత్రకృచ్ఛ్రములు నశించును. తుమికివిత్తనములను మజ్జిగతోగాని బియ్యపు కడుగుతో హా గడచూర్ణమునుగాని తుమికిఇగుళ్ళచూర్ణమునుగాని సేవించిన మూత్రకృచ్ఛ్రములు హరించును. పల్లేరు శొంఠి వీటితోనైన యుదకము మూత్రకృచ్ఛ్రములం బోఁగొట్టును.

## భిన్నభిన్నకృచ్ఛ్రములకు భిన్నములగు నుపాయములు.

శ్లో. సర్వం త్రిదోష ప్రభవంతు వాయోః, స్థానానుపూర్వ్యా ప్రసమీక్ష్య కార్యం, త్రిభ్యోధికే ప్రాగ్వమనం కఫే స్యాత్, పిత్తే విరేకః పవనేతు వస్తిః. 12. బృహతీధావనీపాఠా యష్టీమధుకలింగకాః, పాచనీయో బృహత్యాదిః కృచ్ఛ్రదోష త్రయాపహః, తథాభిఘాతజే కుర్యాత్సద్యోవ్రణచికిత్సితం. 13. మూత్రకృచ్ఛ్రే సదా చాస్య కార్యావాతహరీ క్రియా, స్వేదచూర్ణక్రియాభ్యంగవస్తయస్స్యుః పురీషజే. 14. క్వాథం గోక్షురబీజస్య యవక్షారయుతం పిబేత్, మూత్రకృచ్ఛ్రం శకృజ్జే చ పీతం శీఘ్రం నివారయేత్. 15. హితా క్రియా త్వశ్మరిశర్కరాయాం యాంమూత్రకృచ్ఛ్రే కఫమారుతోత్థే.

త్రిదోషజమగుదానికి వాయుస్థానముల నానుపూర్వ్యగా పరికించి కఫాధిక్యమయ్యెనేని వమనమును పిత్తాధికమగునేని విరేచనమును వాతాధికమగునేని వస్తియును చేయఁదగినది. పెద్దవాకుడు కోలపొన్న అగరు శొంఠి మధుకము కొడిశెపాలవిత్తులు ఈమొదలగునవి బృహత్యాదిగణమనఁబడును. కృచ్ఛ్రదోషములను హరించును. గాయముచేనగుదానికి సద్యోవ్రణమునకుఁబోలె చికిత్సను చేయవలయును. ఎల్లప్పుడును దీనికి వాతనాశకమగు చికిత్సను చేయవలయు. పురీషజమగు దానికి స్వేదము చూర్ణక్రియ అభ్యంగము వస్తి ఇవ్వియవి చేయవలయును. కఫవాతజములగు హానియందువలెనే పల్లేరుకాయల కషాయమును యవక్షారముతో త్రాగవలయును.

## శిలాజిత్తు లేహ్యము.

శ్లో. లేహ్యం శుక్రవిబంధోత్థే శిలాజతుసమాక్షికం, వృష్యైర్బృంహితధాతోశ్చ విధేయాః ప్రమదోత్తమాః. 16. ఏలాహింగుయుతః క్షీరం సర్పిర్మిశ్రం పిబేన్నరః, మూత్రదోషవిశుద్ధ్యర్థం శుక్రదోష

హారం చ తత్. 17. యన్మూత్రకృచ్ఛ్రే విహితం తు పైత్తే తత్కారయే చ్ఛోణితమూత్రకృచ్ఛ్రే, త్రికంటకారగ్వధదర్భకాశ దురాలభాపర్వతభేదపథ్యాః, నిఘ్నంతి పీతామధునాశ్మరీం చ, సంప్రాప్తమృత్యో రపి మూత్రకృచ్ఛ్రమ్.18. కషాయోఽతిబలామూలసాధితః సర్వకృచ్ఛ్రజిత్. 19. ఏలాశ్మభేదకశిలా జతుపిప్పలీనాం చూర్ణాని తండులజలై ర్లులితాని పీత్వా, యద్వా గుడేన సహితా న్యవలిహ్య తాని, చాసన్నమృత్యు రపి జీవతి మూత్రకృచ్ఛ్రీ. 20. అయోరజః శ్లక్ష్ణపిష్టం మధునా సహ యోజితమ్, మూత్రకృచ్ఛ్రం నిహన్త్యాశు త్రిభి ర్లేహై ర్న సంశయః. 21. సితాతుల్యో యవక్షారః సర్వకృచ్ఛ్రనివారణః, నిదిగ్ధికారసో వాపి సక్షౌద్రః కృచ్ఛ్రనాశనః. 22.

వీర్యబంధకమగు మూత్రకృచ్ఛ్రరోగము శిలాజిత్తు తేనె సేవింపవలయును. వీర్యవృద్ధికరము లగు నౌషధములచేత స్త్రీసంభోగము కార్యము. ఏలకులు ఇంగువలతో సిద్ధముచేసిన పాలలో నేతిని వైచికొని త్రాగిన మూత్రదోషములను వీర్యదోషములు నష్టములగును. పిత్తమూత్రకృచ్ఛ్రచికిత్సలనే రక్తమూత్రకృచ్ఛ్రములకును చేయునది. పల్లేరు రేలచెక్క దర్భ రెల్లు మూలగొండి కరక్కాయ వీటికషాయములో తేనెను కలిపి త్రాగిన అన్నివిధములగు మూత్రకృచ్ఛ్రములు నశించును. ఏలకులు పాషాణభేదము శిలాజిత్తు పిప్పళ్లు వీటిచూర్ణమును బియ్యపుకడుగుతో త్రాగినను బెల్లముతో కలిపి తినినను మరణాసన్నుడైన మూత్రకృచ్ఛ్రరోగియును బ్రదుకును. మండూరమును నక్కగా నూరి తేనెను కలిపి మూడుపూటలు తినిన మూత్రకృచ్ఛ్రములు నశించును. చెల్లనావిలి యవక్షారము సమముగా సేవించినను, వాకుడురసముతో తేనెను త్రాగినను కృచ్ఛ్రనాశనము అగును.

## శతావరి ఘృతము.

శ్లో. శతావరీకాశకుశశ్వదంష్ట్రా విదారి కేక్ష్వామలకేషు సిద్ధం, సర్పిః పయోవా సితయా విమిశ్రం కృచ్ఛ్రేషు పిత్తప్రభవేషు యోజ్యమ్. 23.

పిల్లపీచర కాశము కుశలు పల్లేరు నేలగుమ్ముడు ఉసిరిక పిటితో సిద్ధముచేసిన నేయిని గాని పాలను గాని చక్కెరను కలిపికొని పిత్తజములగు మూత్రకృచ్ఛ్రముల కుపయోగించికొనవలయును.

### త్రికంటక ఘృతము.

శ్లో. త్రికంటకైరండకుశాద్యభీరు కర్కారుకేక్షుస్వరసేనసిద్ధమ్, సర్పిర్గుడార్ధాంశయుతం ప్రపేయం కృచ్ఛ్రాశ్మరీమూత్రవిఘాతహేతోః. 24.

పల్లేరు ఆముదము రెల్లు పిల్లిపీచర కర్బూజాగింజలు చెఱకుగడలు వీటిరసముతో సిద్ధముచేసిన నేతియందు నేతిలో సగభాగమును బెల్లమునుచేర్చి త్రాగిన మూత్రకృచ్ఛ్రములు అశ్మరులు మూత్రవిఘాతములు నశించును.

### సుకుమార ఘృతము.

శ్లో. పునర్నవా మూలతులా దశమూలంశతావరీ, బలా తురగగంధా చ తృణమూలం త్రికంటకమ్. 25. విదారీ వంశనాగాహ్వా గుడూచ్యతిబలా తథా, పృథగ్దశపలాన్భాగాన్ జలద్రోణే విపాచయేత్. 16. తేన పాదావశేషేణ ఘృతస్యార్ధాఢకం పచేత్, మధుకం శృంగబేరం చ ద్రాక్షా సైంధవపిప్పలీ. 27. పృథగ్ద్విపలికానద్యాద్యవాన్యాః కుడవం తథా, త్రింశద్గుడపలాన్యత్ర తైలస్యైరండజస్య చ. 28. ప్రస్థం దత్వా సమాలోడ్య సమ్యఙ్మృద్వగ్నినా పచేత్, ఏతదీశ్వరపుత్రాణాం ప్రాగ్భోజనమనిందితమ్. 29. రాజ్ఞాం రాజసమానాం చ బహుస్త్రీపతయశ్చ యే, మూత్రకృచ్ఛ్రే కటిస్తంభే తథా గాఢపురీషిణామ్. 30. మేఢ్రవంక్షణశూలే చ యోనిశూలే చ శస్యతే, యథోక్తానాం చ గుల్మానాం వాతశోణితకాశ్చ యే. 31. బల్యం రసాయనం శీతం సుకుమారకుమారకమ్, పునర్నవాశతేద్రోణో దేయోఽన్యేషు తథా పరః 32.

గలిజేరువేళ్లను 100 పలములును దశమూలములు శతావరి ముత్తవపులగము పెన్నేరు వట్టివేళ్లు పల్లేరు నేలగుమ్మడు వంశలోచనము నాగకేసరములు తిప్పతీగె పెద్దముత్తువపులగము ఇవి పదిపదిపలములును అర్ధాఢకపరిమితముగు నుదకములో పక్వమును చేయవలయును. నీరు నాలుగవపాలు మిగిలియున్నప్పుడు 32 పలముల నేయిని మధుకము అల్లము ద్రాక్ష సైంధవలవణము పిప్పళ్లు రెండేసిపలములును, వామము నాల్గుపలములును, బెల్లము 40 పలములును ఆముదము 16 పలములును కలిపి కలియఁబెట్టుచు పక్వముచేసి ప్రాతఃకాలముల సేవించుటయుత్తమము. ఇయ్యది దొరలబిడ్డలు రాజులు రాజతుల్యులును సేవింపఁదగినది. స్త్రీలును పురుషులును దీనినిమూత్రకృచ్ఛ్రము

కటిస్తంభము మలబద్ధకము లింగశూల అండశూల యోనిశూల గుల్మరోగములు వాతరక్తపు మూత్రకృచ్ఛ్రములు గలవానియం దుపయోగింపవలయును. ఇయ్యది బలకరమును సుకుమారతం గలిగించునదియును చల్లనిదియు నగు రసాయనము. నూరుపలముల గజ్జేరువేళ్లను ఒకద్రోణపునీటిలో ఇందు వేయవలయును. ఇతర ఔషధములయందు మరియొక ద్రోణమును కూడ చేర్పవలయును.

ఇట్లు చక్రదత్తయందు మూత్రకృచ్ఛ్రాధికారప్రకరణము ముగిసెను.

---

# ౩౨. మూత్రాఘాతాధికారము.

## మూత్రఘాతోపాయములు.

శ్లో. మూత్రాఘాతా న్యథాదోషం మూత్రకృచ్ఛ్రహరై ర్జయేత్, వస్తిముత్తరవస్తిం చ దద్యా త్స్నిగ్ధం విరేచనమ్. 1. కల్కమేర్వారుబీజానా మక్షమాత్రం ససైన్ధవమ్, ధాన్యామ్లయుక్తం పీత్వైవ మూత్రాఘాతా ద్విముచ్యతే. 2. పాటల్యా యావశూకాచ్చ పారిభద్రా త్తిలాదపి, క్షారోదకేన మదిరాం త్వగేలోషణసంయుతామ్, పిబే ద్గుడోపదంశాన్వా లిహ్యా దేతా న్పృథక్పృథక్, త్రిఫలాకల్కసంయుక్తం లవణం వాపి పాయయేత్. 4. నిదిగ్ధికాయాః స్వరసం పిబే ద్వస్త్రపరిస్రుతమ్, జలే కుంకుమకల్కం వా సక్షౌద్ర ముషితం నిశి. 5. సతైలం పాటలాభస్మ క్షారవద్వా [illegible]సుతామ్, సురాం సౌవర్చలవతీం మూత్రాఘాతీ పిబేన్నరః. 6 దాడిమామ్బుయుతం ముఖ్య మేలాబీజం సనాగరమ్, పీత్వా సురాం సలవణాం మూత్రాఘాతా ద్విముచ్యతే. 7. పిబే చ్ఛిలాజతు క్వాథే గణే వీరతరాదికే, రసం దురాలభాయా వా కషాయే వాసకస్య వా. 8.

దోషానుసారముగా మూత్రాఘాతములను మూత్రకృచ్ఛ్రనాశకములగు చికిత్సలతో పోగొట్టవలయును. వస్తి ఉత్తరవస్తి విరేచనము వీనిని చేయింపవలయును. కరుబూజవిత్తనములను కల్కముచేసి ఒకతులముతీసికొని అందు సైంధవలవణమును గంజిని చేర్చికొని త్రాగిన మూత్రాఘాతములు నశించును. రక్తపాటలపుష్పము యవక్షారము వేపతిలలు వీటిని క్షారోదకములతో మద్యమునుగా చేసి లవంగపుపట్ట ఏలకులు మిరియ

ములు నీటితోఁ జేర్చి త్రాగినను వాకుడురసమును వడియఁగట్టి త్రాగినను నీటిలోఁ గుంకుమపూవుకల్కమును తేనెను నైచిగా త్రియంతయు నుంచి త్రాగినను, పాటలభస్మమును తైలముతోఁ గలిపి త్రాగినను సౌవర్చలవణముతో మద్యమును చేసి త్రాగినను దానిమ్మపండ్లరసములోఁ జిన్నయేలకులను కొంచెము కలిపిత్రాగినను సైంధవలవణమును మద్యముతోఁ జేర్చి త్రాగినను శిలాజిత్తు కషాయములోఁ గాని పీరతరాది గణకషాయములోఁ గాని యవక్షారరసములోనైనను అడ్డసరము కషాయములోనైనను కలిపిత్రాగిన మూత్రాఘాతములు నశించును.

## త్రికంటకాదిపయస్సు.

శ్లో. త్రికంటకైరండ శతావరీభిః సిద్ధం పయో వా తృణపంచమూలైః, గుడప్రగాఢం సఘృతం పయో వా రోగేషు కృచ్ఛ్రాదిషు శస్తమేతత్. 9. నలకుశకాశేక్షుశిఫాం క్వథితాం ప్రాతః సుశీతలాం శీతామ్, పిబతః ప్రయాతి నియతం మూత్రగ్రహ ఇత్యువాచ కచః. 10. గోదావర్త్యా మూలం క్వథితం ఘృతతైలగోరసైర్మిశ్రమ్, పీతం నిరుద్ధమచిరా ద్భినత్తి మూత్రస్య సంఘాతం. 11. జలేన ఖాదిరీబీజం మూత్రాఘాతాశ్మరీహరం, మూలం రుద్రజటాయా శ్చ తక్రపీతం తదర్థకృత్ 12. మూత్రే విబద్ధే కర్పూరచూర్ణం లింగే ప్రవేశయేత్, శృతశీతపయోన్నాశీ చందనం తండులాంబునా. 13. పిబే త్సశర్కరం శ్లేష్మ ముష్ణవాతే సశోణితే, శీతోఽవగాహ ఆవస్తి రుష్ణవాతనివారణః. 14. కూష్మాండకరస శ్చాపి పీతః సక్షారశర్కరః, స్త్రీణామతిప్రసంగేన శోణితం యస్య సిచ్యతే. 15. మైథునోపరమ శ్చాస్య బృంహణీయో హితో విధిః, స్వగుప్తాఫలమృద్వీకా కృష్ణేక్షురసికారజః. 16. సమాంశ మర్ధభాగాని క్షీరక్షౌద్రఘృతానిచ, సర్వం సమ్యగ్విమథ్యాక్షమానం లీఢ్వా పయః పిబేత్, హన్తి శుక్రాశయోత్థాంశ్చ దోషా న్వంధ్యాసుతప్రదం. 17.

ఏనుగుపల్లేరు ఆముదపువేళ్లు పిల్లిపీచరము వానితో సిద్ధముచేసిన నేయిగాని పాలుగాని తృణపంచమూలములతో సిద్ధముచేసిన నేతినిగాని పాలనుగాని బెల్లముతో త్రాగిన మూత్రకృచ్ఛ్రాదిరోగములకు మంచిది. వట్టివేళ్లు దర్భలు రెల్లు చెఱకు వీటివేళ్ళతోనైన కషాయమును చల్లార్చి ప్రాతఃకాలమున నియతముగా పుచ్చుకొనిన మూత్రాఘాతము మానును అని కచముని చెప్పెను. హంసపాదిచెట్టువేళ్లను కషాయముచేసి

నేయి నూనె ఆవుమజ్జిగలతో కలిపి త్రాగిన మూత్రాఘాతము వెంటనే నశించును. ఖదిర బీజములను నీటితో నూరిత్రాగిన మూత్రాఘాతము నశ్మరియును హరించును. త్రిజటామూలమును మజ్జిగతో త్రాగినను మూత్రాఘాతాదులు నశించును. మూత్రము బంధించినచో కర్పూరపుచూర్ణమును లింగమునందు రాయవలయును. కాచిచల్లార్చిన పాలను త్రాగవలయును. బియ్యపునీటితో చందనమును శర్కరతో నుష్ణవాతములందు త్రాగవలయును. వస్తివలికుచన్నీటిలో కూయుచున్నను ష్ణవాతము హరించును. గుమ్మడిపసరులో చక్కెరవైచికొని త్రాగవలయును. స్త్రీలయొక్క అతిప్రసంగముచే రక్తము స్రవించుచున్నచో సంగమము పనికిరాదు. పరదగొండి ద్రాక్ష పిప్పళ్లు చెఱకు చక్కెర వీటిని సమానభాగములుగను, పాలు తేనె నేయి సమభాగములుగను చేర్చి తెచ్చి ఒకతులముచొ సేవించి పాలను త్రాగిన వీర్యాశయదోషములు నశించును. గొడ్డుతనమును మానును.

## చిత్రకాదిఘృతము.

శ్లో. చిత్రకం శారిబా చైవ బలం కాలానుశారిబా, ద్రాక్షావిశాలా పిప్పల్య స్తథా చిత్రఫలా భవేత్. 18. తథైవ మధుకం దద్యా ద్దద్యా దామలకాని చ, ఘృతాఢకం పచేదేభిః కల్కైః రక్ష సమన్వితైః. 19. క్షీరద్రోణే జలద్రోణే తస్మిన్ దద్యాత్, శీతం పరిస్రుతంచైవ శర్కరా ప్రస్థసంయుతం. 20. తుగాక్షీర్యా శ్చ తత్సర్వం మతిమాన్ ప్రతిమిశ్రయేత్, తతో మితం పిబేత్కాలే యథాదోషం యథాబలం. 21. వాతరేతాః పిత్తరేతాః శ్లేష్మరేతా శ్చయో భవేత్, రక్తరేతా గ్రంధిరేతాః పిబే దిచ్ఛన్నరోగతాం. 22. జీవనీయం చ వృష్యం చ సర్పి రేత న్మహాగుణం, ప్రజాహితం చ ధన్యం చ సర్వరోగాపహం శివం. 23. సర్పి రేత త్ప్రయుంజానా స్త్రీ గర్భం లభతే చిరాత్, అసృగ్దోషాం జయే చ్చైవ యోనిదోషాం శ్చ సంహతాన్. 24. మూత్రదోషేషు సర్వేషు కుర్యా దేత చ్చికిత్సితం.

చిత్రమూలము సుగంధిపాల ముత్తువపులగము నల్లసుగంధపాల ద్రాక్ష కొడిసెపాలవిత్తులు పిప్పళ్లు యష్టిమధుకము ఉసిరిక వీటిని కాలుపలముచొ, ఆఢకము నేతిలో పక్వము చేసి కల్కమునొక ద్రోణము పాలుమరియొక ద్రోణము నీరువీటితో సిద్ధముచేసి దింపి చల్లార్చివడియగట్టి 16 ప॥ చక్కెరను వైచి వంశలోచన 16 పలములు కలిపి బలదోషానుసారము త్రాగిన రక్తపీతము మున్నగురోగములు నశించును. వాతపిత్తశ్లేష్మరోగములు నశించును. ఈఘృతము జీవనౌషధము. వృష్యయోగము నైయున్నది. దీనిని సేవించిన

స్త్రీ గర్భవతి యగును. రక్తదోషములు నశించును. సంహతము లగు యోనిదోషము లన్నియు నడుగంటును. సమస్తములగు మూత్రదోషములందును దీనితో చికిత్సఁ జేయవలయును.

ఇట్లు చక్రదత్తయందు మూత్రాఘాతాధికారప్రకరణము ముగిసెను.



## 33. అశ్మర్యధికారము.

### * అశ్మరీరోగమునకు సామాన్య చికిత్సలు.

శ్లో. వరుణస్య త్వచం శ్రేష్ఠాం శుంఠీ గోక్షురసంయుతాం, యవక్షారగుడం దత్వా క్వాథయిత్వా పిబేద్ధితాం. 1. అశ్మరీం వాతజాం హన్తి చిరకాలానుబంధినీం, వీరతరః సహచరీ దర్భో వృక్షాదనీ నలః. 2. గుంద్రాకాశకుశా వశ్మభేద మోరటటుంటుకాః, కురంటికా చ వశిరో వసుకః సాగ్నిమంథకః 3. ఇందీవరీశ్వదంష్ట్రా చ తథా కాపోతవక్త్రకః, వీరతరాదిరిత్యేష గణో వాతవికారనత్. 4. అశ్మరీ శర్కరామూత్రకృచ్ఛ్రాఘాతరుజాపహః, శుంఠ్యగ్నిమంథపాషాణశిగ్రువరుణగోక్షురైః. 5. అభయారగ్వథఫలైః క్వాథం కుర్యా ద్విచక్షణః, రామఠక్షారలవణ చూర్ణం దత్వా పిబేన్నరః. 6. అశ్మరీమూత్రకృచ్ఛ్రఘ్నం పాచనం దీపనం పరమ్, హన్యాత్కోష్ఠాశ్రితం వాతం కట్యూరుగుదమేఢ్రగమ్. 7.

ఉలిమిరిచెక్క శొంఠి పల్లేరు వీటికషాయమును యవక్షారము బెల్లములతో సిద్ధము చేసి త్రాగిన చాలకాలమునుండి యున్న అశ్మరియును నశించును. కురువేరు గోరింట దర్భ తిప్పతీగె భద్రముస్తలు కాశము నిశలు చెఱకు పచ్చనిలొద్దుగ పల్లేరు బ్రాహ్మము వీరతరాదిగణమనంబడును. ఇయ్యదివాతవికారమును హరించును. అశ్మరిశర్కర మూత్రకృచ్ఛ్రము మూత్రాఘాతములనిది పోగొట్టును. శొంఠి అగ్నిమంథము పాషాణము మునగ ఉలిమిరి కరక్కాయ రేలపండ్లు వీటితో కషాయముజేసి ఇంగువ యవక్షారమునుచేర్చి త్రాగిన అశ్మరి మూత్రకృచ్ఛ్రములనుపోగొట్టి అగ్నిని దీపింపజేయును. కటి తొడలు గుదస్థానము మేఢ్రస్థానము మున్నగువానిలో గలవాతములను నశింపజేయును.

---

* అశ్మరి యనగా, మూత్రద్వారమునందు రాయి పెరిగెడి రోగము.

### పాషాణ భేదాది ఘృతము.

శ్లో. పాషాణభేదో వసుకో వశిరోఽశ్మన్తకం తథా, శతావరీ శ్వదంష్ట్రా చ బృహతీ కంటకారికా. 8. కపోతవక్త్రార్తగల కాంచనోశీర గుల్మకాః, వృక్షాదనీ భల్లుక శ్చ వరుణః శాకజం ఫలం. 9. యవాః కులుత్థాః కోలాని కతకస్య ఫలాని చ, ఉషకాది ప్రతీవాప మేషాం క్వాథేశృతం ఘృతం. 10. భినత్తి వాతసంభూతా మశ్మరీం క్షిప్ర మేవ తు, క్షారా న్యవాగూః పేయా శ్చ కషాయాణి పయాంసి చ, భోజనాని చ కుర్వీత వర్గేఽస్మి న్వాతనాశనే. 11.

కొండపిండిచెక్క మోదనవేళ్లు ఏనుగుపిప్పళ్లు పిల్లిపీచర పల్లేరు వాకుడు బ్రాహ్మి గోరంట పట్టివేళ్లు గన్నేరు చిట్టిగన్నేరు బదనిక ఉలిమిడి వెలగపండు వీనికషాయములో ఊషకాదిగణౌషధములను ప్రతివాపముచేసి నేతిని చేసి సేవింపవలయును. ఇయ్యది వాతజమగు నశ్మరీరోగమును శీఘ్రముగా పోగొట్టును. క్షారపదార్థములను గంజి పేయ కషాయములును చేసి భుజింపవలయును. వాతనాశకవర్గములగు వానిని భుజింపవలయును.

### ఉషకాది గణము.

శ్లో. ఊషకం సైంధవం హింగు కాశీసద్వయగుగ్గులూః, శిలాజతుః తుత్థకం చ ఊషకాది రుదాహృతః. 12. ఉషకాదిః కఫం హన్తి గణో మేదోవిశోధనః, అశ్మరీశర్కరామూత్ర శూలఘ్నః కఫగుల్మనుత్. 13.

చౌడు సైంధవలవణము ఇంగువ రెండు తెలుగులగు కాసీసములు గుగ్గులుము శిలాజిత్తు మైలుతుత్థము ఇయ్యవి ఉషకాది గణము. ఇది కఫమును పోగొట్టి మెదడును శుద్ధిచేసి అశ్మర్యాదుల నశింపజేసి గుల్మాదులను పోగొట్టును.

### కుశాది ఘృతము.

శ్లో. కుశః కాశః శరో గుల్మ ఇత్కరో మోరటోశ్వభిత్. 14. దర్భో విదారీ వారాహీ శాలిమూలం త్రికంటకః, భల్లూకః పాటలీ పాఠా పత్తూరోథ కురంటకాః. 15. పునర్నవే శిరీషశ్చ క్వథితా స్తేషు సాధితం, ఘృతం శిలాహ్వా మధుకం బీజై రిందీవరస్య చ. 16. త్రపుషై ర్వారుకాణాం వా బీజై శ్చావాపితశ్శృతమ్, భినత్తి పిత్తసంభూతా మశ్మ

రీం క్షిప్ర మేవ తు. 17. క్షారాగా న్యవాగూః పేయాం శ్చ కషాయాణి పయాంసి చ, భోజనాని చ కుర్వీత వర్గేఽస్మి న్పిత్తనాశనే. 18.

కుశకాశములు తెల్లు నల్లచెఱకు చెఱకువేళ్లు పల్లేరు కొండపిండి దర్భశాలిమూలము త్రికంటకములు పాటలి అగరుశొంఠి నేలగుమ్ముడు నేలతాడి పత్తూరము గోరింట శిరీషము గలిజేరు వీటితోనైన కషాయములతో సాధించినదియును, శిలాజిత్తు మధుకము కమలబీజములు దోసకాయ కరుబూజావిత్తులు వీటితో ప్రతివాపము చేయఁబడినదియు నగు నేతిని పిత్తాశ్మరీరోగులు త్రాగవలయును.

## వరుణాది ఘృతము.

శ్లో. గణే వరుణకాద్యే చ గుగ్గు ల్వేలాహరేణుభిః, కుష్ఠముస్తాహ్వామరిచ చిత్రకైః ససురాహ్వయైః. 19. ఏతై స్సిద్ధ మజా సర్పి రుషకాదిగణేనచ, భిన త్తి కఫసంభూతా మశ్మరీం క్షిప్ర మేవ తు. 20. క్షారాం న్యవాగూః పేయాం శ్చ కషాయాణి పయాంసి చ, భోజనాని ప్రకుర్వీత వర్గేఽస్మి న్కఫనాశనే. 21. వరుణా గ్నిగలః శిగ్రుః తర్కారీ మధుశిగ్రుకాః, మేషశృంగీ కిరంటౌ చ బింబ్యగ్నిమంథమోరటాః. 22. శైర్యో శిరీషోదర్భో వరీవసుక చిత్రకౌ, బిల్వం చైవాజశృంగీ చ బృహతీద్వయమేవచ. 23. వరుణాదిగణో హ్యేష కఫమేదో నివారణః, వినిహన్తి శిరఃశూలం గుల్మాద్య న్తరవిద్రధీన్. 24.

వరణాదిగణములందును గుగ్గిలము ఏలకులు రేణుక కోష్ఠు తుంగముస్తలు మిరియములు చిత్రమూలము దేవదారు వీటికషాయమందు నుషకాదిగణమును ప్రతివాపము చేసి సిద్ధము చేసిన మేకపాలు కఫాశ్మరిని పోఁగొట్టును. కఫనాశకములగు క్షారాదుల నిందు భుజింపవలయును. ఉలిమిరి నల్లగోరింట మునగ తీయమునగ మేషశృంగి నెమిలియడుగుచెక్క దొండపండు అగ్నిమంథము చెఱకు శైరీయము శిరీషము దర్భ వరివసుక చిత్రకములు పిల్లిపీచర బిల్వము అజశృంగి దుష్టపుతీగ వాకుడు ఇయ్యది వరణాది గణము. కఫమేదనివారణము, శిరశ్శూల గుల్మము విద్రధి మున్నగువానిని ఇది నశింపఁజేయును.

## వరణాదికషాయము.

శ్లో. వరుణత్వక్కషాయం తు పీతం చ గుడసంయుతమ్, అశ్మరీం పాతయ త్యాశు వస్తిశూలనివారణమ్. 25. యవక్షారం గుడో న్మి

శ్రం పిబేత్పుష్పఫలోద్భవమ్, రసం మూత్రవిబంధఘ్నం శర్కరాశ్మరినాశనమ్. 26. పిబేద్వరుణమూలత్వక్క్వాథం తత్కల్కసంయుతం, క్వాథశ్చ శిగ్రుమూలోత్థః కదుష్ణోఽశ్మరిఘాతకః. 27. నాగరవారుణగోక్షురపాషాణభేదకపోతవల్కజః క్వాథః, గుడయావశూకమిశ్రః పీతో హన్త్యశ్మరీ ముగ్రామ్. 28. వరుణత్వక్శిలాభేదశుంఠీగోక్షురకైః కృతః, కషాయః క్షారసంయుక్తః శర్కరాం చ భినత్త్యపి. 29. శ్వదంష్ట్రైరండపత్రాణి నాగరం వరుణాత్వచమ్, ఏతత్ క్వాథవరం ప్రాతః పిబేదశ్మరిభేదనం. 30. మూలం శ్వదంష్ట్రాక్షురకోరుభూకాత్ క్షీరేణ పిష్టం బృహతీద్వయాచ్చ, ఆలోడ్య దధ్నా మధురేణ పేయం దినాని సప్తాశ్మరిభేదనార్థం. 31. పక్వేక్ష్వాకురసః క్షారః సితాయుక్తోఽశ్మరీహరః, పాషాణరోగపీడాం సౌవర్చలయుక్తా సురా జయతి. 32. తిలవ్యన్నమధుదుగ్ధయుక్తా త్రిరాత్రం తిలనాళభూతిః. 33.

ఉలిమిరికషాయములో బెల్లమును కలిపి త్రాగిన అశ్మరులు శీఘ్రముగా నశించును. వస్తిశూలలు నశించును. యవక్షారమును బెల్లముతో పుష్పఫలరసమును త్రాగిన మూత్రబంధము శర్కరాశ్మరులు నశించును. ఉలిమిరిచెక్క కషాయములో కల్కమును వేసి త్రాగినను మునగచెక్క కషాయమును గోరువెచ్చగా త్రాగినను అశ్మరి నశించును. శొంఠి ఉలిమిర పల్లేరు కొండపిండివేళ్లు బ్రాహ్మి వీటికషాయములో యవక్షారము బెల్లము కలిపి త్రాగిన శర్కర అశ్మరులు నశించును. ఉలిమిరి కొండపిండి శొంఠి పల్లేరు వీటికషాయమును యవక్షారముతో త్రాగినచో శర్కరలు నశించును. పల్లేరు ఆముదపాకులు శొంఠి ఉలిమిరిచెక్క వీటికషాయమును ప్రాతఃకాలమునందు త్రాగిన నశ్మరులు నశించును. పల్లేరు తిలపుచెక్క ఆముదపువేళ్లు వాకుడు వీటిని పాలలో నూరి పెరుగుతో కలిపి ఏడురాత్రులు త్రాగినచో నశ్మరులు నశించును. చేదుసార రసమును యవక్షారము చక్కెర వీటిని కలిపి త్రాగినచో అశ్మరులు నశించును. అశ్మరీబాధను సౌవర్చలవణముతో చేసిన కల్లును త్రాగిన పోగొట్టును. నువ్వుకట్టెలంగాల్చిన బూదిని త్రాగినను మూడురాత్రులలో పోగొట్టును.

## ఏలాదిక్వాథము.

శ్లో. ఏలోపకుల్యామధుకాశ్మభేదకౌంతీశ్వదంష్ట్రావృషకోరుబూకైః, క్వాథం పిబేదశ్మజతుప్రగాఢం సశర్కరే చాశ్మరిమూత్రకృచ్ఛ్రే. 34.

ఏలకులు పిప్పళ్లు యష్టిమధుకము కొండపిండివేళ్లు రేణుకబీజములు పల్లేరు అడ్డసరము ఆముదములు వీటిని కషాయమును చేసి పెన్నేరు లక్క వీటిని కలిపి సేవించిన శర్కర మూత్రకృచ్ఛ్రము అశ్మరులు నశించును.

### త్రికంటకాది చూర్ణము.

శ్లో. త్రికంటకస్య బీజానాం చూర్ణం మాక్షికసంయుతం, అవిక్షీరేణ సప్తాహం పిబే దశ్మరినాశనం. 35. శుక్రాశ్మర్యాం తు సామాన్యో విధి రశ్మరినాశనః.

పల్లేరుగింజలను పొడిగొట్టి తేనె నందు కలిపి మేకపాలతో నేడుదినములు త్రాగిన కల్లుగట్టుట (అనగా నశ్మరీరోగము) మానును. తెల్లఅశ్మరియందు అశ్మరీసామాన్య చికిత్సను చేయవలయును.

### పాషాణభేదచూర్ణము.

శ్లో. పాషాణభేదం వృషకం శ్వదంష్ట్రా పాఠాభయావ్యోషశఠీనికుంభాః, హింస్రాఖరాశ్వా సితిమారకాణా మేర్వారుకా చ్చ త్రపుసా చ్చ బీజం. 36. ఉపకుంచికాహింగుసవేతసామ్లం స్యాద్ద్వే బృహత్యౌ హపుషా వచా చ, చూర్ణం పిబే దశ్మరిభేదిపక్వం సర్పి శ్చ గోమూత్ర చతుర్గుణం తైః. 37.

కొండపిండివేళ్లు అడ్డసరము పల్లేరు అగరు శొంఠి కరక్కాయలు శొంఠి మిరియములు పిప్పళ్ళు కచ్చూరము కరక్కాయలు తాలింశపత్రము నక్కదోసవిత్తులు మున్నగువానిచూర్ణమును నాలుగెట్లగోమూత్రముతో సిద్ధముచేసి నేతితో త్రాగిన నశ్మరులు హరించును.

### కులత్థ చూర్ణము.

శ్లో. కులత్థ సిన్ధూత్థ విడంగసారం సశర్కరం శీతలయావశూకం, బీజాని కూష్మాండక గోక్షురాభ్యాం ఘృతం పచే న్వారుణస్య తోయే. 38. దుఃసాధ్య సర్వాశ్మరి మూత్రకృచ్ఛ్రం మూత్రాభిఘాతం చ సమూత్రబంధం, ఏతాని సర్వాణి నిహన్తి శీఘ్రం ప్రరూఢవృక్షా నివ వజ్రపాతః. 39.

ఉలవలు సైంధవలవణము వాయువిడంగములు కలకండ కర్పూరము యవక్షారము గుమ్ముడువిత్తులు పల్లేరు వీటితో ప్రతివాపమును చేసి ఉలిమిరికషాయముతో నేతిని త్రాగిన దుస్సాధ్యములగు నశ్మరీరోగము లన్నియును మూత్రకృచ్ఛ్రము మూత్రాభి

ఘాతము మూత్రబంధము మున్నగువానిని వజ్రము వృక్షములగుంపునువలె నశింపఁ జేయును.

శరాది పంచమూల ఘృతము.

శ్లో. శరాదిపంచమూల్యా వా కషాయేణ పచేద్ఘృతమ్, ప్రస్థం గోక్షురకల్కేన సిద్ధ మద్యాత్ససశర్కరమ్. 40. అశ్మరీమూత్రకృచ్ఛ్రఘ్నం రేతోమార్గరుజాపహమ్.

తృణపంచమూలముల కషాయములో పల్లేరుకల్కమును 16 పలముల నేతిని పక్వముచేసి చక్కెర కలిపి సేవించిన అశ్మరి మూత్రకృచ్ఛ్రము మున్నగు మూత్రరోగములు హరించును.

వరుణాదిఘృతము.

శ్లో. వరుణస్య తులాం క్షుణ్ణాం జలద్రోణే విపాచయేత్. 41. పాదశేషం పరిస్రావ్య ఘృతప్రస్థం విపాచయేత్, వరుణం కదళీం బిల్వం తృణజం పంచమూలకమ్. 42. అమృతాం చాశ్మజం దేయం బీజం చ త్రపుషోద్భవమ్, శతపర్వతిలక్షారం పలాశక్షార మేవ చ. 43. యూథికాయాశ్చ మూలాని కార్షికాణి సమావపేత్, అస్య మాత్రాం పిబ జ్జంతు ర్దేశకాలాద్యపేక్షయా. 44. జీర్ణే తస్మి న్పిబే త్పూర్వం గుడం జీర్ణం తు మస్తునా, అశ్మరీం శర్కరాం చైవ మూత్రకృచ్ఛ్రం చ నాశయేత్ 45.

ఉలిమిరిచెక్క చూర్ణము ద్రోణపునీటిలో పక్వముచేసి నాల్గవపాలు మిగిలినప్పు డొకప్రస్థము నేతినిపక్వము చేసి ఉలిమిరి అరటి బిల్వము తృణపంచమూలములు కరక్కాయ కొండపిండివేళ్ళు త్రపుషబీజములు వంశలోచన తిలక్షారము మున్నగువానిని ఒక్కొక్కకాలుపలము తీసి ప్రాతివాపమునిచ్చి దేశకాలానుసారముగా త్రాగి జీర్ణమైన పిమ్మట పాతబెల్లమును మజ్జిగ తేటతో త్రాగినచో అశ్మర్యాది రోగములు నశించును.

వీరతరాది తైలము.

శ్లో. బధ్నాధికారే య త్తైలం సైంధవాద్యం ప్రకీర్తితమ్, త త్తైలం ద్విగుణక్షీరం పచే ద్వీరతరాదినా. 46. క్వాథేన పూర్వకల్కేన సాధితం తు భిషగ్వరైః, ఏత త్తైలవరం శ్రేష్ఠ మశ్మరీణాం వినాశనమ్. 47. మూత్రాఘాతే మూత్రకృచ్ఛ్రే పిచ్ఛితే మథితే తథా, భగ్నే శ్రమాభిపన్నే చ సర్వథైవ ప్రశస్యతే. 48.

బ్రధ్నరోగపుటధికారమునందు జెప్పిన సైంధవాదితైలమును రెండురెట్లపాలు వీరతరాదిగణకషాయమును కల్కము చేసి పక్వముచేయవలయును. ఇయ్యది అశ్మరిని పోఁగొట్టును. మూత్రాఘాతాది మూత్రరోగముల నన్నింటిని హరించును.

## వరుణాద్యతైలము.

శ్లో. త్వక్పత్రమూలపుష్పస్య వరుణా త్స్రికంటకాత్, కషాయేణ పచే త్తైలం వస్తినా స్థాపనేన చ. 49. శర్కరాశ్మరిశూలఘ్నం మూత్రకృచ్ఛ్రనివారణమ్.

ఉలిమిరిచెక్క వేళ్లు పూవులు పల్లేరు వీటికషాయముతో తైలమును పక్వము చేసి యుంచి వస్తులయందుపయోగించిన శర్కర అశ్మరి శూల మూత్రకృచ్ఛ్రము నశించును.

## శల్యోద్ధరణాద్యుపాయములు.

శ్లో. శల్యవి త్తా మశామ్యంతీం ప్రత్యాఖ్యాయ సముద్ధరేత్. 50. పాయుక్షిప్తాంగులీభ్యాం తు గుద మేఢ్రాన్తరే గతాం, సేవన్యాః సవ్యపార్శ్వే చ యవమాత్రం విముచ్య తు. 51. వ్రణం కృత్వా శ్మరీమాత్రం కర్షే తాం శస్త్రకర్మవిత్. భిన్నేతు వస్తౌ దుర్జ్ఞానా న్మృత్యుః స్యా దశ్మరీం వినా. 52. నిఃశేషా మశ్మరీం కుర్యా ద్వస్తౌ రక్తం చ నిర్హరేత్, హృతాశ్మరీ కదుష్ణాంభో గాహయే ద్యోజయే చ్చ తమ్. 53. గుడం మూత్రవిశుద్ధ్యర్థం మద్వాజ్యాక్తవ్రణం తతః, దద్యా త్త్ర్యాజ్యాం త్ర్యహం పేయాం సాధితాం మూత్రశోధనైః. 54. ఆదశాహం తతో దద్యా త్పయసా మృదునోదనమ్, స్వేదయే ద్వవమధ్వాఘ్యం కషాయైః క్షాళయే ద్వ్రణమ్. 55. ప్రపౌండరీక మంజిష్ఠా యష్టి లోధ్రైశ్చ లేపయేత్, ఏతైశ్చ సలిలైః సిద్ధం ఘృత మభ్యంజనే హితం. 56. అప్రశాన్తే తు సప్తాహా ద్వ్రణే దాహేపి చేష్యతే, దైవాన్నాభ్యాం తు యా లగ్నా తాం విపాట్యాపకర్షయేత్. 57.

శల్యచికిత్స నెఱిఁగిన వైద్యుఁడు అసాధ్యములగు నశ్మరులను వదలిపెట్టి గుదస్థానమునను రెండంగుళము లదూరమును అశ్మరిని తీసివేయవలయును. సీవనియొక్క ఎడమప్రక్కన యవగింజంత వదలి గాయమును చేసి అశ్మరిని తీసివేయవలయును. తెలివిలేమిచే వస్తి పగిలిపోయెనేని అశ్మరిరోగి చనిపోవును. నిశ్శేషముగా నశ్మరిని తొలగింప

వలయును. పిమ్మట వేడినీళ్లతో కాచి భుజింపచేయందగును. మూత్రశోధాకరములగు నౌషధములతో సిద్ధముచేసిన నేయిని పేయను త్రాగించవలెను. పదిదినములవఱకు నిట్టులు పాలతో మృదువగు నన్నమును పెట్టవలయును. యవలు తేనె కలిపిన పదార్థములతో స్వేదము నిప్పించి కషాయముతో గాయమును కడుగవలయును. కమలములు మంజిష్ఠము యష్టిమధుకము లొద్దుగ వీటిచూర్ణముతో పూయవలయును. వీటితో సిద్ధముచేసిన నేతిని రుద్దుట మంచిది. ఏడుదినములవఱకును గాయముమానదేని వ్రణమునందు రెండు చుఱకలును వేయవలయును. దైవయోగమున బొడ్డుదగ్గఱ సంక్రమించిన యశ్మరిని పెకల్చి పారగొట్టవలయును.

ఇట్లు చక్రదత్తయందు అశ్మర్యధికారప్రకరణము ముగిసెను.

---

# ౩౮. ప్రమేహాధికారము.

ప్రమేహోపాయములు.

శ్లో. శ్యామాక కోద్రవోద్దాల గోధూమ చణకాఢకీ, కులుత్థాశ్చ హితా భోజ్యా పురాణమేహినాం సదా. 1. జాంగలం తిక్తశాకాని యవాన్నం చ తథా మధు, పారిజాతజయా నింబవహ్నిగాయత్రిణాం పృథక్. 2. పాఠాయాం సాగురోః పీతా ద్వయస్య శారదస్య చ, జలేక్షుమధ్యసికతాం శైవాల లవణపిష్టకాః. 3 సాంద్రమేహాన్ క్రిమాత్ ఘ్నన్తి హ్యష్టౌ క్వాథాః సమాక్షికాః, దూర్వా కశేరు పూతీక కుంభీపల్వల శైవలమ్, జలేన క్వథితం పీతం శుక్రమేహహరం పరమ్. 4. త్రిఫలాగ్వధద్రాక్షా కషాయో మధుసంయుతః, పీతో నిహన్తి ఫేనాఖ్యం ప్రమేహం నియతం నృణాం. 5.

ప్రాచీనమగు మేహరోగములు గలవారలకు చామలు కొఱ్ఱలు గోధుమలు ఉద్దాలకములు సెనగలు అరికలు ఉలవలు ఇవి పథ్యధాన్యములు. అడవిధాన్యములు చేదుగలకూరలు యవాన్నము తేనె హితములు. దేవదారు అరణి వేప చిత్రమూలము ఖదిరము అగరుశొంఠి అగరు తెల్లకషలను వీటిని వేరువేరుగా తేనెతోకలిపి క్వాథములను చేసి సేవించినచో జలప్రమేహము ఇక్షుప్రమేహము మదిరాప్రమేహము

సికతాప్రమేహము శనైఃప్రమేహము లవణప్రమేహము పిష్టప్రమేహము సాంద్రప్రమేహము క్రమముగా నశింపఁజేయును. దూర్వలు కశేరువు నెమలియడుగువేరు కుంకుమపువ్వు నూత్నశైవాలము వీటిని నీటితో కషాయము చేసి త్రాగిన శుక్రప్రమేహములుహరించును. త్రిఫలములు అమ్లవేతము ద్రాక్ష వీటికషాయమును తేనెతో కలిపి త్రాగినచో ఫేన ప్రమేహము నశించును.

## లోధ్రాది కషాయములు.

శ్లో. లోధ్రాభయాకట్ఫలముస్తకానాం విడంగ పాఠార్జున ధన్వనాసామ్, కదంబ శాలార్జున దీప్యకానాం విడంగదార్వీధవ శల్లకీనామ్. 6. చత్వార ఏతే మధునా కషాయాః కఫప్రమేహేషు నిషేవణీయాః, అశ్వత్థా చ్చతురంగుల్యా న్యగ్రోధాదేః ఫలత్రికాత్. 7. సజుంగిరక్తసారా చ్చ క్వాథాః పంచ సమాక్షికాః, నీలహారిద్రఫేనాఖ్య క్షారమాంజిష్ఠకాహ్వయాన్. 8. మేహాన్ హన్యుః క్రమా దేతే సక్షౌద్రో రక్తమేహనుత్, క్వాథః ఖర్జూరకాశ్మర్య తిందుకాస్థ్యమృతాకృతాః. 9. లోధ్రార్జునోశీరకుచందనానా మరిష్టసేవ్యామలకాభయానామ్, ధాత్ర్యర్జునారిష్టకవత్సకానాం, నీలోత్పలైలాతిని శార్జునానాం. 10. చత్వార ఏతే విహితాః కషాయాః పిత్తే ప్రమేహే మధుసంప్రయుక్తాః.

లొద్దుగ కరక్కాయలు కట్ఫలము తుంగముస్తలు వాయువిడంగములు అగరుశొంఠి అర్జునవృక్షము యవాసయును మ్రానిపసపు శల్లకియును కఁమి మద్ది అజమోదలును అను నీనాలుగు విధముల కషాయములలో తేనెను కలిపికొని కఫప్రమేహములయందు సేవింపవలయును. పిప్పళ్లతో అమ్లవేతసముతో న్యగ్రోధాదిగణముతో త్రిఫలములతో మంజిష్ఠ రక్తచందనములతో వేఱ్వేరుగా నైదువిధముల కషాయములనుకాచి తేనెతో కలిపి త్రాగిన నీలము హారిద్రము ఫేనము క్షారము మంజిష్ఠకము అను ప్రమేహములు నశించును. ఖర్జూరము గుమ్ముడి తుమికి తిప్పతీగె వీటికషాయములో తేనెను చేర్చికొని త్రాగిన రక్తప్రమేహములు హరించును. లొద్దుగ అర్జునము వట్టివేళ్ళు రక్తచందనములును మంజిష్ఠ కురువేరు ఉసిరిక కరక్కాయలును ఉసిరిక అర్జునము నింబము కోష్ఠులును నల్లకమలములు ఏలకులు పసపు అర్జునవృక్షపుచెక్కయును అను నీనాల్గువిధముల కషాయములను తేనెకలిపి త్రాగినచో ప్రమేహములలో హితకరము అగును.

## ఛిన్నాదిక్వాథములు.

శ్లో. ఛిన్నావహ్నికషాయేణ పాఠాకుటజ రామఠం, తిక్తాం కుష్ఠంచ సంచూర్ణ్య సర్పి ర్మేహీ పిబే న్నరః. 11. ఖాదిరపూగక్వాథం క్షౌద్రాహ్వయే పిబేత్, అగ్నిమంథకషాయం తు వసామేహే ప్రయోజయేత్. 12. పాఠాశిరీషదుస్పర్శ మూర్వాకింశుకతిందుకమ్, కపిత్థానాం భిషక్క్వాథం హస్తిమేహే ప్రయోజయేత్. 13. కంపిల్లసప్తచ్ఛదశాలజాని విభీత రోహీతకకౌటజాని, కపిత్థపుష్పాణి చ చూర్ణితాని క్షౌద్రేణ లిహ్యా త్కఫపిత్తమేహీ. 14. సర్వమేహహరా ధాత్ర్యా రసః క్షౌద్రనిశాయుతః, కషాయ స్త్రిఫలాదారుముస్తకై రథవా కృతః. 15. ఫలత్రికం దారునిశాం విశాలాం ముస్తం చ నిఃక్వాథ్య నిశాంశ కల్కమ్, పిబే త్కషాయం మధుసంప్రయుక్తం సర్వేషు మేహేషు సముత్థితేషు. 16.

తిప్పతీగ చిత్రమూలముల కషాయములో అగరుశొంఠి కోష్ఠు ఇంగువ కటుకి రోహిణి వీటిచూర్ణమును కలిపి ఘృతప్రమేహి త్రాగవలయును. తెల్లచంద్ర చంద్రపాక వీటి కషాయమును క్షౌద్రప్రమేహి త్రాగవలయును. అగ్నిమంథకషాయమును వసాప్రమేహమునందును అగరుశొంఠి శిరీషము యవాస చాగ కింశుకము తుమికిచెక్క వెలగ వీటికషాయమును హస్తిమేహమునందును కంపిల్లము సప్తచ్ఛదము శాలపర్ణి తాండ్ర రోహీతలొద్ది కుటజము (గిరిమల్లిక) వెలగ రాతిపూవు వీటిచూర్ణమును తేనెతో కఫపిత్తమేహమునందును సేవింపవలయును. ఉసిరికరసము తేనెపసపుతో చేర్చి త్రాగిన యన్ని విధముల మేహములు నశించును. లేనిచో త్రిఫలములు దేవదారువు తుంగముస్తలతో కషాయమును గాచి త్రాగవలయును. త్రిఫలములు మ్రానిపసపు ఇంద్రవారుణి తుంగముస్త వీటికషాయములో పసపుపొడివేసి తేనెతో త్రాగిన ప్రమేహము లన్నియును నశించును.

## మ్రానిపసపు కషాయము.

శ్లో. కటంకటేరీమధుక త్రిఫలా చిత్రకై స్సమైః, సిద్ధః కషాయః పాతవ్యః ప్రమేహాణాం వినాశనః. 17. త్రిఫలా దారుదార్వ్యబ్ద క్వాథః క్షౌద్రేణ మేహహా, కుటజాసనదార్వ్యబ్ద ఫలత్రయ భవోఽథవా. 18. త్రిఫలాలోహశిలాజతు పథ్యాచూర్ణం చ లీఢ మేకైకం,

మధునామరాస్వరసశ్చవ సర్వాన్ మేహాన్ నిరస్యతి. 19. శాలముష్కక కంపిల్ల కల్క మక్షసమం పిబేత్, ధాత్రీగసేన సక్షౌద్రం సర్వమేహ హరం పరమ్. 20.

మ్రానిపసపు మధుకము త్రిఫలములు చిత్రమూలములు వీటితో చేసిన కషాయము ప్రమేహములను పోగొట్టును. త్రిఫలములు దేవదారు మ్రానిపసపు వీటికషాయమును తేనెతో త్రాగిన ప్రమేహములు నశించును. లేనిచో కోష్ఠు మ్రానిపసపు దేవదారు త్రిఫలములు వీటికషాయమైనను ప్రమేహమును హరించును. త్రిఫలములు మండూరము శిలాజిత్తు కరకాయలు వీటిచూర్ణమును తేనెతోనాకిన ప్రమేహములు నశించును. తిప్పతీగెరసము అర్జునపుచెక్క ముష్కము కంపిల్లను వీటికల్కమును అక్షమంత త్రాగినను ఉసిరికరసముతో తేనెను త్రాగినను సర్వమేహములును నశించును.

## న్యగ్రోధచూర్ణము.

శ్లో. న్యగ్రోధోదుంబరాశ్వత్థ స్యోనాకారగ్వధాసనమ్, ఆమ్ర జంబూ కపిత్థం చ ప్రియాలం కకుభం ధవమ్. 21. మధుకోమధుకం లోధ్రం వరుణం పారిభద్రకం, పటోలం మేషశృంగీ చ దన్తీ చిత్రక మాఢకీ. 22. కరంజత్రిఫలా శక్ర భల్లాతక ఫలానిచ, ఏతాని సమభాగాని శ్లక్ష్ణచూర్ణాని కారయేత్. 23. న్యగ్రోధాద్యమిదం చూర్ణం మధునా సహ లేహయేత్, ఫలత్రయరసం చాను పిబే న్మూత్రం విశుద్ధ్యతి. 24. ఏతేన వింశతి ర్మేహా మూత్రకృచ్ఛ్రాణి యాని చ, ప్రశమం యాన్తి యోగేన పిడకా న చ జాయతే. 25. న్యగ్రోధాద్య మిదం త్వత్ర చామ్రజం స్వ స్థి గృహ్యతే. 26.

మర్రి మేడి రాగి పెద్దమ్రాను అమ్లవేతసు తెకమామిడి నేరేడు వెలగ ప్రియాలు అర్జునవృక్షము చంద్ర మధుకను ముల్లంగి లొద్దుగ ఉలిమిరి వేప చేదుపొట్ల పల్లేరు దంతి చిత్రమూలము ఆఢకి నెమలిఅడ్డు త్రిఫలములు కొడిసెపాల జీడి వీటిని సమానభాగములనుగా తెచ్చి చూర్ణము చేసి తేనెతో సేవించి తదుపాతి త్రిఫలముల యుదకముతో త్రాగిన మూత్రము శుద్ధమగును. వినివలన వింశతి మేహములను శాంతించును. పిడక వ్యాధులు పుట్టనే పుట్టవు. ఇయ్యది న్యగ్రోధాదిచూర్ణము. ఇందు మామిడి నేరేడును విత్తులు చేర్పవలయును.

### త్రికంటకతైలము.

శ్లో. త్రికంటకాశ్మన్తక సోమవల్కై- ర్భల్లాతకై స్సాతివిషై స్సలోధ్రైః, వచాపటోలార్జున నింబముస్తై ర్హరిద్రయా దీప్యకపద్మకైశ్చ. 27. మంజిష్ఠపాఠాగురుచందనైశ్చ సర్వైస్సమస్తైః కఫవాతజేషు, మేహేషు తైలం విపచేద్ఘృతం తు పిత్తేషు మిశ్రం త్రిషు లక్షణేషు 28.

పల్లేరు ఆరె తెల్లచంద్ర నల్ల జీడివిత్తులు అతివస లొద్దుగ వస చేదుపొట్ల అర్జున చెక్క వేపవేళ్లు తుంగముస్తెలు పసపు అజమోద కమలములు మంజిష్ఠము అగరుశొంఠి అగురు చందనము వీటితో తైలమును పక్వము చేసి కఫవాతపు ప్రమేహములకు నీయవలయును. పిత్తప్రమేహములయందు నేతిని పక్వము చేయవలయును. త్రిదోషార్థమగు దానికిని త్రిలక్షణములందును మిశ్రముచేసి ఈయవలయును.

### ధాన్వంతర ఘృతము.

శ్లో. కఫమేహహరః క్వాథ స్సిద్ధం సర్పిః కఫే హితం, పిత్తమేహఘ్న నిర్యూహసిద్ధం పిత్తే హితం ఘృతం. 29. దశమూలం కరంజౌ ద్వౌ దేవదారుః హరీతకీ, వర్షాభూ ర్వరుణోదన్తీ చిత్రకం సపునర్నవం. 30. సుధాసీపకదంబా శ్చ బిల్వభల్లాతకాని చ, శఠీపుష్కరమూలం చ పిప్పలీమూలమేవ చ. 31. పృథగ్దశపలా న్భాగాం స్తత స్తోయార్మణే పచేత్, యవకోలకులుత్థానాం ప్రస్థం ప్రస్థం చ దాపయేత్. 32. తేన పాదావశేషేణ ఘృతప్రస్థం విపాచయేత్, నిచులం త్రిఫలా భార్గీ రోహిషం గజపిప్పలీ. 33. శృంగబేరం విడంగాని వచా కంపిల్లకం తథా, గర్భేణానేన తత్సిద్ధం పాయయేత్తు యథాబలమ్. 34. ఏత ద్ధాన్వన్తరం నామ విఖ్యాతం సర్పి రుత్తమం, కుష్ఠం గుల్మం ప్రమేహాం శ్చ శ్వయథుం వాతశోణితమ్. 35. ప్లీహోదరం తథా ర్శాంసి విద్రధిం పిడకా శ్చ యాః, అపస్మారం తథోన్మాదం సర్పి రేతన్నియచ్ఛతి. 36. పృథక్తోయార్మణే తత్ర పచే ద్ద్రవ్యా చ్ఛతం శతమ్, శతత్రయాధికే తోయ ముత్సర్గక్రమతో భవేత్. 37.

కఫమేహహరములగు కషాయములతో చేసిన ఘృతము కఫమునకును పిత్తమేహహర కషాయసిద్ధఘృతము పిత్తమునకును హితములు. దశమూలము ఇఱుతెలుగులగు నెమలియడ్డు

వేరులు దేవదారు కరక్కాయలు గజ్జేరు ఉలిమిరి చిత్రమూలము నఖమనుగంధద్రవ్యము జెముడుపాలు కడిమి మారేడు నల్లజీడివిత్తనములు కచ్చూరము బోదతరము అగురు శొంఠి వీటిని వేర్వేరుగా పదిపలములచొ॥ తీసికొని 256 పలముల నీటిలో పక్వముచేసి యవలు ఉలవలు 16పలములచొ॥ వైచిపక్వముచేసి నాల్గవపాలుమిగిలియుండగా 16ప॥ నేయినందు వైచి పక్వముఁ జేయవలయును. జలవేతసము త్రిఫలములు గంటుభారంగి రోహిషతృణము ఏనుగుపిప్పళ్లు ఆల్లము వాయువిడంగములు వస కంపిల్లకము వీటికల్కమునందు వైచి సిద్ధముచేసిన ఘృతమును బలానుసారముగా సేవించిన కుష్ఠుగుల్మములు ప్రమేహములు వాపులు వాతరక్తములు ప్లీహోదరములు మూలరోగము విద్రధి పిడకవ్యాధులు మృగీరోగము పిచ్చి వీటిని పోఁగొట్టును.

## త్ర్యూషణగుటికలు.

శ్లో. త్రికటుః త్రిఫలా చూర్ణ తుల్య యుక్తం తు గుగ్గులుమ్, గోక్షురక్వాథసంయుక్తం గుటికాం కారయే ద్భిషక్. 38. దోషకాలబలాపేక్షీ భక్షయే చ్చానులోమికీమ్, న చాత్ర పరిహారోఽస్తి కర్మ కుర్యా ద్యథేప్సితమ్. 39. ప్రమేహా న్మూత్రాఘాతాం శ్చ వాలరోగో దరం జయేత్.

శొంఠి మిరియములు పిప్పళ్ళు త్రిఫలములు వీటిచూర్ణమును సమముగా గుగ్గిలము పల్లేరుల కషాయములో వైచి మాత్రలఁజేసి దోషకాలబలముల ననుసరించి యిచ్చి ప్రమేహములు మూత్రరోగములు ఉదరరోగములు నశించును. పథ్యములేదు. పలసి నపనిని చేయవచ్చును.

## శిలాజిత్తు యోగము.

శ్లో. శాలసారాదితో యేన భావితం యు చ్ఛిలాంజతు. 40. పిబే త్తేనైవ సంశుద్ధ దేహః పిష్టం యథాబలమ్, జాంగలానాం రసై స్సార్థం తస్మి న్జీర్ణే చ భోజనమ్. 41. కుర్యా దేవం తులాంయావదు పయుంజీత మానవః, మధుమేహం విహాయాఽసౌ శర్కరా మశ్మరీం తథా, వపు ర్వర్ణబలోపేతః శతం జీవ త్యనామయః. 42.

శాలసారాదికషాయములో భావనచేసి శిలాజిత్తును నూరి బలానుసారముగా భక్షించి జీర్ణించిన పిమ్మట అడవిజంతువుల మాంసపురసముతో భుజింపవలయును. ఇది మధుమేహములను తప్ప తక్కిన శర్కరాశ్మరులనన్నింటిని పోఁగొట్టును.

### విడంగాది లేహ్యము.

శ్లో. విడంగత్రిఫలాముస్తైః కణయా నాగరేణ చ. 43. జీరకాభ్యాం యుతో హన్తి ప్రమేహా నతిదుస్తరాన్, లోహా మూత్రవికారాం శ్చ సర్వ మేవ న సంశయః. 44.

వాయువిడంగములు త్రిఫలములు తుంగముస్తలు పిప్పళ్లు శొంఠి జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ వీటితో చేర్చిన మండూరము మిక్కిలియును భయంకరములగు ప్రమేహములను మూత్రవికారములనైనను నిస్సంశయముగా పోగొట్టును.

### మక్షికాద్యుపాయములు.

శ్లో. మాక్షికం ధాతు మప్యేవం యుంజ్యా త్తస్యా ప్యయం గుణః, శాలసారాది వర్గస్య క్వాథే తు ఘనతాం గతే. 45. దన్తీలోధ్రశివాకాన్త లోహతామ్రరజః క్షిపేత్, ఘనీభూత మదగ్ధం చ ప్రాశ్య మేహా న్వ్యపోహతి. 46. వ్యాయామజాతమఖిలం భజన్మేహా న్వ్యపోహతి, పాదత్రచ్ఛత్రరహితో భైక్షాశీ మునివ ద్యతిః. 47. యోజనానాం శతం గచ్ఛే దధికం వా నిరన్తరమ్, మేహా న్జేతుం బలేనాపి నీవారామలకాశనః. 48. శరావికాద్యాః పిడకాః సాధయే చ్ఛోథవ ద్భిషక్, పక్వా శ్చికిత్సే ద్వ్రణవ త్తాసాం పానే ప్రశస్యతే. 49. క్వాథం వనస్పతే ర్వాస్తం మూత్రం చ వ్రణశోధనమ్, ఏలాదికేన కుర్వీత తైలం చ వ్రణరోపణమ్. 50. ఆరగ్వధాదినా కుర్యాత్ క్వాథ ముద్వర్తనాని చ, శాలసారాదిశేకం చ భోజ్యాదిం చ కణాదినా. 51. సౌవీరకం సురాం శుక్తం తైలం క్షీరం ఘృతం గుడమ్, అమ్లేక్షురసపిష్టాన్నానూపమాంసాని వర్జయేత్. 52.

స్వర్ణమాక్షికమును శాలసారాదిగణపుటౌషధుల కషాయముతో పక్వము చేసి గట్టిపడిన పిమ్మట దంతి లొద్దుగ కరక్కాయను లోహకాంతము తామ్రము వీటిచూర్ణమును వైచి గట్టిపడిన పిమ్మట దించి భక్షించిన ప్రమేహములు నశించును. శరీరపరిశ్రమలను చేసినను ప్రమేహము శాంతించును. కాళ్లకుజోడు లేకుండ పైకిగొడుగు లేకుండ భిక్షాశియగు మునివలె 400 క్రోసులు ఎల్లప్పుడును తిరుగవలయును. నీవారముల అన్నము ఉసిరికరసమును తినిన మేహములు నశించును. శరావికాదిబాధలలో శోఫకువలె చికిత్స చేయవలయును. పక్వములయిన పిడకావ్రణములకు వ్రణచికిత్సను చేయవలయును. మూలికలకషాయమును మేకమూత్రమును గాయములను శోధించును. ఏలాదిగణకషాయములో తైలమును తయారుచేసి గాయముపైన పూయవలయును. ఆరగ్వధగణపు

కషాయముతో తడుపవలయును. కళాదిగణపు ఔషధములను భుజింపవలయును. గంజి మద్యము శుక్తము తైలము పాలు నేయి బెల్లము పులుసు చెఱకురసము నూరిన అన్నము నీటిపట్టుల జంతువుల మాంసము ఇవ్యాది అపథ్యపదార్థములు.

ఇట్లు చక్రదత్తయందు ప్రమేహాధికార ప్రకరణము ముగిసెను.

## 38. స్థౌల్యాధికారము.

### స్థౌల్యహరోపాయములు.

శ్లో. శ్రమచింతావ్యవాయాధ్వక్షౌద్రజాగరణప్రియః, హంత్యవశ్య మతిస్థౌల్యం యవశ్యామాకభోజనః. 1. అస్వాపం చ వ్యవాయం చ వ్యాయామం చింతనాని చ, స్థౌల్య మిచ్ఛన్ పరిత్యక్తుం క్రమేణాతిప్రవర్ధయేత్. 2. ప్రాతర్మధుయుతం వారి సేవితం స్థౌల్యనాశనమ్, ఉష్ణమన్నస్య మండం వా పిబన్ కృశతనుర్భవేత్. 3. సచవ్యజీరకవ్యోషహింగుసౌవర్చలానలాః, సక్తవః పీతా మేదోఘ్నా వహ్నిదీపనాః. 4 విడంగనాగరక్షారకాలలోహరజో మధు, యవామలకచూర్ణం తు ప్రయోగః స్థౌల్యనాశనః. 5.

పరిశ్రమము విచారము దుర్వ్యసనము మైథునము నడక క్షౌద్రము జాగరణము ఇవ్యాది సేవించువారలును, యవలు చామలు నీటి అన్నమును తినెడివారలును, స్థౌల్యమును పోఁగొట్టుకొందురు. నిద్రలేపోవుట మైథునము వ్యాయామము ఆలోచనములు వీటిని అతిస్థౌల్యము కూడదనుకొనెడివాడును పెంపు చేయవలయును. ప్రాతస్సున తేనెతో నీటిని త్రాగినను వేడియన్నమును గాని గంజిని గాని త్రాగినను కృశించిన శరీరముగలవాడగును. చవ్యము జీలకఱ్ఱ త్రికటుకములు ఇంగువ సౌవర్చలవణము చిత్రమూలము వీటిని పత్తుపిండి మంచితీర్థము పెఱుగు వీటితో సేవించిన మేదస్సు నశించును. అగ్నియుద్దీపించును. వాయువిడంగములు శొంఠి యవక్షారము ఎఱ్ఱచిత్రమూలము మండూరము యవలు ఉసిరికరసము వీటిచూర్ణమును సేవించినను అతిస్థౌల్యమునశించును.

### వ్యోషాది ప్రయోగములు.

శ్లో. వ్యోషం విడంగశిగ్రూణి త్రిఫలాం కటురోహిణీం, బృహత్యౌ ద్వే హరిద్రే ద్వే పాఠా మతివిషాం స్థిరాం. 6. హింగుకేబూకమూలాని యమానీధాన్యచిత్రకం, సౌవర్చల మజాజీం చ హపుషాం

చేతి చూర్ణయేత్. 7. చూర్ణతైలఘృతక్షౌద్రై ర్భాగాః స్యు ర్మానతః సమాః, సక్తూనాం షోడశగుణో భాగః సంతర్పణం పిబేత్. 8. ప్రయోగా త్తస్య శామ్యన్తి రోగాః సంతర్పణోత్థితాః, ప్రమేహా మూఢవాతా శ్చ కుష్ఠా న్యర్శాంసి కామలాః. 9. ప్లీహపాండ్వామయః శోథో మూత్రకృచ్ఛ్ర మరోచకః, హృద్రోగో రాజయక్ష్మా చ కాస శ్వాసౌ గలగ్రహః. 10. క్రిమయో గ్రహణీదోషాః శ్వైత్ర్యం స్థౌల్య మతీవ చ, నరాణాం దీప్యతే చాగ్నిః స్మృతి ర్బుద్ధి శ్చ జాయతే. 11.

శొంఠి మిరియములు పిప్పళ్లు వాయువిడంగములు ముస్త త్రిఫలములు కటుకరోహిణి వాకుడు పసుపు మ్రానిపసుపు అగరుశొంఠి అతివస శాలిపర్ణి ఇంగువ వాకళ ముల్లంగి ఓమము ధనియములు చిత్రమూలము సౌవర్చలవణము జీలకఱ్ఱ హ్రీబేరము వీటిని చూర్ణముచేసి సత్తుపిండియు నేయి తేనె వీటికో భాగపరిమాణముగా సేవింపవలయును. సత్తుపు 16 భాగములు సేవింపవలయును. దీనివలన సంతర్పణోత్థములగు రోగములు నశించును. ప్రమేహములు మూఢవాతములు కుష్ఠులు మూలరోగములు కామెల ప్లీహ పాండురోగము వాపు మూత్రకృచ్ఛ్రము అరోచకము హృద్రోగము క్షయరోగము కాస శ్వాసము గళగ్రహము క్రిమిరోగములు గ్రహణులు బొల్లి స్థౌల్యములును నశించును. అగ్ని దీపించును. బుద్ధి వృద్ధియగును.

## అమృతాది గుగ్గులుము.

శ్లో. బదరీపత్రకల్కేన పేయా కాంజికసాధితా, స్థౌల్యను త్స్యా దామలకరసం వా పి శిలాజతు. 12. అమృతాత్రుటి వేల్లవత్సకం కలింగపథ్యామలకాని గుగ్గులుః, క్రమవృద్ధ మిదం మధుప్లుతం పిడకాస్థౌల్యభగన్దరం జయేత్. 13.

రేగాకుకల్కముతో గంజిని పేయగా చేసి యిచ్చినను, నెల్లిరసముతో శిలాజిత్తు నిచ్చినను స్థౌల్యము హరించును. తిప్పతీగ సన్నఏలకులు మారేడుచెక్క కొడిశపాలపట్ట కొడిశపండు కరక్కాయలు ఉసిరిక తిప్పతీగ వీటిని క్రమవృద్ధిగా చూర్ణముచేసి తేనెతో సేవించిన పిడికలు స్థౌల్యములు భగందరములు నశించును.

## నవక గుగ్గులుము.

శ్లో. వ్యోషాగ్ని త్రిఫలా ముస్త విడంగై ర్గుగ్గులం సమమ్, ఖాదన్ సర్వా జయే ద్వ్యాధీ న్మేదః శ్లేష్మా మవాతజాన్. 14.

శొంఠి మిరియములు పిప్పళ్లు చిత్రమూలము త్రిఫలములు తుంగముస్తలు వాయువిడంగములు వీటితో సమముగా గుగ్గిలమును కలిపి తినిన మేదము శ్లేష్మము వాతము వీటివలనపుట్టిన యన్నిరోగములును నశించును.

## లోహరసాయనము.

శ్లో. గుగ్గులు స్తాలమూలీ చ త్రిఫలా ఖాదిరం వృషమ్, త్రివృతాలంబుషా స్నుక్చ నిర్గుండీ చిత్రకం తథా. 15. ఏషాం దశపలా భాగాంస్తోయే పంచాఢకే పచేత్, పాదశేషం తతః కృత్వా కషాయ మవతారయేత్. 16. పలద్వాదశకం దేయం తీక్ష్ణలోహం సుచూర్ణితమ్, పురాణసర్పిషః ప్రస్థం శర్కరాష్టపలోన్మితమ్. 17. పచేత్తామ్రమయే పాత్రే సుశీతేచావతారితే, ప్రస్థార్ధం మాక్షికం దేయం శిలాజతుపలద్వయం.18. ఏలాత్వక్చ పలార్ధంచ విడంగాని పలద్వయం, మరిచం చాంజనం కృష్ణా ద్విపలం త్రిఫలాన్వితమ్. 19. పలద్వయం తు కాసీసం సూక్ష్మచూర్ణీకృతం బుధైః, చూర్ణం దత్వా సుమథితం స్నిగ్ధే భాండే నిధాపయేత్.20. తత స్సంశుద్ధదేహ స్తు భక్షయే దక్షమాత్రకమ్, అనుపానం పిబేత్ క్షీరం జాంగలానాం రసం తథా. 21. వాతశ్లేష్మహరం శ్రేష్ఠం కుష్ఠమేహోదరాపహమ్. కామలాం పాండురోగం చ శ్వయథుం సభగంధరమ్. 22. మూర్ఛామోహవిషోన్మాదగరాణి వివిధాని చ, స్థూలానాం కర్షణం శ్రేష్ఠం మేదురే పరమౌషధమ్. 23. కర్షయే చ్చాతిమాత్రేణకుక్షిం పాతాలసన్నిభమ్, బల్యం రసాయనం మేధ్యం వాజీకరణముత్తమమ్. 24. శ్రీకరం పుత్రజననం వలీపలితనాశనం, నాశ్నీయాత్కదలీకందం కాంజికం కరమర్దకం, కరీరం కారవేల్లం చ షట్కారాణి వర్జయేత్. 25.

గుగ్గిలము నేలతాటిగడ్డ త్రిఫలములు చండ్ర అడ్డసరము తెల్లతెగడ అలంబుష జెముడు నీలిక చిత్రమూలము వీటిని 10 పలములను అయిదాఢకముల నీటిలోపక్వము చేసి నాల్గవపాలు నీరు మిగిలియుండగా దింపవలయును. మండూరమును 12 పలములను ప్రాతనేతిని ప్రస్థమును శర్కర ఎనిమిది పలములును వైచి రాగిపాత్రలోపక్వము చేసి చల్లార్చి దింపవలయును. తేనె 8ప॥ శిలాజిత్తు 2పల॥ ఏలకులు లవంగపుపట్ట అరతులము చొ. వాయువిడంగము 3 పలములు మునగ పిప్పళ్లు త్రిఫలములు ఇవి2పలములు కాసీసము 2 పల॥ వీటిని చూర్ణము చేసి దీనిని పైదానియందు వైచి మథించి దిన మొక తు!

చొప్పున భక్షింపవలయును. పాలు నీటిపట్టుమృగములమాంసము అనుపానము చేయ వలయును. వాతకఫముల నిది పోఁగొట్టును. కామెరలు పాండురోగములు వాపులు భగంధరము మూర్ఛ మోహము విషము పిచ్చి కృత్రిమవిషములు వీనిబోఁగొట్టును. స్థౌల్యము ను తగ్గించును. పాతాళతుల్యముగా కుక్షిని చేయును. ఇది బలకరము వాజీకరణమునగు రసాయనము. ముడుతలు తలనెరియుట మున్నగువానిఁ బోగొట్టును. సంతానప్రదమగును. అరటిఊచ గంజి ఓకకూర ఓకపండ్లు కరీరము కాకరకాయ కరమర్దకము అనునారింటిని తినరాదు.

## త్రిఫలాద్యతైలము.

శ్లో. త్రిఫలాతివిషా మూర్వా త్రివృచ్చిత్రక వాసకైః, నింబారగ్వధ షడ్గ్రంథా సప్తపర్ణ నిశాద్వయైః. 26. గుడూచీంద్రసురా కృష్ణా కుష్ఠసర్షపనాగరైః, తైలమేభి స్సమం పక్వం సురసాదిరసాప్లుతం. 27. పానాభ్యంజన గండూష నస్యవస్తిషు యోజితం, స్థూలతాలస్య కండ్వాదీన్ జయే త్కఫకృతా న్గదాన్. 28.

త్రిఫలములు అతివస చాగపలము తెల్లతెగడ చిత్రమూలము అడ్డసరము నింబము ఆమ్లవేతసము వస పాతాలపసపు మ్రానిపసపు తిప్పతీగె కొడిసెపాలవిత్తులు పిప్పళ్ళు కోష్ఠు ఆవాలు శొంఠి సీటికల్కము సురసాదిగణరసము వీటిలోఁ తైలమును పక్వము చేసి త్రాగవలయును. అభ్యంజనము గండూషము (పుక్కిలింత) వస్తికర్మము వీటియందు నుపయోగింపవలయును. స్థౌల్యము మాంద్యము గజ్జి మున్నగురోగములను జయించును.

## శిరీషాదిప్రలేపము.

శ్లో. శిరీషలామజ్జక హేమలోధ్రై స్త్వగ్దోషసంస్వేదహరః ప్రఘర్షః, పత్రాంజలాంబుభయచందనాని శరీరదౌర్గంధ్యహరః ప్రదేహః. 29. వాసాదలరసాలేపా చ్ఛంఖచూర్ణేన సంయుతః, బిల్వపత్రరసై ర్వాపి గాత్రదౌర్గంధ్యనాశనః. 30. హరీతకీలోధ్రమరిష్టపత్రంచూతత్వచో దాడిమవల్కలం చ, ఏషోంగరాగః కథితోఽంగనానాం జంఘాకషాయ శ్చ నరాధిపానాం. 31. దలజలలఘుమలయభవ విలేపనం హరతి దేహదౌర్గంధ్యం, విమలారనాళసహితం పీత మివాలంబుషాచూర్ణం, 32. గోమూత్రపిష్టం వినిహన్తి కుష్ఠం, పర్ణోజ్జ్వలం గోపయసా చ యుక్తం, కక్షాది దౌర్గంధ్యహరం పయోభిః శస్తం వశేకృద్ర

జనీద్వయేన. 33. చించాపత్రస్వరసమృదితం కక్షాదియోజితం జయతి, దగ్ధహరిద్రోద్వర్తన మచిరా ద్దేహస్య దౌర్గంధ్యం. 34. హస్తపాదశ్రుతౌ యోజ్యం గుగ్గులుం పంచతిక్తకం, అథవా పంచతిక్తాఖ్యం ఘృతం ఖాదే దతంద్రితః. 35.

దిరిసెన అవిరిగడ్డి కర్పూరము లొద్దుగ వీటితో సంఘర్షణచేసిన త్వగ్దోషములు హరించును. చెమటపోవును. యవలగంజి మండూరము తగరము చందనము వీటితో నైన పైపూత యొడలిచెడువాసనను బోఁగొట్టును. అడ్డసరపు ఆకులరసములో శంఖచూర్ణమును కలిపి పూసినఁగాని మారేడు ఆకులరసముతో పూసినను గాని శరీరమునదుర్గంధములు హరించును. కరక్కాయలు లొద్దుగ వేపఆకు మామిడిచెక్క దానిమ్మబెరడు వీటిని రాచిన స్త్రీయంగములు ప్రీతిఁగలిగించును. రాజసుఖమునొసగును. జాపత్రి కురువేరు తగరము వేప వీటిలేపము దుర్గంధము నణఁగించును. గోమూత్రముతో నూరినపసపు కుష్ఠును బోఁగొట్టును. కాంతినిచ్చును. చంకలు యున్నగువాని వాసనపోవును. వశీకరణముఁ గావించును. చింతాకురసముతో పసపుగాల్చి నూరిపూసికొన్నను కాల్చిపసపును నలుగుపెట్టుటచేతను శరీరపువాసన నశించును. పంచతిక్తములును గుగ్గిలము హస్తపాదశ్రోత్రములయందు లేపనఁ జేసికొనినను పంచతిక్తఘృతమును చక్కగా త్వరపడక త్రాగినను శరీరపు దుర్గంధములు తొలగును.

ఇట్లు చక్రదత్తయందు స్థౌల్యాధికార ప్రకరణము ముగిసెను.



# 36. ఉదరరోగాధికారము.

## ఉదరమునందు సామాన్యములగు నుపాయములు.

శ్లో. ఉదరే దోషసంపూర్ణే కుక్షౌ మందో యతో౽నలః, తస్మా ద్భోజ్యాని యోజ్యాని దీపనాని లఘూని చ. 1. రక్తశాలీ న్యవా న్ముద్గాం జాంగలాంశ్చ మృగద్విజాన్, పయోమూత్రాసవారిష్ట మధు సీధు తథా పిబేత్. 2. వాతోదరం బలవతః పూర్వంస్నేహై రుపాచరేత్, స్నిగ్ధాయ స్వేదితాంగాయ దద్యా త్స్నేహవిరేచనం. 3. హృతే దోషే పరిమ్లానం వేష్టయే ద్వాససోదరం, తథా స్య నవకాశత్వా ద్వాయునా ధ్మాపయే త్పునః 4. దోషాతిమాత్రోపచారా త్స్రో

తోమార్గనిరోధనాత్, సంభవత్యుదరం తస్మా న్నిత్య మేనం విరేచయే
త్. 5. విరిక్తే చ యథా దోషహరైః పేయూ శ్రుతా హితా, వా
తోదరీ పిబే త్తక్రం పిప్పలీలవణాన్వితం. 6. శర్కరామరిచోపేతం
స్వాదు పిత్తోదరీ పిబేత్, యమానీసైంధవాజాజీ వ్యోషయుక్తం కఫో
దరీ. 7.

దోషపూర్ణమగు నుదరరోగమునందు కుక్షియందు మందాగ్ని యుండుటచేత నాహారపదార్థములను దీపనములను లఘువులనుగా నీయవలయును. ఎఱ్ఱని వరిబియ్యము యవలు పెసలు నీటిపట్టుజంతువులయు పక్షులయు మాంసము పాలు గోమూత్రము మద్యము మధువు మున్నగునవి పథ్యపదార్థములు. వాతోదరముగలవానికి ముందుగా స్నేహవిధులతో చికిత్సఁ జేయువలయును. చెమటపట్టించిన పిమ్మట విరేచనములను ఇప్పింపవలయును. దోషము హరించిన పిమ్మట గుడ్డతో గట్టిగ చుట్టవలయును. అవకాశము లేకపోవునట్లుగాని నింపవలయును. దోషముల నుపశమించుటచేతను స్రోతోమార్గముల నరికట్టుటచేతను ఉదరరోగములుపుట్టును. కావున ఎప్పుడైనను సరియే. విరేచనమునకిప్పింపవలయును. పిమ్మట దోషహరములగు పదార్థములతో పేయముచేసి యీయవలయును. వాతోదరరోగి పిప్పళ్లు ఉప్పు వేసికొని మజ్జిగను త్రాగవలయును. చక్కెర మిరియములు కలసిన దానిని పిత్తోదరరోగియును అంటుప్పు సైంధవలవణముతో కూడిన తక్రము కఫోదరరోగియు త్రాగవలయును.

## తక్రయుక్తమద్యాదులు.

శ్లో. పిబే న్మధుయుతం తక్రం వ్యక్తామ్లం నాతిపేలవం, మధు
తైలవచాశుంఠీ శతాహ్వాకుష్ఠసైంధవైః 8. యుక్తం ప్లీహోదరీ జాతం
సవ్యోషం తు దకోదరీ, బద్ధోదరీ తు హపుషా దీప్యకాజాజిసైంధవైః.
9. పిబే చ్ఛిద్రోదరీ తక్రం పిప్పలీక్షౌద్రసంయుతం, త్ర్యూషణక్షారలవణై
ర్యుక్తం తు నిచయోదరీ. 10. గౌరవారోచకార్తానాం సమం దాగ్న్య
తిసారిణాం, తక్రం వాతకఫార్తానా మమృతత్వాయ కల్ప్యతే. 11.
వాతోదరే పయోఽభ్యాసో నిరూహో దశమూలకః, సోదావర్తే
వాతఘ్నామ్లశృతైరండానువాసనః. 12.

తేనెతో కలిపి మజ్జిగను పుల్లనివిగను పలచనివిగను కాకుండునట్లు త్రాగవలయును. తేనె తైలము వస శొంఠి శతావరి కోష్ఠు సైంధవలవణము వీటిని చేర్చి మజ్జిగను త్రాగిన ప్లీహోదరరోగము నశించును. త్రికటుకములతో మజ్జిగను కఫోదరరోగియును

బద్ధోదరరోగి హాపుషము ఓమును జీలకఱ్ఱ సైంధవలవణములతోను పిప్పళ్లు తేనెతో త క్రమును ఛిద్రోదరరోగియును త్రికటుకములు క్షారములు లవణములతో నిచయోదరి యును త్రాగవలయును. ఒడలుబఱువు అరోచకము మందాగ్ని అతిసారము వాతము కఫ ము వీటితో బాధపడెడివారికి తక్రము అమృతమువంటిది. వాతోదరమునందు పాలను త్రాగుటయును నిర్వస్తిః జేయుటయు హితములు. ఉదావర్తసహితములగు వాతోద రరోగమునందు వాతనాశకములగు నామ్లఔషధములను ఆముదము మున్నగు వానితో వస్తులను యిచ్చుట మంచిది.

## సాముద్రాది చూర్ణము.

శ్లో. సాముద్రసౌవర్చలసైంధవాని, క్షారం యవానా మజమో దకం చ, సపిప్పలీచిత్రక శృంగబేరం, హింగూవిడం చేతి సమాని కు ర్యాత్. 13. ఏతాని చూర్ణాని ఘృతప్లుతాని భుంజీత పూర్వం కవలం ప్రశస్తం, వాతోదరం గుల్మ మజీర్ణ భుక్తం వాయుప్రకోపం గ్రహణీం చ దుష్టాం. 14. అర్శాంసి దుష్టాని చ పాండురోగం భగందరం చేతి నిహన్తి సద్యః. 15.

సముద్రము ఉప్పు సౌవర్చలవణము సైంధవలవణము యవక్షారము ఓమము పిప్పళ్లు చిత్రమూలము అల్లము ఇంగువ ఆంటుప్పు ఇవి సమానభాగములుగా తీసికొనవ లయును. చూర్ణము చేసి (వీటిని) ఆచూర్ణమును అన్నములో తొలికబళమున నేతితో తినుట మంచిది. వాతోదరము గుల్మము అజీర్ణము వాతప్రకోపము గ్రహణి మూల రోగ ము పాండురోగము భగంధరము వీటిని యీచూర్ణము నశింపఁజేయును.

## పిత్తోదరాదులకు విరేచనాదులు.

శ్లో. పిత్తోదరే తు బలినం పూర్వ మేవ విరేచయేత్, అనువా స్య బలం క్షీరవస్తిశుద్ధంవిరేచయేత్. 16. పయసా సత్రివృత్కల్కే నోరుబూకశృతేన వా, శాతలాత్రాయమాణాభ్యాం శృతేనారగ్వధేన వా. 17. కఫో దుదరిణం శుద్ధం కటుక్షారాన్నభోజితం, మూత్రారిష్టా యస్కృతిభి ర్యోజయే చ్ఛ కఫాపహైః. 18. సన్నిపాతోదరే సర్వాం యథోక్తాం కారయే త్క్రియాం,ప్లీ హోదరే ప్లీహహరం కర్మోదరహ రం తథా. 19. స్విన్నాయ బద్ధోదరిణే మూత్రం తీక్ష్ణౌషధాన్వితం, స తైలం లవణం దద్యా న్నిరూహం సానువాసనం. 20. పరిస్రంసీని చా న్నాని తీక్ష్ణం చైవ విరేచనం, ఛిద్రోదరమృతే స్వేదో శ్లేష్మోదరవదాచ

రేత్. 21. జాతంజాతం జలం స్రావ్యం శాస్త్రోక్తం శస్త్రకర్మ చ, జలోదరే విశేషేణ ద్రవసేవాం వివర్జయేత్. 22. దేవదారు పలాశార్క హస్తిపిప్పలిశిగ్రుకైః, సాశ్వగంధైః సగోమూత్రైః ప్రదిహ్యా దుదరం శనైః. 23. మూత్రాణ్యష్టావదుదరిణాం సేకే పానే చ యోజయేత్, స్నుహీపయోభావితానాం పిప్పలీనాం పయోఽశనః. 24. సహస్రం చ ప్రయుంజీత శక్తితో జఠరామయీ, శిలాజతూనాం మూత్రాణాం గుగ్గులోస్త్రైఫలస్య చ. 25. స్నుహీక్షీరప్రయోగశ్చ శమయ త్యుదరామయమ్, స్నుక్పయసా పరిభావిత తండులచూర్ణైర్వినిర్మితః పూపః. 26. ఉదర ముదారం హంస్యా ద్యోగోఽయం సప్తరాత్రేణ, పిప్పలీవర్ధమానం వా కల్పదృష్టం ప్రయోజయేత్. 27. జఠరాణాం వినాశాయ నాస్తి శేష సమం భువి.

పిత్తోదరమునందు బలవంతునికి తొలుత విరేచనములఁ జేయింపవలయును. దుర్బలుఁడగునేని క్షీరవస్తులచే శుద్ధముచేసి విరేచనముగ నిప్పించవలయును. తెల్లతెగడ కల్కముతో పాలనుగాని ఆముదపుకల్కముతో సిద్ధముచేసిన పాలనుగాని పుల్లప్రబ్బలితోనైన పాలతోగాని ప్రవర్తిక్రియవలయును. కఫముచేతనగు నుదరరోగికి తీక్ష్ణమును క్షారమునగు నాహారమును, కఫనాశకములగు గోమూత్రము అరిష్టము మందూరము వీటితో బెట్టింపవలయును. సన్నిపాతోదరములకు నిదే చికిత్సఁ జేయనలయును. ప్లీహోదరములకు ప్లీహనాశకములును ఉదరనాశకములు నగు పదార్థములను సేవింపవలయును. స్వేదితునిఁ జేయించిన బద్ధోదరరోగమునను తీక్ష్ణౌషధయుతమగు గోమూత్రము నీయవలయును. పరిస్రంసరోగి అన్నమును విరేచనమును కఫోదరరోగివలె నాచరింపవలయును. వెంటవెంటనే జలమును వెడలించుటయును, శాస్త్రప్రకారము శస్త్రకర్మములఁ జేయించుటయును మంచిది. జలోదరమునందు విశేషముగా జలపదార్థములను తినరాదు. దేవదారువు మోదుగు జిల్లేడు ఏనుగుపిప్పలి మునగ పెన్నేరు గోమూత్రము వీటితో నుదరమును లేపనచేయవలయును. వేయిపిప్పళ్లను జెముడుపాలలో నానవైచి వానిని శక్త్యనుసారముగా నుదరరోగి తినవలయును. జెముడుపాలలో బియ్యమును నానవైచి పొడిచేసి కట్టిన ఏడురాత్రులలో నుదరరోగము పోగొట్టును. లేనిచో శాస్త్రసిద్ధముగా వర్ధమానపిప్పలి నుపయోగించినను ఉదరరోగములు నశించుటకు సాటికిలేని యౌషధము అగును.

### పటోలాది చూర్ణము.

శ్లో. పటోలమూలం రజనీ విడంగం త్రిఫలాత్వచం, 28. కంపిల్లకం నీలినీం చ త్రివృతాం చేతి చూర్ణయేత్, షడాద్యా న్కార్షికా న్స్యాం స్త్రీంశ్చ ద్విత్రిచతుర్గుణాన్. 29. కృత్వా చూర్ణం తతో ముష్టిం గవాం మూత్రేణ వా పిబేత్, విరిక్తో జాంగలరసై ర్భుంజీత మృదు మోదనం. 30. మండం పేయాం చ పీత్వా చ సవ్యోషం షడహం పయః, శృతం పిబేత్తు తచ్చూర్ణం పిబే దేవం పునఃపునః. 31. హన్తి సర్వోదరా ణ్యేత చ్చూర్ణం జాతోదకా న్యపి, కామలాం పాండురోగం చ శ్వయథుం చాపకర్షతి. 32.

చేదుపొట్ల పసపు వాయువిడంగములు కరక్కాయలు తాడి ఉసిరిక కంపిల్లము నీలిని తెల్లతెగడ వీటిని చూర్ణము చేయవలయును. మొదటిఆరింటి నొక్కొక్కతులము చొ॥కంపిల్లమును రెండుతు॥ నీలిని 3తు॥ తెల్లతెగడపలమును చూర్ణముచేసిఒకపలముపాడిని గోమూత్రముతో త్రాగవలయును. విరేచనములు గలిగినచో అడవిజంతువుల మాంసముతో మెత్తనియన్నమును తినవలయును. త్రికటుకములను మండమును పేయను చేసికొని ఆరుపూటలు త్రాగిన సమస్తోదరరోగములును నశించును. కాచినపాలతో దీనిని మాటమాటికి త్రాగవలయును. ఇయ్యది ఉదరరోగములను కామెలలను పాండురోగములను వాపును నశింపజేయును.

### నారాయణ చూర్ణము.

శ్లో. యమానీ హపుషా ధాన్యం త్రిఫలా సోపకుంచికా, కారవీ పిప్పలీమూల మజగంధా శఠీ వచా. 33. శతాహ్వా జీరకం వ్యోషం స్వర్ణక్షీరీసచిత్రకమ్, ద్వ్యక్షారౌ పౌష్కరంమూలం కుష్ఠం లవణపంచకం. 34. విడంగం చ సమాంశాని దన్త్యా భాగత్రయం తథా, త్రివృద్విశాలే ద్విగుణే శాతలా స్యా చ్చతుర్గుణా. 35. ఏష నారాయణో నామచూర్ణో రోగగణాపహః, నైనం ప్రాప్య భివర్ధన్తే రోగా విష్ణుమివాసురాః. 36. తక్రేణోదరిభిః పేయో గుల్మిభి ర్బదరాంబునా, ఆనద్ధవాతే సురయా వాతరోగే ప్రసన్నయా. 37. దధిమండేన విట్సంగే దాడిమాంబుభి రర్శసి, పరికర్తేచ వృక్షామ్లై రుష్ణాంబుభి రజీర్ణకే. 38. భగందరే పాండురోగే కాసే శ్వాసే గలగ్రహే, హృద్రోగే గ్రహణీ దోషే కోష్ఠే మందానలే జ్వరే. 39. దంష్ట్రావిషే

మూలవిషే సగరే కృత్రిమే విషే, యథార్హం స్నిగ్ధకోష్ఠేన పేయ మేత ద్విరేచనం. 40.

వాయము బోడతరము ధనియములు త్రిఫలములు నల్లజీలకఱ్ఱ అడవిజీలకఱ్ఱ కలంజి అజమోదము మోడి తులసి కచూరము వస పిల్లిపీచర జీలకఱ్ఱ శొంఠిమిరియములు పిప్పళ్లు చుక్కఆకు చిత్రమూలము యవక్షారము సజ్జక్షారము పుష్కరమూలము కోష్ఠు పంచలవణములు వాయువిడంగములు వీటిని సమానభాగములను దంతి మూడుభాగములను తెల్లతెగడ విశాల రెండురెట్లును సప్తల నాలుగుభాగములను చేర్చి చూర్ణముచేసిన నారాయణచూర్ణ మనఁబడును. ఇయ్యది రోగసమూహములను పోగొట్టును అసురులు విష్ణువు నొంది వృద్ధి నొందలేనట్లు దీనినొందిన రోగములు వర్ధిలంజాలవు. ఉదరరోగులు మజ్జిగతోను గుల్మరోగులు రేగునీటితోను వాతరోగమునందు కల్లుతోను విట్సంగమునందు దధిమండముతోను మూలరోగములందు దానిమ్మపండ్లరసముతోను పరికర్తమునందు చింతపండుతోను అజీర్ణమునందు ఉష్ణోదకములతోను భగందరము పాండురోగము కాసము శ్వాసము గలగ్రహము హృద్రోగము గ్రహణి కుష్ఠు మందానిలము జ్వరము దంష్ట్రావిషముల విషము కృత్రిమవిషము వీటియందును ఈచూర్ణమును సేవింప వలయును.

## దంత్యాదికల్కము.

శ్లో. దన్తీ వచా గవాక్షీ చ శంఖినీ తిల్లకం త్రివృత్, గోమూత్రేణ పిబే త్కల్కం జఠరామయనాశనం. 41. సక్షీరం మాహిషం మూత్రం నిరాహారః పిబే న్నరః, శామ్య త్యనేన జఠరం సప్తాహా దితి నిశ్చయః. 42. గవాక్షీ శంఖినీ దంతీ నీలినీ కల్కసంయుతం, సర్వోదర వినాశాయ గోమూత్రం పాతు మాచరేత్. 43. అర్కపత్రం సలవణ మన్తర్ధూమం దహే త్తతః, మస్తునా తత్పిబేత్ క్షారం గుల్మప్లీహోదరాపహం. 44. పీతః ప్లీహోదరం హన్యా త్పిప్పలీమరిచాన్వితః, అమ్లవేతససంయుక్తః శిగ్రుక్వాథః ససైన్ధవః. 45. గృహీత్వా యస్య సంజ్ఞా ముత్పాటయిత్వేన్ద్రవారుణీమూలం, ప్రక్షిప్యతే సుమూశే శామ్యతే ప్లీహోదరం తస్య. 46 రోహీతకాభయాక్షోద భావితం మూత్ర మంబు వా, పీతం సర్వోదరప్లీహ మేహార్శః క్రిమిగుల్మనుత్.

దంతి వస కోడిసెపాలవిత్తులు శంఖిని లొద్దుగ తెల్లతెగడ వీటికల్కమును గోమూత్రముతో త్రాగిన ఉదరరోగములు నశించును. కేవలమూత్రము పాలుకలిపి నిరాహారియై ఏడుదినములు త్రాగిన నుదరరోగము నశించును. గవాక్షి శంఖిని దంతి నీలిని వీటికల్కముతో గోమూత్రమును సర్వోదరరోగశాంతికై త్రాగవలయును. జిల్లేడాకునకు ఉప్పురాచి పొగలేకుండ మండించి దధిమండముతో పాలలో కలిపి త్రాగిన గుల్మములు ప్లీహోదరములు నశించును. మునగ కషాయమును సైంధవలవణము పిప్పళ్లు మిరియములు ఆమ్లవేతము వీటితో చేర్చి త్రాగిన ప్లీహోదరములు నశించును. గోహింశకము కరక్కాయలపొడితో భావనచేసిన మూత్రము నుదకమును త్రాగిన ఉదరములు ప్లీహ మేహము మూలరోగము జంతువాతము గుల్మము మున్నగునవి నశించిపోవును.

### దేవదారు కషాయము

శ్లో. దేవద్రుమం శిగ్రుమయూరకం చ గోమూత్రపిష్టా నథవా శ్వగంధాన్, పీత్వా శు హన్యా దుదరం ప్రవృద్ధం కృమీ న్సశోథా ను దరం చ దూష్యం. 48. దశమూలదారునాగర చ్ఛిన్నమహాపునర్నవాభయాంక్వాథః, జయతి జలోదర శోథ శ్లీపదగలగండ వాతరోగాం శ్చ. 49. హరీతకీనాగర దేవదారు పునర్నవాఛిన్నరుహాకషాయః, సగుగ్గులుర్మూత్రయుత శ్చ పేయః శోథోదరాణాంప్రవరః ప్రయోగః. 50. ఏరండతైలం దశమూల మిశ్రం గోమూత్రయుక్తం స్త్రీఫలారసో వా, నిహన్తి వాతోదరశోథశూలం క్వాథః సమూత్రో దశమూలజ శ్చ. 51.

దేవదారు మునగ మయూరకము గాని గోమూత్రముతో నూరిన పెన్నేరుగాని ఉదరరోగములం పోగొట్టును. దశమూలములు ప్రానిపసపు శొంఠి ఛిన్నరుహ పునర్నవ కరక్కాయ వీటికషాయము జలోదరము వాపు శ్లీపదము గలగండము వాతరోగము వీనినిపోగొట్టును. కరక్కాయలు శొంఠి దేవదారు పునర్నవా ఛిన్నరుహ వీటికషాయమును గుగ్గిలము మూత్రముతో నూరి త్రాగిన వాపు ఉదరములు శాంతించును. ఆముదమును దశమూలములతో కలిపి గాని త్రిఫలముల రసమును గోమూత్రముతో గాని త్రాగిన వాతోదరము శోఫ శూలము నష్టమగును.

### పునర్నవాష్టకము.

శ్లో. పునర్నవా నింబపటోల శుంఠీ తిక్తాభయా దార్వ్యమృతా కషాయః. సర్వాంగశోథోదర కాసశూల శ్వాసాన్వితం పాండుగదం

నిహన్తి. 51. పునర్నవాం దార్వభయాం గుడూచీం పిబేత్సమూత్రాం మహిషాక్షయుక్తాం, త్వగ్దోషశోథోదరపాండురోగ స్థౌల్యప్రసేకోర్ధ్వకఫామయేషు. 52. గోమూత్రయుక్తం మహిషీపయో వా క్షీరం గవాం వా త్రిఫలావిమిశ్రమ్, క్షీరాన్నభుక్కేవలమేవ గవ్యం మూత్రం పిబేద్వా శ్వయథూదరేషు. 53. పునర్నవాదార్వమృతా పాఠా బిల్వం శ్వదంష్ట్రికా, బృహత్యౌ ద్వే రజన్యౌ ద్వే పిప్పల్యశ్చిత్రకం వృషమ్. 54. సమభాగాని సంచూర్ణ్య గవాం మూత్రేణ వా పిబేత్, బహుప్రకారం శ్వయథుం సర్వగాత్రవిసారిణమ్. 55. హన్తి శూలోదరాణ్యష్టౌ వ్రణాం శ్చైవోద్ధతానపి, పురాణం మాణకం పిష్ట్వా ద్విగుణీకృతతండులమ్. 56. సాధితం క్షీరతోయాభ్యామభ్యసేత్పాయసం తతః, హన్తి వాతోదరం శోథం గ్రహణీం పాండుతామపి. 57. సిద్ధో భిషగ్భిరాఖ్యాతః ప్రయోగోయం నిరత్యయః, దశమూలతులార్ధరసే సక్షారైః పంచకోలైః పలికైః, సిద్ధం ఘృతార్ధపాత్రం ద్వ్యమస్తుక ముదరగుల్మఘ్నం. 58.

పునర్నవ నింబయు చేదుపొట్ల శొంఠి పిప్పళ్లు కరక్కాయ మ్రానిపసపు తిప్పతీగె వీటికి షాయమును త్రాగినచో సర్వాంగశోథను ఉదరము కాసము శూల శ్వాస పాండురోగములు నశించును. గలిజేరు మ్రానిపసపు లేక తిప్పతీగె మహిషాక్షి వీటిని గోమూత్రముతో త్రాగినచో త్వగ్దోషములు వాపు ఉదరరోగములు పాండువు దొండబారుట కఫరోగము ఇవి యన్నియును తొలగును. గోమూత్రముతో ఎనుముపాలుగాని త్రిఫలములతో ఆవుపాలుగాని కేవలగోమూత్రముతో పాలను చేర్చిన అన్నమునుగాని సేవించిన వాపులు ఉదరరోగములు నశించును. గలిజేరు మ్రానిపసపు కరక్కాయ అగరుశొంఠి బిల్వఫలము శ్వదంష్ట్రి రెండువిధములగు వాకుళ్లు పసపు మ్రానిపసపు, పిప్పళ్లు చిత్రమూలము వృషము వీటిని సమానభాగములను పొడిచేసి గోమూత్రముతో త్రాగిన సమస్తాంగములయందు వ్యాపించిన వాపులు శూలలు అష్టవిధోదరములు హెచ్చుపెరిగిన వ్రణములు నశించును. ప్రాతదియగు మాణకమును పొడిచేసి రెండురెట్లు బియ్యముతో చేర్చి పాలతో నీటితో పాయసముగా చేసి త్రాగిన వాతోదరము వాపు గ్రహణి పాండురోగములను పోగొట్టును. ఇయ్యది సిద్ధప్రయోగమని వైద్యులచేత చెప్పబడినది. దశమూలముల రసము అరతులమంతలో పంచకోలములు ఒకపలము సమానభాగము చేయువైచి మజ్జిగ తేటతో త్రాగిన గుల్మరోగములు నశించును

## చిత్రక ఘృతము.

శ్లో. చతుర్గుణే జలే మూత్రే ద్విగుణే చిత్రకాత్పలే, కల్కే సిద్ధం ఘృతప్రస్థం సక్షారం జఠరీ పిబేత్. 59.

నాలుగురెట్లనీళ్లలో రెండురెట్లమూత్రములో ఒకపలము చిత్రమూలము కల్కమునందు 16 పలముల నేతిని సిద్ధముచేసి యవక్షారమును చేర్చికొని ఉదరరోగి త్రాగవలయును.

## బిందు ఘృతము.

శ్లో. అర్కక్షీరపలే ద్వేచ స్నుహీక్షీరపలాని షట్, పథ్యాకం పిల్లకం శ్యామా సంపాకం గిరికర్ణికా. 60. నీలినీ త్రివృతా దన్తీ శంఖినీ చిత్రకం తథా, ఏతేషాం పలికై ర్భాగైః ఘృతప్రస్థం విపాచయేత్. 61. అథాస్య మలినే కోష్ఠే బిందుమాత్రం ప్రదాపయేత్, యావతో స్య పిబే ద్బిందూం స్తావ ద్వారా న్విరిచ్యతే. 62. కుష్ఠం గుల్మ ముదావర్తం శ్వయథుం సభగందరం, శమయ త్యుదరా ణ్యష్టౌ వృక్ష మింద్రాశని ర్యథా. 63 ఏత ద్బిందుఘృతం నామ యేనాభ్యక్తో విరిచ్యతే,

జిల్లేడుపాలు 2 పలములు జెముడుపాలు 8 పలములు కరక్కాయలు కంపిల్లకము నల్లతెగడ ఆమ్లవేతము విష్ణుక్రాంత నీలి తెల్లతెగడ దంతి శంఖిని చిత్రమూలము వీటిని ఒక్కొక్కపలము చొ॥ 16 పలముల నేతిలో వైచి పక్వముచేసి మలినకోష్ఠమునందొక బొట్టును విడువవలయును. ఎన్నిబిందువులను వేసిన నన్నిమాఱులు విరేచనమగును. కుష్ఠు గుల్మము ఉదావర్తము వాపు భగందరము అష్టవిధోదరములు నశించును. వజ్రము చెట్లను వలె నశింపజేయును. దీనిని రుద్దికొనిన విరేచనములు గలుగ జేయును.

## నారాచఘృతము.

శ్లో. దధిమండాఢకే సిద్ధా త్స్నుహీక్షీరపలకల్కితాత్. 64. ఘృతప్రస్థా త్పిబే న్మాత్రాం తద్వ జ్జఠరశాన్తయే, తథా సిద్ధం ఘృతప్రస్థం పయ స్యష్టగుణే పిబేత్. 65. స్నుక్షీరపలకల్కేన త్రివృతా షట్పలేనచ, స్నుక్షీరదంతీ త్రిఫలా విడంగ, సింహీత్రివృచ్చిత్రకకల్కయుక్తం, ఘృతం విపక్వం కుడపప్రమాణం, తోయేన తస్యాక్షమ ధార్ధకర్షం. 66. పీతోష్ణమంభోను పిబే ద్విరిక్తే పేయాం సుఖోష్ణాం

వితరేద్వ్యాధిజ్ఞః, నారాచ మేత జ్జఠరామయానాం యుక్త్యోపయుక్తం శమనం ప్రదిష్టమ్. 68.

దధిమండము ఒకఆఢకము జెముడుపాలు ఒకపలము వీటిలో సిద్ధముచేసిన 16 పలముల నేయి త్రాగిన నుదరములు నశించును. అట్లులే సిద్ధము చేయఁబడిన నేతిని ఎన్నిదిరెట్లపాలలో కలిపి త్రాగవలయును. జెముడుపాలు 1 పలము తెగడ 8 ప॥ జెముడు అమ్లవేతము త్రిఫలములు వాయువిడంగములు వాకుడు తెల్లతెగడ చిత్రమూలము వీటిని 4 పలముల కల్కములో సిద్ధముచేసిన నేతిని మంచినీటితో ఒక తుల॥ త్రాగవలయును. వేడినీటిని త్రాగరాదు. దప్పియైన వేడిపేయను త్రాగవలయును. ఇత్యాది నారాచరసము. ఇది ఉదరరోగములు పోగొట్టును.

ఇట్లు చక్రదత్తయందు ఉదరరోగాధికారప్రకరణము ముగిసెను.

---

# 32. ప్లీహరోగాధికారము.

ప్లీహకు సామాన్యోపాయములు.

శ్లో. యమానికా చిత్రక యావశూక షడ్గ్రంథి దన్తీ మగధోద్భవానామ్, ప్లీహాన మేతద్వినిహన్తి చూర్ణముష్ణాంబునా మస్తు సురా సవైర్వా. 1. పిప్పలీం కింశుకక్షార భావితాం సంప్రయోజయేత్, గుల్మ ప్లీహాపహం వహ్నిదీపనం చ రసాయనం. 2. విడంగాగ్నిసింధూత్థ సక్తూం దగ్ధ్వా వచాన్వితాన్. పిబేత్క్షీరేణ సంచూర్ణ్య గుల్మప్లీహోదరాపహం. 3. తాలపుష్పభవః క్షారః సగుడః ప్లీహనాశనః, క్షారం వా విడకృష్ణాభ్యాం పూతీకస్యామ్లనిఃస్రుతం. 4. ప్లీహా యకృత్ప్రశాన్త్యర్థం పిబేత్ప్రాతర్యథాబలం, పాతవ్యో యుక్తితః క్షారః క్షీరేణో దధిశుక్తిజః. 5. పయసా వా ప్రయోక్తవ్యాః పిప్పల్యః ప్లీహశాన్తయే, భల్లాతకాభయా జాజీ గుడేన సహ మోదకః.6.సప్తరాత్రాన్నిహన్త్యాశు ప్లీహాన మతిదారుణం, శోభాంజనకనిర్యూహం సైంధవాగ్నికణాన్వితం. 6. పలాశక్షారయుక్తం వా యవక్షారం ప్రయోజయేత్.

వాయము చిత్రమూలము యవక్షారము వస దంతి పిప్పళ్లు వీటిచూర్ణము వేడినీళ్లు మజ్జిగ లేటకల్లు ఆసవము అనువీటిలో దేనితో నైనను త్రాగినప్లీహరోగములు నశించును.

మోదుగ క్షారములో భావనచేసిన పిప్పళ్ళ నైన నుపయోగింపవచ్చును. వాయువిడంగములు నెయ్యి చిత్రమూలము సైంధవలవణము వస వీటిని చూర్ణముచేసి వేయించి పాలతో త్రాగిన గుల్మము ప్లీహమున్నగునవి నశించును. బెల్లముతో తాటిమోవు క్షారమును (అనగా తాటి బెల్లమును) తినిన ప్లీహ పోవును. అంటుప్ప పిప్పళ్లు నెమలిఅడ్డు వీటిని బలానుసారముగా ప్రాతఃకాలమునందు ప్లీహయకృద్రోగముగలవారు భక్షింపవలయును. సముద్రపు ముత్తియము వలనఁబుట్టిన క్షారమును యుక్తిపూర్వకముగా సేవింపవలయును. పిప్పళ్ళు పాలతో నైనను సేవింపవలెను. జీడివిత్తనములు కరక్కాయలు జీలకఱ్ఱ వీటిని బెల్లముతో మాత్రలను కట్టికొని తినినచో నేడురాత్రులలో నసాధ్యమైన ప్లీహరోగములైనను నశించును. మునఁగ కాయ కషాయములో సైంధవలవణము చిత్రమూలము పిప్పళ్లను వేసికొని యవక్షారముతో గాని మోదుగక్షారమును సేవించిన ప్లీహాలు నశించును.

### ఇతరములగు నుపాయములు.

శ్లో. తిలాన్స్సలవణాం స్చైవ ఘృతం షట్పలకం తథా. 9. ప్లీహాద్దిష్టాం క్రియాం సర్వాం యకృతః సంప్రయోజయేత్, లశునం పిప్పలీమూల మభయాం చైవ భక్షయేత్. 10. పిబేద్గోమూత్రగండూషం ప్లీహరోగ విముక్తయే, ప్లీహజిచ్ఛరపుంఖాయాః కల్క స్తక్రేణ సేవితః, శరపుంఖైవ సంచర్వ్య జగ్ధ్వా పేయాభయాథవా, శగ్రిస్తా నిర్యూహః ససైంధవ స్తింత్రిడీకసంమిశ్రః. 12. ప్లీహావ్యుపరమయోగ్యః పక్వామ్రరసోఽథవా సమధుః, దధ్నా భుక్తవతో వామబాహుమధ్యే శిరాంభిషక్. 13. విధ్యేత్ప్లీహవినాశాయ యకృన్నాశాయ దక్షిణే, ప్లీహానం మర్దయే ద్గాఢం దుష్టరక్తప్రవృత్తయే. 14.

ఉప్పుతో తిలలను షట్పలఘృతమును గాని ప్లీహరోగమునం దియ్యవలయును. ఉల్లిగడ్డ పిప్పలిమూలము కరక్కాయలు వీటిని తినవలయును. గోమూత్రపుపుక్కిళ్లను పుక్కిలింపవలయును. శరపుంఖకల్కమును మజ్జిగతో సేవించిన ప్లీహరోగములు నశించును. శరపుంఖనే చర్వణచేసి తిని త్రాగవలయును. బోడతరము కషాయములో సైంధవలవణము చింతపండుపులుసు చేర్చి త్రాగినను పక్వముచేసి ఆమ్రరసమునందు తేనెను వైచికొనియైనను త్రాగిన ప్లీహరోగములు నశించును. ప్లీహరోగములు నశించునిమిత్తమున యకృద్రోగము నశించుటకయ్యును దక్షిణబాహుమధ్యమునందు శిరను ఛేదింప

వలయును. దుష్టరక్తప్రవృత్తికొఱకై అనగా దుష్టరక్తము నశించి మంచిరక్తము ప్రవహించుటకు ప్లీహను గాఢముగా మర్దింపవలయును.

## మాణాద్యగుటికా.

శ్లో. మాణమార్గా మృతా వాసా స్థిరా చిత్రకసైంధవమ్, నాగరం తాళగండం చ ప్రత్యగం తు త్రికార్షికమ్. 15. బిడసౌవర్చలక్షార పిప్పల్యశ్చాపి కార్షికాః, ఏతచ్చూర్ణీకృతం సర్వం గోమూత్రస్యాఢకే పచేత్. 16. సాంద్రీభూతే గుడీం కుర్యాద్దత్వా త్రిఫలమాక్షికమ్, యకృత్ప్లీహోదరహరో గుల్మార్శో గ్రహణీహరః. 17. యోగః పరకరో నావహ్నా చాగ్నిసందీపనః పరః.

ప్రమాణితమగు కస్తూరి తిప్పతీగె కొంత అడ్డసరము శాలపర్ణి చిత్రమూలము సైంధవలవణము శొంఠి తాళగండము వీటిని ముక్కాలు ముక్కాలుపల॥ చొ॥ తీసికొని అంటుప్పు సౌవర్చలవణము పిప్పళ్లు వీటినిపలము చొ॥ తీసికొని చూర్ణము చేసి 64పలముల గోమూత్రములో పక్వముచేసి గట్టిపడినపిమ్మట 3 పలముల తేనెనుకలిపి మాత్రలను కట్టవలయును. వీనిని సేవించిన యకృద్రోగము ప్లీహోదరరోగములు మూలరోగము మున్నగునవి యన్నియు నశించును.

## రోహితాది చూర్ణము.

శ్లో. రోహితకాభయాక్షోదభావితం మూత్రమంబు వా. 18. పీతం సర్వోదరప్లీహమేహార్శః క్రిమిగుల్మనుత్, పిప్పలీ నాగరం దన్తీ సమాంశం ద్విగుణాభయమ్. 19. చూర్ణం పీతం బిడార్ధాంశం ప్లీహఘ్నం హ్యుష్ణవారిణా, క్రమవృద్ధ్యా దశాహాని దశాపిప్పలికం దినమ్. 20. వర్ధయేత్పయసా సార్ధం తథైవాపనయేత్పునః, జీర్ణే జీర్ణే చ భుంజీత షాష్టికం క్షీరసర్పిషా. 21.

రోహితకత్వణము కరక్కాయలు వీటిచూర్ణమును ఆవుమూత్రములోకలిపిగాని మంచినీటితోగాని త్రాగిన ఉదరరోగమున్నగునవన్నియు నశించును పిప్పళ్లు శొంఠి దంతెన వీటిని సమానభాగములనుగాగైకొని కరక్కాయ రెండుపాళ్లు చేర్చి పొడిచేసి ఆచూర్ణమునందు సగభాగము అంటుప్పును కలిపి వేడినీళ్లతో త్రాగినచో ప్లీహరోగములు నశించును. క్రమక్రమముగా పదేసి పిప్పళ్ళను వృద్ధిచేయుచు పాలతో దీనిని త్రాగి జీర్ణించినపిదప షష్ఠిధాన్యపు గంజిని నేతితో చేర్చి త్రాగవలయును.

## పిప్పలీవర్ధమానములు.

శ్లో. పిప్పలీనాం ప్రయోగోఽయం సహస్రస్య రసాయనః, దశ పిప్పలికః శ్రేష్ఠో మధ్యమః షట్ప్రకీర్తితః. 22. యస్త్రి పిప్పలి పర్యన్తః ప్రయోగః సోఽపరః స్మృతః, బృంహణం వృష్య మాయుష్యం ప్లీహోదరవినాశనం. 23. వయసః స్థాపనం మేధ్యం పిప్పలీనాం రసాయనం, పంచపిప్పలిక శ్చాపి దృశ్యతే వర్ధమానకః. 24. పిష్టా స్తా బలిభిః పేయాః శృతా మధ్యబలై ర్నరైః, శీతీకృతా హ్రస్వబలై ర్దేహదోషామయా న్ప్రతి. 25.

వేయి పిప్పళ్లు తెచ్చి పైదానివలెనే పాకముచేసినచో నియ్యది రసాయనమగును. ఇందు పదిపిప్పళ్ళు దినమును తినుట యుత్తమము. ఆరుతినుట మధ్యమును మూడుతినుట కనీసము. ధాతువుల నిది వృద్ధిపొందించును. వీర్యమునకు హితకరము. ఆయువును వృద్ధి పొందించును. ప్లీహోదరములను పోగొట్టును. వయస్సును నిలుపును. బుద్ధిని పెంచును. ఇంక నెన్నియోగుణము లనేకము లిందు గలవు.

## పిప్పలీచిత్రక ఘృతము.

శ్లో. పిప్పలీచిత్రకా న్మూలం పిష్ట్వా సమ్య గ్విపాచయేత్, ఘృతం చతుర్గుణక్షీరం యకృత్ప్లీహోదరాపహం. 26.

మోడి చిత్రమూలము వీటినినూరి నాలుగురెట్లు పాలుకలిపి నేతిని పక్వముచేసి సేవించిన యకృత్ ప్లీహోదరములు నశించును.

## పిప్పలీఘృతము.

శ్లో. పిప్పలీకల్కసంయుక్తం ఘృతం క్షీరచతుర్గుణం, పిబేత్ప్లీహాగ్నిసాదాది యకృద్రోగహరం పరం. 27.

పిప్పళ్ల కల్కమును నాలుగు రెట్లపాలు వీటిలో సిద్ధముచేసిన ఘృతము ప్లీహ మందాగ్ని మున్నగువానిని పోగొట్టును.

## ద్వితీయ చిత్రకఘృతము.

శ్లో. చిత్రకస్య తులాక్వాథే ఘృతప్రస్థం విపాచయేత్, ఆరనాలంతద్ద్విగుణం దధిమండం చతుర్గుణం. 28. పంచకోలకతాళీస క్షారైర్లవణసంయుతైః, ద్విజీరకనిశాయుగ్మ మ్మరిచం తత్ర దాపయేత్. 29. శ్వాసగుల్మోదరాధ్మాన పాండురోగారుచిజ్వరాన్, బస్తి హృత్పార్శ్వ

కట్యూ్యరు శూలోదావర్త పీనసాన్. 30. హన్యాత్ప్రీతం తదర్శోఘ్నం శోథఘ్నం వహ్నిదీపనం, బలవర్ణకరం చాపి భస్మకం చ నియచ్ఛతి.31.

చిత్రమూలము క్వాథములో 100 పలములంతలో 16 పలముల నేతిని పక్వము చేసి గంజి రెండుగెట్లు మజ్జిగ తేట నాలుగు రెట్లు పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి తాడిశపత్రి యవక్షారము జీలకఱ్ఱ మ్రానిపసపు మిరియములు వీటి కల్కమును చేర్చి పక్వము చేసి సేవించిన ప్లీహరోగములను గుల్మరోగములను ఉదరరోగములను ఆనాహమును పాండురోగమును అరుచిని జ్వరమును వస్తిశూలలు మున్నగువానిని పోగొట్టును. ఇది అగ్నిని దీపింపజేయును. బలవర్ణములనుకూడ కలిగించును. భస్మకరోగముల నిది పొఱద్రోలును.

## రోహితకఘృతము.

శ్లో. రోహితకత్వచః క్షుణ్ణాః పలానాం పంచవింశతిః, కోలద్విప్రస్థసంయుక్తం కషాయ ముపకల్పయేత్. 32. పలికైః పంచకోలైశ్చ తత్సర్వై శ్చాపి తుల్యయా, రోహీతకత్వచాపిష్టైః ఘృతప్రస్థం విపాచయేత్. 33. ప్లీహాభివృద్ధిం శమయే దేత దాశు ప్రయోజితం, తథా గుల్మజ్వర శ్వాస క్రిమి పాండుత్వ కామలాః 34.

రోహీతకత్వఙము 25 పలములు పెద్ద ఉేగుపండ్లు రెండు ప్రస్థములు వీటిని కషాయము కాచి పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి వీటిని ఒక్కొక తులము అన్నిటితో సమానభాగములను గ్రహించి 16 పలముల నేతిని పక్వము చేయవలయును. ఇయ్యది ప్లీహరోగములను గుల్మ జ్వర శ్వాస కృమి పాండువులను కామెరలను రూపుమాపును.

## మహారోహితక ఘృతము.

శ్లో. రోహితకా త్పలశతం క్షోదయేద్బదరాఢకం, సాధయిత్వా జలద్రోణే చతుర్భాగావశేషితే. 35. ఘృతప్రస్థం సమావాప్య ఛాగ క్షీర చతుర్గుణం, తస్మిన్ దద్యాదిమా న్కల్కా న్సర్వాం స్తానక్షసమ్మితాన్. 36. వ్యోషం ఫలత్రికం హింగు యమానీం తుంబురుం బిడం, అజాజీం కృష్ణలవణం దాడిమం దేవదారు చ. 37. పునర్నవాం విశాలాంచ యవక్షారం సపౌష్కరం, విడంగం చిత్రకం చైవ హపుషాం చవికాంవచాం. 38. ఏతైః ఘృతం విపక్వం తు స్థాపయేద్భాజనే దృఢే, పాయ

యేత్త్రిఫలాం మాత్రాం వ్యాధిం బలమపేక్ష్య చ. 39. రసకేనాథ యూషేణ పయసా వాపి భోజయేత్, ఉపయుక్తే ఘృతే తస్మిన్వ్యాధీన్ హన్యా దిమాన్బహూన్. 40. యకృత్ప్లీహోదరం చైవ ప్లీహశూలం యకృత్తథా, కుక్షిశూలంచహృచ్ఛూలం పార్శ్వశూలమరోచకం. 41. విబంధశూలం శమయే త్పాండురోగం సకామలం. ఛర్ద్యతీసారశమనం తంద్రాజ్వరవినాశనం, మహారోహీతకం నామ ప్లీహఘ్నం తు విశేషతః. 42.

రోహీతకత్వణము 100 పలములు, రేగు 64 పలములు వీటిని ద్రోణపు నీటిలో పక్వముచేసి నాల్గవపాలుగా దిగక్రాగినప్పుడు నాలుగురెట్లు మేకపాలను పోసి 16 పలముల నేతిని పక్వము చేయవలయును. అందు ఒక్కొక్క తులప్రమాణముగా కల్కమును వేయుచుండవలయును. శొంఠి మిరియములు పిప్పళ్లు కరక్కాయలు తాడియుశిరిక యింగువ వామము ధనియములు అంటుప్పు జీలకఱ్ఱ సౌవర్చలవణము దానిమ్మ దేవదారు గలిజేరు కొడిసెపాలవిత్తులు యవక్షారము పుష్కరమూలము వాయువిడంగములు చిత్రమూలము హరారము చవ్యము వస వీటితో పక్వముచేసి ఆఘృతమును దింపి యుంచుకొనవలయును. దీనిని సేవించెడి రోగితనబలము ననుసరించి సేవింపవలయును. యకృద్రోగప్లీహరోగములు మున్నగునవి దీని వలన నశించును.

ఇట్లు చక్రదత్తయందు ప్లీహరోగాధికారప్రకరణము ముగిసెను.

---

# 38. శోథాధికారము.

శోథను సామాన్యోపాయములు.

శ్లో. శుంఠీ పునర్నవై రండ పంచమూలశృతం జలం, వాతికే శ్వయథౌ శస్తం పానాహారపరిగ్రహే. 1. దశమూలం సర్వథాచ శస్తం వాతే విశేషతః, క్షీరాశనః పిత్తకృతేఽథ శోథే త్రివృద్గుడూచీ త్రిఫలాకషాయం. 2. పిబే ద్గవాం మూత్రవిమిశ్రితం వా ఫలత్రికాచూర్ణ మథాక్షమాత్రం, అభయా దారు మధుక తిక్తా దన్తీ సపిప్పలి. 3. పటోలం చందనం దార్వీం త్రాయమాణేంద్రవారుణీ, ఏషాం క్వాథః స

సర్పిష్కః శ్వయథు జ్వర దాహహా. 4. విసర్ప తృష్ణా సంతాప సన్నిపాత విషాపహో, శీతవీర్యై ర్హిమజలై రభ్యంగాదీం శ్చ కారయేత్. 5.

శొంఠి గలిజేరు ఆముదపువిత్తులు పంచమూలములు వీటికషాయమును వాతశోధలలో త్రాగవలయును. భోజనము అభ్యంజనమును శ్రేష్ఠములు. అన్నివిధములగు దశమూలపుకషాయము వాతరోగములకు విశేషము శ్రేష్ఠము. పిత్తశోధము నందుపాలు త్రాగే వారైనచో తెల్లతెగడ త్రిఫలములు వీటికషాయమును గోమూత్రములో కలిపికొని ఒక్కతులము త్రిఫలచూర్ణమును కలిపి త్రాగవలయును. కరక్కాయలు దేవదారువు మధుకము కటుకరోహిణి దంతెన పిప్పళ్లు పొల్ల చందనము మ్రానిపసపు కలుక్రానుగ పాపర వీటికషాయమును నేతితో త్రాగిన జ్వరమును దాహమును నశించును. విసర్పము దప్పి సంతాపము సన్నిపాతము విషము వీటిని పోగొట్టును. శీతవీర్యము గలవారు చలినీటితో అభ్యంగనాదులను దీనిని సేవించు కాలములో చేసికొనవలయును.

## పునర్నవాష్టకము.

శ్లో. పునర్నవా విశ్వత్రివృద్గుడూచీ సంపాక పథ్యామరదారు కల్కం, శోథే కఫోత్థే మహిషాక్షయుక్తం మూత్రం పిబేద్వా సలిలం త్వథైషాం. 6. కఫే తు కృష్ణా సికతా పురాణ పిణ్యాక శిగ్రుత్వగుమా ప్రలేపః, కులుత్థ శుంఠీ జలమూత్రసేక శ్చండాగురుభ్యా మనులేపనం చ. 7. అజాజి పాఠా ఘనపంచకోల వ్యాఘ్రీరజన్యః సుఖతోయపీతాః, శోథం త్రిదోషం చిరజం ప్రవృద్ధం నిఘ్నన్తి భూనింబమహాషధేచ. 8. పునర్నవా నింబ పటోల శుంఠీ తిక్తామృతా దార్వభయాకషాయః, సర్వాంగశోథోదరకాస శూల శ్వాసాన్వితం పాండుగదం నిహన్తి. 9.

గలిజేరు శొంఠి తెల్లతెగడ తిప్పతీగె ఊలచెక్క కరక్కాయలు దేవదారుచెక్క గుగ్గిలము వీటిని గోమూత్రమునందు గాని కషాయముసుచేసి త్రాగిన కఫశోధములు నశించును. కఫశోధయందు పిప్పళ్ళు చక్కెర తురుష్కము మునగచెక్క పసపు వీటిలేపమును ఉలవలు శొంఠి వీటి నీటిలోను గోమూత్రమునందువైచి సేచన చేయుటయును శివలింగితోకూడ అగరును రాయుటయును హితములు. జీలకఱ్ఱ అగరుశొంఠి తుంగముస్తెలు పిప్పళ్ళు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి వీటిచూర్ణమును సుఖపూర్వకముగా వేడినీటితో త్రాగవలయును. త్రిదోషజమగు శోఫయును చిరకాలము నుండి యున్నశోఫయును నశించును. నేలవేము శొంఠి కషాయములు శోఫము పోగొట్టును.

గలిజేరు వేప చేదుపాళ్ల శొంఠి కటుకరోహిణి తిప్పతీగె దేవదారువు కరక్కాయలు వీటికషాయము సంపూర్ణముగా శరీరమునందలి శోఫలను పోగొట్టును.

## శోథయందు గుడయుక్తార్ద్రిక రసాదులు.

శ్లో. ఆర్ద్రికస్య రసః పీతః పురాణగుడమిశ్రితః, అజాక్షీరాశినాం శీఘ్రం సర్వశోథహరో భవేత్. 10. పునర్నవా దారు శుంఠీ క్వాథే మూత్రే చ కేవలే, దశమూలరసే వాపి గుగ్గులుః శోథనాశనః. 11. బిల్వపత్ర రసం పూతం శోషణం శ్వయథౌ త్రిజే, విట్సంగే చైవ దుర్నామ్ని సిదధ్యాత్కామలాస్వపి. 12. గుడపిప్పలిశుంఠీనాం చూర్ణం శ్వయథునాశనం, ఆమాజీర్ణ ప్రశమనం శూలఘ్నం వస్తిశోధనం. 13. పురో మూత్రేణ సేవేత పిప్పలీ వా పయోన్వితా, గుడేన వా ఽభయాం తుల్యాం విశ్వం వా శోథరోగిణాం. 14. గుడార్ద్రికం వా గుడనాగరం వా గుడాభయం వా గుడపిప్పలీం వా, కర్షాభివృద్ధ్యా త్రిఫలప్రమాణం ఖాదేన్నరః పక్ష మథాపి మాసం. 15. శోథప్రతిశ్యాయ గలాస్యరోగాన్ సశ్వాసకాసారుచిపీనసాం శ్చ, జీర్ణజ్వరార్శో గ్రహణీవికారాన్ హన్యాత్తథా ఽన్యాన్ కఫవాతరోగాన్. 16.

ప్రాతఃబెల్లముతో చేర్చి అల్లపురసమును త్రాగవలయును. మేకపాలను త్రాగిన శోథ నశించును. గలిజేరు దేవదారు శొంఠి వీటికషాయమునందుగాని కేవలమును గోమూత్రములోగాని దశమూలముల రసములోగాని చేర్చి గుగ్గిలమును సేవించినచో శోథలు నశించును. త్రిదోషముల శోథలందు బిల్వపత్రరసమును వడియగట్టి త్రాగిన శుష్కించును. దీనినే మలబద్ధమునందును శూలరోగమునందును కామెలయందును దీనినే చేయవలయును. బెల్లము పిప్పళ్ళు శొంఠివీటిచూర్ణము శోథలనుపోగొట్టును. ఆమపుటజీర్ణమును పోగొట్టును. శూలలను పోగొట్టును. వస్తిని శోధించును. గుగ్గులమును గోమూత్రముతోగాని పిప్పళ్లను పాలతోగాని బెల్లముతో కరక్కాయనుగాని లేక శొంఠినిగాని తినిన శోథ(వాపు) నశించును. బెల్లము అల్లముగాని బెల్లము శొంఠిగాని బెల్లము కరక్కాయలు గాని బెల్లము పిప్పళ్ళు గానికర్షముచొ॥ పెంచి మూడుపలముల వఱకు పదిహేను రోజులు వఱకు గాని ఒకనెలగాని తినినచో వాపు పీనస మున్నగు రోగములు నశించును.

## పద్మకల్కాదులు.

శ్లో. స్థలపద్మమయం కల్కం పయసాఽఽలోడ్య పాయయేత్, ప్లీహామయహరం చైవ సర్వాంగైకాంగశోథజిత్. 17. దారుగుగ్గులుశుంఠీనాం కల్కో మూత్రేణ శోథజిత్. వర్షాభూశృంగబేరాభ్యాం కల్కో వా సర్వశోథజిత్. 18. సింహాస్యామృతభండాకీక్వాథం కృత్వా సమాక్షికం, పీత్వా శోథం జయేజ్జంతుః శ్వాసం కాసం వమిం జ్వరం. 19. భూనింబవిశ్వకల్కం జగ్ధ్వా పేయః పునర్నవా క్వాథః, అపహరతి నియత మాశు శోథం సర్వాంగకం నృణాం. 20. శోథను త్కోకిలాక్షస్య భస్మ మూత్రేణ వాంభసా, క్షీరం శోథహరం దారు వర్షాభూనాగరైశ్శృతం. 21. పేయం వా చిత్రకవ్యోషత్రివృద్దారు ప్రసాధితం.

స్థలకమలముల కల్కమును పాలతో నాలోడితము చేసి త్రాగించినచో ప్లీహరోగమును సర్వాంగములఁ గలవాపును ఏకాంగశోథను పోఁగొట్టును. దేవదారుచెక్క గుగ్గిలము శొంఠి వీటికల్కమును గోమూత్రముతో సేవించిన శోథను జయించును. లేకపోయినచో, గలిజేరు అల్లము వీటికల్కము అన్నివిధములగు వాపులను పోఁగొట్టును. అడ్డసరము వారాహీకంద ములక వీటిని కషాయమును పెట్టి త్రాగిన వాపు శ్వాసము కాసము ఛర్ది జ్వరములు నశించును. నేలవేము శొంఠితో చేసిన కల్కమును తిని గలిజేరు కషాయమును త్రాగుట మంచిది. ఇయ్యది సర్వాంగశోథలను పోఁగొట్టును. గొలిమిడిని భస్మముచేసి గోమూత్రముతో సేవించినను నీటితో త్రాగినను దేవదారువు శొంఠి గలిజేరు వీటితో పక్వముచేసినపాలనుగాని చిత్రమూలము శొంఠి మిరియములు పిప్పళ్లు తెల్లతెగడ దేవదారువు వీటితో సాధించిన పాలనుగాని త్రాగుట మంచిది.

## క్షారగుటికా.

శ్లో. పునర్నవా మూల కపిత్థ దారు చ్ఛిన్నోద్భవా చిత్రకమూల సిద్ధాః, రసా యవాగ్వాం చ పయాంసి యూషాః శోథే ప్రదేయాః దశమూలగర్భాః. 22. క్షారద్వయం స్యాల్లవణాని చత్వార్యయోరజో వ్యోషఫలత్రికే చ, సపిప్పలీ మూల విడంగ సారం ముస్తాజమోదామరదారు బిల్వం. 23. కలింగక శ్చిత్రకమూల పాఠే యష్ట్యాహ్వయం సాతివిషం పలాశం, సహింగుకర్షం త్వథ శుష్కచూర్ణం ద్రోణం తథామూ

లకశుంఠికానాం. 24. స్యాద్భస్మన స్తత్సలిలేన సాధ్య మాలోడ్య యావ ద్ఘనమప్యదగ్ధం, స్త్యానం తతః కోలసమాంచమాత్రాం కృత్వాసశుష్కాం విధినా ప్రయుంజ్యాత్. 25. ప్లీహోపరశ్విత్ర హలీమకార్శః పాండ్వా మయారోచక శోథశోషాన్, విషూచికా గుల్మగరాంశ్మరీశ్చ సశ్వాసకా సాన్ప్రణుదే త్సకుష్ఠాన్. 26. సౌవర్చలం సైంధవం చ బిడ మౌద్భిద మేవ చ, చతుర్లవణ మత్ర స్యా జ్జల మష్టగుణాం భవేత్. 27.

గలిజేరువేళ్లు వెలగ దేవదారువు తిప్పతీగె చిత్రమూలపువేళ్ళు వీటితోసిద్ధము చేసిన రసము పాలు యూషము దశమూలముల కల్కముతో చేర్చి సేవించిన హితమగును. సజ్జక్షారము యవక్షారము లవణచతుష్టయము లోహచూర్ణము శొంఠి మిరియములు పిప్పళ్ళు త్రిఫలములు మోడి వాయువిడంగములు తుంగముస్తలు వాము దేవదారువు మారేడు కోష్ఠు చిత్రమూలపువేళ్ళు అగరుశొంఠి ముల్లంగి అతివస ఒక తులము ఇంగువ మునగవేళ్ళు వీటిని. ద్రోణమునీటితో కషాయముచేసి। పైవాని భస్మమును అందు వైచి ఆలోడనచేసి గట్టిపడినపిమ్మట రేగుపండంతమాత్రలనుగట్టి యథావిధిగానుపయోగింప వలయును. ప్లీహోదరము శ్విత్ర కుష్ఠము హలీమకము మూలరోగము పాండురోగము అరోచకము వాపు విషూచిక, శోప మున్నగువానినిది నశింపజేయును. సౌవర్చ లవణము, సైంధవలవణము, అఁటుప్పు, నేలయుప్పు అనునీనాలుగింటితో నాలుగురెట్లు నీటినీయోగమందు చేర్పవలయును.

### పునర్నవాది ఘృతము.

శ్లో. పునర్నవా చిత్రక దేవదారు పంచోషణ క్షార హరీతకీనాం, కల్కేన పక్వం దశమూలతోయే ఘృతోత్తమం శోథనిషూదనం చ. 28.

గలిజేరు చిత్రమూలము దేవదారువు పిప్పళ్ళు ఏనుగుపిప్పళ్లు చవ్యము కాయఫలము శొంఠి యవక్షారము కరక్కాయలు వీటికల్కమును దశమూలకషాయముతో పక్వముచేసికలిపిన ఆవునేయియును శోథలను పోగొట్టును.

### శుంఠీఘృతము.

శ్లో. పునర్నవా క్వాథ కల్క సిద్ధం శోథహరం ఘృతం, విశ్వౌషధస్య కల్కేన దశమూలజలే శృతం. 29. ఘృతం నిహన్యాచ్ఛ్వయథుం గ్రహణీం పాండుతామయం. 30.

గజ్జేరుయొక్క కషాయకల్కములలో సిద్ధముచేసిన నేయి శోథలనుపోఁగొట్టును. శొంఠిని కల్కముచేసియును, దశమూలముల కషాయములో నేతిని సిద్ధముచేసియును సేవించిన శోథలు నశించును. గ్రహణులు పాండు రోగములును కూడ నశించును.

## చిత్రకాద్యఘృతము.

శ్లో. సచిత్రకా ధాన్యయమాని పాఠాః సదీప్య కత్ర్యూషణ వేతసామ్లాః, బిల్వాత్ఫలం దాడిమయావశూకం సపిప్పలీమూల మథాపి చవ్యం. 31. పిష్ట్వాక్ష మాత్రాణి జలాఢ కేన పక్త్వా ఘృతప్రస్థ మథోపయుంజ్యాత్, అర్శాంసి గుల్మాం శ్చ్వయథుం చ కృచ్ఛ్రం నిహంతి వహ్నిం చ కరోతి దీప్తమ్. 32.

చిత్రమూలము ధనియములు వాము అగరుశొంఠి అజమోద శొంఠి మిరియములు పిప్పళ్లు ఆమ్లవేతసము మారేడుచెక్క దానిమ్మ యవక్షారము మోడి చవ్యము వీటినన్నిటిని కాలు కాలుపలముచొ ఒక ఆఢక ప్రమాణపు నీటిలో పక్వముచేసి 16 పలములనేయిని సిద్ధముచేసి సేవించిన మూలరోగములు శోథలు మున్నగునవి నశించును.

## పంచకోలాద్యఘృతము.

శ్లో. రసే విపాచయే త్సర్పిః పంచకోల కులత్థయోః, పునర్నవాయాః కల్కేన ఘృతం శోథ వినాశనం 33.

పిప్పళ్ళు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి ఉలవలు వీటిరసములో గలిజేరు కల్కమునుచేసి నేతిని పక్వముచేసి సేవించిన శోథలు నశించును.

## చిత్రక ఘృతము.

శ్లో. క్షీరం ఘటే చిత్రకకల్కలిప్తే దధ్యాగతం సాధు విమథ్య తేన, తజ్జం ఘృతం చిత్రకమూలకల్కం తక్రేణ సిద్ధం శ్వయథుఘ్న ముగ్రం. 34. అర్శోతిసారా నిల గుల్మ మేహాం స్త్వద న్తి సంవర్ధయతే బలం చ.

చిత్రమూలపుకల్కముతో లేపనచేసిన కుండలో పెరుగును పాలను పోసి చక్కఁగాఁ జిలచి తీసిననేతిని చిత్రమూలపువేళ్లకల్కము మజ్జిగతో సిద్ధముచేసిన దానిని సేవించుట యుత్తమము. ఇది శోథను పోఁగొట్టును. మూలరోగము అతిసారము వాతగుల్మములు ప్రమేహము మున్నగు వానిని కూడ పోఁగొట్టి బలమునిచ్చును.

## మాణకఘృతము.

శ్లో. మాణకక్వాథకల్కాభ్యాం ఘృతప్రస్థం విపాచయేత్. 35. ఏకజం ద్వంద్వజం శోథం త్రిదోషం చ వ్యపోహతి.

ప్రేంఖణపు కషాయకల్కములలో 16 పలముల నేతిని పక్వము చేసి సేవించి ఏకదోష ద్విదోష త్రిదోషజముల వాపులు సయితము నశించును.

స్థలపద్మకఘృతము.

శ్లో. స్థలపద్మపలాన్యష్టౌ త్ర్యూషణస్య చతుఃపలమ్. 36. ఘృత ప్రస్థం పచే దేభిః క్షీరం దత్వా చతుర్గుణమ్, పంచకాసార్తి హారే చ్ఛోఫ ఘ్నంశోఽథం చైవ సుదుస్తరమ్. 37.

మెట్టతామర 8పలములు శొంఠి మిరియములు పిప్పళ్ళు 4 పలములు వీటిని కషాయము చేసి అందు నాల్గురెట్లు పాలుకలిపి 16 పలముల నేతిని అందు పక్వము చేసి సేవించిన పంచవిధములగు దగ్గులు భయంకరములగు వాపులును కూడ నశించును.

శైలేయాదిఘృతము.

శ్లో. శైలేయ కుష్ఠాగురు దారు కౌంతీ త్వక్పద్మకైలాంబు పలాశముస్తైః, ప్రియంగు స్థౌణేయక హేమమాంసీ తాళీసపత్రప్లవపత్ర ధాన్యైః. 38. శ్రీవేష్టక ధ్యామక పిప్పలీభిః పృక్కానఖైర్వాపి యథోపలాభమ్, వాతాన్వితేభ్యంగ మిశన్తి తైలం సిద్ధం నుపిష్టై రపి చ ప్రదేహమ్. 39.

శైలేయము కోష్ఠు అగరు దేవదారు రేణుకబీజములు లవంగపుపట్ట కమలములు ఏలకులు కురువేరు తుంగముస్తెలు ప్రియంగువు దవనము హేమము జటామాంసి తాడిశపత్రి ధనియములు జాపత్రి శ్రీవేష్ట ధూపము గోహిపత్రణము పిప్పళ్ళు పృక్కయను ద్రవ్యము నఖమను గంధద్రవ్యము వీటిని దొరకినంతగా తెచ్చి తైలమును సిద్ధముచేసి మర్దించినగాని వీటిని నూరి పట్టు వేయుటగాని శోథలకు హితకరము అగును.

శుష్కమూలాద్యఘృతము.

శ్లో. శుష్కమూలక వర్షాభూ దారు రాస్నా మహౌషధైః, పక్వ మభ్యంజనా త్తైలం సశూలం శ్వయథుం జయేత్. 40.

ఎండినముల్లంగివేళ్ళు గలిజేరు దేవదారువు సన్నరాస్న శొంఠి వీటితోపక్వము చేసిన తైలమును రుద్దినను వాపులు నశించును.

పునర్నవాలేహము.

శ్లో. పునర్నవా మృతా దారు దశమూలరసాఢకే, ఆర్ద్రిక స్వరసే ప్రస్థే గుడస్య తు తులాం పచేత్. 41. తత్సిద్ధం వ్యోష చవ్యైలా త్వక్పత్రైః కార్షికైః పృథక్, చూర్ణీకృతైః క్షిపే చ్ఛీతే మధునః కు

డపం లిహేత్. 42. లేహః పౌనర్నవో నామ శోథ శూల నిషూదనః, శ్వాస కాసా౽రుచిహరో బలవర్ణాగ్ని వర్ధనః. 43.

గలిజేరుతిప్పతీగెదేవదారువు దశమూలములు వీటియొక్క అష్టక పుపరిమాణముగల రసములోను 16 పలముల అల్లపురసమును 100 పలముల బెల్లమునుపక్వముచేసి శొంఠి మిరియములు పిప్పళ్ళుచవ్యముఏలకులు లవంగపుపట్ట జాపత్రి వీటిని ఒక్కొక్కకాలు పలము చొప్పునచూర్ణము చేసి చల్లారిన పిమ్మట పైదానిలో వేసి నాలుగుపలముల తేనెతోను కలపవలసినది. ఇయ్యది వాపులను శూలలను శ్వాసకాసములను అరుచిని పోఁగొట్టి బలమును కాంతిని పెంపుఁజేయును.

## దశమూలహరీతకి.

శ్లో. దశమూలకషాయస్య కంసే పథ్యా శతం పచేత్, తులాం గుడాద్ఘనే దద్యా ద్వ్యోషక్షారం చతుఃపలం. 44. త్రిసుగంధం సువర్ణాంశం ప్రస్థార్ధం మధునో హిమే, దశమూలీ హరీతక్యః శోథార్శో హన్యుః సుదారుణాన్. 45. జ్వరారోచక గుల్మార్శో మేహ పాండూదరామయాన్, ప్రత్యేక మేక కర్షాంశం త్రిసుగంధ మితో భవేత్. 46. కంసహరీతకీ చైషా చరకే పఠ్యతే౽న్యథా, ఏతన్మానేన తుల్యత్వం తేన తత్రాపి వర్ణ్యతే. 47.

48 పలముల దశమూలపు కషాయములో నూరుకరక్కాయలను పక్వముచేసి గట్టిపడినపిమ్మట 100 పలముల బెల్లము శొంఠి మిరియములు పిప్పళ్లు యవక్షారము 4 పలములును లవంగపుపట్ట ఏలకులు జాపత్రి వీటిచూర్ణము ఒకతులమును చేర్చి సిద్ధముచేసి చల్లారినపిమ్మట 8 పలముల తేనెను కలిపి సేవించిచో భయంకరములగు వాపులును నశించును. జ్వరము అరోచకము గుల్మము మూలరోగము ప్రమేహము పాండువు ఉదరరోగము వీటికైనచో లవంగపుపట్ట మున్నగు మూటిని మూడుతులములు చేర్పవలయును. ఇదికంసహరీతకి అందురు. చరకములో మరియొకరీతిగా చెప్పఁబడినది. ఇందు వర్ణించిన మానమునే అందును వర్ణించి యున్నారు.

## కంసహరీతకీ.

శ్లో. ద్విపంచమూలస్య పచేత్కషాయే కంస్యే౽భయానాం చ శతం గుడాచ్చ, లేహే సుసిద్ధే చ వినీయ చూర్ణం వ్యోషత్రిసౌగంధ్య ముపస్థితే చ. 48. ప్రస్థార్ధమాత్రం మధునః సుశీతే కించిచ్చ చూ

ర్ణాదపి యావశూకాత్, ఏకాభయాం ప్రాశ్య తతశ్చ లేహో చ్ఛుక్తిని నిహన్తి శ్వయథుం ప్రవృద్ధం. 49. కాసజ్వరారోచక మేహగుల్మాన్ల్సీహ త్రిదోషోద్భవ పాండురోగాన్, కార్శ్యామవాతావసృగమ్లపిత్తం వైవర్ణ్యమూత్రానిల శుక్రదోషాన్. 50. అత్ర వ్యాఖ్యాన్తరం నోక్తం వ్యాఖ్యా పూర్వైవ యచ్ఛుభా.

దశమూలముల కషాయము 48 పలములలో కరక్కాయలు నూరు బెల్లము నూరుపలములు వేసి లేహము చేసి అందు శొంఠి మిరియములు పిప్పళ్లు లవంగపుపట్ట ఏలకులు జాపత్రి వీటిని చూర్ణముచేసి వేయవలయును. చక్కగా చల్లారినపిమ్మట 4పలముల తేనెను కలిపి కొంచెము యవక్షారము పిమ్మట కరక్కాయను తిని అరపలము లేహమును తినవలసినది. ఇయ్యది ప్రబలమైన వాపులను సైతము శమింప జేయును. దగ్గు జ్వరము అరోచకము ప్రమేహము గుల్మము ప్లీహరోగము త్రిదోషజనితమగు పాండువు కృశించిపోవుట ఆమవాతము రక్తరోగము అమ్లపిత్తము వివర్ణత మూత్రదోషములు వాతదోషములు వీర్యదోషములు అనువీటిని పోగొట్టును. ఇచ్చట ఇతరవ్యాఖ్యలేవియును చెప్పబడలేదు.

## వాపునకు లేపములు.

శ్లో. లేపో ఽరుష్కరశోథం నిహన్తి తిల దుగ్ధ మధు నవనీతైః. 51. తత్తరుతలమృద్భిర్వా శాలదలైర్వా తు న చిరేణ, శోథే విషనిమిత్తే తు విషోక్తా సమ్మతా క్రియా. 52. గ్రామ్యజానూపంపిశితలవణం శుష్కశాకం నవాన్నం, గౌడం పిష్టాన్నం దధి సకృశరం విజ్జలం మద్యమమ్లం, ధానావల్లూరం సమశన మథోగుర్వసాత్మ్యం విదాహి స్వప్నం చారాత్రౌ శ్వయథుగదవాన్వర్జయేన్మైథునం చ. 53.

తిలలు తేనె పాలు నవనీతము వీటితో చేసిన లేపనము అరుష్కరశోథమును పోగొట్టును. జీడిచెట్టు క్రిందిమట్టితో గాని ఆయాకుల తోటిగాని లేపనచేసిన వాపు నశించును. విషోత్పన్నములగు శోథలకు విషోక్తములగు చికిత్సలనేచేయవలయును. మేకమాంసము నీటిపట్టులందలి జంతువుల మాంసము ఎండుకూరలు క్రొత్తధాన్యములయన్నము బెల్లపుపదార్థములు పెలుగు పులగము జలవేతసము కల్లు అమ్లరసము గోధుమలు మాంసము మంచిభోజనము ప్రకృతి విరుద్ధములగు భోజనములు ఈవస్తువులను శోథరోగులు బొత్తుగా పరిత్యజింపవలయును.

ఇట్లు చక్రదత్తయందు శోథరోగాధికారప్రకరణము ముగిసెను.

---

# ౩౬. వృద్ధ్యధికారము.

## వాతవృద్ధికి గుగ్గులు తైలాదులు.

శ్లో. గుగ్గులుం రుబుతైలం వా గోమూత్రేణ పిబేన్నరః, వాతవృద్ధిం నిహన్త్యాశు చిరకాలానుబంధినీం. 1. సక్షీరం వా పిబే త్తైలం మాస మేరండసంభవమ్, పునర్నవాయాస్తైలం వా తైలం నారాయణం తథా. 2. పానే వస్తౌ రుబో స్తైలం పేయం వా దశకాంభసా, చందనం మధుకం పద్మ ముశీరం నీల ముత్పలమ్ 3 క్షీరపిష్టైః ప్రదేహస్స్యా ద్దాహశోథరుజాపహః, పంచవల్కలకల్కేన సఘృతేన ప్రలేపనమ్. 4. సర్వం పిత్తహరం కార్యం రక్తజే రక్తమోక్షణమ్, శ్లేష్మవృద్ధిం తూష్ణవీర్యై ర్మూత్రపిష్టైః ప్రలేపయేత్. 5. పీతదారుకషాయం చ పిబే న్మూత్రేణ సంయుతమ్, స్విన్నం మేదః సముత్థంతు లేపయే త్సురసాదినా. 6. శిరోవిరేకద్రవ్యైర్వా సుఖోష్ణై ర్మూత్రసంయుతైః, సంస్వేద్య మూత్రప్రభవాం వస్త్రపట్టేన వేష్టయేత్. 7. సీవన్యాః పార్శ్వతో ధస్తా ద్విధ్యే ద్వ్రీహిముఖేన వై, శంఖోపరి చ కర్ణాన్తే త్యక్త్వా సీవసిమాంత్ర హేత్. 8. వ్యత్యాసాద్వా శిరాం విధ్యే దంత్రవృద్ధినివృత్తయే, అంగుష్ఠమధ్యే త్వక్ఛిత్త్వా దహేదంగవిపర్యయే 9.

గుగ్గులును గాని ఆముదమును గాని గోమూత్రముతో త్రాగవలయును. ఇయ్యది చిరకాలోత్పన్నములగు వాతవృద్ధులను పోగొట్టును. లేనిచో పాలతో ఆముదమును గాని గలిజేరు తైలమును గాని నారాయణ తైలమునుగాని త్రాగినను ఆముదమును దశమూలముల కషాయముతో త్రాగినను హితము. వస్తికర్మలను చేయుటయు నుత్తమములు. చందనము ముల్లెగ కమలను వట్టివేళ్లు నల్లకలువలు వీటిని పాలతో నూరి లేపనచేయవలయును. ఇది దాహము శోథము మున్నగు రోగములను పోగొట్టును. మఱ్ఱివ్రేళ్లు పిప్పళ్ళు రావి వేతసను వీటిని నేతితో కల్కముచేసి లేపనచేసిన సంపూర్ణముగా పిత్తనాశనమగును. రక్త వృద్ధియందు రక్తమును వెడలింపవలయును. కఫవృద్ధియందు గోమూత్రముతో నూరిన యుష్ణౌషధులతో లేపన చేయవలయును.

పచ్చిదేవదారుకషాయమును గోమూత్రముతో చేర్చి త్రాగవలయును. మేదనుగోమూత్రముతో స్వేదితముఁజేసి సురసాదిగణౌషధములతోఁకలిపి లేపనచేయవలయును. మూత్రజమగు వృద్ధికిచక్కఁగా చెమటఁబట్టించి పట్టువేయవలయును. లేనిచో వ్రీహిముఖశస్త్రముతో ఛేదింపవలయును. చెవికొనయందు గూబను వదలిపెట్టి సూదితో కాల్పవలయును. అంత్రవృద్ధిని పోఁగొట్టుటకై వ్యత్యాసముగా రక్తనాడిని ఛేదింపవలయును. అంగుష్ఠపునడిమి చర్మమును అంగవిపర్యయమునందు కాల్పవలయును.

## రాస్నాకషాయాదులు.

శ్లో. రాస్నాయష్ట్యామృతైరండబలాగోక్షురసాధితః, క్వాథోంత్రవృద్ధిం హన్త్యాశు రుబుతైలేన మిశ్రితః. 10. తైలమేరండజం పీత్వా బలసిద్ధపయోన్వితమ్, ఆధ్మాన శూలోపచితా మంత్రవృద్ధింజయే న్నరః. 11. హరీతకీం మూత్రసిద్ధాం సతైలాం లవణాన్వితాం, ప్రాతః ప్రాతశ్చ సేవేతకఫవాతమయాపహామ్. 12. గోమూత్రసిద్ధాం రుబుతైలభృష్టాం హరీతకీం సైంధవసంప్రయుక్తాం, ఖాదే న్నరః కోష్ణజలానుపానాం నిహన్తి వృద్ధిం చిరజాంప్రవృద్ధాం. 13. త్రిఫలాక్వాథగోమూత్రం పిబేత్ప్రాతరతంద్రితః, కఫవాతోద్భవం హన్తి శ్వయథుం వృషణోత్థితం. 14. సరళాగురుకుష్ఠాని దేవదారుమహౌషధం, మూత్రారనాళసంయుక్తం శోథఘ్నం కఫవాతనుత్. 15. భృష్టోఽరుబుక తైలేన కల్కః పథ్యాసముద్భవః, కృష్ణాసైంధవసంయుక్తో వృద్ధిరోగహరః పరః. 16.

సన్నరాస్న యష్టిమధుకము తిప్పతీగె ఆముదము ముత్తవపులగము పల్లేరు వీటితోనైన కషాయమునందు ఆముదపు తైలమును చేర్చి త్రాగిన అంత్రవృద్ధి నశించును. ముత్తువపులగముతో సిద్ధముచేసిన పాలతో ఆముదమును త్రాగిన ఆనాహము శూల ఆంత్రవృద్ధి నశించును. కరక్కాయలను గోమూత్రముతో సిద్ధముచేసి తైలము ఉప్పు కలిపి ప్రొద్దుటఁ బుచ్చుకొనిన కఫవాతరోగములు నశించును. గోమూత్రముతో సిద్ధముచేసిన ఆముదములో వేయించిన కరక్కాయచూర్ణమును ఉప్పును చేర్చి తిని కొంచెము వేడినీళ్లను త్రాగవలయును. ఇయ్యది ప్రాచీనములగు వృద్ధులనుగూడ పోఁగొట్టును. సరలము అగరు కోష్ఠు దేవదారువు శొంఠి వీటిని గోమూత్రము గంజితో చేర్చి త్రాగిన వాపునశించును. కరక్కాయలకల్కమును ఆముదముతో వెచ్చచేసి పిప్పళ్లు సైంధవలవణములను చేర్చికొని సేవించినచో వృద్ధిరోగములు నశించును.

## గవ్యఘృతాది ప్రయోగములు.

శ్లో. గవ్యం ఘృతం సైంధవసంప్రయుక్తం శంబూకభాండేనిహితం ప్రయత్నాత్, సప్తాహ మాదిత్యకరైర్విపక్వం నిహన్తి కూరండ మతిప్రవృద్ధం. 17. ఐంద్రీమూలభవం చూర్ణం రుబుతైలేన మర్దితం, త్ర్యహాద్గోపయసా పీతం సర్వవృద్ధినివారణం. 18. రుద్రజటా మూలలిప్తా కరటవ్యాఘ్రచర్మణా, బద్ధావృద్ధిః శమం యాతి చిరజాపి న సంశయః. 19. నిష్పిష్టమారనాళేన రూపికామూలవల్కలం, లేపో వృద్ధ్యామయం హన్తి బద్ధమూల మపి దృఢం. 20. వచాసర్షప కల్కేన ప్రలేపో వృద్ధినాశనః, లజ్జాగృధ్రమలాభ్యాం చ లేపో వృద్ధిహరః పరః. 21.

ఆవునేయి సైంధవలవణములను శంఖుపాత్రలో ఏడుగోజులుంచి సూర్యపుట ముంబెట్టి త్రాగిన మిక్కిలిపెరిగినదైనను కూరండములు నశించును. పాపరవేళ్లచూర్ణమును ఆముదపుతైలముతో మర్దించి మూడుగోజులు ఆవుపాలతో త్రాగినచో అన్ని విధములగు వృద్ధులును నశించును. రుద్రజడవేరుతో లేపనచేసినను కరటచర్మముతో కట్టినను ప్రాచీనములగు వృద్ధులును నశించుటకు సందేహములేదు. జిల్లేడువేళ్లను దొక్కను గంజితో నూరి లేపనచేసినచో దృఢములగు వృద్ధిరోగములును నశించును. వస ఆవాలు వీటికల్కముతో లేపనచేసిన వృద్ధులు నశించును. లజ్జావంతి గద్దరెట్ట వీటితో లేపనచేసినచో వృద్ధిరోగములు నశించిపోవును.

## బిల్వాదిక్వాథచూర్ణములు.

శ్లో. మూలం బిల్వకపిత్థయో రరలుకస్యాగ్నే ర్బృహత్యో ర్ద్వయోః, శ్యామా పూతికరంజ శిగ్రుకతరోర్వర్షాభుపుష్కరం. కృష్ణాగ్రంధిక చవ్య పంచలవణ క్షారాజమోదాన్వితం, పీతం కాంజిక కోష్ణతోయమథితం చూర్ణీకృతం బ్రధ్నసుత్. 22. అవిక్షీరేణ గోధూమకల్కం కుందురుకస్య వా, ప్రలేపనం సుఖోష్ణం స్యా ద్బ్రధ్నశూలహరః పరః. 23. మృతమాత్రే తు వై కాకే విశస్తే సంప్రవేశయేత్, బ్రధ్నం ముహూర్తం మేధావీ తత్ క్షణా దరుజం భవేత్. 24. అజాజీ హపుషా కుష్ఠం గోధూమం బదరాణి చ, కాంజికేన సమం పిష్ట్వా కుర్యా ద్బ్రధ్నప్రలేపనం. 25.

మారేడు వెలగ అగరుశొంఠి చిత్రమూలపువేళ్లు వాకుడు నల్లతెగడ కలుక్రానుగ మునగచెక్క శొంఠి జీడివిత్తులు పిప్పళ్లు మోడి చవ్యము పంచలవణములు యు

పక్షారము అజమోద వీటిచూర్ణము కొంచెమంత వేడినీటితో త్రాగినచో బ్రధ్నరోగములు నశించును. గోధుమకల్కము గాని ఆందుగ కల్కము గాని మేకపాలతో నూరి వెచ్చజేసి లేపనచేసిన బ్రధ్నశూలలునశించును. అప్పుడు (క్రొత్తగా) చచ్చిన కాకియందు బ్రధ్నమును రెండుగడియలుంచినచో వెంటనే రోగమునశించును. జీలకఱ్ఱ బోడతరము కోష్ఠు గోధుమలు రేగుపండ్లు వీటిని సమానభాగములను గంజితోనూరి పట్టించినను బ్రధ్నరోగములు నశించును.

## బృహత్సైంధవతైలము.

శ్లో. సైంధవం మదనం కుష్ఠం శతాహ్వాం నిచుళం వచామ్, హ్రీబేరం మధుకం భార్గీ దేవదారు సనాగరం. 26. కట్ఫలం పౌష్కరం మేదాం చవికం చిత్రకం శఠీం, విడంగాతివిషే శ్యామాం రేణుకాం నలినీం స్థిరాం. 27. బిల్వాజమోదే కృష్ణాంచ దంతీ రాస్నే ప్రపిష్య చ, సాధ్యమేరండజం తైలం తైలం వాతవికారనుత్. 28. బ్రధ్నోదావర్తగుల్మార్శః ప్లీహమేహాఢ్యమారుతాన్, ఆనాహమశ్మరీంచైవ హన్యాత్తదనువాసనాత్. 29. ఘృతం సౌరేశ్వరం యోజ్యం బ్రధ్నవృద్ధినివృత్తయే. 30.

సైంధవలవణము మంగ్రొత్తికాయ కోష్ఠు పిల్లిపీచర నీటిప్రబ్బలి వస కురువేరు యష్టిమధుకము గంటుభారంగి దేవదారువు శొంఠి గుమ్మడు పుష్కరమూలము మేద చవ్యము చిత్రమూలను కిచ్చాగము వాయువిడంగములు అతివస నల్లతెగడ రేణుకబీజములు నీలి శాలిపర్ణి మారేడు అజమోద పిప్పళ్లు దంతి సన్నరాష్ట్ర వీటిని నూరి ఆముదముతో సిద్ధముచేసి సేవించిన వాతవికారములు నశించును. బ్రధ్నము ఉదావర్తము గుల్మము మూలరోగము ప్లీహరోగము ప్రమేహము ఆఢ్యవాతము ఆనాహము మున్నగువాటిని నిది అనువాసనమాత్రముననే పోగొట్టును. బ్రధ్నరోగమును వృద్ధిరోగమును తొలగించుటకు సౌరేశ్వరఘృతమును సైతము ప్రయోగింపవలయును.

ఇట్లు చక్రదత్తయందు వృద్ధ్యధికారప్రకరణము ముగిసెను.



# ౪౦. గళగండాధికారము.

## గళగండమునకు యవముద్గాది ప్రయోగములు.

శ్లో. యవముద్గపటోలాని కటురూక్షం చ భోజనం, ఛర్దిం చ రక్తమోక్షం చ గళగండే ప్రయోజయేత్. 1. తండులోదకపిష్టేన

మూలేన పరిలేపితః, హస్తికర్ణపలాశస్య గళగండః ప్రశామ్యతి. 2. సర్షపాః శిగ్రుబీజాని శణబీజాతసీయవాన్, మూలకస్య చ బీజాని తక్రేణామ్లేన పేషయేత్. 3. గండాని గ్రంథయశ్చైవ గళగండాః సుదారుణాః, ప్రలేపాత్తేన శామ్యన్తి విలయం యాన్తి చాచిరాత్. 4. జీర్ణకర్కారుకరసో బిడసైంధవసంయుతః, నస్యేన హన్తి తరుణం గళగండం న సంశయః. 5. జలకుంభీకజం భస్మ పక్వం గోమూత్రగాలితం, పిబేత్కోద్రవభక్తాశీ గళగండప్రశాన్తయే. 6. సూర్యావర్తరసేనాభ్యాం గళగండేఽనాహనే, స్ఫోటాస్రావైః శమం యాంతి గళగండో న సంశయః. 7.

యవలు, పెసలు, పొట్లకాయ, కటువు, రూక్షము అగు అన్నము, ఛర్దిరక్తస్రావము మున్నగునవి గళగండమునందు హితకరములు. కడుగునీటితో ఆముదపు గింజలను మోదుగువేళ్లను నూరి లేపనచేసిన గళగండములు నశించును. ఆవాలు మునగవిత్తులు జనపవిత్తులు అవిసె యవలు ముల్లంగివిత్తులు వీటినన్నిటిని పులిమజ్జిగతోనూరి లేపనచేసినను ఉంచినను గండములు కణుతులు భయంకరములగు గళగండములు ఈలేపనవలన శీఘ్రముగా నశించును. ప్రాతసొరకాయరసములో అంటుప్పు సైంధవలవణములను చేర్చి నస్యవిధి చేసిన తరుణములగు గలగండములు నశించును. సందియము లేదు. జలోత్పన్నమగు చంగల్వకోష్ఠును కాల్చి గోమూత్రములో వైచికొని త్రాగినను కొఱ్ఱలను తినినను గళగండములు నశించును.

## తుంబీతైలాదులు.

శ్లో. తిక్తాలాబుఫలే పక్వే సప్తాహముషితం జలం, మద్యం వా గళగండఘ్నం పానాత్పథ్యానుసేవినః. 8. కట్ఫలచూర్ణాన్తర్గలవర్తో గళగండమపహరతి, ఘృతమిశ్రం పీతమివ శ్వేతగిరికర్ణికామూలం. 9. మహిషీమూత్రవిమిశ్రం లోహమలస్థితం ఘటే మాసం, అన్తర్గూఢమవిదగ్ధం లిహ్యాన్మధునాథ గళగండే. 10. జిహ్వాయాః పార్శ్వతోఽధస్తాచ్ఛిరా ద్వాదశ కీర్తితాః, తాసాం స్థూలశిరే ద్వేఽథ ఛిన్ద్యాత్తే చ శనైశ్శనైః. 11. బడిశేనైవ సంగృహ్య కుశపత్రేణ బుద్ధిమాన్, స్రుతే రక్తే వ్రణే తస్మిన్దద్యాత్సగుడమార్ద్రకం. 12. భోజనం చానభిష్యన్ది యూషః కౌలత్థ ఇష్యతే, కర్ణయుగ్మబహిస్సంధిమధ్యాభ్యాసే స్థితం చ

యత్. 13. ఉపర్యుపరి తచ్ఛిన్ద్యాద్గలగండే శిరాత్రయం, విడంగక్షార సింధూగ్రరాస్నాగ్నివోష్యపదారుభిః. 14. కటుతుంబీఫలరసైః కటుతైలం విపాచయేత్, చిరోత్థమపి నశ్యేత గళగండం నివారయేత్. 15.

పక్వమైన చేదుసొరకాయలో నాలుగురోజులుంచిన నీటిని గాని కల్లును గాని త్రాగి పథ్యభోజనముఁ జేసినచో గళగండములు నశించును. కట్ఫలచూర్ణమును నల్లదింటెనతో నూరి గాని శ్వేతగోకర్ణి వేళ్లరసములో నేయిని వేసికొని త్రాగినగాని గళగండములు నశించును. మండూరను మేకమూత్రము కుండలో నుంచి ఒక నెలయైన పిమ్మటపాక బయటికిరానట్లు దగ్ధము చేయవలయును. పిమ్మట తేనెలో కలిపి దీనిని సేవించిన గళగండములకు మిక్కిలిహితమగును. రెండు చేవుల వెంబడి సంధుల నడుమను సమీపమునను మీదనున్న నాడులను మూడిటినైనను ఛేదింపవలయును. వాయువిడంగములు యవక్షారము సైంధవలవణము సన్నరాస్న వస చిత్రమూలము శొంఠి మిరియములు పిప్పళ్లు దేవదారువు చేదసొరరసము వీటిలో ఆవనూనెను పక్వముచేసి నస్యవిధి చేసినను గళగండములు నశించును.

## అమృతాద్యఘృతము.

శ్లో. తైలం పిబేచ్చామృతవల్లీనింబహింస్రాహ్వయా వృక్షకపిప్పలీభిః, సిద్ధం బలాభ్యాం చ సదేవదారు హితాయ నిత్యం గళగండరోగీ. 16. మాక్షికాఢ్యః సకృత్పీతః క్వాథో వరుణమూలజః, గండమాలాం నిహన్త్యాశు చిరకాలానుబంధినీం. 17. పిష్టా జ్యేష్ఠాంబునా పేయాః కాంచనారత్వచః శుభాః, విశ్వభేషజసంయుక్తా గండమాలాపహాః పరాః. 18. ఆరగ్వధశిఫాక్షిప్తం పిష్ట్వా తండులవారిణా, సమ్యఙ్నస్యప్రలేపాభ్యాం గండమాలాం సముద్ధరేత్. 19. గండమాలామయార్తానాం నస్యకర్మణి యోజయేత్, నిర్గుండ్యాశ్చ శిఫాం సమ్యగ్వారిణా పరివేషితాం. 20.

తిప్పతీగె వేప అమ్లవేతము పిప్పళ్లు చిన్నముత్తువపులగము పెద్దముత్తువపులగము దేవదారువు వీటితో సిద్ధముచేసిన తైలమును గళగండరోగి త్రాగవలయును. ఉలిమిరివేళ్ల కషాయములో తేనెను వేసికొని యొకమారు త్రాగిన చాలరోజులనుండి యుండిన గలగండములను నశించును. కాంచనారచూర్ణమును బియ్యపుకడుగుతో శొంఠిచూర్ణమును వైచికొని త్రాగిన గళగండములు నశించును. అమ్లవేతసపువేళ్లను బియ్యపునీళ్లతో

నూరి చక్కగా నస్యవిధినిన్నీ లేపనములను చేసిన గలగండములు నశించును. నల్లవావిలిని నీటితో చక్కగానూరి గండమాలతో పీడింపఁబడెడు వారికి నస్యకర్మముగా నుపయోగింపవలయును.

## కోశాతకీనస్యము.

శ్లో. కోశాతకీనాం స్వరసేన నస్యం తుంబ్యాస్తు వా పిప్పలిసంయుతేన, తైలేన వార్క్షభవేన కుర్యా ద్వచోపకుల్యే సహమాక్షికేణ. 21. ఐంద్ర్యా వా గిరికర్ణ్యా వా మూలం గోమూత్రయోగతః. గండమాలాం హరే త్శీఘ్రం చిరకాలోత్థితా మపి. 22. అలంబుషా దళోద్భూతాత్స్వరసా ద్వ్యపలే పిబేత్, అపచ్యాగండమాలాయాః కామలాయాశ్చ నాశనః. 23. గళగండగండమాలాకురండాంశ్చ వినాశయేత్, పిష్టం జ్యేష్ఠాంబునా మూలం లేపాద్బ్రాహ్మణయష్టికం. 24.

తక్కోలపురసముతోగాని చేదసొరఁకనుతోగాని పిప్పలిని చేర్చిగాని తేనెతో వస పిప్పళ్లనుగాని నూరి నస్యవిధి నుపయోగింపవలయును. శ్వేతగోకర్ణి వేళ్లను గోమూత్రముతో నూరి త్రాగిన చిరకాలమైన గండమాలలనుగూడ పోఁగొట్టును. గంటుభారంగిని బియ్యపుకడుగుతో నూరి లేపనచేసినచో గలగండములును గండమాలలును నశించును.

## చుచుందరీశాఖోటకబింబ్యాది తైలము.

శ్లో. అభ్యంగా న్నాశయే న్నౄణాం గండమాలాం సుదారుణామ్, ఛుచుందర్యా విపక్వం తు తిలానా తైలవరం ధ్రువమ్. 25. గళగండాపహం తైలం సిద్ధం శాఖోటకత్వచా, బింబ్యాశ్వమారనిర్గుండీసాధితం చాపి నావనమ్. 26.

చుచుందరీతైలమును రుద్దిన భయంకరములగు గండమాలలు శీఘ్రముగా నశించును. శాఖోటవృక్షపుబెరడుతో తయారుచేసిన లేక చేదుసొర గన్నేరు వావిలి వీటితోసాధించిన తైలమును నస్యముగా నుపయోగించినను గలగండరోగములు శాంతిల్లును.

## నిర్గుండీతైలము.

శ్లో. నిర్గుండీస్వరసే చాథ లాఙ్గలీ మూల కల్కితమ్,
తైలం నస్యా న్నిహన్త్యాశు గండమాలాం సుదారుణామ్. 27.

వావిలి రసములోను పాతిగడ్డ కల్కమునందును సిద్ధము చేసిన తైలము భయంకరములగు గండమాలలనుకూడ పోఁగొట్టును.

## కార్పాసికాపూపాదులు.

శ్లో. వనకార్పాసికామూలం తండులైస్సహ యోజితమ్, పక్త్వా తు పూపికాం ఖాదే దపచీనాశనాయ తు. 28. శోభాంజనం దేవదారు కాంజికేన తుపేషితమ్, కోష్ణం ప్రలేపతోహన్యాదపచీ మతి దుస్తరామ్. 29. సర్షపారిష్టపత్రాణి దగ్ధ్వా భల్లాతకైస్సహ, ఛాగమూత్రేణ సంపిష్టమపచీఘ్నం ప్రలేపనమ్. 30. అశ్వత్థకాష్ఠంనిచులం గవాం దంతం చ దాహయేత్, వారాహమజ్జసంయుక్తం భస్మహన్త్యపచీవ్రణాన్. 31. పార్ష్ణిం ప్రతి ద్వాదశ చాఙ్గులాని భిత్వేన్ద్రవస్తిం పరివర్జ్య శిల్పీ సమ్యక్, విదార్య మత్స్యాండనిభాని వైద్యో నికృష్య జాలాన్యనలం విదధ్యాత్. 32. మణిబంధోపరిష్టాద్వా కుర్యాద్రేఖాత్రయం భిషక్, అంగుళ్యన్తరితం సమ్యగపచీనాం ప్రశాన్తయే. 33. బంధోత్పలాభవం మూలం బద్ధం పుష్యేఽపచీంజయేత్, అపామార్గస్య వా ఛిన్ద్యాజ్జిహ్వా తలగతే శిరే. 34.

అడవి ప్రత్తివేళ్ల నుబియ్యముగంజితో పూరీగ చేసిపక్వముచేసితినినచో అపచీ రోగములు నశించును. మునగ దేవదారువులను గంజితోనూరి వెచ్చఁజేసి లేపనఁజేసినభయంకరములైన అపచీరోగములునునశించును. ఆవాలు వేప జీడివిత్తులుకలిపి భస్మముచేసి మేకపాలతో నూరి లేపనచేసినను మంచిదియే. రావిచెక్కను జలవేతమును ఆవుపంటిని కాల్చి పందిమజ్జిగతో చేర్చి లేపనచేసినను అపచీరోగములు నశించును. ఇంద్రవస్తివిషయములో క్రిందపండ్రెండు అంగుళములు వదిలిపెట్టి చేపగ్రుడ్డు వలె తోలచి నిప్పు నంటింపవలయును. లేనిచో మణిబంధముమీదను అంగుళుల సందులలోను మూడురేఖలను అంటింపవలయును. అపచీరోగము శాంతించుటకై పుష్యనక్షత్రములో నాటిన సహదేవచెట్టు వేరు నుపయోగింపవలయును.

## వ్యోషాద్యతైలము.

శ్లో. వ్యోషం విడంగం మధుకం సైంధవం దేవదారు చ,
తైలమేతైశ్శృతం నస్యాత్కృచ్ఛ్రామప్యపచీం జయేత్. 35

త్రికటుకములు వాయువిడంగము యష్టిమధుకము సైంధవలవణము దేవదారువు వీటికషాయముతో సిద్ధముచేసిన తైలము భయంకరములగు నపచీరోగములనైనను పోగొట్టును.

## చందనాద్యతైలము.

శ్లో. చందనం సాభయా లాక్షా వచా కటుకరోహిణీ,
ఏతై స్తైలం శృతం పీతం సమూలా మపచీం జయేత్. 36

చందనము కరక్కాయలు లక్క వస కటుకరోహిణి వీటితైలము నిర్మూలముగా నపచీరోగములను పోగొట్టును.

## గుంజాద్యతైలము.

శ్లో. గుంజా హయారిశ్యామాక సర్షపైర్మూత్రనాధితమ్, తైలం తు దశధావశ్చాత్కాలా లవణపంచకమ్. 37. మరిచైశ్చూర్ణితై ర్యుక్తం సర్వావస్థాగతాం జయేత్, అభ్యంగా దపచీముగ్రాం వమీకార్శోర్బుద వ్రణాన్. 38.

చిరసెనగలు గన్నేరు నల్లతెగడ జిల్లేడు ఆవాలు వీటితో నిప్పళ్లు పంచలవణములు మిరియముల చూర్ణముతో సిద్ధముచేసిన తైలమును రుద్దిన అన్నివిధములగు నపచీరోగములును మూలరోగములు నశించును.

## గ్రంధులందు శోధనక్రియలు.

శ్లో. గ్రంథిష్వామేషు కుర్వీత భిషక్శోథప్రతిక్రియామ్, పక్వానాపాట్య సంశోధ్య రోపయే ద్వ్రణభేషజైః. 39 హింస్రారోహిణ్యమృతా చ భార్గీ శ్యామాఃబిల్వ గురుకృష్ణగంధాః, గోపిత్తపిష్టాస్సహతాశ్చ గ్రంథౌ విధేయోఽనిలజే ప్రలేపః. 40. జలౌకసాః పిత్తకృతే హితాస్తు క్షీరోదకాభ్యాం పరిషేచనం చ, కాకోలివర్గస్య తు శీతలాని పిబేత్కషాయాణి సశర్కరాణి. 41. ద్రాక్షారసేనేక్షురసేన వాపి చూర్ణం పిబేద్వాపి హరీతకీనాం, మధూకజంబ్వర్జునవేతసానాం త్వగ్భిః ప్రదేహానవతారయేచ్చ. 42. కృతేషు దోషేషు యథానుపూర్వ్యా గ్రంథౌ భిషక్ శ్లేష్మసముత్థితే తు. 43. స్విన్నే చ విమ్లాపన మేవ కుర్యా దఙ్గుష్ఠరేణుద్రుషదీసుతైశ్చ.

పచ్చిగ్రంధులను వాపును పోగొట్టుచికిత్సను చేయవలయును. పక్వములగు వానిని శోధించి గాయపులెపొషధులతో అంకురింపజేయవలయును. కటామాంసి కటుకరోహిణి తిప్పతీగె గంటుభారంగి శ్యామాకము మారేడు అగురు వీటిని గోపిత్తముతో నూరి వాతగ్రంధులకు లేపనమును చేయువలయును. పిత్తగ్రంధులయందు జలక్రియ

హితకరము. పాలు నీళ్లు వీటితో సేచనచేయుట, కాకోలిగణపుఔషధుల కషాయము ను చల్లార్చి చక్కెరతో కలిపి సేవించుటయును హితకరములు. కరక్కాయచూర్ణమును ద్రాక్షరసముతో గాని ఇక్షురసముతో గాని త్రాగవలయును. మధుకము నేరేడు మున్నగు వానిని నూరి పైనిపట్టింపవలయును. దోషముల ననుసరించి చికిత్సలను చేయుచుం డవలయును. ఇట్లుచేసినపిమ్మట కఫగ్రంథులను స్వేదముచేయించి ఆపిమ్మట అంగుష్ఠము ను దుమ్ముతోను చిన్నరాలతోను విమ్లాపనము చేయవలయును.

### వికంకతాది లేపము.

శ్లో. వికంకతారగ్వధకాకణన్తీ కాకాదనీ తాపసవృక్షమూలైః, ఆలేపయేదేనమలాబుభార్గీ కరంజకాలామదనైశ్చ విద్వాన్. 44. దన్తీ చిత్రకమూలత్వక్సుధార్కపయసీ గుడః, భల్లాతకాస్థికాసీసం లేపోభిన్ద్యాచ్ఛిలామపి. 45. గ్రన్థ్యర్బుదాదిజిల్లేపో మాంత్ర్యావాహకకీటజః, సర్జికామూలకక్షారః శంఖచూర్ణసమన్వితః, ప్రలేపో విహితస్తీక్ష్ణో హన్తిగ్రన్థ్యర్బుదాదికాన్. 46.

ములుదంతి రేల ఎఱ్ఱచిందసెనగ అడవిదొండ ఇంగుదీవృక్షమువేళ్లు వీటితోను సొరకంటుభారంగి నల్లతెగడ ఉమ్మెత్తకాయ వీటితోను లేపనములను చేయించినను, దంతి చిత్రమూలము వేళ్లు జముడుపాలు బెల్లము జీడివిత్తనములు కాసీసము వీటితో లేపనచేయించినను రాళ్లైనను తెగిపోవును. బురదలో తిటిగెడి పురుగులు మునగి యవక్షారము శంఖచూర్ణము వీటిని నూరి లేపనచేసినను గ్రంథులు మున్నగునవి నశించును. మర్మస్థలము తప్ప తక్కినచోట్ల పుట్టి-పక్వముకానట్టి-గ్రంథులను కాల్చవలయును.

### గ్రంథిపాచన విధి.

శ్లో. గ్రంథీనమర్మప్రభవానపక్వానుద్ధృత్య వాగ్నిం విదధీత వైద్యః, క్షారేణ వైతాన్ప్రతిసారయేత్తు సంలిఖ్య సంలిఖ్య యథోక్తదేశమ్. 47. గ్రంథ్యర్బుదానాం నయతోవిశేషః ప్రదేహహేత్వాకృతి దోషదూష్యైః, తతశ్చికిత్సేద్భిషగర్బుదానివిధానవిద్గ్రంథిచికిత్సితేన. 48. వాతార్బుదేచాప్యుపనాహనాని స్నిగ్ధైశ్చ మాంసైరథ వేశవారైః, స్వేదం విదధ్యాత్కుశలస్తు నాడ్యా శృంగేణ రక్తం బహుశోహరేచ్చ. 49. స్వేదోపనాహామృదవస్తుపథ్యాః పిత్తార్బుదే కాయవిరేచనాని, విఘృష్య చోదుంబరశాకగోజీపత్రైః భృశం క్షౌద్రయుతైః ప్రలింపేత్. 50.

శ్లక్ష్ణీకృతై స్సర్జరసప్రియంగుపతంగలోధ్రార్జునయష్టికాహ్వైః, లేపనం శంఖచూర్ణేన సహామూలకభస్మనా, కఫార్బుదాపహం కుర్యాద్గ్రంథ్యాదిషు విశేషతః. 51.

వైద్యోపదేశము ననుసరించి క్షీరక్షారములతో ప్రతిసారణమును చేయవలయును. ప్రదేశమును కారణమును ఆకారమును దోషములను దూష్యములను గుర్తెఱిగి వైద్యుఁడు అర్బుదరోగమునకు చికిత్సను చేయవలయును. వాతార్బుదమునందు ఉపనాహమును స్వేదమును స్నిగ్ధములగు మాంసము నుపయోగింపవలయును. వైద్యుఁడు నేర్పరియై నాళములకు చెమ్మటను పట్టించుచుండవలయును. శృంగములద్వారా రక్తమును విస్తారముగా వెడలింపవలయును. పిత్తార్బుదములందు స్వేదమిచ్చుట పెడకట్టుట మెల్లగా ప్రవర్తింపించుటయును చేయవలయును. మేడి, గడ్డి మొదలగువానికొమ్మలు మొదలగువానిచే గీఱి పిమ్మట సర్జరసము ప్రియంగువు లొద్దుగ రక్తచందనము అర్జునవృక్షము యష్టిమధుకము వీటిని తేనెతో నూఱి పట్టు వేయవలయును. కఫార్బుదమునందును గ్రంథి మున్నగువానికిని శంఖచూర్ణమును మునగభస్మమును కలిపి లేపనము చేయవలెను.

## నిష్పావాది లేపనములు.

శ్లో. నిష్పావపిణ్యాకకులుత్థకల్కైర్మాంసప్రగాఢైర్దధిమస్తుయుక్తైః, లేపం విదధ్యాత్క్రిమయో యథాత్ర ముంచన్త్య పత్యాన్యథ మక్షికా వా. 52. అల్పావశేషం క్రిమిభిః ప్రజగ్ధం లిఖేత్తతోఽగ్నిం విదధీత పశ్చాత్, యదల్పమూలం త్రపుతామ్రసీస సంవేష్ట్య పత్రైరథ వాఽయసైర్వా. 53. క్షారాగ్నిశస్త్రాణ్యవతారయేచ్చ ముహుర్ముహుః ప్రాణమవేక్షమాణః, యదృచ్ఛయా చోపగతాని పాకం పాకక్రమేణోపచరేద్యథోక్తమ్. 54. ఉపోదికారసాభ్యక్తా స్తత్పత్రపరివేష్టితాః, ప్రణశ్యన్త్యచిరాన్నౄణాం పిడకార్బుదజాతయః 55. ఉపోదికా కాంజికతక్రపిష్టా తయోపనాహో లవణేన మిశ్రః, దృష్టోఽర్బుదానాం ప్రశమాయ కైశ్చిద్దినే దినే వా త్రిషు మర్మజానామ్.51. లేపోఽర్బుదజిద్రంభామోచకభస్మ తుషశంఖచూర్ణకృతైః, సరటామధిరార్ద్రీకగంధకయవబిడంగనాగరైర్వాథ. 57. స్నుహీగండీరకాస్వేదో నాశయేదర్బుదాని చ, సీసకేనాఽథ లవణైః పిండారకఫలేన వా. 58. హారిద్రాలోధ్రపత్తుంగగృహధూమమనశ్శిలాః, మధుప్రగాఢో లేపోఽయం మే

దోర్బుదహరః పరః. 59. ఏతామేవ క్రియాం కుర్యాదశేషాం శర్క రార్బుదే. 60

అసుములు పిణ్యాకము ఉలవలు నీటికల్కమును మాంసమును పెరుగుతో మర్దించి లేపన చేయవలయును. పురుగులవలన తినఁబడి కొంచెముగా మిగిలిన దానిని కాల్చివేయవలయును. ఇంకను మిగిలినచో వంగము రాగి సీసము నీటి రేకులతో చుట్టి క్షారము అగ్ని శస్త్రచికిత్సలను చేయవలయును. దైవయోగమున పక్వమైనదానిని క్రమముగా చికిత్స చేయవలయును. ఉల్లిరసముతో తడిపి ఆయాకులతో చుట్టిపెట్టిన పురాతనములైనను అర్బుదజాతి నశించును. మర్మజమగు అర్బుదము వీనితో మూడేసిగోజాలు కట్టుచుండుటచేత నశించును. అరటి చాగవృక్షములబూడిద శంఖభస్మము వీటితో లేపనచేసినను అర్బుదములు నశించును. జెముడుపాలు కాషజెముడు స్వేదము అర్బుదములను పోగొట్టును. దిరిసెనలసణముగాని పిండీతకపు ఫలమునుగాని నూరి లేపనచేసినచో అర్బుదములు నశించును. పసపు లొద్దుగ రక్తచందనము ఇంటిబూజు మనశ్శిల వీటిలో తేనెను వైచి నూరి, లేపనము చేసినచో అర్బుదములు నశించును. శర్కరార్బుదరోగములకు ఈపైని చెప్పిన చికిత్సల నన్నిటిని చేయవలయును.

ఇట్లు చక్రదత్తయందు గళగండాధికార ప్రకరణము ముగిసెను.

---

# ౪౧. శ్లీపదాధికారము.

## శ్లీపదమున సామాన్య చికిత్సలు.

శ్లో. లంఘనాలేపనస్వేదరేచనైః రక్తమోక్షణైః, ప్రాయశ్శ్లేష్మహరై రుష్ణైః శ్లీపదం సముపాచరేత్. 1. ధత్తూరైరండనిర్గుండీ వర్షాభూశిగ్రు సర్షపైః, ప్రలేపః శ్లీపదం హన్తి చిరోత్థ మతిదారుణమ్. 2. పిప్పిష్టమారనాలేన రూపికామూలవల్కలమ్, ప్రలేపాచ్ఛ్లీపదం హన్తి బద్ధమూల మథోద్వృతమ్. 3. పిండారకతరుసంభవ వందాకశిఫా జయతి సర్పిషా పీతా, శ్లీపద ముగ్రం నియతం బద్ధ్వా సూత్రేణ జంఘాయాం. 4. హింతశ్చాలేపనే నిత్యం చిత్రకో దేవదారు వా, సిద్ధార్థశిగ్రుకల్కో వా సుఖోష్ణో మూత్రపేషితః. 5. స్నేహస్వేదోపనాహాంశ్చ శ్లీపదేఽనిలజే భిషక్, కృత్వా గుల్ఫోపరిశిరాం విధ్యేత్తు చతురంగుళే. 6.

గుల్ఫస్యాధః శిరాం విధ్యే చ్ఛ్లీపదే పిత్తసంభవే, పిత్తఘ్నీం చ క్రియాం కుర్యాత్పిత్తార్బుదవిసర్పవత్. 7. మంజిష్ఠాం మధుకం రాస్నాం సహిం స్రాం సపునర్నవామ్, పిష్ట్వారనాళై ర్లేపోయం పిత్తశ్లీపద శాన్తయే. 8. శిరాం సువిదితాం విధ్యేదంగుష్ఠే శ్లేష్మశ్లీపదే. మధుయుక్తాని చాభ క్ష్ణం కషాయాణి పిబేన్నరః. 9. పిబేత్సర్షప తైలేన శ్లీపదానాం నివృత్తయే, పూతీకరంజచ్ఛదజం రసం వాపి యథాబలమ్. 10.

లంఘనము లేపనము స్వేదనము విరేచనము రక్తస్రావణము కఫనాశక పదార్థములను సేవించుట నను వీనిచేత శ్లీపదరోగమునకు చికిత్సం జేయవలయును. ఉమ్మెత్త ఆముదము వావిలి గలిజేరు మునగ ఆవాలు వీటిని నూరి లేపన చేసిన ప్రాతబడిన శ్లీపదములను కూడ నశింపం జేయును. జిల్లేడువేళ్లను గాని ప్రత్తివేళ్లను గాని గంజితో నూరి లేపనచేసిన శ్లీపదము మొదలంట నశించును. మంగ వేళ్లు వందాకవేళ్లు నూరి నేతితోకలిపి త్రాగిన మొలత్రాటిలో నెల్లప్పుడును కట్టుకొని యున్నను శ్లీపదములు నశించును. చిత్రమూలము దేవదారువులు యొక్క గాని ఆవ మునగలయొక్క గాని కల్కమును గోమూత్రముతో నూరి వెచ్చజేసి లేపన చేసిన హితమగును. వాతశ్లీపదములందు స్నేహము స్వేదము ఉపనాహమును వైద్యుండు చేయుచుండవలయును. పిత్తశ్లీపదమునందు గుల్ఫమునకు క్రిందనాడులను ఛేదింపవలయును. పిత్తార్బుదము పిత్తవిసర్పి వీట్లకు చేసినట్లు ఇందు చికిత్సను చేయవలయును. మంజిష్ఠ యష్టిమధుకము సన్నరాష్ట జటామాంసి గలిజేరు వీటిని గంజితో నూరి లేపనచేసిన పిత్తశ్లీపదములు నశించును. కఫశ్లీపదమునకు అంగుష్ఠమునందు చక్కగా గుర్తించి నాడీచ్ఛేదనము జేయవలయును. మధుయుక్తములగు కషాయములను పిచ్చుటం ద్రాగవలయును. లేనిచో శ్లీపదరోగశాంతికై నేమలిఅడుగుఆకులరసమును తైలముతో త్రాగవలయును.

## వృద్ధదారక చూర్ణము.

శ్లో. అనేనైవ విధానేన పుత్రజీవకజం రసమ్, కాంజికేన పిబే చ్చూర్ణం మూత్రై ర్వా వృద్ధదారజమ్. 11. రజనీం గుడసంయుక్తాం గోమూత్రేణ పిబే న్నరః, హన్తి శ్లీపదం హన్తి దద్రుకుష్ఠం విశేష తః. 12. గంధర్వతైలభృష్టాం హరీతకీం గోజలేన యః పిబతి, శ్లీపద బంధనముక్తో భవ త్యసౌ సప్తరాత్రేణ. 13. ధాన్యామ్లం తైలసంయుక్తం కఫవాతవినాశనమ్, దీపనం చామదోషఘ్న మేత చ్ఛ్లీపదనాశనమ్. 14. గోధావతీమూలయుక్తాం ఖాదే న్మాహేంద్రరీం నరః, జయే

శ్లీపదకోపోత్థం జ్వరం సద్యో న సంశయః. 15. శ్లీపదఘ్నో రసో భ్యాసా ద్గుడూచ్యా స్తైలసంయుతః, త్రికటు త్రిఫలా చవ్యం దార్వీ వరుణగోక్షురమ్. 16. అలంబుషాం గుడూచీం చ సమభాగాని చూర్ణయేత్, సర్వేషాం చూర్ణ మాహృత్య వృద్ధదారస్య తత్సమమ్. 17. కాంజికేన చ తత్పేయ మక్షమాత్రం ప్రమాణతః, జీర్ణే చాపరిహారం స్యా ద్భోజనం సర్వకామికమ్. 18. నాశయే చ్ఛ్లీపదం స్థౌల్య మామవాతం సుదారుణమ్, గుల్మ కుష్ఠానిలహరం వాతశ్లేష్మజ్వరాపహమ్. 19.

ఇదేవిధముగా (పుత్రజీవి) లక్ష్మణపంజిరసమును త్రాగివిదారీచూర్ణమును గంజితోగాని గోమూత్రముతోగాని త్రాగవలయును. పసపును గోమూత్రముతో త్రాగినచో ఒకవర్షపు శ్లీపదమును కుష్ఠమునశించును. తెల్లఆముదపు తైలమునందు వేఁచిన కరక్కాయలను గోమూత్రముతో సేవించిన వాఁడు ఏడురోజులతో శ్లీపదబాధనుండి విముక్తుఁడగును. తైలమునుచేర్చిన గంజి కఫవాతములను పోఁగొట్టును. దీపనముఁజేయును. ఆమదోషమును పోగొట్టును. చెప్పుటట్టాకుతో కాకమిసుపరసమును సేవించిన శ్లీపదజమగు రోగము మిగుల త్వరలో నశించును. తిప్పతీగెరసములో తైలమును వేసికొని దినము సేవించుచుండిన శ్లీపదములు నశించును. శొంఠి మిరియములు త్రిఫలములు పిప్పళ్లు చవ్యము మ్రానిపసుపు పల్లేరు తిప్పతీగె వీటిని సమానభాగములుగా తీసికొని చూర్ణమును చేసి దానితో సమానముగా నేలగుమ్ముడుచూర్ణమును ఒక్కతులమంత గంజితోకలిపి త్రాగవలయును. జీర్ణించినపిమ్మట అన్నిపదార్థములను భుజింపవచ్చును. భయంకరమగు నామవాతము శ్లీపదము మున్నగునవి నశించును.

### పిప్పల్యాదిచూర్ణము.

శ్లో. పిప్పలీ త్రిఫలా దారు నాగరం సపునర్నవం, భాగై ర్ద్విపలికై రేషాం తత్సమం వృద్ధదారకం. 20. కాంజికేన పిబే చ్చూర్ణం కర్షమాత్రం ప్రమాణతః, జీర్ణే చాపరిహారం స్యా ద్భోజనం సర్వకామికం. 21. శ్లీపదం వాతరోగాం శ్చ హన్యా త్ప్లీహాన మేవ చ, అగ్నిం చ కురుతే ఘోరం భస్మకం చ నియచ్ఛతి. 22.

పిప్పళ్లు త్రిఫలములు దేవదారువు శొంఠి గలిజేరు వీటిని రెండుపలములచొప్పున వీటిఅంతతో సమానముగా సముద్రపాల చూర్ణముచేసి కాలుపలమును గంజితో త్రాగి జీర్ణించినపిమ్మట ఇష్టమువచ్చినట్లుల భుజించినచో శ్లీపదములను వాతరోగములను పోగొట్టును, జఠరాగ్నిని కలిగించును,

### కృష్ణాద్యమోదకము.

శ్లో. కృష్ణాచిత్రకదన్తీనాం కర్ష మర్ధపలం పరం, వింశతి శ్చ హారీతక్యో గుడస్య తు పలద్వయం,మధునా మోదకం ఖాదే చ్ఛ్లీపదం హన్తి దుస్తరం. 23.

పిప్పళ్లు చిత్రమూలము దంతి ఇవి ఒక్కొక్కకాలు పలమును, కరక్కాయలు ఇరువదియును, బెల్లము రెండు పలములును చూర్ణము చేసి తేనెతో మాత్రలను కట్టి తినిన భయంకరములగు శ్లీపదములు నశించును.

### సౌరేశ్వరఘృతము.

శ్లో. సురసాం దేవకాష్ఠం చ త్రికటు త్రిఫలే తథా, లవణాన్యథ సర్వాణి విడంగాన్యథ చిత్రకం. 24. చవికా పిప్పలీమూలం గుగ్గులు ర్హపుషా వచా, యవాగ్రజం చ పాఠా చ శఠ్యేలా వృద్ధదారుకం. 25. కల్కైశ్చ కార్షికై రేభి ర్ఘృతప్రస్థం విపాచయేత్, దశమూలీకషాయేణ ధాన్యయూషద్రవేణ చ. 26. దధిమండసమాయుక్తం ప్రస్థం ప్రస్థం పృథక్పృథక్, పక్వం స్వాదు ఘృతం కల్క త్పిబే త్కర్షత్రయం హవిః. 27. శ్లీపదం కఫవాతోత్థం మాంసరక్తాశ్రితం చ యత్. మేదశ్శ్రితం చ పిత్తోత్థం హన్యా దేవ న సంశయః. 28. అపచీం గండమాలాం చ అన్త్రవృద్ధిం తథార్బుదం, నాశయే ద్గ్రహణీదోషం శ్వయథుం గుదజాని చ, పర మగ్నికరం హృద్యం కోష్ఠక్రిమివినాశనమ్, ఘృతం సౌరేశ్వరం నామ శ్లీపదం హన్తి సేవితం. 30. జీవకేన కృతం హ్యేత ద్రోగానీకవినాశనమ్.

సురస దేవదారువు శొంఠి మిరియములు పిప్పళ్లు త్రిఫలములు పంచలవణములు వాయువిడంగములు చిత్రమూలము చవ్యము మోడి గుగ్గిలము బోడతరము వస యవక్షారము అగరుశొంఠి కచ్చూరము ఏలకులు వృద్ధదారకము వీటినొక్కొక్కతులము చొప్పున తీసికొని కల్కముచేసి ఇందు 16 పలముల నేతిని పక్వము చేయవలయును. దశమూలముల కషాయముతోను ధనియముల యూషరసముతోను దధిమండము తోను వేర్వేరుగా నొక్కొక్క ప్రస్థము చొప్పున నేతిని పక్వము చేసి మూడుతులములు త్రాగవలయును. కఫవాతశ్లీపదములను మాంసరక్తాశ్రితమగు శ్లీపదమును పిత్తపు శ్లీపదమును నశింపఁ జేయును. అపచీ గండమాల అంత్రవృద్ధి అర్బుదము గ్రహణీదోషము వాపులను ఇయ్యది పోఁగొట్టును. ఇయ్యది సౌరేశ్వరమను ఘృతము.

విడంగాదిచూర్ణము.

శ్లో. విడంగమరిచార్కేషు నాగరే చిత్రకే తథా. 31. భద్రదార్వేలకాఖ్యేషు సర్వేషు లవణేషు చ, తైలం పక్వం పిబేద్వాపి శ్లీపదానాం నివృత్తయే. 32.

వాయువిడంగములు మిరియములు అర్కపత్రము శొంఠి చిత్రమూలము తుంగముస్తెలు మ్రానిపసపు ఏలకులు లవణములు వీటియందు పక్వముచేసిన తైలమును సేవించినను శ్లీపదములను పోగొట్టును.

ఇట్లు చక్రదత్తయందు శ్లీపదాధికారప్రకరణము ముగిసెను.

# ౪౩. విద్రధ్యధికారము.

విద్రధికి సామాన్యోపాయములు.

శ్లో. జలౌకాపాతనం శస్తం సర్వస్మిన్నేవ విద్రధౌ, మృదుర్విరేకో లఘ్వన్నం స్వేదః పిత్తోత్తరం వినా. 1. వాతఘ్నమూలకల్కైస్తు వసాతైలఘృతప్లుతైః, సుఖోష్ణో బహులో లేపః ప్రయోజ్యో వాతవిద్రధౌ. 2. స్వేదోపనాహాః కర్తవ్యాః శిగ్రుమూలసమన్వితాః, యవగోధూమముద్గైశ్చ సిద్ధాపిష్టైః ప్రలేపయేత్. 3. విలీయతే క్షణేనైవమపక్వశ్చైవ విద్రధిః, పునర్నవాదారువిశ్వదశమూలాభయాంభసా. 4. గుగ్గులుం రుబుతైలం వా పిబేన్మారుతవిద్రధౌ, పైత్తికం శర్కరాలాజామధుకైః శారివాయుతైః. 5. ప్రదిహ్యాత్ క్షీరపిష్టైర్వా పయస్యోశీరచందనైః, పిబేద్వా త్రిఫలాక్వాథం త్రివృత్కల్కాక్షసంయుతమ్. 6. పంచవల్కలకల్కేన ఘృతమిశ్రేణ లేపనం, యష్ట్యాహ్వా శారిబా దూర్వా నలమూలైస్సచందనైః. 7. క్షీరపిష్టైః ప్రలేపస్తు పిత్తవిద్రధిశాంతయే, ఇష్టకాసికతాలోహగోశకృత్తుషపాంశుభిః. 8. మూత్రపిష్టైశ్చ సతతం స్వేదయేచ్ఛ్లేష్మవిద్రధిమ్, దశమూలకషాయేణ సస్నేహేన రసేన వా. 9. శోథం వ్రణం వా కోష్ణేన సశూలం పరిషేచ

యేత్, త్రిఫలా శిగ్రు వరుణ దశమూలాంభసా పిబేత్. 10. గుగ్గులుం మూత్రయుక్తం వా విద్రధౌ కఫసంభవే, పిత్తవిద్రధివ త్సర్వాం క్రియాం నిరవశేషతః. 11. విద్రధ్యోః కుశలః కుర్యా ద్రక్తాగంతునిమిత్తయోః, శోభాంజనకనిర్యూహో హింగుసైంధవసంయుతః. 12. అచిరం విద్రధిం హంతి ప్రాతఃప్రాత ర్నిషేవితః, శిగ్రుమూలం జలే ధౌతం దరపిష్టం ప్రగాలయేత్. 13. తద్రసం మధునా పీత్వా హంత్యంతర్విద్రధిం నరః, శ్వేతవర్షాభువో మూలం మూలం వరుణకస్య చ. 14. జలేన క్వథితం పీత మపక్వం విద్రధిం జయేత్, వరుణాదిగణక్వాథ మపక్వేఽభ్యంతరోత్థితే. 15 ఊషకాదిప్రతీవాపం పిబేత్సంశమనాయ వై, శమయతి పాఠామూలం, క్షౌద్రయుతం తండులాంభసా పీతమ్. 16. అంతర్భూతం విద్రధి, ముద్ధత మాశ్వేవ మనుజస్య, అపక్వే త్వేత దుద్దిష్టం పక్వేతు వ్రణవత్క్రియా. 17. స్రుతేఽప్యూర్ధ్వమధశ్చైవ మైరేయామ్లసురాసవైః, పేయో వరుణకాదిస్తు మధుశిగ్రురసోఽథవా. 18. ప్రియంగుధాతకీలోధ్రం కట్ఫలం తినిశత్వచం, ఏతైస్తైలం విపక్తవ్యం విద్రధౌ రోపణం పరమ్. 19.

అన్నివిద్రధులకును జలగలను కరిపించుట మంచిది. మృదువుగా విరేచనముఁ జేయించుట స్వేదము నుత్తమములు. వాతహరములగు కల్కములను వెచ్చఁజేసి లేపన చేయుట వాతవిద్రధికి మంచిది. మునగవేళ్లతో స్వేదము నుపనాహమును చేయింప వలయును. యవలు గోధుమలు పెసలు వీటిపిండిని కట్టవలయును. గలిజేరు దేవదారువు శొంఠి దశమూలములు కరక్కాయలు వీటికాథముతో గుగ్గిలమును గాని ఆముదమును గాని వాతవిద్రధియందు త్రాగవలయును. పిత్తవిద్రధికి చక్కెర పేలాలు మధుకము సుగంధిపాల వీటితోగాని పాలు వట్టివేళ్లు చందనము నూరకొనిగాని లేపన చేయవలయును. దశమూలముల కషాయమునుగాని తైలసహితమగు మాంసరసమును గాని కొంచెము వెచ్చఁజేసి శూలసహితములగు వాపులను గాయములను తడుపవలయును. త్రిఫలములు మునగ వరణదశమూలములు వీటికషాయముతోగాని గోమూత్రముతో గుగ్గిలమును గాని కఫవిద్రధికై త్రాగవలయును. మునగకషాయములో ఇంగువ సైంధవలవణములను వైచికొని ప్రాతఃకాలమున నిత్యమును త్రాగుచుండిన విద్రధి శీఘ్రముగ శమించును. అగరుశొంఠివేళ్లను తేనెతో కలిపికొని బియ్యపుకడుగుతో త్రాగిన అతి భయంకరములగు విద్రధులయినను శమించును. ఇయ్యది పక్వముగాని విద్రధి విషయ

ము. ఇక పక్వముఅయినదానిని గాయములకువలెనే యుపచరింపవలయును. క్రిందిమీదికి స్రావముగలవిద్రధులలో మైరేయామ్లసురాసవములగాని వరణాదిగణక్వాథమును గాని మునగరసములో తేనెను చేర్చికొని గాని త్రాగవలయును. కొట్టిలు ధాతకీకుసుమము లొద్దుగ కట్ఫలము అజగిరత్వక్కు వీనితో తైలమునుచేసి విద్రధికిరోపణము చేయవలయును.

ఇట్లు చక్రదత్తయందు విద్రధ్యధికార ప్రకరణము ముగిసెను.

# ౪౩. వ్రణశోధాధికారము.

## వ్రణశోధ కుపాయములు.

శ్లో. ఆద్యం విమ్లాపనం కుర్యా ద్ద్వితీయ మవసేచనం, తృతీయ ముపనాహం చ చతుర్థీం పాటనక్రియాం. 1. పంచమం శోధనం చైవ షష్ఠం రోపణ మిష్యతే, ఏతే క్రమా వ్రణస్యోక్తాః సప్తమో వైకృతాపహః. 2. మాతులుంగాగ్నిమంథౌ చ భద్రదారుమహౌషధం, అహింస్రా చైవ రాస్నా చ ప్రలేపో వాతశోథహా. 3. కల్కైః కాంజికసంపిష్టః స్నిగ్ధః శాఖోటకత్వచః, సుపర్ణఇవ నాగానాం రక్తశోథవినాశనః. 4. దూర్వాచనలమూలంచమధుకంచందనంతథా, శీతలాశ్చగణాస్సర్వే ప్రలేపః పిత్తశోథహా. 5. న్యగ్రోధోదుంబరాశ్వత్థప్లక్షవేతసవల్కలైః, ససర్పిష్కైః ప్రలేప స్స్యా చ్ఛోథనిర్వాపణ స్సృతః. 6. ఆగన్తౌ శోణితోత్థే చ ఏషఏవ క్రియాక్రమః, అజగంధాశ్వగంధా చ కాలాసరలయా సహ. 7. ఏకైషికాజశృంగీ చ ప్రలేపః శ్లేష్మశోథహా, పునర్నవా శిగ్రుదారు దశమూల మహౌషధైః. 8. కఫవాతకృతే శోథే లేపః కోష్ణో విధీయతే, న రాత్రౌ లేపనం దద్యా ద్దత్తం చ పతితం తథా. 9. న చ పర్యుషితం శుష్యమాణం నైవావధారయేత్, శుష్యమాణ ముపేక్షేత ప్రదేహం పీడనం ప్రతి. 10. నచాపి ముఖ మాలింపే త్తేన దోషః ప్రసిచ్యతే, స్థిరా న్మందరుజః శోథా న్స్నేహై ర్వాం కఫాపహైః. 11. అభ్యజ్య స్వేదయిత్వా చ వేణునాడ్యా తతః శనైః,

విమ్లాపనార్థం మృద్నీయా త్తలేనాంగుష్ఠకేనవా. 12. రక్తావసేచనం కుర్యా దాదా వేవ విచక్షణః, శోథే మహతి సంబద్ధే వేదనావతి చవ్రణే.

మొదట వాడ్చుటయును పిమ్మట సేచనము మూడవది ఉపనాహము నాలవది పగల్చుట అయిదవది శోధించుట ఆరవది మాన్చుట అను నీచికిత్సాక్రమము గాయములను చెప్పఁబడినది. ఏడవది వికారనాశకకర్మను చేయుటయైయున్నది. మాదీఫలము తక్కెడు తుంగముస్తెలు దేవదారువు శొంఠి జటామాంసి రాస్నా వీటి లేపము వాతపు వాపులనుపోగొట్టును. బూరుగుచెట్టు చెక్కను గంధితోనూరి కల్కమును చేసి లేపన చేసిన రక్తశోథలు నశించును. గరికె వట్టివేళ్లు యష్టిమధుకము చందను శీతలగణపుటౌషధులు వీటితోనగు లేపము పిత్తవాపులను పోగొట్టును. మఱ్ఱి మేడి రావి జువ్వి ప్రబ్బలి వీటి పట్టలను నేతితోనూరి లేపన చేసిన వాపులు నశించును. ఆగంతుక వ్రణమనను రక్తజ శోథకును ఈచికిత్సనే చేయవలయును. తులసి పెన్నేరు నల్లతెగడ తెగడ ముస్తగు వీటితోనగు లేపనము వాపులను తగ్గించును. గలిజేరు మునగ దేవదారువు దశమూలములు శొంఠి పిట్టిని నెచ్చఁజేసి లేపన చేయుట కఫవాతములకు హితకరము అగును. గాయములపైని పట్టింపరాదు. బొటనవ్రేలితో విమ్లాపనక్రియ రుద్దవలయును. వృద్ధినొందిన వాపులందును వేదనగలుగు వ్రణములందును మొదటనే విచక్షణుఁడైన వైద్యుఁడు రక్తమును వెడలించుచుండవలయును.

## ✦ వ్రణశోథకు రక్తమోచనాదులు. ✦

శ్లో. యోన యాతి శమం లేప స్వేదసేకావతర్పణైః, సోఽపి నాశం వ్రజ త్యాశు శోథ శ్శోణిత మోక్షణాత్. 14. ఏకత శ్చ క్రియా స్సర్వా రక్తమోక్షణ మేకతః, రక్తం హి వ్యమ్లతాం యాతి తచ్చే న్నాస్తి నచాస్తి రుక్. 15. స చే దేవ ముపాక్రాన్తః శోథో న ప్రశమం వ్రజేత్, తస్యోపనాహైః పక్వస్య పాటనం హిత ముచ్యతే. 16. తైలేన సర్పిషా వాపి తాభ్యాం వా శక్తుపిండికా, సుఖోష్ణః శోథపాకార్థ ముపనాహః ప్రశస్యతే. 17. సతిలా సాతసీబీజా దధ్యమ్లా శక్తుపిండికా, సకిణ్వాకుష్ఠలవణా శస్తా స్యా దుపనాహనే. 18. బాలవృద్ధాసహక్షీణభీరూణాం యోషితా మపి. మర్మోపరి చ జాతే చ పక్వే శోథే చ దారుణే. 19. గవాం దన్తం జలేఘృష్టం బిందుమాత్రం ప్రలేపయేత్, అత్యన్తకఠినే చాపి శోథే పాచనభేదనం. 20. కటుతైలాన్వితై ర్లేపా త్సర్వనిర్మోకభస్మభిః, చయః శామ్యతి గండస్య ప్రకో

ప స్స్ఫుటతి ద్రుతమ్. 21. చిరబిల్వాగ్నికౌ దంతీ చిత్రకో హయమారకః, కపోతకంకగృధ్రాణాం పురీషాణి చ దారణం. 22. క్షారద్రవ్యాణి వా యాని క్షారో వా దారణః పరః, ద్రవ్యాణాం పిచ్ఛిలానాం తు త్వఙ్మూలాని ప్రపీడనం. 23. యవగోధూమమాషాణాం చూర్ణాని చ సమాసతః, తతః ప్రక్షాలనం క్వాథః పటోలీనింబపత్రజః. 24. అవిశుద్ధే విశుద్ధే చ న్యగ్రోధాది త్వగుద్భవః, పంచమూలద్వయం వాతే న్యగ్రోధాది శ్చ పైత్తికే. 25. ఆరగ్వధాదికో యోజ్యః కఫజే సర్వకర్మసు.

లేపస్వేదాదులచే నుపశాంతి నొందని శోథరక్తమోక్షణమువలన శీఘ్రముగా నశించుచున్నది. ఒకవైపు సంపూర్ణముగా చికిత్సను చేయుచు రెండవవైపునందు రక్తమును వెడలింపవలయును. రక్తమే వ్రణత్వమునొందును. వ్రణమే కానిచో బాధయే యుండదు. ఇట్టి చికిత్సచేసినను శాంతింపని శోథను ఘృతోపనాహములచే జీర్ణించుట మంచిది. తైలముతో గాని నేతితో గాని రెండింటితో గాని సత్తువును ముద్దజేసి వెచ్చవెచ్చగా కాచుట మంచిది. తిలలు అవిసెవిత్తులు దధి అమ్లము వస కోష్ఠు ఉప్పు వీటితోనైన సత్తుపిండముపనాహమునకు ప్రశస్తము. పిల్లలు ముదుసళ్లు ఓర్వలేనివారు క్షీణించినవారు భయస్వభావులు స్త్రీలు పురుషులు వీరికి మర్మమునందు కలిగిన దారుణమగు శోథమునందును ఆవుదంతమును నీటితో అరగదీసి ఒకబొట్టు లేపనచేసిన అత్యంతకఠినమగు శోథమునందును పాచనముగ కలిగించును. నెలుసుడుచెక్క గాదెడు దంతి చిత్రమూలము గన్నేరు పావురపుపెంట కంకపుపెంట గద్దపెంట వీటిని లేపన చేయుటయును దారణమే యగును. సమస్తద్రవ్యములును క్షారములును భేదించునట్టి వేయగును. యవలు గోధుమలు మినుములు వీటిచూర్ణమును లేపనచేయవలయును. పిమ్మట చేదుపొట్ల వేప కషాయముతో చక్కగా కడుగవలయును. శుద్ధముకాని దానికిని శుద్ధమైన దానికిని న్యగ్రోధాధి కషాయము హితకరము. వాతశోథమునందు దశమూలముల క్వాథము పిత్తశోథలకు న్యగ్రోధాది గణపు కషాయమును కఫశోథమునందు ఆరగ్వధాది కషాయమును హితకరములు అనియందురు.


తిలాష్టకము.

శ్లో. తిలకల్కః సలవణౌ ద్వే హరిద్రే త్రివృద్ఘృతమ్. 26. మధుకం నింబపత్రాణి లేప స్స్యా ద్వ్రణశోధనః.

సన్నిపాతిశోథమునందు తిలలను కల్కముచేసి ఉప్పు పసపు మ్రానిపసపు తెల్లతెగడ నేయి యష్టిమధుకము వేపఆకులు వీటితోనైన లేపనము గాయములనుశోధించును.

### నింబపత్రలేపాదులు.

శ్లో. నింబపత్రం తిలాదన్తీ త్రివృత్సైంధవమాక్షికమ్. 27. దుష్టవ్రణప్రశమనో లేపః శోధనకేసః, ఏకంవా శారిబామూలం సర్వవ్రణవిశోధనః. 28. పటోలం తిలయష్ట్యాహ్వత్రివృద్దన్తీ నిశాహ్వయం, నింబపత్రాణి చాలేపః సపటుః వ్రణశోధనః. 29. త్రిఫలాఖదిరోదార్వీ న్యగ్రోధాదిబలాకుశాః, నింబకోలకపత్రాణి కషాయః శోధనే హితం. 30. అనేన ఘ్రాతిమాంసానాం మాంసస్థానమరోహతామ్, కల్కసంరోపణః కార్యస్తిలానాం మధుకాన్వితః. 31. నింబపత్రమధుభ్యాం తు యుక్తస్సంశోధనః స్మృతః, పూర్వాభ్యాం సర్పిషా వాపి యుక్తశ్చాప్యుపరోహణః. 32. నింబపత్రతిలైః కల్కో మధునా క్షతశోధనః, రోపణః సర్పిషా యుక్తో యవకల్కేప్యయం విధిః. 33. నింబపత్రఘృతక్షౌద్రదార్వీమధుకసంయుతా, వర్తిస్తిలానాం కల్కో వా శోధయేద్రోపయేద్వ్రణమ్. 34

వేపాకు నువ్వులు దంతి తెల్లతెగడ సైంధవలవణము తేనె వీటిని నూరి లేపనచేసిన గాయము మానును. శోధనచేయుటలో సింహముతో నిదిసాటియున్నది. లేదా ఒక్క మరుబాల వేళ్లే సంపూర్ణముగ గాయములను శోధింపగలుగును. చేదుపొట్ల తిలలు మధుకము తెల్లతెగడ పసుపు మ్రానిపసుపు వేపాకు ఉప్పు వీటినిగాని లేపనచేసిన గాయములను శోధించును. త్రిఫలములు కాచు మ్రానిపసుపు న్యగ్రోధాదిగణపుటౌషధములు ముత్తువపులగము కుశలు వేపఆకులు వీటికషాయము శోధనచేయుటలో హితకరము. దుర్గంధమైన మాంసము లేక మాంసస్థానమున నంకురములేని గాయములకు నువ్వులకల్కములో తేనెగలిపి పట్టువేయవలసినది. వేపఆకులను తేనెతో నూరివేసిన వ్రణమును సంశోధించును. నేతితో కలిపిన రోపణముగనుండును. యవకల్కమునకు గూడ నిదియే పద్ధతి. వేపఆకులు నేయి తేనె మ్రానిపసపు మధుకము నీటితో నూరి వత్తిచేసి గాని కల్కము చేసి గాని యుపయోగించిన గాయములను శోధించును. అంకురములనుకూడ పుట్టించును.

### సప్తదళదుగ్ధాదులు.

శ్లో. సప్తదలదుగ్ధకల్కః శమయతి దుష్టవ్రణం ప్రలేపేన, మధుయుక్తా శరపుంఖా సర్వవ్రణరోపణీ కథితా. 35. మానుషశిరఃకపాలం తదస్థి వా లేపయేత మూత్రేణ, రోపణమిదం క్షతానాం యోగశతై

రప్యసాధ్యానామ్ వ్రణాన్విశోధయేద్వర్త్యా సూక్ష్మాస్యాన్మర్మసంధిగాన్. 36. అభయాత్రివృతాదన్తీ లాంగలిమధుసైంధవైః, సుషవీపత్రధత్తూరకర్ణమోటకుశేరకాః.37.పృథగేతే ప్రలేపేనగంభీరవ్రణరోపణాః, పంచవల్కలచూర్ణైర్వా శుక్తిచూర్ణసమన్వితైః. 38. ధాతకీచూర్ణలోధ్రైర్వా తథా రోహన్తితేవ్రణాః, సదాహవేదనావస్త్రవ్రణాయే మారుతోత్తరాః. 39. తేషాం తిలానుమాం శ్చైవ భృష్టాన్పయసి నిర్వృతాన్, తేనైవ పయసా పిష్ట్వా దద్యాదాలేపనం భిషక్. 40. వాతాదిభూతాన్నాస్రావా ధూపయేదుగ్రవేదనాన్, యవాజ్యభూర్జమదన శ్రీవేష్టకసురాహ్వయైః. 41. శ్రీవాసగుగ్గుల్వగురుశాలనిర్యాసధూపితాః, కఠినత్వం వ్రణా యాన్తి నశ్యంత్యుగ్రాశ్చ వేదనాః. 42. తిలాః పయః సితా క్షౌద్రం తైలం మధుక చందనం, లేపేన శోధరుగ్దాహరక్తం నిర్వాపయేద్వ్రణాత్. 43. పిత్తవిద్రధివీసర్పశమనం లేపనాదికమ్, అగ్నిదగ్ధే వ్రణే సమ్యక్ప్రయుంజీత చికిత్సకః.44. మహారాష్ట్రీజటాలేపో దగ్ధపిష్టావచూర్ణితం,జీర్ణగేహతృణాచ్చూర్ణం దగ్ధవ్రణహితం మతమ్. 45.

ఏడాకుల పొన్న ఆకులను పాలలో కల్కముచేసి లేపన చేసిన దుష్టవ్రణములు నుపశాంతి నొందును. తేనె కలిపిన వెంపలి అన్నివిధములగు గాయములను మాన్పును. మనుజుని శిరఃకపాలమును గాని ఎముకను గాని గోమూత్రముతో నూరి లేపన చేసినచో కోట్లకొలది యోగములకు సాధ్యముగాని గాయములును మానును. చిన్నమూతి గలిగి మర్మస్థానములందున్న గాయమును వస్తిద్వారా శోధింపవలయును. కరక్కాయలు తెల్లతెగడ దంతి తేనె సైంధవలవణము జాపత్రి లవంగపుపట్ట చుక్కకూర వీటిని వేరు వేరుగా లేపనచేసినచో గంభీరములగు అంకురములయినను మొలకలెత్తును. పంచవల్కలచూర్ణమునందు శంఖచూర్ణమును వైచి గాని ధాత్రీఫలచూర్ణముతో గాని లొద్దుగచూర్ణముతో గాని అంకురములు వచ్చును. భగ్గునమండుచు బాధించెడి గాయము పశాంతి నొందుటకై నువ్వులను పాలతో నూరి లేపనఁ జేయవలయును. వాతాదులవలనఁబుట్టినస్రావరహితములగు గాయములకును భుజపత్రము ఉమ్మెత్తకాయ శ్రీవేష్టధూపము దేవదారువు శ్రీవాసము గుగ్గిలము అగరు వీటితో పొగవేసిన మంచిది. దీన గాయముగట్టిపడును. బాధయు నుపశమిల్లును. నువ్వులు పాలు కలకండ తేనె తైలము మధుకము చందనము వీటినినూరి లేపనచేసిన వ్రణములందలి వాపు శూల దాహము

రక్తము ఉపశమిల్లును. పిత్తవిద్రధులును పిత్తవిసర్పలు నుపశాంతించుటకు వైద్యుఁడు జలూక వేయవలయును. నీటిపిప్పలిఆకులను గాల్చి నూరి పట్టించి వ్రణములను శాంతి నొందింపవలయును. పూరింటిచూరు ప్రదకలను చూర్ణముచేసి కట్టుటయును హిత కరమే యగును.

### జీవికా కల్కములు.

జీవకకల్కం పశ్చాత్ సిక్తక సర్జరసమిశ్రితం హరతి, ఘృతమభ్యంగాత్పావక దగ్ధోద్దుఃఖం క్షణార్ధేన. 46. అస్తగంధాదారకో దహనజం లేపాన్నిహన్తి వ్రణం, మశ్వత్థస్య విశుష్క వల్కలకృతం చూర్ణం తథా గుండనాత్, అభ్యంగాద్వినిహన్తి తైలమఖిలం గండూషపద్మైః స్వాధితం, పిష్ట్వా శాల్మలితూలకైర్జలగతా లేపాత్తథా వాలుకాః. 47. సద్యః క్షతం వ్రణం వైద్యః సశూలం పరిషేచయేత్, యష్టిమధుకకల్కేన కించిదుష్ణేన సర్పిషా. 48. బుద్ధ్వాగంతువ్రణం వైద్యో ఘృతం క్షౌద్రసమన్వితమ్, శీతాం క్రియాం ప్రయుంజీత పిత్తరక్తోష్మనాశినీం. 49. కాస్తకవలక మేకం సుశ్లక్ష్ణం గవ్యసర్పిషా పిష్టం, శమయతి లేపాన్నియతం వ్రణమాగంతూద్భవం న సందేహః. 50. అపామార్గస్య సంసిక్తం పత్రోత్థేన రసేన వా, సద్యోవ్రణేషు రక్తం తు ప్రవృత్తం ప్రతితిష్ఠతి. 51. కర్పూరపూరితం బద్ధం సఘృతం సంప్రరోహతి, సద్యః శస్త్రక్షతం పుంసాం వ్యథాపాకవివర్జితం. 52. శరపుంఖా కాకజంఘా ప్రసూతమహిషీమలమ్, లజ్జావతీ చ సద్యస్కవ్రణఘ్నం పృథగేవతు. 23. ఘనోజిహ్వాకృత శ్చూర్ణః సద్యఃక్షతవిరోహణః, చక్రతైలం క్షతే విద్ధే రోపణం పరమం మతం. 54. యవక్షారం భక్షయిత్వా పిండం దద్యాద్వ్రణోపరి, శృగాలకోలిమూలేన నష్టశైలం వినిస్సరేత్. 55. లాంగలీమూలలేపాద్వా గవాక్షీమూలతస్తథా, క్షతోష్మణో విగ్రహార్థం తత్కాలం విస్మృతస్య చ. 57.

జీవికాకల్కమునందు మైనము ఘృతరసమును కలిపి నేతిని సిద్ధము చేసి రుద్దినచో ఒక్కఘడియలో కాలుటవలన నగువ్రణములు తొలగిపోవును. అశ్వత్థవృక్షముయొక్క బెరళ్ల నొక పాత్రలో వైచి పొగబయలునకురాకుండునట్లు కాల్చి లేపనవేసిన అగ్నిదగ్ధమగు గాయముమానును. పిప్పలివృక్షము త్వక్కునుచూర్ణముచేసి కట్టినను అ

స్నిగ్ధములగు వ్రణములు నశించును. అప్పుడు నలిసుపడి బాధ గలిగించు గాయముల కు మధుకకల్కమును నేతితో చేర్చి కొంచెము వెచ్చబెట్టి సేచనము జేయవలయును. ఆగంతు వ్రణముల నెఱింగి వైద్యుడు తేనె గలిపిన నేయి మున్నగు శీతలక్రియలను ప్రయోగింపవలయును. మంచిపోక నొకదానిని ఆవునేతితో నూరి దినమును లేపనచేసిన ఆగంతుక వ్రణములుమానును. కొంచెమైనను సందియములేదు. ఉత్తరేణు పసరును పిండిన అప్పటికప్పుడు రక్తస్రావము ఆగిపోవును. కర్పూరమును నేతితో కట్టినచో తత్కాలమునందలి శస్త్రఘాతములు మానును. వెంపలి గురివెందఆకు తొలిచూరి గేదెయొక్క పేడ లజ్జావంతి ఇవియన్నియును ప్రత్యేకము తత్కాలక్షతములను మాన్పును. నుక్క నాలుకను చూర్ణము చేసి యున్న తత్కాలమే చర్మమంకురించును. చక్రతైలము గాయములకు వేదనలకు రోపణమని చెప్పబడి ది. యవక్షారమును తిని గాయముపైని సన్నరేగుచెట్టు మూలముతో నొకముద్దనూరి పెట్టినచో నశించినదైనను మఱల నెలువడి వచ్చును. ముయ్యాకుపొన్న వేళ్లను లేపన చేసినను తెల్లజిలెడ వేళ్లను లేపనచేసినను తత్కాలక్షతములు తొలగి సుఖములు కలుగును.

## కషాయ లేపాదులు.

శ్లో. కషాయాః శీతమధురాః స్నిగ్ధా లేపాదయో హితాః, ఆమాశయస్థే రుధిరే వమనం పథ్యముచ్యతే. 57. పక్వాశయస్థే దేయం చ విరేచనమసంశయః, వ్యాధోపంశాంత్యై గేరంశ స్వాదంష్ట్రాశ్మభిదా త్రివృతా. 58. సహింగుసైంధవః పీతః కోష్ఠస్థం స్రావయేదసృక్, యవకోలకుళుత్థానాం నిస్నేహేన రసేన చ. 59. భుంజీతాన్నం యవాగూం వా పిబేత్సైంధవసంయుతాం, అత్యర్థమస్రం స్రవతి ప్రాయశో యత్ర పీక్షతే. 60. తతో రక్తక్షయాద్వాయుః కుపితస్తీవ్రరుజాకరే, స్నేహపానం పరిషేకం స్నేహాలేపోపనాహనం. 61. స్నేహవస్తిం చ కుర్వీత వాతఘ్నౌషధసాధితాం, ఇతి సాప్తాహికః ప్రోక్తః సద్యోవ్రణహితో విధిః. 62. సప్తాహాత్పరతః కుర్యాచ్ఛారీరవ్రణవత్క్రియాం, కరంజారిష్టనిర్గుండీరసో హన్యాద్వ్రణక్రిమీన్. 63. కలాయవిదలీపత్రం కోషామ్రాస్థి చ పూరణాత్, సురసాదిరసైః సేకో లేపనః స్వరసేన వా. 64. నింబసప్తాహ్వజాత్యర్క సప్తపర్ణాశ్వమారకాః, క్రిమిఘ్నా మూత్రసంయుక్తాః సేకాలేపనధావనైః. 65. ప్రక్షాళ్యమాంసపేష్యా

వా క్రిమీ నపహారే ద్వ్రణాన్, లశునే నాథ వా దద్యా ల్లేపనం క్రిమినాశనం. 66.

వగరుగను చల్లగను మధురముగను మెత్తగనున్న లేపాదులు హితకరములు. ఆమాశయము నందున్న రక్తవిషయమై వాంతిని చేయించుట మంచిది. పక్వాశయస్థితమునకు విరేచనముత్తమము. వెదురుఆకు ఆముదపువేళ్లు పల్లేరు కొండపిండి వీటిని కషాయమును పెట్టుకొని అందు సైంధవలవణము ఇంగువ వేసికొని త్రాగినచో కోష్ఠగతమగు రక్తమును వెడలించును. యవలు పెసలు ఉలవలు వీటిని నిస్సారముగా అన్నముతో భక్షించినను సైంధవలవణమును వేసికొని గంజినైనను త్రాగినను ఉత్తమము. ఎక్కువక్షతములు గలిగిన విస్తారము రక్తము నశించుచున్నది. రక్తక్షయమైనచో వాతము ప్రకోపించి బాధించును. అప్పుడు తైలపానాదులను చేయవలయును. ఇట్లు ఏడు నాళ్లు జాలవలెనను సద్యోవ్రణములకు చికిత్సను చేయవలయును. ఏడునాళ్లైనను తరువాత శరీరపు గాయములవలెనే చికిత్సఁజేయవలయును. చిరుసెనగలు ఏడాకుల పొన్నఆకులు చింతపండుముద్దలు వీటిని పూయించుట చేతను సురసాదిగణపుకషాయముల చల్లుట చేతను పురుగులు నశించును. లేనిచో మాంసపుగ్రుడ్డుతో గాయములను కడిగి పురుగులను పోఁగొట్టవచ్చును. ఉల్లిగడ్డను పూసినను పురుగులు నశించును.

## త్రిఫలాగుగ్గులము.

శ్లో. యే క్లేదపాకస్రుతిగంధవంతో వ్రణా మహాన్తః సరుజ స్స శోథాః, ప్రయాన్తి తే గుగ్గులుమిశ్రితేన పీతేన శాన్తిం త్రిఫలారసేన. 67.

క్లేదము పాకము స్రావము గంధము గలిగిన వ్రణములను మిక్కిలిబాధయును వాపును గల వ్రణములును గుగ్గలము కలిపిన త్రిఫలారసమును త్రాగుటచేత నశించిపోవును.

## వటికాగుగ్గులము.

శ్లో. త్రిఫలాచూర్ణసంయుక్తో గుగ్గులు ర్వటకీకృతః, నిర్యన్త్రణో విబంధఘ్నో వ్రణశోధనరోపణః. 68. అమృతాగుగ్గులు శ్చాస్తో హితం తైలం చ వజకం, విడంగత్రిఫలావ్యోషచూర్ణం గుగ్గులునా సమం. 69. సర్పిషా వటకీకృత్వా ఖాదే ద్వా హితభోజనః, దుష్టవ్రణాపచీ మేహ కుష్ఠనాడీవ్రణాపహః. 70.

త్రిఫలముల చూర్ణమునందు గుగ్గిలమునుకలిపి ఉండలను చేసి వ్రణములనుంచిన చో వ్రణశోధనముఁ జేసి రోపణఁ జేయును. అమృతగుగ్గులమును వజ్రతైలమును హిత కరములు. వాయువిడంగములు త్రిఫలములు శొంఠి మిరియములు పిప్పళ్లు గుగ్గిలము వీ టిని సమానభాగములను గాతీసికొని నేతితో మాత్రలను కట్టి హితభుక్కు అయినవాఁడు భుజింపవలయును. దుష్టవ్రణములు అపచీప్రమేహము మున్నగునవి దీనిచే నశించును.

## అమృతగుగ్గులు.

శ్లో. అమృతాపటోలమూల త్రిఫలత్రికటుక్రిమిఘ్నానాం, సమ భాగానాం చూర్ణం, సర్వసమో గుగ్గులో ర్భాగః. 71. ప్రతివాసర మే కైకాం ఖాదే ద్గుళికాం ప్రమాణాం, జేతుం వ్రణా న్వాతాసృ గ్గుల్మో దరశ్వయథురోగాదీన్. 72.

తిప్పతీగె చేదుపొట్ల త్రిఫలములు శొంఠి మిరియములు పిప్పళ్లు వాయువిడంగ ములు వీనిని సమానభాగములనుగాతీసికొని చూర్ణముచేసి ఆచూర్ణమంతేసి గుగ్గులను కలిపి ఒక్కొక్కతులము చొప్పున మాత్రలను కట్టి దినమును తినుచుండినచో గాయ ములు వాతరక్తములు గుల్మోదరములు మున్నగునన్నిరోగములు శాంతించును.

## జాతికాద్యఘృతము.

శ్లో. జాతీ నింబ పటోల పత్ర కటుకా దార్వీ నిశా శారిబా, మం జిష్ఠాభయతుత్థ సిక్థ మధుకై ర్నక్తాహ్వబీజైః స్సమైః, సర్పిస్సిద్ధ మనేన సూక్ష్మవదనా మర్మాశ్రితాః స్రావిణో గంభీరాః సరుజో వ్రణాః సగతి కాః శుష్యన్తి రోహన్తి చ. 73.

జాజి వేప చేదుపొట్ల ఆకులు కటుకరోహిణి సోంపు పసపు శారివ మంజిష్ఠ కరక వేరు మైలతుత్తము మైనము యష్టిమధుకము నెమలిఅడుగువిత్తనములు వీటిని సమా నభాగములను తీసికొని కల్కముచేసి కల్కముతో సిద్ధముజేసిన నేతినిరాగిన సూక్ష్మవ దనములు గలిగి గంభీరములైనట్టి వ్రణములును నశించును.

## గౌరాద్యఘృతము.

శ్లో. గౌరా హరిద్రా మంజిష్ఠా మాంసీ మధుక మేవ చ, ప్ర పౌండరీకం హ్రీబేరం భద్రముస్తం సచందనమ్. 74. జాతీనింబపటోలం చ కరంజం కటురోహిణీ, మధూచ్ఛిష్టం సమధుకం మహామేదా తథై వ చ. 75. పంచవల్కలతోయేన ఘృతప్రస్థం విపాచయేత్, ఏష గౌ రో మహావీర్యః సర్వవ్రణవిశోధనః. 76. ఆగంతు స్సహజా శ్చైవ సు

చిరోత్థా శ్చ యే వ్రణాః, విషమా మపి నాడీం చ శోధయే చ్ఛీఘ్ర మేవ చ. 77. గౌరాద్యం జాతికాద్యంచ తైల మేవం ప్రసాధ్యతే, తైలం సూక్ష్మాననే దుష్టే వ్రణే గంభీర ఏవ చ. 78.

గోరోజనము పసపు మంజిష్ఠ జటామాంసి మధుకము తెల్లకమలములు కురువేరు భద్రముస్తలు చందనము జాజి నింబము చేదుపొట్ల నెమలిఅడుగు కటుకరోహిణి మైనము మధుకము మహామోద పంచవల్కలములు వీటిని కషాయమునేసి అంకోకప్రస్థము నేతిని పక్వముచేసి సేవించవలయును. ఇయ్యది మహావీర్యసమన్వితమగు గౌరఘృతము అనఁబడును. ఆగంతుకములును సహజములును ప్రాచీనములునగు గాయములనుమాన్పి విషమరూపములగు నాడులను మిక్కిలి శీఘ్రముగా శోధించును. గౌరాద్యజాతికాద్యతైలములు ఈవిధముగనే సిద్ధమగును. సూక్ష్మముఖములును దుష్టములును గంభీరములునగు వ్రణములకు ఇయ్యవి హితకరములు.

## కరంజాద్యఘృతము.

శ్లో. నక్తమాలస్య పత్రాణి వరుణాని ఫలాని చ, సుమనాయా శ్చ పత్రాణి పటోలారిష్టయో స్తథా. 79. ద్వే హరిద్రే మధూచ్ఛిష్టం మధుకం తిక్తరోహిణీ, మంజిష్ఠా చందనోశీర ముత్పలం శారిబే త్రివృత్. 80. ఏతేషాం కార్షికై ర్భాగై ర్ఘృతప్రస్థం విపాచయేత్, దుష్టవ్రణప్రశమనం తథా నాడీవిశోధనం. 81. సద్యశ్ఛిన్నవ్రణానాంచ కరంజాద్యమిహేష్యతే. 82.

నెమలిఅడ్గుఆకులను ఉలిమిరి పొట్ల వేపఆకలను పసపు మ్రానిపసపు మైనము మధుకము కటుకరోహిణి మంజిష్ఠము చందనము వట్టివేళ్లు తెల్లకమలములు రెండు విధములగు మనుబాలలును తెల్లతెగడ వీటితో ఒక్కొక్కతులము చొప్పున 16 పలముల నేయిని పక్వము చేసి దుష్టవ్రణములను శాంతినొందింపవలయును. ఇయ్యది నాడీవ్రణములను శోధించును. తత్కాలఘాతములనుకూడ పోఁగొట్టును.

## ప్రపౌండరీకతైలము.

శ్లో. ప్రపౌండరీక మంజిష్ఠా మధుకోశీర పద్మకైః, సహరిద్రైశ్శృతం సర్పి స్సక్షీరం వ్రణరోపణమ్. 83.

కమలములు మధుకము కాకోలి క్షీరకాకోలి చందనము వీటితో సిద్ధముచేసిన తైలము గాయములను మాన్పి మఱల చర్మమును పుట్టించుటయందు మిక్కిలి శ్రేష్ఠము.

## తిక్తాదిఘృతము.

శ్లో. తిక్తా సిక్థ నిశా యష్టీ నక్తాహ్వాఫలపల్లవైః, పటోలమాలతీనింబ పత్రైర్ర్వణ్యం ఘృతం పచేత్. 84.

కటుకరోహిణి మైనము పసుపు మధుకము నెమళ్లఅడుగుచెక్క కాయ ఆకులు పటోలము జాజి వేప వీటిఆకులతో సిద్ధముచేసిన నేయి వ్రణములకు హితకరము.

## విపరీతమల్లతైలము.

శ్లో. సిందూరకుష్ఠవిషహింగురసోనచిత్ర బాణాంఘ్రిలాంగలికకల్కవిపక్వతైలం, ప్రాసాద మంత్రయుత ఘూత్కృత నున్నఫేనో దుష్టవ్రణ ప్రశమనో విపరీతమల్లః. 85. ఖడ్గాభిఘాతగురుగండమహోపదంశ నాడీవ్రణ వ్రణ విచర్చిక కుష్ఠపామాః, ఏతా న్నిహన్తి విపరీతకమల్ల నామ తైలం యథేష్టశయనాసనభోజనస్య. 86.

సిందూరము కోష్ఠు విషము ఇంగువ ఉల్లిగడ్డ చిత్రమూలము గోంటవేళ్లు వీటి కల్కమునందు పక్వముచేసిన తైలమునే విపరీతమల్లతైలమని యందురు. ఇదిదుష్టవ్రణములను మాన్పును. ఖడ్గఘాతములం బోగొట్టును. గండరోగము ప్రమేహము ఉపదంశము నాడీవ్రణము గాయము విచర్చిక కుష్ఠు వీటినిపోగొట్టును. దీనిసేవించునప్పుడు స్వేచ్ఛగా మజ్జన భోజనాదులను నెఱపవచ్చును.

## అంగారక తైలము.

శ్లో. కుఠారకా త్పలశతం సాధయే న్నల్వణేంభసి, తేన పాదావశేషేణ తైలప్రస్థం విపాచయేత్. 87. కల్కైః కుఠారాపామార్గ ప్రోష్ఠికామత్స్యకాయుతైః. 88.

తెల్లతులసి నూరుపలములు తెచ్చి ఒకద్రోణము నీటిలో పక్వము చేసి నాల్గవపాలు నీరు మిగిలినప్పుడు 16 పలముల తైలమునందు పక్వము చేసి తెల్లతులసి ఉత్తరేణు ప్రోష్టికయను చేప తేనెటీగ వీటితోకల్కముచేసిసేవించిన అన్ని నాడీవ్రణములును నశించును.

## రెండవ ప్రపౌండరీకతైలము.

శ్లో. ప్రపౌండరీకం మధుకం కాకోల్యౌ ద్వే సచందనే, సిద్ధమేభిః సమం తైలం తత్పరం వ్రణరోపణం. 89.

కమలములు మధుకము రెండువిధములకాకోలులు చందనము వీటితో తయారు చేసిన తైలము గాయముల మాన్పుటలో చాలమంచిది.

## దూర్వాఘృతము.

శ్లో. దూర్వాస్వరససిద్ధం వా తైలం కంపిల్లకేన వా, దార్వీత్వ చశ్చ కల్కేన ప్రధానం రోపణం వ్రణే. 92. యేనైవ విధినా తైలం ఘృతం తేనైవ సాధయేత్, రక్తపిత్తోత్తరం జ్ఞాత్వా సర్పి రేవావపాచయేత్. 93.

దూర్వారసములో సిద్ధముచేసిన తైలము గాని కాంపిల్లకములో సిద్ధముచేసిన తైలము గాని మ్రానిపసపు ధాలికాకల్కములతో నైన తైలము గాని గాయములను మాన్పును.

## మంజిష్ఠాఘృతము.

శ్లో. మంజిష్ఠాం చందనం మూర్వాం పిష్ట్వా సర్పి ర్విపాచయేత్, సర్వేషా మగ్నిదగ్ధానా మేతద్రోపణ మిష్యతే. 94.

మంజిష్ఠ చందనము ధాగఫలము వీటిని నూరి నేతిలోవైచి పక్వము చేసి అన్ని విధములగు దగ్ధవ్రణములకును రోపణ చేయవలయును.

## పాటలీతైలము.

శ్లో. సిద్ధం కషాయకల్కాభ్యాం పాటల్యాః కటుతైలకం, దగ్ధవ్రణరుజాస్రావ దాహవిస్ఫోటనాశనమ్. 95.

పాటలీకషాయముల కల్కముతో సిద్ధముచేసినతైలము దగ్ధవ్రణముల బాధను స్రావము మున్నగు వాటిని పోగొట్టును.

## చందనతైలము.

శ్లో. చందనం ఘటశృంగం చ మంజిష్ఠామధుకం తథా, ప్రపౌండరీకం మూర్వా చ పతంగం ధాతకీ తథా. 96. ఏభి స్తైలం విపక్తవ్యం సర్పిఃక్షీరసమన్వితమ్, అగ్నిదగ్ధవ్రణే శ్రేష్ఠం మృతునా రోపణం పరమ్. 97.

మంచిగంధము మఱ్ఱియిగుళ్లు మంజిష్ఠము మధుకము కమలములు చాగఫలము రక్తచందనము తెలకాయలు నెయ్యి పాలు వీటితో తైలమును పక్వముచేసి దగ్ధవ్రణములకు రుద్దవలయును.

మనశ్శిలాది లేపములు.

శ్లో. మనశ్శిలాలే మంజిష్ఠా సలాక్షా రజనీద్వయం, ప్రలేపస్స ఘృతక్షౌద్ర స్త్వగ్విశుద్ధికరః పరః. 98. అయోరజ స్సకాసీసం త్రిఫలా కుసుమాని చ, ప్రలేపః కురుతే కార్ష్ణ్యం సద్యఏవ నవత్వచి. 99. కాలీయకరతామ్రాస్థి హేమకాలారసోత్తమైః, లేప స్సగోమయరసః సవర్ణకరణః పరః. 100. చతుష్పదాం హి త్వగ్రోమఖురశృంగాస్థిభస్మనా, తైలాక్తా చూర్ణితా భూమి ర్భవే ద్రోమవతీ పునః, వ్రణగ్రంథిం గ్రంథివచ్చ జయేత్ క్షారేణ వా భిషక్. 101.

మనశ్శిల హరిదళము మంజిష్ఠను లక్క పసపు మ్రానిపసపు నేయి తేనె వీటితో నగు లేపము చర్మమును శుద్ధిచేయును. లోహచూర్ణము కాసీసము త్రిఫలాకుసుమములు వీటిలేపము క్రొత్తచర్మమునుపుట్టించును. మ్రానిపసపు మామిడిటెంకలు కాంచనము మంజిష్ఠము వీటిరసములతోనగు తైలమునుపూసినను రోమములు దట్టముగా మొలచును. మఱియు నీవ్రణగ్రంథులను గ్రంథులకువలెనే వైద్యుడు చికిత్సచేసి జయింపవలయును.

ఇట్లు చక్రదత్తయందు వ్రణశోధాధికారప్రకరణము ముగిసెను.

---

# ౪౪. నాడీవ్రణాధికారము.

నాడీవ్రణమున కుపాయములు.

శ్లో. నాడీనాం గతి మన్విష్య శస్త్రేణాపాట్య శస్త్రవిత్, సర్వవ్రణక్రమం కుర్యా చ్ఛోధనం రోపణాదికం. 1. నాడీం వాతకృతాం సాధు పాటితాం లేపయే ద్భిషక్, ప్రత్యక్పుష్పీఫలయుతై స్తిలైః పిష్టైః ప్రలేపయేత్. 2. పైత్తికీం తిలమంజిష్ఠా నాగదన్తీనిశాయుగైః, శ్లైష్మికీం తిలయష్ట్యాహ్వా నికుంభారిష్టసైంధవైః. 3. శల్యజాం తిలమధ్వాజ్యై ర్లేపయే చ్ఛిన్నశోధితాం. 4. ఆరగ్వధనిశా కాలా చూర్ణాజ్యక్షౌద్రసంయుతా, సూత్రవర్తి ర్వ్రణే యోజ్యా శోధనీ గతినాశినీ. 5. ఘోంటాఫలత్వఙ్మదనాత్ఫలాని పూగస్యచ త్వక్లవణం చ ముఖ్యం, స్నుహ్యా

ర్కదుగ్ధేన సహైవ కల్కో వర్తీకృతో హ న్త్యచిరేణ నాడీమ్. 6. వర్తీకృతం మాక్షికసంప్రయుక్తం నాడీఘ్న ముక్తం లవణోత్తమం వా, దుష్టవ్రణే యద్విహితం చ తైలం తత్సేవ్యమానం గతి మాశు హన్తి. 7. జాత్యర్కసంపాకకరం చ దన్తీ సిన్ధూత్థసౌవర్చలయావ శూకైః, వర్తిః కృతా హ న్త్య చిరేణ నాడీం స్నుక్క్షీరపిష్టా సహ మాక్షికేణ. 8. మాహిషదధికోద్రవాన్నం మిశ్రితం హరతిచిరవిరూఢాం చ, భుక్తం కంగునికామూల చూర్ణ మతి దారుణాం నాడీమ్. 9.

శస్త్రము చేయనెఱిగినవాడై వైద్యుడు నాడులగతిని కనిపెట్టి ఛేదన చేసి అన్నివ్రణములకు వలెనే శోధనమును రోపణమును చేయవలయును. వాతనాడిని ఛేదించిన తెల్లఉత్తరేణి ఫలములను తిలలను నూరి లేపన చేయింపవలెను. పిత్తనాడిని తిలలు మంజిష్టము పసపు మ్రానిపసపు వీటితో లేపనచేయవలయును. కఫనాడులను తిలలు మధుకము దంతి వేప సైంధవలవణము వీటితో లేపనచేయింపవలయును. ఛిన్నములును శోధితములు నగు శల్యనాడులను తేనెతో నేతితో లేపనచేయవలయును. అమ్లవేతము మ్రానిపసపు వీటిచూర్ణమునందు నేతిని తేనెను కలిపికొని వత్తిచేసి గాయమునందుంచిన శోధించును దోషములనుపోగొట్టును. పోకచెక్క లవంగపుపట్ట ఉమ్మెత్త వీటిని జెముడు పాలతోను జిల్లేడుపాలతోను కల్కము చేసి దానితో వత్తినిచేసి యుపయోగించిన నాడీవ్రణములు నశించును. సైంధవలవణముతో వత్తిచేసి తేనెతో కలిపియుపయోగించినను నాడీవ్రణములు నశించును.

### కృశాదులకు శిరోవ్యాపోపాయములు.

శ్లో. కృశదుర్బలభీరూణాం గతి ర్మర్మాశ్రితా చ యా, క్షారసూత్రేణ తాం ఛిన్ద్యా న్న శస్త్రేణ కదాచన. 10. ఏషణ్యా గతి మన్విష్య క్షారసూత్రానుసారిణీం, సూచీం విదధ్యా దభ్యన్తే చోన్నామ్య చాశు నిర్హరేత్. 11. సూత్రస్యాన్తం సమానీయ గాఢం బంధం సమాచరేత్, తతః క్షీణబలం వీక్ష్య సూత్ర మన్యత్ప్రవేశయేత్. 12. క్షారాక్తం మతిమా న్వైద్యో యావ న్న ఛిద్యతే గతిః, భగందరే ప్యేష విధిః కార్యో వైద్యేన జానతా. 13. అర్బుదాదిషు చోత్క్షిప్య మూలే సూత్రం నిధాపయేత్, సూచీభి ర్యవవక్త్రాభి రాచితం శ్వాస మంతతః. 14. మూలే సూత్రేణ బధ్నీయా చ్ఛిన్నే చోపచరే ద్వ్రణమ్.

కృశించినవారు దుర్బలులు భయస్వభావులు అగు వారలకు మర్మస్థానపు వాటిని క్షారసూత్రముతో కాయవలయునే కాని శస్త్రముతో చికిత్స చేయరాదు. ఏషణీశస్త్రముతో క్షారసూత్రము ననుసరించి సూదులనుచొప్పించి లోపలి మలినమును పోగొట్టవలయును. భగందరమునకును ఇదియే పద్ధతి. అర్బుదాదులయందు ఉత్క్షేపణ చేసి సూత్రస్థాపన చేయవలయును. యవసమానమగు ముఖముగల సూదితో ఛేదింపబడిన వ్రణమును సూత్రముతో చక్కగా కట్టవలయును.

### సప్తాంగగుగ్గులము.

శ్లో. గుగ్గులు త్రిఫలా వ్యోషైః సమాంశై రాజ్యయోజితః, నాడీదుష్టవ్రణశూల భగందర వినాశనః. 15.

గుగ్గిలము త్రిఫలములు శొంఠి మిరియములు పిప్పళ్లు వీటిని సూరి నేతితో చేర్చి సేవించినచో నాడీవ్రణాదులు మానును.

### సర్జికాదితైలము.

శ్లో. సర్జికా సింధుదన్త్యగ్ని రూపికా నలనీలికా, స్వరమంజరీ బీజేషు తైలం గోమూత్ర పాచితమ్, దుష్టవ్రణప్రశమనం కఫనాడీవ్రణాపహం. 16.

సజ్జక్షారము సైంధవలవణము దంతెన చిత్రమూలము ప్రత్తివేళ్లు నీలి తులసి వి త్తనములు గోమూత్రము వీటితో తైలమును పక్వముచేసి వాడినచో దుష్టవ్రణములు నశించును.

### కుంభీకాదితైలము.

శ్లో. కుంభీక ఖర్జూర కపిత్థ బిల్వ వనస్పతీనాం తు శలాటువర్గే, కృత్వా కషాయం విపచేత్తు తైలమావాప్య ముస్తం సరలం ప్రియంగుమ్,. 17. సౌగంధికా మోచరసాహిం పుష్ప లోధ్రాణి దత్వా ఖలు ధాతకీం చ, ఏతేన శల్యప్రభవా హి నాడీరోహే ద్వ్రణో వైముఖ మాశు చైవ. 18.

పున్నాగము ఖర్జూరము వెలగ మారేడు ఈవనస్పతుల కసిగాయలను కషాయము పెట్టి అందు తైలమును పక్వము చేయవలయును. అందు తుంగముస్తెలు సరలము లవంగపుపట్ట ఏలకులు జాపత్రి నాగకేసరములు మాచికాయ లొద్దుగ ధాత్రిపుష్పము వీటికల్కమును చేర్చివాడిన నాడీవ్రణములు శీఘ్రముగా మాని చర్మము పెట్టును.

### భల్లాతకతైలము.

శ్లో. భల్లాతకార్కమరిచై ర్లవణోత్తమేన సిద్ధం విడంగరజనీద్వయ చిత్రకై శ్చ, స్యా న్మార్కవస్య చ రసేన నిహంతి తైలం నాడీం కఫానిలకృతా మపచీం వ్రణాం శ్చ. 19.

నల్లజీడి జిల్లేడు మిరియములు సైంధవలవణము వాయువిడంగములు పసపు మ్రానిపసపు చిత్రమూలము వీటికల్కమును గుంటకలగరాకు రసముతో సిద్ధముచేసిన తైలము కఫవాతపు నాడీవ్రణముల పోగొట్టును.

### నిర్గుండీతైలము.

శ్లో. సమూలపత్రాం నిర్గుండీం పీడయిత్వా రసేన తు, తేన సిద్ధం సమం తైలం నాడీదుష్టవ్రణాపహం. 20. హితం పామాపచీనాం తు పానాభ్యంజనసావనైః, వివిధేషు చ స్ఫోటేషు తథా సర్వవ్రణేషు చ. 21.

వేళ్లు ఆకులతో గల వావిలిని మర్దించి రసము తీసి అందు సమానముగా తైలమును పోసి పక్వము చేసి వాడినచో దుష్టవ్రణము మున్నగు వానిని పోగొట్టును. ఇయ్యది అనేకవిధము లగు రోగములకును హితికరము.

### హంసపాదాదితైలము.

శ్లో. హంసపాదారిష్టపత్రం జాతీపత్రం తతో రసైః,
తత్కల్కై ర్విపచే త్తైలం నాడీవ్రణవిరోహణమ్. 22.

ఎఱ్ఱని వేపయిగుర్లు జాజిఆకులు రసముతీసి కల్కము చేసి తైలమును కాచి వాడినచో నాడీవ్రణములు శాంతించును.

ఇట్లు చక్రదత్తయందు నాడీవ్రణాధికారప్రకరణము ముగిసెను.

---

## ४४. భగందరాధికారము.

### భగందరకు సామాన్యోపాయములు.

శ్లో. గుదస్య శ్వయథుం జ్ఞాత్వా విశోష్య శోధయే త్తతః, రక్తావసేచనం కార్యం యథా పాకం న గచ్ఛతి. 1. వటపత్రేష్టకాశుంఠీ గుడూచ్యః సపునర్నవాః, సుపిష్టాః పీడకాలంభే లేపః శస్తో భగందరే. 2. పీడకానా మపక్వానా మపతర్పణపూర్వకం, కర్మ కుర్యా ద్విరేకాంతం

భిన్నానాం వక్ష్యతే క్రియాం. 3. ఏషణీపాటనం క్షారవహ్నిదాహాదికం క్రమం, విధాయ వ్రణవత్కార్యం యథాదోషం యథా క్రమమ్. 4. త్రివృత్తిలానాగదన్తీ మంజిష్ఠాసహసర్పిషా, ఉత్సాదనం భవేదేత త్సైన్ధవక్షౌద్రసంయుతం. 5. రసాంజనం హరిద్రే ద్వే మంజిష్ఠా నింబపల్లవాః, త్రివృత్తేజోవతీ దన్తీకల్కో నాడీవ్రణాపహః. 6. కుష్ఠం త్రివృత్తిలాదన్తీ మాగధ్యః సైంధవం మధు, రజనీ త్రిఫలాతుత్థం హితం వ్రణవిశోధనం. 7. స్నుహ్యార్కదుగ్ధదార్వీభి ర్వర్తిం కృత్వా విచక్షణః, భగందరగతం జ్ఞాత్వా పూరయే త్తాం ప్రయత్నతః. 8. ఏషా సర్వశరీరస్థాం నాడీం హన్యా న్న సంశయః, తిలాభయాలోధ్ర మరిష్టపత్రం నిశావచాలోధ్ర మగారధూమః. 9. భగందరే నాడ్యుపదంశయోశ్చ దుష్టవ్రణే శోధనరోపణోఽయం. 10.

గుదస్థాపు వాపును ఎండించి శోధింపవలయును. పక్వము కానట్టులుండగనే రక్తమును వెడలింప వలయును. మఱ్ఱిఆకులు ఇటుకలు శొంఠి తిప్పతీగ గలిజేరు వీటిని చక్కగా నూరి భగందరవిషయముల లేపన జేయుట మంచిది. పక్వము కాని పిడకలను (రోగములను) లంఘనపూర్వకమైన విరేచనకర్మము నుపయోగింప వలయును. ఏషణీపాటనము క్షారము కాల్చు మున్నగు వానిని దోషానుసారముగా చేయవలయును. తెల్లతెగడ తిలలు నాగదంతి మంజిష్ఠము సైంధవలవణము నెయ్యి తేనె వీటితో నలుగు పెట్టుకొన వలయును. రసాంజనము పసపు మ్రానిపసపు మంజిష్ఠ వేపఆకు తెల్లతెగడ తేజోవంతి దంతి వీటికల్కము నాడీవ్రణములను పోగొట్టును. కోష్ఠు తెల్లతెగడ తిలలు దంతి పిప్పళ్లు సైంధవలవణము తేనె పసపు త్రిఫలములు వీటికల్కము గాయములను శోధించును. జనుముపాలు జిల్లేడుపాలు మ్రానిపసపు వీటితో వత్తులను చేసి భగందరము నెతిగి వైద్యుఁడుపయోగింప వలయును. ఇయ్యది శరీరమునందంతటను గల నాడీవ్రణములను పోగొట్టును. సందియము లేదు. తిలలు కరక్కాయ లొద్దుగ వేపాకు పసపు వస ఇంటిబూజు వీటికల్కము భగందరము నాడీరోగము ఉపదంశము దుష్టవ్రణములు వీనిని శోధించి మాన్పును.

## నవకార్షిక గుగ్గులము.

శ్లో. ఖరాస్రపక్వభూరోగ చూర్ణలేపో భగందరం, హన్తి దన్త్యగ్న్యతివిషా లేప స్తద్వ చ్ఛునోస్థి వా. 11. త్రిఫలారససంయుక్తం బిడాలాస్థిప్రలేపనం, భగందరం నిహ న్త్యాశు దుష్టవ్రణహరం పరం. 12.

త్రిఫలాపురకృష్ణానాం త్రిపంచైకాంశయోజితా, గుడికాం శోధగుల్మార్శోభగందరవతాం హితా. 13.

గాడిదనెత్తుటితో పక్వము చేసిన మద్దిచూర్ణలేపము కాని దింటెన చిత్రమూలము అతివస వీటిలేపము గాని కుక్కయెముకలను నూరి లేపన చేసినఁ గాని భగందరములను నశింపఁ జేయును. త్రిఫలముల రసములో పిల్లియెముకలను నూరి లేపన చేసినను భగందరము నశించును. త్రిఫలములు 3 భాగములు గుగ్గిలము 5 భాగములు పిప్పళ్లు ఒకభాగము వీటిమాత్రలు వాపులు గుల్మములు మూలరోగము భగందరము మున్నగు వానిని పోగొట్టును.

## సప్తవింశతి గుగ్గులుము.

శ్లో. త్రికటు త్రిఫలా ముస్త విడంగామృతచిత్రకం, శఠ్యేలాపిప్పలీమూలం హాపుషా సురదారు చ. 14. తుంబురుపుష్కరంచవ్యం విశాలారజనీద్వయం, బిడం సౌవర్చలం క్షారౌ సైంధవం గజపిప్పలీ. 15. యావన్త్యేతాని చూర్ణాని తావద్ద్విగుణగుగ్గులుః, కోలప్రమాణం గుడికాం భక్షయేన్మధునా సహ. 16. కాసశ్వాసం తథా శోధమర్శాంసి సభగందరం, హృచ్ఛూలం పార్శ్వశూలం చ కుక్షివస్తిగుదే రుజం. 17. అశ్మరీం మూత్రకృచ్ఛ్రం చ అంత్రవృద్ధిం తథా క్రిమీన్, చిరజ్వరోపసృష్టానాం క్షయోపహతచేతసాం. 18. ఆనాహం చ తథోన్మాదం కుష్ఠాని చోదరాణిచ, నాడీదుష్టవ్రణా న్సర్వా న్ప్రమేహాశ్లీపదం తథా. 19. సప్తవింశతికో హ్యేష సర్వరోగనిషూదనః.

శొంఠి మిరియములు పిప్పళ్లు త్రిఫలములు తుంగముస్తెలు వాయువిడంగములు తగరము చిత్రమూలము కచ్చూరము ఏలకులు మోడి దేవదారువు ధనియములు పుష్కరమూలము చవ్యము ఇంద్రవారుణి పసపు మ్రానిపసపు అంటుప్పు సౌవర్చలవణము యవక్షారము సజ్జక్షారము సైంధవలవణము గజపిప్పలి వీటిచూర్ణమంత రెండింతలు గుగ్గిలమును వేసి రేగుపండంత మాత్రలను గట్టి తేనెతో తినవలయును. దగ్గు శ్వాసము వాపు మూలరోగము భగందరము హృచ్ఛూలము మున్నగువాని నిది పోగొట్టును.

## విష్యందన తైలము.

శ్లో. జంబుకస్య చ మాంసాని భక్షయే ద్వ్యంజనాదిభిః. 20. అజీర్ణవర్జీ మాసేన ముచ్యతే నా భగందరాత్, పంచతిక్తం ఘృతం శ

స్తం పంచతిక్తశ్చ గుగ్గులుః. 21. న్యగ్రోధాదిగణో యస్తు హిత శ్శోధన రోపణః, తైలం ఘృతం వా తత్సర్వం భగందరవినాశనం. 22. చిత్రకార్కౌ త్రివృత్పాఠే మలపూహయమారకౌ, సుధాం వచాం లాంగలికం హారితాలం సువర్చికాం. 23. జ్యోతిష్మతీం చ సంయోజ్య తైలం ధీరో విపాచయేత్, ఏత ద్విష్యన్దనం నామ తైలం దద్యా ద్భగందరే. 24. శోధనం రోపణం చైవ సవర్ణకరణం తథా.

అజీర్ణము లేని రోగియైనచో నక్కమాంసపు వ్యంజనాదులతో నెలరోజులు భక్షించిన భగందరము నశించును. పంచతిక్తఘృతము పంచతిక్త గుగ్గిలము నిందులకు ప్రశస్తములే యగును. న్యగ్రోధాధిగణౌషధులు రోపణశోధనలయందు హితకరములు. తైలమును గాని నేతిని గాని దీనిలో పక్వము చేసి సేవించిన భగందరము నశించును. చిత్రమూలము జిల్లేడు తెల్లతెగడ అగరుశొంఠి నల్లగూలరు గన్నేరు జముడు వస హారిదళము సజ్జ కీటిని కలిపి తైలమును పక్వము చేసి ప్రయోగించినను భగందరములు మానిపోవును.

## కరవీరాద్యతైలము.

శ్లో. కరవీర నిశా దన్తీ లాంగలీ లవణాగ్నిభిః, మాతులుంగార్క-వత్సాహ్వైః పచే త్తైలం భగందరే. 25.

గన్నేరు పసపు దంతివేళ్లు ముష్ట్యాకు పొన్న సౌవర్చలవణము చిత్రమూలము మాచిపత్రి జిల్లేడు కోష్ఠు వీటితో తైలమును పక్వము చేసి భగందరమునకు ప్రయోగింపవలయును.

## నిశాద్యతైలము.

శ్లో. నిశార్క-క్షీరసింధ్వగ్ని పురాశ్వహనవత్సకైః, సిద్ధ మభ్యంజనే తైలం భగందరవినాశనం. 26. వ్యాయామం మైథునం యుద్ధం పృష్ఠయానం గురూణి చ, సంవత్సరం పరిహరే దుపరూఢ వ్రణో నరః. 27.

పసపు జిల్లేడుపాలు సైంధవలవణము చిత్రమూలము గుగ్గిలము గన్నేరు కోష్ఠు వీటితో సిద్ధముచేసిన తైలమును రుద్దినచో భగందరములు నశించును. వ్యాయామము మైథునము యుద్ధము పృష్ఠయానము మున్నగునవి ఒకసం॥ వఱకును వదలిపెట్టవలయును.

ఇట్లు చక్రదత్తయందు భగందరాధికారప్రకరణము ముగిసెను.

# ౪౯. ఉపదంశాధికారము.

---

ఉపదంశమునందు ప్రయోగింపవలసిన తంత్రము.

శ్లో. స్నిగ్ధస్విన్నశరీరస్య ధ్వజమధ్యే శిరావ్యధః, జలౌకఃపాతనం వాస్యాదూర్ధ్వాధఃశోధనం తథా. 1. పాకో రక్ష్యః ప్రయత్నేన శిశ్నక్షయకరో హి సః, పటోలనింబ త్రిఫలాగుడూచీ క్వాథం పిబేద్వా ఖదిరాశనాభ్యాం, సగుగ్గులుం వా త్రిఫలాయుతం వా, సర్వోపదంశాపహరః ప్రయోగః. 2.

స్విన్నమును స్నిగ్ధమునగు శరీరముయొక్క లింగమధ్యమునందలి నరములను ఛేదించిగాని జలగలను పట్టించిగాని వమనములను విరేచనములను చేయింప వలయును. ప్రయత్నముగా పాకమును కాపాడవలయును. లేనిచో శిశ్నమును తినివేయును. పటోలము నింబము త్రిఫలములు తిప్పతీగ వీటికషాయమునుగాని కాచు గుగ్గిలము త్రిఫలములు వీటికషాయమునైనను త్రాగవలయును. ఇయ్యది ఉపదంశలను పోగొట్టును.

ఉపదంశయందు సామాన్యోపాయములు.

శ్లో. ప్రపౌండరీకం మధుకం రాస్నా కుష్ఠం పునర్నవా, సరలాగురుభద్రాహ్వైః క్వాథై కే లేపసేచనే. 3. గైరికాంజనమంజిష్ఠా మధుకోశీరపద్మకైః, సచందనోత్పలైః స్నిగ్ధైః శ్లక్ష్ణైః సంప్రలేపయేత్. 4. నింబార్జున శ్వత్థకదంబశాల జంబూవటోదుంబుర వేతసేషు, ప్రక్షాళనాలేపఘృతాని కుర్యాచ్చూర్ణాని పిత్తాస్రభవోపదంశే. 5. త్రిఫలాయాః కషాయేణ భృంగరాజరసేన వా, వ్రణప్రక్షాలనం కుర్యాదుపదంశప్రశాంతయే. 6. దహేత్కటాహే త్రిఫలాం సమాంశాం మధుసంయుతాం, ఉపదంశే ప్రలేపోయం సద్యోరోపయతి వ్రణం. 7. రసాంజనం శిరీషేణ పథ్యయా వా సమన్వితం, సక్షౌద్రం వా ప్రలేపేన సర్వలింగగదాపహం. 8. బబ్బూలదలచూర్ణేన దాడిమత్వగ్భవేన వా, గుండనం వ్రణచూర్ణేన ఉపదంశహరం పరం. 9. లేపః పూగఫలే నా

శ్వమారమూలేన వా తథా, సేవే న్నిత్యం యవాన్నం చ పానీయం కౌప మేవ చ. 10. జయాజాత్యశ్వమారార్క సంపాకానాం దళైః పృథక్, కృతం ప్రక్షాలనే క్వాథం మేఢ్రపాకే ప్రయోజయేత్. 11.

కమలములు యష్టిమధుకము రాస్నా కోష్టు గలిజేరు సరలము అగరు భద్రముస్తలు వీటిలేపనము నేకమును వాతోపదంశములందు హితకరములు. నింబము మద్దిచెక్క రావిచెక్క కదంబము సాలము నేరేడు నుత్తి జువ్వి వేపను వీటిచూర్ణములో పిత్తరక్తమునందు ప్రక్షాళన చేయవలయును. ఈమూలికలతో సిద్ధముచేసిన ఘృతము హితకరము. త్రిఫలములను కషాయమును చేసి గాని గుంటగలగరాకు రసముతో గాని గాయములను తోమిన నుపదంశములు శాంతించును. ఉసిరిక కరక్కాయలు తాడి వీటిని సమభాగములుగా కటాహమునందు వైచి దగ్ధము చేసి తేనెలో కలిపి లేపన చేసిన తత్కాలము నందు రోపణములు కలుగును. తుమ్మచెక్క చూర్ణముతో కాని దానిమ్మచెక్క చూర్ణముతో గాని మనుజుని యెముకల చూర్ణముతో గాని గుందన ముపదంశమును పోగొట్టును. పోకచెక్కలను గన్నేరునుగాని నూరి లేపన చేయవలయును. యవలఅన్నము బావినీళ్లు నిందు పథ్యములు. అగణి జాజి గన్నేరు జిల్లేడు అమ్లవేతము వీటిఆకులతో కషాయమును కాచి లింగమును పక్వముగా కడుగుట ద్వారా ప్రయోగింపవలయును.

### భూనింబాద్య ఘృతము.

శ్లో. భూనింబనింబత్రిఫలాపటోల కరంజజాతీఖదిరాశనానాం, సతోయకల్కై ర్ఘృత మాశు పక్వం సర్వోపదంశాపహరం ప్రదిష్టం.

నేలవేము నింబము త్రిఫలములు చేదుపొట్ల నెమలియడుగు జాజి కాచు రాస్న వీటికషాయ కల్కములలో సిద్ధము చేసిన ఘృతము సమస్తవిధము లగు నుపదంశములను పోగొట్టును.

### కరంజాదిఘృతము.

శ్లో. కరంజనింబార్జునశాలజంబూ వటాదిభిః కల్కకషాయసిద్ధం, సర్పి ర్నిహన్త్యా దుపదంశదోషం సదాహపాకం స్రుతిరాగయుక్తం. 13.

నెమలియడుగు వేప అర్జునము మద్దినేరేడు వీటికల్కకషాయములలో సిద్ధము చేసిన నేయి దాహపాకసహితమును స్రావసహితము నగు ఉపదంశములనైనను పోగొట్టును.

అగారధూమతైలము.

శ్లో. అగారధూమరజనీ సురాకిట్టం చ తైస్త్రిభిః, భాగోత్తరైః పచే త్తైలం కండూశోధరుజాపహం. 14. శోధనం రోపణం చైవ సవర్ణకరణం తథా, అర్శసాం ఛిన్నదగ్ధానాం క్రియాకార్యోపదంశవత్. 15.

ఇంటిబూజు పసపు మద్యము వీటిని భాగోత్తరములుగా తైలములో పక్వముచేసి యుపయోగించినను యుపదంశాదులు నివర్తించును.

ఇది చక్రదత్తయందు ఉపదంశాధికారప్రకరణము ముగిసెను.



# ౪౮. శూకదోషాధికారము.

శూకదోషములకు సామాన్యోపాయములు.

శ్లో. హితంచ సర్పిషః పానం పథ్యం చాపి విరేచనం, హితశ్శోణితమోక్షశ్చ యచ్చాపి లఘుభోజనం. 1. సర్షపీం లిఖితాం సూక్ష్మైః కషాయై రవచూర్ణయేత్, తైరేవాభ్యంజనం తైలం సాధయే ద్వ్రణరోపణం.2. క్రియేయ మధిమంథేపి రక్తం స్రావ్యం తథోభయోః, అష్ఠీలాయాం హృతే రక్తే శ్లేష్మగ్రంథివ దాచరేత్. 3. కుంభికాయాం హరేద్రక్తం పక్వాయాం శోధితే వ్రణే, తిందుకాత్రిఫలాలోధ్రై ర్లేప స్తైలం చ రోపణం. 4. అలజ్యాం హృతరక్తాయా మయ మేవ క్రియాక్రమః, స్వేదయే ద్గ్రథితం స్నిగ్ధం నాడీస్వేదేన బుద్ధిమాన్. 5. సుఖోష్ణై రుపనాహైశ్చ సస్నిగ్ధై రుపనాహయేత్,ఉత్తమాఖ్యాం తు పిడకాం సంఛిద్య బడిశోద్ధృతాం. 6. కల్కైశ్చూర్ణైః కషాయాణాం క్షౌద్రయుక్తై రుపాచరేత్, క్రమః పిత్తవిసర్పోక్తః పుష్కరీమూఢయో ర్హితః. 7. త్వక్పాకే స్పర్శహాన్యాం చ సేచయే న్మృదితం పునః, బలాతైలేన కోష్ణేన మధురై శ్చోపనాహయేత్. 8. రసక్రియా విధాతవ్యా లిఖితే శతపోనకే, పృథక్పర్ణ్యాదిసిద్ధం చ తైలం దేయ మనన్తరం. 9. పిత్త

విద్రధివచ్చాపి క్రియాశోణితజేఽర్బుదే, కషాయకల్కసర్పింషి తైలం చూర్ణం రసక్రియాం. 10. శోధనే రోపణే చైవ వీక్ష్య వీక్ష్యావతారయేత్, అర్బుదం మాంసపాకం చ విద్రధిం తిలకాలకం. 11. ప్రత్యాఖ్యాయ ప్రకుర్వీత భిషక్తేషాం ప్రతిక్రియాం. 12.

నేయి త్రాగుటయును విరేచనముం జేయించుటయును నెత్తుటిని వెడలించుటయును లఘ్వాహారమును ఇందు మిక్కిలి హితకరములు. ఆవాలు కషాయములతో చేర్చి సిద్ధము చేసిన తైలమును రుద్దిన గాయములం దంకురములు కలుగును. ఈచికిత్సనే అధిమంథమునకును చేయవలయును. ఈరెండిటిలో రక్తస్రావము అష్టిలాయందు రక్తస్రావము అయినపిమ్మట గ్రంథులకువలె చికిత్సను చేయవలయును. కుంభికయందు రక్తమును వెడలింపవలయును. పక్వమైన కుంభికయందు గాయమును శోధించి త్రిఫలములు లోధ్ర వీటిలేపనమును తైలమును రుద్దినగాయములు అంకురించును. అలజీకి రక్తమును వెడలించిన పిమ్మట ఈచికిత్సనే చేయవలయును. గ్రథితమును స్నిగ్ధమును చేసి బుద్ధిమంతుఁడు నాడీస్వేదముతో స్వేదనం జేయింపవలయును. సుఖప్రాగ్వకముగా వెచ్చని స్నిగ్ధమగు వాటితో నుపనాహము చేయింపవలయును. పెద్దపిడికలను చక్కగా ఛేదనచేసి బడిశముతో ఉద్ధరించి కషాయము కల్కము చూర్ణమునందు తేనెను కలిపి సేవింపవలయును. పిత్తవిసర్పియందు చెప్పినక్రమమే పుష్కరియందును హితకరము. త్వక్పాకము స్పర్శహాని మృదితము వీట్లకు మాటిమాటికిని సేచన చేయవలయును. కొంచెము వెచ్చజేసిన ముత్తువపులగపు తైలమును మధురపదార్థములతో నుపనాహము చేయవలయును. శతపోనకమునందు రసక్రియను చేయుట మంచిది. కషాయము కల్కము నేయి తైలము చూర్ణము రసక్రియ వీటిని చక్కగా పరీక్షించి శోధనమునందు నుపయోగింపవలయును. అర్బుదము మాంసపాకము విద్రధి తిలకాలకము వీటిని వదిలిపెట్టి తక్కినవానికి వైద్యుఁడు చికిత్స చేయఁబడును.

ఇట్లు చక్రదత్తయందు శూకదోషాధికార ప్రకరణము ముగిసెను.

---

# ౪౮. భగ్నాధికారము.

## భగ్నమునకు సామాన్యోపాయములు.

శ్లో. ఆదౌ భగ్నం విదిత్వా తు సేచయే చ్ఛీతలాంబునా, పంకేనాలేపనం కార్యం బంధనం చ కుశాన్వితం. 1. సుశ్రుతోక్తంచ భగ్నే

షు వీక్ష్య బంధాది మాచరేత్, అవనామిత మున్నహ్యా దున్నతం చావనామయేత్. 2. ఆచ్ఛేదతి క్షిప్త మధోగతం చోపరివర్తయేత్, ఆలేపనార్థం మంజిష్ఠా మధుకం చామ్లపేషితం. 3. శతధౌతఘృతోన్మిశ్రం శాలిపిష్టం చ లేపనం, సప్తరాత్రా త్సప్తరాత్రా త్సౌమ్యే ష్వృతుషు మోక్షణం. 4. కర్తవ్యం స్యా త్త్రిరాత్రా చ్చ తథాగ్నేయేషు జానతా, కాలే చ సామశీతోష్ణ పంచరాత్రా ద్విమోచయేత్. 5. న్యగ్రోధాది కషాయం చ సశీతం పరిషేచనే, పంచమూలీవిపక్వం తు క్షీరం దద్యా త్సవేదనే. 6. సుఖోష్ణ మవతార్యం వా చక్రతైలం విజానతా, మాంసం మాంసరస స్సర్పిః క్షీరం యూషః సతీనజః. 7. బృంహణం చాన్నపానం చ దేయం భగ్నం విజానతా, గృష్టిక్షీరం ససర్పిష్కం మధురౌషధసాధితం. 8. శీతలం ద్రాక్షయా యుక్తం ప్రాత ర్భగ్నః పిబే న్నరః, సఘృతేనాస్థిసంహారం లాక్షాగోధూమ మర్జునం. 8. సంధియుక్తే స్థిభగ్నే చ పిబేత్ క్షీరేణ మానవః, రసోన మధులాక్షాజ్య సితాకల్కం సమశ్నతాం. 10. భిన్నభిన్నచ్యుతాస్థీనాం సందాన మచిరా ద్భవేత్, పీతవ రాటుకాచూర్ణం ద్విగుంజం వా త్రిగుంజకం, అపక్వక్షీరపీతం స్యా దస్థిభగ్నప్రరోహణం.

తొలుత విఱిగిన స్థలమును గుర్తించి చల్లనినీటితో సేచనచేయవలయును. బురదతో లేపనచేయుటయును కుశలతో కట్టుటయును హితకరములు. భగ్నములందు సుశ్రుతుడు చెప్పినదాని చక్కగా చూచి చేయవలయును. వంగినదానిని ఎత్తి కట్టవలయును. ఎత్తికొనియున్నదానిని వంచి కట్టవలయును. లేపనకొఱకు మంజిష్ఠము మధుకమును పుల్లనిరసముతో నూరి మూడువందల మారులు వడియకట్టిన నేతిలోకలిపి బియ్యమును నూరి పట్టింపవలయును. పంచమూలములలో పక్వముచేసిన పాలను బాధకల భగ్నరోగమునందు ఈయవలయును. లేనిచో నిపుణుడైన వైద్యుడు వెచ్చగా చక్రతైలము నుపయోగింపవలయును. మాంసరసము నేయి పాలు చిరిసెనగలయూషము పుష్టిని కలిగించు అన్నమును భగ్నరోగమునం దుత్తములు.

## లాక్షాగుగ్గులము.

శ్లో. క్షీరం సలాక్షా మధుకం ససర్పి స్స్యా జ్జీవనీయం చ సుఖావహం చ. భగ్నః పిబే త్త్వక్పయ వార్జునస్య గోధూమచూర్ణం సఘృ

తేన వాథ. 12. లాక్షాస్థి సంహృత్కకుభాశ్వగంధా, శ్చూర్ణీకృతానా గబలాపురశ్చ, సంభగ్నయుక్తాస్థిరుజం నిహన్యా, దంగాని కుర్యాత్కులిశోపమాని.13. అత్రాన్యతోపి దృష్టత్వా త్తుల్య శ్చూర్ణేన గుగ్గులుః.

పాలు లక్క మధుకము నేయి జీవనీయగణపుటౌషధములను త్రాగవలయును. అర్జునపుచెక్కను పాలతోనైనను నేతిని పాలతోనైనను గోధుమచూర్ణమును సేవించిన భగ్నములం సహితకరమగును. లక్క అర్జునపుచెక్క పెన్నేరు పెద్దముత్తువ పులగము గుగ్గిలము వీటిని చూర్ణముచేసి తినిన ఎముకలు విఱుగుటతోటికూడిన సమస్త బాధలును నశించును.

## ఆభాగుగ్గులు.

శ్లో. ఆభాఫలత్రికై ర్వ్యోషై స్సర్వై రేభి స్సమాంశకైః
తుల్యో గుగ్గులు రాయోజ్యో భగ్నసంధిప్రసాధకః. 14.

పెద్దపిల్లపీచర త్రిఫలములు శొంఠి మిరియములు పిప్పళ్లు వీటినిసమానభాగము చేసి వీటిఅన్నిటియంత గుగ్గిలమును చూర్ణముచేసి సేవించిన భగ్నసంధు లదుకుకొనును.

## గంధతైలము.

శ్లో. సవ్రణస్య తు భగ్నస్య వ్రణం సర్పి ర్మధూత్తమైః, ప్రతిసార్య కషాయై శ్చ శేషం భగ్నవ దాచరేత్. 15. భగ్నం నైతి యథాపాకం ప్రయతేత తథా భిషక్, వాతవ్యాధివినిర్దిష్టా న్స్నేహా నత్ర ప్రయోజయేత్. 16. రాత్రౌ రాత్రౌ తిలా న్కృష్ణా న్వాసయే దస్థిరే జలే, దివా దినైవ సంశోష్య క్షీరేణ పరిభావయేత్. 17. తృతీయం సప్తరాత్రం చ భావయే న్మధుకాంబునా, తతః క్షీరం పునః పీతా న్సుశుష్కాం శ్చూర్ణయే ద్భిషక్. 18. కాకోల్యాదిశ్వదంష్ట్రాం చ మంజిష్ఠాం శారివాం తథా, కుష్ఠం సర్జరసం మాంసీం సురదారు సచందనం. 19. శతపుష్పాం చ సంచూర్ణ్య తిలచూర్ణేన యోజయేత్, పీడనార్థం చ కర్తవ్యం సర్వగంధై శ్శృతం పయః. 20. చతుర్గుణేన పయసా తత్తైలం విపచే త్తునః, ఏలా మంశుమతీం పత్రం జీరకం తగరం తథా. 21. లోధ్రం ప్రపౌండరీకం చ తథా కాలానుశారివాం, శైలేయకం క్షీరశుక్లా మనన్తాం సమధూలికాం. 22. పిష్ట్వా

శృంగాటకం చైవ ప్రాగుక్తా న్యౌషధాని చ, ఏభి స్త ద్విపచే త్తైలం శాస్త్రవి న్మృదునాగ్నినా. 23. ఏత త్తైలం సదా పథ్యం భగ్నానాం సర్వ కర్మసు, ఆక్షేపకే పక్షఘాతే చాంగశోషే తథార్దితే. 24. మన్యా స్తంభే శిరోరోగే కర్ణశూలే హనుగ్రహే, బాధిర్యే తిమిరే చైవ యే చ స్త్రీషు క్షయం గతాః. 25. పథ్యం పానే తథాభ్యంగే నస్యే వస్తిషు యోజయేత్, గ్రీవాస్కంధోరసాం వృద్ధి రనే నైవోపజాయతే. 26. ముఖం చ పద్మప్రతిమం స్వస్వగంధిసమీరణం, గంధతైల మిదం నామ్నా సర్వవాతవికారనుత్. 27. రాజార్హ మేత త్కర్తవ్యం రాజ్ఞా మేవ విచక్షణైః, తిలచూర్ణచతుర్థాంశం మిళితం చూర్ణమిష్యతే. 28. లవణం కటుకం క్షార మమ్లం మైథున మాతపం, వ్యాయామం చ న సేవేత భగ్నో రూక్షాన్న మేవ చ, 29.

గాయములైన భగ్నపుగాయములను తేనె త్రిఫలములు వీటికషాయముతో ప్రతిసారణము చేసి తక్కినదానిని భగ్నమునకువలెనే చికిత్స జేయవలయును. రాత్రులు నల్లనువ్వులు పారెడు నీటిలో వాసితముచేసి ప్రతిదినము సుఖముగా పాలతో భావన చేయవలయును. మూడవసప్తరాత్రము మధుకకషాయముతో భావన చేసి పాలను పీల్చిన తిలలను చూర్ణము చేయవలయును. కాకోల్యాదిగణము పల్లేరు మంజిష్ఠ మను బాల కోష్ఠు జటామాంసి సజ్జరసము దేవదారువు చందనము సోంపు వీటిచూర్ణమును తిలచూర్ణముతో చేర్చి పీడనార్థము గంధద్రవ్యముతో పక్వము చేసి పాలను కాచవలయును. పిమ్మట దానికి నాలుగురెట్లు తిలతైలమును మఱల పక్వము చేయవలయును. ఏలకులు అంశుమతి జాపత్రి జీలకర్ర తగరము లోధ్రము ఉత్తరేణు లోవానము క్షీరకాకోలి మధుకములును శృంగాటకమును పూర్వపు ఔషధులును వీటితో తైలమును సన్ననిసెగతో పక్వముచేసి యుపయోగించినచో హితకరము. దీనిని ఆక్షేపకము పక్షఘాతము అంగశోషము మున్నగు వానియందు వాడవలయును. ఇయ్యది గంధతైలము. సమస్త వాతవికారములను పోగొట్టును. రాజయోగ్యమగు తైలము. తిలచూర్ణము నాలుగవపాలు కలిపిన చూర్ణముగా నుండవలయును. ఉప్పు కటు క్షారము పులుసు స్త్రీభోగము రూక్ష భోజనము భగ్నరోగి వదలివేయవలయును.

ఇట్లు చక్రదత్తయందు భగ్నాధికారప్రకరణము ముగిసెను.

---

# ౪౯. కుష్ఠాధికారము.

కుష్ఠుకు పంచకషాయములు.

శ్లో. వాతోత్తరేషు సర్పి ర్వమనం శ్లేష్మోత్తరేషు కుష్ఠేషు, పిత్తోత్తరేషు మోక్షో రక్తస్య విరేచనం చాగ్ర్యం. 1. ప్రోచ్ఛన మల్పే కుష్ఠే మహతి చ శస్త్రం శిరావ్యధనమ్, బహుదోషః సంశోధ్యః కుష్ఠీ బహుశోఽనురక్షతా ప్రాణాన్, వచావాసాపటోలానాం నింబస్య ఫలినీత్వచః, కషాయో మధునా పీతో వా న్తిక్ర స్మదనాన్వితః. 3.

వాతాధిక్యముగలదానికి నేయియును కఫాధిక్యతగల కుష్ఠునకు వమనమును పిత్తాధిక్యతగల కుష్ఠునకు రక్తవిస్రావనమును విరేచనములును శ్రేష్ఠములు. అల్పకుష్ఠువునకు ప్రోచ్ఛనమును ఎక్కువదానియందు నాడీవేధనమును శ్రేష్ఠములు. బహుదోషములుగల కుష్ఠురోగి సంశోధము చేయదగినవాడు. వస అడ్డసరము పటోలము నింబము కలుకాని నుగ వీటిబెరడును కషాయము చేసి తేనె యుష్మైత్తరసములను చేర్చ త్రాగినచో వాంతులను గలిగించును.

విరేచనాదులు.

శ్లో. విరేచనం తు కర్తవ్యం త్రివృద్దన్తీఫలత్రికైః, యే లేపాః కుష్ఠానాం, ప్రయుజ్యన్తే నిర్గతాస్రదోషాణాం, సంశోధితాశయానాం స్సద్య స్సిద్ధి ర్భవతి తేషాం. 4. మనశ్శిలాలే మరిచాని తైల, మార్కం పయః కుష్ఠహరః ప్రదేహః, కరంజబీజైడగజః సకుష్ఠో,గోమూత్రపిష్టశ్చ వరః ప్రదేహః. 5. పత్రాణి పిష్ట్వా చతురంగులస్య, తక్రేణ పర్ణా న్యథ కాకమాచ్యాః, తైలాక్తగాత్రస్య నరస్య కుష్ఠా న్యుద్వర్తయేదశ్వహనచ్ఛదైశ్చ. 6. ఆరగ్వధః సైడగజః కరంజో వాసాగుడూచీమదనంహరిద్రే, శ్ర్యాహ్వాః సురాహ్వాః ఖదిరో ధవ శ్చ నింబో విడంగం కరవీర క శ్చ. 7. గ్రంధి శ్చ భార్గా లశున శ్శిరీషః సలోమశో గుగ్గులు కృష్ణగంధే, పణిజ్జకో వత్సకస ప్తపర్ణ్ణ పీలూని కుష్ఠం సుమనః ప్రవాలః. 8. వచాహరేణుత్రివృతాని కుంభీ భల్లాతకంగైరికమంజనం చ, మనశ్శి

లాలే గృహధూమపేలా కాసీసలోధ్రార్జునము స్తసర్జాః. 9. ఇత్యర్ధరూపై ర్విహితా షడేతే గోపిత్తపీతాః పునరేవ పిష్టాః, సిద్ధాః పరం సర్షపతైలయుక్తా శ్చూర్ణప్రదేహాః భిషజా ప్రయోజ్యాః. 10. కుష్ఠాని కృచ్ఛ్రాణి నవం కిలాసం సురేంద్రలుప్తం కిటిభం సదద్రుం, భగందరార్శాంసి స్వపచీం సపామాం హన్యుః ప్రయుక్తా అచిరా న్నరాణాం. 11.

తెల్లతెగడ దంతి త్రిఫలములు వీటితో విరేచనమున కిప్పించవలయును. నిర్గతాస్రదోషులకు సంశోధితమగు ఆమాశయము గలవారికి కుష్ఠరోగులకు ఇట్టి లేపమును ప్రయోగించిన శీఘ్రముగా సిద్ధి అగును. మనశ్శిల హరిదలము మిరియములు తైలము జిల్లేడుపాలు వీటిలేపము కుష్ఠులను హరించును. నెమలిఅడుగువిత్తులు బావంచాలవిత్తులు కోష్ఠు వీటిని గోమూత్రముతో నూరి లేపన చేసిన కుష్ఠములకు మంచిది. అల్లవేతపు ఆకులను మజ్జిగతో కాకమాచి మణోహాపుఆకులు నూరి గన్నేరురసముతో తైలమును తడిపి ఉద్వర్తనము (నలుగు) పెట్టింపవలయును. రేలచెక్క నెమలియడుగు అడ్డసరము తిప్పతీగ ఉమ్మెత్తకాయ పసుపు మ్రానిపసుపు మారేడు భుజపత్రము ఉల్లిగడ్డ దిరిసెన నీలి గుగ్గులు నంగ కాను శ్వేత మరువము కోష్ఠు సప్తల పీలు కుష్ఠము జాజిచిగుళ్లు వస రేణుకబీజములు తెల్లతెగడ దంతి హరితాళము ఇంటిబూజు ఏలకులు కాసీసము లొద్దుగ అర్జునము తుంగముస్తలు వీని అర్ధ అర్ధ శ్లోకములలో చెప్పినరీతి ఆరు చూర్ణములు చేసి గోపిత్తముతో ముద్ద జేసికొని ఆవనూనెతో చేర్చి లేపన చేయవలయును. కష్టసాధ్యములగు కుష్ఠులు మున్నగునవి దీనిచే నశించును.

## మనశ్శిలాదితర ప్రదేహములు.

శ్లో. మనశ్శిలా త్వక్కుటజా త్సకుష్ఠా త్సలోమశః సైడగజః కరంజః, గ్రంథిశ్చ భూర్జః కరవీరమూలం చూర్ణాని సాధ్యాని తుషోదకేన. 12. పలాశనిర్దాహరసేన చాపి క్షీరోద్ధృతా న్యాఢకిసంమితేన, దర్వీప్రలేపం ప్రవదన్తి లేప మేతత్పరం కుష్ఠవినాశనాయ. 13. కుష్ఠం హరిద్రే సరసం పటోలం నింబాశ్వగంధే సురదారు శిగ్రు, ససర్షపం తుంబురుధాన్యవన్య చండా శ్చ దూర్వా శ్చ సమాని కుర్యాత్. 14. తైస్తక్రయుక్తైః ప్రథమం శరీరం తైలాక్త ముద్వర్తయితుం యతేత, తథాస్య కండూః పిడకాః సకోఠాః కుష్ఠాని శోథాశ్చ శమం ప్రయాన్తి. 15.

కొడిసెపాలవిత్తులు కోష్ఠు సైంధవలవణము గంజి వాయువిడంగములు వీటిలేపనము క్రిమిరోగములను దద్రుమండలకుష్ఠువులను పోగొట్టును. జెముడుకాడరసములో సర్షపకల్కమునుంచి బొగ్గునిప్పులతో పక్వము చేసి లేపన చేసినచో విచర్చికలు నశించును. జెముడుకాడరసములో బూజు సైంధవలవణములనుంచి పొగ బయటపోకుండ భస్మము చేసి తైలముతో లేపన చేసిన విచర్చికలు నశించును. తగిరిసెవిత్తులు తిలలు ఆవాలు కోష్ఠు పిప్పళ్లు అంటుప్పు సౌవర్చలవణము సైంధవలవణము వీటిని దుర్వాసన కలుగచేసి లేపనచేసిన విచర్చికాదులు నశించును. ఉమ్మెత్తగింజలు క్షారోదకములతోను ఆవనూనెతోను కాచి యుపయోగించినచో విపాదికలు నశించును.

## ధాత్ర్యాదిలేపనములు.

శ్లో. ధాత్ర్యక్షపథ్యాక్రిమిశత్రువహ్ని భల్లాతకావల్గుజలోహభృంగైః, భాగాభివృద్ధైస్తిలతైలమిశ్రైః సర్వాణి కుష్ఠాని నిహన్తి లేపః. 16. విడంగసైంధవశివా శశిరేఖాసర్షపకరంజరజనీభిః, గోజలపిష్టో లేపః కుష్ఠహరో దివసనాథసమః. 17. విడంగైడగజాకుష్ఠనిశాసింధూత్థసర్షపైః, ధాన్యామ్లపిష్టైర్లేపోయం దద్రూకుష్ఠరుజాపహః. 18. దూర్వాభయాసైంధవచక్రమర్ద కుఠేరకాః కాంజికతక్రపిష్టాః, త్రిభిః ప్రలేపైరతిబద్ధమూలం దద్రుం చ కుష్ఠం చ నివారయన్తి. 19. తుల్యో రసస్సాలతరోస్తుషేణ సచక్రమర్దేప్యభయావిమిశ్రః, పానీయభక్తేన తదాంబుపిష్టో లేపః కృతో దద్రుగజేంద్రసింహః. 20.

తాడి యుసిరిక కరక్కాయలు వాయువిడంగములు చిత్రమూలము నల్లజీడివిత్తనములు బావంచాలు లోహము గంటుభారంగి—వీటిని ఉత్తరోత్తరముగా వృద్ధిభాగములతో గ్రహించి అనగా క్రమముగా నొకదానికంటె నొకటి హెచ్చుగాచేకొని తిలతైలమును కలిపిలేపనచేయించినచో సమస్తములగు కుష్ఠులును నశించును. వాయువిడంగములు సైంధవలవణము కరక్కాయ బావంచాలు చెంగల్వకోష్ఠుపసపు—వీటినిగోమూత్రముతోనూరి లేపనచేసినచో సూర్యునితోసమానముగా సమస్తకుష్ఠములను ఉన్మూలింపజేయును. వాయువిడంగములు తింటెపుచెక్క కోష్ఠు పసపు సైంధవలవణము ఆవాలు వీనినిధాన్యామ్లముతోనూరిలేపనజేసినను కుష్ఠురోగములుహరించును. దూర్వాలు (గరికలు) కరక్కాయ సైంధవలవణము తింటెపుగింజలు వసతులసి—వీటిని గంజితో

గాని మజ్జిగతో గానినూరి లేపనచేసినచో దద్రురోగములను కుష్ఠురోగములనుకూడ నశింపజేయును. మద్దిచెక్కరసముతో తింటెపుగింజలు కరక్కాయవీటిని నీటితో నూరి లేపనచేసినచో దద్రురోగములణెడి ఏనుగులకియ్యది సింహప్రాయము కాగలదు.

—॰ ప్రపున్నాడాదిఉద్వర్తనము. ॰—

శ్లో. ప్రపున్నాడస్య బీజాని ధాత్రీసర్జరసస్స్నుహీ, సౌవీరపిష్టం దద్రూణా మేత దుద్వర్తనం పరం. 21. చక్రమర్దకబీజాని కరంజం చ సమాంశకం, స్తోకం సుదర్శనామూలం దద్రుకుష్ఠవినాశనమ్. 22. లేపనా ద్భక్షణాచ్చైవ తృణకం దద్రునాశనం, యూథీపున్నాగమూలం చ లేపా త్కాంజికపేషితం. 23. కాసమర్దకమూలం చ సౌవీరేణ చ పేషితమ్, దద్రూకిటిభకుష్ఠాని జయే దేతత్ప్రలేపనాత్. 24. శిఖరిరసేనసుపిష్టం మూలకబీజం ప్రలేపత స్సిధ్మ, క్షారేణ వా కదల్యా రజనీమిశ్రేణ నాశయతి. 25. గంధపాషాణచూర్ణేన యవక్షారేణ పేషితమ్, సిధ్మనాశం వ్రజ త్యాశు కటుతైలయుతేన వా. 26. కాసమర్దకబీజాని మూలకానాం తథైవ చ, గంధపాషాణమిశ్రాణి సిధ్మానాం పరమౌషధమ్. 27. ధాత్రీరస స్సర్జరస స్సపాక్యః సౌవీరపిష్టశ్చ తథాయుతశ్చ,భవన్తి సిధ్మాని యథా న భూయ స్తథైవ ముద్వర్తనకం కరోతి.28.

తింటెపుగింజలను ఉసిరిక సర్జరసము జెముడుపాల- అను వీనిని గంజితో నూరి పట్టించిన దద్రువులకు హితము. మఱియు తింటెపుగింజలను కానుగ వీటిని సమానభాగములను తెచ్చి కొంచెము సుదర్శనమూలమును చేర్చి నూరి లేపనచేసిన దద్రువులు నశించును. తృణకమును (సుగంధితృణమును) నూరి లేపనచేసినను లేక భక్షించినను దద్రువులు నశించును. నంద్యావర్తపుపూవులు పున్నాగమూలము వీటిగంజితో నూరి పూసినను, కాసమర్దకమూలమును సౌవీరలవణముతో నూరి పూసినను, ముల్లంగిగింజలను ఉత్తరేణురసముతో నూరి పూసినను, యవక్షారము అరటి పసపు వీటిని నూరి పూసినను, గంధపాషాణచూర్ణముతో యవక్షారమును నూరి పూసినను లేక కటుతైలముతో లేపనచేసినను సిధ్మలన్నియును నశించును. చేదుపొట్లగింజలను ముల్లంగివిత్తులను గంధపాషాణముతో నూరిపూసినను సిధ్మలు కుదురగలవు. మఱియును ఉసిరికరసము మద్దిరసము అంటుప్పు వీనిని గంజితో నూరి ముద్దచేసి నలుగుపెట్టినను సిధ్మలు నశించును.

### కుష్ఠాది లేపనములు.

శ్లో. కుష్ఠం మూలకబీజం ప్రియజ్గవ స్సర్షపా స్తథా రజనీ, ఏతత్కేసరకుష్ఠం నిహన్తి బహువార్షికం సిధ్మ. 29. నీలకురంటకపత్రం స్వరసేనాలిప్య గాత్ర మతిబహుశః, లింపే న్మూలక బీజై స్తక్రే ణైత ద్ధి సిధ్మనాశాయ. 30. చక్రాహ్వయం స్నుహీక్షీరభావితం మూత్రసంయుతం, రవితప్తం హి కించిత్తు లేపనా త్కిటిభాపహమ్. 31. ఆరగ్వధస్య పత్రాణి ఆరనాళేన పేషయేత్, దద్రూకిటిభకుష్ఠాని హన్తి సిధ్మాన మేవ చ. 32. బీజానివా మూలకసర్షపాణాం లాక్షారజన్యో ప్రపునాడబీజం. 33. శ్రీవేష్టకవ్యోషవిడంగకుష్ఠం పిష్ట్వా చ మూత్రేణ తు లేపనం స్యాత్, దద్రూణి సిధ్మం కిటిభాని పామాం కాపాలకుష్ఠం విషమం చ హన్యాత్. 34.

కోష్టు ముల్లంగివిత్తులు ప్రేంకణము ఆవాలు పసపు వీటిని నూరి లేపనచేసినచో అనేకములగు ఏండ్లనుండి వచ్చుచున్న సిధ్మరోగమైనను నశించును. నల్లగోరింటరసము తో ముల్లంగివిత్తులను నూరి మజ్జిగకలిపి పూసినచో సిధ్మలు నశించును. దింటెనను జెముడుపాలలో భావనచేసి గోమూత్రములో నెండలో నెండించి నూరి పూసినను, రేలపూవులను గంజితోనూరి పూసినను దద్రుకిటిభకుష్ఠములు నశించును. సిధ్మలును నివర్తించును. ముల్లంగిగింజలను ఆవాలు లక్క పసపు తెలెనగింజలు వీటినిన్ని శ్రీవేష్టకము వాయువిడంగములు చెంగల్వకోష్ఠులను గోమూత్రముతో నూరి పూసినచో దద్రురోగములు సిధ్మలు కిటిభరోగములు పామ కపాలకుష్ఠము ఇయ్యవి నశించును.

### ఏడగజాదిలేపనములు.

శ్లో. ఏడగజకుష్ఠసైంధవ సౌవీరసర్షపైః క్రిమిఘ్నైశ్చ, క్రిమిసిధ్మదద్రుమండల కుష్ఠానాం నాశనో లేపః. 35. స్నుక్కాండే సర్షపాత్కల్కః కుకూలానిలపాచితః, లేపా ద్విచర్చికాం హన్తి రాగవేగ ఇవ త్రపామ్. 36. స్నుక్కాండే సుషిరే దగ్ధ్వా గృహధూమం ససైంధవమ్, అన్తర్ధూమం తైలయుక్తం లేపా ద్ధన్తి విచర్చికామ్. 37. ఏడగజాతిలసర్షప కుష్ఠమాగధికా లవణత్రయయుస్తు, పూతికృతం దివసత్రయ మేతద్ధన్తి విచర్చికా దద్రుసకుష్ఠం. 38. ఉన్మత్తకస్య బీజేన మాణకక్షారవారిణా, కటుతైలం విపక్తవ్యం శీఘ్రం హన్యా ద్విపాదికామ్. 39. నారికేళోదకే న్యస్తా స్తండులాః పూతితాం గతాః, లేపా ద్విపాదికాం

ఘ్నన్తి చిరకాలానుబంధినీం. 40. సర్జరసః సింధుసంభవ గుడమధుమహిషాక్షగైరికం సఘృతం, సిక్థక మేతత్ప్రక్వం పాదస్ఫుటనాపహం సిద్ధం. అవల్గుజం కాసమర్దం చక్రమర్దం నిశాయుతమ్. 41. మాణిమంథేన తుల్యాంశం మస్తు కాంజికపేషితం, కచ్ఛూం కండూం జయ త్యుగ్రాం సిద్ధ ఏష ప్రయోగరాట్. 42. కోమలం సింహాస్యదలం సనిశం సురభిజలేన సంపిష్టమ్, దివసత్రయేణ నియతం క్షపయతి కచ్ఛూం విలేపనతః. 43.

తింటెనగింజను కోష్ఠు సైంధవలవణము సౌవీరాంజనము ఆవాలు వీనిని నూరి లేపన చేసిన క్రిమిసిద్మ దద్రు కుష్ఠు ఫులునశించును. జెముడుపాలకాడలను ఆవాలతో నూరి కొలదిపాటి సెగమీద కల్కము చేసి లేపనచేసినచో విచర్చికలు నశించును. ఇంటిబూజు తైలముతో నూరి పూసినను విచర్చికలు నశించును. తింటెనవిత్తులు నువ్వులు ఆవాలు కోష్ఠు లవణములు మూడును నూరి పూసినచో పూతిగంధము గలవిచర్చికలును దద్రువులును కుష్ఠురోగములును నశించును. ఉమ్మెత్తగింజలను నూనకంద వీటినిక్షారోదకములతో కలిపి కటుతైలమును సిద్ధముచేసి పూసినచో విచర్చికలు నశించును. ఎడవీటికాయలో బియ్యము నానబెట్టి నుగినతర్వాత నూరి పూసినను దద్రువులు కుష్ఠువు విచర్చికలును నశించును. సర్జరసము సైంధవలవణము బెల్లము తేనె మైసాక్షిగుగ్గిలము వీటిని నేతితో నూరి పూసినను సిక్థకములు హరించును. బావంచాలను పసపు తింటెనగింజలను నూరిపూసినను కచ్ఛూకండ్వాదులు నశించును. అడ్డసరముయొక్క లేతఆకురసముతో పసపును నూరి పూసినప్పటికిని మూడునాళ్లలో కచ్ఛువులు నశించిపోగలవు. ఇయ్యది సిద్ధక్రియ యనియు నెఱుంగా వలయును.

## గోమూత్రపానాదులు.

శ్లో. హరిద్రాకల్కసంయుక్తం గోమూత్రస్య పలద్వయం, పిబేన్నరః కామచారీ కచ్ఛూపామావినాశనం. 44. శోథపాండ్వామయహరీ గుల్మమేహకఫాపహా, కచ్ఛూపామాహరీ చైవ పథ్యా గోమూత్రసాధితా. 45. పిబతి సకటుతైలం గంధపాషాణచూర్ణం, రవికిరణసుతప్తం పామలో యః పలార్ధం, త్రిదినతదనుసిక్తః క్షీరభోజీచ శీఘ్రం, భవతి కనకదీప్త్యా కామయుక్తో మనుష్యః 46.

రెండుపలముల గోమూత్రములో హరిద్రాకల్కమును చేర్చికొని కామచారియగు వాడు త్రాగనేని కచ్ఛువు పామ నశించును. గోమూత్రములో సాధించిన కర

కాయలు శోఫ పాండురోగము గుల్మము ప్రమేహము మున్నగువానిని పోగొట్టును. గంధపాషాణచూర్ణమును ఆవనూనెలో కలిపికొని సూర్యకిరణములతో పక్వముచేసి అరపలము చొ॥ పామవ్యాధి గలవాడు త్రాగవలయును. దానితోనే సేకమును చేయవలయును. పాలనే త్రాగుచుండవలయును. ఇట్లైనచో బంగరువంటి కాంతి గలవాడగును.

## హారిద్రాలేపము.

శ్లో. నిశాసుధారగ్వధ కాకమాచీ పత్రైస్సదార్వీప్రపునాడబీజైః, తక్రేణ పిష్టైః కటుతైలమిశ్రైః పామాదిషూద్వర్తన మేతదిష్టం. 47. సిందూరమరిచచూర్ణం మహిషీనవనీతసంయుతం బహుశః, లేపాద్వినిహన్తి పామాం తైలం కరవీరసిద్ధం వా. 48. మాంసీ చందనసంపాక కరంజారిష్టసర్షపమ్, శటీకుటజదార్వ్యబ్దం హన్తి కుష్ఠమయం గణః. 49. భల్లాతకద్వీపిసుధార్కమూలం గుంజాఫలం త్ర్యూషణశంఖచూర్ణమ్, తుత్థం సకుష్ఠం లవణానిపంచ క్షారద్వయం లాంగలికాం చ పక్త్వా. 50. స్నుహ్యర్కదుగ్ధేఘన మాయసస్థం శలాకయా తం విదధీత లేపమ్. 51. కుష్ఠే కిలాసే తిలకాలకే చ అశేషదుర్నామసు చర్మకీలే, విషవరుణహరిద్రాచిత్రకాగారధూమ, మనిలమరిచదూర్వాః క్షీరమర్కస్నుహీభ్యాం. 52. దహతి పతితమాత్రాత్కుష్ఠజాతీరశేషాః, కులిశమివ సరోషాచ్ఛక్రహస్తాద్విముక్తమ్.

పసపు జముడు ఈల కామంచి వీటిఆకులను తగిరిసవిత్తులు వీటిని మజ్జిగతో నూరి తైలములో కలిపి పామాదిరోగములందు మర్దించుట మంచిది. సిందూరము మిరియములచూర్ణమును గేదనేతిలో కలిపిగాని గన్నేరుతో సిద్ధముచేసిన తైలమును గాని లేపన చేసిన పామ నశించును. జీడివిత్తులు చిత్రమూలము జెముడుచెక్క జిల్లేడుచెక్క చిరిసెనగ శొంఠి మిరియములు పిప్పళ్లు శంఖచూర్ణము మైలుతుత్తము కోష్ఠు పంచలవణములు వీటిని గంగళములోవైచి జెముడు జిల్లేడు పాలతో పక్వము చేసి గడ్డగట్టిన పిమ్మట లేపన చేయవలయును. కుష్ఠము కిలాసము మూలరోగము మున్నగునవి నశించును. ఇందు విషము వరుణపసపు చిత్రమూలము ఇంటిబూజు మిరియములు గరిక

అర॥– క్షీరస్నుహీక్షీరములను కలపవలయును. నీటిని పట్టించినమాత్రముననే సమస్త కుష్ఠములును నశించును.

నవకషాయము ౧.

శ్లో. శశాంకలేఖా సవిడంగసారా సపిప్పలీకా సహుతాశమూలా, సాయోమలా సామలకా సతైలా సర్వాణి కుష్ఠాన్యపహన్తి లీఢా. 53. తీవ్రేణ కుష్ఠేన పరీతదేహో యస్సోమరాజీం నియమేన ఖాదేత్, సంవత్సరం కృష్ణతిలద్వితీయాం ససోమరాజీం వపుషాతిశేత్. 54. ఖుర్జనేపికదుష్ణేన వారిణా వాగుజీం పిబేత్, క్షీరభోజీ త్రిసప్తాహాత్కుష్ఠరోగా ద్విముచ్యతే. 55. ఏకస్తిలస్య భాగా ద్వౌ సోమరాజ్యా స్తథైవ చ, భక్ష్యమాణ మిదం ప్రాత ర్గుహ్యాదన్రువినాశనమ్. 56. అవల్గుజా ద్బీజకర్షం పీత్వా కోష్ణేన వారిణా, భోజనం సర్పిషా కార్యం సర్వకుష్ఠప్రణాశనమ్. 57. త్రిఫలాపటోలరజనీ మంజిష్ఠా రోహిణీవచా నింబైః, ఏష కషాయోఽభ్యస్తో నిహన్తి కఫపిత్తజం కుష్ఠమ్. 58.

భావంచి వాయువిడంగములు పిప్పళ్లు చిత్రమూలము మండూరము ఉసిరిక తైలము వీటిని కలిపి భక్షించిన అన్నివిధములగు కుష్ఠులును నశించును. భయంకరమగు కుష్ఠుగలవారు నల్లనువ్వులతో చేర్చిన బావంచి విత్తనములను ఒక్కసంవత్సరము నియమముగా భక్షింపవలయును. ఖుర్జమును సేవించువాడు వేడినీళ్లతో నేకుగొజాలు త్రాగి పాలను త్రాగుచుండిన కుష్ఠు నశించును. తిలలు 1 భాగము బావంచి 2 భాగములు వీటిని ప్రొద్దుటనే భక్షించుచున్న గుహ్యద్రువులును నశించును. బావంచిని ఒకతులము విత్తనములను వేడినీళ్లతో త్రాగి నేతిని తినిన అన్నివిధములగు కుష్ఠులు నశించును. త్రిఫలములు పటోలము పసపు మంజిష్ఠ కటుకరోహిణి వస నింబము వీటికషాయమును నిరంతరమును త్రాగినను కుష్ఠులు నశించును.

ఛిన్నాస్వరసాది సేవనము.

శ్లో. ఛిన్నాయాః స్వరసో వాపి సేవ్యమానో యథాబలమ్, జీర్ణే ఘృతేన భుంజీత స్వల్పం యూషోదకేన వా. 59 అతిపూతిశరీరోపి దివ్యరూపో భవే న్నరః, పటోలఖదిరారిష్ట త్రిఫలాకృష్ణవేత్రజమ్. 60. తిక్తాశనః పిబే త్క్వాథం కుష్ఠీ కుష్ఠం వ్యపోహతి, తిలాజ్యత్రిఫలా క్షౌద్ర వ్యోషభల్లాతశర్కరాః. 61. వృష్యా స్సప్త సమో మేధ్యః

కుష్ఠహా కామచారిణః, విడంగత్రిఫలాకృష్ణా చూర్ణం లీఢం సమాక్షిక మ్. 62. హన్తి కుష్ఠం క్రిమీ న్మేహా న్నాడీవ్రణభగందరాన్, ఇంద్రాశనం గమాదాయ ప్రశస్తేహని చోద్ధృతం. 63. తచ్చూర్ణం మధుసర్పిర్భ్యాం లిహేత్తిరఘృతాశనః, హత్వాచ సర్వకుష్ఠాని జీవే ద్వర్షశతద్వయమ్. 64. యః ఖాదే దభయారిష్టం మరిచామలకాని వా, స జయే త్సర్వకుష్ఠాని మాసా దూర్ధ్వం న సంశయః. 65. దహ్యమానా చ్ఛ్వతః కుంభే మూలగే ఖదిరాద్రసః, సాజ్యా ధాత్రీరసక్షౌద్రో హన్యాత్కుష్ఠం రసాయనమ్. 66.

లేనిచో బలానుసారముగా తిప్పతీగె రసమును సేవించి జీర్ణించిన పిమ్మట నేతితో గాని గంజితో గాని కొలదిగా భుజింపవలయును. మిక్కిలియును దుర్గంధశరీరముగలవాఁడైనను దివ్యరూపము కలవాఁడగును. పటోలము కాచు నింబము త్రిఫలములు నల్లజీలకఱ్ఱ వేతము వీటికషాయమును తిక్తమగు భోజనమును కుష్ఠులనుపోగొట్టును. వాయువిడంగములు త్రిఫలలు పిప్పళ్లు వీటిచూర్ణమును తేనెతో సేవించిన కుష్ఠవులు క్రిమిరోగములు ప్రమేహములు నాడీవ్రణములు భగందరము మున్నగునవి నశించును. మంచిదినమునందు పెళ్లగించి తెచ్చిన పాపర వేరును చూర్ణము చేసి తేనెను నేతిని కలపి పాలను నేతిని త్రాగునభ్యాసముగలవాడు సేవింపవలయును. ఇయ్యది అన్నివిధములగు కుష్ఠులను పోగొట్టి 200 ఏండ్లు జీవింపచేయును. కరక నింబములనుగాని మిరియములను సిరికనుగాని తినిన నొక నెలలో కుష్ఠములు తొలగిపోవును. ఈరసాయనము కుష్ఠును హరించును.

## వయస్యాది లేపములు.

శ్లో. వయస్యైడగజా కుష్ఠ కృష్ణాభి ర్గుడికా కృతా, బస్తమూత్రేణ సంపిష్టా లేపా చ్ఛ్విత్రవినాశినీ. 67. పూతీకార్కస్నుహ్నరేంద్రద్రుమాణాం, మూత్రే పిష్టాః పల్లవాః సౌమనాశ్చ, లేపా చ్ఛ్విత్రం ఘ్నన్తి దద్రువ్రణాం శ్చ, కుష్ఠా న్యర్శాంసి భగ్ననాడీవ్రణాం శ్చ. 68. గజచిత్రవ్యాఘ్రచర్మ మసీతైలవిలేపనాత్, శ్విత్రం నాశం వ్రజే త్కిం వా పూతికీటవిలేపనాత్. 69. కుడవోఽవల్గుజబీజా ద్ధరితాలచతుర్థభాగసంమిశ్రః, మూత్రేణ గవాం పిష్టః సవర్ణకరణః పరః శ్విత్రే. 70.

మధుకము తగిరిసె కోష్ఠు పిప్పళ్లు వీటితో సిద్ధము చేసి మూత్రమునందునూరి లేపనచేసినచో తెల్లకుష్ఠులు నశించును. సెమలిఅడుగుచెక్క జిల్లేడు జెముడు పుష్కర

మూలము తేల జాజి వీటిఆకులను గోమూత్రముతో నూరి లేపన చేసినచో శ్వేత్రము లు దద్రులు కుష్ఠువు మున్నగునవి నశించును. దంతి చిత్రమూలము గుంటకలగర వీటి తైలమునందు పక్వముచేసి లేపనచేసినను, దుర్గంధముగలపురువులను నూరి లేపనచేసినను శ్విత్రకుష్ఠములు నశించును. బావంచివిత్తనములు నాలుగు పలములు హరిదళను ఒక పలము వీటిని గోమూత్రములో నూరి లేపనచేసినను సమానముగు వర్ణము వచ్చును.

## ధాత్రీ క్వాథములు.

శ్లో. ధాత్రీఖదిరయోః క్వాథం పీత్వా వల్గుజసంయుతమ్, శంఖేందుధవలం శ్విత్రం తూర్ణం హన్తి న సంశయః. 71. శృంగేషు దగ్ధగజలండజేచ గజస్య మూత్రేణ బహుస్రుతే చ, ద్రోణప్రమాణం దశభాగయుక్తే దత్వా పచేద్బీజ మవల్గుజస్య. 72. ఏతద్యదా చిక్కణతాముపైతి తదా సుసిద్ధాం గుడికాం ప్రయుంజ్యాత్, విశ్వం విలింపేద థ తేన ఘృష్టం తదా వ్రజత్యాశు సవర్ణభావమ్. 73. శ్వేతజయంతీమూలం పిష్టం పీతం చ గవ్యపయసైవ, శ్విత్రం నిహన్తి నియతం గదివారే వైద్యనాథ స్యాజ్ఞా. 74.

ఉసిరిక కాచు వీటికషాయములో బావంచిని కలిపికొని త్రాగిన చంద్రునివలె తెల్లగానున్న కుష్ఠులును నశించును. సందేహము లేదు. తెగరినెను చక్కగా దగ్ధముచేసి ఏనుగు మూత్రముతో కడిగి ద్రోణమునీటిలో పదవపాలు బావంచి విత్తనములను వైచి పక్వము చేసి గట్టిపడిన పిమ్మట మాత్రలనుచేసి నీటిని లేపనచేసినచో తెల్లకుష్ఠులు నశించును. తెల్లనినెల్లివేరును నూరి గోమూత్రముతో చిపలిపలినను నియమముగా త్రాగినచో శ్విత్రకుష్ఠములు నశించునని ధన్వంత్రి యాజ్ఞయె యున్నది.

## కుష్ఠహరమార్గము.

శ్లో. పుష్పకాలే తు పుష్పాణి ఫలకాలే ఫలాని చ, సంచూర్ణ్యశీ పిచుమర్దస్య త్వఙ్మూలాని దలాని చ. 75. ద్విరంశాని సమాహృత్య భాగికాని ప్రకల్పయేత్, త్రిఫలాత్ర్యూషణం బ్రాహ్మీ శ్వదంష్ట్రారుష్కరాగ్నికాః. 76. విడంగసార వారాహీ లోహచూర్ణామృతా స్సమాః, హరిద్రాద్వయావల్గుజవ్యాధిఘాతాః సశర్కరాః. 77. కుష్ఠేంద్రయవపాఠాశ్చ కృత్వా చూర్ణం సుసంయుతమ్, ఖదిరాసననింబానాం ఘనక్వాథేన భావయేత్. 78. సప్తధా పంచనింబం తు మార్కవస్వరసేన తు, స్నిగ్ధ

శుద్ధతను ర్ధీమా న్భోజయే చ్ఛ శుభే దినే. 79. మధునా తిక్తహవిషా ఖదిరాశనవారిణా, లేహ్యా ముష్ణాంబునా వాపి కోలవృద్ధ్యా పలంపి బేత్. 80. జీర్ణే చ భోజనం కార్యం స్నిగ్ధం లఘుహితం చ యత్. విచర్చి కోదుంబరపుండరీక కపాలదద్రూకిటిభాలసాదనే, శతారువిస్ఫోటవిస ర్పపామాం కఫ ప్రకోపం త్రివిధం కిలాసమ్. 81. భగందరశ్లీపదవాతరక్తం జాత్యాన్ధ్యనాడీవ్రణశీర్షరోగాన్, సర్వా న్ప్రమేహా న్ప్రదరాం శ్చ సర్వా న్దంష్ట్రావిషం మూలవిషం నిహన్తి. 82. స్థూలోదరః సింహకృశోదర శ్చ సుశ్లిష్టసన్ధి ర్మధునోపయోగాత్, సమోపయోగా దపి యే దశ న్తి సర్వాదయో యాన్తి వినాశ మాశు. 83. జీవే చ్చిరం వ్యాధిజరా విముక్తః శుభే రత శ్చన్ద్రసమానకాన్తిః. 84.

పంచనింబముల పుష్పములను ఫలకాలములో ఫలములను చెక్కను వేళ్లను రెం డు రెండు భాగములుగా తెచ్చి త్రిఫలములు శొంఠి మిరియములు పిప్పళ్లు బ్రాహ్మీ ప ల్లేరు జీడి చిత్రమూలము వారాహీకంద తిప్పతీగె వీటిని సమానభాగములుగా చేర్చ నవలయును. పసపు మానిపసపు బావంచి ఆరె కండచక్కెర కోష్ఠు ఇంద్రయవము అగరుశొంఠి వీటిచూర్ణమును అందు కలుప వలయును. కాచు వేగిచెక్క నింబము వీటికషాయమునందు ఏడువారములు భావనచేసి పంచనింబములను గుంటగలకరాకు రసములో భావనచేయవలయును. పిమ్మట స్నిగ్ధమును శుద్ధమును నగు శరీరముగలవాడు శుభదినమునందు దీనిని ప్రయోగింపగావలయును.

## ఏకవింశతిగుగ్గులము.

శ్లో. చిత్రకం త్రిఫలావ్యోష మజాజీం కారవీం వచామ్, సైంధవా తివిషేకుష్ఠం చవ్యైలాయావశూకజమ్. 85. విడంగాన్యజమోదాం చ ము స్తా న్యమరదారు చ, యావ న్త్యేతాని సర్వాణి తావన్మాత్రం తు గు గ్గులుమ్. 86. సంశుద్ధ్య సర్పిషా సార్థం గుడికాం కారయే ద్భిషక్, ప్రా త ర్భోజనకాలే చ భక్షయే త్తు యథాబలమ్. 87. హ న్త్యష్టాదశకుష్ఠా ని క్రిమీ న్దుష్టవ్రణాని చ, గ్రహణ్యర్శోవికారాం శ్చ ముఖామయగ ళగ్రహాన్. 88. గృధ్రసీ మథ భగ్నం చ గుల్మం చాశు నియచ్ఛతి, వ్యాధీ న్కోష్ఠగతాం చాన్యాన్ జయే ద్విష్ణు రివాసురాన్. 89.

చిత్రమూలము త్రిఫలములు శొంఠి మిరియములు పిప్పళ్లు జీలకఱ్ఱ కార వి వస సైంధవలవణము అతివస కోష్ఠు చవ్యము ఏలకులు అజమోద వాయువిడంగములు

తుంగముస్తెలు దేవదారువు వీటిఅన్నిటియంత గుగ్గిలము వీటిని చూర్ణముచేసి నేతితో మాత్రలను గట్టి ప్రాతఃకాలపు భోజనసమయమునందు బలానుసారముగా భక్షింపవలయును. ఇది పదునెన్మిది విధములగు కుష్ఠులు కృమిరోగములు దుష్టవ్రణములు గ్రహణీదోషములను రాక్షసులను విష్ణువుబోలె ఇయ్యది నశింపఁజేయును.

## తిలపట్వలఘృతము.

శ్లో. పంచభల్లాతకాం శ్ఛిత్వా సాధయే ద్విధివజ్జలే, కషాయం తం పిబే చ్ఛీతం ఘృతే నాక్తౌష్ఠతాలుకః. 90. పంచవృద్ధ్యా పిబే ద్యావత్సప్తతిం హ్రాసయే త్తతః, జీర్ణేఽద్యా దోదనం శీతం ఘృతం క్షీరోపసంహితమ్. 91. ఏత ద్రసాయనం మేధ్యం వలీపలితనాశనమ్, కుష్ఠార్శః క్రిమిదోషఘ్నం దుష్టశుక్రవినాశనమ్. 92. తైలం భల్లాతకానాం చ పిబే న్మాసం యథాబలం, సర్వోపతాపనిర్ముక్తో జీవే ద్వర్షశతం దృఢమ్. 93. ప్రలేపోద్వర్తనస్నాన పానభోజనకర్మణి, శీలితం ఖాదిరం వారి సర్వత్వగ్దోషనాశనమ్. 94. నింబం పటోలం దార్వీం దురాలభాం తక్తకరోహిణీం త్రిఫలాం, కుర్యా దర్ధపలాంశా న్పర్పటకం త్రాయమాణాం చ. 95. సలిలాఢకసిద్ధానాం రసేఽష్టభాగస్థితే క్షిపేత్పూతే, చందనకిరాతతిక్తక మాగధికా త్రాయమాణాం చ. 96. ముస్తావత్సకబీజం కల్కీకృత్వా ర్ధకర్షికా న్భాగాన్, నవసర్పిషశ్చ షట్పల మేత త్సిద్ధం ఘృతం పేయం. 97. కుష్ఠజ్వరగుల్మార్శో గ్రహణీపాండ్వామయ శ్వయథూన్, హన్తి పామావిసర్పపీడకాన్కండూమదగంధ సిద్ధంచ. 98.

అయిదుజీడిగింజలను ముక్కలుచేసినీటిలో యథావిధిగా సాధించి కషాయముఁజేసి త్రాగిన కుష్ఠువులు నశించును. ఇయ్యది వలీపలితమును కుష్ఠుమున్నగు వానిని పోగొట్టును. జీడితైలమును బలానుసారముగా నొకనెలరోజులు త్రాగినచో సమస్తములయినట్టి దుఃఖములను నశించి 300 ఏండ్లుబ్రతుకఁగలుగును.

నింబము పటోలము మ్రానిపసపు దురదగొండి కటుకరోహిణి త్రిఫలములు పిత్తపాపడ కలుక్రాంగ వీటినర్ధపలములు చొ॥ తెచ్చి 64 పలములనీటిలో వైచి కషాయముచేసి ఎన్మిదవ పాలు మిగిలియున్నప్పుడు వడియగట్టి పిమ్మట చందనము నేలవేము పిప్పళ్లు తుంగముస్తెలు వీటి నర్ధతులముచొ॥ కల్కముచేసి 6 పలముల నేతినందు సిద్ధముచేసి త్రాగిన కుష్ఠువులు జ్వరములు గుల్మములు మొదలగునవి నశించును.

### పంచతిక్తకఘృతము.

శ్లో. నింబం పటోలం వ్యాఘ్రీం చ గుడూచీం వాసకం తథా, కుర్యాద్దశ పలాన్భాగానేకైకస్య సుకుట్టితాన్. 99. జలద్రోణే విపక్తవ్యం యావత్పాదావశేషితం, ఘృతప్రస్థం పచేత్తేన త్రిఫలాగర్భసంయుతం. 100. పంచతిక్తమిదం ఖ్యాతం సర్పిః కుష్ఠవినాశనం, అశీతిం వాతజాన్రోగాం శ్చత్వారింశచ్చ పైత్తికాన్. 101. వింశతిం శ్లైష్మికాంశ్చైవ పానాదేవాపకర్షతి, దుష్టవ్రణక్రిమీన్ సర్వాః పంచకాసాంశ్చ నాశయేత్. 102.

నింబము పటోలము తిప్పతీగె అడ్డసరము వీటినన్నిటిని నూరి పదిపది పలములు తీసికొని ఒకద్రోణపు నీటిలో పక్వము చేసి నాల్గవ పాలు నీరు మిగిలినప్పుడు త్రిఫలముల కల్కమును కలిపి 16 పలముల నేతిని అందు పక్వము చేయవలయును. దీనినే పంచతిక్తఘృతమందురు. ఇది కుష్ఠను 80 విధములగు వాతరోగములను 40 విధములగు పిత్తరోగములను 20 విధములగు కఫరోగము నుదుష్టవ్రణములు కృమిరోగములు మున్నగువానిని పోగొట్టును.

### తిక్తకఘృతము.

శ్లో. త్రిఫలాద్వినిశావాసాయాసపర్పటకూలకాన్, త్రాయన్తీకటుకానింబాన్ప్రత్యేకం ద్విపలోన్మితాన్. 103. క్వాథయిత్వా జలద్రోణే పాదశేషేణ తేన తు, ఘృతప్రస్థం పచేత్కల్కైః పిప్పలీవనచందనైః. 104. త్రాయంతీశక్రభూనింబైస్తత్పీతం తిక్తకం ఘృతమ్. హన్తి కుష్ఠజ్వరార్శాంసి శ్వయథుం గ్రహణీగదమ్. 105. పాండురోగం విసర్పం చ క్లీబానామపి శస్యతే.

త్రిఫలములు పసపు మ్రానిపసపు అడ్డసరము పిత్తపాపడ కూలకము కలుకానుగ కటుకరోహిణి నింబము వీటిని రెండేసిఫలము లొక ద్రోణపు నీటిలో కషాయముచేసి పిప్పళ్లు తుంగముస్తెలు చందనము కలుకానుగ ఇంద్రయవ నేలవేము వీటికల్కమును చేర్చి నేతిని సిద్ధముచేసి సేవించిన కుష్ఠాదిరోగములు నశించును.

### మహాతిక్తకఘృతము.

శ్లో. సప్తచ్ఛదం ప్రతివిషాం సంపాకం తిక్తరోహిణీం, పాఠాం ముస్తముశీరం త్రిఫలాం పటోలపిచుమర్దపర్పటకమ్. 106. ధన్వయా-

సం సచందన ముపకుల్యే పద్మకం రజన్యా చ. 107. షడ్గ్రంథాం సవిశాలాం శతావరీశారివే చోభే, వత్సకబీజం వాసాం మూర్వా మమృతాం కిరాతతిక్తం చ. 108. కల్కా న్కుర్యా న్మతిమా న్యష్టాహ్వాం త్రాయమాణాం చ, కల్కస్తు చతుర్భాగో జల మష్టగుణం రసోఽమృతఫలానాం. 109. ద్విగుణో ఘృతా చ్చ దేయ స్తత్సర్పిః పాయయే త్సిద్ధమ్, కుష్ఠాని రక్తపిత్తం ప్రబలా న్యర్శాంసి రక్తవాహీని. 110. విసర్ప మమ్లపిత్తం వాతాసృక్పాండురోగం చ, విస్ఫోటకా న్పామా నున్మాదకా న్కామలాం జ్వరం పాండుం. 111. హృద్రోగగుల్మపిడకా మసృగ్దరం గండమాలాం చ, హన్యాదేత త్సద్యః పీతం కాలే యథాబలం సర్పిః, యోగశతై రప్యజితా న్మహావికారా న్మహాతిక్తం. 112.

ముయ్యాకుపొన్న అతివస సంపాకము కటుకరోహిణి అగరుశొంఠి తుంగముస్తె పట్టివేళ్లు పటోలనింబములు పిత్తపాపడ యవాసచందనము పిప్పళ్లు పద్మాక్షము పసపు మ్రానిపసపు వస పిల్లపీచర మనుబాల మధుకము త్రాయమాణము వీటిని కల్కములను చేయవలయును. కల్కము నాలుగుభాగములు నీళ్లుఎన్మిదిభాగములు పటోలరసము రెండురెట్లు ఒక పాలునెయ్యి కలిపి సిద్ధముచేసి సేవించిన కుష్ఠు రక్తపిత్తము మూలరోగము అమ్లపిత్తము పాండురోగములు మున్నగు వానిని సమయానుసారముగా సేవించిన నశింపచేయును. ఇయ్యది మహాతిక్తఘృతము. వందలకొలది యోగములకు కుదురనిరోగముల నెల్లను ఇది పోగొట్టును.

## మహాఖాదిరఘృతము.

శ్లో. ఖాదిరస్య తులాః పంచ శింశపాశనయో స్తులే, తులార్థాః సర్వ ఏవైతే కరంజారిష్టవేతసాః. 113. పర్పటః కుటజ శ్చైవ వృష్యః క్రిమిహరః తథా, హరిద్రే కృతమాల శ్చ గుడూచీత్రిఫలాత్రివృత్. 114 సప్తపర్ణస్తు సంక్షుణ్ణో దశద్రోణే చ వారిణః, అష్టభాగావశేషం తు కషాయ మవతారయేత్. 115. ధాత్రీరసం చ తుల్యాంశం సర్పిష శ్చాఢకే పచేత్, మహాతిక్తకకల్కై శ్చ యథోక్తైః పలసమ్మితైః. 116. నిహన్తి సర్వకుష్ఠాని పానాభ్యంగాన్నిషేవణాత్, మహాఖదిర మిత్యేత త్పరం కుష్ఠవినాశనం. 117.

చంద్రచెక్క ఐదుతులములు ఇరుగుడు ఒకతులము కరంజము నింబము వేపపిత్త పాపడ కోష్ఠు చెఱకుగాని ఉసిరిక వాయువిడంగములు పసపు మ్రానిపసపు తేల తిప్పతీగె త్రిఫలములు తెల్లతెగడ సప్తల వీటినిగాని చూర్ణముచేసి పదిద్రోణముల నీటిలో పక్వముచేసి నాలవపాలు మిగిలినప్పుడు దించి ఉసిరికరసము 64 పలములు నేయి 64 పలములు కలిపి మహాతిక్తకఘృతమును పక్వము చేయవలయును. కాని పై యౌషధములను ఒక్కొక్కపలమే వేయవలయును. ఇది మహాఖదిరఘృతము. దీనిని సేవించిన కుష్ఠు లన్నివిధము లగునట్టివియును నశించును.

### పంచతిక్తకగుగ్గులము.

శ్లో. నింబామృతావృషపటోలనిదిగ్ధికానాం, భాగాన్పృథగ్దశపలాన్విపచేద్ఘటేఽపామ్ 118. అష్టాంశశేషితజలేన సునిఃసృతేన, ప్రస్థం ఘృతస్య విపచేత్పిచుభాగకల్కైః. 119. పాఠావిడంగసురదారుగజోపకుల్యా, ద్విక్షారనాగరనిశామిశిచవ్యకుష్ఠైః. 120. తేజోవతీమరిచవత్సకదీప్యకాగ్ని రోహిణ్యరుష్కరవచాకణమూలయుక్తైః, మంజిష్ఠయాతివిషయా వరయా యమాన్యా సంశుద్ధగుగ్గులుపలైరపి పంచసంఖ్యైః. 121. తత్సేవితం విషమతిప్రబలం సమీరం సంధ్యస్థిమజ్జగతమప్యథ కుష్ఠమీదృక్, నాడీవ్రణార్బుదభగందరగండమాలాం జత్రూర్ధ్వసర్వగతగుల్మగుదోత్థమేహాన్. 122. యక్ష్మారుచిశ్వసనపీనసకాసశోష, హృత్పాండురోగగళవిద్రధివాతరక్తం. 123.

వేప తిప్పతీగె రేణుకయు పటోలము వాకుడు వీటిని పదేసి పలములు ప్రత్యేకముగా పక్వముచేసి ఎనిమిదవపాలు మిగులగా ఒక ప్రస్థము నేతిని ఒకతులముకల్కమును అగరుశొంఠి వాయువిడంగములు దేవదారువు ఏనుగుపిప్పళ్లు సజ్జక్షారము యవక్షారము శొంఠి పసపు సోంపు చవ్యము కోష్ఠు తేజోవంతి మిరియములు వాము చిత్రమూలము కరక్కాయలు జీడిగింజలు వస పిప్పళ్లు మంజిష్ఠము అతివస త్రిఫలములు వీటి నన్నిటిని తీసికొని చక్కగా శుద్ధముచేసిన గుగ్గిలమును ౫ పలములను కలిపి సేవించిన దుస్సాధ్యము లయినను కుష్ఠు నాడీవ్రణము మున్నగు రోగములు నశించును.

### వజ్రకఘృతము.

శ్లో. వాసాగుడూచీత్రిఫలాపటోల, కరంజనింబాశనకృష్ణవేత్రం తత్క్వాథకల్కేనఘృతంవిపక్వం, తద్వజ్రకం కుష్ఠహరం ప్రదిష్టం. 124.

విశీర్ణ కర్ణాంగుళిహస్తపాదః, క్రిమ్యర్దితో భిన్నగలోపి మర్త్యః, పౌరాణికీం కాన్తి మవాప్య జీవే, దవ్యాహతో వర్షశతం చ కుష్ఠీ. 125.

అడ్డసరము తిప్పతీగె త్రిఫలములు పటోలము వెమలిఅడుగుచెక్క నింబము వేగి నల్లమనుబాం వీటికషాయముల కల్కములతో నేతిని పక్వము చేయవలయును. ఇయ్యది కుష్ఠము పోగొట్టును. దీనిని సేవించిన కాళ్లు వ్రేళ్లు తెగి పోయినవారికైనను యథా ప్రకారపు కాంతియును కాయమును వచ్చి 100 ఏండ్లు జీవించెదరు.

## ఏలతైలము.

శ్లో. ఆరగ్వధం ధవం కుష్ఠం హరితాళం మనశ్శిలామ్, రజనీద్వయసంయుక్తం పచే త్తైలం విధానవిత్, ఏతేనాభ్యంజయే చ్ఛ్విత్రీ క్షిప్రం శ్విత్రం వినశ్యతి. 126.

ఏల కాచు కోష్ఠు హరిదళము మణిశిల పసపు మాని పసపు వీటికల్కమును చేయుటను చక్కగా నెతిగి చేసి సేవించిన కుష్ఠులు నశించును.

## తృణకతైలము.

శ్లో. మంజిష్ఠా రజ్ని శౌచక్ర ముర్వారగ్వధపల్లవైః, తృణకస్వరసే సిద్ధం తైలం కుష్ఠహరం కటు. 127.

మంజిష్ఠము కోష్ఠు పసపు తగిరిసెవిత్తులు ఏలఆకులు వీటికల్కము, రోహితతృణరసము వీటితో ఆవనూనెను సిద్ధముచేసి సేవించిన కుష్ఠులు నశించును.

## మహాతృణకతైలము.

శ్లో. హరిద్రా త్రిఫలాదారు హయమారకచిత్రకమ్, సప్తచ్ఛదశ్చ సంబస్త్వే కర్కరాజో నాలకం నఖీ. 128. కుష్ఠ మేడగజాబీజం లాంగలీగణికారికా, జాతీపత్రం చ దార్వీ చ హరితాలం మనశ్శిలా. 129. కళింగా తిలపత్రం చ అర్కక్షీరం చ గుగ్గులుః, గుడత్వాజ్మరిచం చైవ కుంకుమం గ్రంధిపర్ణజమ్. 130. సర్జపర్ణాశఖదిర విడంగం పిప్పలీం వచామ్, ఘనరేణ్వమృతాయష్టి కేసరం ధ్యామకం విషం, విశ్వాకట్ఫలమంజిష్ఠా పోలస్తుంబీఫలంతథా, స్నుహీసంపాకయోః పత్రం వాగుజీబీజమాంసికే. 131 ఏలాజ్యోతిష్మతీమూలం శిరీషోగోమయాద్రసః, చందనేకుష్ఠనిర్గుండీ విశాలా మల్లికాద్వయమ్. 132. వాసాశ్వగంధాబ్రాహ్మీ

చ శ్యామ్యాంచంపకకల్కలం, ఏతైః కల్కైః పచే త్తైలం తృణకస్వరస ద్రవం. 134 సర్వత్వగ్దోషహరణం మహాతృణక సంజ్ఞితం.

పసపు త్రిఫలములు దేవదారువు గన్నేరు చిత్రమూలము సప్తల వేపచెక్క నెమలియడ్డుచెక్క కుటువేరు నఖము కోష్ఠు తగిరిసెవిత్తులు జాజిచిగుళ్లు మ్రానిపసపు హరిదళము మనశ్శిల తెల్లతెగడ తిలలు తేజపత్రి జిల్లేడుపాలు గగ్గిలము లవంగపు పట్ట మిరియములు కేసరములు చిట్టిఆగులతులసి కాచు వాయువిడంగములు పిప్పళ్లు వస తుంగముస్తెలు రేణుక తిప్పతీగె మధుకము గోహిపతృణము మంజిష్ఠము సారవిత్తులు జెముడు ఆకులు బావంచివిత్తులు ఏలకులు మున్నగువాని కల్కమునందు తైలమును పక్వముచేసి వాడినచో త్వగ్దోషములు సమస్తమును హరించును.

## వజ్రకతైలము.

శ్లో. సప్తపర్ణకరంజార్కమాలతీకరవీరజం. 135. మూలం స్నుహీశిరీషాభ్యాం చిత్రకాస్ఫోతయో రపి, కరంజబీజం త్రిఫలాం త్రికటుం రజనీద్వయమ్. 136. సిద్ధార్థకం విడంగం చ ప్రపున్నాడతిలై స్సహ, మూత్రపిష్టైః పచే త్తైలం ఏభిః కుష్టమ్ వినాశనం. 137. అభ్యంగా ద్వజ్రకం నామ నాడీదుష్టవ్రణాపహం.

ఏడాకులపొన్న నెమలియడుగుచెక్క జిల్లేడు జాజి గన్నేరు వీటివేళ్లను జముడు శిరీషములవేళ్లను చిత్రమూలపువేళ్లు తెల్లమనుబాలవేళ్లును నెమలియడుగు విత్తనములును త్రిఫలములు శొంఠి మిరియములు పిప్పళ్లు పసపు మ్రానిపసపు ఆవాలు వాయువిడంగములు తగిరిసె తిలలు వీటిని గోమూత్రముతో నూరి తైలమును పక్వము చేయవలయును. ఇయ్యది కుష్ఠును పోగొట్టును. దీనిని పైనరుద్దినచో నాడ్రవ్రణాదులు మానును.

## మరిచాద్యతైలము.

శ్లో. మరిచాలశిలాహాస్వర్క పయోశ్వారజటాత్రివృత్. 138. శకృద్రసవిశాలారు జ్నిశాయుగ్దారుచందనైః, కటుతైలా త్పచేత్ప్రస్థం ద్వ్యక్షై ర్విషపలాన్వితైః. 139. సగోమూత్రం తదభ్యంగా ద్దద్రుశ్విత్రవినాశనం, సర్వేష్వపి చ కుష్ఠేషు తైల మేత త్ప్రశస్యతే. 140.

మిరియములు హరిదలము మణిశిల అర్కక్షీరము గన్నేరువేళ్లు తెల్లతెగడ పేడ ఇంద్రవారుణి కోష్ఠు పసపు మ్రానిప్పసపు దేవదారువు చందనము వీటినన్నిటి నరపలము చొ॥ వీటిని కల్కముచేసి అందు 16 పలముల ఆవనూనెను కలిపి పక్వముచేసి గోమూత్రమును కలిపి రుద్దిన శ్విత్రకుష్ఠములును నశించును.

## బృహన్మరీచాద్య తైలము.

శ్లో. మరిచం త్రివృతా దంతీ క్షీరమార్కం శకృద్రసః, దేవదారు హరిద్రే ద్వే మాంసీ కుష్ఠం సచందనం. 141. విశాలా కరవీరం చ హరితాలం మనశ్శిలా, చిత్రకో లాంగలాఖ్యా చ విడంగం చక్రమర్దకం. 142. శిరీషం కుటజో నింబం సప్తపర్ణస్నుహామృతాః, సంపాకో నక్తమాలోబ్దః ఖదిరం పిప్పలీ వచా. 143. జ్యోతిష్మతీ చ పలికా విషస్య ద్విపలం భవేత్, ఆఢకం కటుతైలస్య గోమూత్రం తు చతుర్గుణం. 144. మృత్పాత్రే లోహపాత్రే వా శనైర్మృద్వగ్నినా పచేత్, పక్వా తైలవరం హ్యేత న్నిక్షయే త్కౌష్ఠికా న్వ్రణాన్. 145. పామా విచర్చికా దద్రు కండూ విస్ఫోటకాని చ, వలయః పలితం ఛాయా నీలీ వ్యంగ స్తథైవ చ. 146. అభ్యంగేన ప్రణశ్యంతి సౌకుమార్యం చ జాయతే, ప్రథమే వయసి స్త్రీణాం యాసాం నస్యం తు దీయతే.147. పరా మపి జరాం ప్రాప్య న స్తనా యాంతి నమ్రతాం, వలీవర్ద స్తురంగో వా గజో వా వాయుపీడితః. 148. ఏభి రభ్యంజనై ర్గాఢం భవే న్మారుతవిక్రమః.

మిరియములు తెల్లతెగడ దంతి అర్కక్షీరము పేడరసము దేవదారువు పసుపు మ్రానిపసపు జటామాంసి కుష్ఠుచందనము గన్నేరు హరిదళము మణిశిల చిత్రమూలము లాంగలీ వాయువిడంగములు తగిరిస నిరసెన కోష్ఠుచెక్క నింబము ఏడాకులపొన్న జెముడు తిప్పతీగె ఈల నెమలిఅడ్డు తుంగముస్తె పిప్పళ్లు వస వీటిని పలము చొ॥ అవనాసె ఒకయాఢకము నాలుగురెట్లు గోమూత్రము వీటిని మట్టికుండలో గాని లోహపాత్రలో గాని సన్ననిసెగను పక్వముచేసి దించి ఈతైలము కుష్ఠవ్రణములకు పూయవలయును. గజ్జి విచర్చిక దద్రు జిల విస్ఫోటకము వలీపలితము ఇవియన్నియు నశించును. బాగపుప్రథమావస్థలో నస్యమును చేసినచో స్త్రీలకు వృద్ధావస్థలోనైనను చనుమొనలు వ్రేలబడవు.

## విష తైలము.

శ్లో. నక్తమాలం హరిద్రే ద్వే అర్కం స్తగర మేవ చ. 149. కరవీరం వచా కుష్ఠ మాస్ఫోతా రక్తచందనం, మాలతీ సప్తపర్ణం చ మంజిష్ఠా సింధువారికా. 150. ఏషా మర్ధపలా న్భాగాన్ విషస్యాపి పలం తథా, చతుర్గుణే గవాం మూత్రే తైలప్రస్థం విపాచయేత్. 151

శ్విత్ర విస్ఫోటకిటిభ కీటలూతా విచర్చికాః, కండూకచ్ఛువికారా శ్చ యే వ్రణా విషదూషితాః. 152. విషతైల మిదం నామ్నా సర్వవ్రణ విశోధనం.

నెమలిఅడుగు పసపు మ్రానిపసపు జిల్లేడు తగరము గన్నేరు వస కోష్ఠు తెల్ల మనుబాల రక్తచందనము జాజి సప్తపర్ణము మంజిష్ఠ వావిలి వీటి నర్ధపలముంతయును పొన్నతైలము నొకపలమును నాలుగుసేర్లు గోమూత్రమును వీటిలో 16 పలముల తైలమును పక్వముచేసి వాడిన శ్విత్రకుష్ఠాదులను పోగొట్టును.

### కరవీరతైలము.

శ్లో. శ్వేతకరవీరరసో గోమూత్రం చిత్రకం విడంగం చ, కుష్ఠేషు తైలయోగః సిద్ధోయం సమ్మతో భిషజాం. 153.

తెల్లగన్నేరురసము గోమూత్రము చిత్రమూలము వాయువిడంగములు వీటిలో సిద్ధముచేసిన తైలము కుష్ఠుల నన్నిటిని పోగొట్టును.

### తెల్లగన్నేరు తైలము.

శ్లో. శ్వేతకరవీరమూలం విషాంశసాధితం గవాం మూత్రే, చర్మదళపామా సిధ్మవిస్ఫోట క్రిమికిటిభజి త్తైలం. 154.

తెల్లగన్నేరువేళ్లు పొన్నతైలము వీటిని గోమూత్రములో సాధించి లేపనచేసిన చో పామాదిరోగములు నశించును.

### సిందూరాదితైలము.

శ్లో. సిందూరార్ధపలం పిష్ట్వా జీరకస్య పలం తథా, కటుతైలం పచే న్నాసీం సద్యః పామాహరం పరం. 155.

సిందూరము అరపలము జీలకఱ్ఱపలము వీటిని 8 పలముల ఆవనూనెతో పక్వము చేసి యుపయోగించినచో తత్క్షణమే పామను పోగొట్టును.

### మహాసిందూర తైలము.

శ్లో. సిందూరం చందనం మాంసీ విడంగం రజనీద్వయం, ప్రియంగుం పద్మకం కుష్ఠం మంజిష్ఠాం ఖదిరం వచాం. 156. జాత్యర్కత్రివృతానింబ కరంజవిష మేవ చ, కృష్ణవేత్రకలోధ్రం చ ప్రపున్నాడం చ సంహరేత్. 157. శ్లక్ష్ణపిష్టాని సర్వాణి యోజయే త్తైలమాత్రయా, అభ్యంగేన ప్రయుంజీత సర్వకుష్ఠవినాశనం. 158. పామావిచర్చి

కాకండూ విసర్పాదివినాశనం, రక్తపిత్తోత్థితాన్ హన్తి రోగా నేవంవిధాన్నహూన్. 159.

సిందూరము చందనము జటామాంసి వాయువిడంగములు పసపు మ్రానిపసపు ప్రియంగువు పద్మాక్షము కోష్ఠు మంజిష్ఠము కాచు మున్నగువానిని నూరి తైలములో పక్వముచేసి రుద్దినచో కుష్ఠులు నశించును.

ఆదిత్యక తైలము.

శ్లో. మంజిష్ఠా త్రిఫలాలాక్షా నిశాశిలాలగంధకైః, చూర్ణితై స్తైల మాదిత్యపాకం పామాహరం పరం. 160.

మంజిష్ఠము త్రిఫలములు లక్క పసపు మణిశిల హరిదళము గంధకము వీటిచూర్ణమునందు తైలము ను ఎండలో కాచవలయును. ఇయ్యది పామరోగములనుపోగొట్టును.

దూర్వాద్యతైలము.

శ్లో. స్వరసేన చ దూర్వాయాః పచే త్తైలం చతుర్గుణం, కచ్ఛూవిచర్చికా పామాః అభ్యంగా దేవ నాశయేత్. 161.

నాలుగురెట్ల గరికరసములో తైలమును కాచి రుద్దినను పామరోగములు నశించును.

అర్కతైలము.

శ్లో. అర్కపత్రరసే పక్వం కటుతైలం నిశాయుతం, మనఃశిలాయుతం వాపి పామా కచ్ఛ్వాదినాశనం. 162.

జిల్లేడాకుల రసమునందు ఆవనూనెను పక్వముచేసి పసుపును గాని మణిశిలను గాని చేర్చి పూసికొనిన పామాదులు నశించును.

గండీరాది తైలము.

శ్లో. గండీరికా చిత్రక మార్కవార్క,కుష్ఠద్రుమ త్వగ్గవజై స్స మూత్రైః, తైలం పచే న్మండలదద్రుకుష్ఠ, దుష్టవ్రణారుక్కిటిభాపహారీం. 163.

కెముడు చిత్రమూలము గుంటగలగరాకు జిల్లేడు వీటిరసముచేర్చి ఉప్పు గోమూత్రములలో తైలమును కాచి రుద్దినచో కుష్ఠులు నశించును.

పృథ్వీసార తైలము.

శ్లో. చిత్రకస్యాథ నిర్గుండ్యా హయమారస్య మూలతః, నాడీచ బీజా ద్విపలతః కాంజిపిష్టం పలంపలం. 164. కరంజతైలాష్టపలం కాంజిక

స్య వలం పునః, మిశ్రితం సూర్యసంతప్తం తైలం కుష్ఠవినాస్రజిత్. 165.

చిత్రమూలము వేళ్ళు వావిలివేళ్ళు గన్నేరు వేళ్లు నాడీ శాకపుబీజములు పొన్న వీటిని ఒక్కొక్కపలము గంజిలో నూరి మర్దించినను కుష్ఠులు నశించును.

### సోమరాజి తైలము.

శ్లో. సోమరాజీ హరిద్రే ద్వే సర్షపారగ్వధం గదం, కరంజైడగజాబీజం గర్భం దత్వా విపాచయేత్. 166. తైలం సర్షపసంభూతం నాడీదుష్టవ్రణాపహం, అనేనాశు ప్రశామ్యన్తి కుష్ఠాన్యష్టాదశైవ తు. 167. నీలికా పిడకా వ్యంగం గంభీరం వాతశోణితం, కండూకచ్ఛూప్రశమనం కచ్ఛుపామావినాశనం. 168.

బావంచివిత్తులు పసపు మ్రానిపసపు ఆవాలు రేల కోష్ఠు నెమలి యడుగు తగిరి సెవిత్తులు వీటికల్కమును ఆవనూనెలో సిద్ధముచేసి రాచినను పదునెనిమిది విధములగు కుష్ఠులను నశించును.

### రేచనాది తైలము.

శ్లో. పక్షాత్పక్షా చ్ఛర్దనా న్యభ్యుపేయా, న్మాసా న్మాసా త్స్రంసనం చా ప్యధస్తాత్, త్ర్యహా త్త్ర్యహా న్నస్యత శ్చావపీడా, న్మాసే ష్వస్రు జ్మోక్షయే త్షట్సు షట్సు. 169. యోషిన్మాంససురాత్యాగః శాలిముద్గయవాదయః, పురాణా స్తిక్తశాకం చ జాంగలం కుష్ఠినాం హితం. 170.

పదిహేనురోజులకు వమనమును నెలనెలకు విరేచనములను మూడేసిరోజులకు నస్యమును ఆరేసినెలలకు రక్తస్రావమును చేయవలయును. స్త్రీసంగాది అపథ్యములను వదలి పెట్టవలయును.

ఇట్లు చక్రదత్తయందు కుష్ఠాధికారప్రకరణము ముగిసెను.

---

## ౫౦. ఉదర్ధకోఠ శీతపిత్తాధికారము.

### ఉదర్దకాదులకు అభ్యంగములు.

శ్లో. అభ్యంగః కటుతైలేన సేక శ్చోష్ణాంబుభి స్తతః, ఉదర్ధే వమనం కార్యం పటోలారిష్టవారిణా. 1. త్రిఫలాపురకృష్ణాభి ర్ద్విరేక

శ్చాత్ర శస్యతే, త్రిఫలాం క్షౌద్రసహితాం పిబేద్వా నవకార్షికాం.2. విసర్పోక్త మమృతాది భిష గత్రాపి యోజయేత్, సితాం మధుకసం యుక్తాం గుడ మామలకై స్సహ. 3. సగుడం దీప్యకం యస్తు ఖాదే త్పథ్యాన్నభు క్నరః, తస్య నశ్యతి సప్తాహా దుదర్దః సర్వదేహజః. 4. సిద్ధార్థరజనీకల్కైః ప్రపున్నాడతిలై స్సహ, కటుతైలేన సంమిశ్ర మేత దుద్వర్తనం హితం. 5. దూర్వానిశాయుతో లేపః కచ్ఛుపామావినా శనః, క్రిమిదద్రుహర శ్చైవ శీతపిత్తహరః పరః. 6. అగ్నిమంథభవం మూలం పిష్టం పీతం చ సర్పిషా, శీతపిత్తోదర్దకోఠా న్సప్తాహా ద్దేవ నా శయేత్. 7. కుష్ఠోక్తం చ క్రమం కుర్యా దమ్లపిత్తఘ్న మేవ చ, ఉద ర్దోక్తాం క్రియాం చాపి కోఠరోగే సమాచరేత్. 8. సర్పిః పీత్వా మహా తిక్తం కార్యం శోణితమోక్షణం.

ఆవనూనెతో తలంటికొని వేడినీళ్లను పోసికొని వాంతులను చేయవలయును. త్రిఫలాదులతో విరేచనము చేయించుటమంచిది. లేనిచో త్రిఫలచూర్ణమును తేనెతోనైనను త్రాగ వలయును. విసర్పికి చెప్పిన అమృతాదియోగములను నిందునవలంబింపవలయును. మధుకము చక్కెరతో గాని ఉసిరికతో గాని బెల్లముతో గాని తినవలయును. గుడసహితమగు అజమో దను సేవించిన ఉదర్దము నశించును. దూర్వలను పసపును నూరి లేపన చేసినచో కచ్ఛ దద్రువు పామ నశించును. అరణివేళ్లను నూరికొని నేతితో త్రాగిన శీతపిత్తాదులు ఏడు రోజులలో నశించును. కుష్ఠమునకు చెప్పిన చికిత్సలను ఆమపిత్తమునకు పోగొట్టెడిచికిత్సలను విస్తారముగా కోఠరోగమునందు చేయవలయును. మహాతిక్తమును త్రాగి రక్తస్రావణ మును చేయుటయును మంచిది.

### నింబపత్రసేవనాదులు.

శ్లో. నింబస్య పత్రాణి సదా ఘృతేన ధాత్రీవిమిశ్రాణ్యథ వోప యుంజ్యాత్. 9. విస్ఫోటకోఠక్షతశీతపిత్తం కండ్వస్రపిత్తం సహసా చ జహ్యాత్, క్షారసింధూత్థతైలై శ్చ గాత్రాభ్యంగం ప్రయోజయేత్.10. గంభారికాఫలం పక్వం శుష్క ముత్స్వేదితం పునః, క్షీరేణ శీతపిత్త ఘ్నం ఖాదితం పథ్యసేవినా. 11. తైలోద్వర్తనయోగేన యోజ్య ఏలాదికో గణః, శుష్కమూలకయూషేణ కౌలుత్థేన రసేన వా. 12. భోజనం సర్వదా కార్యం లావతిత్తిరిజేన వా, శీతలా న్యన్నపానాని

బుద్ధ్వా దోషగతిం భిషక్. 18. ఉష్ణాని వా యథాకాలం శీతపిత్తే ప్రయోజయేత్.

ఎల్లప్పుడును వేపఆకులను నేతితోగాని ఉసిరికతోగాని కలిపితినినచో విస్ఫోటకము కోష్ఠక్షతము శీతపిత్తము గజ్జి మున్నగునవి నశించును. పండినగుమ్ముడు నెండించి పాలతోతినిన శీతపిత్తములు నశించును. ఏలాది గణపుటౌషధములను తైలముతో నలుగుపెట్టవలయును. ఎండినమునఁగకాయల రసముతోగాని ఉలవలకషాయముతోగాని తిత్తిరపక్షిమాంసపు రసముతోగాని భుజింపవలయును. దోషములను చక్కగా నెఱిగి శీతలములుగాని ఉష్ణములుగాని యైన యన్నపానములను శీతపిత్తరోగుల ననుసరించి వైద్యుఁడు పెట్టించుచుండ వలయును.

ఇట్లు చక్రదత్తయందు ఉదర్దకోష్ఠ శీతపిత్తాధికార ప్రకరణము ముగిసెను.

---

# ౫౧. ఆమ్లపిత్తాధికారము.

## ఆమ్లపిత్తమునకు సామాన్యోపాయములు.

శ్లో. వాన్తిం కృత్వామ్లపిత్తేతు విరేకం మృదు కారయేత్, సమ్యగ్వాంతవిరిక్తస్య సుస్నిగ్ధస్యానువాసనం. 1. ఆస్థాపనం చిరోద్భూతే దేయం. దోషాద్యపేక్షయా, క్రియాశుద్ధస్య శమనీ హ్యానుబంధవ్యపేక్షయా. 2. దోషసంసర్గజే కార్యా భేషజాహారకల్పనా, ఊర్ధ్వగం వమనైర్ధీమా నధోగం రేచనైర్హరేత్. 3. తిక్తభూయిష్ఠ మాహారం పానం వాపి ప్రకల్పయేత్, యవగోధూమవికృతీ స్తీక్ష్ణసంస్కారవర్జితాః. 4. యథాస్వం లాజసక్తూన్వా సితా న్మధుయుతా న్పిబేత్, నిస్తుషయవవృషధాత్రీ, క్వాథ స్త్రిసుగంధిమధుయుతః పీతః, అపనయతి చామ్లపిత్తం యది భుంక్తే ముద్గయూషేణ. 5. కఫపిత్తవమీకండూజ్వరవిస్ఫోటదాహహా, పాచనో దీపనః క్వాథః శృంగబేరపటోలయోః. 6. పటోలం నాగరం ధాన్యం క్వాథయిత్వా జలం పిబేత్, కండూపామార్తిశూలఘ్నం కఫపిత్తాగ్నిమాంద్యజిత్. 7. పటోలవిశ్వామృతరోహిణీకృతం, జలం పిబేత్పిత్తకఫోచ్ఛ్రితే తు, శూలభ్రమారోచకవహ్నిమాంద్య దాహజ్వరచ్ఛర్దినివారణం తత్. 8. యవకృష్ణాపటోలానాం క్వా

థం క్షౌద్రయుతం పిబేత్, నాశయే దమ్లపిత్తం చ అరుచిం చ వమిం తథా. 9.

అమ్లపిత్తమునకు వాంతులను చేయించి పిమ్మట మృదువుగా విరేచనముల క్రియవలయును. చిరోద్భూతమగు దానియందు దోషాదులకంటె నెక్కుడుగా నాస్థాపనం జేయవలయును. దోషసంసర్గజములగు వానికి ఔషధమును ఆహారమును కల్పింపవలయును. ఊర్ధ్వగతమైన అమ్లపిత్తము వాంతులచేతను అధోగతమైన అమ్లపిత్తమును విరేచనములచేతను పోగొట్టవలయును. తిక్తములగు నాహారములను కల్పింపవలయును. పొట్టుతీసిన యవలు అడ్డసరము ఉసిరిక వీటికషాయములో లవంగపుపట్టు ఏలకులు జాపత్రి వీటిచూర్ణమును తేనెను వేసికొని త్రాగి ముద్గయూషమును భుజించినచో అమ్లపిత్తము నశించును. అల్లము పటోలము వీటికషాయము పాచకమును దీపనము నగును. పటోల శొంఠి ధనియములు వీటికషాయమును త్రాగినచో పాను శూల మున్నగునవి నశించును. పటోలము శొంఠి వారాహీ కంద వీటికషాయము పిత్తకఫాధిక్యతయందును అమ్లపిత్తమునందును త్రాగిన శూల భ్రమ మున్నగునవి నశించును. యవలు పిప్పళ్లు పటోలము వీటికషాయములో తేనెను వైచికొని త్రాగిన అమ్లపిత్తము అరుచి మున్నగునవి నశించును.

## వాసాదశాంగము.

శ్లో. వాసామృతాపర్పటకానింబభూనింబమార్కవైః, త్రిఫలాకులకైః క్వాథః సక్షౌద్రశ్చామ్లనాశనః. 10. ఫలత్రికం పటోలం చ తిక్తాక్వాథః సితాయుతః, పీతః క్లీతకమధ్వాక్తో జ్వరచ్ఛర్ద్యమ్లపిత్తజిత్. 11. పథ్యాభృంగరజః చూర్ణం యుక్తం జీర్ణగుడేన యు, జయే దమ్లపిత్తజన్యాం చర్ది మున్మవిదాహజాం. 12.

అడ్డసరము తిప్పతీగె పిత్తపాపడ వేప నేలవేము గుంటకలగరాకు త్రిఫలములు పటోలము వీటికషాయములో తేనెను కలిపి త్రాగిన నామ్లపిత్తములు నశించును. త్రిఫలములు పటోలము కటుకరోహిణి వీటికషాయములో చక్కెర మధుకము తేనె వేసికొనిత్రాగినను అమ్లపిత్తములు జ్వరములు నశించును. కరక్కాయలు గుండకలగరచూర్ణమును ప్రాతబెల్లములో తినిన పిత్తజములగు విదాహము ఛర్ది మున్నగునవి నశించును.

## వాసాదిగుగ్గులము.

శ్లో. వాసానింబపటోలత్రిఫలానయోపయోజితో జయతి,అధికకఫామ్లపిత్తం ప్రయోజితో గుగ్గులుః క్రమేణ, ఛిన్నాఖదిరయష్ట్యాహ్వ

దార్వ్యంబో వా మధుద్రవం. 13. సద్రాక్షా మభయాం ఖాదే త్స
క్షౌద్రాం సగుడాం చ తాం, కటుకాసితావలేహ్య పటోల విశ్వాం
చ క్షౌద్రసంయుక్తాం, రక్తస్రుతౌ చ యుక్త్యా వా ఖండకూష్మాండకం
శ్రేష్ఠం. 14. పటోలధన్యాక మహౌషధాబ్దైః కృతః కషాయో వినిహ
న్తి శీఘ్రం, మందానలం పిత్తబలాసదాహ చ్ఛర్ది జ్వరానూనిలశూల
రోగాన్. 15. ఛిన్నోద్భవానింబపటోలపత్రంపలత్రికం సుక్వథితం సు
శీతం, క్షౌద్రాన్వితం పిత్త మనేకరూపం సుదారుణం హన్తి హి చామ్ల
పిత్తం. 16.

అడ్డసరము నింబము పటోలము త్రిఫలములు ఆశన వీటితో గుగ్గులమును చేర్చి సేవించిన ఆమ్లపిత్తమును పోగొట్టును. తిప్పతీగె కాచు మధుకము మాఁనిపసపు వీటికషాయమునందు తేనెను వైచికొని త్రాగినను ద్రాక్ష కరక్కాయలను తేనె బెల్లములతోగాని సేవించినను మంచిది. అట్లే పటోలమును శొంఠిని తేనెలో కలిపికొని తినిన రక్తస్రావములకు మంచిది. పటోలము ధనియములు శొంఠి తుంగముస్తెలు వీటికషాయము అగ్నిమాంద్యాదులను పోగొట్టును. తిప్పతీగె నింబము పటోలము వీటిని 12 తులముల కషాయమును చేసి చల్లార్చి తేనె వైచికొని త్రాగిన ననేకవిధము లగు నామ్లపిత్తములను పోగొట్టును.

పటోలాదికషాయములు.

శ్లో. పటోల త్రిఫలా నింబ శృతం మధుయుతం పిబేత్, పిత్త
శ్లేష్మజ్వరచ్ఛర్దిదాహశూలోపశాంతయే. 17. సింహాస్యామృతమండూకీ
క్వాథం పీత్వా సమాక్షికం, అమ్లపిత్తం జయే జ్జంతుః కాసం శ్వాసం
జ్వరం వమిం. 18. వాసాఘృతం తిక్తఘృతం పిప్పలీఘృత మేవ చ, ఆ
మ్లపిత్తే ప్రయోక్తవ్యం గుడకూష్మాండకం తథా. 19. పక్తిశూలాపహా
యోగా స్తథా ఖండామలక్యపి, పిప్పలీమధుసంయుక్తా చామ్లపిత్తవినా
శినీ. 20. జంబీరస్వరసః పీతః సాయం హ న్త్యమ్లపిత్తకం, గుడపిప్పలి
పథ్యాభి స్తుల్యాభి ర్మోదకః కృతః. 21. పిత్తశ్లేష్మాపహః ప్రోక్తో మంద
మగ్నిం చ దీపయేత్, హింగుం చ కతకఫలాని చించాత్వచోఘృతం చ
పుటదగ్ధం. 22. శమయతి తదమ్లపిత్త మమ్లభుజో యది యథోత్తరం

ద్విగుణం, కాంతాపాత్రే వరాకల్కే వ్యుషితోఽభ్యాసయోగతః, సితాక్షౌద్రసమాయుక్తః కఫపిత్తహర స్స్మృతః. 23.

చేదుపొట్ల త్రిఫలములు నింబము వీటికషాయములో తేనెను వేసికొని త్రాగిన పిత్తము కఫము జ్వరము మున్నగునవి శాంతించును. అడ్డసరము వారాహీకంద పెద్దవాకుడు వీటికషాయమును తేనెతో త్రాగిన శాంతించును. బెల్లము పిప్పళ్లు కరక్కాయలు వీటినినూరి మాత్రలనుకట్టి తినినను పిత్తకఫములు నశించును. ఇంగువ చిల్లగింజలు చింతబెఱడు నేయి వీటిని పుటపాకముచేసి యథోత్తరముగా నమ్ముచు భుజించువారు భుజించిన ఆమ్లపిత్తము హరించును. కాంతలోహపాత్రములో త్రిఫలాకషాయమును రాత్రియంతయు నుంచి చక్కెరను తేనెను చేర్చికొని సేవించిన మంచిది.

## పంచనింబాదిచూర్ణము.

శ్లో. ఏకోంశః పంచనింబానాం ద్విగుణో వృద్ధదారకః, సక్తు దశగుణో దేయః శర్కరామధురీకృతః. 24. శీతేన వారిణా పీతః శూలం పిత్తకఫోత్థితం, నిహన్తి చూర్ణం సక్షౌద్ర మమ్లపిత్తం సుదారుణం. 25.

పంచనింబములు ఒకపాలు బోడ్డికూర రెండుపాళ్ళు సత్తు పదిపాళ్లు పొడిచేసి చక్కెరకలిపి చల్లనినీటితో త్రాగిన పిత్తకఫములు నశించును. తేనెతో త్రాగిన భయంకరములగు నామ్లపిత్తములును నశించును.

## లోహకిట్టాదిధాతుశోధనములు.

శ్లో. ఆశు భక్తోదకైః పిష్టైః భ్రామకం తత్ర పస్థితం, కందమానాస్థిసంహార ఖండకర్ణరసైరథ. 26. తండులీయం చ శాలిం చ కాలమారిషజేన చ, వృశ్చీరబృహతీభృంగ లక్ష్మణా కేశరాజజైః. 27. పేషణం భావనం కుర్యాత్స్పుటం చానేకశో భిషక్, యావన్నిశ్చంద్రకం తత్స్యాచ్ఛుద్ధి రేవం విహాయసః, స్వర్ణమాక్షిక శాలిం చ ధ్మాతం నిర్వాపితం జలే. 28. త్రైఫలేథ విచూర్ణైర్వం లోహం కాంతాదికం పునః. 29. బృహత్పత్రకరీకర్ణ త్రిఫలావృద్ధదారజైః, మాణకందాస్థిసంహార శృంగబేరభవై రసైః. 30. దశమూలీముండతికా తాలమూలీసముద్భవైః, పుటితం సాధు యత్నేన శుద్ధిమేవ మయో వ్రజేత్. 31. వశిరం శ్వేతవాట్యాలం మధుపర్ణీ మయూరకం, తండులీయం చ వర్షాహ్వాం దత్వాథ శో

ర్థ్వమేవ చ. 32. పాక్యం సజీర్ణమండూరం గోమూత్రేణ దినత్రయం, అంతర్బాష్పమదగ్ధం చ తథా స్థాప్యం దినత్రయం. 33. విచూర్ణితం శుద్ధిరియం లోహకిట్టస్య దర్శితా, జయం త్యావర్ధమానస్య ఆర్ద్రికస్య రసేన తు. 34. వాయస్యా శ్చానుపూర్వ్యైవం మర్దనం రసశోధనం, గంధకం నవనీతాఖ్యం క్షుద్రితం లోహభాజనే. 35. త్రిధా చండాతపే శుష్కం భృంగరాజరసాప్లుతం, తతో వహ్నౌ ద్రవీభూతం త్వరితం వస్త్రగాలితం. 36. యత్నా ద్భృంగరసే క్షిప్తం పునః శుష్కం విశుద్ధ్యతి.

కలికడుగుతో నభ్రికమునుసూరి యుంచి మాణకందపు ఆముదము లవంగపుపట్ట వీటి రసమును ఎల్లగలిజేరు గుంటకలగర వీటితో మాటిమాటికి భావనచేసి పుటమువేయవలయును. చంద్రుడు ప్రకాశింపనంతవఱకును దీనిని పక్వము చేయవలయును. ఇట్లు లోహమును శుద్ధిచేయగావలయును.

## క్షుధావతీగుటిక.

శ్లో. గగనా ద్విపలం చూర్ణం లోహస్య పలమాత్రకం. 37. లౌహకిట్టపలార్ధం చ సర్వ మేకత్ర సంస్థితం, మండూకపర్ణీవశిరతాలమూలీరసైః పునః. 38. వరీభృంగకేశరాజ కాలమారిషజైరథ, త్రిపలాభద్రముస్తాభిః స్థాలీపాకా ద్విచూర్ణితం. 39. రసగంధకయోః కర్షౌ ప్రత్యేకం గ్రాహ్య మేకతః, తన్మర్దనా చ్చిరాఖల్వే యత్నతః కజ్జలీకృతం. 40. వచా చవ్యంయమానీచ జీవకేశరపుష్పికా,వ్యోషం ముస్తంవిడంగంచ గ్రంథికం ఖరమంజరీ. 41. త్రివృతా చిత్రకోదంతీ సూర్యావర్తో సిత స్తథా, భృంగమాణకకంద శ్చ ఖండకర్ణక ఏవ చ. 42. దండోత్పలా కేశరాజకాలావకడకోపిచ, ఏషా మర్ధపలం గ్రాహ్యం పటఘృష్టం సుచూర్ణితం. 43. ప్రత్యేకం త్రిఫలాయా శ్చ పలార్ధం పల మేవ చ, ఏత త్సర్వం సమాలోడ్య లోహపాత్రే తు భావయేత్. 44. ఆతపే దండసంఘృష్ట మార్ద్రికస్య రసైస్త్రిధా, తద్రసేన శిలాపిష్టం గుటికాం కారయే ద్భిషక్. 45. బదరాస్థి నిభాం శుష్కాం సునిగుప్తాం నిధాపయేత్, త త్ప్రాత ర్భోజనాదౌ తు సేవితం గుటికాత్రయం. 46.

అమ్లోదకానుపానం చ హితం మధురవర్జితం, దుగ్ధం చ నారికేళం చ వర్జనీయం విశేషతః. 47. భోజ్యం యథేష్ట మిష్టం చ వారిభక్తామ్ల కాంజికం, హం త్యమ్లపిత్తం వివిధం శూలం చ పరిణామజం. 48. పాండు రోగం చ గుల్మం చ శోథోదరగుదామయాన్, యక్ష్మాణం పంచకాసాం శ్చ మందాగ్నిత్వ మరోచకం. 49. ప్లీహానం శ్వాస మానాహ మామ వాతం సుదారుణం, గుడీ క్షుధావతీ సేయం విఖ్యాతా రోగనాశినీ. 50.

అభ్రిధాతుచూర్ణమును 2 పలములు లోహము 1 పలము లోహమలను అరపల మువీటినొకచోటునను౦చి మంజిష్ఠను ఏనుఁపిప్పలి మసలి వీటిసిరసముతీసి యుంచుకొని పిల్లపీచర గుంటకలగర నీలి కీటినిరసము తీసి పిమ్మట త్రిఫలను బు తుంగముస్తెలు భద్రముస్తె లు వీటితోస్థాలిపక్వముతో చూర్ణము చేసి పాదరసము గంధకము నొక్కొక్కకులము కలపవలయును. రాతిఖల్వములో వీనిని ఏకముగా నూరి కాటుకవలె చేయవలయును. వస చవ్యము వాముము జీవకము సోంపు శొంఠి మిరియములు పిప్పళ్లు తుంగముస్తెలు వా యువిడంగములు పిప్పలిమూలము తులసి తెల్లతెగడ చిత్రమూలము దంతి గంటుభారంగి వెలగ మానకంద సహదేవాకు నల్లతెగడ వీటిని అరపలమరపలము చొ॥చూర్ణముచేసి గు డ్డతో వస్త్రకాళితము బట్టవలయును. మఱియును కరక్కాయలు తాడి ఉసిరిక వీటిని ప్రత్యేకముగా రెండేసి నాల్గేసితులముల చొప్పునచూర్ణించిఅన్నిటిని లోహపాత్రము నందు భావనచేసి మూడుమారులు కలియఁబెట్టవలయును. ఎండలో అల్లమును కట్ట తో నలగబొడిచి ఆరసముతో రాతిపైని నూరి మాత్రలను కట్టవలయును. శెనగ గిం జంతగాకట్టి ఎండించియుంచికొని ప్రతిదినమును ప్రాతఃకాలమునందు మూడుమాత్రల చొ॥ సేవింపవలయును. ఆమ్లరసము ననుపానము చేసికొని మధురపదార్థములను త్యజింప వలయును. ఇయ్యది అనేకవిధములగు ఆమ్లపిత్తములను ఉదరరోగాదులను పోగొట్టును.

## జీరకఘృతము.

శ్లో. పిష్ట్వాజాజీం సధన్యాకం ఘృతప్రస్థం విపాచయేత్, కఫ పిత్తారుచిహారం మందానిలవమిం జయేత్. 51.

జీలకఱ్ఱను ధనియములును నూరి 16 పలములనేతిని పక్వముచేసి సేవించిన కఫ పిత్తారుచులు మానును. మందాగ్నిని ఛర్దిని ఇది పోగొట్టును.

## పటోలశుంఠీ ఘృతము.

శ్లో. పటోలశుంఠ్యోః కల్కాభ్యాం కేవలం కులకేన వా, ఘృ తప్రస్థం విపక్తవ్యం కఫపిత్తహరం పరం. 52.

పటోలమును శొంఠిని కల్కములను చేసి 16 పలములనేయిని పక్వముచేసి సేవించిన కఫపిత్తములు నశించును.

పిప్పలీఘృతము.

శ్లో. పిప్పలీక్వాథకల్కేన ఘృతం సిద్ధం మధుప్లుతం పిబే త్త్ప్రాత రుత్థాయ ఆమ్లపిత్తనివృత్తయే. 53.

పిప్పళ్లకషాయముల కల్కములతో నేతిని సిద్ధముచేసి ప్రొద్దుటిపూట తేనెను కలిపికొని త్రాగినచో ఆమ్లపిత్తములు నశించును.

ద్రాక్షాద్యఘృతము.

శ్లో. ద్రాక్షామృతాశక్రపటోలపత్రైః సోశీరధాత్రీఘనచందనైశ్చ, త్రాయంతికా పద్మకిరాతధాన్యైః కల్కైః పచే త్సర్పి రుపేత మేభిః. 54. యుంజీత మాత్రాం సహ భోజనేన సర్వర్తుపానేపి భిషగ్విదధ్యాత్, బలాసపిత్తం గ్రహణీం ప్రవృద్ధాం కాసాగ్నిసాదం జ్వర మమ్లపిత్తం. 55 సర్వం నిహన్యా ద్ఘృత మేత దాశు సమ్యక్ప్రయుక్తం హ్యమృతోపమం చ.

ద్రాక్ష తిప్పతీగె కొడిసెపాల పటోలము వట్టివేళ్లు ఉసిరిక తుంగముస్తె చందనము కటుక్రోణిగ పద్మాక్షము నేలవేము ధనియములు వీని కల్కముతో నేతినిచేర్చి పక్వముచేసి భోజనసమయములందు దీనిని ప్రయోగింపవలయును. ఇయ్యది కఫపిత్తాది రోగములను అన్నింటిని నశింపజేయును.

శతావరీఘృతము.

శ్లో. శతావరీమూలకల్కం ఘృతప్రస్థం పయస్సమం, పచే న్మృద్వగ్నినా సమ్యక్ క్షీరం దత్వా చతుర్గుణం. 56. నాశయే దమ్లపిత్తం చ వాతపిత్తోద్భవా న్గదాన్, రక్తపిత్తం తృషాం మూర్ఛాం శ్వాస సంతాపమేవ చ. 57.

శతావరీకల్కమును జలమును సమానభాగములుగా చేర్చి 16 పలముల నేయి నాలుగురెట్లుపాలు కలిపి సన్ననిసెగను పక్వముచేయవలయును. ఇయ్యది ఆమ్లపిత్తమును వాతపిత్తమువలన పుట్టిన రోగములను రక్తపిత్తమును దప్పి మూర్ఛలను శ్వాసమును సంతాపమును నశింపజేయును.

ఇట్లు చక్రదత్తమందు ఆమ్లపిత్తాధికారప్రకరణము ముగిసెను.

# ౫౨. విసర్పవిస్ఫోటాధికారము.

---

## విసర్పవిస్ఫోటములకు ఉపాయములు.

శ్లో. విరేకవమనాలేపసేచనాసృగ్విమోక్షణైః, ఉపాచరేద్యథాదోషం విసర్పానవిదాహిభిః. 1. పటోలపిచుమర్దాభ్యాం పిప్పల్యా మదనేన చ, విసర్పే వమనం శస్తం తథైవేంద్రయవైస్సహ. 2. త్రిఫలారససంయుక్తం సర్పిస్త్రివృతయా సహ, ప్రయోక్తవ్యం విరేకార్థం విసర్పజ్వరశాంతయే. 3. రసమామలకానాం వా ఘృతమిశ్రం ప్రదాపయేత్, తృణవర్జం ప్రయోక్తవ్యం పంచమూలచతుష్టయం. 4. ప్రదేహాసేకసర్పిర్భిర్విసర్పే వాతసంభవే.

విరేచనములు వమనములు లేపనములు సేచనములు రక్తస్రావములు మున్నగువానిని, దోషానుసారముగా విసర్పవిదాహకరములగు చికిత్సలను చేయవలసినది. పటోలము నింబము పిప్పలి ఉమ్మెత్త వీనిమూలమున విసర్పరోగమునందు వమనము చేయించుట మంచిది. త్రిఫలారసముతోను తెల్లతెగడతోను విరేచనములకై ఘృతము నిచ్చుట మంచిది. దీనిచే విసర్పజ్వరములు నశించును. లేనిచో ఉసిరికరసములో నేతినికలిపి ప్రయోగింపవలయును. లేనిచో తృణపంచకవర్జితమగు పంచమూలక చతుష్టయమునైనను ఈయవలయును. వాతమువలనఁబుట్టిన విసర్పములకు లేపనములు సేకములతో చికిత్సలను చేయఁగా వలయును.

## వాతమునందు శోఫమున్నగు చికిత్సలు.

శ్లో. కుష్ఠం శతాహ్వా సురదారుముస్తా వారాహి కుస్తుంబురు కృష్ణగంధాః, వాతేర్కవంశార్తగలాశ్చ యోజ్యాః సేకేషు లేపేషు తథా ఘృతేషు. 5. ప్రపౌండరీకమంజిష్ఠా పద్మకోశీరచందనైః, సయష్టీందీవరైః పిత్తే క్షీరపిష్టైః ప్రలేపయేత్. 6. కశేరుశృంగాటకపద్మగుంద్రాః సశైవలాః సోత్పలకర్దమాశ్చ, వస్త్రాంతరాః పిత్తకృతే విసర్పే లేపా విధేయాః సఘృతాః సుశీతాః. 7. ప్రదేహాః పరిషేకాశ్చ శస్యంతే పంచవల్కలైః, పద్మకోశీరమధుకచందనై ర్వా

ప్రశస్యతే. 8. పిత్తే తు పద్మినీపంకం పిష్టం వా శంఖశైవలం, గుండ్రామూలం తు శుక్తి ర్వా గైరికం వా ఘృతాన్వితం. 9. న్యగ్రోధపాదా గుండ్రా చ కదళీగర్భ ఏవ చ, బిసగ్రంథికలేపః స్యా చ్ఛతధౌతఘృతాప్లుతః. 10. హరేణవో మసూరా శ్చ ముద్గా శ్చైవ సశాలయః, పృథక్ పృథ క్ప్రదేహాః స్యుః సర్వై ర్వా సర్పిషా సహ. 11. ద్రాక్షారగ్వధకాశ్మర్య త్రిఫలైరండపీలుభిః, త్రివృద్ధరీతకీభి శ్చ విసర్పే శోధనం హితం. 12.

కోష్టు పిల్లపీచర దేవదారువు తుంగముస్తెలు వారాహీకంద నేపాళపువిత్తులు ధనియములు మునగ తాడిశపత్రి నీలి గోరింట వీటినన్నిటినినూరి నేతితో చేర్చి సేకలేపములను చేయవలయును. కమలములు మంజిష్ఠ పద్మాక్షము వట్టివేళ్ళు చందనము మధుకము నల్లకమలములు వీటిని పాలతో నూరి విసర్పికి లేపనచేయవలయును. కసేరువు శృంగాటకము కమలములు భద్రముస్తెలు సేవంతి నల్లకమలములు వీటిని నూరి వడియగట్టి నేతితో పిత్తవిసర్పులకు లేపనచేయుట మంచిది. ఇట్లే పంచవల్కలముల లేపన సేకములును హితకరములు. పద్మాక్షము వట్టివేళ్లు మధుకము చందనము వీటితో లేపనచేసినను శ్రేష్ఠమే. పిత్తవిసర్పియందు కమలపు బురదగాని శంఖమునుగాని నూరి లేపనను చేయవలయును. మఱ్ఱియూడలు తెల్ల అరటిపొట్ట కమలనాళము వీటిని నూరి నూరుమాఱులు వడియగట్టిన నేతిలో కలిపి లేపనచేయ వలయును. రేణుకబీజములు నల్లతెగడ పెసలు శాలిధాన్యము వీటిని వేరువేఱుగా సమముగా నేతిలోకలిపి నూరి లేపనచేయవలయును. ద్రాక్ష ఆమ్లవేతము ఱేల గుమ్ముడు త్రిఫలములు ఏరండము పీలువు తెల్లతెగడ కరక్కాయలు వీటితో శోధనచేయుట విసర్పిరోగములకు మంచిది.

## ఖదిర లేపాదులు

శ్లో. గాయత్రీసప్తపర్ణాబ్దవాసారగ్వధదారుభిః, కుటన్నటై ర్భవే ల్లేపో విసర్పే శ్లేష్మసంభవే. 13. అజాశ్వగంధాసరలాథకాలా నైకేశికా వా పృథవాఽజశృంగీ, గోమూత్రపిష్టో విహితః ప్రలేపో హన్యా ద్విసర్పం కఫజం సుశీఘ్రం. 14. మదనం మధుకం నింబం వత్సకస్య ఫలాని చ, వమనం చ విధాతవ్యం విసర్పే కఫసంభవే. 15. త్రిఫలాపద్మకోశీర సమంగాకరవీరకం, ఫలమూల మనంతా చ లేపః శ్లేష్మ విసర్పహా. 16. ఆరగ్వధస్య పత్రాణి త్వచః శ్లేష్మాతకోద్భవాః, శిరీషపుష్పకామాచీ హితా లేపావచూర్ణనైః. 17.

కాచు ముయ్యాకుపొన్న తుంగముస్తెలు అడ్డసరము జేలచెక్క దేవదారువు భద్రముస్తెలు వీటిని లేపనచేసిన శ్లేష్మవిసర్పులకు మంచిది. గరదగొండి అశ్వగంధ తెల్లతెగడ నల్లతెగడ వీటిని గోమూత్రముతో నూరి చల్లని దానినే లేపనచేసిన విసర్పి నశించును. ఉమ్మెత్త మధుకము నింబము కొడిసెపాల విత్తులు వీటితో వమనములను చేయించుట విసర్పికి హితము. త్రిఫలములు పద్మాక్షము వట్టివేళ్లు మజ్జిష్ఠము గన్నేరు వీటిలేపము కఫవిసర్పిని పోగొట్టును. జేలపత్రములు విరిగిచెక్క దిరిసెనపూవులు కాకమాచి వీటితో లేపనములను అవమార్గములను చేయింపవలయును.

## నవకషాయగుగ్గులము.

శ్లో. ముస్తారిష్టపటోలానాం క్వాథః సర్వవిసర్పనుత్, ధాత్రీపటోలముద్గానా మథవా ఘృతసంప్లుతః. 18. అమృతవిషపటోలం నింబకల్కై రుపేతం త్రిఫలఖదిరసారం వ్యాధిఘాతం చ తుల్యం, క్వథితమిద మశేషం గుగ్గులో ర్భాగయుక్తం, జయతి విషవిసర్పా న్కుష్ఠమష్టాదశాఖ్యాన్. 19.

తుంగముస్తెలు నింబముపటోలము వీటికషాయము విసర్పిరోగములన్నిటిని పోగొట్టును. ఉసిరికపటోలము ముద్గక్వాథము వీనిని నేతితో చేర్చివర్తిజేసిన విసర్పులు నశించును. వారాహీకంద అమృతవిషము పటోలము తుంగముస్తెలు ముయ్యాకుపొన్న కాచు వేపఆకులు పసపు మ్రానిపసపు వీటిని నూరి లేపనచేసినచో విషములు విసర్పులు కుష్ఠులు విస్ఫోటములు గజ్జి శీతపిత్తము జ్వరము మున్నగునవి నశించును.

## అమృతాదిక్వాథము.

శ్లో. అమృతవృషపటోలం ముస్తకం సప్తపర్ణం ఖదిర మసితవేత్రం నింబపత్రం హరిద్రే, వివిధవిషవిసర్పా న్కుష్ఠవిస్ఫోటకండూ రపనయతి మసూరీం శీతపిత్తం జ్వరం చ. 20. పటోలామృతభూనింబ వాసకారిష్ట పర్పటైః, ఖదిరాబ్దయుతైః క్వాథో విస్ఫోటాతిజ్వరాపహః. 21.

తిప్పతీగె వృషము పటోలము తుంగముస్తెలు ముయ్యాకుపొన్న ఖదిరము నల్లవేతసము వేపాకు పసపు మ్రానిపసపు వీటికషాయము అన్నివిధములగు విషములను విసర్పములను విస్ఫోటములను గజ్జిరోగములను మసూరికారోగములును శీతపిత్తములు జ్వరములు మున్నగువానిని నశింపజేయును. పటోలము తిప్పతీగె నేలవేము అడ్డసరము అరిష్టము పిత్తపాపడ కాచు తుంగముస్తెలు వీటిని కషాయము చేసి సేవించినచో విస్ఫోటాదిపీడలును జ్వరములును నశించును.

### పటోలాదికషాయములు.

శ్లో. పటోలత్రిఫలారిష్టగుడూచీముస్తచందనైః, సమూర్వా రోహిణీపాఠా రజనీ సదురాలభా. 22 కషాయం పాయయేద్దేత శ్లేష్మపిత్తజ్వరాపహం, కండూత్వగ్దోషవిస్ఫోట విషవీసర్పనాశనం. 23. భూనింబ వాసా కటుకా పటోల ఫలత్రికా చందననింబసిద్ధః. విసర్పదాహ జ్వర వక్త్రశోష విస్ఫోట తృష్ణా వమినుత్కషాయః. 24. సకఫే పిత్తయుక్తే తు త్రిఫలాం యోజయేత్పురైః, దురాలభాం పర్పటకం పటోలం కటుకాం తథా. 25. సోష్ణం గుగ్గులుసమ్మిశ్రం పిబేద్వా ఖదిరాష్టకం, కుండలీపిచుమర్దాంబు ఖదిరేంద్రయవాంబు నా. 26. విస్ఫోటం నాశయత్యాశు వాయు ర్జలధరా నివ, చందనం నాగపుష్పం చ తండులీయకశారిబే. 27. శిరీషవల్కలం జాతీలేప స్స్యాద్దాహనాశనః, శుకతరునతమాంసీ రజనీపద్మాచ తుల్యాని. 28. పిష్టాని శీతతోయేన లేపస్స్యాత్సర్వవిస్ఫోటే, శిరీషమూలమంజిష్ఠా చవ్యామలకయష్టికాః. 29. సజాతీపల్లవక్షౌద్రా విస్ఫోటే కవలగ్రహాః, శిరోషోదుంబరౌజంబూ సేకాలేపనయో ర్హితాః. 30. శ్లేష్మాతకత్వచోవాపి ప్రలేపాశ్చ్యోతనే హితాః. 31. శిరీషయష్టినతిచందనైలమాంసాహరిద్రాద్వయకుష్ఠవాలైః, లేపో దశాంగః సఘృతైః ప్రదిష్టో విసర్పకండూజ్వరశోథహారీ. 32. శిరీషకోశీర నాగాహ్వా హింస్రాభి ర్లేపనా త్కృతం, విసర్పవిషవిస్ఫోటాః ప్రశమ్యంతి న సంశయః. 33.

పటోలము త్రిఫలములు వేప తిప్పతీగె తుంగముస్తెలు చందనము నాగఫలము కరకాయలు అగరుశొంఠి పసపు చిట్టికొండి వీటికషాయమును త్రాగవలయును. ఇయ్యది కఫము పిత్తజ్వరము ఖజ్జ విస్ఫోటము విషములు విసర్పములు నశింపజేయును. నేలవేము అడ్డసరము కటుకరోహిణి పటోలము త్రిఫలములు చందనము నింబము వీటితో సిద్ధముచేసిన కషాయము విసర్పములను దాహములను జ్వరములను ముఖశోషలను విస్ఫోటములను నశింపచేయును. కఫపిత్తపు విసర్పులయందు గుగ్గిలముతో త్రిఫలములను సేవింపవలయును. నాగఫలము పిత్తపాపడ పటోలము కటుకరోహిణి వీటి కషాయమును త్రాగినను తిప్పతీగె నింబము కురువేరు కాచు కొడిసెపాల వీటికషాయమును త్రాగినను విస్ఫోటములు నశించును.

## వృషాద్యఘృతము.

శ్లో. వృషఖదిరపటోలపత్రనింబత్వగమృతామలకీకషాయకల్కైః, ఘృతమభినవమేతదాశు పక్వం జయతి విసర్పగదాన్ సకుష్ఠగుల్మాన్. 34.

అడ్డసరము కాచు చేదపొట్లలసంగ పుపట్ట తిప్పతీగె ఉసిరిక వీటికషాయము లోను కల్కములోను నూత్నఘృతమును పక్వము చేయవలయును. ఇయ్యది విసర్పమున్న గుల్మమును పోగొట్టును.

## పంచతిక్తఘృతము.

శ్లో. పటోలసప్తచ్ఛదనింబవాసాఫలత్రికం ఛిన్నరుహావిపక్వం, తత్పంచతిక్తం ఘృతమాశు హన్తి త్రిదోషవిస్ఫోటవిసర్పకండూః. 35.

చేదుపొట్ల ముయ్యాకుపొన్న వేపాకు అడ్డసరము త్రిఫలములు తిప్పతీగె వీటితో పక్వముచేసిన ఘృతము విస్ఫోటము విసర్పము కండువులను పోగొట్టును.

## మహాపద్మకఘృతము.

శ్లో. పద్మకం మధుకం లోధ్రం నాగపుష్పస్య కేసరం, ద్వే హరిద్రే విడంగాని సూక్ష్మైలాతగరం తథా. 36. కుష్ఠంలాక్షాపత్రకం చ సిక్థకం తుత్థ మేవ చ, బహువారః శిరీషశ్చ కపిత్థఫల మేవ చ. 37. తోయే నాలోడ్య తత్సర్వం ఘృతప్రస్థం విపాచయేత్, యాంశ్చరోగాన్నిహన్త్యాశు తాన్నిబోధ మహామునే. 38. సర్పకీటాఖుదష్టేషు లూతామూత్రకృతేషు చ, విషధేషు స్ఫోటకేషు తథా కుష్ఠవిసర్పిషు. 39. నాడీషు గండమాలాసు ప్రభిన్నాసు విశేషతః, అగస్త్యవిహితం ధన్యం పద్మకం తు మహాఘృతం. 40.

పద్మాక్షము మధుకము లొద్దుగ నాగకేసరములు పసపు మ్రానిపసపు వాయువిడంగములు చిట్టియేలకులు తగరము కోష్టు లక్క తాడిశపత్రి మైలతుత్తము మైనము విరిగిచెక్క శిరీషము వెలగపండ్లు వీటిని నీటిలో నూరి అందు 16 పలములతైలమును పక్వముచేసి సేవించినచో విసర్పములు పురువులు మూత్రకృచ్ఛ్రరోగములు అనేకవిధములగు స్ఫోటకములు కుష్ఠులు విసర్పులు నాడీవ్రణములు గండమాలలు నశించును.

స్నాయువులకువావిలిరసము.

శ్లో. రోగస్తు స్నాయుకాఖ్యో యః క్రియా తత్ర విసర్పవత్, గవ్యం సర్పి స్త్ర్యహం పీత్వా నిర్గుండీస్వరసం త్ర్యహం, పిబే త్స్నాయుక మత్యుగ్రం హ న్త్యవశ్యం న సంశయః. 41. శోభాంజనమూల దళైః కాంజికపిష్టైః సలవణై ర్లేపః, హ న్తి స్నాయుకరోగం యద్వా మోచకత్వచో లేపః. 42.

స్నాయువను రోగమునకు విసర్పము వలె చికిత్స చేయవలయును. ఆవునేతిని మూడురోజులు త్రాగినపిమ్మట వావిలి రసమును మూడుదినములు త్రాగినచో స్నాయురోగములు నశించును. సందియములేదు. మునగచెక్క ఆకులు వీటిని గంజిలో నూరి సైంధవలవణమును కలిపి లేపనచేసినను ఇందుగుచెక్కను నూరి లేపనచేసినను స్నాయురోగములు నశించి పోవును.

ఇట్లు చక్రదత్తయందు విస్ఫోటాధికార ప్రకరణము ముగిసెను.

---

# ౫౩. మసూర్యధికారము.

మసూరికకు సామాన్యోపాయములు

శ్లో. సర్వాసాం వమనం పథ్యం పటోలారిష్టవాసకైః, కషాయై శ్చ వచావత్సయష్ట్యాహ్వఫలకల్కితైః. 1. సక్షౌద్రం పాయయే ద్బ్రాహ్మ్యా రసం వా హైలమోచికం, వాంతస్య రేచనం దేయం శమనం చాబలే నరే. 2. సుషవీపత్ర నిర్యాసం హరిద్రాచూర్ణసంయుతం, రోమంతీ జ్వరవిస్ఫోట మసూరీశాంతయే పిబేత్. 3. ఉభాభ్యాం హృతదోషస్య విశుష్యంతి మసూరికాః, నిర్వికారా శ్చాల్పపూయాః పచ్యంతే చాల్పవేదనాః. 4. కంటాకుంభాండుమూలం క్వథనవిధికృతం హింగుమాషైకయుక్తం, పీతం బీజం జయాయాః సఘృత ముషితవాః పీత మంఘ్రిః సికట్వా, మాఘామూలం శిఫావా దమనకకుసుమజా సోషణా వాఽథ పూతిః, యోగావాస్యంబునైతే ప్రథమ మథ గదే దృశ్య

మానే ప్రయోజ్యాః. 5. ఉద్ధృత్య ముష్టి మాచ్ఛాద్య భేషజం యత్ప్రియుజ్యతే, తన్ముష్టియోగ మిత్యాహు ర్ముష్టియోగపరాయణాః. 6.

అన్ని విధములగు మసూరికలయందును చేదుపొల్లవేపాకు అడ్డసరము వీటికషాయమును వసకోష్ఠుచెక్క మధుకము ఉమ్మెత్త కాయ వీటికల్కమును ఇచ్చి వాంతులను చేయించుట మంచిది. బ్రాహ్మీరసమునందు తేనెను వైచికొని త్రాగినను జలబ్రాహ్మీరసమును త్రాగినను చిలుకకూర రసమును త్రాగినను హితమును కలిగించును. వమనమును చేయించి ప్రవర్తుల క్రియపలయును. నిర్బలమనుష్యునకు ఇట్లైనచో శమనము కలుగును. కాకర జీలకఱ్ఱ ఆకుల రసమునందు పసపు వైచి త్రాగినచో జ్వరములు విస్ఫోటములు మసూరికలు శాంతించును. వమనము చేయించుటచేతను విరేచనమున కిప్పించుటచేతను దోషరహితము అయినవానికి వచ్చిన మసూరికలు నశించిపోవును. తెల్లనాకుడు తిప్పతీగ వీటికషాయములలో ఒకమాషమంత ఇంగువను వైచిగాని నేతితో క్రౌంచబీజములను నూరిగాని సేవించినచో మసూరికలు నశించును.

పికటీమూలమును నూరి త్రాగినను మహాకంద వనస్పతివేళ్ళనునూ త్రాగినను మిరియములతో నెమలి యడుగుచెట్టు వేళ్ళను నూరి త్రాగినను మసూరికలు నశించును.

## ఉష్ట్రిమూలాంబుపానాదులు.

శ్లో. ఉష్ట్రికంటకమూలం వా ప్యనంతామూల మేవ వా, విధిగృహీతం జ్యేష్ఠాంబుపీతం హన్తి మసూరికాం. 7. తద్వచ్ఛృగాలకంటకమూలం చ వ్యుషితాంభసా, మసూరీం మూర్ఛితో హన్తి గంధకార్ధ స్తు పారదః. 8. నిశాచించాచ్ఛదే శీతవారిపీతే తథైవ తు, యావత్సంఖ్యా మసూర్యంగే తావద్భిః శైలుజైః దలైః. 9. ఛిన్నాసాతురనామ్నాతు గుణీ వ్యేతి న వర్ధతే, వ్యుషితం వారి సక్షౌద్రం పీతం దాహాగుణీ హరం. 10 శేలుత్వక్కృతశీతాంభః సేకోవా కాయశోషణే, ఉగ్రాజ్యవంశసిలీ యవన్నృషకార్పాస కీకస బ్రాహ్మీ. 11. స్వరసమయూరకలంత్సాధూపో రోమాంతికాదిహరః, తర్పణం వాతజానాం ప్రాగ్లాజచూర్ణై స్సశర్కరైః. 12. భోజనం తిక్తయూషైశ్చ ప్రతుదానాం రసేన వా, ద్విపంచమూలం రాస్నా చ దా ర్వ్యుశీరం దురాలభా; 13. సామృతం ధాన్యకం ముస్తం జయే ద్వాతసముత్థితాం. 14.

ఉష్ట్రీమూలపు వేరును గాని అనంతమూలమునుగాని యథావిధిగా తెచ్చి బియ్యపు కడుగుతో నూరి త్రాగినచో మసూరికలు నశించును. నక్కపొన్న మారేడు వీటివేళ్ళను వేసి వాసినగట్టిన నీటితో సేవింపవలయును. పసపు చింతాకులు వీటిని నూరి చల్లనినీటితో కలిపి త్రాగవలయును. ఎన్నిమసూరికలు అంగములయందుండిన నన్నివితిగి యాకులను త్రుంచినచో మసూరికలు త్వమమైనవియైనచో నశించును. వితిగిచెక్క కషాయమును చల్లార్చి రాత్రియంతను నుంచి తేనెతో త్రాగినను గాని శరీరశోషమునకు సేచనము జేసినను గాని మసూరికలు నశించిపోవును. వస నేయి నీలి నెమలియడుగు చెక్క అడ్డసరము ప్రత్తివేళ్ళు క్షీకసము బ్రాహ్మితెల్లయుత్తరేణు లక్క వీటితో వైచిన ధూపము సోమంతికలు మున్నగు మసూరికలను నశింపజేయును. వాతపు మసూరికము లందు తొలుత పేలపిండిలో చక్కెరను కలిపి తర్పణక్రియను చేయవలయును. కటుపదార్థములతో చేసినయూషమునందు గాని ముక్కతో పొడిచిలిను పక్షుల మాంసరసముతో గాని భుజింపచేయవలయును. దశమూలములు రాస్న మ్రానిపసపు వట్టివేళ్లు పిన్నదూలగొండి వారాహీకంద ధనియములు తుంగముస్తెలు వీటితో వాతపు మసూరికలను జయింపవలెను.

### వాతజములందు గుడూచ్యాదులు.

శ్లో. గుడూచీం మధుకం రాస్నాం పంచమూలం కనీయకం, చందనం కాశ్మర్యఫలం బలామూలం వికంకితం. 15. పాకకాలే మసూర్యాం తు వాతజాయాం ప్రయోజయేత్, ద్రాక్షాకాశ్మర్యఖర్జూరపటోలారిష్టవాసకైః. 16. లాజామలకదుస్పర్శైః శీతాయుక్తైశ్చ పైత్తికే, శిరీషోదుంబరాశ్వత్థ శేలున్యగ్రోధపల్కలైః. 17. ప్రలేపస్సఘృతః శీఘ్రం వ్రణవిస్ఫోటదాహహా, దురాలభాం పర్పటకం భూనింబం కటురోహిణీం. 18. శ్లేష్మికాయాం పిత్తజాయాం వా పానే నిఃక్వాథ్య దాపయేత్.

తిప్పతీగె మధుకము రాస్న లఘు పంచమూలములు గుమ్ముడుకాయలు ముత్తువపులగము వీటినన్నిటిని వాతమసూరికల విషయములో పాకకాలమునందు పక్వము చేసి యీయవలసినది.

ద్రాక్ష గుమ్ముడు ఖర్జూరము పటోలము వేప అడ్డసరము పేలాలు ఉసిరిక వీటిని నూరి చక్కెరను కలిపి పిత్తమసూరికలలో ప్రయోగింపవలయును. దిరిసెన మేడి రావి బూరుగు మఱ్ఱి వీటిపట్టలను నేతిలో నూరి లేపనచేయవలయును. గాయములు

విస్ఫోటకపుమంటలు శీఘ్రముగా నశించును. దులదగొండి. పర్పాటకము నేలవేము కటుకరోహిణి వీటికషాయము కఫమసూరికలయందుగాని పిత్తపుమసూరికలయందు గాని త్రాగవలయును.

## నింబాదులు.

శ్లో. నింబం పర్పటకం పాఠాం పటోలం కటురోహిణీం. 19. వాసాం దురాలభాం ధాత్రీ ముశీరం చందనద్వయం, ఏష నింబాదికః ఖ్యాతః పీతః శర్కరయా యుతః. 20. హన్తి త్రిదోషమసూరీం జ్వరవీసర్పసంభవాం, ఉత్థితా ప్రవిశేద్యా తు పునస్తాం శాహ్యాత్ నయేత్. 21.

వేప పిత్తపాపడ అగరుశొంఠి పటోలము కటుకరోహిణీ అడ్డసరము దూలగొండి వట్టివేళ్లు చందనము రక్తచందనము ఇయ్యవి నింబాదులని చెప్పఁబడియెను. ఈనింబాదులను కండచక్కెరతో కలిపికొని భక్షించినచో త్రిదోషములవలనఁ బుట్టిన మసూరికలు జ్వరములు విసర్పివల్ల పుట్టినమసూరికలు మున్నగువానిని పోగొట్టును. మసూరికలేచి మఱలనణగి పోయునేని దానిని వెడలించుటయే యుత్తమము.

## పటోలాదిజలము.

శ్లో. పటోలకుండలీముస్త వృషధన్వయవాసకైః, భూనింబనింబకటుకా పర్పటైశ్చ శృతం జలం. 22. మసూరీం శమయేదామాం పక్వాం చైవ విశోషయేత్, నాతః పరతరం కించి ద్విస్ఫోట జ్వరశాంతయే. 23. పటోలమూలారుణతండులీయకం పిబేద్ధరిద్రామలకల్కసంయుతం, మసూరికాస్ఫోటవిదాహ శాంతయే తదేవ రోమాంతివమిజ్వరాపహమ్. 24. పటోలమూలారుణ తండులీయకం తథైవ ధాత్రీఖదిరేణ సంయుతం, పిబేజ్జలం సుక్వథితం సుశీతలం, మసూరికారోగవినాశనం వరం. 25.

పటోలము తిప్పతీగె తుంగముస్తెలు అడ్డసరము దులదగొండి నేలవేము వేప కటుకరోహిణి పర్పాటకము వీటికషాయముత్రాగిన పక్వాపక్వములగు మసూరికలైనను శోధించును. విస్ఫోటజ్వరములు నశించుటకింతకంటెను మంచిమంచిమందుమఱియొక్కటి లేదు. చేదుపొట్ల మంజిష్ఠము వీటికషాయములో పసపు ఉసిరిక రసము వేసికొని

త్రాగినను త్తమను. మసూరికలు విస్ఫోటకములు వీటియందైన మంటలు పోవును. మఱియు నియ్యదియే రోమంతిక ఛర్ది జ్వరములనుకూడ పోగొట్టును. పటోలపువేళ్లు మంజిష్ఠము బియ్యముకడుగు వీటికషాయములో యుసిరిక చంద్ర వీటికషాయమును వైచి చల్లార్చి త్రాగినచో నన్నిమసూరికలు నిశ్చయముగా నశించును.

## ఖదిరాష్టకము.

శ్లో. ఖదిరత్రిఫలారిష్టపటోలామృతవాసకైః, క్వాథోష్టకాంగో జయతి రోమాంతిక మసూరికాః. 26. కుష్ఠవిసర్పవిస్ఫోట కండ్వాదీనపి తా నతేః.

చంద్ర త్రిఫలయులు వేపపటోలయులు నారాహీకంద అడ్డసరము వీటి అష్టాంగ క్వాథము విసర్పి విస్ఫోటకములను రోమంతికా మసూరికలను కుష్ఠును విసర్పమును విస్ఫోటము మున్నగు వానిని పోగొట్టును.

## అమృతాదిక్వాథములు.

శ్లో. అమృతాదికషాయ స్తు జయే త్పిత్తకఫాత్మికాం. 27. పాపీ రేణ తు సంపిష్టం మా తులుంగస్య కేసరం, ప్రలేపా త్పాతయ త్యా శు దాహం చాశు నియచ్ఛతి. 28. పాదదాహం ప్రకురుతే పిడకాపా దసంభవా, తత్ర సేకం ప్రశంసంతి బహుశ స్తండులాంబునా. 29. పా కకాలే తు సర్వా స్తా విశోషయతి మారుతః, తస్మా త్సంబృంహణం కార్యం నచ పథ్యం విశోషణం. 30. గుడూచీమధుకం ద్రాక్షా మోర టం దాడిమైస్సహ, పాకకాలే తు దాతవ్యం భేషజం గుడసంయుతం. 31. తేన పాకం వ్రజ త్యాశు నచ వాయుః ప్రకుప్యతి, లిహే ద్వా బాదరం చూర్ణం పాచనార్థం గుడేన తు. 32. అనే నాశు విపచ్యంతే వాతపిత్తకఫాత్మికాః.

అమృతాదిక్వాథములు పిత్తమసూరికలను జయించును. మాతులుంగకేసరములను గంజితోనూరి లేపనచేసిన మసూరికలు నశించును. దాహమును శీఘ్రముగానుపశమిల్లును. కాళ్ళపైని పుట్టిన పిటకములకు దాహములను పుట్టించును. అప్పుడు బియ్యపుకడుగుతో చాలమారులు కడుగుటమంచిది. పక్వముకాఁబోవు కాలమునందుమసూరికలవాయువులు నశించును. కనుక పుష్టిగలిగించువస్తువులను రోగికి పెట్టవలయును. తిప్పతీగె మధుకము ద్రాక్ష ఇక్షుమూలము దానిమ్మ వీటిలో బెల్లమును వేసి పక్వకాలము నందొసగవలయును. ఇట్లయినశీఘ్రముగా మసూరికలు నశించును, వాయువుప్రకోపింపదు. పక్వముఅగుటకై

తుగుమూర్ణము నుబెల్లములోకలిపి యైనను తినిపింపవలయును. ఇట్లయినచో వాతపిత్త కఫసంబంధము లగు మసూరికలు శాంతించును.

ధన్వమాంసరసాదులు.

శ్లో. శూలాధ్మానపరీతస్య కంపమానస్య వాయునా. 33. ధన్వ మాంసరసాశ్శస్తా ఈషత్సైంధవసంయుతాః, దాడిమామ్లరసై ర్యుక్తా యూషా స్స్యు ర్దరుచౌ హితాః. 34. పిబే దంభ స్తప్తశీతం భావితం ఖదిరాశనైః, శౌచే వారి ప్రయుంజీత గాయత్రీబహువారజం. 35. జాతీపత్రం సమంజిష్ఠం దార్వీపూగఫలం శమీం, ధాత్రీఫలం సమధుకం క్వథితం మధుసంయుతం. 36. ముఖరోగే కంఠరోగే గండూషార్థం ప్రశస్యతే, అక్ష్ణోః సేకం ప్రశంసంతి గవేధుమధుకాంబునా. 37. మధుకం త్రిఫలా మూర్వా దార్వీత్వ క్నీల ముత్పలం, ఉశీరలోధ్రమంజిష్ఠాః ప్రలేపా శ్చ్యుతనే హితాః. 38. నశ్యం త్వ నేన ద్యస్గాతా మసూరో న ద్రవంతి చ, పంచవల్కలచూర్ణేన క్లేదినీ మవచూర్ణయేత్. 39. భస్మనా కేచి దిచ్ఛంతి కేచి ద్గోమయరేణునా. క్రిమిపాతభయాచ్చాపి ధూపయే త్సరలాదినా. 40. వేదనాదాహశాంత్యర్థం స్యుతానాంచ విశుద్ధయే, సగుగ్గులుం వరాం క్వాథం యుంజ్యా ద్వా ఖదిరాష్టకం. 41. కృష్ణాభయారజోలిహ్య స్మధునా కంఠశుద్ధయే, ఋఢ్వాష్టాంగావలేహ్వాం కబలం శ్చార్ద్రికాదిభిః. 42. పంచతిక్తం ప్రయుంజీత పానాభ్యంజనభోజనైః, కుర్యా ద్వ్రణవిధానం చ తైలాదీ న్వర్జయే చ్చిరం. 43. విషఘ్నైస్సిద్ధమంత్రై శ్చ ప్రసృజ్యాత్తు పునఃపునః, తథా శోణితసంసృష్టాః కాశ్చి చ్ఛోణితమోక్షణైః. 44.

పోటు ఉబ్బువాతకంపము గలవానికి అడవిజంతువుల మాంసరసములో సైంధవలవణమును వేసి త్రాగించుటమంచిది. అరుచికి దానిమ్మపుల్లకాయరసముతోచేర్చినయూషమునిచ్చుట మంచిది. శోధనచేయుటకు చండ్రలతునము పిటికషాయోదకములుత్తమములు. జాపత్రి మంజిష్టము పోకపసపు పోకజమ్మి ఉసిరిక మధుకము వీటిని కషాయము చేసి తేనెను కలిపికొని త్రాగిన ముఖరోగములు కంఠరోగములును నశించును. మధు

కడు త్రిఫలములు చాగఫలము మ్రానిపసపు జాపత్రి నల్లకమలములు వట్టివేళ్లు లోధ్ర మంజిష్ఠ వీటిని కన్నులకు లేపన చేసినను కంటిలో పిండినను నుత్తమములు. క్లేదములుగల మసూరికలయందు పంచవల్కలచూర్ణమును వ్రాయవలయును. క్రిములు పడునవెడిభయమునకు సరలాది ధూపముల నిచ్చుట మంచిది. త్రిఫలముల కషాయములో గుగ్గిలమునుగాని ఖదిరాష్టక చూర్ణమునుగాని కలిపి సేకము చేసిన పీడలు తొలగులు. పిప్పళ్లు కరక్కాయల చూర్ణములో తేనెనువైచికొని త్రాగినను అష్టాంగచూర్ణము నాకినను మంచిది. పానము మర్దనము భోజనములయందు పంచతిక్తకషాయము నీయవలయును. గాయము పూడుట కుపాయము నాలోచింపవలయును. తైలాదులను వర్జింపవలయును. విషనాశకములగు సిద్ధమంత్రములతో మాటిమాటికి తుడువవలయును. రుధిరోత్పన్నములగు మసూరికలకు రుధిరమును వెడలింపవలయును.

### హరిద్రాదిప్రలేహము.

శ్లో. నిశాద్వయోశీరశిరీషముస్తకైః సలోధ్రభద్రశ్రియనాగకేసరైః, సస్వేదవిస్ఫోటవిసర్పకుష్ఠదౌర్గంధ్యరోమాంతిహరః ప్రదేహః. 45. బింబ్యతీముక్తకాఽశోకప్లక్షవేతసపల్లవైః, నిశి పర్యుషితైః క్వాథో మసూరీభయనాశనః. 46. చైత్రాసితభూతదినే రక్తపతాకాన్వితా స్నుహీ భవనే, ధవళితకలశన్యస్తా పాపరుజో దూరతో ధత్తే. 47.

పసపు మ్రానిపసపు వట్టివేళ్లు దిరిసెన తుంగముస్తెలు లోధ్ర చందనము నాగకేసరములు వీటిని లేపన చేసినచో స్వేదరోగములు విస్ఫోటకములు విసర్పములు కుష్ఠులు దుర్గంధములు మున్నగు రోగములు నశించును. దొండ అతిముక్తపువేళ్లు అశోకము జువ్వి వేతసము వీటిఆకులను రాత్రులు నీటిలో తడిపి ప్రొద్దుటిపూట వీనిచే కడుగుటవలన మసూరికలు నశించును. చైత్రబహుళచతుర్దశినాడు జెముడుచెట్టును తనయింటికి తెచ్చి తెల్లని కలశములో నుంచి ఎఱ్ఱని పతాకతో నలంకరించెనేని మసూరికలు నశించిపోగలుగును.

ఇట్లు చక్రదత్తయందు మసూర్యధికారప్రకరణము ముగిసెను.



# ౫౪. క్షుద్ర రోగాధికారము.

శ్లో. తత్రా జగల్లికా మామాం జలౌకాభి రుపాచరేత్, శుక్తి సౌరాష్ట్రికా క్షార కల్కై శ్చాలేపయే న్ముహుః.1. కఠినాం క్షారయోగై శ్చ ద్రావయేదజగల్లికామ్, శ్లేష్మవిద్రధి కల్కేన జయే దనుశయీం భిషక్. 2. వివృతా మింద్రవృద్ధాంచ గర్దభీం జాలగర్దభామ్, ఇరివేల్లికాం గంధనామాం జయే త్పిత్తవిసర్పవత్. 3. మధురౌషధసిద్ధేన సర్పిషా శమయేద్వ్రణాన్, రక్తావసేకై ర్బహుభి స్స్వేదనై రపతర్పణైః. 4. జయే ద్విదారికాం లేపైః శిగ్రుదేవద్రు మోద్భవైః, పనసికాం కచ్ఛపికా మనేన విధినాభిషక్. 5. సాధయే త్కఠినానన్యాం చ్ఛోధాన్దోషసముద్భవాన్, అన్త్రాలజీంకచ్ఛపికాం తథా పాషాణగర్దభమ్. 6. సురదారుశిలాకుష్ఠైః స్వేదయిత్వా ప్రలేపయేత్, కఫమారుతశోథఘ్నో లేపః పాషాణగర్దభే. 7.

అపక్వముగానున్న అజగల్లికారోగమును జలగలనుపట్టించి యుపచరింపవలయును. ముత్తెపుసున్నమును సౌరాష్ట్రిలవణమును కల్కముచేసి పూయుటచేత శమింపచేయవలయును. గట్టిగానున్న అజగల్లికను ఉప్పుపదార్థముల లేపనచేత కరగింపవలయును. అనుశయీరోగమును కఫవిద్రధికి చెప్పిన కల్కముతో పోగొట్టవలయును. వివృత ఇంద్రవృద్ధ గర్దభి జాలగర్దభి ఇరివేల్లికా అనునీరోగములయందు పిత్తవిసర్పికి చెప్పిన యౌషధములచేత జయింపవలయును. మధురములగు నౌషధులచే తయారుచేయబడిన నేతితో గాయములను మాన్పవలయును. విదారికారోగమును నెత్తురువెడలించుట, చెమటపుట్టించుట, లంఘనము చేయించుట మున్నగువానిచేతను మును దేవదారుల చెక్కలను నూరి లేపనచేయుటచేతను ఉపచరింపవలెను. పనసికను కచ్ఛపికనుకూడ నీరీతిగనే చికిత్సచేయవలయును. ఇతరములగు దోషములవలన గలిగిన దుస్సాధములగు శోథలలో (వాపులను)ఇట్లే చికిత్సచేయవలయును. అంత్రాలజీ పాషాణగర్దభము కచ్ఛపిక అను నీరోగములనుగూడ, చెమ్మటపట్టించి దేవదారుచెక్క మణిశిల కోష్ఠు వీటిని నూరి పట్టువేసి పోగొట్టవలయును. పాషాణగర్ధభమునందు కఫవాతములను పోగొట్టునట్టి పట్టులను వేయవలయును.

శస్త్రములు మున్నగువాని ప్రయోగములు.

శ్లో. శస్త్రేణోద్ధృత్యవల్మీకం క్షారాగ్నిభ్యాం ప్రసాదయేత్, మనశ్శిలాల భల్లాత సూక్ష్మైలాగురు చందనైః. 8. జాతీపల్లవకల్కైశ్చ నింబతైలం విపాచయేత్, వల్మీకం నాశయేత్తద్ధి బహుచ్ఛిద్రం బహుస్వనం. 9. పాదదారీషు చ శిరాం వ్యధయేత్తలశోధనీమ్, స్వేదస్నేహోపపన్నౌతు పాదౌచా లేపయేన్ముహుః. 10. మధూచ్ఛిష్ఠ వసా మజ్జా ఘృతక్షారైర్వి మిశ్రితైః, సర్జాఖ్య సింధూద్భవయో శ్చూర్ణం మధుఘృతాప్లుతమ్, నిర్మథ్య కటుతైలాక్తం పిహితం పాదప్రమార్జనమ్. 11.

వల్మీకరోగమునందు శస్త్రముతో కోచి క్షారముచేత అగ్నిచేత చికిత్సచేయవలయును. మణిశిల జీడివిత్తులు చిన్నయేలకులు అగరుచందనము జాపత్రి యీటితో నగు కల్కమునందు వేపనూనెను పక్వముచేయవలయును. ఈతైలము బహురంధ్రములు పడిన వల్మీకరోగమును పోగొట్టును. పాదదారీ రోగమునందు లోపలి నాడులను శోధింపవలయును. నూనె చెమటల నూరుచుండెడి కాళ్లకు మైనము వస త్రిలవణములు నేయి వీటినికలిపి లేపనచేయవలయును. సముద్రఫేనము దేవదారుచెక్క వీటిచూర్ణములో తేనెను నేయిని ఆవనూనెను కలిపి చిలికి కాళ్లకు పట్టువేయుట యుత్తమము.

శ్లో. ఉపోది కాసర్షప నింబమోచ కర్కారు కైర్వారు కభస్మతోయే, తైలం విపక్వం లవణాంశయుక్తం తత్పాదదారీం వినిహంతి లేపాత్. అలసేమ్లోశ్చిరం సిక్తౌ చరణౌ పరిలేపయేత్, పటోలారిష్టకాసీస త్రిఫలాభిర్ముహుర్ముహుః. కరంజబీజం రజనీ కాశీసం మధుకం మధు, రోచనాహరితాలం చ లేపోయమలసేహితః. లాక్షాభయా రసాలేపః కార్యం వా రక్తమోక్షణమ్, జాతీపత్రంచ సంమర్ద్య దద్యాదలసకే భిషక్. 15.

దుంపబచ్చలి ఆవ వేప బూరుగు సొర దోస వీటినికాల్చిబూదిచేసి ఆనీటిలో తైలమును పక్వముచేసి ఒకపాలు ఉప్పునందుకలపవలయును. దీనిని లేపనచేయుట చేత పాదదారీరోగమునశించును. కాళ్లు మొద్దుబారినట్లుండురోగమునందు పుల్లనికషాయములతోను కల్కములతోను మాటిమాటికి కాళ్ళను కడుగవలయును. పిప్పట చేదుపొట్ల వేప కాశీసము త్రిఫలములు వీటినినూరి మాటి మాటికి లేపన చేయువలయును. నెమలియ

డుగు విత్తనములు పసపు కశీసము మధుకము తేనె గోరోచనము హరిదళము వీటిని నూరి లేపనచేయుట అలసరోగమునందు హితకరము. లక్కకరక్కాయలు వీటిరసమును పూసినను విషపునెత్తురును వెడలించినను జాపత్రినూరి పట్టు వేసినను అలసరోగములు కుదురును.

### ప్రసారణాదులు.

శ్లో. బృహతీరససిద్ధేన తైలేనాభ్యజ్య బుద్ధిమాన్, శిలారోచనకాశీసచూర్ణైర్వా ప్రతిసారయేత్. 16. దహేత్కదర ముద్ధృత్య తైలేన దహనేనవా, చిప్పముష్ణాంబునా స్విన్న ముత్కృత్యాభ్యజ్య తం వ్రణమ్. 17. దత్వా సర్జరసం చూర్ణం బద్ధ్వా వ్రణవదాచరేత్, స్వరసేన హరిద్రాయాః పాత్రే కృష్ణాయసే౽భయామ్.18. ఘృష్ట్వా తజ్జేన కల్కేన లింపే చ్చిప్పం పునఃపునః, చిప్పే సటంకణాస్ఫోతా మూలలేపో నఖవ్రణే. 19. నింబోదకేన వమనం పద్మినీకంటకే హితం, నింబోదకశ్రృతంసర్పిః సక్షౌద్రం పానమిష్యతే. 20. పద్మనాళకృతః క్షారః పద్మినీం హంతి లేపతః, నింబారగ్వధకల్కాభ్యాం ముహు రుద్వర్తనం హితం. 21. నీలీపటోలమూలాభ్యాం సాజ్యాభ్యాం లేపనం హితం, జాలగర్దభరోగే తు సద్యో హంతి చ వేదనామ్. 22.

బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు వాకుడురసముతో సిద్ధముచేసిన నూనెతో మణిశిలగోరోచనము కాశీసము వీటినిపొడిచేసికలిపి పట్టింపవలయును. కాలిలో కదరమును కణితిలేచెనేని నూనెతో గాని అగ్నితో గాని నశింపచేయవలయును. చిప్పమనురోగమును గోరువెచ్చనినీటితో చెమటపట్టించి శస్త్రముతో ఛేదించి ఆగాయమునందు తైలమునువేసి అందుసర్జరసచూర్ణమును పోసి కట్టవలయును. పసపును పసపురసముతోను కరక్కాయను నల్లని యినుపపాత్రములోను నూరి కల్కముచేసి చిప్పమునకు చికిత్సచేయవలయును. టంకపుచెక్క తెల్లచాగచెక్క వీటిని నూరి పట్టించిన చిప్పరోగము తొలగును. పద్మినీకంటకరోగమునందు వేపరసముతో వాంతి చేయించుట హితము. వేపరసముతో సిద్ధముచేసిన నేతిలో తేనెను కలిపికొని త్రాగుట హితకరము. కమలపుతీవెలముండ్లను నూరి పట్టించిన పద్మినీరోగములు నశించును. లేనిచో వేప ఆరె వీటిని కల్కముచేసి మాటిమాటికి నలుగుపెట్టుటమంచిది. నల్లచేదుపొట్ల ముల్లంగి వీటిని నేతితోనూరి లేపనచేసిన హితమగును. ఈలేపము జాలగర్దభరోగమునందు తత్క్షణమే నొప్పిని పోగొట్టి హితమును చేయును.

### స్తన్యశోధనాదులు.

శ్లో. అహిపూతనకే ధాత్ర్యాః పూర్వం స్తన్యం విశోధయేత్, త్రిఫలాఖదిరక్వాథైర్వ్రణానాం ధావనం సదా. 23. కరంజత్రిఫలాతిక్తైః సర్పిస్సిద్ధం శిశోర్హితం, గుదభ్రంశే గుదం స్నేహైః అభ్యజ్యాశు ప్రవేశయేత్. 24. ప్రవిష్టస్వేదయే చ్చాపి బద్ధం గోష్ఫణయా భృశం, కోమలం పద్మినీపత్రం యః ఖాదేచ్ఛర్కరాన్వితం. 25. ఏతన్నిశ్చిత్య నిర్దిష్టం న తస్య గుదనిర్గమః, వృక్షామ్లానల చాంగేరీబిల్వ పాఠాయవాగ్రజమ్. 26. తక్రేణశీలయేత్వాయు భ్రంశార్త్యోఽనల దీపనమ్, గుదం చ గవ్యపయసా మక్షయే దవిశంకితః. 27. దుష్ప్రవేశో గుదభ్రంశో విశత్యాశు న సంశయః, మూషికాణాం వసాభిర్వా గుదే సమ్యక్ప్రలేపనం. 28. స్విన్నమూషిక మాంసేన చాథవా స్వేదయే ద్గుదమ్.

చన్నులకుగిలిగెడు అహిపూతనరోగములప్పుడు తల్లియొక్క పాలను శుద్ధి చేయవలయును. త్రిఫలములు కాచు వీటికషాయముతో గాయములను కడుగవలయును. నెమలిఅడుగు విత్తనములు త్రిఫలములు వేపవేళ్లువీటితో తయారుచేసిన నేతిని పిల్లవానికిచ్చుట మంచిది. ఎక్కువగా మైలుతుత్తమును పానలేపనలయందు పయోగింపవలయును. గూదదిగినచో తైలము మున్నగువానిచే గూదను మెత్తబఱచి లోపలకు శీఘ్రముగా నెట్టవలయును. పిమ్మట చెమటపుట్టించి గోష్ఫణయంత్రముతో కట్టుటమంచిది. లేతకమల దళములను చక్కెరతో చేర్చి తినినచో నిక నెన్నటికిని గూద దిగదు. చింతపండు చిత్రమూలము చుక్కకూర మారేడు విషబొద్ది యవక్షారము వీనిని మజ్జిగలో కలిపి సేవించిన గూదదిగుటమాని ఆకలిఁబుట్టించును. ఆవుపాలతో తడుపుచుండిన గుదభ్రంశము తప్పక తొలగిపోవును. ఎలుకవసను రాచినను లేక ఎలుక మాంసముతో చెమట పట్టించినను గూదదిగుట నిలిచి పోవును.

### చాంగేరీ ఘృతము.

శ్లో. చాంగేరీకోలదధ్యమ్లనాగరక్షారసంయుతమ్. ఘృతము త్క్వథితం పేయం గుదభ్రంశరుజాపహం, శుంఠీక్షారా వత్ర కల్కౌ శిష్టం తు ద్రవమిష్యతే. 30.

పులిచింత రేగు పెరుగు గంజి శొంఠి యవక్షారములనుచేర్చి నేతిని చక్కగా కాచి త్రాగినచో గూదదిగుటమానును. ఇందుశొంఠి యవక్షారములు రెండును కల్కములుగాను తక్కినవి ద్రవములుగాను చేర్పవలయును.

## మూషికాద్య తైలము.

శ్లో. క్షీరే మహత్పంచమూలం మూషికా మంత్రవర్జితాం, పక్త్వాతస్మిన్స్వచేత్తైలం వాతఘ్నౌషధ సాధితమ్, గుదభ్రంశ మిదం తైలం పానాభ్యంగా త్ప్రసాధయేత్. 31.

ఆంత్రములేని యెలుకను బృహత్పంచ మూలములను పాలలో పక్వముచేయవలయును. పిమ్మట వాతనాశకములగు మూలికలతో సిద్ధముచేసిన తైలమునిందు మరల పోసికాచవలయును. ఈతైలమును సేవించినను అంటుకొనినను గూదదిగుటను పోగొట్టి మేలుచేయును.

## పరిక్తుకచికిత్స.

శ్లో. స్వేదోపనాహం పరికర్తికాయాం కృత్వాసమభ్యజ్య ఘృతేన పశ్చాత్, ప్రవేశయేచ్ఛర్మశనైః ప్రవిష్టే ర్మాంసైస్సుఖోష్ణై రుపనాహయేచ్చ. 32. స్నేహస్వేదైః స్తథానేనాం చికిత్సేదవపాటికాం, నిరుద్ధప్రకశే నాడీం ద్వియుఖం కినకాదిజాం. 33. క్షిప్త్వా త్యక్త్వా క్షుల్లకాదిస్సేహస ఏరపేచయేత్, తైలేన వా వచాదారు గంధైస్సిద్ధేన చక్రికాత్. 34. పునస్థూలతరా నాడీ దేయా స్రోతో వివృద్ధయే, శస్త్రేణ సేవసిం త్యక్త్వా భిత్వా వ్రణవదా చరేత్. 35. స్నిగ్ధంచ భోజనం బద్ధే గుదే వ్యేష క్రియాక్రమః, చర్మకీలం జతుమణిం మసకాం స్తిలకాలకాన్. 36. ఉద్ధృత్య శస్త్రేణ దహేత్ క్షారాగ్నిభ్యాం విశేషతః, రుబునాలస్యచూర్ణేన ఘర్షణమసకనాశనః. 37.

లింగసంబంధమగు చర్మరోగమునందు ఉపనాహకమును చెమటను పుట్టించి నేతితో తడిపి మెల్లమెల్లగా లోపలపెట్టి చమ్మగా నుండువేడి మాంసమును గట్టి చెమట పుట్టింపవలయును. అవపాటికారోగము (అనగా లింగపు చర్మము జారిపోవుట చేత వాయుని ధమై కలిగెడి ప్రకాశమనురోగము) నందు ఉపనాహకస్వేదమును పట్టవలయును. లేనిచో చుల్లికాదులను తైలముతో తడుపవలయును. అదియును కానిచో వస మ్రానిపసపు గంధకము వీటియందు సిద్ధము చేసిన తైలముతో మూడురోజులవఱకును తడుపుచుండవలయును. నాడీప్రవాహము అభివృద్ధిజెందుటకై లింగపుమొదటియందు తప్పతక్కిన చోటుల శస్త్రము చేసి గాయములనువలెకట్లు కట్టి మెత్తనియాహారముం బెట్టింపవలయును. గూదకును ఇదే చికిత్స. చర్మకీలకము జతుమణిమసక (మ

త్సారోగము) తిల్లిరోగము అను వానియందును శస్త్రము చేసి అగ్నితోను క్షారపదార్థములతోను దహింపచేయవలయును. ఆముదపు కాడలను పొడిచేసి రుద్దిన మత్సారోగము తొలగిపోవును.

### తారుణ్యపిడికారోగచికిత్స.

శ్లో. నిర్మోకభస్మ ఘృష్ట్వాద్వా మనశ్శాంతిం వ్రజేత్సదా, యువానపిడకాన్యచ్ఛ నీలికావ్యంగ శర్కరాః. 38. శిరావ్యధైః ప్రలేపైశ్చ జయే దభ్యంజనైస్తథా, లోధ్రధాన్యవచాలేప స్తారుణ్యపిడికాపహః. 39. తద్వద్గోరోచనాయుక్తం మరిచం ముఖలేపతః, సిద్ధార్థకవచాలోధ్రసైంధవైశ్చ ప్రలేపనం. 40. శమనంచ నిహన్త్యాశు పిడికాం యువానోద్భవామ్, వ్యంగేషు చార్జునత్వగ్వా మంజిష్ఠా వా సమాక్షికీ. 41. లేపస్సనవనీతా వా శ్వేతాశ్వఖురజామసీ, రక్తచందనమంజిష్ఠా లోధ్రకుష్ఠ ప్రియంగవః. 42. వటాంకుర మసూరాశ్చ వ్యంగఘ్నా ముఖకాంతిదాః, వ్యంగానాం లేపనం శస్తం రుధిరేణ శశస్య చ. 43. మసూరైస్సర్పిషా పిష్టైర్లిప్తమాస్యం పయోన్వితైః, సప్తాహాచ్చ భవేత్సత్యం పుండరీకదళప్రభమ్. 44. మాతులుంగ జటాసర్పిశ్శిలాగోశకృద్రసః, ముఖకాంతికరో లేపః పిడకాతిలకాలజిత్. 45. నవనీతగుడక్షౌద్రకోలమజ్జాప్రలేపనమ్, వ్యంగజిద్వరుణత్వగ్వా ఛాగక్షీరప్రపేషితా. 46. జాతీఫలస్య లేపో నీలవ్యంగాదినాశనః, సాయంచ కటుతైలేనాభ్యంగో వక్త్రప్రసాధనః 47.

యౌవనదశయందు పుట్టెడిమొటిమలు మచ్చలు నీలికవ్యంగము శర్కర అను రోగములకు నాడీచ్ఛేదము లేపనము అభ్యంజనము అనువానివలన చికిత్స చేయవలయును. లొద్దుగపూవు కొత్తిమెరలు వస నూరి పట్టించిన మొటిమలు నశించును. అట్లే మిరియములను గోరోజనముతో నూరి రాచిన పోవును. మఱియును ఆవాలు వస లొద్దుగపూవు సైంధవలవణము వీటితో లేపనము చేసినను వాంతిచేయించినను తక్షణమే పిడిక (మొటిమ)లను పోగొట్టును. వ్యంగరోగమునందు మద్దిచెక్క మంజిష్ఠము తేనె వీటితో లేపన చేయుట శ్రేష్ఠము. లేనిచో తెల్లనిదైన బూడిదను నవనీతముతో కలిపి రాచినను శ్రేష్ఠమే యగును. ఎఱ్ఱగంధము మంజిష్ఠ లొద్దుగ కోష్ఠు ప్రేంకణపు చెక్క మఱ్ఱియిగుళ్లు మసూరిధాన్యము వీనిని నూరి లేపన చేసినను వ్యంగము తొలగిపోవును. కుందేటి నెత్తురును పూసినను వ్యంగము నశించును. మసూరధాన్యమును నేతితో పాలతో నూరి

ఏడురోజులు పూసిన వ్యంగము నశించి కమలమువలె ముఖము వికసించును. లేనిచో మాదీఫలపు చెక్కను జటామాంసి నేయి మణిశిల పేడనీటితో కలిపి రాచిన ముఖకాంతివర్ధిల్లును. పిడికరోగములు తిల్లిరోగములును తొలగును. నవనీతముతో చేసిన నెయ్యి బెల్లము తేనె ఊగుపండ్లరసము వీటిని నూరి లేపన చేసినను వ్యంగములు నశించును. మేకపాలలో ఉలిమిడిచెక్కను నూరి ముఖమునకు పూసిన వ్యంగములు నశించును. జాజికాయ కల్కమును పూసినచో నీలిరోగము వ్యంగరోగము మొన్నగునవి క్షీణించిపోవును. సాయంకాలమునందు ఆవనూనెతో రుద్దుకొనిన ముఖమునకు స్వచ్ఛముగు కాంతి కలుగును.

## ముఖకాంతికై మరికొన్ని ఉపాయములు.

శ్లో. కాలీయకోత్పలామయ దధి సరబదరాస్థి మధ్యఫలినీభిః, లిప్తం భవతి చ వదనం శశిప్రభం సప్తరాత్రేణ. 48. తుషరహిత యవచూర్ణస యష్టిమధుక లోధ్రలేపేన, భవతి ముఖం పరినిర్జితచామీకరచారుసౌభాగ్యమ్. 49. రక్షోఘ్న శర్వరీద్వయ మంజిష్ఠాగైరికాంహ్వా ద్యైస్తు పయః, సిద్ధేన లిప్తమానన ముఖ్య ద్విపబింబవ ద్విభాతి. 50. పరిణతదధిశరపుంఖైః కువలయదళకుష్ఠ చందనోశీరైః, ముఖకమల కాంతికారీ భ్రుకుటీతిలకాలకాఙ్ఞయతి. 51.

నల్లఅగురు కలువలు కోష్ఠు పెయిగు శంఖపునాభి ప్రేంఖణపుచెక్క వీటిని నూరి ఏడురోజులు పూసినచో చంద్రునితో సమానముగా ముఖముగును. పొట్టుతీసిన యవల చూర్ణము కమలనాళము ముల్లగి మధుకము లొద్దుగపువ్వు వీటితో లేపనచేసిన మిసిమిసిలాడుచు మొగము బంగరువన్నె గలిగియుండును. శిరీషపుష్పము (దిరిసెన) పసపు మ్రానిపసపు మంజిష్ఠము గైరికధాతువు వీటిని గొఱ్ఱెపాలతో వండి లేపనచేసిన చంద్రునివంటి కాంతిగలిగి ప్రకాశించును. తగరము పెయిగు నల్లకమలదళములు కోష్ఠు చందనము వట్టివేళ్లు వీటిని నూరి లేపనచేసినచో ముఖకాంతి వృద్ధినొందును. భ్రుకుటిరోగమును తిలకాలికమును ఇయ్యది పోగొట్టును.

## హారిద్రాద్యయ తైలము.

శ్లో. హారిద్రాద్వయ యష్ట్యాహ్వా కాలీయక కుచందనైః, ప్రపౌండరీకమంజిష్ఠా పద్మపద్మక కుంకుమైః. 52. కపిత్థ తిందుకప్లక్షవట పత్రైః పయోన్వితైః, లేపయే త్కల్కితై రేభిః తైలం వాభ్యంజనం చ

రేత్. 53. పిప్లవం నీలికావ్యంగాం స్తిలకాన్ముఖదూషికాన్, నిత్యసేవీ జయేత్ క్షిప్రం ముఖం కుర్యా న్మనోరమమ్. 54.

పసపు మ్రానిపసపు ముల్లంగి చల్లఅగరు ఎఱ్ఱగంధము పుండరీకమను గంధద్రవ్యము మంజిష్ఠము కమలములు పద్మాక్షి కేసరి వెలగపండు కానుగచెక్క జువ్వి మఱ్ఱి వీటిఆకులు పాలు కలపి నూరి కల్కముచేసి అందుతైలమును వండి దానిని రుద్దికొనిన పిప్లరోగము నీలికవ్యంగము తిలకాలికము మున్నగురోగములను జయించుట మాత్రమే గాక మొగమునకు సొగసును తెచ్చును.

## కనకతైలము.

శ్లో. మధుకస్య కషాయేణ తైలస్య కుడవం పచేత్, కల్కైః ప్రియంగుమంజిష్ఠాచందనోత్పలకేసరైః. 55. కనకంనామ తత్తైలం ముఖకాంతికరం పరం, అభీకునీలికావ్యంగశోధనం పర మర్చితమ్. 56.

అతిమధురపు కషాయమునందు నాల్గుపలముల తైలమును చేర్చి మంజిష్ఠ రక్తచందనము కమలములు కేసరి వీటిని వైచి కల్కముచేసి తైలమును దింపవలయును. ఇయ్యది ముఖమునకు కాంతినిచ్చును. నీలికవ్యంగము మున్నగు ముఖరోగముల నన్నిటిని పోగొట్టును.

## మంజిష్ఠాది తైలము.

శ్లో. మంజిష్ఠా మధుకం లాక్షా మాతులుంగం సయష్టికమ్, కర్షప్రమాణై రేతైస్తు తైలస్య కుడవం తథా. 57. ఆజం పయస్త ద్ద్విగుణం శనైర్మృద్వగ్నినా పచేత్, నీలికా పిడికావ్యంగా నభ్యంగాదేవ నాశయేత్. 58. ముఖం ప్రసన్నం పచితం వలీపలితవర్జితమ్, సప్తరాత్రప్రయోగేణ భవేత్కనకసన్నిభమ్. 59.

మంజిష్ఠ అతిమధురము లక్కమాచికాయ ముల్లంగి వీటిని పావుపావు పలము చొప్పునతెచ్చి నాల్గుపలముల తైలము అయిదుపలముల మేకపాలును చేర్చి మెల్లమెల్లగా సన్ననిసెగ పైనివీటిని వండవలయును. ఈతైలమును రుద్దుకొనిన నీలిక పిడిక వ్యంగము అను వీనిని పోగొట్టును. ముఖము స్వచ్ఛమైనదగును. దీనిని ఏడురోజులు సేవించినంతమాత్రానసే ముఖము బంగరువంటి దగును.

## కుంకుమాది తైలము.

శ్లో. కుంకుమం చందనం లాక్షా మంజిష్ఠా మధుయష్టికా, కాలీయక ముశీరంచ పద్మకం నీల ముత్పలమ్. 60. న్యగ్రోధపాదాః ప్లక్షస్య

శుంగాః పద్మస్య కేసరం, ద్విపంచ మూలసహితైః కషాయైః పలికైః పృథక్. 61. జలాఢకం విపక్తవ్యం పాదశేష మథోద్ధరేత్, మంజిష్ఠా మధుకం ద్రాక్షా పతంగం మధు యష్టికా. 62. కర్షప్రమాణైరేతైస్తు తైలస్య కుడపం తథా, అజాక్షీరం తద్ద్విగుణం శనైర్మృద్వగ్నినా పచేత్. 63. సమ్యక్పక్వం పరం హ్యేతన్ముఖవర్ణప్రసాదనమ్, నీలికాపిడకావ్యంగా నభ్యంగా దేవ నాశయేత్. 64. సప్తరాత్ర ప్రయోగేణ భవేత్కాంచన సన్నిభమ్, కుంకుమాద్య మిదం తైల మశ్విభ్యాం నిర్మితం పురా. 65.

కేసరి చందనము లక్క మంజిష్ఠము యష్టిమధుకము కాలీయకము వట్టివేళ్లు పద్మాక్షము నల్లగల్వలు మఱ్ఱియూడలు జువ్విచిగుళ్లు కమల కింజల్కములు వీటి నన్నిటిని ఒక్కొక్కపలము చొప్పున తెచ్చి దశమూలములను 64 పలముల నీటితో కషాయముగా గాచి దానిలోపైయౌషధములను కలపవలయును. తరువాత మంజిష్ఠము అతిమధురము లక్క పతంగము యష్టిమధుకము వీటిని పావుపలము చొప్పున తీసికొని కల్కమును చేసి నాల్గుపలముల తైలమును చేర్పవలయును. అయిదుపలముల మేకపాలును ఈక్వాథములో కలుపవలయును. పిమ్మట సన్నని సెగపైన మెల్లమెల్లగా పక్వముచేసి చక్కగా పక్వమైన పిమ్మట యుపయోగించి కొనవలయును. ఇయ్యది మొగమునకు మెఱుగుబెట్టును. నీలిక పిడక వ్యంగ మున్నగురోగములను అభ్యంజనము చేసికొనిన మాత్రాననే పోగొట్టును. దీని నేడుదినములు సేవించినచో ముఖము బంగారుతో తుల్యమగును. ఇయ్యది అశ్వినీదేవతలచే పూర్వమునిర్మింపఁబడిన కుంకుమాదితైలము.

మఱియొకవిధమగు కుంకుమాదితైలము.

శ్లో. కుంకుమం కింశుకం లాక్షా మంజిష్ఠా రక్తచందనమ్, కాలీయకం పద్మకంచ మాతులుంగస్య కేసరం. 66. కుసుంభం మధుయష్టికం ఫలినీ మదయంతికా, నిశేద్వే రోచనాపద్మము త్పలంచమనశ్శిలా. 67. కాకోల్యాది సమాయుక్తైరీతైరక్షసమైర్భిషక్, లాక్షారసపయోభ్యాంచ తైలప్రస్థం విపాచయేత్. 68. కుంకుమాద్య మిదం తైలం చాభ్యంగా త్కాంచనోపమమ్, కరోతివదనం సద్యః పుష్టిలావణ్యకాంతిదమ్. 69. సౌభాగ్యలక్ష్మీ జననం వశీకరణ ముత్తమమ్.

కేసరి మోదుగమొగ్గ లక్క మంజిష్ఠ రక్తచందనము కాలీయకము పద్మాక్షమాది మొగ్గలు మ్రానిపసపు యష్టిమధుకము కుసుంభపసపు మ్రానిపసపు కమలము మణిశిల వీటినన్నిటిని ఒక్కొక్క పావుపలముచొ॥ కాకోల్యాది గణోక్తములగు ఔషధుల తో కలిపి లత్తుక మేకపాలు నీటిలోనుడకబెట్టి ఇందు ఒకసేరు తైలమును పోసి పక్వము చేయవలయును. ఇది కుంకుమాదితైలము. దీనిని రుద్దుకొనినచో శరీరమును బంగారువలె మెఱయఁజేయును. ముఖమునకు వన్నె నిచ్చును. బలమును సంపదను కలిగించును. అందరిని వశులఁజేయును.

## వర్ణకఘృతము.

శ్లో. మధుకం చందనం కంగుః సర్షపం పద్మకం తథా. 70. కాలీయకం హరిద్రా చ లోధ్రమేభిశ్చ కల్కితైః, విపచేద్ధి ఘృతం వైద్యః తత్పక్వం వస్త్రగాలితమ్. 71. పాదాంశం కుంకుమం సిక్థం క్షిప్త్వా మందానలే పచేత్, తత్సిద్ధం శిశిరే నీరే ప్రక్షిప్యాకర్షయేత్తతః. 72. తదేతద్వర్ణకంనామ ఘృతం వర్ణప్రసాధనమ్, అనేనాభ్యాస లిప్తం హి వలీభూతమపి క్రమాత్. 73. నిష్కలంకేందుబింబాభం స్యాద్విలాసవతీముఖమ్, అరూషికాయాం రుధిరే వసిక్తే శిరవ్యధే నాథ జలౌకసా వా, నింబాంబుసిక్తే శ్శిరసి ప్రలేపో దేయోఽశ్వవర్చోరససైంధవాభ్యాం. 74. పురాణమథ పిణ్యాకం పురీషం కుక్కుటస్య వా. 75. మూత్రపిష్టం ప్రలేపోయం శీఘ్రం హన్యాదరూంషికాం, అరూంషిఘ్నం భృష్టకుష్ఠచూర్ణం తైలేన సంయుతమ్. 76.

యష్టిమధుకము చందనము ప్రేంకణము పద్మాక్షము కాలీయకము కమలము మ్రానిపసపు లొద్దుగ వీటిని కల్కముచేసి అందు నేతిని పక్వముచేసి పిమ్మట వడియఁగట్టి అందు నాలుగవ పాలు కుంకుమ పువ్వు మైనము కలిపి సన్నని సెగపైన మెల్లమెల్లగా పక్వము చేసి చల్లనినీటిపై బోసి పాకమును కనుగొని దింపవలయును. ఇయ్యది వర్ణకమనెడు ఘృతము. కాంతినిచ్చును. దీనిని నిత్యమును నియమముగా సేవించెడి వానికి మొగపుముడుతలు తలనెఱపును రావు. స్త్రీల కిద్దానిచంద్రబింబముతో సమానముగా ముఖము కళకళలాడుచుండును. అరూషికారోగమునందు నాడీభేదనచేత గాని జలగలను కరిపించిగాని నెత్తురును వెడలింపవలయును. పిమ్మట నింబోదకములతో తడిపి గుఱ్ఱపులద్దెపాదరసము సైంధవలవణము వీటిని కలిపి తలకు పట్టువేయవలయును. లేనిచో ప్రాతవడినగానుగపిండిని గాని కోడిపెంటనుగాని మూత్రముతో నూరి పట్టు వేసిన వెంటనే

అరూషికారోగమును నశింపఁజేయును. కోష్ఠును వేయించి పొడిచేసి తైలముతో కలిపి సేవించినను అరూంషికలు నశించిపోవును.

## హారిద్రాద్యయతైలము.

శ్లో. హారిద్రాద్వయ భూనింబ త్రిఫలారిష్టచందనైః, ఏతత్తైలమరూంషీణాం సిద్ధమభ్యంజనే హితమ్. 77. దారణేతు శిరాం విధ్యేత్ స్నిగ్ధాం స్విన్నాం లలాటజాం, అవపీడశిరోవస్తీ నభ్యంగాం శ్చావచారయేత్. 78. కోద్రవాణాం తృణక్షీరపానీయం పరిధావనే, కార్యో దారణకే మూర్ధ్ని ప్రలేపో మధుసంయుతః. 79. ప్రియాలబీజ మధుకకుష్ఠమిశ్రైస్ససైంధవైః, కాంజికస్థా త్రిసప్తాహం మాషా దారణకాపహా. 80. సహా నీలోత్పల కేసరయష్టి మధుకతిలైస్స దృశమా మలకమ్, చిరజాతమపి చ శీర్షే దారణరోగం శమం నయతి. 81.

పసపు మ్రానిపసపు నేలవేము త్రిఫలములు వేపవేళ్లు చందనము వీటికల్కము లో తైలమును వండి దానిని రుద్దుకొనిన యెడల అన్నివిధములగు నరూంషికారోగములు తొలఁగిపోవును. శిరస్సును బ్రద్దలించెడి దారణరోగమునందు నునుపుగను చెమ్మగిలుచున్నట్టుగను నున్న నాడిని ఛేదింపవలయును. అవపీడనశిరోవస్తులను రుద్దవలయును. ఆరెకగడ్డిరసపు పానీయమును పోసికడుగవలయును. ఈక్షీరమునందే తేనెను కలిపి తలకు పట్టు వేయవలయును. లేనిచో మోరటివిత్తనములు యష్టిమధుకము కోష్టు సైంధవలవణము వీటిని కలిపి పట్టునైనను వేయవలయును. లేనిచో ఇరువదియొక్కరోజులవఱకు గంజిలోనానవైచిన మినుములను నూరి పట్టు వేసినను మంచిదే. నల్లకల్వలు కుంకుమపువ్వు యష్టిమధుకము నూవులు ఉసిరికకాయలు వీటిని నూరి పూసినను చాలరోజులనుండి యున్నదైనను దారణరోగము ఉపశాంతి నొందును.

## త్రిఫలాద్యతైలము.

శ్లో. త్రిఫలాద్యారజో మాంసీమార్కవోత్పలశారివైః, ససైంధవైః పచేత్తైల మభ్యంగా దురుకాం జయేత్. 82. చిత్రకందంతిమూలంచ కోశాతకిసమన్వితమ్, కల్కంపిష్ట్వా పచే త్తైలం కేశదద్రు వినాశనమ్. 83. గుంజాఫలై శ్శృతం తైలం భృంగరాజరసేనవా, కండూదారణ హృత్కుష్ఠ కపాలవ్యాధి నాశనమ్. 84.

త్రిఫలముల చూర్ణము జటామాంసి గుంటకలగరాకు కమలములు సుగంధిపాలవేళ్లు సైంధవలవణము వీటియందు తయారుచేయఁబడిన తైలమును రుద్దికొనిన శిరస్సునగ

దు పుట్టెడిదారణ రోగములు అన్నియును నశించును. చిత్రమూలము దంతిమూలము నేల గుమ్ముడి వీటిని కల్కముచేసి అందు ఆవాలనూనెను సిద్ధముచేయవలయును. ఈతైలము చుండును పోగొట్టును. గురిగింజలు గుంటకలగరాకువీటితో కాచఁబడినతైలము జిలలను దారణరోగములను కుష్ఠరోగమును తలపోటులను నశింపఁజేయును.

### భృంగరాజతైలము.

శ్లో. భృంగరాజ త్రిఫలోత్పల శారిలోహపురీష సమన్విత కారి, తైలమిదం పచ దారుణహారి కుంచితకేశఘనస్థిరకారి. 85. ప్రపౌండరీక మధుకపిప్పలీ చందనోత్పలైః, కార్షికైస్తైలకుడపం త్రిర్ద్విరామలకీరసః, సాధ్య స్సప్రతిమర్శ స్స్యా త్సర్వశీర్షగదాపహః. 86.

గుంటకలగర త్రిఫలములు కలువలు సుగంధిపాలవేళ్లమండూరము వీటితో చేసిన కల్కమునందు సిద్ధముచేసిన తైలము శిరస్సునకు గలుగు దారుణరోగములను హరించును. క్షీణించినవారికి మఱల వెంట్రుకలను మొలపించునట్టిది. వేయి రేకులకమలములు యష్టిమధుకము పిప్పళ్లు చందనము కల్వలు వీటినొక్కొక్క కర్షమెత్తు తెచ్చి పదియారు తులముల ఆవనూనెను ఇరువది తులముల యుసిరికరసమును కలిపి అటుపైని తైలమును పక్వముచేయవలయును. దీని రుద్దుకొనుట వలన అన్నివిధములగు శిరోరోగములు కుదురును.

### మాలత్యాదితైలము.

శ్లో. మాలతీకరవీరాగ్ని నక్తమాలావిపాచితమ్, తైలమభ్యంజనే శస్తమింద్రలుప్తాపహం పరమ్. 87. ఇదంహి త్వరితం హంతి దారుణం నియతంనృణాం, ధాత్ర్యామ్రమజ్జలేపాత్స్యాత్ప్రరోరు స్స్నిగ్ధకేశతా. 88. ఇంద్రలుప్తే శిరాంవిద్ధ్వా శిలాకాసీసతుత్థకైః, లేపయేత్త్వరితః కల్కైస్తైలంచాభ్యంజనే హితం. 89. కుటన్నటశిఖిజాతీ కరంజకరవీరజైః, అవగాఢపదం చైవ ప్రచ్ఛయిత్వా పునః పునః. 90. గుంజాఫలైశ్చిరం లింపే త్క్లేశభూమిం సమంతతః, హస్తిదంతమసీం కృత్వా ముఖ్యం చైవ రసాంజనమ్. 91. లోమాన్యనేన జాయంతే నృణాం పాణితలేష్వపి, భల్లాతకబృహతీఫలగుంజామూలఫలేభ్య ఏకేన, మధుసహితేన ఏలిప్తం సురరుతులిప్తం శమం యాతి. 92. బృహతీఫలరసపిష్టంగుంజాఫలమూలం చేంద్రలుప్తస్య, కనకనిఘృష్టస్య సతో దాతవ్యంప్రచ్ఛితస్యాస

దా. 93. ఘృష్టస్యకర్కశైః పత్రైః ఇంద్రలుప్తస్య గుండనమ్, చూర్ణితై ర్మరిచైః కాయమింద్రలుప్తనివారణమ్. 94. ఛాగక్షీరరసాంజన పుట దగ్ధగజేంద్ర దంత మషిలిప్తాః, జాయంతే సప్తరాత్రా త్తల్వావ్యమపి కుంచితాశ్చికురాః. 95. మధుకేందీవరమూర్వాతిలాజ్యగోక్షీర భృంగలేపేన, అచిరాద్భవంతి ఘనకేశా దృఢమూలాయతా బుజవః. 96.

జాజిపువ్వు గన్నేరు చిత్రమూలము నెమలిఅడుగు వీటితో సిద్ధము చేయబడిన తైలము ఇంద్రలుప్తయను (బట్టతలయగుటయను) రోగమును పోగొట్టును. దీనిని నియమముగా సేవించువారిని దారుణరోగములు చేరఁజాలవు. ఉసిరిక మామిడి వీటిరసమును లేపన చేయుటచేత వెంట్రుకలు దట్టముగను స్థిరముగను పెరుగగలవు. ఇంద్రలుప్తరోగమునందు శిరోనాడులను ఛేదించియంతటను శిలాజిత్తు కాసీసము మైలుతుత్తము వీటిని లేపనచేయవలయును. వీటికల్కములో సిద్ధము జేయఁబడిన తైలమును రుద్దుటయును హితకరమే యగును. చాలకాలమునుండి పుట్టియున్నయింద్రలుప్త రోగమునందు చిత్రమూలము జాతీఫలము నెమలియడుగు గన్నేరువీటికషాయముతో వెంట్రుకలూడిపోయిన చోటుల గురిగింజలు వాని చెక్క వీటిని నూరి లేపన చేయవలయును. లేనిచో ఏనుగు దంతపు మసితో రసాంజనము నూరి లేపన చేసినచో మనుజులకు అరచేతులలో కూడ వెంట్రుకలు మొలచును. జీడిపిత్తనములు వాకుడు గురుగింజవేళ్లు బరడు నూరి ఇంద్రలుప్తరోగమునకు లేపనము చేయవలయును. కఠినములగు ఆకులతో నాఁటసికొని పోయిన తలలో మిరియములచూర్ణమును పట్టించిన యింద్రలుప్తరోగము తొలఁగిపోవును. మేకపాలు రసాంజనము పుటపాకము పెట్టిచేసిన ఏనుగుదంతపు మసి వీటిని కలిపి లేపనచేయుటచేత నేడురోజులలో బట్టతలపైనను ఉత్తమములగు కేశములు పుట్టగలవు. మధుకము కమలములు మూర్వ (నాగచెక్క) తిలలు నేయి ఆవుపాలు గుంటకలగరాకు వీటినినూరి పట్టించిన మిక్కిలి శీఘ్రకాలములోనే మనుజుఁడు శోభనకేశములు గలవాఁడు అగును.

## స్నుహ్యాది తైలము.

శ్లో. స్నుహీంపయః పయోఽర్కస్య మార్కవో లాంగలీ విషం, మూత్రమాజం సగోమూత్రం రక్తికా సేంద్రవారుణీ. 97. సిద్ధార్థం తీక్ష్ణతైలం చ గర్భందత్వా విపాచితం, వహ్నినా మృదు నాపక్వం తైలంఖాలిత్యనాశనమ్. 98. కూర్మపృష్ఠ సమానాపి కు జ్యాయా రోమతస్కరీ, దిగ్ధా సా నేన జాయేత ఋక్షశారీరలోమశా. 99.

జముడుపాలు జిల్లేడుపాలు గుంటకలగరాకు నీరు పిప్పలి అతివస మేకమూత్రము ఆవుపంచితము కొండెసె పాలవిత్తులు ఆవాలు (తెల్లవి) ఈయౌషధులలో ఆవనూనెను పోసి మెల్లమెల్లగా సన్నని సెగను పాకము చేసి ఈ తైలమును లేపన చేసినయెడల బట్టతలపోయి మంచిగా వెంట్రుకలు కలుగును. తాబేటి చిప్పవలె మొద్దుబారినతలగల వారును దీనిని సేవించిన ఎలుగుబంటుకు వలె పొడవగు వెంట్రుకలను పొందగలరు.

### ఆదిత్యపాక గుడూచీ తైలము.

శ్లో. వటావరోహ కేశిన్యో శ్చూర్ణే నాదిత్యపాచితమ్, గుడూచీస్వరసే తైలం చాభ్యంగాత్కేశరోపణం. 100.

మఱ్ఱియూడ జటామాంసి వీనిని చూర్ణము చేసి తిప్పతీగె రసమునందు కలిపి ఎండలో పుటము పెట్టి పక్వము చేసి సిద్ధము చేసిన తైలమును అంటుకొనినయెడల వెంట్రుకలు ఉత్పత్తి యగును.

### చందనాది తైలము.

శ్లో. చందనం మధుకం మూర్వా త్రిఫలా నీలముత్పలం, కాంతా వటావరోహశ్చ గుడూచీరస మేవచ. 101. లోహచూర్ణం తథా కేశీ శారిబే ద్వే తథైవచ, మార్కవ స్వరసేనైవ తైలం మృద్వగ్నినా పచేత్. 102. శిరస్యుత్పాటితాః కేశా జాయంతే ఘనకుంచితాః, దృఢమూలాశ్చ స్నిగ్ధాశ్చ తథా భ్రమరసన్నిభాః. 103. నస్యేనా కాలపలితం నిహన్యా త్తైల ముత్తమమ్.

చందనము యష్టిమధుకము (అనగా అతిమధురము) చాగ త్రిఫలములు నల్లకల్వలు మూర్వ మఱ్ఱియూడలు తిప్పతీగెరసము లోహచూర్ణము జటామాంసి రెండు తెఅగులగు లొద్దుగులు కమలపుదుంప వీటి కల్కము చేర్చి గుంటకలగరాకు రసముతో తైలమును సన్నని సెగను పక్వము చేయవలయును. దీనిని సేవించుటవలన రాలిపోయిన వెంట్రుకలు మరల మొలచును. వెంట్రుకలు దట్టముగను గట్టిగను సున్నగను నల్లగను పెరుగును. ఈ తైలము అసమయమున పుట్టిన నెఱపులైనను పోగొట్టును.

### మధుకాది తైలము.

శ్లో. తైలం సయష్టిమధుకైః క్షీరే ధాత్రీఫలైశ్శృతమ్. 104. నస్యే దత్తం జనయతి కేశాన్ శ్మశ్రూణి చాప్యథ, త్రిఫలానీలినీ పత్రం లోహం భృంగరజస్సమమ్. 105. అవిమూత్రేణ సంయుక్తం కృష్ణీకరణ ముత్తమమ్, త్రిఫలాచూర్ణ సంయుక్తం లోహచూర్ణం వినిక్షిపేత్. 106. ఈ

పత్పక్వే నారికేళే భృంగరాజరసాన్వితే, మాషమేకంతు నిక్షిప్య సమ్యగ్గర్భాత్సముద్ధరేత్. 107. తతశ్శిరో ముండయిత్వాలేపం దద్యాద్భిషగ్వరః, సంవేష్ట్య కదళీపత్రై ర్మోచయేత్సప్తమేదినే. 108. క్షాళయే త్త్రిఫలాక్వాథైః క్షీరమాంసరసాశినః, కపాలరంజనం చైత త్కృష్ణీకరణ ముత్తమమ్. 109. ఉత్పలం పయసాసార్థం మాసం భూమౌ నిధాపయేత్, కేశానాం కృష్ణీకరణే స్నేహనంచ విధీయతే. 110. భృంగపుష్పం జపాపుష్పం మేషీదుగ్ధ ప్రపేషితం, తేనైవాలోడితం లోహపాత్రస్థం భూమ్యధఃకృతం. 111. సప్తాహాదుద్ధృతం పశ్చాద్భృంగరాజరసేనతు, ఆలోడ్యాభ్యజ్య చ శిరో వేష్టయిత్వా వసేన్నిశాం. 112. ప్రాతస్తు క్షాలనం కార్య మేవంస్యాన్మూర్ధ్ని రంజనమ్, ఏవం సిందూర వాలాంబ శంఖభృంగరసైః క్రియా. 113

అతిమధురము మధుకము ఉసిరిక వీటితో పక్వము చేసినపాలతో నైన క్వాథమునందు సిద్ధము చేసిన తైలమును నస్యముగా నిచ్చుచో తలకును గడ్డమునకును వెంట్రుకలు మొలచును. త్రిఫలములు నీలికూరాకులు గుంటకలగరాకు పొడి వీటినిసమానభాగములను ఆడుమేక మూత్రముతో నూరి వెంట్రుకలకు పట్టించిన నల్లబడును. కొంచెముగా పక్వమైన కొబ్బరికాయలో (మంచినూనెను) లోహచూర్ణమును త్రిఫలముల చూర్ణమును పోసి దానియందు గుంటకలగరాకు పసరును పోసి మూతిని మూసి ఒకనెలరోజులుంచి తరువాత వైద్యుడగువాడు తలను క్షౌరము చేయించి దీనిని పూసి అరటిఆకులతో చుట్టికట్టి యేడుదినములైన పిమ్మట విప్పవలయును. తరువాత త్రిఫలముల కషాయముతో కడుగవలయును. పాలు మాంసరసము నాహారముగా పెట్టవలయును. ఇయ్యది కపాలమును రంజింపచేసి వెంట్రుకలను నల్లపఱచును. కలువను పాలతో నొకనెలరోజులు భూపుటమును వేయవలయును. తరువాత తీసి నూరిపట్టించిన శిరోజములు నల్లపడును. గుంటకలగరాకు పువ్వు జపాపుష్పము వీటిని ఆడుమేకపాలతో నూరి ఇనుపపాత్రలో పోసి భూమిలో పాతిపెట్టి యేడురోజులుంచి తీసి గుంటకలగరాకు పసరును కలిపి సాయంకాలమునందు శిరస్సునకు లేపనచేసి ప్రాతఃకాలమునందు కడుగుచుండవలయును. ఇదేవిధముగా సిందూరమును శంఖపుష్పము గుంటకలగరాకు వీటిరసములతోటియును చికిత్సలను చేయవలయును.

## శంఖచూర్ణమున్నగు లేపనములు.

శ్లో. నవదగ్ధ శంఖచూర్ణం కాంజికసిక్తం హి సీసకం ఘృష్ట్వా, లేపా త్కచా నర్కదలావబద్ధాన్ శుభ్రాన్కరోతి నీలతరాన్. 114. లోహమలామల కల్కైః స్నజపాకుసుమైః స్సదా నరస్స్నాయాత్, పలితానీహన పశ్యతిగంగాస్నాయీవ నరకాణి. 115. నింబస్య బీజానిహి భావితాని భృంగస్య తోయేన తథాశనస్య, తైలంతు తేషాం వినిహంతి న స్యాద్దుగ్ధాన్నభోక్తుః పలితం సమూలం. 116. నింబస్య తైలం ప్రకృతిస్థమేవ నస్యేనిషిక్తం విధినాయథావత్, మాసేనగోక్షీరభుజోనరస్యజరాగ్రిభూతం పలితం నిహంతి. 117. క్షీరాత్సమార్క వరసాత్ ద్విప్రస్థే మధుకాత్పలే, తైలస్యకుడపం పక్వం తన్నస్యం పలితావహం. 118.

క్రొత్తగా కాల్చిన శంఖచూర్ణమును గంజితో తడిపి సీసముతో నూరి కలుపవలయును. పిమ్మట దీనిని పూసి తలకు జిల్లేడాకులను కట్టవలయును. ఇట్లు చేసిన తెల్లని వెంట్రుకలును మిక్కిలియును నలుపెక్కును. మండూరము ఉసిరిక జపాపుష్పము వీని కల్కమును రుద్దుకొని స్నానముం జేసిన గంగలో స్నానము చేసినవాడు పాపములను వలెనే తలనెఱుపురోగమును పోగొట్టుకొనగలుగును. వేపవిత్తనములను గుంటకలగరాకురసములో గాని పుల్లనీటితో (తరవాణి) గానిభావనచేసి దానితో తైలమును సిద్ధముచేయు వలయును. దీనిని నస్యవిధిచేయుచు పాలన్నమును తినెడివాడు పలితరోగములను పోగొట్టుకొనును. వేపనూనెనే నస్యవిధిగా నుపయోగించిన వానికి వృద్ధదశయందును నెఱపుతనము రాజాలదు. పాలను గుంటకలగరాకు రసమును 32 తులములు తెచ్చి రెండుపలములు అతిమధురమును చేర్చి 4 పలముల తైలమును పక్వముచేసి మర్దన చేసినచో తలనెఱియుట నశించి పోగలదు.

## మహానీలతైలము.

శ్లో. ఆదిత్య వల్లీమూలాని కృష్ణశైరీయ కస్యచ, సురథస్యచపత్రాణి ఫలం కృష్ణాశనస్య చ. 119. మార్కవంకాక మాచీచ మధుకం దేవదారుచ, పృథగ్దశపలాంశాని పిప్పలీ త్రిఫలాంజనం. 120. ప్రపౌండరీకం మంజిష్ఠా లోధ్రం కృష్ణాగరూత్పలం, ఆమ్రాస్థికర్దమః కృష్ణామృణాళీర క్తచందనం. 121. నీలీభల్లాతకాస్థీని కాసీసం మదయంతికా, సోమరాజ్య శనశ్శస్త్రం కృష్ణో పిండీతచిత్రకా. 122. పుష్పాణ్యర్జునకాశ్మర్యోః ఆమ్రజంబూ ఫలానిచ, పృథక్పంచపలైర్భాగైః సుపి

ష్టైరాధకంపచేత్. 123. వైభీతకస్య తైలస్య ధాత్రీ రస చతుర్గుణమ్, కుర్యా దాదిత్యపాకం వా యావచ్ఛుష్కో భవే ద్రసః. 124. లోహపాత్రే తతః పూతం సంశుద్ధ ముపయోజయేత్, పానే నస్యక్రియాయాం చ శిరోభ్యంగే తథైవచ. 125. ఏతచ్చాక్షుష్య మాయుష్యం శిరస స్సర్వరోగనుత్, మహానీల మితి ఖ్యాతం పలితఘ్న మనుత్తమమ్. 126.

సూర్యవల్లితీగయొక్క వేరు నల్లగోరింటరసము సురసపత్రములు నీలివిత్తనములు గుంటకలగరాకు కాచఆకు దేవదారు వీటి నన్నిటిని వేర్వేరుగా పదిపదిపలములు తెచ్చి పిప్పళ్లు త్రిఫలములు తుత్థాంజనము కమలము మంజిష్ఠ లొద్దుగ అగరు మామిడి టెంక నల్లగలువలు ఎఱ్ఱగంధము నీలి జీడివిత్తనములు కాసీసం మదయ తి సోమవల్లి ఆశ ము చిత్రమూలము మద్ది నేలగుమ్ముడు మామిడి నేరేడు వీటిని వేఱువేఱుగా నైదైదు పలములను తెచ్చి అన్నిటిని నూరి సిద్ధముచేసి పిమ్మట 74 పలముల తాడితైలమును తైలముకంటెను నాల్గురెట్లధికముగా నుసిరికకాయలరసమును తీసికొని కలిపి (అన్నిటిని) ఎండలోపెట్టి తర్వాత వడియగట్టి యినుపపాత్రములో పోసి యుంచవలయును. ఈతైలమును త్రాగుటకును నస్యవిధిని తలంటుటకును ఉపయోగించిన నేత్రములకు వికాసము నిచ్చును. ఆయుష్యమును పెంపొందించును. శిరోరోగములను పూర్తిగా పోగొట్టును. ఇయ్యది మహానీలతైల మనంబడును. తల నెఱియుటను పోగొట్టును. ఉత్తమమైనది.

## భృంగరాజఘృతాదులు.

శ్లో. భృంగరాజ రసే పక్వం శిఖిపిత్తేన కల్కితం, ఘృతం నస్యేన పలితం హన్యా త్సప్తాహయోగతః. 127. కాంజికాపిష్ట శైలూకమజ్జ సచ్ఛిద్రలౌహగే, యదర్కతాపా త్పతతి తైలం తన్నస్య ముత్తమమ్. 128. కేశా నీలాలి సంకాశా స్సద్య స్స్నిగ్ధా భవంతి చ, నయన శ్రవణ గ్రీవా దంతరోగాంశ్చ హంత్యదః. 129. కాసీసంరోచనాతుల్యం హరితాలం రసాంజనం, అమ్లపిష్టైః ప్రలేపోయం వృషకచ్ఛ్వహిపూతయోః. 130. పటోల పత్ర త్రిఫలా రసాంజన విపాచితం, పీతం ఘృతం నిహంత్యాశు కృచ్ఛ్రామ ప్యహిపూతనాం. 131. రజనీ మార్కవమూలం పిష్టం శీతేన వారిణా తుల్యం, హంతి విసర్పం లేపా ద్వారా

హాదశనా హ్యాయం ఘోరం. 132. నాగకేసరచూర్ణం వా శతధౌతేస సర్పిషా, పిష్ట్వా లేపో విధాతవ్యో దాహే హర్షే చ పాదయోః. 133.

నెమలిపిత్తముతో కల్కముచేసి నేయి కలిపి గుంటకలగరాకు రసమునందు పక్వముచేసి నస్యము వేసిన తలనెరియుట మానును. గిరిగిచెక్కను గంజితో నూరి కల్కముచేసి రంధ్రములు గల లోహయంత్రమునందు ఎండకు ఎండించి నస్యముగా నుపయోగించిన తక్షణమే కురులు నలుపెక్కును. ఇయ్యాదియే పండ్లు కండ్లు చెవి మెడ మున్నగువాని రోగములను పోగొట్టును. గోరోచనమును కాసీసమును హరితాళమును తుత్తమును వీటిని సమానభాగములనుగా తెచ్చి గంజితో నూరి వృషకచ్ఛా అహిపూతనరోగములయందు లేపనచేయుట మంచిది. చేదుపొట్ల త్రిఫలములు రసాంజనము వీటితో పక్వముచేసిన నేయిని త్రాగుటవలన చిరకాలమునుండి యున్న యహిపూతన రోగములు నశించును. పసపు గుంటకలగరాకు వేళ్లును సమానభాగములను చేకొని చల్లనినీటితో నూరి లేపనచేసినయెడల భయంకరములగు దంతరోగములును నశించును. మఱియును నూరుమారులు వడియకట్టిన నేతిలో నాగకేసరముల చూర్ణమును కలిపి లేపనచేసినచో కాళ్లమంటలును నశించి పోగలవు.

ఇట్లు చక్రదత్తయందు క్షుద్రరోగాధికార ప్రకరణము ముగిసెను.

---

# ౫౫. ముఖరోగాధికారము.

ఓష్ఠరోగమునకు సామాన్యములగు నుపాయములు.

శ్లో. ఓష్ఠప్రకోపే వాతోత్థే శాల్వస్వేనోపనాహనమ్, మస్తిష్కే చైవనస్యే చ తైలం వాతహరైశ్శృతం 1. స్వేదోభ్యంగస్నేహపానం రసాయనమిహోచ్యతే, శ్రీవేష్టకం సర్జరసం గుగ్గులుం సురదారు చ, యష్టిమధుకచూర్ణం చ విదధ్యాత్ప్రతిసారణమ్. 2. వేధం శిరాణాం వమనం విరేకం తిక్తస్యపానం రసభోజనం చ, శీతాన్ప్రలేపాన్పరిషేచనం చ పిత్తోపసృష్టే ష్వధరేషు కుర్యాత్. 3. పిత్తరక్తాభిఘాతోత్థాన్ జలౌకాభిరుపాచరేత్, పిత్తవిద్రధివచ్చాపి క్రియాం కుర్యాదశేషతః. 4. శిరోవిరేచనం ధూమస్స్వేదః కవలధారణం, హృతరక్తే ప్రయోక్తవ్య మోష్ఠకోపే కఫాత్మకే. 5 త్రికటు స్సర్జికా క్షారః క్షారశ్చ యవశూకజః, క్షౌద్రయుక్తం విధాత

వ్య మేతచ్చ ప్రతిసారణం, మేదోజే శ్వాదితే భిన్నే శోధితే జ్వలనే హితః. 6. ప్రియంగు త్రిఫలాలోధ్రం సక్షౌద్రం ప్రతి సారణం, హితం చ త్రిఫలాచూర్ణం మధుయుక్తం ప్రలేపనం. 7. సర్జరస కనకగైరికధాన్యాక ఘృతతైల సింధుసంయుక్తం, సిద్ధం సిక్తకమధుకే స్ఫుటితోచ్చ్విటితే వ్రణం హంతి. 8.

వాతప్రకోపముచేతనగు ఓష్ఠరోగమునందు వేడివరియన్నముచేత నావిరి పట్టవలయును. తలలోను ముక్కులోను నగు వానియందు వాతహారములగు నస్యక్రియలను చేయవలయును. చెమటపట్టించుట తలంటుట త్రాగుట యనునివి ఈరోగమునందు రసాయనము లనఁబడును. సరళధూపము గుగ్గిలము దేవదారు మధుకము వీటిచూర్ణము నెక్కించుట మంచిది. పిత్తప్రకంపితములగు నధరోష్ఠరోగములందు నాడులను కుట్టుట, విరేచనమున కిచ్చుట చేదువస్తువుల తినిపించుట శీతలోదకముల చేత లేపనస్నానాదులను చేయవలయును. పిత్తరక్తము చేతనైన దానికి జలగలను పట్టించుట మంచిది. తక్కినవాటియందు పిత్తవృద్ధికి చేసినచికిత్సనే చేయవలయును. కఫమువలన రక్తమునుహరించి వచ్చినయోష్ఠరోగమునకు నాడీచ్ఛేదము విరేచనము పొగపట్టుట చెమ్మటపట్టుట నోటముద్దనుపట్టుకొనుట చేయింపవలయును. శొంఠి మిరియములు పిప్పళ్లు సర్జికాక్షారము వీటు ఉప్పు తేనె కలిపిరాచిన ఓష్ఠశాకము నశించును. మేదోజనితమగు దానికి చెమటపట్టించి శోధించుటయును కాల్చుటయును మంచిది. ప్రియంగుచెక్క త్రిఫలములు లొద్దుగ వీటినినూరి తేనెతో కలిపిరాచిన హితమగును. సర్జరసము నాగకేసరము ఎఱ్ఱమట్టి ధనియములు నేయి నూనె సిందూరము వీటితో సిద్ధముచేసిన తైలమును రాచిన పగిలినదియును గాయమైనదియును అగు నోష్ఠరోగములను పోగొట్టును.

## దంతరోగమున కుపాయములు.

శ్లో. శీతాదే హృతరక్తేతు తోయే నాగరసర్షపాన్, నిష్క్వథ్య త్రిఫలాం చాఽపి కుర్యాద్గండూష ధారణం, ప్రియంగవశ్చ ముస్తా చ త్రిఫలా చ ప్రలేపనం. 9. కుష్ఠం దార్వీ మబ్దలోధ్రం సమంగా పాఠాతిక్తాతేజసీ పీతికా చ, చూర్ణం శస్తం ఘర్షణం తద్ద్విజానాం రక్తస్రావం హంతి కండూం రుజాంచ. 10. చలదంత స్థిరకరం కార్యం వకులచర్వణం, ఆర్తగలదలక్వాథ గండూషో దంతచాలనుత్. 11. దంతచాలే హితం శ్రేష్ఠం తిలోగ్రాచర్వణం సదా, దంతపుప్పుటకే కార్యం తరుణే రక్తమోచనం. 12. సపంచలవణో క్షారః సక్షౌద్రః

ప్రతిసారణం, దంతానాం తోదహర్షే చ వాతఘ్నాః కవలాహితాః. 13. దంతచాలేతు గండూషో వకుల త్వక్కృతో హితః, మాక్షికం పిప్పలీ సర్పి ర్మిశ్రితం ధారయే న్ముఖే. 14. దంతశూలహరం ప్రోక్తం ప్రధాన మిద మౌషధం, విస్రావితే దంతవేష్టే వ్రణంతు ప్రతిసారయేత్. 15. లోధ్రపత్తంగ మధుక లాక్షాచూర్ణై ర్మధూత్తరైః, గండూషే క్షీరిణో యోజ్యా స్సక్షౌద్ర ఘృతశర్కరాః. 16.

శీతాదమను దంతరోగమునందు కొంచెము యావాల కషాయములో త్రిఫలములను కూడ చేర్చి పుక్కిట నుంచికొనవలయును. పేరింకణపుచెక్క తుంగ ముస్తెలు త్రిఫలము లు నూరి పట్టువేయవలయును. కోష్టు మ్రానిపసపు తుంగముస్తెలు లొద్దుగ మంజిష్ఠ విష బొద్ది కటుకరోహిణి చాగ సరళవృక్షము చెక్క వీటిని చూర్ణము చేసి పండ్లను తోమికొనినచో రక్తము కారుట దురద మున్నగు నవియన్నియును తొలగి పోవును. పొగడ చెక్కను నమలిన కదలెడి పండ్లు గట్టిపడును. నల్లగోరంట కషాయమును పుక్కిట నుంచి కొనిన పండ్లుకదలుట మానిపోవును. నువ్వులును వసయును తినుచుండిన పండ్లకదలిక యందు హితమగును. పుష్పిపన్నందు చిగురునలోనున్న రక్తమును వెడలించుట మంచి ది. పంచలవణములు యవక్షారము వీటిలో తేనెను కలిపి లేపన చేసిన పుష్పితొలగి పోవును. దంతతోదమనిగాని దంతహర్షమనిగాని యనబడు రోగమునందు వాతనాశకౌషధములతో కబలధారణ ముత్తమము. పండ్లుకదలిన పొగడకషాయముతో గట్టి పరుపవలయును. తేనె పిప్పళ్లు నెయ్యి వీటిని కలిపి నోటికి రాచికొనుట మంచిది. ఇ య్యది దంతశూలముల పోగొట్టుటలో ముఖ్యమైనది. రక్తమును వెడలించిన దంతవేష్ట న రోగమునందు గాయమును లొద్దుగ పతంగము మధుకము లక్క వీటిని కలిపి పొడిచేసి తేనెతో కలిపి పట్టింపవలయును. వేపమొదలగు పాలవృక్షముల బెరడు తోనగుకషాయములో తేనె నేయి చక్కెర కలిపి పుక్కిట నుంచికొనవలయును.

## పండ్లు పట్టుకొనిపోవుటకు చికిత్సలు.

శ్లో. శైశిరే హృతరక్తే చ లోధ్రముస్తరసాంజనైః, సక్షౌద్రై శ్శస్యతే లేపో గండూషే క్షీరిణో హితాః. 17. క్రియాం పరిచరే కుర్యా చ్ఛీతాదోక్తాం విచక్షణః, సంశోధ్యోభయతః కార్యం శిర శ్చోపకుశే తతః. 18. కాకోదుంబరికాగోజీ పత్రై ర్విస్రావయే ద్భిషక్, క్షౌద్రయుక్తైశ్చ లవణై స్సవ్యోషైః ప్రతిసార

యేత్. 19. పిప్పల్యస్సర్షపా శ్శ్వేతా నాగరం నైచులం ఫలం, సుఖోదకేన సంగృహ్య కవలం తస్యయోజయేత్. 20. శస్త్రేణ దంత వైదర్భే దంతమూలాని శోధయేత్, తతః క్షారం ప్రయుంజీత క్రియా స్సర్వాశ్చ శీతలాః. 21. ఉద్ధృత్యాధిదంతం తు తతోగ్ని మవచారయేత్, క్రిమిదంతకవ చ్చాత్ర విధేయో హి విజానతా. 22. ఛిత్వాధిమాంసం సక్షౌద్రై రేతై శ్చూర్ణై రుపాచరేత్, పాఠా వచా తేజోవతీ సర్జికాయావశూకజైః. 23. క్షౌద్రః ద్వితీయః పిప్పల్యాః కవల శ్చాత్ర కీర్తితః, పటోల నింబ త్రిఫలా కషాయ శ్చా త్ర ధావనే. 24. శిరో విరేకశ్చ హితో ధూమో వైరేచనశ్చ యః, నాడీవ్రణహరం కర్మ దంతనాడీషు కారయేత్. 25. యం దంత మధిజా యేత నాడీ త ద్దంత ముద్ధరేత్.

దంతములకు శైశిరరోగము (పట్టుకొనుట) వచ్చినప్పుడు రక్తమును స్రవింపఁ జేసి గౌరసగతుంగముస్తలు వీటిని నూరి తేనెతోకలిపి పట్టింపవలయును. క్షీరవృక్షముల (వేపమున్నగునవి) కషాయములచేత చిగుళ్లు గట్టి పరుపవలయును. పరిదరమను రోగ మందు శీతోదమునకైన చికిత్సనే చేయవలయును. ఉపకుశ మనుదానియందు వాంతి చేయించుట భేదికి ఇప్పించుట మంచిది. తరువాత కుక్కమేడి గోభీసీటికషాయముతో తలగిడుగివలయును. మతియును శొంఠి మిరియములు పిప్పళ్లు పంచలవణములు వీటిని నూరి తేనెలోకలిపి నోటికిపూయుట హితకరము. మతియును పిప్పలి తెల్లదిరిశన శొంఠి నీటిప్రబ్బలిపండ్లు వీటితో కషాయముచేసి వెచ్చవెచ్చగా పుక్కిటనుంచికొనవల యును. దంతవైదర్భమను రోగమునందు శస్త్రముతోపండ్లను శోధింపవలయును. పిమ్మట క్షారమునుఇచ్చి శీతలోపచారముల నన్నిటినిచేయవలయును. ఎక్కువపంటి నూడఁబెఱికి పుప్పిపంటికివలెనే చికిత్స చేయవలయును. దంతములపైపెఱిగెడి దుర్మాంసమును కోసి వైచి విషబొద్ది తేజోవతి సర్జక్షారము యవక్షారము వీటిచూర్ణములో తేనెను కలిపి లేపనమును చేయవలయును. పిప్పలియు నింతకురెండింతలు తేనెయునుకలిపి ధరింపవల యును. చేదుపొట్ల వేపఆకు త్రిఫలములు వీటికషాయముతో పండ్లుతోమికొనుట మంచి ది. తలను కడుగుటయును మంచిది. శిరస్సునకు విరేచనమును గలిగించునట్టిపొగను పట్టుట హితకరము. దంతరోగములయందును నాడీరోగములయందును నాడీవ్రణమును పోగొ ట్టు ఔషధములనే యుపయోగింపవలయును.

**పండ్లనూడ బెఱుకుట**

శ్లో. ఛిత్వాధమాంసం శస్త్రేణ యదినో పరజో భవేత్. 26.
శోధయిత్వా దహే చ్చాపి క్షారేణ జ్వలనేన వా, గతిర్హి నస్తి హన్వస్థి దశనే సముపేక్షితే. 27. తస్మాత్సమూలం దశన ముద్ధరే ద్భగ్న మస్థి చ, ఉద్ధృతే తూత్తరే దంతే శోణితం సంప్రసిచ్యతే. 28. రక్తాభియోగా త్పూర్వోక్తా ఘోరా రోగా భవంతి హి, చలమ ప్యుత్తరం దంత మతో నాప హరే ద్భిషక్, కషాయం జాతి మదన కటుకస్వాదుకంటకైః. 29. లోధ్రఖాదిరమంజిష్ఠా యష్ట్యాహ్వై శ్చాపి యత్కృతం, తైలంసంశోధనం తద్ధి హన్యాద్దంతగతాం గతిం. 30. కషాయం పరతః కృత్వాపిష్ట్వా లోధ్రాదికల్కితం, కంటకీమదనో యోజ్యః స్వాదుకంటో వికంకతః. 31. సుఖోష్ణా స్స్నేహకబలా సర్పిష స్త్రైవృతస్యవా, నిర్యూహా శ్చానిలఘ్నానాం దంత హర్ష ప్రమర్దనాః. 32. స్నైహికశ్చహితో ధూమః నస్యం స్నైహిక మేవచ, అహింసన్ దంతి మూలాని శర్కరా ముద్ధరే ద్భిషక్. 33. లాక్షాచూర్ణై ర్మధుయుతై స్తత స్తాం ప్రతిసారయేత్, దంతహర్ష క్రియాం చాపి కుర్యా న్నిరవశేషతః. 34.

నాడీరోగముగలలోపంటినూడ బెఱుకుటయును మంచిదియే. పండ్లపై బెఱిగినదుష్టాంసమును శస్త్రముతో ఛేదించి నిప్పుతోగాని యుప్పుతోగాని శోధించి కాచపలయును. వెలిదవడలలోని యెముకను పంటిని యుపేక్షించితిమేని కదులనేలేక పోయెదము. కనుక పండలంట పీకివేయుటయే మంచిది. పైదంతముల నూడ బెఱికిన నెక్కువగా నెత్తురుకారును. అప్పుడు ఆనెత్తుటివలన భయంకరములగు రోగములుపుట్టును. కనుకబుద్ధిమంతుండై వైద్యుఁడు కదలుచున్నప్పటికి పైపంటిని ఊడతీయరాదు. జాపత్రి ఉమ్మెత్తకటుకరోహిణి పల్లేరు లొద్దుగ కాచు మంజిష్ఠము యష్టిమధుకము వీటియందు సిద్ధముచేయఁబడిన తైలము దంతరోగములను సంశోధించును. దంతములుకదలుట మానును. లేనిచో లోధ్రాది కషాయముతో పుక్కిలింపవలయును. లోధ్రాదులగు నౌషధులను కల్కముచేసి యందు వాకుడు నుమ్మెత్తయును చేర్చిపల్లేరు పుల్లవెలగ తెల్లతెగడ మున్నగువానితో సిద్ధముచేసిన నేయి కలిపి పక్వముచేసి వెచ్చవెచ్చగా చమ్మగానుండునట్టులు కాచవలయును. వాతనాశకములగు నౌషధులతో సిద్ధముచేసిన కషాయమును

ఇచ్చుటవలన దంతహర్షరోగము (చిగళ్లుపూచుట) నశించిపోవును. స్నేహసహితమగు ధూమమును నస్యమును చేయింపవలయును. దంతమూలములను కొఱికి వేయుచుండెడి శర్కరను వైద్యుఁడు కనిపట్టి శస్త్రముతో తీసివేయవలయును. తరువాత దానిపైని తేనెలో కలిపిన లక్కచూర్ణమును వేయవలయును. దంతహర్షరోగమునకు చికిత్సను పూర్తిగా చేయవలయును.

## దంతకాపాలికరోగములకు చికిత్సా.

శ్లో. కపాలికాః కృచ్ఛ్రసాధ్యాః తత్రాప్యేషా క్రియామతా, జయేద్విస్రావణైః స్విన్నమచలం క్రిమిదంతకం. 35. తథావపీడైర్వాతఘ్నైః స్నేహగండూషధారణైః, భద్రదార్వాది వర్షాభూలేపైః స్నిగ్ధైశ్చ భోజనైః. 36. హింగుం సోష్ణంతు మతిమాన్ క్రిమిదంతేషు దాపయేత్, బృహతీభూమికదంబక పంచాంగులి కంటకారికా క్వాథైః. 37. గండూషైస్తైలయుతైః క్రిమిదంతక వేదనాశమనః, నీలీజంఘా వాయసజంఘాను గ్దుగాదీనాంతు మూలమేకైకం, సంచర్వ్య స్థానందశన విధృతం దశనక్రిమిపాతినం ప్రాహుః. 38. చలముద్ధృత్య వా స్థానం దహేత్తుసుషిరస్య వా.

దంతకాపాలికారోగములు కృచ్ఛ్రసాధ్యములు. అయినను ఈదిగువచికిత్సను చేయుంట యుత్తమము. దంతక్రిములయందు వాతమును పోగొట్టెడి తైలములు మున్నగువానిని పుక్కిలిట నుంచికొనుటలచేతను విస్రావణములచేతను చెమటను పుట్టింపవలయును. తుంగముస్తెలు మ్రానిపసపు గజ్జేరు వీటిని లేపనచేయవలయును. మృదువులగు ఆహారములభుజింపవలయును. క్రిమిదంతములయందు బుద్ధిమంతులగు వైద్యులు వెచ్చనియింగువను ధరింపచేయువలయును. నీలికాచిచెక్క ఆముదపువిత్తులు వీటితోనైన కషాయమునందు తైలమును కలిపి పుక్కిలిట నుంచికొనవలయును. లేకున్న నీలి మున్నగు వానిలో నేదాని యొక్క చెక్కనుగాని వేరునుగాని పంటిసందున పెట్టికొని నమలినచో పురుగులు పడిపోవును. కదిలిన పల్లునూడ బెఱికి ఆచోటును కాల్చుట మంచిది.

## విదార్యాదితైలము.

శ్లో. తతో విదారీయష్ట్యాహ్వ శృంగాటక కశేరుభిః. 39. తైలం దశగుణం క్షీరం సిద్ధం నస్యేతు యోజయేత్, హానుమోక్షే సముద్దిష్టా కార్యా చార్దితవత్క్రియా. 40. ఫలాన్యమ్లాని శీతాంబు రూక్షా

స్నం దంతధావనం, తథాతికఠినా న్యభక్ష్యా న్దంతరోగే వివర్జయేత్. 41. సప్తచ్ఛదార్కదుగ్ధాభ్యాం పూరణం క్రిమిదంతనుత్, జీవనీయేన రంధ్రేణ క్రిమిదంత ప్రపూరణం. 42. అర్క క్షీరేణైకయోగ ఏవసద్భిః ప్రశస్యతే, ద్రోణపుష్పీద్రవః ఫేనమధుతైల సమాయుతః. 43. క్రిమిదంతవినాశాయ కార్యం కర్ణస్య పూరణం, పటోల కటుకావ్యోష పాఠాసైంధవభార్గికైః 44. చూర్ణై ర్మధుయుతై లేపః కవలో మధుతైలకైః, జిహ్వారోగేషు కర్తవ్యం విధాన మిదముత్తమం. 45. ముస్తామధుకనిర్గుండీ ఖదిరోశీరదారుభిః, సమంజిష్ఠా విడంగైశ్చ సిద్ధం తైలం హరే త్క్రిమీన్. 46.

విదారీకంద యష్టిమధుకము శృంగాటకము (సింగాడాదుంపలని యందురు) కశేరుకము నెడికంద వీటికల్కములో తైలమును కలిపి తైలము కంటె పదిరెట్లెక్కువ పాలను చేర్చి పక్వముచేసి నస్యముగా నుపయోగింపవలయును. హనుమోక్షరోగమున కగుచికిత్సలను చేయునది. పక్వముకానిపండ్లను చల్లనీటిని వేడియన్నమును పీనితో పండ్లు రుద్దికొనుటమంచిది. గట్టిగానుండు భక్ష్యములను దంతరోగము కలవాడు వదలుకొనవలయును. ఏడాకులపొన్న జిల్లేడు వీటిపాలతో క్రిమిదంతములను తడుపవలయును. లేక ద్రోణపుష్పపురసమునందు సముద్రపు నురుగు కలిపి తేనెను నూనెను కలిపి పుక్కిట నుంచికొనిన దంతరోగములు నశించును. దీనినే జిహ్వారోగములను చేయునది. తుంగముస్తెలు యష్టిమధుకము నీలిచెక్క కాచు వట్టివేళ్లు దేవదారుచెక్క మంజిష్ఠ వాయువిడంగములు వీటితో సిద్ధము చేసిన తైలమును సేవించిన క్రిమిరోగములు నశించును.

## జిహ్వారోగచికిత్సా (నోటిపూతలు).

శ్లో. ఓష్ఠప్రకోపేనిలజే యదుక్తం ప్రాక్ చికిత్సితం, కంటకేష్వనిలోత్థేషు తత్కార్యం భిషజాఖిలు. 47. పిత్తజేషు నిఘృష్టేషు నిస్రుతే దుష్టశోణితే, ప్రతిసారణగండూష నస్యంచ మధురంహితం. 48. కంటకేషు కఫోత్థేషు లిఖితేష్వస్రుజః క్షయే, పిప్పల్యాదిర్మధుయుతః కార్యంతు ప్రతిసారణం. 49. గృహ్ణీయాత్కబలాన్వాపి గౌరసర్షప సైంధవైః, పటోలనింబ వార్తాకుక్షారయూషైశ్చభోజయేత్. 50. జిహ్వాజాడ్యంచిరజం మాణకభస్మలవణ ఘర్షణం హంతి, ఈషత్సున్నక్ క్షీరా

క్తం జంబీరాద్యమ్లచర్వణంవాపి. 51. కర్కటాంఘ్రి క్షీరపక్వఘృతాభ్యాం గేనసశ్యతి, దంతశబ్దః కర్కటాంఘ్రిలేపాద్వా దంతయోజితాత్. 52. ఉపజిహ్వాంతు సంలిఖ్య క్షారేణ ప్రతిసారయేత్, శిరోవిరేక గండూష ధూమైరేనాంవిపాచయేత్. 53. వ్యోషక్షారాభయావహ్నిచూర్ణమేత త్ప్రఘర్షణం, ఉపజిహ్వాప్రశాంత్యర్థమేతైస్తైలం విపాచయేత్. 54. ఛిన్నాంఘ్రిశ్లేష్మలశుంఠీం వ్యోషోగ్రాక్షౌద్రసింధుజైః, కుష్ఠోషణవచాసింధు కణా పాఠాప్లవైరపి. 55. సక్షౌద్రైర్భిషజా కార్యం గలశుంఠ్యాపిఘర్షణం, ఉపనాసావ్యథోహన్తిగలశుంఠీమశేషతః. 56. గలశుంఠీ హారం తద్వచ్ఛేఫాలీ మూలచర్వణం, వచా మతివిషాం పాఠాం రాస్నాంకటుకరోహిణీం. 57. నిష్క్వాథ్య పిచుమర్దంచ కబలం తత్ర యోజయేత్.

వాయువువలననగు నోష్ఠపాక రోగమునందు తొలుతఁ జెప్పఁబడిన చికిత్సనే వాతమువలన పుట్టెడి జిహ్వాకంటకరోగములకును చేయవలయును. పిత్తజములగు జిహ్వాకంటకరోగములకు వరిపిడిగల పదార్థములతో రుద్ది చెడురక్తమును వెడలించి మధురౌషధములను పూసి మధురౌషధులను పుక్కిట నుంచికొనవలయును, నస్యవిధులను చేయవలయును. కఫోత్పన్నములగు కంటకములకు దుష్టరక్తమును వెడలించి పిప్పళ్లు శొంఠి మిరియములు నూరి తేనెతో పూయవలయును. లేనిచో తెల్ల ఆవాలు సైంధవలవణము వీటిముద్దను పుక్కిట నుంచికొనవలయును. ఛేదుసొళ్లవేప వానుడు వీటితో సిద్ధము చేయఁబడిన గంజిని త్రాగవలయును. మాణకభస్మమును ఉప్పును రుద్దిన జిహ్వారోగము చిరకాలపుదియైనను నశించును. లేనిచో నిమ్మకాయ మున్నగు పులుపు పదార్థములను తినినను నశించును. వృషభమను ముల్లంగివేరు పాలు నేయి వీటిని పక్వముచేసి దీనిని రాచిన జిహ్వారోగము పోవును. వృషభమూలికను నూరి పట్టించినను పండ్లసందున నుంచికొనినను దంతముల కడకడమను ధ్వని నశించును. ఉపజిహ్వను గీచి క్షారముతో పూయవలయును. మఱియును శిరోవిరేకము పుక్కిలింత ధూమపానము వీటినిన్ని చేయవలయును. శొంఠి మిరియములు పిప్పళ్లు యవక్షారము కరక్కాయలు చిత్రమూలము వీటిచూర్ణమును రుద్దినచో గాని వీటితో సిద్ధముచేసిన తైలమును రాచినఁగాని నాలుక మొద్దుబారుట తగ్గిపోవును. మెడకణితిలా శస్త్రముచేయించి అచ్చోట శొంఠి మిరియములు పిప్పళ్లు వస తేనె సముద్రఫేనము వీటితో గాని; కోష్ఠు పిప్పళ్లు వస సముద్రఫేనము అగరుశొంఠి వీటిని నూరి తేనెగలిపి పట్టువేసినను గలశుంఠి (కణితి) తగ్గిపోవును.

## కంఠరోగచికిత్సా.

శ్లో. క్షారసిద్ధేషు ముద్గేషు యూషా శ్చాప్యశనే హితాః. 58. తుండి కేర్యధ్రుషేకూర్మసంఘాతే తాలుపుప్పుటే, ఏషఏవ విధిః కార్యో విశేషశ్శస్త్రకర్మణి. 59. తాలుపాకేతు కర్తవ్యం విధానం పిత్తనాశనం, స్నేహస్వేదౌ తాలుశోషే విధిశ్చానిల నాశనః. 60. సాధ్యానాం రోహిణీనాంతు హితం శోణితమోక్షణమ్, ఛర్దనం ధూమపానంచ గండూషోనస్యకర్మచ. 61. వాతికీంతు హృతేరక్తేలవణైః ప్రతిసారయేత్, సుఖోష్ణాం స్తైలకబలా న్ధారయేచ్చాప్యభీక్ష్ణశః. 62. పతంగ శర్కరాక్షౌద్రైః పైత్తికీంప్రతిసారయేత్, శ్వేతావిడంగదంతీషు సిద్ధంతైలం ససైంధవం. 63. నస్యకర్మణి దాతవ్యంకబలంచకఫోచ్ఛ్రియే, పిత్తవ త్సాధయే ద్వైద్యో రోహిణీం రక్తసంభవామ్. 64. విస్రావ్య కంఠశాలూకం సాధయే త్తుండికేరివత్, ఏకకాలంయవాన్నంచ భుంజీతస్నిగ్ధమల్పశః. 65. ఉపజిహ్వికవచ్చాపి సాధయే ద్ధిజిహ్వికాం, ఉన్నామ్యజిహ్వామాకృష్య బడిశేనాథ జిహ్వికం. 66. ఛేదయేన్మండలాగ్రేణ తీక్ష్ణోష్ణైఘర్షణాదిభిః, ఏకబృందంతు విస్రావ్యవిధిం శోధనమాచరేత్. 67. శిలాయుశ్చాపియోవ్యాధి స్తంచ శస్త్రేణ సాధయేత్, అమర్మస్థంసుపక్వంచ శోథయే ద్గలవిద్రధిం. 68. కంఠరోగేష్వసృజ్మోక్షః స్తీక్ష్ణై ర్నస్యాదికర్మచ, క్వాథపాతం తు దార్వీత్వఙ్నింబతార్క్ష్యకలింగజం. 69. హరీతకీ కషాయోవా పేయో మాక్షికసంయుతః, కటుకాతివిషా దారుపాఠాముస్తకలింగకాః, గోమూత్రక్వథితాః పేయాః కంఠరోగవినాశనాః.

తుండికేము అర్వృధ్రుషము కూర్మము సంఘాతము తాలుపుప్పుటము అనునీరోగములయందు క్షారపదార్థములతో సిద్ధము చేసిన పెసరపప్పు గంజినిఆహారముగా పెట్టుటమంచిది. ఈరోగములన్నిటికిని ఇయ్యదియేవిధానము కానిశస్త్రకర్మమునందు ఆధిక్యము గలదు. తాలుపాకరోగమునకు పిత్తనాశక చికిత్సను చేయవలయును. తాలుశోషమునకు స్నేహమును స్వేదమును ఇప్పింపవలయును. వాతనాశకవిధులను ఆచరింపవలయును. రోహిణియను రోగమునందు నెత్తురు వెడలించుట మంచిది. ఛర్ది ధూమపానము

నస్యకర్మ ఈవిధులను చేయవలయును. వాతమువలననగు రోహిణిరోగమునకు నెత్తురును వెడలించి ఉప్పునూరి కట్టవలయును. మాటిమాటికి వెచ్చవెచ్చని తైలముతో కాచవలయును. పిత్తోత్పన్నమగు రోహిణీ రోగమునకు తేనెమైనను కండచక్కెరతేనె వీటి పట్టుహితకరము. ద్రాక్షపరూషకము వీటికషాయమును పుక్కిటనుంచి కొనుటయుత్తమము. కఫోత్పన్నములగు రోహిణులకు బూజు కటుకరోహిణి నూరిపట్టును వేయవలయును. తెల్లసంభాలు మారేడుచెక్క దంతిచెట్టు వీటివేళ్లతో సిద్ధముచేసిన తైలమునందు సైంధవలవణమునుకలిపి కఫోత్పన్నములగు రోహిణులకు నస్యవిధిగానుపయోగించిన దూరములగును. రుధిరోత్పన్నరోహిణులను పిత్తపువాటివలెనేచికిత్స చేయవలయును. కంఠశాలూకరోహిణులను రక్తమును స్రవింపజేసి తుండికేరికివలెనే చికిత్సచేయవలయును. యవభోజనమును ఒకపూట భుజింపవలయును. గురుభోజనమునుకొలదిగా తీసికొనవలయును. అధిజిహ్వాకారోగమును ఉపజిహ్వికలకువలెనే లాగి బడిశమను శస్త్రముచేతఛేదించి తీక్ష్ణములగు పదార్థములను రుద్దవలయును. ఏకబృందమనుగళరోగమును రక్తమును స్రవింపజేసి శోధింపవలయును. శిలాయువను పేరుగల కంఠరోగమును శస్త్రముతో ఛేదించి కట్టుగట్టవలయును. మర్మస్థలములందుండక చక్కగాపక్వమైన గలవిద్రధిని కోసి వేయవలయును. కంఠరోగమునకు రక్తమును స్రవింపజేయుటయును నస్యవిధులను చేయుటయును మ్రానివసపు లవంగపుపట్ట వేపకాయ కొడిసెపాలవిత్తులు కరక్కాయవీటికషాయములో తేనెకలిపికొని త్రాగుటయును శ్రేష్ఠము. కటుకరోహిణి అతివస మ్రానిపసపు అగరుశొంఠి తుంగముస్తెలు కొడిసెపాలవిత్తులు వీటిని ఆవుపంచితముతో కషాయముజేసి త్రాగిన కంఠరోగములు పూర్తిగా నశించును.

### కాలక చూర్ణము.

శ్లో. గుడధూమో యవక్షారః పాఠావ్యోషరసాంజనం. 71.
తేజోహ్వాత్రిఫలాలోహం చిత్రకశ్చేతి చూర్ణితం, సక్షౌద్రం ధారయేదే
త ద్గలరోగవినాశనం. 82. కాలకంనామ తచ్చూర్ణం దంతజిహ్వాస్య
రోగనుత్, పిప్పలీపిప్పలీమూలచవ్యచిత్రకనాగరైః, సర్జికాక్షారతుల్యాం
శైశ్చూర్ణోయం గళరోగనుత్.

ఇంటిలోనిబూజుయవక్షారము అగరుశొంఠి శొంఠి మిరియములు పిప్పళ్లురసాంజనము తేజోవంతి తాడియనిరిశలుకరకకాయలు మండూరము చిత్రమూలము వీటినిచూర్ణముచేసి తేనెతో కలిపి నోటికిరాచికొనిన ముఖరోగములన్నియు నశించును. ఇయ్యది అన్ని గళరోగములను పూర్తిగా పోగొట్టును. ఈకాలకమనుచూర్ణము పండ్లు నాలుక నోరు మొదలగు వానికి గలుగు ;జబ్బులను పోగొట్టును. పిప్పళ్లు మోడి చవ్యము

చిత్రమూలము శొంఠి సర్జికాక్షారము వీటిని సమానభాగములుగా చేర్చి చూర్ణముచేసి సేవించిన గలరోగములు నశించిపోవును.

## పీతకచూర్ణము.

శ్లో. మనశ్శిలాం యవక్షారో హరితాళం ససైంధవం. 74. దార్వీత్వక్చేతి తచ్చూర్ణం మాక్షికేణ సమాయుతం, మూర్ఛితం ఘృతమండేన కంఠరోగేషు ధారయేత్. 75. ముఖరోగేషు చ శ్రేష్ఠం పీతకం నామ కీర్తితం.

మణిశిల యవక్షారము సైంధవలవణము హరిదలము మ్రానిపసపు లవంగపుపట్ట వీటినిచూర్ణము చేసి అందులో తేనెకలిపి పిమ్మట ఘృతమండములో భావనచేసి ఈచూర్ణమును ముఖమునందు ధరించిన (నోటిలో నుంచికొనిన) ముఖరోగము లన్నిటిని పోగొట్టును.

## క్షారగుటికా.

శ్లో. యవాగ్రజం తేజవతీం సపాఠాం రసాంజనం దారునిశాం సకృష్ణాం. 76. క్షౌద్రేణ కుర్యాద్గుడికాంముఖేన తాంధారయే త్సర్వగళామయేషు, దశమూలం పిబేదుష్ణం యూషం మూలకులుత్థయోః. 77. తీక్ష్ణరేక్షురసగోమూత్ర దధి మస్త్వమ్లకాంజికైః, విదధ్యాత్కబలాన్వీక్ష్య దోషం తైలంఘృతైరపి. 78. పంచకోలకతాలీసపత్త్రైలామరిచత్వచః, పలాశముష్కకక్షార యవక్షారాశ్చ చూర్ణితాః. 79. గుడేపురాణే క్వథితే ద్విగుణేగుడికాః కృతాః, కర్కంధు మాత్రాస్సప్తాహం స్థితాముష్కకభస్మని, కంఠరోగేషు సర్వేషుధార్యాస్స్యురమృతోపమాః.

యవక్షారము తేజోవంతి అగరుశొంఠి రసాంజనము మ్రానిపసపు పిప్పళ్లు వీటిచూర్ణమును తేనెలో కలిపి మాత్రలను కట్టి పుక్కిటనుంచికొనిన గళరోగము లన్నియును నశించును. దశమూలములకషాయములను వేడిగా త్రాగవలయును. లేనిచో ముల్లంగి ఉలవలు వీటితో సిద్ధముచేయఁబడిన యూషమునైనను పాలు చెఱకురసము గోమూత్రము గంజి వీటిని గాని పుక్కిటఁబెట్టుకొనవలయును. దోషానుసారముగా నేతినిగాని తైలమును గాని ధరించిన కంఠరోగములు నశించును. పిప్పళ్లు మోడి శొంఠి చవ్యము చిత్రమూలము తాడిశపత్రి లవంగములు ఏలకులు మిరియములు లవంగపుపట్ట మోదుగక్షారము పాటలీ వృక్షపుక్షారము యవక్షారము వీటిని చూర్ణముచేసి రెండు

కెట్లు బెల్లపు కషాయముతో రేగుపండంత మాత్రలనుగాచేసి ఏడురోజులు పాటల వృక్షపు బూడిదలోనుంచి సేవించిన సంపూర్ణముగా కంఠరోగములను పోగొట్టును.

ముఖరోగమునకు ఇతరము లగు చికిత్సలు.

శ్లో. మూత్రస్విన్నాం శివాంతుల్యాం మధురీకుష్ఠతాళకైః. 81. అభ్యస్య ముఖరోగాం స్తు జయేద్విరసతామపి, వాతాత్సర్వసరం చూర్ణై ర్లవణైః ప్రతిసారయేత్. 82. తైలం వాతహరైస్సిద్ధం హితం కబళన స్యయోః, పిత్తాత్మకే సర్వసరే శుద్ధకాయస్య దేహినః. 83. సర్వపిత్త హరః కార్యః విధి ర్మధురశీతలః, ప్రతిసారణ గండూషా న్ధూమం సంశో ధనానిచ. 84. కఫాత్మకే సర్వసరేక్రమం కుర్యా త్కఫాపహం, ముఖ పాకే శిరోవేధః శిరఃకాయవిరేచనం. 85. కార్యంచ బహుధా నిత్యం జాతీపత్రస్య చర్వణం, జాతీపత్రామృతాద్రాక్షా యాస దార్వీఫలత్రికైః. 86. క్వాథః క్షౌద్రయుత శ్శీతో గండూషో ముఖపాకనుత్, కృష్ణాజీరకకు ష్ఠేంద్రయవానాం చూర్ణత స్త్ర్యహాత్. 87. ముఖపాకే వ్రణక్లేదదౌర్గం ధ్య ముపశామ్యతి, రసాంజనం లోధ్రిమధాభయాంచ మనశ్శిలానాగర గైరికంచ. 88. పాఠాహరిద్రా గజపిప్పలీ చ స్యాద్ధారణం క్షౌద్రయుతం ముఖస్య.

గోమూత్రముతో ఉడికిపెట్టిన కరక్కాయలు ఉసిరిక కోష్ఠు తాడిశపత్రి వీ టిని చూర్ణము చేసి భక్షించిన ముఖరోగములును అసహ్యతయును నశించును. వాతము వలన సర్వసరరోగము పుట్టెనేని ఉప్పును రాయవలయును. లేక వాతనాశకములగు నౌషధులచేత తయారుచేసిన తైలమును నస్యవిధిగా నుపయోగించుచు దానినే పుక్కిట నుంచికొనవలయును. పిత్తపు సర్వ సరములకు విరేచనముతో శరీరమును నిర్మలము చేసి బాగుగా చల్లని తియ్యని పిత్తనాశక విధుల నొనర్పవలయును. కఫోత్పన్నములగు వా ని యందు ప్రతిసారణము పుక్కిలింత ధూమపానము సంశోధనము నగువీని నన్నిటిని చేయవలయును. ముఖపాక రోగమునందు నాడీవేధనమును శిరోవిరేచనమును చేయవల యును. ప్రతిదినమును జాపత్రిని తినుట మంచిది. జాపత్రి తిప్పతీగె ద్రాక్షతీటకసింద మ్రానిపసపు త్రిఫలములు వీటికషాయమునందు తేనెను వైచికొని చల్లార్చి పుక్కిటనుంచి కొనిన ముఖరోగములు నశించును. నల్లజీలకఱ్ఱ కోష్ఠు కొడిసెపాలవిత్తులు వీటిచూర్ణ మును మూడురోజులు పుక్కిట నురచికొనిన ముఖపాకము దుర్గంధము గాయములుక్లేదము

మున్నగునవి యన్నియును నశించును. రసాంజనము లొద్దుగపూవు కరక్కాయ మణిశిల శొంఠి ఎఱ్ఱమట్టి అగరుశొంఠి పసపు ఏనుగు పిప్పళ్లు వీటిచూర్ణము తేనెతో కలిసి పుక్కిట నుంచికొనిన హితకర మగును.

పటోలాదికషాయము.

శ్లో. పటోల నింబజంబ్వామ్రమాలతీనవపల్లవాః. 89. పంచపల్లవజశ్శ్రేష్ఠః కషాయో ముఖధావనే, పంచవల్కకషాయోవా త్రిఫలాక్వాథ ఏవ వా. 90. ముఖపాకేషు సక్షౌద్రః ప్రయోజ్యోముఖధావనే, స్వరసః క్వథితోదార్వ్యా ఘనీభూతస్సరక్రియా. 91. సక్షౌద్రా ముఖరోగాసృగ్దోషనాడీ వ్రణాపహా, సప్తచ్ఛదోశీరపటోల ముస్తహారీతకీ తిక్తకరోహిణీభిః. 92. యష్ట్యాహ్వరాజద్రుమ చందనైశ్చ క్వాథం పిబేత్పాకహరం ముఖస్య, పటోలశుంఠీ త్రిఫలావిశాలాత్రాయంతి తిక్తా ద్విని శామృతానాం, పీతః కషాయో మధునానిహంతి ముఖేస్థిత శ్చాస్య గదా న శేషాన్. 94. క్వథిత త్రిఫలాపాఠామృద్వీకాజాతి పల్లవాః, నిషేవ్యా భక్షణీయ్యావా త్రిఫలాముఖపాకహా. 95. తిలానీలోత్పలం సర్పిశ్శర్కరాక్షీరమేవచ, సక్షౌద్రో దగ్ధవక్త్రస్య గండూషోదాహపాకనుత్. 96. తైలేన కాంజికే నాథగండూషశ్చూర్ణదాహహా, ఘనకుష్ఠై లాధాన్యకయష్టీ ముద్వేలవాలుకాకబళః, వదనేతిపూతిగంధం హరతి సురాలశునగంధంచ. 94.

చేదుపొట్లవేపచిగుళ్లు నేరేడుపండ్లు మామిడిచిగుళ్లు మాలతిచిగుళ్లనుగాని పంచపల్లవములనుగాని తెచ్చి కషాయమును పెట్టి ముఖమును కడిగికొనుట శ్రేష్ఠము. పంచవల్కముల కషాయమునందుగాని త్రిఫలముల కషాయమునందుగాని తేనెనుకలిపి ముఖపాకరోగమునకై ముఖమును కడుగుట మంచిది. మ్రానిపసపు కషాయమును పెట్టి గట్టిపడిన పిమ్మట తేనె గలిపికొని ముఖమునం దుంచికొనినచో ముఖరోగములు రక్తపుదోషములు నాడీవ్రణములును నశించును. ముయ్యాకుపొన్న పట్టివేళ్లు చేదుపొట్ల తుంగముస్తెలు కరకకాయలు నేలవేము కటుకరోహిణి యష్టిమధుకము చందనము వీటికషాయములో తేనెను కలిపి త్రాగిన ముఖరోగములు నశించును. చేదుపొట్ల శొంఠి త్రిఫలములు కొడిసెపాలవిత్తులు త్రాయమాణము కటుకరోహిణి పసపు మ్రానిపసపు తిప్పతీగె వీటిని కషాయముచేసి తేనెను కలిపి త్రాగిన ముఖసంబంధము లగు రోగము లన్నియును తొలగిపో

వును. త్రిఫలములు అగరుశొంఠి ద్రాక్ష జాపత్రి వీటికషాయమునుగాని త్రిఫలములను గాని సేవించినయెడల ముఖపాకరోగములు తొలగిపోవును. తిలలు నల్లగల్వలు నేయి కలకండ పాలు వీటిలో తేనెను కలిపికొని పుక్కిట నుంచికొనినచో, దగ్ధముఖపు ముఖపాకరోగముగూడ తొలగిపోవును. తైలముచేతగాని గంజితోగాని పుక్కిట నుంచికొనిన ముఖదాహము నశించును. తుంగముస్తెలు కోష్ఠు ఏలకులు ధనియములు ముల్లంగి తేనె ఏలువ వీటిని ముద్దగా చేసి నోట నుంచికొనిన దుర్గంధము కల్లువలన ఉల్లిగడ్డలవలన గలిగెడి కంపునైనను నశింపఁజేయును.

## మహాసహచరతైలము.

శ్లో. తులాంతథా నీలకురంటకస్య ద్రోణేంభసఃసంశ్రవయేద్యథావత్, పూత్వా చతుర్భాగరసేతుతైలం పచేచ్ఛనై రర్ధపలప్రయుక్తైః. 98. కల్కైరనంతాఖదిరారిమేదజంబ్వామ్ర యష్టీమధుకోత్పలానాం, తత్తైలమాశ్వేవ ధృతం ముఖేన స్థైర్యం ద్విజానాం విదధాతి సద్యః. 99.

నల్లగోరింటను నూరుపలములను తెచ్చి ద్రోణపు నీటిలో వైచి పక్వముఁ జేయవలయును. నాలుగవపాలు బాకీ యుండునప్పుడు క్రముచొప్పున తైలమును కలిపి సన్నని మంటపైని పక్వము చేయవలయును. దానిలో తిప్పతీగె కాచు దుర్గంధముగల ఖదిరము నేరేడు ఉసిరిక యష్టిమధుకము కలువ వీటి నన్నిటిని అరపలము చొప్పున వైచి కల్కమును చేసి ఉడుకుచున్న ఆ తైలములో పోయవలయును. పిమ్మట దించి ఈ తైలమును పుక్కిట నుంచికొనిన పండ్లు కదలుటను పోగొట్టును.

## చంద్రతైలము.

శ్లో. అరిమేదత్వక్ఫలశత మభినవమాపోత్థం ఖండశః కృత్వా, తోయాఢకైశ్చతుర్భిః నిష్క్వాథ్య చతుర్థశేషేణ. 100. తేనక్వాథేన మతిమాం స్తైలస్యార్థాఢకం విపచేత్, కల్కైరతుసమాంశై ర్మంజిష్ఠాలోధ్రమధుకానాం. 101. అరిమేదఖదిరకట్ఫలలాక్షాన్యగ్రోధముస్తసూక్ష్మైలానాం, కర్పూరాగురు పద్మకలవంగ కంకోలజాతీ ఫలానాం. 102. పతంగగైరిక వరాంగకుసుమ ధాతకీనాం చ, సిద్ధంభిషగ్వి దధ్యాదిదం ముఖోత్థేషు రోగేషు. 103. పరిశీర్ణ దంత విద్రధిశైశిర శీతాద దంతహర్షేషు, క్రిమిదంత దారణ చలిత ప్రదుష్టమాంసావళీర్ణేషు, ముఖదౌర్గంధ్యే కార్యం ప్రాగుక్తే ష్వామయేషుతైల మిదమ్. 104.

దుర్గంధముగల చంద్రచెక్కను నూరుపలములు తెచ్చి ముక్కలు చేసి ఒక ద్రోణపు నీటితో కషాయమును కాచి నాలుగవపాలు వీసము మిగిలియుండగా మప్పదిరెండుపలముల తైలమును కలిపి సన్నని సెగను పక్వము చేయవలయును. మంజిష్ఠము యష్టిమధుకము దుర్గంధపుచంద్రచెక్కను కాయఫలము లక్క మత్తివేళ్లు తుంగము స్తైలు చిన్నయేలకులు కర్పూరము అగురు పద్మాక్షము లవంగము కంకోలము జాపత్రి త్రిఫలములు పతంగము ఎఱ్ఱమట్టి లవంగపుపట్ట ఉసిరికకాయలు వీటిని కాలుకాలుపచొ. తీసికొని వచ్చి కల్కమును చేసి పైతైలము మఱుగుచుండగా నందు వేయవలయును. ఇయ్యది అన్నివిధములగు దంతరోగములను పోగొట్టును. పరిశీర్ణము దంతవిద్ధి మంచుకు పండ్లు పట్టికొనిపోవుట దంతహర్షము పుప్పిపన్ను దారణము పండ్లకదలిక దుర్మాంసము పెఱుగుట మాంసము తినిపోవుట ముఖదౌర్గంధ్యము మున్నగు రోగములలో దీనిని వాడుట శ్రేష్ఠము.

### లాక్షాదితైలము.

శ్లో. తైలం లాక్షారసం క్షీరం ఘృతప్రస్థం సమం పచేత్. 105. చతుర్గుణేరిమక్వాథే ద్రవైశ్చపలసంమితైః, లోధ్రకట్ఫలమంజిష్ఠాపద్మకేసరపద్మకైః. 106. చందనోత్పలయష్ట్యాహ్వైస్తైలంగండూషధారణం, దాలనందంతచాలంచ హనుమోక్షం కపాలికాం. 107. శీతాదంపూతిపక్వంచ హ్యారుచిం విరసాస్యతాం, హన్యాద్దాస్యగతా నేతాన్ కుర్యాద్దంతా నపి స్థిరాన్. 108.

తైలము లాక్షారసము పాలు వీటిని ప్రత్యేకముగా సేరు చొ॥ తెచ్చి ఇంతకు నాలుగు రెట్లు చంద్రకషాయమునందు పక్వమునుచేయవలయును. లొద్దుగ కట్ఫలము మంజిష్ఠము కమలకింజల్కములు కేసరి పద్మాక్షము చందనము కమలము యష్టిమధుకము వీటి నొక్కొక్కపలము చొప్పునచేర్చి కషాయమునుచేసి పైదానియందు కలపవలయును. పిమ్మట నీతైలమును పక్వముచేయవలయును. దీనిని పుక్కిటనుంచికొనిన దంతచలనము హనుమోక్షము కపాలిక శీతాదము పూతివక్త్రము అరుచి అసహ్యత మున్నగు రోగములు నశించును. పండ్లు గట్టిపడును.

### వకుళాది తైలము.

శ్లో. వకుళస్య పలం లోధ్రం వజ్రవల్లీకురంటకం, చతురంగుళబబ్బోలవాజి కర్ణేరిమాశనం. 109. ఏషాంకషాయ కల్కాభ్యాం తైలం పక్వంముఖేధృతం, స్థైర్యంకరోతి చలతాందంతానాం ధావనేనచ. 110.

పొగడచెట్టుబెఱడు లొద్దుగ వజ్రవల్లి గోరింట అమ్లవేతసము వకుళము రేల చెక్క చంద్రసారము అశ్వగంధి వీటిని కల్కమును కషాయమునుచేసి అందుతైలమును కలిపి పక్వముచేయవలయును. పిమ్మట ఈతైలము పుక్కిటనుంచి కొనవలయును. లేనిచో ముఖమును కడిగికొనుటకైన నుపయోగించికొనవలయును. పండ్లు గట్టిపడును.

## సహకారగుటికలు.

శ్లో. ఏలాలతాల వనికాఫల శీతకోష కోలద్వికాని ఖదిరస్య కృతే కషాయే, తుల్యాంశకానిదశభాగమితే నిధాయ ప్రోద్భిన్నకైతకపుటే పుటవద్విధాయ. 111. ప్రాగంశతుల్యశశినాభి తదేకసంఘం పిష్ట్వా నవేన సహకారరసేన హస్తౌ, లిప్త్వా యథాభిలషితాం గుడికాంవిదధ్యాత్, స్త్రీపుంసయోర్వదన సౌరభ బంధుభూతాం. 112.

ఏలకులు కస్తూరి నూనీఫలము త్రిఫలములు కర్పూరము కోషఫలము కంకోలము వీటిని గంధుగట్లనుగా తెచ్చి అంతను పదిగట్లు చంద్రసారము కొనివచ్చి కషాయమునుచేసి ఈయౌషధుల కల్కమును కలిపి మొగలిదొప్పలలో పెట్టి పుటపాకముచేసి యథావిధిగా పక్వము గావింపవలయును. పిమ్మట ఈయౌషధులంత కర్పూరమును కస్తూరిని కలిపి వైద్యుడగువాడు తనచేతులతో మామిడిరసమును పూసికొని గుటికలను చేయవలయును. ఇవి పుక్కిటనుంచికొనినచో దుర్గంధమును పోగొట్టి సుగంధమును కలిగించును.

## స్వల్పఖదిరవటికా.

శ్లో. ఖదిరస్య తులాంసమ్యగ్జలద్రోణే విపాచయేత్, శేషేష్టభాగే తత్పూతే ప్రతివాపం ప్రదాపయేత్. 113. జాతీకర్పూరపూగాని కక్కోలకఫలాని చ, ఇత్యేషా గుడికా కార్యా ముఖసౌభాగ్యవర్ధినీ. 114. దంతౌష్ఠముఖరోగేషు జిహ్వాతాల్వామయేషు చ.

నూరు పలముల చంద్రచెక్కను ద్రోణపు నీటిలోకాచి ఎనిమిదవపాలు నీరు మిగిలియుండునప్పుడు జాపత్రి కర్పూరము పోకచెక్కలు కంకోలము వీటిచూర్ణమును పోసి పిమ్మట మాత్రలను కట్టియుంచికొనవలెను. ఇవ్వని ముఖమునకు కాంతినిచ్చి ముఖరోగములను దంతరోగములను ఓష్ఠరోగములను జిహ్వారోగములను తాలురోగములను నశింపచేయును.

### బృహత్ఖదిరవటికా.

శ్లో. గాయత్రిసారతులయేరిమవల్కలానాం సార్ధం తులాయుగలమంబుఘటైశ్చతుర్భిః, నిష్కాథ్య పాద మవశిష్టం సువస్త్ర పూతం భూయః పచేదథ శనైర్మృదు పావకేన. 115. తస్మిన్ ఘనత్వముపగచ్ఛతి చూర్ణమేషాం శ్లక్ష్ణం క్షిపేచ్చ కబలగ్రహభాగికానాం, ఏలామృణాలసిత చందన చందనాంబుశ్యామా తమాలవికసా ఘనలోహయష్టి. 116. లజ్జాఫలత్రయరసాంజనధాతకీ భశ్రీపుష్పగైరిక కటంకటకట్ఫలానాం, పద్మాహ్వలోధ్ర వటరోహయవాసకానాం మాంసీ నిశాసురభి వల్కల సంయుతానాం. 117. కక్కోలజాతి ఫలకోషల వంగకాని చూర్ణీకృతాని విదధీత పలాంశికాని, శీతేఽవతార్య ఘనసారచతుః పలం చ క్షిప్త్వా కలాయసదృశీర్వటికాః ప్రకుర్యాత్. 118. శుష్కాముఖే వినిహితా వినికారయంతి రోగాన్గలౌష్ఠరసనాద్విజతాలుజాతాన్, కుర్యుర్ముఖే సురభితాం పటుతాం రుచించ స్థైర్యం పరం దశనగం రసనాలఘుత్వమ్. 119.

చంద్రచెక్కను నూరుపలములు తెచ్చి దుర్గంధపుచంద్రను 150 పలములును తెచ్చి వీటిని నాలుగుద్రోణముల నీళ్లలో వండి నాల్గవపాలు నీళ్లు మిగిలియున్నప్పుడు వాసెనగట్టి సన్నని మంటతో పక్వముచేసి గట్టిపడునప్పుడు ఏలకులు పుష్కరనాళము తెల్లచందనము రక్తచందనము కురువేరు తెల్లతెగడ జాపత్రి మంజిష్ఠము తుగముస్తెలు మండూరము యష్టిమధుకము లజ్జావంతి త్రిఫలములు రసాంజనము ధాతకీకుసుమము. నాగకేసరములు లవంగములు గేరు మ్రానిపసపు కోడిసెపాలవిత్తనములు పద్మాక్షము లోధ్ర మఱ్ఱిఇగుళ్లు యవాస జటామాంసిపసపు పొగడచెక్క వీటినన్నిటిని ఒక్కొక్క పిడికిలిచొప్పున తీసికొని పొడిచేసి ఉడికెడి ఆరసములో పోయవలయును. కంకోలము జాతిఫలము కోషఫలము లవంగము వీటినొక్కొక్కపలముచొ॥ చూర్ణమును అందుకలిపి దింపవలయును, చల్లారినపిమ్మట నాలుగుపలములకర్పూరమునుకలిపి నూగుశనగకాయంత వేసి మాత్రలుచేసి ఎండించి పుక్కిట నుంచికొనవలయును. మెడపెదవి పండ్లునాలుక దవడలు మున్నగువానియందు పుట్టినరోగము లన్నియును నశించిపోవును. ముఖమునకు పరిమళమును గలిగించును. దంతములను గట్టిపఱచును. నాలుకను తేలికగాఁ జేయును.

ఇట్లు చక్రదత్తయందు ముఖరోగాధికారప్రకరణము ముగిసెను.

---

# ౫౬. కర్ణరోగాధికారము.

## కర్ణరోగమునందు చేయఁదగు నుపాయములు.

శ్లో. కపిత్థ మాతులుంగామ్ల శృంగబేర రసై శ్శుభైః, సుఖోష్ణైః పూరయేత్కర్ణం కర్ణశూలోపశాంతయే. 1. శృంగబేరం చ మధు చ సైంధవం తైలమేవ చ, కటూష్ణం కర్ణయోర్దేయ మే తద్వా వేదనా పహం. 2. లశునార్ద్రిక శిగ్రూణాం సురంగ్యామూలకస్య చ, కదల్యా స్స్వరస శ్శ్రేష్ఠః కదుష్ణః కర్ణపూరణే. 3. సముద్రఫేన చూర్ణేన యుక్త్వా వాప్యవచూర్ణయేత్, ఆర్ద్రికసూర్యావర్తక శోభాంజన మూల మూలక స్వరసాః. 4. మధు తైల సైంధవ యుతాః పృథగుష్ణాః కర్ణశూల హారాః, శోభాంజనక నిర్యాస స్తిల తైలేన సంయుతః. 5. వ్యక్తోష్ణః పూరణే కర్ణే కర్ణశూలోపశాంతయే, అష్టానామపి మూత్రాణాం మూత్రేణా న్యతమేన చ. 6. కోష్ణేన పూరయేత్కర్ణౌ కర్ణశూలోపశాంతయే, అశ్వత్థపత్ర ఖల్వంవా విధాయ బహుపత్రకమ్. 7. తైలాక్త మంగారపూర్ణం విదధ్యా చ్ఛ్రవణోపరి, యత్తైలం చ్యవతే తస్మాత్ ఖల్వా దంగారతాపితాత్. 8. తత్ప్రాప్తం శ్రవణస్రోత స్సద్యో గృహ్ణాతి వేదనాం, అర్కపత్ర పుటేదగ్ధ స్నుహీపత్ర భవో రసః కదుష్ణం పూరణాదేవ కర్ణశూల నివారణః. 9.

వెలగ మాచికాయ వీటితోనైన గంజి నల్లపురసమును వెచ్చఁజేసి చెవిలో పోసిన చెవిపోటులు మానును. అల్లము తేనె సైంధవలవణము నూనె వీటిని కొంచెము వెచ్చఁజేసి చెవిలో పోసిన చెవిబాధలు తప్పిపోవును. లేనిచో ఉల్లిగడ్డ అల్లము మునగ ఆకు సురంగి ముల్లంగి అరటి వీటిరసము వెచ్చజేసి గ్రైనను పోయవలయును. సముద్రఫేనపు పొడిని పోసినను పోటులు తగ్గును. అల్లము నీరు గంటకలగరాకు ముల్లంగి చెక్క వీటిరసముతో తేనెను సైంధవలవణమును కలిపి చెవికి పోసిన కర్ణశూల హరించును. మునగబంకను నువ్వుల నూనెలో వెచ్చఁజేసి చెవిలో పోసిన కర్ణశూల నశించును. గోమూత్రము మున్నగు నష్టమూత్రములోను ఏదైనా నొకదానిచేత మూత్ర

మును వెచ్చఁజేసి చెవిలోఁ బోసిన కర్ణశూలలు తొలఁగిచనును. లేనిచో రావిఆకులను బొత్తిగాపట్టి చమురుతో తడిపినిప్పుమీద పెట్టితీసి దానితో కాచవలయును. జిల్లేడుఆకుల దొన్నెలో పాలతో సిద్ధము చేయఁబడిన జెమిటికాడలరసమును కొంచెము వెచ్చఁజేసి చెవిలోనఁ బోసినచో కర్ణశూలలు శాంతించును.

## దీపికాతైలము.

శ్లో. మహతః పంచమూలస్య కాండాన్యష్టాంగులాని చ, క్షౌమేణావేష్ట్య సంసిచ్య తైలేనాదీపయేత్తతః. 10. యత్తైలం చ్యవతే తేభ్యః సుఖోష్ణం తత్ప్రయోజయేత్, జ్ఞేయం తద్దీపికాతైలం సద్యో గృహ్ణాతి వేదనాం. 11. ఏవంకుర్యాద్భద్రకాష్ఠే కుష్ఠే కాష్ఠే చ సారలే, మతిమాన్ దీపికాతైలం కర్ణశూలనివారణం. 12. అర్కస్య పత్రం పరిణామపీతం ఆజ్యేన లిప్తం శిఖినావతప్తం, ఆపీడ్య తోయం శ్రవణే నిషిక్తం నిహంతి శూలం బహువేదనం చ. 13. తీవ్రశూలాతురే కర్ణే సశబ్దే క్లేదవాహిని, బస్తమూత్రం క్షిపేత్కోష్ణం సైంధవేనావచూర్ణితం. 14. వంశావలేఖసంయుక్తే మూత్రే వాజావికే భిషక్, తైలం పచేత్తేన కర్ణంపూరయేత్కర్ణశూలినః, హింగుతుంబురుశుంఠీభిః సాధ్యం తైలంతు సార్షపం, కర్ణశూలే ప్రధానంతు పూరణం హితముచ్యతే. 16.

బృహత్పంచమూలములను గైకొని పట్టుబట్టలో చుట్టి నూనెలోముంచి నిప్పును ముట్టింపవలయును. అయ్యది మండునప్పుడు పడెడి వేడి వేడి చినుకును దీపికాతైలమని యనెదరు. ఇది కర్ణశూలలను పోగొట్టును. ఈవిధముగనే భద్రకాష్ఠము కోష్ఠు సరలపుకొమ్మ వీటినికూడను పట్టుగుడ్డతో చుట్టి తైలములోనుంచి తైలమును పిడిచి చెవిలోఁబోసిన చెవిపోటులు నశించును. పండువాడిన జిల్లేడాకును నేయిపూసి నిప్పుపైని కాచి చెవిలోఁ పిండెదరేని మిక్కిలియును గల చెవిపోటులును నశించును. ఎక్కువపోటును బుఁయిమని ధ్వనియును గల చెవియందైనను మేక యుచ్చలో సైంధవలవణమును చేర్చి వెచ్చజేసి పోయవలయును. అవక్షీర మేకయుచ్చలతో సిద్ధము చేసిన తైలమును పోసినను కర్ణశూలములు హరించును. మఱియు ఇంగువ ధనియాలు శొంఠి వీటితో తయారు చేయఁబడిన ఆవనూనెను చెవిపోటులకు తప్పక పోయవలయునని పెద్దలు పలుకుదురు.

## క్షారతైలము.

శ్లో. బాలమూలకశుంఠీనాం క్షారో హింగు సనాగరం, శతపుష్పా వచా కుష్ఠం దారుశిగ్రురసాంజనం. 17. సౌవర్చలం యవక్షారః సర్జికోద్భిదసైంధవమ్, భూర్జగ్రంథిబిడం ముస్తం మధుశుక్తం చతుర్గుణమ్. 18. మాతులుంగరసశ్చైవ కదల్యారసఏవవా, తైలమేభిర్విపక్తవ్యం కర్ణశూలహరంపరమ్. 19. బాధిర్యం కర్ణనాదశ్చ పూయాస్రావశ్చ దారుణః, పూరణాదస్య తైలస్య క్రిమయః కర్ణసంశ్రితాః. 20. క్షిప్రం వినాశం గచ్ఛంతి కృష్ణాత్రేయస్య శాసనాత్, క్షారతైలమిదం శ్రేష్ఠం ముఖదంతామయాపహం 21. మధుప్రధానం శుక్తంతు మధుశుక్తం తథాపరమ్, జంబీరస్య ఫలరసం పిప్పలీమూలసంయుతం. 22. మధుభాండే వినిక్షిప్య ధాన్యరాశౌ సధాపయేత్, మాసేన తజ్జాతరసం మధుశుక్తముదాహృతం. 23. కర్ణనాదే కర్ణక్ష్వేడే కటుతైలేన పూరణమ్, నాదబాధిర్యయోః కుర్యాత్కర్ణశూలోక్తమౌషధమ్. 24.

కురువేరు ముల్లంగి శొంఠి వీటిక్షారము ఇంగువ తుంగముస్తెలు సోంపు వస కోష్ఠు మ్రానిపసుపు మునగ యవక్షారము సజ్జీక్షారము సౌవర్చలవణము సైంధవలవణము భుజపత్రపు గణుపు బిడలవణము ముస్తెలు నాలుగురెట్లు మధుశుక్తము మాదీఫలపురసము కదళీరసము వీటితో తైలమును పక్వముచేసి వాడిన కర్ణశూలలను పోగొట్టును. చెవిటితనము చెవిదిబ్బెడ పూయస్రావము చెవిలోబడిన పురుగులు ఈమొదలగు రోగములను పోసినమాత్రాన హరించును. ఇద్యాది కృష్ణాత్రేయమునిసంమతము. ఈక్షారతైలము ముఖరోగములను దంతరోగములను పోగొట్టును. మధువు (తేనె) ఇందుప్రధానము వస్తువు గనుక ఇయ్యది మధుశుక్తమనియు నంబడును. నిమ్మపండ్లరసము వేపపండ్లరసము పిప్పళ్లమోడి వీటిచూర్ణము కలిపి తేనె పాత్రములో పోసి వాసెనగట్టి ధాన్యపు కుండలో నుంపవలయును. ఒకనెలరోజు లిట్లుయున్న పిమ్మట పైకి తీసియుపయోగించికొనవలయును. ఇదియును మధుశుక్తమను రసమనియే చెప్పంబడును. చెవిదిబ్బెట చెముడు చెవిపోటు మున్నగు వానియందు బాధిర్య రోగమునకును కర్ణశూలమునను చెప్పిన యౌషధమునే చేయుటమంచిది.

## అపామార్గ క్షారతైలము.

శ్లో. అపామార్గక్షారజలే తత్కల్కేన సాధితం తిలజమ్, అపహరతి కర్ణనాదం బాధిర్యం చాపి పూరణాతః. 25.

ఉత్తరేణు క్షారముతో కలిసిన నీటియందు ఉత్తరేణుకల్కమును కలిపితిలతైలమును కాచిచెవిలో పోసిన చెవిదిమ్ము చెముడు మొదలగునవి హరించును.

### సర్జికాదితైలము.

శ్లో. సర్జికామూలకం శుష్కం హింగుకృష్ణ మహౌషధం, శత పుష్పాచతై స్తైలం పక్వం శుక్తంచతుర్గుణం. 26. ప్రణాదశూలబాధిర్యం స్రావంచాశువ్యపోహతి.

సర్జగసను ఎండిన ముల్లంగి ఇంగువపిప్పళ్లు శొంఠి సోంపు వీటితో తైలమును కాచవలయును. పక్వమగుచున్న ఆ తైలములో నాలుగురెట్లు గంజికలిపి సిద్ధముచేసి యుపయోగించిన కర్ణనాదమును కర్ణశూలమును చెవుడును కర్ణము చీముకారుట మున్నగునవి నశించును.

### దశమూలీతైలము.

శ్లో. దశమూలికషాయేణ తైలప్రస్థం విపాచయేత్. 27. ఏతత్కల్కం ప్రదేయం వై బాధిర్యే పరమౌషధమ్.

దశమూలముల కషాయమునందును కల్కమునందును తైలమును పోసి పక్వముచేసిచెవిలో పోసిన చెవిసంబంధములగు రోగములను మాన్చుటకు పరమమగు నౌషధమగును.

### బిల్వతైలము.

శ్లో. ఫలంబిల్వస్యమూత్రేణ పిష్ట్వాతైలంవిపాచయేత్. 28. సాజక్షీరం తద్ధిహరేద్బాధిర్యం కర్ణపూరణే, ఏషఏవవిధిః కార్యః ప్రణాదేకర్ణపూరణే. 29. గుడనాగరతోయేన నస్యం స్యాదుభయోరపి, చూర్ణం పంచకషాయాణాంకపిత్థరసయుతం. 30. కర్ణస్రావే ప్రశంసంతి పూరణం మధునాసహ, మాలతీదల రసమధునాపూరిత మథవా గవాంమూత్రైః. 31. దూరేణఃరత్యజ్యతే శ్రవణయుగంపూతిరోగేణ, హరితాలం సగోమూత్రం పూరణం పూతికర్ణజిత్, సర్జత్వక్చూర్ణ సంయుక్తః కార్పాసీఫలజోరసః. 32. మధునాసంయుతః స్యాత్పూయకర్ణ స్రావే ప్రశస్యతే.

బిల్వఫలమును గోమూత్రముతో నూరి మేకపాలతో కలిపి తైలమును పక్వమును చేయవలయును. దీనిని చెవిలోపోసిన బాధిర్యము నశించును. కర్ణనాదముమున్న

గువానియందును దీనినే చేయవలయును. బెల్లము శొంఠి పీటిరసముతో నస్యవిధినొన ర్చుట మంచిది. కర్ణస్రావరోగమునందు పంచకషాయములను వెలగరసముతోను తేనె తోను కలిపి చెవిలోపోయవలయును. జాజిఆకుల రసము తేనెకలిసికొని గోమూత్ర మును కలిపిగాని చెవిలోపోసిన కర్ణసంబంధమగు దుర్గంధము హరించును. దేవదారు చక్కగాడిని పత్తికాయలరసమును కలిపి తేనెచేర్చి కర్ణస్రావమునకై యుపయో గింపవలయును.

## జంబ్వామ్రతైలము.

శ్లో. జంబ్వామ్ర పత్రం తరుణం సమాంశం కపిత్థ కార్పాసఫలం చ సార్ద్రం. 33. క్షుణ్ణ్వారసం తం మధునావిమిశ్రం స్రావాపహం సం ప్రవదంతి తజ్జ్ఞాః, పక్వం నింబరజస్తైలం ససార్షపం స్రావహారం ప్రదిష్టం, పుటపాకవిధిస్విన్న హస్తివిడ్జాతిగోంపకః రసః సతైలసింధూ త్థః కర్ణస్రావహరః పరః. 34.

మామిడి నేరేడు చిగుళ్లను సమభాగములనుగా తెచ్చి వెలగపండు పత్తికాయ లు పీటిరసమును కలిపి తేనెచేర్చి చెవిలోపోసిన కర్ణస్రావములు నశించును. ఈయౌ షధులతో సిద్ధముచేసిన నింబతైలముగాని నిమలితైలముగాని ఆవనూనెతో కలిపిపోసిన, పెద్దలు కర్ణస్రావములు మానునని చెప్పెదరు. ఏనుగలద్దిని పుటముపెట్టి చక్కగా పండికాలినపిమ్మట తీసి దానిరసముతో తైలమును సైంధవలవణమును కలిపి చెవిలోపోసికొనిన కర్ణస్రావములు హరించును.

## నాడీశోధనతైలము.

శ్లో. జంబూకస్య తు మాంసేన కటుతైలం విపాచయేత్, తస్య పూరణమాత్రేణ కర్ణనాడీ ప్రశామ్యతి. 35. నిశాగంధ పలే పక్వం కటుతైలం పలాష్టకం, ధుత్తూరపత్రజరసే కర్ణనాడీ జిసుత్తమమ్. 36.

గ్రద్దమాంసముతో ఆవనూనెను కాచి చెవిలోపోసినంతనే కర్ణనాడి యుపశ మించును. గంధకము పసపు ఒకపలముకు 8 పలముల తైలములో వైచికాచి యుమ్మెత్త రసముపోసి పక్వము చేయవలయును. ఇయ్యది కర్ణనాడీరోగములను జయించును.

## స్నేహము స్వేదముమున్నగు నితరములగు నుపాయములు.

శ్లో. అథకర్ణ ప్రతీనాహే స్నేహస్వేదౌ ప్రయోజయేత్, తతో విరిక్తశిరసః క్రియాంల ప్రాప్తాం సమాచరేత్. 37. కర్ణపాకస్య భైష

జ్యం కుర్యాత్క్షతవిసర్పవత్, నాడీస్వేదోథ వమనం ధూమమూర్ధ్వ విరేచనం. 38. విధిశ్చ కఫహాసర్వః కర్ణకండూం వ్యపోహతి, క్లేదయిత్వాతు తైలేన స్వేదేన ప్రవిలాప్యచ. 39. శోధయేత్కర్ణగూథంతు భిషక్సమ్యక్శలాకయా, నిర్గుండీస్వరసస్తైలం సింధూధూమరజో గుడః. 40. పూరణాత్పూతికర్ణస్య శమనో మధుసంయుతః, జాతీపత్ర రసే తైలం విపక్వం పూతికర్ణజిత్. 41. వరుణార్కకపిత్థామ్రజంబూపల్లవ సాధితం, పూతికర్ణాపహం తైలం జాతీపత్రి రసేనవా. 42. సూర్యావర్తక స్వరసం సింధువారరసస్తథా, లాంగూలీమూలజరసం త్ర్యూషణేనావచూర్ణితం. 43. పూరయేత్క్రిమికర్ణంతు జంతూనాం నాశనం పరం, క్రిమికర్ణక నాశార్థం క్రిమిఘ్నం యోజయే ద్విధిమ్. 44. వార్తాకుధూమశ్చ హంతిః సర్షపస్నేహఏవచ, హతిసూర్యావర్త వ్యోష స్వరసేనాతిపూరితే. 45. కర్ణేపతంతి సహసా సర్వాస్తు క్రిమిజాతయః, నీలబున్నా రసస్తైల స్సింధుకాంజిక సంయుతః. 46. కదుష్ణః పూరణాత్కర్ణే నిశ్శేష క్రిమిపాతనః, ధూపనఃకర్ణదార్గంధ్యే గుగ్గులుశ్శ్రేష్ఠ ఉచ్యతే. 47. రాజవృక్షాదితోయేన సురసాదిజలేన వా, కర్ణప్రక్షాళనం కార్యం చూర్ణైరేతైః ప్రపూరణం. 48. ఘృతం రసాంజనం నార్యాః క్షీరేణ క్షౌద్రసంయుతం, ప్రశస్యతే చిరోత్థేపి సస్రావే పూతికర్ణకే. 59.

కర్ణప్రతీనాహరోగమునందు స్నేహస్వేదములను చేయవలయును. పిమ్మట శిరోవిరేకమును గలిగించు చికిత్సజేయవలయును. కర్ణపాకమునకు క్షతవిసర్పికివలె చికిత్సచేయవలయును. నాడులను చెమటపట్టించుట వాంతి పొగ ఊర్ధ్వవిరేచనము కఫమును పోగొట్టెడి విధులును కర్ణకండూరోగమును పోగొట్టును. వైద్యుడు తైలముతో చెమటపట్టించి తైలముతో కఱగించి శలాక (కడ్డీ)తో శోధనమును చేయవలయును. వావిలిఆకుపసరును తైలమును సైంధవలవణమును బూజు బెల్లము తేనె వీనన్నిటిని కాచి కలిపి చెవిలోపోసినచో చెవిదుర్గంధము తొలగిపోవును. జాజిఆకుపసరులో తైలమును పోసినచెవి దుర్గంధము నశించును. ఉలిమిరిఆకులు జిల్లేడుఆకులు వెలగఆకు నేరేడు మామిడిచిగుళ్లు వీటిపసరుతో కలిపిసిద్ధముచేసిన తైలముగాని జాజిఆకుపసరుగాని కర్ణపు దుర్గంధమును పోగొట్టును. సూర్యావర్తకపు (ప్రొద్దుతిరుగుడు) పసరుగాని ఉలిమిరి ఆకులరసముగాని నీరుపిప్పలి మల్లంగిరసముగాని త్రికటువుల చూర్ణముతో కలిపి

పోసినచెవిలోనిపురుగులు నశించును. క్రిమికర్ణరోగము నశించుటకు క్రిములఁజంపెడి విధుల నుపయోగి పవలయును. వాకుడుఆకు పొగ వేయుటగాని ఆవమానెను పోయుటగాని మిక్కిలి మంచిది. ప్రొద్దుతిరుగుడుచెట్టు త్రికటుకములు వీటిరసమును చెవిలో పోసిన తత్క్షణమే క్రిములుపడిపోవును. నీలిరసములో సైంధవలవణము గంజికలిపివెచ్చజేసి చెవిలో పోసినను క్రిములు నశించును. చెవిదుర్గంధము అడఁగుటకు గుగ్గులుధూపము శ్రేష్ఠము. చెవిని పిచికారు పట్టుట పైచూర్ణముతో చెవిని పూరించుట నల్లతులసి రసమును పోయుట మున్నగునవిహితకరములు. రసాంజనమును నేయిని చనుబాలతో తేనెను చేర్చిచెవిలో పోసికొనినచో చిరకాలమునుండి యుండిన కర్ణస్రావములు కర్ణములదుర్గంధమును నశించును.

## కుష్ఠాదితైలము.

శ్లో. కుష్ఠహింగు వచాదారు శతాహ్వావిశ్వ సైంధవైః, పూతికర్ణాపహం తైలం బస్తమూత్రేణ సాధితం. 28.

కోష్ఠుఇంగువ వసపసపు శతావరి శొంఠిసైంధవలవణము వీటితోసిద్ధము చేయఁబడిన తైలమును మేకమూత్రముతో కాచి చెవిలో పోసికొనిన చెవివాసన నశించును.

## విద్రధి మున్నగువానికి ఇతరములగు ఉపాయములు.

శ్లో. విద్రధౌచాపి కుర్వీత విద్రధ్యుక్తం హి భేషజం, శతావరీ వాజిగంధాపయస్యైరండజీవకైః. 29. తైలం విపక్వం సక్షీరం పాలీ సంపుష్టికృత్పరం, గుంజాచూర్ణయుతే జాతే మాహిషే క్షీర ఉద్ధతం, నవనీతం తదభ్యంగాత్కర్ణపాలీవివర్ధనం, విషగర్భంతిక్తతుం బీతైల మష్టగుణే స్వరాత్. 31. మూత్రే పక్వం తదభ్యంగాత్కర్ణపాలీవివర్ధనం. కల్కేన జీవనీయేన తైలం పయసి సాధితం. 32. అనూపమాంసక్వాథేన పాలీపోషణవర్ధనం, మాహింషనవనీతయుతం సప్తాహం ధాన్యరాశిపరిసితం. 33. నవముసలికందచూర్ణ స్సృద్ధికరం హి కర్ణపాలీనాం, కర్ణస్య దుర్వ్యధే భూతే సంరంభో వేదనా భవేత్. 34. తత్ర దుర్వ్యధరోహార్థం లేపో మధ్వాజ్యసంయుతైః, మధూకయవమంజిష్ఠారుబుమూలైస్సమంతతః. 35. అనేకధాతుచ్ఛిన్నస్య సంధిః కర్ణస్య వైభిషక్, యో యథాభినివిష్టస్స్యాత్తం తథా వినియోజయేత్. 36. ధాన్యామ్లోష్ణోదకానాం తు సేకో వాతేన దూషితే, రక్తపిత్తేన పయసా శ్లేష్మణా తూష్ణవారిణా. 37. తతస్సీవ్య స్థిరం కుర్యాత్సంధిం బంధేన వా

పునః, మధ్వాజ్యేన తతోఽభ్యజ్య పిచునాసంధివేష్టకం. 38. కపాల చూర్ణేనతతశ్చూర్ణయేత్పథ్యయాఽథవా.

కర్ణవిద్రధులకు విద్రధికి చెప్పిన చికిత్సనే చేయవలయును. పిల్లపీచర అశ్వగంధ (పెన్నేరు) పాలచెట్టు ఆముదపువిత్తులు వీట్లతో తైలమును పక్వముచేసి పాలను కలిపి చెవిలోపోసికొనిన కర్ణపాళి వృద్ధినొందును. మఱియు నన్నిరోగములును కుదురును. గురిగింజపొడిని పోసిగేదెపాలను కాచి దానినుండి వెన్నతీసి దానిసిరాచినకర్ణపాళీలు (చెవితమ్మెలు) పెఱుగును. విషగర్భమను తైలమును చేదుసారతైలమును ఎనిమిదిరెట్లగాడిదమూత్రమునను పక్వముచేసి లేపనచేసినచో కర్ణపాళి వృద్ధియగను. జీవనీయగణపు ఓషధులను కల్కముచేసి పాల నందుకలిపి తైలమునుచేర్చి పక్వముచేసి చెవిలో పోసిన కర్ణపాళి పుష్టినొందును. నీటిపట్టులలోని మృగములమాంసమును క్వాథముచేసి పోసిన కర్ణపాళి పెఱుగును. లేనిచో గేదనేతిని ఏడుగోజులు ధాన్యపుకుండలో నుంచి తీసిరాచిన కర్ణపాళీ వృద్ధియగును. ముసలికందను తినినను వృద్ధియగును. చెవిలో చెడునీరు నిలిచిన పోటు పుట్టును. అద్దానిని పోగొట్టికొనుటకై యష్టిమధుకము యవలు మంజిష్ఠను ఆముదపువేళ్లు వీటిని తేనె నేయి కలిపి నూరి అనేకవిధములుగా తెగిన చెవులకు పట్టింపవలయును. ఎట్లు తెగినదానినట్టులనే జోడింపవలయును. గంజి వేడినీరు వీటిని పోయుటచేతను వాతదూషితములయందు హితము కలుగును. రక్తపిత్తదూషితమగు చెవిని పాలతోను కఫదూషితమగదానిని వేడినీరుతోను కడిగి పిమ్మట తెగినచెవినిసరిగాచేర్చి కట్టు కట్టవలయును. తేనెనేయి కలిపి వేపఆకునూరికట్టనైనను కట్టవలయును. శంఖచూర్ణముతోగాని కరక్కాయ పొడితోగాని కట్టును కట్టవలయును.

ఇట్లు చక్రదత్తయందు కర్ణరోగాధికార ప్రకరణము ముగిసెను.

---

# ౫౮. నాసారోగాధికారము.

## నాసారోగోపాయములు.

శ్లో. పంచమూలీశృతం క్షీరం స్యాచ్చిత్రకహరీతకీ, సర్పిర్గుడ షడంగశ్చ యూషః పీనసశాంతయే. 1.

పంచమూలములకషాయము పాలు చిత్రమూలము కరక్కాయ బెల్లము నేయి అను నీయారువస్తువులతో సిద్ధముచేసిన యూషము పీనసరోగములకు వాడవలయును

### వ్యోషాదిచూర్ణము.

శ్లో. వ్యోషచిత్రకతాలీసతింతిడీచామ్లవేతసం, సచవ్యాజాజీతుల్యాంశ మేలాత్వక్పత్రమాదికం. 2. వ్యోషాదికం చూర్ణమిదం పురాణగుడసంయుతం, పీనసశ్వాసకాసఘ్నం రుచిస్వరకరం పరం. 3.

శొంఠి మిరియములు పిప్పళ్లు చిత్రమూలము తాడిశపత్రి అమ్లవేతసము, చవ్యము బచ్చలి, జీలకఱ్ఱ ఏలకులు లవంగపుపట్ట మున్నగువాని సమానభాగములనుగా చేకొని చూర్ణముచేసి ప్రాతబెల్లమును అందు కలిపి సేవి పవలయును. ఇయ్యది పీనస శ్వాసదగ్గులను పోగొట్టి రుచిని కలిగించును.

### పాఠాదులగు వివిధతైలములు.

శ్లో. పాఠాద్విరజనీమూర్వా పిప్పలీ జాతిపల్లవైః, దంత్యాచ తైలం సంసిద్ధం నస్యం సమ్యక్తు పీనసే, వ్యాఘ్రీ దంతీ వచాశిగ్రుసురసవ్యోషసైంధవైః, పాచితం నావనం తైలం పూతినాసాగదంజయేత్. 5. త్రికటువిడంగసైంధవబృహతీఫలశిగ్రుసురసదంతీభిః, తైలం గోజలసిద్ధం నస్యం స్యాత్పూతినస్యస్య. 6. కలింగహింగుమరిచలాక్షాసురసకట్ఫలైః, కుష్ఠోగ్రశిగ్రుజంతుఘ్నైరవపీడః ప్రశస్యతే. 7. తైరేవ మూత్రసంయుక్తైః కటుతైలం విపాచయేత్, అపీనసే పూతినస్యే శమనం కీర్తితంపరం. 8. నానాపాకే పిత్తహారం విధానం కార్యంసర్వం బాహ్యమభ్యంతరం చ హరేద్రక్తంక్షీరవృక్షత్వచశ్చ యోజ్యాస్నేకే సఘృతాశ్చ ప్రదేహాః. 9. పూయాస్రరక్తపిత్తఘ్నాః కషాయానావనాని చ, శుంఠీకుష్ఠకణాబిల్వ ద్రాక్షాకల్కకషాయవత్. 10. సాధితం తైలమాజ్యం వా నస్యం క్షవథుకృన్నిహంత్, దీప్తేరోగే పైత్తికే సంవిధానం సర్వం కుర్యాన్మాధురం శీతలం చ, నాసానాహే స్నేహపానం ప్రధానం స్నిగ్ధాధూమా మూర్ధ్ని వస్తిశ్చ నిత్యమ్. 12.

విషబొద్ది పసపు మ్రానిపసపు చాగచెక్క పిప్పళ్లు జాజియిగుళ్లు దంతి వీటిలో సిద్ధము చేయబడిన తైలమును నస్యముగా నుపయోగించినచో పీనసరోగము తొలగిపోవును. వాకుడు దంతిచెట్టు వస మునగచెక్క నల్లతులసి శొంఠి మిరియములు పిప్పళ్లు సైంధవలవణము వీటినివైచి తైలమును కాచవలయును. దీనిని నస్యముగాజేసిన నాసాసంబంధమగు పూతిరోగమునశించును. శొంఠి మిరియములు పిప్పళ్లు వాయువిడంగములు

సైంధవలవణము వాకుడుచెక్క మునగ నల్లతులసి వీటిని ఆవుమూత్రముతో కలిపి తైలమునుపోసి పక్వము చేసి నస్యమిచ్చిన పూతినాసలు నశించును. కొడిశెపాలవిత్తులు ఇంగువ మిరియములు లక్క మోచరసము కోష్ఠు పిప్పళ్లు మునగచెక్క వాయువిడంగములు వీటితో నవపీడనము (పట్టు) చేయుట హితకరము. ఈయౌషధములనే ఆవు పంచితముతోనూరి ఆవనూనెతో ఉడుకబెట్టి నస్యవిధిం జేసినను పీనస మున్నగు రోగములు నశించును. నాసాపాకరోగములందు పిత్తనాశకమగు చికిత్సను చేయవలయును. రక్తమును వెడలింపవలయును. పాలుగలచెట్లబెఱడు నీటితో తడుపవలయును. నేతిని పైని రాయవలయును. రక్తపిత్తమును నశింపజేసెడి కషాయములనుగాని నస్యములనుగాని యిచ్చుట నాసాపాకరోగమునందు హితకరము. శొంఠి కోష్ఠు పిప్పళ్లుమారేడు చెక్క ద్రాక్ష వీటితోచేసిన కల్కమునందుకాని కషాయమునందుగాని సిద్ధముచేసిన తైలమును లేక నేతిని నస్యముగా నుపయోగించుటవలన తుమ్ములు మున్నగునవి నిలిచిపోవును. పిత్తజమగు నాసాప్రకోపమునకు పూర్తిగా మధురమును శీతలమునగు చికిత్సను చేయవలయును. నాసానాహరోగమునకు పొగవేయుట యుత్తమము. శిరోవస్తినిన్ని చేయింపవలయును.

### వాతికములగు నాసారోగములకు ఘృతపానాదులు.

శ్లో. వాతికేషు ప్రతిశ్యాయే పిబేత్సర్పి ర్యథాక్రమం, పంచభిర్లవణైస్సిద్ధం ప్రథమేన గణేన చ. 13. నస్యాదిషు విధిః కృత్స్నమవేక్షేతార్దితేరితం, పిత్తరక్తోత్థయోః పేయం సర్పిర్మధురకైశ్శృతం. 14. పరిషేకాన్ప్రదేహాంశ్చ కుర్యాదపి చ శీతలాన్, కఫజే సర్పిషాస్నిగ్ధం తిలమాషవిపక్వయా. 15. యవాగ్వా వామయిత్వా వా కఫఘ్నం క్రమమాచరేత్, దార్వింగుదీనికుంభశ్చ క్రిణిహ్యాసురసేనవా. 16. వర్తయోఽత్ర కృతా యోజ్యాధూమపానే యథావిధి, అథవాసఘృతాన్ సక్తూన్కృత్వా మల్లికసంపుటే. 17. నవప్రతిశ్యాయవతాం ధూమం వైద్యః ప్రయోజయేత్, యః పిబతి శయనకాలే శయనారూఢం సుశీతలం మహ్యాం. 18. సలిలంపీనసయుక్తః సముచ్యతే తేన రోగేణ, పుటపత్రం జయాంపత్రం సింధుతైలసమన్వితం. 19. ప్రతిశ్యాయేషు సర్వేషు శీలితం పరమౌషధం, పోషణం గుడసంయుక్తం స్నిగ్ధదధ్యమ్లభోజనం. 20. నవప్రతిశ్యాయహరం విశేషాత్కఫపాచనం, ప్రతిశ్యాయేన వేశస్తోయూష

శ్చించాదలోద్భవః, తతః పక్వం కఫం జ్ఞాత్వా హరేచ్ఛీర్షవిరేచనైః, శిరసోఽభ్యంజనస్వేథ నస్యకట్వమ్లభోజనైః. 22. వమనైర్ఘృతపానైశ్చ తాన్యథాస్వముపాచరేత్, భక్షయతి భుక్తమాత్రే సలవణము ఖ్వన్న మాషముత్యుష్ణం 23 స జయతి సర్వసముత్థం చిరజాతం చ ప్రతిశ్యాయమ్, పిప్పల్యా శ్శిగ్రుబీజాని విడంగం మరిచాని చ. 24. అవపీడః ప్రశస్తోఽయం ప్రతిశ్యాయనివారణః సమూత్రపస్తాశోధ్ద్రదస్తాః క్రియాః క్రిమిషు యోజయేత్. 25. నావనార్థం క్రిమిఘ్నాని భేషజాని చ బుద్ధిమాన్, శేషాణాం తు వికారాణాం యథాస్వం స్యాచ్చికిత్సితం. 26.

వాతమువలనఁ బుట్టిన పీనసరోగమునందు ఐదుసగా పంచలవణములతో సిద్ధము చేసిన ఘృతమును ప్రథమగణోక్తమగు ఘృతమును త్రాగవలయును. రోగ మనుసరించి నస్యాదివిధులను చేయవలయును. పిత్తరక్తోత్పన్నమగు నాసారోగమునందు మధురౌషధములచే సిద్ధముచేసిన నేతిని త్రాగవలయును. కఫజమగుదానికి నేతితో స్నేహనముఁ జేసి నిదప నువ్వులు మినుములు గంజిచేసి త్రాగించి వాంతిఁ జేయింపవలయును. లేనిచో మారేడుపసపు గారకాయలు ఏమాలుగోటా వీటినన్నింటిని రసమునుతీసి వత్తులనం దుతడిపి యథావిధిగా ధూమపానమును చేయింపవలయును. లేనిచో అటుకులను నేతితో తడిపి మల్లికాపుటమును చేసి పొదలో పెట్టి కాల్పవలయును. దానిపొగను పీల్చినచో పీనస యుపశమించును. రాత్రి పరుండుటకు ముందు వట్టివేలపై పరుండి చల్లని నీటిని త్రాగినచో పీనసరోగములు నశించును. జాజిఆకులను పుటపాకము చేసి సైంధవలవణమును తైలమును అందుకలిపి నాసికయందుంచవలయును. ఇవియన్నియును పీనస రోగమునకు పరమౌషధములు. శొంఠి మిరియములు పిప్పళ్లు వీటిని బెల్లములోకలిపి తినినను చిక్కనిమజ్జిగను పులియఁబెట్టి త్రాగినను క్రొత్తగా సంభవించిన పీనస నశించిపోగలదు. క్రొత్తగావచ్చిన పీనసకు చింతఆకులను గంజిచేసి త్రాగుట మంచిది. ఇందు కఫము కలిగినచో మెల్లగా శిరోవిరేకములను చేయవలయును. అభ్యంజనము స్వేదము నస్యము మున్నగువానిని చేయువలయును. ఘృతాదులవలన వమనము హితకరమగును. భుజించిన పిమ్మట పొట్టుతీసినమినపపప్పును ఉప్పును కలిసి వీనిని భక్షించుచుండిన చిరకాలము నుండి యుండినను పీనసరోగము తొలగిపోవును. నాసికనుండి పురుగులు పడుచున్నచో క్రిమినాశకములగు నౌషధములను ఆవుపంచితముతో కలిపి నూరి నస్యవిధిని చేయవలయును. తక్కినవాని ఆయాదోషముల ననుసరించి చికిత్సను చేయవలయును.

## గన్నేరుతైలము.

శ్లో. రక్తకరవీరపుష్పం జాత్యాశనకమల్లికాయాశ్చ, ఏతైస్సమం తు తైలం నసార్శోనాశనం శ్రేష్ఠమ్. 27.

ఎఱ్ఱగన్నేరు అశోకపుష్పము జాజిపువ్వు మల్లియ వీటినితెచ్చి తైలముచేర్చి పక్వముచేసి ఆతైలమును నస్యమునుగా నుపయోగించినచో నాసారోగములును మూలరోగములును ఉపశమిల్లును.

## శిఖరితైలము.

శ్లో. గృహధూమకణాదారుక్షారనక్తాహ్వసైంధవైః, సిద్ధం శిఖరిబీజైశ్చ తైలం నాసార్శసాం[illegible]తం. 28

బూజు పిప్పళ్లు పసపు యవక్షారము కానుగుచెక్క సైంధవలవణము నెమలియడుగువిత్తులు వీటితో సిద్ధముచేసిన తైలము నాసికారోగములను పోగొట్టును.

## చిత్రకతైలము.

శ్లో. చిత్రకచవికానిష్యకనిదగ్ధికాకరంజబీజలవణార్కైః, గో మూత్రయుక్తం సిద్ధం తైలం నాసార్శసాంవిహితం. 29.

చిత్రమూలము చవ్యము ఓనుము వాకుడు నెమలియడుగువిత్తులు జిల్లేడు ఆవు మూత్రము వీటితో తైలమును సిద్ధముచేసి నస్యమునుగానిచ్చిన నాసారోగములు మూల రోగములును నశించును.

## చిత్రకరసాయనము.

శ్లో. చిత్రకస్యామలక్యాశ్చ గుడూచ్యా దశమూలజం, శతం శతం రసం దత్వా పథ్యాచూర్ణాఢకం గుడాత్. 30. శతం పచేద్ఘృతాభూ తేపలం ద్వాదశకం క్షిపేత్, వ్యోషత్రిజాతయోః క్షారాత్పలార్ధమపరే ఽహని. 31. ప్రస్థార్ధం మధునోదత్వాయథాగ్న్యద్యాదతంద్రితః, వృద్ధయేఽగ్నేః క్షయంకాసంపీనసందుస్తరం క్రిమీన్. 32. గుల్మోదావర్త దుర్నామశ్వాసాన్హంతి రసాయనమ్.

చిత్రమూలము ఉసిరికె తిప్పతీగె దశమూలములు వీటిని 100 పలముల చొ॥ వేర్వేరుగా రసమునుతీసి అందొకఆఢకమూత్రమును కరక్కాయలను చూర్ణముచేసివైచి పక్వముచేసిఉడికిగట్టిపడునప్పుడు 12 పలముల బెల్లమును కలపవలయును. రెండవదినము

దానిలో శొంఠి మిరియములు పిప్పళ్లును ముత్తైఆగులగుక్షారములును అర్ధపలముచొప్పున వైచి 8 పలముల తేనెనుపోసి సిద్ధముచేయవలయును. పిమ్మట నీరసాయనమును జఠరాగ్నిననుసరించి భక్షించినజఠరాగ్నియుద్దీపించును. క్షయదగ్రుప్తిఃసజంతువాతముగుల్మముఉదావర్తము మున్నగు రోగము లన్నియు తొలఁగి పోవును. ఇయ్యది చిత్రకహరీతకీరసాయన మని చెప్పఁబడును.

ఇట్లు చక్రదత్తమందు నాసారోగాధికారప్రకరణము ముగిసెను.

---

# ౫౭. నేత్రరోగాధికారము.

## నేత్రరోగములకు సామాన్యములగు ఔషధములు.

శ్లో. లంఘనాలేపనస్వేదశిరావ్యధవిరేచనైః, ఉపాచరేదభిష్యన్దానంజనాశ్చ్యోతనాదిభిః. 1. శ్రీవాసాతివిషాలోధ్రైః చూర్ణితైరల్పసైంధవైః, అవ్యక్తేఽక్షిగదే కార్యం ప్రోతస్త్వైర్గుండనం బహిః. 2. అక్షికుక్షిహరా రోగాః ప్రతిశ్యాయవ్రణజ్వరాః, పంచైతే పంచరాత్రేణ ప్రశమం యాంతి లంఘనాత్. 3. స్వేదః ప్రలేపస్తిక్తాన్నం సేకో దినచతుష్టయాత్, లంఘనం చాక్షిరోగాణామామానాం పాచనాని షట్. 4. అంజనం పూరణం క్వాథపానమామే న శస్యతే, ధాత్రీఫలనిర్యాసో నవదృక్కోపం నిహంతి పూరణాత్. 5. సక్షౌద్రసైంధవో వా శిగ్రూద్భవపత్రరససేకః, దార్వీరసాంజనం వాపి స్తన్యయుక్తం ప్రపూరణమ్. 6. నిహంతి శీఘ్రం దాహాశ్రువేదనాస్యందసంభవాః, కరవీరతరుణకిసలయచ్ఛేదోద్భవ బహులసలిలసంపూర్ణమ్. 7. నయనయుగం భవతి దృఢం సహసైవ తత్క్షణాత్కుపితం, శిఖిమూలం తామ్రకభాజనే స్తోకసైంధవోన్మిశ్రం. 8. మస్తునిఘృష్టం భవగాధ్రతి నవంలోచనోత్కోపం, సైంధవదారుహరిద్రాగైరికపథ్యారసాంజనైః పిష్టైః. 9. దత్తో బహిః ప్రలేపః భవత్యశేషాక్షిరోగహరః, రథాశారవకం లోధ్రం ఘృతభృష్టం బిడాలకః, కార్యో హరీతకీతద్వద్ఘృతభృష్టో బిడాలకః. 10. శాలాకవృక్షైర్బహిర్లేపో బిడాలక ఉదాహృతః, గిరిమృచ్చం

దన నాగర ఘటికాంశ యోజితో బహిర్లేపః. 11. కురుతే వచయా మిశ్రో లోచన మగదం న సందేహః, భూమ్యామలకీ ఘృష్టా సస్సైంధవ గృహ వారియోజితా తామ్రే, యాంతా ఘనత్వ మక్ష్ణోర్జయతి బహిర్లేపతః పీడామ్. 12.

నేత్రాభిష్యందములందు (ఎఱ్ఱవాఁటు పుసికట్టుట మసకకలుగుట, మొ॥) కాటుక వేయుట ఆశ్చ్యోతనము అనగా కలికము మున్నగువానిని వేయుటను చేయవలయును. సరలవృక్షపు జిగురు అతివాసలొద్దుగ వీటిని చూర్ణము చేసి కొంచెము సైంధవలవణమును కలిపి అస్పష్టముగా నుండిన కంటిజబ్బులకు వేయవలయును. కంటిలోను కనుగ్రుడ్డులోను పుట్టెడి ప్రతిశ్యాయము వ్రణములు జ్వరములు మున్నగు నీయైదురోగములును లంఘనమును చేయించుటచేత నయిదు రాత్రులలో నెమ్మదించును. స్వేదము పట్టువేయుట చేదుపదార్థములతినుట సేకము నాలుగురోజులు లంఘనము ననునీయారును ఆమములగు నక్షిరోగములను పక్వము చేయును. అపక్వనేత్ర రోగమునకు కాటుకలు కలికములు కషాయపానములు చేయింపరాదు. ఉసిరికపండులోని జిగట కంటిలోబెట్టిన నూత్నములగు నక్షిరోగములు నశించును. మునగాకు రసములో సైంధవలవణమును తేనెను కలిపి కన్నులకు సేకనము చేయుట శ్రేష్ఠము. లేనిచో మ్రానిపసపు రసాంజనము వీటిని చన్నుపాలతో నూరి కలికముగా నైనను వేసికొనవలయును. దీన నతిశీఘ్రముగా నేత్రపీడలు తొలగి పోవును. కన్నులు పోటులెత్తునప్పుడు తొలుత నేగన్నేరుచిగుళ్లఁ గిల్లి అందుండి చెమర్చునీటిని కంటియందుంచికొనవలయును. నెమలియడుగు వేరును రాగిపాత్రపైనూరి అందుకొంచెము సైంధవలవణమును కలిపి పిమ్మట మజ్జిగతో నూరి పట్టువేసిననే నేత్ర రోగములన్నియును నశించును. సైంధవలవణము మ్రానిపసపు గైరికము కరక్కాయ రసాంజనము వీటిని కన్నులకుపైన పట్టును వేసినయెడల నేత్రరోగములు సంపూర్ణముగా నశించును. లోధ్ర నేతితో వేయించిన కరక్కాయ వీటిని నూరి కంటికిపైని కడ్డీతో రాచినయెడల నేత్రములు నిర్మలములగును. కొండమట్టి చందనము వస వీటిని నూరి కన్నులకు వెలుపట పట్టువేసిన నక్షిరోగములు నశించును. నేలయుసిరిక సైంధవ లవణము వీటిని తామ్రపాత్రముపై గట్టిపడునంతకునూరి కన్నులకు వెలుపల పట్టువైచిన నక్షిరోగములు హరించును.

## నేత్రాభిష్యందమునకు సేకాదులు.

శ్లో. ఆశ్చ్యోతనం మారుతజే క్వాథో బిల్వాదిభిర్హితం, కోష్ణ స్సైరండబృహతీతర్కారీమధుశిగ్రుభిః. 13. ఏరండపల్లవేమూలేత్వ

చిచాజం పయఃశృతం, కంటకార్యాశ్చ మూలేషు సుఖోష్ణం సేచనే హితం. 14. సంపక్వేఽక్షిగదే కార్యం చాంజనాదికమిష్యతే, ప్రశస్తవర్త్మతా చాక్ష్ణోః సంరంభాశ్రుప్రశాంతతా. 15. మందవేదనతా కండూః పక్వాక్షిగదలక్షణం, అంజనాదివిధిశ్చాగ్రే నిఖిలేనాభిధాస్యతే. 16. బృహత్యేరండమూలత్వక్ శిగ్రోర్మూలం ససైంధవం, అజాక్షీరేణ పిష్టం స్యాద్వర్తిర్వాతాక్షిరోగనుత్. 17. హరిద్రే మధుకం పథ్యా దేవదారు చ పేషయేత్, ఆజేన పయసా శ్రేష్ఠమభిష్యందేత దంజనం. 18. గైరికం సైంధవం కృష్ణాం నాగరం చ యథోత్తరం, పిష్టద్విరంశతోఽద్భిర్వా గుళికాంజనమిష్యతే. 19. ప్రపౌండరీకయష్ట్యాహ్వనిశామలకపద్మకైః, శీతైర్మధుసితాయుక్తైః సేకః పిత్తాక్షిరోగనుత్. 20. ప్రాతరాశ్చ్యోతనం పథ్యా శోథమూలాక్షిరోగిణాం.

వాతోత్పన్నమగు నేత్రాభిష్యందమునకు బిల్వాద్యౌషధుల కషాయమును వెచ్చవెచ్చగా కాచవలయును. ఆముదపు ఆకులు వాకుడు యష్టిమధుకము మునగచెక్క వీటి కషాయముతో కన్నులను తడుపుచుండవలయును. ఆముదపువేళ్లయందుగాని ఆకులయందుగాని పట్టయందుగాని పాలను కాంచి ఆపాలతో కన్నులను తడుపుచుండవలయును. లేనిచో వాకుడువేళ్ళలో పాలను పోసి కాచి కన్నులను నీటితో తడుపుచుండవలయును. కన్నులు పోటు లెత్తుచున్నచో అంజనము వేయుటయే యుత్తమము. కన్నులు చక్కగానగుపడుట కంటినీరు అతివేగముగా వచ్చుట స్వల్పముగా వేదన కలిగియుండుట ఇయ్యవి పక్వమగు నక్షిరోగములకు లక్షణములు. పెద్దవాకుడుచెక్క వేళ్లున్ను మునగవేళ్లున్ను సైంధవలవణమున్ను మేకపాలలో నూరి వత్తి చేసి కన్నులలో పెట్టుకొనిన నేత్రరోగములు నశించును. పసుపు మ్రానిపసుపు యష్టిమధుకము కరక్కాయలు దేవదారువు వీటిని మేకపాలతో నూరి కంటిలో వేసికొనిన నభిష్యందరోగములు నశించును. గైరికము సైంధవలవణము పిప్పళ్లు శొంఠి వీటిని ఉత్తరోత్తరము నధికముగా తీసికొని నీటితో నూరి యుండలు గాగట్టి కాటుకగా వేసికొనవలయును. కమలములు ముల్లంగి పసుపు మ్రానిపసుపు ఉసిరిక పద్మాక్షను వీటిని నూరి తేనె చక్కెరల నిందు కలిపి పిత్తదూషితములగు నేత్రములకు పట్టువేయవలయును. ద్రాక్ష ముల్లంగి మంజిష్ఠము జీవనీయగణపు టౌషధములు వీటిని పాలలో కషాయముగా గాచి ప్రొద్దుటి పూటల కన్నులలో వేసికొనుచున్న నేత్రశూలలు మున్నగునవి తొలగి చనును.

### నింబపత్రకల్కాదులు.

శ్లో. నింబస్య పత్త్రైః పరిలిప్య లోధ్రం స్వేదాగ్నినా చూర్ణమథాపి కల్కం, ఆశ్చ్యోతనం మానుషదుగ్ధయుక్తం పిత్తాస్రవాతాపహమ గ్ర్యముక్తం. 21. కఫజే లంఘనం స్వేదః నస్యం తిక్తాన్నభోజనం, తీక్ష్ణైః ప్రధమనం కుర్యాత్తీక్ష్ణైశ్చైవోపనాహనం. 22. ఫణిజ్ఝకాస్ఫోతకపీతబిల్వధత్తూరపీలూసురసార్జభంగైః, స్వేదం విదధ్యాదథవా ప్రలేపం బర్హిష్ఠశుంఠీసురదారుకుష్ఠైః. 23. శుంఠీనింబదలైః పిండః సుఖోష్ణస్స్వల్పసైంధవైః, ధార్యశ్చక్షుషి సంలేపాత్ శోథకండూరుజాపహః. 24. వల్కలంపారిజాతస్య తైలకాంజికసైంధవం, కఫోద్భూతాక్షిశూలఘ్నం తరుఘ్నం కులిశం తథా. 25. ససైంధవం లోధ్రమథాజ్యభృష్టం సౌవీరపిష్టం సితవస్త్రబంధం, ఆశ్చ్యోతనం తన్నయనస్య కుర్యాత్కండూం చ దాహం చ రుజాం చ హన్యాత్. 26.

లొద్దుగపువ్వును వేపాకులతో పొదివి కాచి చూర్ణము చేసి కాని కల్కమును చేసికాని చనుపాలతో రంగరించి కన్నులలో పెట్టినచో పిత్తరక్తవాతములవలన పుట్టిన నేత్రరోగములు హరించును. కఫోత్పన్నములగు నేత్రరోగములకు స్వేదము నస్యవిధి తిక్తాన్నభక్షణము తీక్ష్ణములగు నౌషధములచేత కాచుట పిండికట్టులను కట్టుటయున్నగు వానిని చేయవలయును. ఫణిజ్ఝకము శ్వేతగోకర్ణి మారేడుపండు గోగు తులసి వీటికల్కమును కంటిలో వైచి స్వేదక్రియను చేయవలయును. లేనిచో కురువేరు శొంఠి దేవదారుచెక్క కోష్ఠు వీటితో చెమట పట్టించుట గాని హితకరము అగును. శొంఠి నింబపత్రములను పిడుచగా చేసి కొంచెము వెచ్చఁజేసి సైంధవలవణమును కలిపి నేత్రములకు పట్టునువేయుట మంచిది. నింబవృక్షపు బెరడుగంజి సైంధవలవణము వీటికల్కమును లేపనము చేసినను కఫోత్పన్నములగు నేత్రశూలలు హరించును. లొద్దుగను నేతిలో నుంచి సైంధవలవణమును కలిపి గంజిలో నూరి తెల్లని వస్త్రమునందు కట్టి కంటిపైని పెట్టికొనినయెడల దురద మంట బాధయును తొలగిపోవును.

### వాతాధిక్యమునందు భిన్నములగు నుపాయములు.

శ్లో. స్నిగ్ధై రుష్ణైశ్చ వాతోత్థః పిత్తజో మృదుశీతలైః, తీక్ష్ణరూక్షోష్ణవిశదైః ప్రశామ్యంతి కఫాత్మకాః. 32. తీక్ష్ణోష్ణమృదుశీతా

నాం వ్యత్యాసా త్సాన్నిపాతికాః, తిరీటత్రిఫలాయష్టీశర్కరాభద్రముస్తకాః. 33. పిష్టై శ్శీతాంబునా సేకో రక్తాభిష్యందనాశనః, కశేరుమధుకానాం చ చూర్ణ మంబరసంయుతం. 34. న్యస్త మ స్స్వంతరీక్ష్యాసు హిత మాశ్చ్యోతనం భవేత్, దర్వీపటోలమధుకం సనింబం పద్మకోత్పలం. 35. ప్రపౌండరీకం చైతాని పచే త్తోయే చతుర్గుణే, విపాచ్య పాదశేషం తు తత్పునః కుడవం పచేత్. 36. శీతభూతే తత్ర మధు దద్యా త్పాదాంశికం తతః, రసక్రియైషా దాహాశ్రు రోగరక్తరుజాపహా. 37. తిక్తస్య సర్పిషః పానం బహుశ శ్చ విరేచనం, అక్ష్ణోరపి సమంతా చ్చ పాతనం తు జలౌకసః. 38. పిత్తాభిష్యందశమనో విధి శ్చాప్యుపపాదితః, శిగ్రుపల్లవనిర్యాసః సుఘృష్ట స్తామ్రసంపుటే. 39. ఘృతేన ధూపితో హంతి శోథఘర్షాశ్రువేదనాః, పిష్టై ర్నింబస్య పత్రై రతివిమలతరై ర్జాతిసింధూత్థమిశ్రా అంతర్గర్భం దధానా పటుతరగుటికా పిష్టలోధ్రేణ భృష్టా, తూలై స్సౌవీరసాంద్రై రతిశయమృదుభి ర్వేష్టితా సా సమంతా చ్చక్షుఃకోపప్రశాంతిం చిర ముపరి దృశో ర్భ్రామ్యమాణా కరోతి. 41.

వాతోత్పన్నములగు నేత్రరోగములను స్నిగ్ధములు నుష్ణములగు ఔషధములచేత బాగుచేయవలయును. కఫోత్పన్నములగు రోగములు తీక్ష్ణములు రూక్షములు నగు ఓషధులచేత శాంతిని పొందింపవలయును. సన్నిపాతోత్పన్నములగు నేత్రరోగములయందు తీక్ష్ణములు నుష్ణములును కోమలములునగు చికిత్సను చేయవలయును. లోధ్ర త్రిఫలములు మధుకము కండచక్కెర భద్రముస్తెలు వీటిని నూరి చల్లని నీటిలో కలిపి సేకముచేసిన రక్తాభిష్యందములు తొలగును. కశేరువు మధుకము వీటిచూర్ణమును వస్త్రమునందుంచి పొట్లమునుకట్టి నీటిలోనుంచి కంటిలో పిండుట మంచిది. మ్రానిపసపు పటోలము మధుకము నింబము పద్మాక్షము కమలము నల్లకల్వలు వీటిని నాలుగురెట్ల నీటిలో పక్వము చేసి నాలవపాలు బాకీయుండగా దింపి చల్లార్చి యొకపలము తేనెను కలపవలయును. ఇయ్యది రసక్రియ యనఁబడును. దాహము అశ్రురోగము రక్తరోగము వీటిని పోగొట్టును. కటుతైలమును త్రాగి విరేచనమునకు తీసికొనుట హితకరము. లేనిచో కన్నులకు నలుప్రక్కలను జలగలను పట్టించుట మంచిది. పిత్తాభిష్యందమును పోగొట్టు విధి చెప్పఁబడినది. మునగాకురసమును రాగిసంపుటములో నూరి నేతితో ధూపనచేసిన శోథ

మున్నగునవి నశించును. జావిత్రీ సైంధవలవణములను నూరి మాత్రలఁగట్టి వాటిపైని మెత్తని నింబపత్రములను నూరి పూసి లోధ్రను పూసి మఱల దూదిని గంజితో తడిపి దానిపైని చుట్టి కంటిపైభాగమునందు కట్టిన అక్షిప్రణిపము లుపశాంతించును.

## బిల్వాంజనము.

శ్లో. బిల్వపత్రరసః పూతః సైంధవాజ్యేన చాన్వితః, శుల్బే వరాటికాఘృష్టో ధూపితో గోమయాగ్నినా. 42. పయసా లోడిత శ్చక్షుః పూరణా చ్ఛోథశూలనుత్, అభిష్యందేఽధిమంథే చ స్రావే రక్తే చ శస్యతే. 43. సలవణకటుతైలం కాంజికం కాంస్యపాత్రే ఘనితముపలఘృష్టం ధూపితం గోమయాగ్నా, సపవనకఫకోపం ఛాగదుగ్ధావసిక్తం జయతి నయనశూలం స్రావశోథం సరాగం. 44. తరుస్థవిద్ధామలకరసః సర్వాక్షిరోగనుత్, పురాణం సర్వథా సర్పిః సర్వనేత్రామయాపహం. 45. అయమేవ విధి స్సర్వో మంథాది ష్వపి శస్యతే, అశాంతౌ సర్వథా మంథే భ్రువో రుపరి దాహయేత్. 46. జలౌకః పాతనం శస్తం నేత్రపాకే విరేచనం, శిరావ్యధం వా కుర్వీత సేకాలేపా శ్చ శుక్రవత్. 47.

బిల్వఫలపురసములో సైంధవలవణము నేతిని కలిపి రాగిపాత్రలో గవ్వలతో నూరి గోమయాగ్నిచేత ధూపితముఁ జేసి పాలయందు కలిపి నేత్రములలో వేసికొనిన నేత్రశూలలు తొలగును. ఇయ్యది అభిష్యందము అధిమంథము రక్తస్రావము వీనియందు శ్రేష్ఠము. ఉప్పు ఆవనూనె గంజి వీటిని కాంస్యపాత్రలో వైచి గట్టిపడునంతవఱకును జాతితో తఱచి గోమయాగ్నియందు ధూపితముఁజేసి మేకపాలతో తడిపి కన్నులకు వైచిన వాతకఫముల ప్రకోపమువలన నుత్పన్నములయిన నేత్రరోగములు శూలలు స్రావములు వాపు గజ్జి ఇవి యన్నియును తొలగిపోవును. వృక్షమునుండి అప్పుడు కోసిన ఉసిరికరసమును కంటిలో పిండినచో సంపూర్ణరోగములు నశించును. ప్రాతనేయి అన్నివిధములగు నేత్రరోగములను పోగొట్టును. ఈవిధియే నేత్రపు టధిమంథరోగమునకును చెప్పఁబడినది. అధిమంథరోగము శాంతింపనిచో కనుబొమ్మల పైభాగమును కాల్పవలయును. నేత్రపాకరోగమునందు జలగను పట్టించుటయును ప్రవర్తి కిచ్చుటయును హితకరములు. లేనిచో నాడీచ్ఛేదనముఁ జేయవలెను. శుక్రరోగములకు వలె సేకము లేపన చేయవలెను.

## షడంగగుగ్గులము.

శ్లో. విభీతక శివా ధాత్రీ పటోలారిష్ట వాసకైః, క్వాథో గుగ్గులునా పేయః శోథశూలాక్షిపాకహా. 48. పీలుం చ సవ్రణం శుక్రం రాగాదీం శ్చాపి నాశయేత్, ఏతై శ్చాపి ఘృతం పక్వం రోగాం స్తాం శ్చ వ్యపోహతి. 49.

తాడి యుసిరిక కరకపటోలములు నింబము అడ్డసరము వీటిని కషాయమును జెట్టి గుగ్గిలమును కలిపి త్రాగిన నేత్రపువాపులు శూలపాకములు వ్రణములు గల పీలువు గజ్జి మున్నగురోగములను పోగొట్టును.

## వాసకాద్యౌషధము.

శ్లో. అటరూషాభయానింబధాత్రీముస్తాక్షకోలకైః, రక్తస్రావం కఫం హంతి చక్షుష్యం వాసకాదికం. 50.

అడ్డసరము కరక్కాయలు వేప యుసిరికలు తుంగముస్తె తాడికాయలు వీటి కషాయము మున్నగువానివలన నేత్రసంబంధములగు రక్తస్రావాదులు అన్నియును దూరములగును.

## బృహద్వాసాదిక్వాథము.

శ్లో. వాసాఘనం నింబపటోలపత్రం తిక్తామృతాచందన వత్సకత్వక్, కలింగదార్వీ దహనం చ శుంఠీ భూనింబధాత్ర్యా వభయావిభీతం. 51. క్వ్యామాయవక్వాథమథాష్టభాగం పిబే దిమం పూర్వదినే కషాయం, తైమిర్యగండూ పటలార్బుదం చ శుక్రం నిహన్యా ద్వ్రణమవ్రణం చ. 52. పీలుం చ కాచం చ మహారజ శ్చ నక్తాన్ధ్యరాగం శ్వయథుం సశూలం, నిహంతి సర్వా న్నయనామయాం శ్చ వాసాది రేష ప్రథితప్రభావః. 53.

అడ్డసరము తుంగముస్తెలు నింబము పటోలపత్రములు కటుకరోహిణి తిప్పతీగె చందనము కోష్ఠు కొడిసెపాలవిత్తులు మ్రానిపసపు చిత్రమూలము శొంఠి నేలవేము ఉసిరిక కరక్కాయలు తాడి పిప్పళ్లు వీటి నెనిమిదిరెట్ల నీటిలో కషాయమును కాచి త్రాగిన తిమిరము ఖాజ దురద పటలములు అర్బుదములు మున్నగు నేత్రరోగములు నశించును. మఱియును కాచరోగము శోఫశూలబును ఇంక నితరరోగములును నశించును.

## పథ్యాదిక్వాథములు.

శ్లో. పథ్యా స్త్రిస్రో విభీతక్యః షడ్ధాత్ర్యో ద్వాదశైవ తు, ప్రస్థార్ధే సలిలే క్వాథ మష్టభాగావశేషితం. 54. పీత్వా భిష్యంద మాస్రావం రాగ శ్చ తిమిరం జయేత్, సంరంభరాగశూలాశ్రునాశనం దృక్ప్రసాదనం, నేత్రే త్వభిహతే కుర్యా చ్ఛీత మాశ్చ్యోతనాదికం. 55. దృష్టిప్రసాదజననం విధి మాశు కుర్యాత్ స్నిగ్ధై ర్హిమై శ్చ మధురై శ్చ తథా ప్రయోగైః, స్వేదాగ్నిధూమభయశోకరుజాభితాపై రభ్యాహతా మపి తథైవ భిష క్చికిత్సేత్. 56. ఆగంతుదోషం ప్రసమీక్ష్య కార్యం వక్త్రోష్మణా స్వేదితు మాదిత స్తు, ఆశ్చ్యోతనం స్త్రీపయసా చ సద్యో యచ్చాపి పిత్తక్షతజాపహం స్యాత్. 57. సూర్యోపరాగానలవిద్యుదాదివిలోకనే నోపహతే క్షణస్య, సంతర్పణం స్నిగ్ధహిమాదికార్యం సాయం నిషేవ్యా స్త్రిఫలాప్రయోగాః. 58. నిశాబ్దత్రిఫలాదార్వీ సితా మధుక సంయుతం, అభిఘాతాక్షిశూలఘ్నం నారీక్షీరేణ పూరణం. 59. ఇక్షుకాండకరజ స్తద్వ త్స్వరసో నేత్రపూరణం, అజం ఘృతం క్షీరపాత్రం మధుకం చోత్పలాని చ. 60. జీవకర్షభకౌ చాపి పిష్ట్వా సర్పి ర్విపాచయేత్, సర్వనేత్రాభిఘాతేషు సర్పి రేత త్ప్రశస్యతే. 61.

మూడు కరక్కాయలు తాడి ఆరు ఉసిరిక పండ్రెండు వీటిని 8 పలముల నీటిలో కషాయముచేసి ఎనిమిదవపాలు మిగిలియుండగా దింపి త్రాగిన నేత్రాభిష్యందములు స్రావములు రాగము తిమ్మిరులు ఇయ్యవి నశించును. దృష్టి నిర్మలమగును. కనుపోటులు కుదురును. శీతలౌషధులక్షసమును పిండుట మంచిది. స్నిగ్ధములును శీతలములును మధురములునగు ప్రయోగములనుచేసి దృష్టిని స్వచ్ఛముచేయవలయును. స్వేదము నిప్పుసెగ భయము శోకము బాధ అభితాపము మున్నగువానివలన దూషితమైన దానికిఁగూడ నీచికిత్సనే చేయవలయును. ఆగంతుకదోషములను చక్కఁగా కనిపెట్టి తొలుత నేనోటితో ఆవిరిని పట్టవలయును. చనుబాలతో తడుపుటనుగాని పిత్తక్షతములను హరించు ఔషధములనుగాని చేయవలయును. సూర్యుని గ్రహణమును మంటను మెఱుపును చూచుటచేత దృష్టి హతమయ్యేనేని స్నిగ్ధములును శీతలములు నగునౌషధములచేత తడుపవలయును. సాయంకాలములయందు త్రిఫలములకషాయముతో కడుగుట మంచిది.

పసపు తుంగముస్తెలు త్రిఫలములు మ్రానిపసపు చక్కెర మధుకము వీటిని చనుబాలతో నూరి కంటిలో వేసికొనిన కంటికి దెబ్బ తగులుటవలనఁ గలుగుశూల లన్నియును తొలగును. లేనిచో మేకయొక్క నేతిని పాలను మధుకము కమలములు జీవకము వృషభమనుగంధద్రవ్యము వీటిని నూరి నేతిని పక్వము చేసి నేత్రములకు ప్రయోగించినచో, సమస్తములగు నేత్రాభిఘాతములును తొలగును.

## సైంధవాది ప్రయోగములు.

శ్లో. సైంధవం దారు శుంఠీ చ మాతులుంగీరసో ఘృతం, స్తన్యోదకాభ్యాం కర్తవ్యం శుష్కపాకే తదంజనం. 62. వాతాభిష్యంద వచ్ఛాన్య ద్వాతే మారుతపర్యయే, పూర్వభుక్తం హితం సర్పిః క్షీరం చాప్యథ భోజనే. 63. వృక్షాదన్యాం కపిత్థే చ పంచమూలే మహత్యపి, సక్షీరం కర్కటరసే సిద్ధం చాపి పిబేత్ ఘృతం. 64. అభిష్యంద మధిమంథం రక్తోత్థ మథ వాసునం, శిరోత్పాతం శిరాహర్ష మన్యాం శ్చాక్షిభవా న్గదాన్. 65 స్నిగ్ధస్యాజ్యేన కాంభేన శిరావ్యధైః శమం నయేత్, అమ్లాధ్యుషితశాంత్యర్థం కర్యా ల్లేపా న్సుశీతలాన్. 66. త్రైంగుకం త్రైఫలం సర్పి ర్జీర్ణం వా కేవలం హితం, శిరావ్యధం వినా కార్యః పిత్తస్యందహాగో విధిః. 67. సర్పిః క్షౌద్రాంజనం చ స్యాచ్ఛిరోత్పాతస్య భేషజం, తద్వ త్సైంధవ కాసీసం స్తన్యపిష్టం చ పూజితం. 68 శిరాహర్షేంజనం కుర్యా త్ఫాణితం మధుసంయుతం, మధునా తార్క్ష్యశైలం వా కాసీసం వా సమాక్షికం. 69.

సైంధవలవణము మ్రానిపసపు శొంఠి మాదిరసము నేయి వీటిని చనుబాలతోను నీటితోను నూరి శుష్కపాక నేత్రములకు వేయుట హితకరము. వాయుజములగు నభిష్యందరోగములయందును ఇతరరోగములయందును మొదట ఘృతమును తినిపించి పిమ్మట పాలను త్రాగించుట హితము. బదరికె వెలగ బృహత్పంచమూలములు బిల్వపత్రము వీటితో వేరువేరుగా సిద్ధముచేయబడిన పాలతో కూడిన నేతిని త్రాగుట మంచిది. అభిష్యందము అధిమంథము నేత్రార్జునము శిరోత్పాతము శిరోహర్షము ఈరోగములను ఇతర నేత్రరోగములను స్నిగ్ధము చేయించి నాడులను ఛేదించి పోగొట్టవలయును. అమ్లాధ్యుషితరోగమును పోగొట్టుటకై శీతలలేపములను చేయవ

లయును. తిందుకచెక్కతో సిద్ధము చేసినట్టిగాని త్రిఫలములతో సిద్ధముచేసినట్టిగాని నేతినయినను కేవలము ప్రాతనేతినయినను లేపన చేయవలయును. నాడీభేదనము లేకుండ పిత్తాభిష్యందములను హరించు క్రియలను చేయవలయును. నేయియును క్షౌద్రాంజనమును శిరోత్పాతమునకు తగినభేషజములు. శిరాహర్షమునందు సైంధవలవణము సీసము వీటిని చనుబాలతో నూరి అంజనము వేయవలయును. లేనిచో తేనెతో రసాంజనమును గాని కాసీసమును గాని కలిపివేయుట మంచిది.

### నేత్రవ్రణములకు షడంగగుగ్గులము.

శ్లో. వ్రణశుక్రప్రశాంత్యర్థం షడంగం గుగ్గులుం పిబేత్, కతకస్య ఫలం శంఖం తిందుకం రూప్యమేవ చ. 70. కాంస్యే నిఘృష్టం స్తన్యేన క్షతశుక్రాత్తిరాగజిత్, చందనం గైరికం లాక్షామాలతీ కలికా సమా. 71. వ్రణశుక్రహరీ వర్తిః శోణితస్య ప్రసాదనీ, శిరయా వా హరేద్రక్తం జలౌకాభిశ్చ లోచనాత్. 72. అక్షమజ్జాంజనం సాయం స్తన్యేన శుక్రనాశనం, ఏకం వా పుండరీకం చ ఛాగక్షీరావసేచితం. 73. రాగాశ్రువేదనాం హన్యాత్ క్షతపాకాత్యయాంజకాః, తుత్థకం వారిణా యుక్తం శుక్రం హన్త్యక్షిపూరణాత్. 74. సముద్రఫేనదక్షాండ త్వక్సింధూత్థైః సమాంశికైః, శిగ్రుబీజయుతైర్వర్తిః శుక్రఘ్నీ శిగ్రువారిణా. 75 ధాత్రీఫలం నింబపటోలపత్రం యష్ట్యాహ్వ లోధ్రం ఖదిరం తిలాశ్చ, క్వాథః సుశీతో నయనే నిషిక్తః సర్వప్రకారం వినిహన్తి శుక్రం. 76.

నేత్రవ్రణములు చుక్కలు నశించుటకై షడంగగుగ్గిలమును సేవింపవలయును. చిల్లగింజలు శంఖుపుష్పి తిందకము కుప్పిచెట్టు వీటిని కంచుపాత్రలో చనుబాలతో నూరి అంజనమును చేసిన క్షతశుక్రములబాధలు అన్నియును నశించును. చందనము గైరికము లత్తుక జాజి వీటిని సమభాగములను వత్తిచేసి యుపయోగించినచో వ్రణములు మున్నగునవి తొలగిచనును. లేనిచో కన్నులకు జలగలను పట్టించిగాని దుష్టరక్తమును వెడలింపవలయును. తాడిగుటికలను స్త్రీస్తన్యముతో నూరి కాటుకవైచిన శుక్రములు నశించును. కమలమును మేకపాలతో నూరి అవసేచనముఁ జేసినచో నేత్రరోగములకు నేత్రపాకములను నశించును. మైలుతుత్తమును నీటితో నూరి వైచిన శుక్రములు నశించును. సముద్రఫేనము కోహలాచెక్క సైంధవలవణము మునగవిత్తులు వీటిని మునగరసముతో నూరి వత్తిచేసి కన్నులలో నుంచిన శుక్రములు నశించును. ఉసిరికకాయ

వేపాకులు పటోలపత్రములు మధుకము లోధ్ర కాచు తిలలు వీటిని కషాయముఁజెట్టి చల్లార్చి నేత్రములపైని చల్లినచో నన్నివిధములగు నేత్రరోగములను నశించును.

## సేచనాదులు.

శ్లో. క్షుణ్ణపున్నాగ పత్రేణ పరిభావితవారిణా, శ్యామాకాష్ఠే ఽంబునా వాథ సేచనం కుసుమాపహం. 77. దక్షాండత్వక్శిలాశంఖ కాచచందన గైరికైః, తుల్యై రంజనయోగో ఽయం పుష్పాస్త్రాదివిలేఖనః. 78. శిరీషబీజమరిచపిప్పలీసైంధవై రపి, శుక్రే ప్రఘర్షణం కార్య మథవా సైంధవేన చ. 79. బహుశః పలాశకుసుమస్వరసైః పరిభావితా జయత్యచిరాత్, నక్తాహ్వబీజవర్తిః కుసుమచయం దృక్షు చిరజ మపి. 80. సైంధవత్రిఫలా కృష్ణా కటుకా శంఖనాభయః,సతామ్రరజసో వర్తిః పిష్ట్వా శుక్రవినాశినీ. 81. చందనం సైంధవం పథ్యా పలాశతరుశోణితం, క్రమవృద్ధ మిదం చూర్ణం శుక్రాద్యాదివిలేఖనం. 28.

పున్నాగపు ఆకులను తెచ్చి నీటిలోఁ కలిపి రసముతీసి గాని పిప్పళ్ళకషాయముతో గాని కన్నులకు సేచన చేసిన కంటిపూవులు నశించును. గోంగటచెక్క శిలాజిత్తు శంఖము కాంస్యము చందనము గైరికము వీటిని సమభాగములను అంజనముఁజేసి నేత్రములపూవులకు వేసిన నశించును. దిరిసెనగింజలు మిరియములు పిప్పళ్లు సైంధవలవణము వీటితోగాని కేవలము సైంధవలవణముతోగాని శుక్రమును ఘర్షణచేసిన తొలగును. మోదుగపూవుల రసముతో పలుమారు అనేకమారులు పరిభావనచేసిన శుక్రములునశించును. నెమలియడుగువిత్తులను వత్తిచేసి కంటిలోయుంచిన పువ్వులు నశించును. సైంధవలవణము త్రిఫలములు పిప్పళ్ళు కటుకరోహిణి శంఖపుష్పము రాగిసారిడి వీటినినూరి వత్తిచేసి కన్నులలో వేసికొనిన పూవులు నశించును. చందనము సైంధవలవణము కరక్కాయలు వీటిని ఏకోత్తరములు హెచ్చుగా గ్రహించి చూర్ణముచేసి కన్నులలో వేసికొనిన శుక్రములు అర్మరోగములు నశించును.

## దంతవర్తి.

శ్లో. దంతై ర్హస్తివరాహోష్ట్ర గవాశ్వాజఖరోద్భవైః, సశంఖమౌక్తికాంభోధిఫేనై ర్మరిచపాదికైః. 83. క్షతశుక్ర మపి వ్యాధిం దంతవర్తి ర్నివర్తయేత్, శంఖస్య భాగా శ్చత్వార స్తతో ఽర్ధేన మనశ్శిలా. 84. మనఃశిలార్ధం మరిచం మరిచార్ధేన సైంధవం, ఏతచ్చూర్ణాంజనం శ్రేష్ఠం శుక్రయో స్తిమిరేషు చ. 85. పిచ్ఛటే మధునా యోజ్య మర్జదే మస్తునా తథా, తార్క్ష్యం మధుకసారో ఽహింబీజం చా

క్షుస్య సైంధవం. 86. మధునాంజనయోగా స్స్యు శ్చత్వారః శుక్రశా న్తయే, వటక్షీరేణ సంయుక్తం శ్లక్ష్ణం కర్పూరజం రజః. 87. క్షిప్ర మంజనతో హన్తి శుక్రం చాపి ఘనోన్నతం, త్రిఫలామజ్జమంగల్యామ ధుకం రక్తచందనం. 88. పూరణం మధుసంయుక్తం క్షతశుక్రాజకాశు జిత్, తాలస్య నారికేరళస్య తస్మైవారుష్కరస్య చ. 89. కరీరస్య చ వంశానాం కృత్వా క్షారం పరిశ్రుతం, కరభాస్థికృతం చూర్ణం క్షారే ణ పరిభావితం. 90. సప్తకృత్వోఽష్టకృత్వో వా శ్లక్ష్ణం చూర్ణంతు కా రయేత్, ఏతచ్ఛుష్కే ష్వసాధ్యేషు కృష్ణీకరణ ముత్తమం. 91. యాం ని శుక్రాణి సాధ్యాని తేషాం పరమ మంజనమ్.

ఏనుగు పంది ఒంటె ఆవు గుఱ్ఱము మేక గాడిద వీటిదంతములలో నాలవపాలు శంఖము ముత్తెములు సముద్రఫేనము మిరియములు వేసి వత్తిని చేయవలయును. ఇయ్యది క్షతశుక్రముల నశింపఁజేయును. శంఖము నాలుగు భాగములు మణిశిల అందర్ధభాగము దానిలో నర్ధభాగము మిరియములు మిరియములలో నర్ధభాగ ము సైంధవలవణము వీటిని చూర్ణముచేసి నేత్రములందు వైచిన శుక్రములునశించును. పిచ్చటరోగమునందు దీనినే తేనెలో కలిపి వేయవలయును. అర్బుదరోగమునందు మజ్జిగ తేటతో నూరివేయుట మంచిది. విషబొద్ది మధుకము సత్తుతాడివిత్తులు సైంధవ లవణము ఈనాల్గింటిని వేరువేరుగా తేనెలో కలిపి కన్నులలో వేసికొనిన పూవులు పూచుట నశించును. కర్పూరమును మఱ్ఱిపాలతో నూరి కాటుక వేసికొనినచో మిక్కిలి పెఱిగిన పూవునైనను పోగొట్టును. త్రిఫలములు కమలములు గోరోచనము మధుక ము రక్తచందనము వీటిని తేనెలో కలిపి కన్నులలో వేసికొనినను దెబ్బవలనఁ గలిగిన శుక్రములు అంశువులు నశించును. తాళవృక్షము నారికేలము జీడివిత్తులు అడ్డసర మువీటిని క్షారమునందు ఒంటె ఎముకల చూర్ణమును భావనచేసి పిమ్మట ఏడెనిమిది మాఱులు భావనచేసి ఈచూర్ణము నుపయోగింప వలయును. అసాధ్యములగు శుక్రము లునశించును. సాధ్యము లగువానికి నుత్తమమగు అంజన మనఁదగును.

## పటోలాద్యఘృతము.

శ్లో. పటోలం కటుకాం దార్వీం నింబం వాసాం ఫలత్రికాం. 92. దురాలభాం పర్పటకం త్రాయంతీం చ పలోన్మితాం, ప్రస్థమామలకా నాంచ క్వాథయే దుల్బనేఽంభసి. 93. పాదశేషే రసే తస్మి న్ఘృతప్రస్థం

విపాచయేత్, కల్కైర్వ్యానింబకుటజ ముస్తాయష్ట్యాహ్వచందనైః. 94. సపిప్పలీకై స్తత్సిద్ధం చక్షుష్యం శుక్రయోర్హితం, ఘ్రాణకర్ణాక్షినర్త్వఙ్ముఖ రోగవ్రణాపహం. 95. కామలా జ్వరవీసర్ప గండమాలాహారం పరం.

చేదుపొట్ల కటుకరోహిణి మ్రానిపసపు నింబము అడ్డసరము త్రిఫలములు దూలగొండి పిత్తపాపడ లజ్జాపంతి వీటిని తొలినాల్గిటిని మూడుపలములు చొప్పునను మిగతవానిని ఒక్కొక్కపలము చొప్పునను తీసికొని 16 పలముల ఆమలకములను ఒకద్రోణపు నీటిలో కషాయముగాచి ఔషధులనందు పక్వముచేసి నాలవపాలు మిగిలియుండగా దింపి 16 పలముల నేతిని పక్వము చేయవలయును. నేలవేము కోష్ఠు తుంగముస్తెలు మధుకము చందనము పిప్పళ్లు వీటిని కల్కముచేసి పైదానిలో కలిపి సేవించినచో, శుక్రములు నశించును. ముక్కు చెవి కన్ను ఒడలు ముఖము వీట్లయందుగల వ్రణములను పోగొట్టును. కామెలలు జ్వరము మున్నగువానిఁ బోగొట్టును.

## కృష్ణాద్యతైలము.

శ్లో. కృష్ణావిడంగ మధుయష్టికసింధుజన్మ విశ్వౌషధైః పయసి సిద్ధ మిదం ఛగల్యాః, తైలం నృణాం తిమిరశుక్ర శిరోక్షిశూల పాకాత్యయాం జయతి నస్యవిధౌ ప్రయుక్తం. 97. అజకాం పార్శ్వతో విద్ధ్వా సూచ్యా విస్రావ్య చోదకం, వ్రణం గోమయచూర్ణేన పూరయేత్సర్పిషా సహ. 98. సైంధవం వాజిపాదం చ గోరోచనసమన్వితం, శేలుత్వగ్రససంయుక్తం పూరణం చాజకాపహం. 99.

పిప్పళ్లు వాయువిడంగములు మధుకము సైంధవలవణము శొంఠి వీటికల్కము పాలలోపక్వముచేసి అందు తైలమును పక్వముచేయవలయును. దీనిని నస్యముగా నుపయోగించినచో తిమిరము శుక్రము మున్నగునవినశించును. నేత్రజనులగు అజగల్లికాదులను సూదితో కుట్టి చెడునీటిని వెడలించి పేడచూర్ణము నాగాయమునందు పోయవలయును. సైంధవలవణము గోకర్ణి గోరోచనము వీటిని పూరించిన అజకారోగములు హరించును.

## శశకాది ఘృతము.

శ్లో. శశకస్య శిరఃకణ్కే శేషాంగక్వథితే జలే, ఘృతస్య కుడవం పక్వం పూరణం చాజకాపహం. 100. శశకస్య కషాయే చ సర్పి

షః కుడవం పచేత్, యష్టీప్రపౌండరీకస్య కల్కేన పయసా సమం. 101. ఛాగల్యాః పూరణా చ్ఛక్రక్షతపాకాత్యయాజకాః, హంతి భ్రూశంఖశూలం చ దాహరాగా నశేషతః. 102.

కుందేటితలనునూరి కల్కముచేసి తక్కిన శరీరమును కషాయమును పెట్టి యందు నాల్గుపలముల నేతిని పక్వముచేసి సేవించిన అజకలు నశించును. శశకషాయమునందు నాల్గుపలముల నేతిని పక్వముచేసి మధుకము కల్కము వీటికల్కములో 4 పలముల మేకపాలను పక్వముచేసి అందుసిద్ధముచేసిన ఘృతమును సేవించిన నేత్రసంబంధములగు దాహాదులు నశించును.

### త్రిఫలాదిసేవనము.

శ్లో. త్రిఫలాఘృతం మధుయవాః పాదాభ్యంగః శతావరీముద్గాః, చక్షుష్యాః సంక్షేపాత్ వర్గః కథితో భిషగ్భిరయం. 103. లిహ్యాత్సదా వా త్రిఫలాసు చూర్ణితాం మధుప్రగాఢాం తిమిరేఽథ పిత్తజే, సమీరజే తైలయుతాం కఫాత్మకే మధుప్రగాఢాం విదధీత యుక్తితః. 104 కల్కః క్వాథోఽథవా చూర్ణం త్రిఫలాయా నిషేవితం, మధునా హవిషా వాపి సమస్తతిమిరాంతకృత్. 105. య స్త్రైఫలం చూర్ణమపథ్యవర్జీ సాయం సమశ్నాతి హవిర్మధుభ్యాం, స ముచ్యతే నేత్రగతై ర్వికారై ర్భృత్యై ర్యథా క్షీణధనో మనుష్యః. 106. సఘృతం వా వరాక్వాథం శీలయే త్తిమిరామయీ, జాతా రోగా వినశ్యంతి న భవంతి కదాచన, త్రిఫలాయాః కషాయేణ ప్రాత ర్నయనధావనాత్. 107. జలగండూషైః ప్రాత ర్బహుశోఽంబోభిః ప్రపూర్య ముఖరంధ్రం, నిర్దయ ముక్షన్నక్షి క్షపయతి తిమిరాణి నా సద్యః. 108. భుక్త్వా పాణితలం ఘృష్ట్వా చక్షుషో ర్యత్ప్రదీయతే, అచిరేణైవ తద్వారి తిమిరాణి వ్యపోహతి. 109.

త్రిఫలములు నేయి తేనె యవలు పాదాభ్యంజనము పిల్లపీచర పెసలు ఈవర్గము నేత్రములకు సుఖకరమని చెప్పఁబడినది. లేనిచో సమస్తనేత్రరోగములందును త్రిఫలాచూర్ణమును తేనెతో సేవించిన పిత్తోత్పన్నతిమిరరోగములకువలె చికిత్సఁ జేసినను మంచిది. వాతజములగువానికి తైలములో కలిపియును కఫోత్పన్నములకు తిమిరములకుగూడ తేనెతో కలిపి సేవింపవలయును. త్రిఫలముల కల్కకషాయములను గాని చూర్ణమునుగాని తేనెతో లేక నేతితో భక్షించిన సమస్త తిమిరరోగములునునశించును. అపథ్యవస్తు

వులను త్యజించిసాయంకాలములందు త్రిఫలములచూర్ణమును తేనెలో కలిపి భక్షించినచో సమస్తనేత్రరోగములునశించును. త్రిఫలములకషాయములో తేనెను కలిపి కంటిలో వైచిన తిమిరరోగములు నశించును. త్రిఫలకషాయముతో కన్నులఁ గడిగిన సమస్తనేత్రరోగములు నశించును. క్రొత్తరోగములు పుట్టవు. త్రిఫలోదకములను పుక్కిటిలోనుంచికొని కంటిమీఁద నుమిసిన నేత్రరోగములు నశించును. భోజనముఁ జేసి చేతులనుకడిగికొని రెండుచేతులతో కన్నులను ఆనీటితోఁ దుడిచికొనినచో నేత్రరోగములు నశించును.

### సుఖావతీవర్తి.

శ్లో. కతకస్య ఫలం శంఖం త్ర్యూషణం సైంధవం సితా, ఫేనో రసాంజనం క్షౌద్రం విడంగాని మనఃశిలా. 110. కుక్కుటాండకపాలాని వర్తి రేషా వ్యపోహతి, తిమిరం పటలం కాచ మర్మ శుక్రం తథైవ చ, కండూక్లేదార్బుదం హంతి మలం చాశు సుఖావతీ. 111.

కతకఫలగింజలను శంఖచూర్ణమును శొంఠి మిరియములు పిప్పళ్లు సైంధవలవణము శర్కర సముద్రఫేనము రసాంజనము తేనె వాయువిడంగములు మణిశిల కోడిగ్రుడ్డుచిప్పలు వీటిని వత్తిచేసి కంటిలో వేసికొనిన తిమిరములు పటలములు కాచము అర్మము శుక్రము ఖజ్జ క్లేదము అర్బుదము మున్నగు నేత్రరోగములు నశించును.

### చంద్రోదయావర్తి.

శ్లో. హరీతకీవచాకుష్ఠం పిప్పలీమరిచాని చ, బిభీతకస్య మజ్జా చ శంఖనాభి ర్మనఃశిలా. 112. సర్వ మేత త్సమం కృత్వా ఛాగక్షీరేణ పేషయేత్, నాశయే త్తిమిరం కండూం పటలా న్యర్బుదాని చ. 113. అధికాని చ మాంసాని య శ్చ రాత్రౌ న పశ్యతి, అపి ద్వివార్షికం పుష్పం మాసే నైకేన సాధయేత్. 114. వర్తి శ్చంద్రోదయా నామ నృణాం దృష్టిప్రసాదనీ, హరీతకీ హరిద్రా చ పిప్పల్యో లవణాని చ. 115. కండూతిమిరజి ద్వర్తి న క్వచి త్ప్రతిహన్యతే.

కరక్కాయలు వస కోష్ఠు పిప్పళ్లు మిరియములు తాడిమజ్జ శంఖనాభి మణిశిల వీటిని సమముగాఁ దెచ్చి మేకపాలతో నూరి వత్తిఁజేసి కంటియం దుంచికొనినచో తిమిరములు దురదలు పటలము అర్బుదము దుర్మాంసము రేచీకటి మున్నగు వాటిని పోఁగొట్టును. రెండుసంవత్సరములు ముదిరిన పూవునైనను నశింపఁజేయును. ఇయ్యది దృ

ష్టి నిచ్చెడిది. కరక్కాయలు పసపు పిప్పళ్లు పంచలవణములు వీటిని వత్తిచేసి కంట నుంచి కొనిన కంటిదురదలు నశించును.

కుమారికా వర్తిః.

శ్లో. అశీతి స్తిలపుష్పాణి షష్టిః పిప్పలితండులాః. 119. జాతీకుసుమపంచాశ న్మరిచాని చ షోడశ, ఏషా కుమారికా వర్తి ర్గతం చక్షు ర్నివారయేత్. 117.

తిలపుష్పములను 80 పిప్పలి తండులములను 60 జాతీకుసుమములను 50 మిరియములను 16 ని వత్తిచేయవలయును. ఇయ్యది నష్టమైన దృష్టిని గూడ నొసగును.

త్రిఫలాదివర్తులు.

శ్లో. త్రిఫలాకుక్కుటాండత్వక్కాసీసమయసారజః, నీలోత్పలం విడంగాని ఫేనంచ సరితాంపతేః. 118. ఆజేన పయసా పిష్ట్వా భావయేత్తామ్రభాజనే, సప్తరాత్రం స్థితం భూయః పిష్ట్వాక్షీరేణవర్తయేత్.119. ఏషా దృష్టిప్రదా వర్తి రంధస్యాభిన్నచక్షుషః, చందన త్రిఫలా పూగపలాశతరుశోణితైః. 120. జలపిష్టై రియం వర్తి రశేషతిమిరాపహా, నిశాద్వయా భయా మాంసీ కుష్ఠకృష్ణా విచూర్ణితా. 121. సర్వనేత్రామయాన్ హన్యా దేత త్సోగత మంజనం, వ్యోషోత్పలా భయాకుష్ఠతార్క్ష్యైర్వర్తిః కృతా హరేత్. 122. అర్బుదం పటలం కాచం తిమిరార్మాశ్రునిస్రుతిం, త్ర్యూషణం త్రిఫలావక్ర సైంధవాల మనఃశిలాః, క్లేదోపదేహకండూఘ్నీ వర్తిః శస్తా కఫాపహా. 123. ఏకగుణామాగధికా ద్విగుణా చ హరీతకీ సలిలపిష్టా, వర్తి రియం నయనసుఖా ర్మతిమిర పటలకాచాశ్రుహరీ. 124.

త్రిఫలములు కోడిగ్రుడ్డు చెక్కులు కాసీసము లోహపుపొడి నల్లకల్వలు వాయువిడంగములు సముద్రఫేనము వీటిని తామ్రపాత్రలో నూరి ఏడుదినములు మేకపాలతో తడిపియుంచవలయును. పిమ్మటఁ జక్కగా నూరి వత్తిని చేసి యుపయోగించిన గ్రుడ్డివానికి గూడ కన్నులు వచ్చును. చందనము త్రిఫలములు పోకచెక్క మోదుగపూల లోనికిం జక్కవములు వీటిని నూరి వత్తిఁజేసి కంటిలోనుంచికొనిన సంపూర్ణములగు తిమిరరోగములునశించును. పసపు మ్రానిపసపు జటామాంసి కోష్ఠు పిప్పలి వీటిని కాటుకచేసి వేసికొనిన సమస్తనేత్రరోగములను నశించును. శొంఠిమిరియము ముతిలు పిప్పళ్లుం

కరక్కాయలు శొంఠి వీటితో వత్తిజేసి ధరించిన అర్బుదము పటలము కాచము తిమిరము అర్మము అంశుపతనము మున్నగు రోగములు నశించును. శొంఠి మిరియములు పిప్పళ్లు త్రిఫలములు తగరము సైంధవలవణము హరిదళము మణిశిల వీటివత్తి క్లేదము శోఫ దురద మున్నగువానికి పోగొట్టును. నేత్రములకఫమును తొలగించును. పిప్పళ్లు 1 భాగము కరక్కాయలు 2 భాగములు వీటిని నీటిలో నూరి వత్తినిచేసి కంటిలో నుంచిన దురద అర్మము తిమిరము పటలము నీళ్లుకారుట మున్నగునవి నశించును.

## చంద్రప్రభావర్తి.

శ్లో. అంజనం శ్వేతమరిచం పిప్పలీ మధుయష్టికా, విభీతకస్య మధ్యం తు శంఖనాభి ర్మనశ్శిలా. 125. ఏతాని సమభాగాని అజాక్షీరేణ పేషయేత్, ఛాయాశుష్కాం కృతాం వర్తిం నేత్రేషు చ ప్రయోజయేత్. 126. అర్బుదం పటలం కాచం తిమిరం రక్తరాజికాం, అధిమాంసం మలం చైవ యశ్చ్య శత్రో న పశ్యతి. 12. వర్తి శ్చంద్రప్రభా నామ జాతాన్ధ్య మపి శోధయేత్.

అంజనము తెల్లమిరియములు పిప్పళ్లు మధుకము విభీతకమధ్యము శంఖనాభి మనశ్శిల వీటిని సమభాగములను మేకపాలతో నూరి వత్తిచేసి నీడలో నెండింపవలయును. వీటిని నేత్రములో వైచినచో అర్బుదము పటలము కాచము తిమిరము కన్నులయెఱుపు దుర్మాంసము పుసి రేచీకటి ఇవి యన్నియును నశించును. ఇయ్యది చంద్రప్రభయను వర్తి. జాత్యంధునైనను శోధించును.

## నాగార్జునీయాంజనము.

త్రిఫలావ్యోషసింధూత్థయష్టితుత్థరసాంజనం.128. ప్రపౌండరీకంజంతుఘ్నం లోధ్రం తామ్రం చతుర్దశ, ద్రవ్యా ణ్యేతాని సంచూర్ణ్య వర్తిః కార్యా నభోంజనా. 129. నాగార్జునేన లిఖితా స్తంభే పాటలిపుత్రకే, నాశనీ తిమిరాణాం చ పటలానాం తథైవ చ. 130. సద్యః ప్రకోపం స్తన్యేన స్త్రియా విజయతే ధ్రువం, కింశుకస్వరసేనాథ పీలుపుష్పకరక్తతః. 131. అంజనా ల్లోధ్రతోయేన చాసన్నతిమిరం జయేత్, చిరసంఛాదితే నేత్రే బస్తమూత్రేణ సంయుతా. 132. ఉన్మీలయత్యక్షిచ్ఛేత్రిణ ప్రసాదం చాధిగచ్ఛతి.

త్రిఫలములు శొంఠి మిరియములు పిప్పళ్లు సైంధవలవణము మధుకము మైలుతుత్తము రసాంజనము కమలము వాయువిడంగములు లోధ్రి తామ్రము అనునీపదునాలు

గింటిని చూర్ణముచేసి వర్తిచేసి సేవింపవలయును. ఈవత్తిని నాగార్జునుఁడు పాటలీపుత్రపుస్తంభమున వ్రాసెను. ఇయ్యది తిమిరరోగములను నేత్రపటలములను తొలగించును. చనుబాలలో కలిపిచేసిన తత్క్షణమే నేత్రప్రకోపమును పోగొట్టును. మోదుగరసములోనూతిపైచిన క్రీలు పూవులు మున్నగునవినశించు. లోధ్రోదకములతో నూరిపైచిన కొలదిరోజులతిమిరరోగములు నశించును. చాలరోజులనుండి మూసికొనిపోయిన కన్నుకు మేకమూత్రమును వేయవలయును. శీఘ్రముగా నెమ్మది యగును.

## పిప్పల్యాద్యంజనములు.

శ్లో. పిప్పలీం సతగరోత్పలపత్రాం వర్తయే త్సమధుకాం సహరిద్రాం, ఏతయా సతత మంజయితవ్యం య స్సువర్ణసమ మిచ్ఛతి చక్షుః. 133. వ్యోషాయశ్చూర్ణసింధూత్థా త్రిఫలాంజనసంయుతా, గుడికా జలపిష్టేయం కోకిలా తిమిరాపహా. 134. త్రీణి కటూని కరంజఫలాని ద్వే రజనీ సహసైంధవకం చ, బిల్వతరో ర్వరుణస్య చ మూలం వారిచరం దశమం ప్రవదన్తి. 135. హన్తి తమ స్తిమిరం పటలం చ పిచ్చిట శుక్రక మర్జునం చ, అంజన కంజన రంజనకంచ దృక్చ న నశ్యతి వర్షశతం చ. 136.

పిప్పళ్లు తగరము కమలపత్రము పసపు వీటిని నూరి తేనెను కలిపి వత్తిని చేయవలయును. ఈవత్తిని కన్నులలో పైచికొనిన గరుత్మంతునిబోలిన దృష్టి యలవడును. శొంఠి మిరియములు పిప్పళ్లు లోహరజము సైంధవలవణము త్రిఫలములు అంజనము వీటిని నీటితోనూరి మాత్రలను కట్టియుపయోగించిన తిమిరరోగములు నశించును. శొంఠి మిరియములు పిప్పళ్లు నెమలియడ్డువిత్తులు శంఖము వీటిని నూరి కాటుక చేసి పెట్టికొనిన తిమిరములు పటలములు మున్నగునవి నశించును.

## నీలకమలాద్యంజనము.

శ్లో. నీలోత్పలం విడంగాని పిప్పలీ రక్తచందనం, అంజనం సైంధవం చైవ సద్య స్తిమిరనాశనం. 137. పత్రగైరికకర్పూర యష్టీనీలోత్పలాంజనం, నాగకేసరసంయుక్త మశేషతిమిరాపహం 138. శంఖస్య చతురో భాగా స్తదర్ధేన మనఃశిలా, మనఃశిలార్ధం మరిచం మరిచార్ధేనపిప్పలీ. 139. వారిణాతిమిరంహ న్త్యర్బుదంహ న్తిమస్తునా, పిచ్చిటం మధునా హంతిస్త్రీక్షీరేణ తదుత్తమం. 140. హరిద్రానింబపత్రాణి పిప్పల్యో మరిచాని చ, భద్రముస్తం విడంగాని సప్తమం విశ్వభేషజం.141.

గోమూత్రేణ గుడీ కార్యా భాగమూత్రేణ చాంజనం, జ్వరాంశ్చ నిఖిలాన్ హన్తి భూతావేశం తథైవ చ. 142. వారిణా తిమిరం హన్తి మధునా పటలం తథా, నక్తాంధ్యం భృంగరాజేన నారికేళీరేణ పుష్పకం. 143. శిశిరేణ నరిస్రావ మర్బుదం పిచ్చిటం తథా.

నల్లకమలములు వాయువిడంగములు పిప్పళ్లు రక్తచందనము అంజనము సైంధవలవణము వీటిని చూర్ణముచేసి కంటిలో వేసికొనిన తత్కాలపు తిమిరరోగములు నశించును. తేజపత్రి గైరికము కర్పూరము మధుకము నల్లకమలములు అంజనము నాగకేసరములు వీటికాటుకను వైచికొనిన తిమిరరోగములు సంపూర్ణముగా నశించును. శంఖము నాలుగుభాగములు మణిశిల రెండుభాగములు మిరియము లొకభాగము పిప్పళ్లు అర్ధభాగము వీటిని నీటితో నూరి మజ్జిగతేటతో కలిపి కంటిలో నుంచికొనినచో తిమిరములు నర్బుదములు నశించును. తేనెలో కలిపి వేసికొనిన పిచ్చిటరోగములు నశించును. స్తన్యముతో నైన పూవులు నశించును. పసపు వేపాకులు పిప్పళ్లు మిరియములు భద్రముస్తలు వాయువిడంగములు కొంత వీటిని గోమూత్రముతో నూరి మాత్రలను కట్టవలయును. పిమ్మట మేకమూత్రముతో చాది వేసికొనిన జ్వరములు భూతపిశాచాదిబాధలు నశించును. నీటితో చాదిన తిమిరరోగములును తేనెతో పటలరోగములును గుంటకలగరాకు రసముతో రేచీకటులును స్తన్యముతో నైన పూవులును నశించును.

## కజ్జలాంజనము.

శ్లో. సంగృహ్యాపరతా నలక్తకరసే నామ్రుజ్య గండూపదాన్, లాక్షారంజితతూలవర్తినిహితా న్సృష్టిమధూ న్మిశ్రితాన్. 144. ప్రజ్వాల్యోత్తమసర్పిషా నలశిఖాసంతాపజం కజ్జలం, దూరాసన్ననిశాన్ధ్యసర్వతిమిరప్రధ్వంసకృ ద్బోదితం. 145. ధూమహా నిఘృష్టయాం గుళ్యా అంజనం శమనం తయోః, తిమిరకాచార్మహారం ధూమికాయాశ్చ నాశనం. 146. త్రిఫలాభృంగమహౌషధ మధ్వాజ్యచ్ఛాగపయసి గోమూత్రే, నాగం సప్తసిషిక్తం కరోతి గరుడోపమం చక్షుః. 147. త్రిఫలాసలిలయోగే భృంగరాజద్రవే చ, హవిషి చ విషకల్కే క్షార ఆజ్యే మధూగ్రే. 148. ప్రతిదిన మథ సప్తం సప్తధా సీస మేకం ప్రణిహిత మథ పశ్చా త్కారయే త్తచ్ఛలాకాం, సవితు రుదయకాలే సాంజనా ఽవ్యంజనా వా కరకరికసమేతా నర్మ్యపై చిట్యరోగాన్.

149. అసితసితసముత్థాన్ సంధివర్త్మాభిజాతాన్ హరతి నయనరోగాన్ సేవ్యమానా శలాకా.

దీనిచే కర్పూరముతోఁ నైన పరిస్రావము పిచ్చటము అర్బుదమును నశించును. చచ్చిన ఎఱ్ఱలను తెచ్చి లత్తుక పూసి లత్తుకపూసిన దూదిలో చుట్టి యష్టిమధుకము తేనె దానిపై నిపూసి మండించి ఆపొగవలనఁ బుట్టిన కాటుకను వేసికొనిన కనిపింపకపోవుట తే చీకటి మున్నగునవి అన్నియును నశించును. అంగుళిని భూమికి రుద్ది కంటికి రుద్ది తిమిరాద్యాదులు నశించును. త్రిఫలములు భారంగి శొంఠి తేనె మేకపాలు గోమూత్రము వీటిలో నేడుదినములు సీసము నుంచి చూర్ణముచేసి ధరించిన గరుడునివలె దివ్యదృష్టి వచ్చును. ఇది చేయువిధ మిట్టులు — త్రిఫలోదకములో గుంటకలగరాకురసములో నేతికల్కములో తేనెలో మేకపాలలో గోమూత్రములో దినదినము నేడు రోజులవఱకును సీసమును తపింపఁజేసి పిమ్మట శలాకను చేసి ఒక్కఁ దానిచేగాని అంజనముతోఁగాని కన్నులకు తగిల్చికొనుచుండినన యనరోగముల నన్నిటిని పోగొట్టును.

## చించాదిచూర్ణము.

చించాపత్రరసం నిధాయ విమలే చౌదుంబరే భాజనే, మూలం తత్ర నిఘృష్టసైంధవయుతం గాంజ్యం విశోష్యాతపే, తచ్చూర్ణం విమలాంజనేన సహితం నేత్రాంజనే శస్యతే, కాచార్జునపిచ్చికే సతిమిరే స్రావం చ నిర్వాపయేత్. 150. చిత్రాసష్ఠీయోగే సైంధవ మమలం విచూర్ణ్య తేనాక్షి, శమమంజనేన తిమిరం గచ్ఛతి వర్షాదసాధ్య మపి. 151. దద్యాదుశీరనిర్యూహే చూర్ణితం కణాసైంధవం, తచ్ఛృతం సఘృతం భూయః పచే త్క్షౌద్రం క్షిపే ద్ఘనే. 152. శీతే తస్మిన్ హిత మిదం సర్వజే తిమిరేంజనం, ధాత్రీరసాంజనక్షౌద్రసర్పిర్భి స్తు రసక్రియా. 153. పిత్తానిలాక్షిరోగఘ్నీ తైమిర్యపటలాపహా.

చింతాకురసమును మేడిపాత్రలో పోసి సైంధవలవణమును చితిసెనగవేరును నూరి కలిపి ఎండలో నెండించి కన్నులలో వేసికొనిన గ్రుడ్డిఅర్మము పిచ్చటము తిమిరముస్రావము మున్నగు నన్నియును తొలగును. చిత్తానక్షత్ర షష్ఠీయోగమునందు సైంధవలవణమును చూర్ణముచేసి వేసికొని సంవత్సరములో అసాధ్యమైన తిమిరరోగమైనను నశించును. వట్టివేళ్ళనిర్యూహామునందు సైంధవలవణమును పిప్పలిచూర్ణమును కలిపి నేతిని పోసి పక్వము చేసిగట్టి పడినపిమ్మట తేనెను వేయవలయును. దీనిచల్లారిన పిమ్మటవాడినచో తిమిరరోగములను నశింపఁజేయును. ఉసిరిక రసాంజనము తేనె నేయి వీటిని రసక్రియను

చేసికంటిలో వైచికొనినచో పిత్తవాతోత్పన్నములగు నేత్రరోగములు తిమిరములు పటలనులు తొలగిపోవును.

### శృంగిబేర నస్యాదులు.

శ్లో. శృంగిబేరం భృంగరాజం యష్టితైలేన మిశ్రితం. 154. నస్య మేతేన దాతవ్యం మహాపటలనాశనం, లింగనాశే కఫోద్భూతే యథావ ద్విధిపూర్వకం. 155. విద్ధ్వా దైవకృతే ఛిద్రే నేత్రం స్తన్యేన పూరయేత్, తతో దృష్టేషు రూపేషు శలాకా మాహరే చ్ఛనైః. 156. నయనం సర్పిషాభ్యజ్య వస్త్రపట్టేన వేష్టయేత్, తతో గృహే నిరాబాధే శయితో త్తాన ఏవ చ. 157. ఉద్గార కాస క్షవథుష్ఠీవనోత్కంపనాని చ, తత్కాలం నాచరే దూర్ధ్వం యంత్రణా స్నేహపోతవత్. 158 త్ర్యహాత్త్ర్యహా ద్ధారయే త్తు కషాయై రనిలాపహైః, వాయో ర్భయా త్ర్యహః దూర్ధ్వం స్నేహయే దక్షి పూర్వవత్. 159. దశరాత్రం తు సంయమ్య హితం దృష్టిప్రసాదనం, పశ్చా త్కర్మ చ సేవేత లఘ్వన్నం చాపి మాత్రయా. 160. రాగ శ్శోఫోర్బుధం శోథో బుద్బుదం కేకరాక్షితా, అధిమంథాదయ శ్చాన్యే రోగా స్స్యు ర్దుష్టవేధజాః. 161. అహితాచారతో వాపి యథాస్వం తా మపాచరేత్, రుజాయా మక్షిరోగేవా భూయో యోగా న్నిబోధ మే. 162.

అల్లము గుంటకలగర మధుకము వీటియందు సిద్ధముచేసినతైలమును నస్యముగా నిచ్చిన ఘోపటలములు నశించును. కఫోత్పన్నములగు లింగనాశమునందు యథావిధిగాదైవకృతరంధ్రమును వేధనచేసి స్తన్యముతో పూరింపవలయును. రూపములు కనుపింపసాగగనే కడ్డీని లాగివేయవలసినది. పిమ్మట వాయ్వాదిబాధ లేనిఇంటిలో పరుండఁ బెట్టవలయును. అప్పుడు రోగి కేకరించుట దగ్గుట తుమ్ముట చీదుట వడకుట మున్నగు వానిఁ జేయరాదు. బొమ్మలాగున కదలక యుండవలెను. పిమ్మట మూడురోజులైన తరువాత నేత్రమును వాతహరములగు కషాయములతో నిండించి పిమ్మట వాతము చేయకుండుటకై ఇంకను మూడురోజులు తైలముతో నిండించవలెను. ఇట్లుపదిదినములు గడచినపిమ్మట చక్కని దృష్టియలవడును. తరువాతకూడ మాత్రానుసారముగా తేలికపదార్థమును భుజింపవలయును. విపరీతముగా బ్రవర్తించెనేని ఎఱుపుచోషముఅర్బుదమువాపుబుద్బుదము కేకరాక్షిత్వము అధిమంథము మున్నగు దుష్టరోగములు పుట్టును. ఈరోగములను పోగొ

ట్టుకొనుటకై అపథ్యవస్తువులను సేవింపరాదు. కంటిపోటు రోగమునందు చేయఁదగిన యోగముల నింకను వినుఁడు.

## దూర్వారసాదులచేత ముఖలేపము.

శ్లో. కల్కితా స్సఘృతా దూర్వా యవగైరికశారిణాః, సుఖలేపాః ప్రయోక్తవ్యా రుజా రోగోపశాన్తయే. 163. పయస్యా శారిబాపత్రమంజిష్ఠామధుకై రపి, అజాక్షీరాన్వితై ర్లేపః సుఖోష్ణః పథ్య ఉచ్యతే. 164. వాతఘ్నసిద్ధే పయసి సిద్ధం సర్పి శ్చతుర్గుణే, కాకోల్యాదిప్రతీవాపం ప్రయుంజ్యాత్సర్వకర్మసు. 165. శామ్యత్యేవం న చేచ్ఛూలం స్నిగ్ధస్విన్నస్య మోక్షయేత్, తతః శిరాం దహేచ్చాపి మతిమాన్ కీర్తితాం యథా. 166. దృష్టే రతః ప్రసాదార్థ మంజనే శృణు మే శుభే.

గరికె యవలు గైరికము మను బాల వీటిని నూరి నేతిలో కల్కమును చేసి బాధానివృత్తికై సుఖపూర్వకముగా లేపనఁజేయవలయును. పాలచెట్టు మను బాలాకులు మంజిష్ఠము యష్టిమధుకము వీటిని మేకపాలతో నూరి సుఖోష్ణముగా లేపన చేయవలయును. వాతఘ్నములగువానిచేత సిద్ధము చేయఁబడిన పాలలో నాలుగురెట్లలో నేతిని సిద్ధము చేసి అందు కాకోల్యాదిగణపు ఔషధములను నూరి కలపవలయును. పిమ్మట దీనిని నేత్రకార్యములలో వినియోగపెట్టవలయును.

## వర్త్యంజనము.

శ్లో. మేషశృంగస్య పత్రాణి శిరీషధవయో రపి. 167. మూలత్వా శ్చాపి తుల్యాని ముక్తా వైడూర్య మేవ చ, అజాక్షీరేణ సంపిష్య తామ్రే సప్తాహ మావపేత్. 168. ప్రణిధాయ తు తద్వర్తిం యోజయే దంజనే భిషక్, స్రోతోజం విద్రుమం ఫేనం సాగరస్య మనఃశిలాః. 169. మరిచాని చ తద్వర్తిం కారయే త్పూర్వవ ద్భిషక్, రసాంజనం ఘృతం క్షౌద్రం తాలీసం స్వర్ణగైరికం. 170. గోశకృద్రససంయుక్తం పిత్తోపహతదృష్టయే.

మేషశృంగపుపత్రములును దిరిసెన చండ్ర వీటిఆకులును జాజియాకులును సమానముగా గ్రహించి ముత్తెములు వైడూర్యమణి వీటిని సమానభాగములుగా గ్రహించి ఏడు దినములవరకు రాగిపాత్రలో మేకపాలతో తడిపియుంచి పిమ్మట నూరి వత్తిచేసి

వేసికొనిన హితకరము. శంఖము ముద్గములు సముద్రఫేనము మణిశిల మిరియములు వీటిని వత్తిచేసి వేయుట మంచిది. లేనిచో రసాంజనము నేయి తేనె తాడిశపత్రి స్వర్ణగైరికము వీటిని నూరి పేడరసములో కలిపి వత్తిని చేసి ఆవత్తితో పిత్తోపహతములగు దృష్టులు శాంతించును.

## గుటికాంజనము.

శ్లో. నలినోత్పలకింజల్కం గోశకృద్రససంయుతం. 171. గుడికాంజన మేత త్స్యా ద్దినరాత్ర్యంధయో ర్హితం, నదీజశంఖత్రికటూ న్యథాంజనం మనఃశిలా ద్వే చ నిశే గవాం శకృత్, సచందనేయం గుడికాథ చాంజనే ప్రశస్యతే రాత్రిదినే ష్వపశ్యతాం. 172. కణా చ్ఛాగయకృన్మధ్యే పక్వా తద్రసపేషితా, అచిరా ద్ధన్తి నక్తాంధ్యం తద్వ త్సక్షౌద్రమూషణం. 173. పచేత్తు గాఢం హి యకృత్ప్రియుక్తం ప్రకల్పితం మాగధకాభి రంజనా, నిషేవితం తత్సకృ దంజనేన నిహన్తి నక్తాన్ధ్య మసంశయం ఖలు. 174. దధ్నా నిఘృష్టం మరిచం రాత్ర్యంధ్యాంజన ముత్తమం, తాంబూలయుక్తం ఖద్యోతభక్షణం చ తదర్ధకృత్. 175. శఫరీమత్స్యతుండో నక్తాంధ్యం చాంజనా ద్వినిహంతి, తద్వద్రామఠ టంకణ కర్ణమలం చైకశోంజనా న్మధునా. 177. కేశరాజాన్వితం విద్ధం మత్స్యాండం హస్తి భక్షితం, నక్తాంధ్యం నియతం నృణాం సప్తాహా త్పథ్యసేవినాం. 177.

కమలకేసరములను ఆవుపేడలో కలిపి ఉండలుచేసి కంటిలో నుంచికొనిన పగలు దృష్టి చక్కగా నగుపడును. రేచీకటియు నశించును. అత్యుత్పన్నమగు శంఖము శొంఠి మిరియములు పిప్పళ్లు అంజనము మణిశిల పసపు మానిపసపు పేడ చందనము వీటిని వత్తి చేసి కంటిలో వేసికొనిన దివారాత్రములును దృష్టిస్వచ్ఛముగా నుండును. పిప్పళ్లను మేకకడుపులో (కుడిదిక్కుననున్న) మాంసమునందు పక్వముచేసి కంటిలో వైచికొనిన నిశ్చయముగా రేజీకటులు నశించును. మిరియమును పెరుగులో నూరి కాటుకగా వేసికొన రేజీకటులు నశించును. తాంబూలములో మిణుగురుపురుగును తినినను చేపయొక్క క్షారమును కంటిలో వేసికొనిన రేజీకటులు నశించును. ఇంగువ సుహాగపుష్పము చెవిగుబిలి వీటి నొక్కొక్కదానిని తేనెతో చాది వేయుట మంచిది.

### త్రిఫలాఘృతము.

త్రిఫలాక్వాథ ల్కాభ్యాం సపయస్కం శృతం ఘృతం, తిమిరా ణ్యచిరా ద్ధంతి పీత మేత న్నిశాముఖే. 178

త్రిఫలాకషాయ కల్కములలో పాలు సహితముగా నేతిని కాచి సాయంకాలములయందు త్రాగిన సంపూర్ణముగా తిమిరరోగములు నశించును.

### మహాత్రిఫలాఘృతము.

**శ్లో.** త్రిఫలాయారసప్రస్థం ప్రస్థం భృంగరసస్య చ, వృషస్య చ రసప్రస్థం శతావర్యా శ్చ తత్సమం. 179. అజాక్షీరం గుడూచ్యా శ్చ ఆమలక్యా రసం తథా, ప్రస్థం ప్రస్థం సమాహృత్య సర్వైరేభిర్ఘృతం పచేత్. 180. కల్కః కణాసితాద్రాక్షా త్రిఫలా నీల ముత్పలం, మధుకం క్షీరకాకోలీ మధుపర్ణీ నిదిగ్ధికా. 181. తత్సాధు సిద్ధం విజ్ఞాయ శుభే భాండే నిధాపయేత్, ఊర్ధ్వపాన మధఃపానం మధ్యపానం చ శస్యతే. 182. యావన్తో నేత్రరోగా స్తాన్పానా దేవాపకర్షతి, సరక్త రక్తదుష్టే చ రక్తే చాతిస్రుతేఽపి చ. 183. నక్తాంధ్యే తిమిరే కాచే నీలికా పటలార్బుదే, అభిష్యందేఽధిమంథే చ పక్ష్మకోపే సుదారుణే. 184. నేత్రరోగేషు సర్వేషు వాతపిత్తకఫేషు చ, అదృష్టిం మందదృష్టిం చ కఫవాతప్రదూషితాం. 185. స్రవతో వాతపిత్తాభ్యాం సకండ్వాసన్నదూరదృక్, గృధ్రదృష్టికరం సద్యో బలవర్ణాగ్నివర్ధనం. 186. సర్వనేత్రామయం హన్యా త్త్రిఫలాద్యం మహా ఘృతం.

త్రిఫలములరసము 16 ప॥ గుంటకలగరాకు రసము 16 ప॥ అడ్డసరము రసము 16 పల॥ పిల్లపీచరరసము 16 ప॥ మేకపాలు 16 ప॥ తిప్పతీగెరసము 16 పలములు ఆమ్లరసము 16 ప॥ ఉసిరికరసము 16 ప॥ చొ॥ తెచ్చి ఈరసమునందు నేతిని పక్వముచేయవలయును. ఆనేతిలో పిప్పళ్లు చక్కెర ద్రాక్ష త్రిఫలములు నల్లకలువలము మధుకము క్షీరకాకోలి పాలవాకుడు వీటిని కల్కమును చేసి పక్వముగునపుడు కలిపి చక్కగా పచనమైన పిమ్మట నొకపాత్రలో నుంచవలయును. పిమ్మట నీఘృతమును ఊర్ధ్వపానముగాని అధఃపానమునుగాని మధ్యపానమునుగాని చేయువలయును. దీనిని త్రాగుటచే నేత్రరోగము లన్నియును నశించును. రక్తసహితమైన దానియందును రక్తదుష్టమునందు అతిస్రావమునందును రేచీకటియందును తిమిరము కాచము నీలికపటలము అర్బుదము అభిష్యందము అధిమంథము వీటియందును భయంకరమగు పక్ష్మప్రకోపమునందును సమస్త

వాతపిత్తకములగు నేత్రరోగములయందును అదృష్టి మందదృష్టి వాతపిత్తస్రావము జల అసన్నదూరదృక్త్వము మున్నగువాని నియ్యది తొలగించును.

## గండవ త్రైఫలఘృతము.

శ్లో. త్రిఫలాత్ర్యూషణం ద్రాక్షా మధుకం కటురోహిణీ. 187. ప్రపౌండరీకం సూక్ష్మైలా విడంగం నాగకేసరం, నీలోత్పలం శారిబే ద్వే చందనం రజనీద్వయం. 188. కార్షికైః పయసా తుల్యం త్రిగుణం త్రిఫలారసం, ఘృతప్రస్థం పచే దేత త్సర్వనేత్రరుజాపహం. 189. తిమిరం దోష మాస్రావం కామలాం కాచ మర్బుదం, వీసర్పం ప్రదరం కండూం రక్తం శ్వయథు మేవ చ. 190. ఖాలిత్యం పలితం చైవ కేశానాం పతనం తథా, విషమజ్వరమర్మాణి శుక్రం చాశు వ్యపోహతి. 191. అన్యే చ బహవో రోగా నేత్రజా యే చ వర్త్మజాః, తా న్సర్వా న్నాశయ త్యాశు భాస్కర స్తిమిరం యథా. 192. నచైవాస్మా త్పరం కించి దృషిభిః కాశ్యపాదిభిః, దృష్టిప్రసాదనం దృష్టం యథా స్యా త్త్రైఫలం ఘృతం 193. ఫలత్రికాభీరుకషాయసిద్ధం కల్కేలయష్టిమధుకస్య యుక్తం, సర్పిస్సమం క్షౌద్రచతుర్థభాగం హన్యా త్త్రిదోషం తిమిరం ప్రవృద్ధం. 194.

త్రిఫలములు శొంఠి మిరియములు పిప్పళ్లు ద్రాక్ష మధుకము కటకరోహిణి కమలములు చిన్నయేలకులు వాయువిడంగములు నాగకేసరములు నల్లకల్వలు మనుబాల చందనము పసపు మ్రానిపసపు వీటిని ఒక్కొకతులము చొ॥ వీటిఅన్నిటితో సమానముగా పాలను దానికి మూడురెట్లు త్రిఫలములరసమును చేర్చి పక్వముచేసి 16 పలములనేతిని పక్వముచేయవలయును. ఇయ్యది నేత్రరోగములను సంపూర్ణముగా పోగొట్టును. తిమిరదోషములు ఆస్రావములు కామెరలు కాచము అర్బుదము విసర్పము ప్రదరము కండూరక్తవాతము ఖాలిత్యము నెండ్రుకలనెఱపు విషమజ్వరములు మున్నగునవి నశించు. కాశ్యపాదిఋషులు ఈత్రిఫలాఘృతముకంటె మించిన యౌషధము నేత్రములకు హితకరమైనది లేదు. త్రిఫలములు పిల్లపీచర వీటికషాయములో మధుకము వీటికషాయములో సమానభాగములను నేతిని కలిపి పక్వముచేసి నాలవపాలు తేనెను కలుపవలయును. ఈనేయి త్రిదోషజములగు తిమిరరోగములు నశించును.

## భృంగరాజతైలము.

శ్లో॥ భృంగరాజరసప్రస్థే యష్టీమధుపలేనచ, తైలస్య కుడవం పక్వం సద్యోదృష్టిం ప్రసాదయేత్. 195. నస్యాద్వలీపలితఘ్నం మాసేనైతన్న సంశయః, గవాం శకృత్క్వాథవిపక్వ ముత్తమం హితం చ తైలం తిమిరేషు నస్తతః, ఘృతం హితం కేవల మేవ పైత్తికే తథాణుతైలం పవనాసృగుత్థయోః. 196.

16 పలముల గుంటకలగరాకురసములో నొక పలము మధుకల్కమును కలిపి 4 పలముల తైలమును పక్వము చేయవలయును. ఈతైలమును నస్యము నిచ్చిన దృష్టి స్వచ్ఛమగును. ఒక నెల సేవించిన వలీపలితరోగములు నశించును. ఆవుపేడరసములో తైలమును పక్వముచేసి యుపయోగించిన తిమిరరోగములు నశించును. కేవలపిత్తజము లగు తిమిరరోగములకును ఈచికిత్సనే చేయవలయును.

## నృపవల్లభతైలము.

శ్లో॥ జీవకర్షభకౌ మేధా ద్రాక్షాంశుమతీ నిదిగ్ధికా బృహతీ, మధుకం బలా విడంగం మంజిష్ఠా శర్కరా తథా రాస్నా. 197. నీలోత్పలం శ్వదంష్ట్రా ప్రపౌండరీకం పునర్నవాలవణం, పిప్పల్యః సర్వేషాం భాగై రక్షాంశికైః పిష్టైః. 198. తైలం యది వా సర్పి ర్దత్వా క్షీరం చతుర్గుణం పక్వం, తిమిరం పటలం కాచం నక్తాంధ్యం చార్బుదం తథాంధ్యం చ. 199. శ్వేతం చ లింగనాశం నాశయతి పరం చ నీలికావ్యంగం, ముఖనాసాదౌర్గంధ్యం పలితం చాకాలజం హనుస్తంభం. 200. కాసం శ్వాసం శోషం హిక్కాస్తంభం తథాత్యయం నేత్రే, ముఖజైర్త్వమర్థభేదం రోగం శోపఘ్నం శిరఃస్తంభం. 201. రోగానథోర్ధ్వజత్రోః సర్వా నచిరేణ నాశయతి, నస్యార్థం కుడవం తైలం పక్తవ్యం నృపవల్లభే. 202. అక్షాంశైః శాణికైః కల్కై రన్యే భృంగాదితైలవత్.

ఘృతము జీవక ఋషభకము లను గంధద్రవ్యములు మేద ద్రాక్ష గొలిమిడి వాకుడు మధుకము ముత్తవపులగము వాయువిడంగములు మంజిష్ఠ చక్కెర రాస్న నీలకమలములు పల్లేరు గలిజేరు లవణము వీటిని కాలుపలము చొప్పున నూరి నేతిని గాని నూనెను గాని అందు కాచి ఈతైలముకంటె నాలుగురెట్లు పాలను కలిపి పక్వము చేసి సేవించినచో తిమిరములు పటలములు మున్నగునవి నశించును. ముఖరోగములు అర్ధాంగవాయువులు

నశించును. ఇందు తైలమునుగాని ఘృతమునుగాని నాలుగుపలములను స్వీకరింప వలయును. కొందఱాచార్యులు భృంగరాజతైలమువలె సిద్ధము చేయవలయు ననిరి.

### అభిజిత్తైలము.

శ్లో. తైలస్య పచే త్కుడవం మధుకస్య పలేన కల్కపిష్టేన.
203. ఆమలకీరసప్రస్థం క్షీరప్రస్థేన సంయుతం కృత్వా, అభిజి న్నామ్నా తైలం తిమిరం హన్యా న్మునిప్రోక్తం. 204. వినులాం కురుతే దృష్టిం నష్టా మప్యానయే దిదం శీఘ్రం.

ఒకపలము మధుకకల్కములో నాలుగుపలముల నూనెను ఉసిరికరసమును పాలను 16 పలములను కలిపి పక్వముచేసి సేవించిన తిమిరరోగములు నశించును. నష్టమైన దృష్టి మఱల వచ్చును.

### శుక్లజరోగములకు ఛేదనాదులు.

శ్లో. అర్మ చేతు ఛేదనీయం స్యా త్కృష్ణప్రాప్తం భవే ద్యథా, బడిశావిద్ధ మున్నమ్య త్రిభాగం చాత్ర వర్జయేత్. 205. పిప్పలీత్రిఫలాలాక్షా లోహచూర్ణం ససైంధవం, భృంగరాజరసే పిష్టం గుడికాంజన మిష్యతే. 206. అర్మ సతిమిరం కాచం కండూంశుక్లం తదర్జునం, అజకాం నేత్రరోగాం శ్చ హన్యా న్నిరవశేషతః. 207. పుష్పాఖ్య తార్క్ష్యజ సితోదధి ఫేనశంఖ సింధూత్థ గైరికశిలా మరిచై స్సమాంశైః, పిష్టై శ్చ మాక్షికరసేన రసక్రియేయం హంత్యర్మ కాచ తిమిరార్జునవర్త్మ రోగాన్. 208. కాంతస్య సప్తమః పాదై ర్విరేకాలేపసేచనైః, స్వాదుశీతైః ప్రశమయే చ్ఛుక్తికా మంజనై స్తతః. 209. ప్రవాలముక్తా వైదూర్య శంఖస్ఫటికచందనం, సువర్ణరజతం క్షౌద్ర మంజనం శుక్తికాపహం. 210. శంఖః క్షౌద్రేణ సంయుక్తః కతకః సైంధవేన వా, సితయార్ణవఫేనో వా పృథగంజన మర్జునే. 211. పిత్తం విధి మశేషేణ కుర్యా దర్జునశాంతయే, వైదేహీ శ్వేతమరిచం సైంధవం నాగరం సమం. 212. మాతులుంగరసైః పిష్ట మంజనం పిష్టకాపహం.

అర్మరోగము నల్లగుడ్డుపైకి ప్రాకిన శస్త్రము చేయుట మంచిది. ఎత్తిపట్టికొని బడిశ మనుశస్త్రముచేత ఛేదింపవలయును. పిప్పళ్లు త్రిఫలములు లత్తుక లోహచూర్ణము సైంధవలవణము వీటిని గుంటగలగరాకురసముతో నూరి సిద్ధముచేసి సేవించిన అర్మ

ము తిమిరము కాచము దురద శుక్రము తెలుపు అజక మున్నగు నేత్రరోగములను పో గొట్టును. సోంపు రసాంజనము మిశ్రీ సముద్రఫేనము శంఖము సైంధవలవణము గైరిక ము శిలాజిత్తు మిరియములు వీటిని సమభాగముగను తేనెలో కలిపి కన్నులలో వేసి కొనిన అర్మము కాచము తిమిరము పూవులు మున్నగు నేత్రరోగములు తొలగును. రే ణుక బీజములతో నైన నేతిని త్రాగుటచేతను విరేచనములు లేపనలు సేచనలు చేయుట చేతను శుక్తి మున్నగు రోగములు నశించును. పెసలు ముత్తెములు వైడూర్యమణులు శం ఖము కర్పూరము చందనము బంగారము వెండి తేనె వీటినికలిపి నూరి అంజనముగఁజేసి వేసి కొనిన శుక్తికలు నశించును. లేనిచో శంఖమును నూరి తేనెలో కలిపి కన్నులలో వేసికొన వలయును. మిశ్రి సముద్రఫేనము వీటిని నూరి కాటుకగా వేసికొనిన పూవులు నశిం చును. పూవులు శాంతించుటకై తలుచుగా పిత్తశాంతి చికిత్సను చేయవలయును. పి ప్పళ్లు తెల్లమిరియములు సైంధవలవణము శొంఠి వీటిని మాచీరసములో నూరికాటుక వేసి కొనిన పిష్టకములు నశించును.

## సంధిజముల నుపనాహభేదనాదులు.

శ్లో. భిత్త్వోపనాహం కఫజం పిప్పలీమధుసైంధవైః. 213. విలి ఖేన్మండలాగ్రేణ ప్రచ్ఛయేద్వా సమంతతః, పథ్యాక్షధాత్రీఫలమధ్య బీజై స్త్రిద్వ్యేకభాగై ర్విదధీత వర్తిం, తయాంజయే దశ్రుమతి ప్రగా ఢ మక్ష్ణో ర్హరే త్కృష్ట మపి ప్రకోపం. 214. స్రావేషు త్రిఫలాక్వాథం యథాదోషం ప్రయోజయేత్, క్షౌద్రేణాజ్యేన పిప్పల్యా మిశ్రం వి ధ్యే చ్ఛిరాం తథా. 215. త్రిఫలామూత్రకాసీససైంధవైః సరసాంజ నైః, రసక్రియా క్రిమిగ్రంథౌ భిన్నే స్యా త్ప్రతిసారణం. 216.

కఫోత్పన్నములగు నుపనాహములకు భేదనమును చేసిపిప్పళ్లుసైంధవలవణము తే నె వీటినందు నింపవలయును. కరక్కాయలు 1 భాగము తాడి 2 భాగను సిరిక 3 భాగ ములు వీటిని మధ్యబీజములను క్రమముగామూడు రెండు ఒక భాగమును గ్రహించి నూరి వత్తిచేసి ధరించిన నేత్రములోని యాశువులను తొలగించును.

## ప్రతిసారణాదులు.

శ్లో. స్విన్నాం భిత్త్వా వినిష్పీడ్య భిన్నా మంజననామికాం, శిలైలానతసింధూత్థై స్సక్షౌద్రైః ప్రతిసారయేత్. 217. రసాంజనమ ధుభ్యాం చ భిన్నాం వా శస్త్రకర్మణా, ప్రతిసా ర్యాంజనై ర్యుంజ్యా దుష్ణై ర్దీపశిఖోద్భవైః. 218. స్వేదయే ద్ఘృష్టయాంగుల్యా హరే ద్ర

క్తం జలౌకసా, రోచనాక్షారతుత్థాని పిప్పల్యః క్షౌద్ర మేవ చ.219. ప్రతిసారణ మేకైకం భిన్నేన గణ ఇష్యతే,నిమిషే నాసయా పేయం సర్పి స్తేన చ పూరణం. 220. స్వేదయిత్వా బిసగ్రంథిం ఛిద్రాణ్యస్య నిరాశ్రయం, పక్వం భిత్వా తు శస్త్రేణ సైంధవే నావచూర్ణయేత్. 221. వర్త్మావలేఖం బహుశ స్తద్వ చ్ఛోణిత మోక్షణం, పునఃపున ర్విరేకం చ పిల్లరోగాతురో భజేత్. 222. పిల్లీ స్నిగ్ధో వమే త్పూర్వం శిరావ్యధం స్రుతేఽసృజి, శిలారసాంజనవ్యోషగోపిత్తై శ్చక్షు రంజయేత్, హరితాలవచాదారు మురసారసపేషితం, అభయారసపిష్టం వా తగరం పిల్లనాశనం. 223. భావితం బస్తమూత్రేణ సస్నేహం దేవదారు చ, కాకమాచీఫలై కేన ఘృతయుక్తేన బుద్ధిమాన్. 224. ధూపయే త్పిల్లరోగార్తం పతంతి క్రిమయోఽచిరాత్.

అసజనమనుగ్రగమునందు చెమటను పట్టించి భేదన చేసి నిష్పీడనము చేయవలయును. పిమ్మట శిలాజిత్తు ఏలకులు తగరము సైంధవలవణము తేనె వీటితో ప్రతిసారణమును చేయవలయును. లేనిచో శస్త్రకర్మ నెఱిఁగి వైద్యుఁడు రసాంజనము తేనెలతో ప్రతిసారణమును చేయవలయును. ఇట్లు ప్రతిసారణమును చేసి దీపశిఖోద్భవము లగు నుష్ణములో చెమటను పట్టింపవలయును. పిల్లిని రుద్ది ఆవిరిపట్ట వలయును. జెలగలను పట్టించి రక్తమును వెడలింపవలయును. పిమ్మట క్రమముగా గోరోచనము యవక్షారము మైలుతుత్తము పిప్పళ్లు తేనె వీటి నొక్కొక్కదానిని ప్రతిసారణము చేయింపవలయును.

## చూర్ణాంజనము.

శ్లో. రసాంజనం సర్జరసో జాతీపుష్పం మనశ్శిలా. 226. సముద్రఫేనో లవణం గైరికం మరిచాని చ, ఏతత్సమాంశం మధునా పిష్టం ప్రన్నవర్త్మని. 227. అంజనం క్లేదకండూఘ్నం పక్ష్మణాం చ ప్రరోహణం, మస్తకాస్థిచులుక్యా స్తు తుషోదలవణాన్వితం 228. తామ్రపాత్రే ఽంజనం ఘృష్టం పిల్లే ప్రక్లిన్నవర్త్మని, తామ్రపాత్రే గుహామూలం సింధూత్థం మరిచాన్వితం. 229. ఆరనాలేన సంఘృష్ట మంజనం పిల్లనాశనం, హరిద్రే త్రిఫలాం లోధ్రం మధుకం రక్తచందనం. 230. భృంగరాజ

రసే పిష్ట్వా ఘర్షయే ల్లోహభాజనే, తథా తామ్రే చ సప్తాహం కృత్వా వర్తిం రజోఽథవా. 231. పిచ్చిటీధూమదర్శీచ తిమిరోపహా తేక్షణాః, ప్రాత ర్ని శ్యంజయే న్నిత్యం సర్వనేత్రామయాపహం. 232. మంజిష్ఠామధుకోత్పలో దధి కఫత్వ క్సేవ్యగోరోచనా మాంసీచందనశంఖపత్రగిరిమృ త్తాలీసపుష్పాంజనైః, సర్వై రేవ సమాంశ మంజన మిదం శస్తం సదా చక్షుషోః కండూక్లేదమలాశ్రుశోణి తరుజా పిల్లార్మశుక్రాపహం. 233.

రసాంజనము సర్జరసము జాజిపుష్పము మనశ్శిల సముద్రఫేనము ఉప్పు గైరికము వీటిని సమముగా చేకొని తేనెలోనూరి కంటిలో వేసికొనిన క్లిన్నములు వర్త్మరోగములునశించును. చేపతలలోనుండు యెముకను గంజిని ఉప్పునుకలిపి రాగి పాత్రలో నూరి క్లిన్నవర్త్మ మున్నగు వానికుపయోగింప వలయును. కొలపొన్న వేళ్లను రాగిపాత్రలోనూరి సైంధవలవణము మిరియములు కలిపి గంజితో ఘర్షణచేసి అంజనముఁజేసి వేసికొనిన పిల్లరోగములు నశించును. పసపు మానిపసపు త్రిఫలములు లొద్ధ మధుకము రక్తచందనము వీటిని గుంటకలగరాకుపసములో కలిపి లోహపాత్రమునందు గాని రాగి పాత్రములోగాని ఘర్షణచేసి వత్తినిచేసిగాని అంజనము చేసిగాని కంటికి వేసికొనిన పిచ్చిట బూజు గ్రమ్మినట్లుండుట తిమిరము మున్నగునవి సంపూర్ణముగా నశించును. మధుకము మంజిష్ఠము కమలము సముద్రఫేనము తేజపత్రి గోరోచనము జటామాంసి చందనము శంఖము కొండమట్టి తాళిశపత్రి వీటినిసమాంశములను గొని అంజనము చేసి ధరించిన నేత్రములకు హితము. కండువు క్లేదము రక్తపుపీడ మున్నగునవి నశించును.

## తుత్థకాంజనము.

శ్లో. తుత్థకస్య పలం శ్వేతమరిచాని చ వింశతిః, వింశతా కాంచికపలైః పిష్ట్వా తామ్రే నిధాపయేత్. 234. పిల్లా నపిల్లా న్కురుతే బహువర్షోత్థితా నపి, త త్సేకే నోపదేహాశ్రు కండూశోథాం శ్చ నాశయేత్. 235. యాప్యః పక్ష్మోపరోధ స్తు రోమోద్ధరణలేఖనైః, వర్త్మన్యుపచితం లేఖ్యం స్రావ్య ముత్క్లిష్టశోణితం. 236. ప్రవృద్ధాంతర్ముఖం రోమ సహిష్ణో రుద్ధరే చ్ఛనైః, సందంశే నోద్ధరే ద్దృష్ట్వాం పక్ష్మరోమాణి బుద్ధిమాన్. 237. రక్షన్నక్షీదహే త్పక్ష్మ తప్తహేమశలాకయా, పక్ష్మరోగే పునర్నైవం కదాచి ద్రోమసంభవః. 238. ఉత్సంగినీ బహుల

కర్దమవర్త్మనీ చ శ్యావం చ యచ్చ పటుతంత్వీహ బద్ధవర్త్మ, క్లిష్టం చ పోథకియుతం త్వీహ వర్త్మ యచ్చ కుంభికినీ చ సహ శర్కరయా వలేఖ్యాః. 239. శ్లేష్మోపనాహనగణం చవిసం చ భేద్యో, గ్రంథిశ్చ యః క్రిమికృతోంజననామికా చ. 240.

మైలుతుత్తము 1 పలము తెల్లమిరియములు 20 పలములు వీటిని 40 పలముల గంజిలో కలిపి తామ్రపాత్రలో ఘర్షణచేసి అంజనముగా వేసికొనిన బహుకాలము నుండియుండిన పిల్లనేత్రరోగము నశించును. లేక ఈ యౌషధులతో సేకము చేసినను ఉసదేహము వాపు మొదలగునవి నశించును. పలకె దలయందు రక్తస్రావమును చేయింపవలయును. ప్రవృద్ధములగు అంతర్ముఖరోగములను బుద్ధిమంతుడగు వైద్యుడు చిమటలాంటికత్తెరతో వెడలింపవలయును. గరదగల గ్రంథులు మొదలగువానియందు లేఖనకర్మమున్నగు చికిత్సలు జేయవలయును.

## వర్త్మజములకు ఘృతాదిచోతనము.

శ్లో. ఘృతైసైంధవచూర్ణేన కఫోనాహం పునఃపునః, విలిఖేన్మండలాగ్రేణ పచ్ఛమే ద్వా సమంతతః. 241. పటోలామలకక్వాథైరాశ్చోతనవిధిర్హితః, ఫణిజ్జకరసం స్య రసైః పోథకినాశనః 242. అనాహపిడకాం స్విన్నాం తిర్యగ్భిత్వా గ్నినా దహేత్, అర్శస్తథా వర్త్మనామ్నా శుష్కార్శోఽర్బుదమేవచ. 243. మండలాగ్రేణ తీక్ష్ణేన మూలే ఛింద్యాద్భిషక్ శనైః, సిందూరొత్పిప్పలీకుష్ఠచూర్ణనీ త్రిఫలారసైః. 244. సురామండేన వర్తిస్స్యాత్ శ్లేష్మాభిష్యందనాశనీ, పోథకీ వర్త్మోపరోధ క్రిమిగ్రంథకతూణకే. 245.

కఫోనాహరోగమును ఘృతసైంధవచూర్ణముచేత పోగొట్టవలయును. పటోలము ఉసిరికవీటికషాయముతోగాని ఫణిజ్జకరసముతోగాని పోథిగ్రంథులను పోగొట్టవలయును అనాహపిడికలను చెమ్మట మొదలగువానివలన పోగొట్టవలయును. నేత్రపుఅర్బుదము వర్త్మార్శము శుష్కార్శము ఈరోగములను మొదల శస్త్రముచేసి పిదప సైంధవలవణము మున్నగు నౌషధులను త్రిఫలరసములో తడిపిమదిరామండములో వత్తిచేసి ధరించిన అభిష్యందాదిరోగములు నశించును.

ఇట్లు చక్రదత్తయందు నేత్రరోగాధికారప్రకరణము ముగిసెను.

---

# ౫౬. శిరోరోగాధికారము.

వాతశిరోరోగమునకు చికిత్స. ౧

శ్లో. వాతికే శిరసో రోగే స్నేహస్వేదాన్ సనావనాన్, పానాన్నముపహారాంశ్చ కుర్యాద్వాతామయాపహాన్. 1. కుష్ఠమేరండ తైలం చ లేపాత్కాంజికపేషితం, శిరోర్తిం నాశయత్యాశు పుష్పం వా ముచుకుందజం. 2. పంచమూలీశృతం క్షీరం నస్యే దద్యాచ్ఛిరోగదే, ఆశిరోవ్యాయతం చర్మ కృత్వాష్టాంగులముచ్ఛ్రితం. 3. తేనావేష్ట్య శిరోఽధస్తాన్మాషకల్కేన లేపయేత్, నిశ్చలస్యోపవిష్టస్య తైలైరుష్ణైః ప్రపూరయేత్. 4 ధారయేదారుజః శాంతేర్యామమాత్రమేవ వా, శిరోబస్తిర్జయత్యేష శిరోరోగం మరుద్భవం. 5. హనుమన్యాక్షికర్ణార్తి మర్దితం మూర్ధకంపనం, తైలేనాపూర్య మూర్ధానం పంచమాత్రాశతాని చ. 6. తిష్ఠేచ్ఛ్లేష్మణి పిత్తేఽష్టౌ దశ వాతే శిరోగదీ, ఏకమేవ విధిః కార్యః తథా కర్ణాక్షిపూరణే. 2.

వాతిక శిరోరోగమునకు స్నేహస్వేదములు పానములును హితములగు భోజ్యన్నపానములును చేయవలయును. కోష్ఠు ఆముదమును గంజితో నూరి లేపనచేసి శిరఃపీడలు తొలగును. లేనిచో ముచికుందవృక్షపుపూలను లేపన చేయవలయును. పంచమూలములలో పాలను కషాయముగా గాచి నస్యము నిచ్చిన శిరోరోగములు నశించును. తలచే నలుప్రక్కలను రాగలచర్మముతో కట్టి క్రింది వైపున మినుముల కల్కమును లేపనను సి రోగినిస్వస్థునిగా కూర్చుండబెట్టి ఆచర్మముపైని వెచ్చనినూనెను పోయవలయును. రోగికి బాధ యుపశమిల్లువఱకును జాముగాని రెండుజాములుగాని ఉంచిన సమస్తశిరోరోగములు నశించును. తలత్రిప్పుడు మన్నగునవి పోవుటకు ఈరీతిగనే తైలముతో తలను పూరింపవలయును. ఇయ్యదివినూరు మాత్రల తైలమును కఫోత్పన్నములును, పిత్తోత్పన్నములును ఎనిమిది వందలవాతపు శిరోరోగములను పోగొట్టును. దీనిచే కర్ణములకును నేత్రములకును చేయవలయును.

## పైత్తిక శిరోరోగములకు.

శ్లో. పైత్తే ఘృతం పయః సేకాః శీతలేపాః సనావనాః, జీవనీయాని సర్పీంషి పానాన్నం చాపి పిత్తనుత్. 8. పిత్తాత్మకే శిరోరోగే స్నిగ్ధం సమ్యగ్విరేచయేత్, మృద్వీకాత్రిఫలేక్షూణాం రసైః క్షీరైః ఘృతైరపి. 9. శతధౌతఘృతాభ్యంగః శీత వాతాది సేవనం, శీతస్పర్శాశ్చ సంసేవ్యాః సదా దాహార్తిశాంతయే. 10. చందనోశీరయష్ట్యాహ్వాబలావ్యాఘ్రనఖోత్పలైః, క్షీరపిష్టైః ప్రదేహః స్యాచ్ఛృతైర్వా పరిషేచనం. 11. మృణాలబిసశాలూక చందనోత్పలకేసరైః, స్నిగ్ధశీతైః శిరో దిహ్యాత్తద్వదామలకోత్పలైః. 12. యష్ట్యాహ్వాచందనానంతా క్షీరసిద్ధం ఘృతం హితం, నావనం శర్కరాద్రాక్షామధుకైర్వాపి పిత్తజే. 13. త్వక్పత్రశర్కరాపిష్టా నావనం తండులాంబునా, క్షీరసర్పిర్హితం నస్యం రసా వా జాంగలాః శుభాః. 14. రక్తజే పిత్తవత్సర్వం భోజనాలేపసేచనం, శీతోష్ణయోశ్చ వ్యత్యాసో విశేషో రక్తమోక్షణం. 15.

పైత్తికశిరోరోగములందు నేతిని పాలను సేకము చేయవలయును. శీతలలేపములు నస్యవిధులు జీవనీయగణపు టౌషధులచేత సిద్ధము చేయఁబడిన యన్నపానములు సేవింపవలయును. పిత్తజశిరోరోగములందు స్నిగ్ధవుషధులు ద్రాక్ష త్రిఫలములు చెఱకు వీటితో విరేచనములను చేయించుట మంచిది, శిరోదాహములు శాంతించుటకై నూరు పర్యాయములు శుద్ధిచేసిన నేతిని రుద్దవలయును. చందనము వట్టివేళ్లు మధుకము ముత్తువపులగము వాకుడు కమలములు వీటిని పాలతో నూరి లేపన చేయవలయును. లేనిచో ఈయౌషధులనే పాలతో కషాయముచేసి సేకము చేయవలయును. కమలనాళములు గడ్డలు జాజికాయ చందనము కమలకేసరములు వీటిని నేతిలో పక్వముజేసి శీతలలేపములను చేయవలయును. ఈఘృతమును నస్యమిచ్చుటచేత గాని కండచక్కెర ద్రాక్ష యష్టిమధుకము వీటికషాయమును నస్యమిచ్చుటచేతఁగాని శిరోరోగములు నశించును. తేజపత్రి కలకండ నీటిని బియ్యపుకడుగుతో నూరి నస్యవిధిఁ జేసినచో హితమగును. రక్తజములగు శిరోరోగములందు సంపూర్ణములగు భోజనలేపనాదులను పిత్తవిధానపురీతిని చేయవలయును. శీతోష్ణముల మార్పును రక్తస్రావమును విశేషము.

## కఫశిరోరోగములు.

శ్లో. కఫజే లంఘనం స్వేదో రూక్షోష్ణైః పాచనాత్మకైః, తక్ష్ణావపీడా ధూమాశ్చ తీక్ష్ణాశ్చ కవలాహితాః. 16. అచ్ఛం చ పాయయే త్సర్పిః పురాణం స్వేదయే త్తతః, మధూకసారేణ శిరః స్విన్నం చాస్య విరేచయేత్. 17. కృష్ణాబ్ధిశుండీమధుక శతాహ్వోత్పలపాకలైః, జలపిష్టైః శిరోలేపః సద్యః శూలనివారణః. 18. దేవదారునతం కుష్ఠం నలదం విశ్వభేషజం, లేపః కాంజికసంపిష్టతైలయుక్తః శిరోర్తినుత్. 19. సన్నిపాతభవే కార్యా దోషత్రయహరీ క్రియా, సర్పిఃపానం విశేషేణ పురాణం స్యాదిశంతి హి. 20. త్రికటుక పుష్కర రజనీ రాస్నా సురదారు తురగగంధానాం, క్వాథః శిరోర్తిజాలం నానాపీతో నివారయతి. 21. నాగరకల్కవిమిశ్రం క్షీరం నస్యేన యోజితం పుంసాం, నానాదోషోద్భూతాం శిరోరుజం హన్తి తీవ్రతరాం. 22. నీలోత్పలం చందనకుష్ఠయుక్తం శిరోరుజాయాం సఘృతః ప్రదేహః, ప్రపౌండరీకం సురదారు కుష్ఠం యష్ట్యాహ్వ మేలా కమలోత్పలే చ. 23. శిరోరుజాయాం సఘృతః ప్రదేహో లోహైరకాపద్మక చోరకైశ్చ.

కఫశిరోరోగములకు లంఘనముచేయవలయును. రూక్షములు నుష్ణములు పాచనాత్మకములగు వస్తువులవలన చెమటఁబుట్టింపవలయును. స్వచ్ఛమైన ప్రాతనేయిని త్రాగించి చెమటపట్టించి యష్టిమధుకపు సత్తుతో నస్యము నిప్పింపవలయును. పిప్పళ్లు తుంగముస్తెలు శొంఠి మధుకము పిల్లపీచర కమలములు కోష్ఠు వీటిని నీటితోనూరి లేపనచేసిన శిరశ్శూలలు తొలఁగును. దేవదారువు తగరము కోష్ఠు వట్టివేరు శొంఠి వీటిని గంజితోనూరి తైలమునుకలిపి శిరస్సునకు లేపనచేసినచో శూలము నశించును. సన్నిపాతపు శిరోరోగమునందు త్రిదోషహరములగు చికిత్సలను పురాణఘృతపానమును చేయింపవలయును: త్రికటుకము కమలము పసుపు రాస్న దేవదారువు పెన్నేరు వీటికషాయమును ముక్కుతో పీల్చిన శిరోబాధ లుపశమిల్లును. తగరము కమలములు చందనము కోష్ఠు వీటినినూరి తేనెకలిపి లేపనచేసినను కమలములు దేవదారువు కోష్ఠు మధుకము ఏలకులు వీటి కల్కములో తేనెకలిపి గాని లోహరజము కమలములు కచోరము వీటికల్కములో నేతిని కలిపి గాని లేపనచేసినను శిరోరోగములు నశించును.

శతాహ్వాతైలము.

శ్లో. శతాహ్వైరండమూలం చ గావవ్యాఘ్రీఫలైః శృతం,
తైలం నస్యం మరుచ్ఛ్లేష్మ తిమిరోర్ధ్వగదాపహం. 24.

పిల్లిపీచర ఆముదపు వేళ్లు తగరము వాకుడు వీటితో పక్వముచేసిన తైలమును నస్యముగా నిచ్చిన శిరోరోగములు నశించును.

జీవకాద్యతైలము.

శ్లో. జీవకర్షభకౌ ద్రాక్షా సితాయష్టిబలోత్పలైః,
తైలం నస్యం పయః పక్వం వాతపిత్తశిరోగదే. 25.

జీవకము ఋషభకము ద్రాక్ష కండచక్కెర మధుకము ముత్తవపులగము కమలములు పాలు వీటితో పక్వముచేసిన తైలమును నస్యము నిచ్చిన వాతపిత్తజనులగు శిరోరోగములు నశించును.

బృహజ్జీవక తైలము.

శ్లో. జీవకర్షభకౌ ద్రాక్షా మధూకం మధుకం బలా, నీలోత్పలం చందనం చ విదారీ శర్కరా తథా. 26. తైలప్రస్థం పచే దేభిః శనైః పయసి షడ్గుణే, జాంగలస్య తు మాంసస్య తులార్ధస్య రసేన తు. 27. సిద్ధ మేత ద్భవే న్నస్యం తైల మూర్ధ్వావభేదకం, బాధిర్యం కర్ణశూలం చ తిమిరం గలశోషకం. 28. వాతికం పైత్తికం చైవ శీర్షరోగం నియచ్ఛతి, దంతచాలం శిరఃశూల మర్దితం చాపకర్షతి. 29.

జీవకము ఋషభకము ద్రాక్ష మధూకము మధుకము ముత్తవపులగము నల్లకల్వలు చందనము విదారి చక్కెర వీటిని 16 పలముల నేతితో పక్వముచేసి నేతికంటె నారురెట్లెక్కువ పాలను 50 పలముల నడవిజంతువులమాంసరసమును కలిపి పక్వముచేసి సేవించిన చెవుడు కర్ణశూలలు తిమిరములు మున్నగునవి నశించును.

షడ్బిందుతైలము.

శ్లో. ఏరండమూలం తగరం శతాహ్వా జీవంతి రాస్నా సహ సైంధవం చ, భృంగం విడంగం మధుయష్టికా చ. విశ్వౌషధం కృష్ణతిలస్య తైలం. 30. అజం పయ స్తైలవిమిశ్రితం చ చతుర్గుణే భృంగరసే విపక్వం, షడ్బిందవో నాసికయో ర్విధేయాః శీఘ్రం నిహన్యుః శిరసో వికారాన్. 31. చ్యుతాం శ్చ కేశాం శ్చలితాం శ్చ దంతాన్ దు

ర్బద్ధమూలాం శ్చ దృఢీకరోతి, సుపర్ణదృష్టిప్రతిమం చ చక్షుః బాహ్వో ర్బలం చాభ్యధికం దదాతి. 32. క్షయజే క్షయ మాసాద్యం కర్తవ్యో బృంహణో విధిః, పానే నస్యే చ సర్పిః స్యా ద్వాతఘ్నై ర్మధురైః శృతైః. 33. క్రిమిజే వ్యోషనక్తాహ్వా శిగ్రుబీజై శ్చ నావనం, అజామూత్రయుతం నస్యం క్రిమిజే క్రిమిజి త్పరం. 34.

ఏరండమూలము తగరము పిల్లపీచర జీవంతిక రాస్న సైంధవలవణము గంటుభారంగి అంటుప్పు యష్టిమధుకము శొంఠి నల్లనూవులతైలము మేకపాలు వీటిని గుంటకలగరాకురసములో పక్వము చేసి ఆరుబిందువులు ముక్కులో పోసిన శిరోవికారము లన్నియును నశించును. రాలిన వెండ్రుకలను కదిలిన పండ్లను గట్టిపఱచును. గరుడునితో సమమగు దృష్టి నిచ్చును. క్షయోత్పన్నమునకు వీర్యవర్ధకములగు చికిత్సలను చేయవలయును. వాతనాశకములు మధురములు నగు నోషధులతో సిద్ధము చేసిన నేతిని త్రాగింపవలయును. మఱియును నస్యము చేయింపవలయును. పురుగులవలనం బుట్టిన శిరశ్శూలలందు శొంఠి మిరియములు పిప్పళ్ళు మునగవిత్తులు వీటిని మేకమూత్రములోనూరి నస్యమును వేయవలయును.

## అపామార్గతైలము.

శ్లో. అపామార్గ ఫల వ్యోష నిశా క్షారక రామఠైః, సవిడంగం శృతే మూత్రే తైలం నస్యం క్రిమిం జయేత్. 35. నాగరం సగుడం విశ్వం పిప్పలీ వాస సైంధవా, భుజస్తంభాదిరోగేషు సర్వే షూర్ధ్వగదేషు చ. 36. సూర్యావర్తే సధాతవ్యం నస్యకర్మాది భేషజం, పాయయే త్సగుడం సర్పి ర్ఘృతపూరాం శ్చ భక్షయేత్. 37. సూర్యావర్తే శిరావేధో నావనం క్షీరసర్పిషా, శీతైః క్షీరఘృతాభ్యాస స్తాభ్యాం చైవ విరేచనం, క్షీరపిష్టై స్తిలై స్స్వేదో జీవనీయై శ్చ శస్యతే. 38. సశర్కరం కుంకుమ మాజ్యభృష్టం నస్యం విధేయం పవనాసృగుత్థే, భ్రూశంఖకర్ణాక్షిశిరోర్ధశూలే దినాభివృద్ధిప్రభవే చ రోగే. 39. కృత్తమాలపల్లవరసే ఖరమంజరికల్కసిద్ధనవనీతం, నస్యేన జయతి నియతం సూర్యావర్తం సుదుర్వారం. 40.

ఉత్తరేణు త్రిఫలములు శొంఠి మిరియములు పిప్పళ్ళు పసుపు యవక్షారము ఇంగువ వాయువిడంగములు వీటిని గోమూత్రముతో పక్వము చేసి నస్యమిచ్చిన క్రిములు నశించును. తుంగముస్తెలు బెల్లము శొంఠి పిప్పళ్లు సైంధవలవణము వీటికల్కమును

నస్యమిచ్చిన భుజ స్తంభరోగములు సంపూర్ణముగా నశించును. సూర్యావర్తమునకు పగటి పూట బాధగల శిరోరోగమునకు నస్యము నివ్వవలయును. లేనిచో నూవులను పాలలో నూరి లేపనచేసి చెమటను పుట్టింపవలయును. జీవనీయగణపుటౌషధులను నూరి లేపన చేసినను హితమే యగును. కుంకుమపువ్వును నేతితో వేయించి చక్కెరను కలిపి నస్యము చేయించిన వాతరక్తజములగు శిరోరోగములు నశించును. నెమలియడుగుఆకుల రసములో ఉత్తరేణువును కల్కముచేసి నవనీతమునందు పక్వముచేసి నస్య మిచ్చినచో దారుణములగు సూర్యావర్తరోగములు తొలగిపోవును.

## దశమూలకాథాదులు.

శ్లో. దశమూలీకషాయం తు సర్పిః సైంధవసంయుతం, నస్య మర్ధావభేదఘ్నం సూర్యావర్తశిరోర్తినుత్. 41. శిరీషమూలకఫలై రవ పీడం చ యోజయేత్, అవపీడో హితో వా స్యా ద్వచాపిప్పలిభిః కృతః. 42. జాంగలాని చ మాంసాని కారయే దుపనాహనం, తేనాస్య శామ్యతి వ్యాధిః సూర్యావర్తః సుదారుణః. 43. ఏష ఏవ విధిఃకృత్స్నః కార్య శ్చార్ధావభేదకే, శారివోత్పలకుష్ఠాని మధుకం చామ్లపేషి తం. 44. సర్పిస్తైలయుతో లేపః సూర్యావర్తార్ధభేదయోః, పిబే త్సశర్కరం క్షీరం నీరం వా నారికేలజం. 45. సుశీతం వాపి పానీయం సర్పిర్వా సస్తయో స్తయోః, అనంతవాతే కర్తవ్యః సూర్యావర్తహితో విధిః. 46 శిరావేధ శ్చ కర్తవ్యో౽నంతవాతప్రశాంతయే, ఆహార శ్చ విధాతవ్యో వాతపిత్తవినాశనః. 47. మధుమస్తుసంయావహవిఃపూరై శ్చ యః క్రమః, సూర్యావర్తే హితం య త్త చ్ఛంఖకే స్వేదవర్జి తం. 48. క్షీరసర్పిః ప్రశంసంతి నస్యపానం చ శంఖకే, శతావరీం కృష్ణతిలా న్మధుకం నీల ముత్పలం. 49. మూర్వాం పునర్నవాం చాపి లేపం సాధ్వవతారయేత్, శీతతోయావసేకాం శ్చక్షీరసేకాంశ్చ శీతలాన్. 50. కల్కై శ్చ క్షీరవృక్షాణాం శంఖకస్య ప్రలేపనం, క్రౌంచకాదంబహంసానాం శరార్యాః కచ్ఛపస్యచ. 51. రసైః సంవిహితస్యాథ తస్య శంఖకసంధిజాః, ఊర్ధ్వం తిస్రః శిరాః ప్రాజ్ఞో భింద్యా దేవ న తాడయేత్. 52. శిరఃకంపే౽మృతా రాస్నా బలాస్నేహా సుగంధిభిః, స్నేహస్వేదాదివాతఘ్నం శిరోబస్తి శ్చ శస్యతే. 53.

దశమూలపుకషాయములో సైంధవలవణమును తేనెను కలిపి నస్యమిచ్చిన శిరః కంపములు సూర్యావర్తము మున్నగునవి నశించును. దిరిసెన వేళ్ళు పండ్లు వీటితో అవపీడనము చేయుటమంచిది. వస పిప్పళ్లు వీటితో సిద్ధము చేసిన కషాయముతోనైన నవపీడనము చేయుట మంచిది. అడవిజంతువులమాంసముతో చెమటను పుట్టించిన, దారుణములగు సూర్యావర్తరోగములును నశించును. కలకండతో పాలను త్రాగినను టెంకాయనీళ్ళలో చక్కెరను వేసికొని త్రాగినను చల్లనినీళ్ళతోగాని నేతితోగాని నస్యమిచ్చినను అనంతవాతము సూర్యావర్తము మున్నగునవి నశించును.

## యష్ట్యాదిఘృతము.

శ్లో. యష్టిమధుబలా రాస్నా దశమూలాంబుసాధితం, మధురైశ్చ ఘృతం సిద్ధ మూర్ధ్వజత్రుగదాపహమ్. 54.

మధుకము ముత్తవపులగము రాస్న వీటకల్కమును దశమూల కషాయముతో పక్వముచేసి నేతినందు కాచి సేవించిన ఊర్ధ్వజత్రువు మున్నగు రోగములు నశించును.

## మయూరఘృతము

శ్లో. దశమూలబలారాస్నా మధుకై స్త్రిపలై స్సహ, మయూరం పక్షపిత్తాంత్ర శకృత్తుండాస్యవర్జితం. 55. జలే పక్త్వా ఘృతప్రస్థం తస్మిన్ క్షీరసమం పచేత్, మధురైః కార్షికై కల్కైః శిరోరోగార్దితాపహం. 56. కర్ణనాసాక్షిజిహ్వాస్య గలరోగవినాశనం, మయూరాద్య మిదం ఖ్యాత మూర్ధ్వజత్రుగదాపహం. 57. ఆఖుభిః కుక్కుటైర్హంసైః శశైశ్చాపి హి బుద్ధిమాన్, కల్పేనానేన విపచే త్సర్పిరూర్ధ్వగదాపహం. 58. దశమూలాదినా తుల్యో మయూర ఇహ గృహ్యతే, అన్యే త్వాకృతిమానేన మయూరగ్రహణం విదుః. 59.

దశమూలములు ముత్తవపులగము మధుకము వీటిని మూడుమూడుపలములు తెచ్చి రెక్కలు పిత్తము అంత్రము మలము కాళ్లుముఖము తీసి వైచిన మయూరమును చెప్పంబోవు నౌషధులను నీటిలో పక్వము చేయవలయును. పిమ్మట నానీటిలో 16 పలములనేయిని 16పలముల పాలను పక్వము చేసి ఒక్కొక్కతులము చొ॥ మధురములగునౌషధులకల్కమునందు కలిపి ఘృతమును రుద్దికొనినచో సంపూర్ణముగా శిరోరోగము లన్నియును నశించును. చెవ్వుముక్కు కన్నునాలుక ముఖము కుతిక వీటిరోగములును నశించును. ఇయ్యది మయూరాద్యఘృతము. ఊర్ధ్వజత్రువులను పోగొట్టును. బుద్ధిమంతుండగు వైద్యుండీయౌషధులలోనే ఎలుక కోడి హంస కుందేలు వీటికల్కములోను

ఈ యౌషధులతోనే నేతిని పక్వముచేయవలయును. ఈవిధియందు మయూరమాంస మును దశమూలములును సమానముగువానిని సమభాగములను గ్రహింపవలయును. కొందఱు ఆకృతిమానముచేత మయూరమునే గ్రహింపవలయునని యందురు.

## ప్రపౌండరీక తైలము.

శ్లో. ప్రపౌండరీక మధుక పిప్పలీ చందనోత్పలైః, సిద్ధం ధాత్రీరసే తైలం నస్యే నాభ్యంజనేన వా. 60. సర్వాన్ మూర్ధగతాన్ హంతి పలితాని చ శీలితం.

వేయిరేకులు గల తామరమూలము యష్టిమధుకము పిప్పళ్ళు చందనము నల్లగలువలు ఉసిరికరసము వీటితో సిద్ధము చేసిన తైలమును నస్యవిధిగా నుపయోగించినను మర్దనచేసినను ఊర్ధ్వగతములగు రోగముల నన్నిటిని పోగొట్టును. తలనెఱియుటనుగూడ పోగొట్టును.

## బృహన్మయూరఘృతము.

శ్లో. శతం మయూరమాంసస్య దశమూలబలాన్వితం. 61. ద్రోణేఽంభసః పచేత్తస్మి న్పాదశిష్టే రసే తతః, నిషిచ్య పయసో ద్రోణం పచేత్ తత్ర ఘృతాఢకమ్. 62 ప్రపౌండరీకవర్గోక్తైః జీవనీయైశ్చ భేషజైః, మేధాబుద్ధిస్మృతికరం మూర్ధజాన్ రోగనాశనం. 53. మయూరమేతత్ స్కంధస్థానిలహరం పరం, మన్యాకర్ణశిరోనేత్రరుజాపస్మారనాశనం. 64. విషవాతామయశ్వాసవిషమజ్వరకాసనుత్.

మయూరమాంసము నూరుపలములు దశమూలములు ముప్పదిపలములు నూరుపలములు వీటినికల్కముచేసి దాని నొక ద్రోణపునీటిలో కషాయముచేయవలయును. నాలవపాలు నీరు మిగిలియుండునప్పుడు ఒకద్రోణము పాలను గలిపి ప్రపౌండరీకవర్గము నందు చెప్పియున్నట్టియు జీవనీయగణమునందు చెప్పినట్టియు నౌషధులకల్కమును చేర్పవలయును. ఈఘృతము బుద్ధిని అభివృద్ధిసేయును. మెడను పైనుండురోగముల నన్నిటిని పోగొట్టును. వాతోత్పన్నములగు సంపూర్ణ రోగములను నశింపజేయును. మన్యకర్ణములు శిరస్సు నేత్రము వీటిబాధను అపస్మారములను విషవాతపురోగములను శ్వాస విషమజ్వరములను దగ్గు మున్నగువానిని పోగొట్టును.

ఇట్లు చక్రదత్తయందు శిరోరోగాధికారప్రకరణము ముగిసెను.

---

# ౬౦. అసృగ్దరరోగాధికారము.

---

అసృగ్దరమున కుపాయములు.

శ్లో. దధ్నా సౌవర్చలాజాజీ మధుకం నీలముత్పలం, పిబేత్ క్షౌద్రయుతం నారీ వాతాసృగ్దరపీడితా. 1. పిబేదైణేయకం రక్తం శర్కరామధుసంయుతం, వాసకస్వరసం పైత్తే గుడూచ్యా రస మేవ వా. 2. రోహీతకాన్మూలకల్కం పాండురేఽసృగ్దరే పిబేత్, జలే నామలకా ద్బీజకల్కం వా ససితామధు. 2. ధాతక్యా శ్చూర్ణమాత్రం వా ఆమలక్యా మధుద్రవం, కాకజంఘామూలం వా మూలం కార్పాస మేవ హి. 4. పాండుప్రదరశాంత్యర్థం పిబేత్తండులవారిణా, అశోకవల్కలక్వాథశృతం దుగ్ధం సుశీతలం, యథాబలం పిబేత్ప్రాత స్తీవ్రాసృగ్దరనాశనం. 5. దార్వీరసాంజనవృషాబ్దకిరాతబిల్వ భల్లాతకైరవకృతో మధునా కషాయః, పీతో జయత్యతిబలం ప్రదరం సశూలం పీతాసితారుణవిలోహితనీలశుక్లం. 6. రసాంజనం తండులీయస్య మూలం క్షౌద్రాన్వితం తండులతోయపీతం, అసృగ్దరం సర్వభవం నిహన్తి శ్వాసం చ భార్గీసహనాగరేణ. 7.

నల్లయుప్పి జీలకఱ్ఱ మధుకము నల్లకలువలు వీటిని పెరుగులో కలిపి తేనెను వేసికొని త్రాగిన వాతజములగు ప్రదరములు నశించును. జింక నెత్తుటిలో తేనెను కండచక్కెరను కలిపికొని త్రాగినచో ప్రదరములు నశించును. రోహీతకపు (సోమిచెట్టు) కల్కమును పాండుర వర్ణముగా రక్తము స్రవించు ప్రదరరోగములకు త్రాగవలయును. ఉసిరికకల్కమును నీటిలో కలిపి కండచక్కెర తేనె కలిపి త్రాగుట మంచిది. లేనిచో ఆరెపూవులను తాడియుసిరికరసములలో తేనెతో త్రాగుట మంచిది. కాకజంఘకపు షపువేళ్లుగాని ప్రత్తివేళ్లుగాని బియ్యపుకడుగుతో నూరి త్రాగిన పాండుపులు ప్రదరరోగములు నశించును. అశోకపు చెక్కతో నాన్చినపాలను కాచి చల్లార్చి బలానుసారముగా ప్రాతఃకాలమున సేవింప వలయును. మ్రానిపసపు రసాంజనము అడ్డసరము తుంగముస్తెలు నేలవేము మారేడుచెక్క జీడివిత్తులు వీటిని కషాయముపెట్టి తేనెను వైచి

కొని త్రాగిన శూలలు కల ప్రదరరోగము లైనను నశించును. పచ్చనినల్లనియొక్కనిరం గులుగల యోనిసంబంధములగు రక్తరోగములను నశించును.

## స్త్రీప్రదరమునకు దశమూలాదులు.

శ్లో. దశమూలం సముద్ధృత్య పేషయే త్తండులాంబునా, ఏత త్పీత్వా త్ర్యహా న్నారీ ప్రదరా త్పరిముచ్యతే. 10. క్షౌద్రయుక్తం ఫలరసం కోష్ఠోదుంబరజం పిబేత్, అసృగ్దరవినాశాయ సశర్కరప యోఽన్నభుక్. 11. ప్రదరం హన్తి బలాయా మూలం దుగ్ధేన మధు యుతం పీతం, కుశవాట్యాలకమూలం తండులసలిలేన రక్తాఖ్యం. 12. శమయతి మదిరాపానం తదుభయ మపి రక్తసంజ్ఞశుక్లాఖ్యౌ, గుడేన బదరీచూర్ణం మోచ మాంసం తథా పయః. 13. పీతా లాక్షా చ స ఘృతా పృథక్ప్రదరనాశనా, రక్తపిత్తవిధానేన ప్రదరాం శ్చా ప్యుపా చరేత్. 14. అసృగ్దరే విశేషేణ కుటజాష్టక మాచరేత్.

దశమూలములను తెచ్చి కడుగుతో నూరి మూడుగాజులు త్రాగిన ప్రదరములు న శించును. నల్లమేడి పండ్లరసములో తేనెను కలిపికొని త్రాగిన ప్రదరరోగములు నశించు ను. ముత్తువపులగపు వేరును పాలతో తేనెతో నూరి త్రాగినను ప్రదరములు నశించును. దర్భలు ముత్తువపులగము వీటిని కడుగుతో నూరి త్రాగిన రక్తప్రదరములు నశించును. మద్యమును త్రాగినను రక్తశుక్లపు ప్రదరములు నశింపజేయును. రేగుచూర్ణములో బె ల్లము కలుపుకొని పాలతో త్రాగినను ఇందుగు చెక్కను పచ్చపాలతో నూరి త్రాగినను ప్రదరములు నశించును.

## పుష్యానుగచూర్ణము.

శ్లో. పాఠాజంబ్వామ్రయో ర్మధ్యం శిలాభేదరసాంజనం. 15. అంబష్ఠకీ మోచరసః సమంగా పద్మకేసరాన్, బాహ్లీకాతివిషా ముస్తం బిల్వం లోధ్రం సగైరికం. 16. కట్ఫలం మరిచం శుంఠీ మృద్వీకా రక్త చందనం, కట్వంగవత్సకానంతా ధాతకీ మధుకార్జునం. 17. పుష్యే ణోద్ధృత్య తుల్యాని శ్లక్ష్ణచూర్ణాని కారయేత్, తాని క్షౌద్రేణసంయు జ్య పాయయే త్తండులాంబునా. 18. అసృగ్దరాతిసారేషు రక్తం య చ్చోపవేశ్యతే, దోషాగంతుకృతా యే చ బాలానాం తాంశ్చ నాశ యేత్. 19. యోనిదోషం రజోదోషం శ్వేతం నీలం సపీతకం, స్త్రీణాం

శ్యావారుణం యచ్చ తత్ప్రసహ్యా నివర్తయేత్. 20. చూర్ణంపుష్యానుగం నామ హితమాత్రేయపూజితం.

విషబొద్ది నేరేడు మామిడి శిలాజిత్తు రసాంజనము మంజిష్ఠము కమలకేసరములు ఇంగువ అతివస తుంగముస్తెలు మారేడు చెక్క లోధ్ర గైరికము కట్ఫలము మిరియములు శొంఠి ద్రాక్షరక్తచందనము కట్వంగము కోష్ఠుచెక్క తిప్పతీగె ఆరె మధుకము అర్జునవృక్షపుచెక్క వీటి నన్నిటిని పుష్యానక్షత్రములో తెచ్చి సమభాగములుగా చక్కగా చూర్ణముచేసి తేనెకలిపి కడుగునీళ్లతో త్రాగించి అసృగ్దరాదిరోగములకు మంచిది.

## ముద్గాది ఘృతము.

శ్లో. ముద్గమాషస్య నిర్యూహే రాస్నాచిత్రకనాగరైః. 21. సిద్ధం సపిప్పలీబిల్వైః సర్పిః శ్రేష్ఠ మసృగ్దరే, కుముదం పద్మకోశీరం గోధూమో రక్తశాలయః. 22. ముద్గపర్ణీ పయస్యా చ కాశ్మరీ మధుయష్టికా, బలాతిబలయో ర్మూల ముత్పలం తాలమస్తకం. 23. విదారీ శతమూలీ చ శాలపర్ణీ సజీవకా, ఫలత్రికస్య బీజాస ప్రత్యగ్రం కదళీఫలం, ఏషా మర్ధపలా న్భాగా న్గవ్యం క్షీరం చతుర్గుణం. 24. పానీయం ద్విగుణం దత్వా ఘృతప్రస్థం విపాచయేత్. 25. ప్రదరే రక్తపిత్తే చ రక్తగుల్మే హలీమకే, బహురూపం చ యత్పిత్తం కామలావాతశోణితే. 26. అరోచకే జ్వరే జీర్ణే పాండురోగే మదే భ్రమే, తరుణీ చాల్పపుష్పా చ యా చ గర్భం న విందతి. 27. అహన్యహని చ స్త్రీణాం భవతి ప్రీతివర్ధనం, శీతకల్యాణకం నామ పర ముక్తం రసాయనమ్. 28.

పెసలు మినుములు వీటి కషాయముతో రాస్న చిత్రమూలము తుంగముస్తెలు పిప్పళ్లు మారేడు చెక్క వీటితో సిద్ధము చేసిన ఘృతము ప్రదరములందు హితకరము. కుముదినీ కమలములు వట్టివేళ్లు గోధుమలు ఎఱ్ఱబియ్యము ముద్గపర్ణి గుమ్ముడు మధుకము ముత్తువపులగము వీటివేళ్లున్న కమలములు తాళమస్తకము విదారీకంద పిల్లపీచర సాలపర్ణి జీవకము త్రిఫలములు క్రొత్తయరటిపండ్లు వీటినన్నిటిని అర్ధపలము చొ॥ తెచ్చి ఆవుపాలు ఈయౌషధులతో నాలుగురెట్లుచేర్చి ఔషధులకంటె రెండింతలు నీళ్లు కలిపి కషాయముచేసి 16 పలములనేతి నందు పక్వము చేసి సేవించిన రక్తగుల్మములు హలీమకము మున్నగురోగములు నశించును.

బృహచ్ఛతావరీ ఘృతము.

శ్లో. శతావరీరసప్రస్థం క్షోదయిత్వా ఽవపీడయేత్, ఘృతప్రస్థసమాయుక్తం క్షీరద్విగుణితం భిషక్. 29. అత్ర కల్కా నిమాన్ దద్యాత్స్వాలోదుంబురసంమితాన్, జీవనీయాని యాన్యష్టౌ యష్టిపద్మకచందనం. 30. శ్వదంష్ట్రా చాత్మగుప్తా చ బలా నాగబలా తథా, శాలపర్ణీ పృశ్నిపర్ణీ విదారీ శారిబాద్వయం. 31. శర్కరా చ సమాదేయా కాశ్మర్యాశ్చ ఫలాని చ, సమ్యక్ సిద్ధం తు విజ్ఞాయ తద్ఘృతం చావతారయేత్. 32. రక్తపిత్తవికారేషు వాతపిత్తకృతేషు చ, వాతరక్తం క్షయం శ్వాసం హిక్కాం కాసం చ దుస్తరం. 33. అంగదాహం శిరోదాహం రక్తపిత్తసముద్భవం, అసృగ్దరం సర్వభవం మూత్రకృచ్ఛ్రం సుదారుణం. 34. ఏతాన్రోగాన్ శమయతి భాస్కరస్తిమిరం యథా.

ఒక ప్రస్థము శతావరిని దంచి రసము తీసి 4 పలములనేతిని పక్వముచేసి ఆనేతిలో రెండింతలు పాలను కలపవలయును. పిమ్మట నీనేతిలో ముందు చెప్పఁబోవు ఔషధముల కల్కమును పెద్దమేడిపండంతయుండఁ జేసికలుపవలయును. జీవనీయాద్యష్టగణముల యౌషధులను మధుకము కమలములు చందనము పల్లేరు గురువిందపులుసు సాలపర్ణి విదారిగంద గరిక వీటిని కల్కముచేసి కలిపి ఈ యౌషధులతో సమముగా కండచక్కెర నందు కలిపి గుప్పెడు పలముల నంతకు కలుపవలయును. పిమ్మట నిందులో నేతిని చక్కగా పక్వము చేసి దీని సేవించినచో రక్తపిత్తవికారములను వాతపిత్తవికారములను పోగొట్టుట కుత్తమమైనదగును. వాతరక్తములు క్షయశ్వాసరోగము ఎక్కిళ్లు కాస అంగదాహము శిరోదాహము రక్తపిత్తములవలనఁ బుట్టిన ప్రదరరోగములు దారుణములగు మూత్రకృచ్ఛ్రములు మన్నగువానిని ఈఘృతము సూర్యుఁడు చీకటులను పోగొట్టునట్టులు నశింపఁజేయును.

ఇట్లు చక్రదత్తయందు అసృగ్దరాధికారప్రకరణము ముగిసెను.



## ౬౧. యోనిరోగాధికారము.

యోనిరోగముల కుపాయములు.

శ్లో. యోని వ్యాపత్సు భూయిష్ఠం శస్యతే కర్మ వాతజిత్, వస్త్యభ్యంగపరీషేకప్రలేపాః పిచుధారణం. 1. వచోపకుంచికా జాతీ కృష్ణా

వృషకసైంధవం, అజమోదాం యవక్షారం చిత్రకం శర్కరాన్వితం. 2. పిష్ట్వా ప్రసన్నయాలోడ్య ఖాదేత్తద్ఘృతభర్జితం, యోనిపార్శ్వార్తిహృద్రోగగుల్మార్శోవినివృత్తయే. 3. గుడూచీ త్రిఫలా దన్తీ క్వాథైశ్చ పరిషేచనం, నతవార్తాకినీకుష్ఠసైంధవామరదారుభిః. 4. తైలాత్ప్రసాదితాద్ధార్యః పిచుర్యోనౌ రుజాపహః, పిత్తలానాం తు యోనీనాం సేకాభ్యంగాః పిచుక్రియాః. 5. శీతాః పిత్తహరాః కార్యాః స్నేహనార్థం ఘృతాని చ, యోన్యాం బలాసదుష్టాయాం సర్వరూక్షోష్ణమౌషధం. 6. పిప్పల్యా మరిచైర్మాషైః శతాహ్వా కుష్ఠసైంధవైః, వర్తిస్తుల్యా ప్రదేశిన్యా ధార్యా యోనివిశోధనీ. 7. హింస్రాకల్కం తు వాతార్తా కోష్ణమభ్యజ్య ధారయేత్, పంచవల్కస్య పిత్తార్తా శ్యామాదీనాం కఫోత్తరా. 8. మూషికామాంససంయుక్తం తైలమాతపభావితం, అభ్యంగాద్ధన్తి యోన్యర్శః స్వేదస్తన్మాంససైంధవైః. 9.

యోనివ్యాపదలలో వాతనాశక చికిత్సలను వస్తికర్మలుఅభ్యంగములు పరిషేకములు లేపములు పిచికారిపట్టుట యుత్తమములు వస, క్రాలుగచ్చ జాజికాయ పిప్పళ్లు అడ్డసరము సైంధవలవణము అజమోద యవక్షారము చిత్రమూలము కండచక్కెర వీటిని కల్లుతేటతో నూరి కలియఁబెట్టి నేతితో వేయించి తినిన యోనిరోగములు పార్శ్వరోగములు హృద్రోగములు గుల్మములు మూలరోగములు అన్నియును తొలగును. తిప్పతీగె త్రిఫలములు దంతి వీటికషాయముతో పరిషేచనము చేయవలయును. అగరువాకుడు కోష్ఠు సైంధవలవణము దేవదారువు వీటితోసిద్ధముచేసిన తైలములో దూదిని తడిపి యోనియం దుంచిన బాధయుపశమిల్లును. పిత్తయోనిరోగులకు సేకాభ్యంగములను పిత్తనాశకశీతలక్రియలను చేయవలయును. స్నేహనమునకై నేతిని యుపయోగింపవలయును. కఫదుష్టములగు యోనులకు సంపూర్ణములగు రూక్షోష్ణములగు నౌషధులను చేయవలయును. పిప్పళ్లు మిరియములు మినుము సోంపు సైంధవలవణము వీటిని నూరి తర్జనియంతవత్తిని చేసి ధరించిన యోనిని శోధించును. పిత్తపీడితములగువానికి పంచవల్కలములకల్కమును ధరింపఁజేయవలయును. కఫపీడితుఁడు శ్యామాదికల్కమును ధరింపవలయును. ఎలుకమాంసముతో తైలము నెండలోనెండించి తలంటుకొనిన యోనులయర్శోరోగములు నశించును.

## గోరోచనా చూర్ణము.

శ్లో. గోపిత్తే మత్స్యపిత్తే వా క్షౌమం త్రిస్సప్తభావితం, మధునా కిణ్వచూర్ణం వా దద్యా దచరణాపహం. 10. స్రోతసాం శోధనం శోధకండూక్లేదహరం చ తత్, కామిన్యాః పూతియోన్యా శ్చ కర్తవ్యః స్వేదనో విధిః. 11. క్రమః కార్య స్తత స్స్నేహపిచుభి స్తర్పణం భవేత్, శల్లకీ జంగినీ జంబు ధనత్వ క్పంచవల్కలైః. 12. కషాయై స్సాధిత స్స్నేహః పిచు స్స్యా ద్విప్లుతాపహః, కర్ణిన్యాం వర్తి కాకుష్ఠపిప్పల్యగ్రాగ్ర్యసైంధవైః. 13. బస్తమూత్రకృతా ధార్యా సర్వం చ శ్లేష్మను ద్ధితం, త్రైవృతం స్నేహనం స్వేద ఉదావర్తానిలార్తిషు. 14. త దేవ చ మహాయోన్యాం ప్రస్తారగాం తు విధీయతే, ఆఖోర్మాంసం సపది బహుధా ఖండీఖండీ కృతం యత్. 15. తైలే పాచ్యం ద్రవతి నియతం యావ దేత న్న సమ్యక్, తత్తైలాక్తం వసనమనిశం యోనిభాగే దధానా హన్తి ప్రీడాకరభగఫలం నాత్రనం దేహబుద్ధిః. 16.

గోవుపిత్తమునందుగాని చేపపిత్తమునందుగాని 21 మార్లు భావనచేసిన పట్టుగుడ్డను కల్లుతో వస ద్రవ్యచూర్ణమును అయినను ఇచ్చిన, ఆచరణమను యోనిరోగము నశించును. రక్తపుకాలవలను పరిశోధించును. కామినిపూతి యోనిరోగములకు స్వేదనముఁజేయుచుండవలయును. అందుగ గిరిగిత్స, నేరేడు చంద్ర వీటిచెక్కలను పంచవల్కలములను కషాయము చేసి అందుసాధించిన తైలమును ఇచ్చిన పిప్లుతములు నశించును. కర్ణనియందు కోష్ఠు పిప్పళ్లు జిల్లేడు సైంధవలవణము మేకమూత్రము వీటిని కలిపి చేసిన వత్తిని ధరించినను కఫనాశకౌషధులనిచ్చినను హితము.

## శతపుష్పతైలాదిలేపములు.

శ్లో. శతపుష్పాతైలలేపా ద్భదరీదలజా త్తథా. 17. పేటికామూలలేపా చ్చ యోని ర్భిన్నా ప్రశామ్యతి, సుషవీమూలలేపేన ప్రవిష్టాన్త ర్బహి ర్భవేత్. 18. యోని ర్మూషకసాభ్యంగా న్నిస్సృతా ప్రవిశే దపి, లోధ్రతుంబీ ఫలాలేపో యోనిదార్ఢ్యం కరోతి చ. 19. వేతసమూలనిః క్వాథ క్షాలనేన తథైవ చ, మూషికా వాగులివసా మ్రక్షణం యోనిదార్ఢ్యదం. 20. వచానీలోత్పలం కుష్ఠం మరిచాని త

క్షైవ చ, అశ్వగంధా హరిద్రా చ గాఢీకరణ ముత్తమం. 21. మదన ఫలమధుకకర్పూరపూరితం భవతి కామినీజనస్య, విగలితయౌవనస్య చ వరాంగ మతిగాఢం సుకుమారం. 22.

జనుపతైలము లేపనచేసినను రేగుచెక్కనూరి లేపనచేసినను పేటికామూలము ను లేపనచేసినను భిన్నములగు యోనులు చక్కనగును. సుషవీమూలము లేపన చేసిన చో బాహ్యాంతరములగు యోనిరోగములు పోగొట్టును. లొద్దుగ సార వీటిలేపనము యోనిని గట్టిపఱచును. వేతసకషాయముతో కడిగినను యోనిదృఢపడును. వస నల్లకలువ లు కోష్టు మిరియములు అశ్వగంధ పసపు వీటిని లేపముచేసినను యోనినిగట్టి పఱచును. ఉమ్మెత్తకాయ తేనె కర్పూరము వీటితో యోనిని పూరించిన ముసలిస్త్రీకి గూఢయోని మిక్కిలి గాఢముగను సుందరముగను మృదువుగను నగును.

పంచపల్లవఘృతము.

శ్లో. పంచపల్లవ యష్ట్యాహ్వ మాలతీకుసుమై ర్ఘృతం, రవిప క్వ మన్యథావా యోనిగంధా ర్తినాశనం. 23. ఇక్ష్వాకుబీజదంతీ చ పలాగుడ మదన కిణ్వ యష్ట్యాహ్వైః, సస్నుక్ క్షీరై ర్వర్తి ర్యోనిగ తా కుసుమసంజననీ. 24. సక్షౌద్రజీరకం జపాపుష్పం భృష్టం జ్యోతిష్మతీ దలం, దూర్వాపిష్టం చ సంప్రాశ్య వనితా త్వార్తవం లభేత్. 25. ధా త్రీంజనాభయాచూర్ణం తోయపీతం రజో హరేత్, శేలుచ్ఛద మి శ్రపిష్టం భక్షణం చ తదర్థకృత్. 26. పుష్యోద్ధృతం లక్ష్మణాయా శ్చ క్రాంగాయా స్తు కన్యయా, పిష్టం మూలం దుగ్ధఘృత పీతమృతౌ తు పుత్రదం. 27. క్వాథేన హయగంధాయాః సాధితం సఘృతం పయః, ఋతుస్నాతా బాలా పీత్వా గర్భం ధత్తే న సంశయః. 28. పిప్పల్యః శృంగబేరంచ మరిచం కేసరంతథా, ఘృతేన సహ పాతవ్యం వంధ్యాపి లభతే సుతం. 29.

పంచపల్లవములు మధుకము జాజిపువ్వులు వీటితో నేతిని ఎండలోబెట్టి గాని మఱియేవిధముగానైనను గాని కాచియుపయోగించినచో యోనులదుర్వాసనలు పోవు ను. చేమ సారవిత్తనములు దంతివేళ్లు పిప్పళ్లు బెల్లము ఉమ్మెత్తకాయ మద్యముతో వస మధుకము జెముడుపాలు వీటితో వత్తిచేసి ధరించిన ముట్టు తప్పక యగుచుందురు. గంజితో దాసెనపువ్వును దుర్వలతో నూరిన మాలకాంగనీపత్రములను తినినచో స్త్రీ ఆర్తవము నొందెదరు. పుష్యనక్షత్రమునందు లక్ష్మణ చక్రాంగి పిల్లవేళ్ళను నూరి పా

లు నేతులతోకలిపి ఋతుకాలమునందు త్రాగిన పుత్రోత్పత్తియగును. అశ్వగంధకషాయమును చేసి నేతితో సిద్ధముచేసిన పాలను త్రాగిన గర్భమును ధరింపఁగల్గుటకు సందియము లేదు. పిప్పళ్లు అల్లము మిరియములు కుంకుమపువ్వు నీటిని నేతితో త్రాగిన గొడ్డుబోతు కూడ బిడ్డలను కనును.

## గర్భోత్పత్తి కుపాయములు.

శ్లో. స్వర్ణస్య రూప్యకస్య చచూర్ణే తామ్రస్య చాజ్యసంమిశ్రే, పీతే శుద్ధే క్షేత్రే భేషజయోగా ద్భవే ద్గర్భః. 30. కృత్వా శుద్ధా స్నానం విలంఘ్య దివసాంతకే తతః ప్రాతః, స్నాత్వా ద్విజాయ భక్త్యా సంపూజ్య తథైవ లోకనాథశం. 31. శ్వేతబలాం ప్రియకముష్టాం కృష్ణాం కర్షం పలం తు శర్కరాయాః, పిష్ట్వైకవర్ణజీవితవత్సాయా గోస్తు దుగ్ధేన. 32. సమాధికష్కృతేన పీత్వా స్నాత్వా దినే దేయ మన్నమస్య చ క్షుధితే సమగ్ర మన్నం దద్యాద్దాపురుషసన్నిధే స్తస్యాః. 33. సముదివసే శుభయోగే దక్షిణపార్శ్వశాల ... గతా, త్యక్తస్త్ర్యంగసంగ ప్రహృష్ట మనా ... లితివృద్ధనాగరీకోత్ప. 34. పురుషస్య సంగమాత్రా ల్లభతే పుత్రం తతో నియతం

బంగారు వెండి రాగిచూర్ణములలో నేతిని కలిపికొని త్రాగించో శుద్ధయోని యందు ఔషధయోగమున గర్భము ప్రాపించును. పరిశుద్ధముగా స్నానముచేసి రోజు అంతయు నుపవసించి ప్రాతఃకాలమునందు బ్రాహ్మణులను గౌరవించి పార్వతిని పూజింపవలయును. ముత్తువపులగపు నేల్లను మధుకమును అర్ధపలము తీసికొని ఒకపలము కండచక్కెర నందుకలిపినూరి ఒకేరంగుగలిగి జీవించియుండువత్సముగలిగిన ఆవుయొక్క పాలతో నేతినికలుపుకొని త్రావించో గర్భముకలుగును. పురుష సంయోగ పర్యంతము సమదినములలో శుభదినములలో దక్షిణపు ప్రక్కలంబరుండుచు ధీరురాలై పురుషుని కలిసినచో తప్పక పుత్రులు పుట్టెదరు.

## పుత్రజననోపాయములు.

శ్లో. గోష్ఠజాతవటకస్య ప్రాగుత్తరశాఖజే శుభే. 35. మాషౌ ద్వౌ చ తథా గౌరసర్షపౌ దధియోజితౌ, పుష్యే పీతౌ ధృతౌ సన్న గర్భాయాః పుత్రకారకౌ. 36. కానకా న్రాజతా న్వాపి లౌహా న్పురు

షకా నమూన్, ధ్యాత్వాగ్నివర్ణా న్పయసో దధ్నోవా ప్యుదకస్య వా.
37. క్షిప్త్వాంజలౌ పిబేత్సుష్యే గర్భే పుత్రత్వకారకాన్.

సులభము.

ఫలఘృతము.

శ్లో. మంజిష్ఠా మధుకం కుష్ఠం త్రిఫలా శర్కరా బలా.
38. మేధా పయస్యా కాకోలీ మూలం చైవాశ్వగంధజం, అజ
మోదా హరిద్రే ద్వే హింగుకం కటురోహిణీ. 39. ఉత్పలం కుము
దం ద్రాక్షాకాకోల్యౌ చందనద్వయం, ఏతేషాం కార్షికైర్భాగైర్ఘృ
తప్రస్థం విపాచయేత్. 40. శతావరీరసక్షీరం ఘృతాద్దేయం చతు
ర్గుణం, సర్పిరేతన్నరః పీత్వా నిత్యం స్త్రీషు వృషాయతే. 41. పు
త్రాం జనయతే నారీ మేధాఢ్యా న్ప్రియదర్శనాన్, యా చైవ స్థిరగ
ర్భా స్యాద్యా వా జనయతే మృతం. అల్పాయుషం వా జనయేద్యా
చ కన్యాం ప్రసూయతే. 43. యోనిదోషే రజోదోషే పరిస్రావే చ
శస్యతే, ప్రజావర్ధన మాయుష్యం సర్వగ్రహనివారణం. 44. నా
మ్నా ఫలఘృతం హ్యేతదశ్విభ్యాం పరికీర్తితం, అనుక్తం లక్ష్మణా
మూలం క్షిపంత్యత్ర చికిత్సకాః. 45. జీవద్వత్సైకవర్ణాయాః ఘృత
మత్ర ప్రశస్యతే, ఆరణ్యగోమయే నాపి వహ్నిజ్వాలా ప్రదీయతే. 46.

మంజిష్ఠము మధుకము కోష్ఠు త్రిఫలములు కండచక్కెర ముత్తువపులగము మేద క్షీరకాకోలి పెన్నేరు అజమోద పసపు మ్రానిపసపు ఇంగువ కటుక రోహిణి కమలములు ద్రాక్ష రక్తచందనము చందనము వీటి సర్గపలముచొ॥ 16 పల॥ నేతిలో పక్వముచేసి పిల్లపీచరరసము పాలు 64 పలములు కలిపి పైనేతిని త్రాగిన సుఖముగా భోగింపఁగలుగును. స్త్రీసేవించిన ప్రియదర్శనులును బుద్ధిమంతులునగు పుత్రులనుకనఁజాలును, గర్భము నిలువనివారు చచ్చినబిడ్డలనుకనువారు యోనిదోషము రజోదోషము కలవారు సేవించినచో సంతానాయుష్యారోగ్యముల నొసఁగి సుఖింపఁజేయును.

రెండవఫలఘృతము.

శ్లో. సహచరే ద్వే త్రిఫలాం గుడూచీం సపునర్నవాం, శుని
నాసాం హరిద్రే ద్వే రాస్నా మేదాం శతావరీం. 47. కల్కీకృత్య
ఘృతప్రస్థం పచేత్ క్షీరచతుర్గుణం, తత్సిద్ధం ప్రపిబేన్నారీ యోని

శూలప్రపీడితా. 48. పిండితా చవితా యా చ నిఃసృతా విసృతా చ యా, పిండయోని స్తు విస్రస్తా షండయోనిశ్చ యా స్మృతా. 49. ప్రపద్యంతే తు తాః స్థానం గర్భం గృహ్ణంతి చాసకృత్, ఏత త్ఫల ఘృతం నామ యోనిదోషహరం పరం. 50.

గోరింటలు త్రిఫలములు తిప్పతీగె గలిజేరు గన్నుడు పసపు మ్రానిపసపు రాస్న మేద సిల్లపీచర వీటిని కల్కముచేసి 64 పలములపాలనుకలిపి 16 పలముల నేతిని పక్వము చేసి సేవించిన పిండితాదిరోగము లన్నియును నశించి మాటిమాటికి గర్భము ధరింప గలుగుదురు.

## సోమఘృతము.

శ్లో. సిద్ధార్థకం వచా బ్రాహ్మీ శంఖపుష్పీ పునర్నవా, పయస్యా మయ యష్ట్యాహ్వా కటుకైలా ఫలత్రయం. 51. శారివే రజనీ పాఠా భృంగదారుసువర్చలా, మంజిష్ఠా త్రిఫలా శ్యామా వృషపుష్పం స గైరికం. 52. ధీమా న్పక్త్వా ఘృతప్రస్థం సమ్యఙ్మాత్రాభిమంత్రితం, ద్విమాసగర్భిణీ నారీ షణ్మాసాన్న ప్రయోజయేత్. 53. సర్వాంగం జనయే త్పుత్రం శూరం పండిత మానినం, జడగద్గదమూకత్వం పానా దేవాపకర్షతి. 54. సప్తరాత్రప్రయోగేణ నరః శ్రుతిధరో భవేత్, నాఽగ్ని ర్దహతి తద్వేశ్మ న వజ్రం హన్తి న గ్రహాః. 55. న తత్ర మ్రియతే బాలో యత్రాస్తే సోమసంగితః, వంధ్యా ఽపి లభతే పుత్రం సర్వామయవివర్జితం. 56 యోనిదుష్టా శ్చ యా నార్యో రేతోదుష్టాశ్చ యే నరాః, అస్య ప్రభావా త్కుక్షిస్థః స్ఫుటవా గ్వ్యాహర త్యపి. 57. ద్రాక్షాపరూషకాశ్మర్య ఫలత్రయ ముదాహృతం "ఓన్నమో మహావినాయకా యామృతం రక్ష రక్ష మమ ఫలసిద్ధిం, దేహి రుద్రవచనేన స్వాహా" సప్తదూర్వాభిమంత్రితం". 58.

తెల్లఆవాలు వస బ్రాహ్మి శంఖపుష్పి గలిజేరు క్షీరకాకోలి కోష్టుమధుకము కటుకరోహిణి త్రిఫలములు అనంతమూలములు పసపు విషబొద్ది గుంటకలగర దేవదారు ఆదిత్యభక్తి మంజిష్ఠను తెల్లతెగడ అడ్డసరము గైరికను వీటిని16పలముల నేతితో పక్వము చేసి చక్కగా మంత్రించి రెండవమాసపు గర్భిణియగు స్త్రీ సేవించిన సంపూర్ణాంగుడును శూరుడును పండితుడును అగుకుమారుని కనఁగలుగును. ఏడురోజులు దీనిని సేవించినచో మనుష్యుఁడు శ్రుతధరుఁడగును. ఈసోమఘృతమున్న ఇల్లు కాలదు. వజ్రమును భేదింపఁ

జాలదు. గ్రహములు బాధింపఁజాలవు. బాలురుమరణింపరు. దీనిని సేవించిన గొడ్రాలును బిడ్డలను కనును. ఈక్రిందిమంత్రముతో ఏడుగురికి పాలను మంత్రింప వలయును. ఓం నమో వినాయకాయ అమృతం రక్ష రక్ష మమ ఫలసిద్ధిం దేహి దేహి రుద్రవచనేన స్వాహా అని.

### నీలోత్పలాదిఘృతము.

శ్లో. నీలోత్పలోశీరమధూకయష్టిద్రాక్షా విదారీ కుశపంచమూలైః, స్యా జ్జీవనీయై శ్చ ఘృతం విపక్వం శతావరీకారసదుగ్ధమిశ్రం 59 తచ్ఛర్కరాపాదయుతం ప్రశస్తం ప్రసృగ్దరే మారుతరక్తపిత్తే, క్షీణే బలే రేతసి సంప్రణష్టే కృచ్ఛ్రే చ రక్తప్రభవే చ గుల్మే. 60.

తాత్పర్యము సులభము.

### బృహచ్ఛతావరీ ఘృతము.

శ్లో. శతావరీమూలతులా శ్చతస్రః సంప్రపీడయేత్, రసేన క్షీరతుల్యేన పచే త్తేన ఘృతాఢకం. 61. జీవనీయై శ్శతావర్యా మృద్వీకాభిః పరూషకైః, పిష్టైః ప్రియాలై శ్చాక్షాంశై ర్ద్వియష్టిమధుకై ర్భిషక్. 62. సిద్ధశీతేచ మధునః పిప్పల్యా శ్చాష్టకం పలం, దద్యా ద్దశ పలం చాత్ర సితాయా స్తద్విమిశ్రితం. 63. బ్రాహ్మణా న్ప్రాశయే త్పూర్వం లిహ్యా త్పాణితలం తతః, యోన్యసృక్ శుక్రదోషఘ్నం వృష్యం పుంసవనం చ తత్. 64. క్షతక్షయాం రక్తపిత్తం కాసం శ్వాసం హలీమకం, కామలాం వాతరక్తం చ విసర్పం హృచ్ఛిరోగ్రహం. 65 ఉన్మాదాదీ నపస్మారా న్వాతపిత్తాత్మకా ఞ్జయేత్, దగ్ధ్వా శంఖం క్షిపే ద్రంభాస్వరసే తత్తు పోషితం. 66. తుల్యాలం లేపతో హంతి రోమగుహ్యాదిసంభవం, రక్తాంజనాపుచ్ఛచూర్ణయుక్తం తైలం తు సార్షపం. 67. సప్తాహం వ్యుషితం హన్తి మూలాం దోమా న్యాసంశయః, కుసుంభతైలాభ్యంగో వా రోమ్ణా ముత్పాటితే ఽతకృత్. 68.

పిల్లపీచరవేళ్లు 400పలములు తెచ్చి రసముపిండి ఆరసముతో సమముగాపాలను కలిపి 64 పలముల నేయిని పక్వముచేసి 56 జీవనీయగణపు ఔషధులను శతావరి ద్రాక్షమున్నగు వానిని కాలుకాలుపలమును మధుకము నర్ధపలమునుకలిపి సిద్ధమైన పిమ్మట చల్లార్చి తేనె పిప్పళ్లు 8 పలములు కలిపి 10 పలముల కండచక్కెరను వైచి ముందుబ్రా

హ్మాణులకు పెట్టి తరువాత ఒకకునుమంతచొప్పు తాను సేవింపవలయును. ఇయ్యది యోని రోగ ప్రదరరోగ వీర్యదోషములను నశింపఁజేయును. వీర్యమును పుష్టిఁజేయును. పుంస్త్వము నిచ్చును. క్షతక్షయ రక్తపిత్తము వగుశ్వాస కామెరలు విసర్పము హృద్రోగము ఉన్మాదము మున్నగువానిని పోగొట్టును.

## ఆరగ్వధాది తైలము.

శ్లో. ఆరగ్వధమూలపలం కర్షద్వితయం చ శంఖచూర్ణస్య। హరితాలస్య చ ఖరజే మూత్రప్రస్థే కటుతైలం పక్వం. 68. తైలం తదిదం శంఖహరితాలచూర్ణితం లేపాత్, నిర్మూలయతి చ రోమాణ్యన్యేషాం సంభవో నైవ. 69. కర్పూరభల్లాతకశంఖచూర్ణం క్షారో యవానాం చ మనఃశిలా చ, తైలం విపక్వం హరితాలమిశ్రం రోమాణి నిర్మూలయతి క్షణేన. 70.

రేలచెక్క 1 పలము శంఖచూర్ణ మర్ధపలము హరిదళము అర్ధపలము గాడిదె ఉచ్చ 16 పలములు నీటిలో ఆవనూనెను పక్వముచేసి లేపనచేసిన రోమములను పోగొట్టును. కర్పూరము జీడివిత్తులు శంఖచూర్ణము నీటిని చూర్ణము చేసి యవక్షారము మణిశిల హరిదళము నీటిలో పక్వముచేసిన తైలము ఒక నిమేషములో రోమములను హరించును.

## క్షార తైలము.

శ్లో. శుక్తిశంబూకశంఖానాం దీర్ఘవృంతాత్తు ముష్కకాత్, దగ్ధ్వా క్షారం సమాదాయ ఖరమూత్రేణ గాలయేత్. 71. క్షారార్ధభాగం విపచే త్తైలం చ సార్షపం బుధః, ఇదమంతఃపురే దేయం తైలమాత్రేయపూజితం. 72. బిందురేకః పతే ద్యత్ర తత్ర రోమా పునర్భవః, మదనాదివ్రణే దేయ మశ్విభ్యాం చ వినిర్మితం. 73. అర్శసాం కుష్ఠరోగాణాం పామాదద్రువిచర్చికాం, క్షారతైల మిదం శ్రేష్ఠం సర్వక్లేదహరం పరం. 74.

ముత్తెపుచిప్ప శంబూకపు శంఖము దుండిగపు చెట్టు వీటిని కాల్చి క్షారము చేసి గాడిదెయుచ్చలో నూరి క్షారముకన్న నైదుపాళ్లు ఆవనూనెను కలిపి పక్వము చేయవలయును. అంతఃపురములలో నియ్యఁదగిన తైలము ఆత్రేయునిచె చెప్పెను. దీనిబొట్టు ఒకటి పడినను అచ్చట నెన్నటికిని రోమములు మొలవవు. మదనవ్రణములను ఈయవలసి

నదని దీనిని అశ్వినీదేవతలు నిర్మించిరి. అర్శలు కుష్ఠురోగములు పామ దద్రువు విచర్చిక మున్నగువానిని పోగొట్టుటకు ఈక్షారతైల ముత్తమము.

ఇట్లు చక్రదత్తయందు యోనిరోగాధికారప్రకరణము ముగిసెను.



# ౬౨. స్త్రీరోగాధికారము.

## గర్భహితములగు నుపాయములు.

శ్లో. మధుకం శాకబీజం చ పయసా సురదారు చ. 1. అశ్మంతకః కృష్ణతిలా స్తామ్రవల్లీ శతావరీ, వృక్షాదనీ పయస్యా చ తథై వోత్పలశారిబా. 2. అనంతా శారిబా రాస్నా పద్మా మధుక మేవ చ, బృహతీద్వయ కాశ్మర్య క్షీరశృంగా స్త్వచో ఘృతం. 3. పృథక్పర్ణీ బలా శిగ్రు శ్వదంష్ట్రా మధుయష్టికా, శృంగాటకం బిసం ద్రాక్షా కశేరు మధుకం సితా. 4. మాసేషు సప్తయోగా స్స్యుః అర్ధశ్లోకాస్తు సప్తసు, యథాక్రమం ప్రయోక్తవ్యా గర్భస్రావే పయోన్వితాః. 5. కపిత్థబిల్వ బృహతీ పటోలేక్షు నిదిగ్ధికాః, మూలాని క్షీరసిద్ధాని దాపయే ద్భిషగష్టమే. 6. నవమే మధుకానంతా పయస్యా శారిబాః పిబేత్, పయస్తు దశమే శుంఠ్యా శృతశీతం ప్రశస్యతే. 7. సక్షీరా వాహితా శుంఠీ మధుకం దేవదారు చ, ఏవ మాప్యాయతే గర్భ స్తీవ్రారుక్ చో పశామ్యతి. 8. కుశకాశోరుబూకానాం మూలై ర్గోక్షురకస్య చ, శృతం దుగ్ధం సితాయుక్తం గర్భిణ్యాః శూలనుత్పరం. 9.

(1) మధుకము శాకబీజము క్షీరకాకోలి దేవదారువులును, (2) ఆరె, నల్లనూగు మంజిష్ఠ శతావరియును, (3) తిప్పతీగె క్షీరకాకోలి కమలములు మనుబాల అనంతమూలము, (4) అనంతమూలము మనుబాల సన్నరాస్న కమలము మధుకములును (5) వాకుడుగుమ్ముడు క్షీరవిదారి లవంగపుపట్ట శుంగము నేయియును, (6) పృథక్పర్ణిముత్తవపులగము మునగ పల్లేరు యష్టిమధుకమును, (7) శృంగాటకము (దుప్పగడ్డ) తామరతూడు ద్రాక్ష కసేరువు మధుకము మధుశర్కరయును ఈయేడు యోగములను ఏడు నెలలు క్రమముగా పాలతో కలిపి గర్భస్రావమునం దుపయోగింప వలయును. వెలగ

మారేడు పెద్దవాకుడు పటోలము చిన్నవాకుడు వీటిని పాలతో సిద్ధముచేసి ఎనిమిది నెలలు ఈయవలయును. తొమ్మిదవ మాసములో మధుకము అనంత క్షీరకాకోలీ మను బాల వీటిని త్రాగవలయును. పదియవ నెలలో శొంఠితో కాచి చల్లార్చిన పాలను త్రాగుట శ్రేష్ఠము. ఈరీతిగాఁ జేసిన గర్భము పుష్టమై బాధ లుపశమిల్లును. కుశకాశలు ఏరండము పల్లేరు వీటివేళ్లను పాలలో పక్వముచేసి చక్కెర వేసికొని త్రాగిన గర్భిణికి శూలలు నశించును.

### గర్భము నిలుచుటకు దుగ్ధము.

శ్లో. కశేరుశృంగాటకజీవనీయ పద్మోత్పలైరండశతావరీభిః, సిద్ధం పయః శర్కరయా విమిశ్రం సంస్థాపయే ద్గర్భ ముదీర్ణశూలం. 10. కశేరుశృంగాటకపద్మకోత్పలం సముద్గపర్ణీమధుకం సశర్కరం, సశూల గర్భస్రుతిపీడితాంగనా పయోవిమిశ్రం పయసాన్నభుక్పిబేత్. 11. గర్భే శుష్కే తు వాతేన బాలానాం చాపి శుష్యతాం, సితామధుక కాశ్మర్యైర్హిత ముత్థాపనే పయః. 12. గర్భశోషే త్వామగర్భాః ప్రసహాశ్చ సదా హితాః.

కసేరువు శృంగాటకము జీవనీయగణపు ఔషధములు కమలములు తెల్లకమలములు ఏరండము శతావరి వీటితో సిద్ధముచేసిన పాలలో కండచక్కెరను కలిపికొని త్రాగిన వృద్ధినొందిన శూలగల గర్భము నిలుచును. కసేరువు శృంగాటకము కమలములు మినుములు మధుకము చక్కెర వీటినికలిపి సేవించిన శూలలు గర్భస్రావములు మున్నగునవి నశించును. వాతముచేత గర్భము శుష్కించినపుడు బాలురకును శుష్కత కలుగును. అట్టి సమయముల తేనె చక్కెర గుమ్ముడు వీటితో సిద్ధముచేసిన పాలు హితకరము. గర్భశోషమునందు పచ్చిగర్భములను తినుట మంచిది.

### నాభిలేపములు మున్నగునవి.

శ్లో. పాఠా లాంగలిసింహాస్య మయూరకజటైః పృథక్, నాభివస్తిభగాలేపా త్సుఖం నారీ ప్రసూయతే. 13. పరూషకస్థిరామూలలేప స్తద్వ త్పృథక్పృథక్, వాసామూలే ప్రుతం తద్వ త్కటిబద్ధే ప్రసూయతే. 14. పాఠాయాస్తు శిఫాం యోనౌ యా నారీ సంప్రధారయేత్, ఉగః ప్రసవకాలే చ సా సుఖేన ప్రసూయతే. 15. తుషాంబుపరిపిష్టేన మూలేన పరిలేపయేత్, లాంగల్యాశ్చరణౌ సూతే క్షిప్రమేతేన గర్భిణీ. 16. ఆటరూషకమూలేన నాభివస్తిభగాలేపః కర్తవ్యః, తాలతరూద్భవమూలే ముక్తకచ్ఛే ప్సృతే పుంసాం. 17. గృహాంబునా

గేహధూమపానం గర్భాపకర్షణం, మాతులుంగస్య మూలాని మధుకం మధుసంయుతం, ఘృతేన సహ పాతవ్యం సుఖం నారీ ప్రసూయతే. 18. పుటదగ్ధసర్పకంచుకమసృణమసీకుసుమసారసహితాం జితాక్షీ, ఝుడితి విశల్యా జాయేత గర్భవతాం మూఢగర్భాపి.

విషబొద్ది లాంగలి అడ్డసరము మయూరకము వీటిని ప్రత్యేకముగా నూరి నాభిస్థానమునందు లేపనచేయుటహితము. బొడ్డు వస్తి యోని వీటికి లేపనచేసిన సుఖప్రసవమగును. పరూషకము ముయ్యాకు పొన్న వీటివేళ్లను వేర్వేరుగానూరి లేపనచేసినను బాలకుడు పుట్టును. అడ్డసరపువేళ్లను మొలలోగట్టిన తత్క్షణమే ప్రసవించును. విషబొద్దివేరును యోనిపై పెట్టుకొనిన స్త్రీ ప్రసవకాలమున సుఖముగ ప్రసవించును. మల్లంగిని యవగంజితోనూరి కాళ్లకులేపనచేసిన గర్భిణీస్త్రీ శీఘ్రముగా ప్రసవించును. పాముకుబుసమును పుటమువైచి స్నిగ్ధమగుసిరాను తేనెలో కలిపి కన్నుల కంజనముగా వైచినమూఢగర్భముగలదైనను శీఘ్రమే ప్రసవించును.

### సుఖప్రసవమునకు మంత్రితోదకములు.

శ్లో. గృహాంబునా హింగుసింధు పానం గర్భాపకర్షణం. 20. ఇహామృతం చ సోమశ్చ చిత్రభానుశ్చ భామిని, ఉచ్చైః శ్రవాశ్చతురశో మందిరే నివసంతు తే. 21. ఇద మమృత మపాం సముద్ధృతం వై భవ లఘుగర్భ మిమం విముంచతు స్త్రీ, తదనల పవనార్కవాసవాస్తే సహలవణాంబుధరైర్దిశంతుశాంతిం. 22. ముక్తాః పాశా విపాశాశ్చ ముక్తాః సూర్యేణ రశ్మయః, ముక్తస్సర్వభయాద్గర్భ ఏహ్యేహి మాచిచ స్వాహా. 23. జలం చ్యవనమంత్రేణ సప్తవారాభిమంత్రితం, పీత్వా ప్రసూయతే నారీ.

ఇంటినీళ్ళలో ఇంగువసైంధవలవణము కలిపి త్రాగిన గర్భాకర్షణమగును. తిప్పతీగ సోమవల్లి చిత్రభానుఉచ్చైశ్రవము ఓచిన్నదానానీయింటిలోనెప్పుడుంచికొనుము. జలోద్ధృతము లగు నీయమృతము ద్రావి గర్భమును ప్రసవింపుము. వాయుసూర్యచంద్రులు ఆనీగర్భమును రక్షింతురు గావుత. పిమ్మటముక్తాః పాశాఅనుచ్యవన మంత్రముతో నీటిని మంత్రించి త్రాగి నేని స్త్రీసుఖముగా ప్రసవించును.

### గర్భయంత్రాదులు.

శ్లో. దృష్ట్వాచోభయ త్రింశకం. 24. తథోభయపంచదశదర్శనం సుఖసూతికృత్, నారీ జతువసుభిస్సహ, పక్షిదిగష్టాదశభి రేవ చ

**26.** అర్కభువనాబ్ధిసహితై రుభయత్రింశక మిద మాశ్చర్యం, వసుగుణాబ్ధ్యేకబాణ నవషట్సప్తయుగ్మైః క్రమాత్. **26.** సర్వం పంచదశ ద్విస్తు త్రింశకం నవకోష్ఠకే, కటుతుంబ్యహినిర్మోక కృతవేధన సర్షపైః. **27.** కటుతైలాన్వితో ధూమో యోనేః పాతయతే మరాం, కచవేష్టితయాంగుల్యా ఘృష్టే కంఠే సుఖం పతత్యమరా. **28.**

ఉభయత్రింశకమును (అనగా నెటుకూడినను ముప్పదివచ్చునట్టిది) ఉభయపంచదశ సర్వసమును (ఎటుమాచిన పదునైదు) అగుయంత్రమునుచూచిన సుఖముగా ప్రసవించును. ఆరు ఎనిమిది పదునైదు పదునెనిమిది పదిపంద్రెండు పదునాలుగు నాలుగు ఈయంకెలతో ఉభయత్రింశక చక్రమగును. ఎనిమిది మూడునాలుగు ఒకటి అయిదు తొమ్మిది ఆరుపదు ఇవిక్రమముగా పదునైదు యంత్రము లగును. చెట్టించిన ముప్పదియగును. చేదుసొర పాముకుబుసము ఆవాలు వీటిని ఆవనూనెలో వైచి మాషితముజేసి యోనికి లేపన చేయవలయును.

## గర్భిణీ విశల్యకరణమంత్రము.

శ్లో. ఏరండస్య వనే కాకో గంగాతీర ముపాగతః, ఇతః పిబతి పానీయం విశల్యా గర్భిణీ భవేత్. **29.** అనేన సప్తధాఽభిమంత్ర్య జలం దేయం విశల్యకం, మూలేన లాంగలిక్యా వా సంలిప్తే పాణిపాదే చ. **30.** అమరాపాతనం సద్యః పిప్పల్యాదిరజః పిబేత్, గర్భమద నదహా సమూలం చిరజ మపి. **31.** గర్భం మృత మమృతం వా నిపాతయతి.

ఏరండవనే అనుమంత్రమును ఏడుమారులు నీటితో నుచ్చరించి ఇచ్చిన శల్యములు నశించును. లాంగలీమూలముతో కాలుచేతులకు లేపన చేసినను మద్యముతో పిప్పలిచూర్ణము త్రావించినను గర్భము జాఱును.

## మదిరాసేవనాదులు.

శ్లో. శాలిమూలాక్షమాత్రం వా మూత్రేణాశ్లేన వాన్వితం. **31.** ఉపకుంచికాం పిప్పలీం చ మదిరాం లాభతః పిబేత్, సౌవర్చలేన సంయుక్తాం యోనిశూలనివారణీం. **32.** సూతాయా హృచ్ఛిరోబస్తిశూలం మక్కల్లసంజ్ఞితం, యవక్షారం పిబే త్తత్ర సర్పిషా క్షౌద్రకేన వా. **33.** పిప్పల్యాదిగణక్వాథం పిబే ద్వా లవణాన్వితం, పారావతశకృత్ప్రీతం శాలితండులవారిణా. **34.** గర్భవాతాంఽతరోత్థే తు రక్తస్రా

వనివారణం, జలపిష్టవరుణాఙ్కత్రైః సన్ప్రుతై రుద్వర్తనాలేపౌ తు. 35.
కిక్కిసరోగం హరంత్యే గోమయఘృష్టా దధ్యో విహితౌ.

ఎఱ్ఱరాజనపు వేళ్లను ఒకతులము గోమూత్రముతోగాని గంజితోగాని త్రాగిన గర్భశూలములు నశించును. నల్లఉప్పితో మద్యముం ద్రాగిన యోనిశూలలు నశించును. ప్రసవించిన స్త్రీకిగల హృచ్ఛూలము వస్తిశూలము మున్నగునవియును నశించును. ఘృతముతోగాని యవక్షారమునుగాని వేడినీళ్లతో గని త్రాగిన గర్భపాతమునందలి రక్తస్రావములు నశించును. నీటిలో నూరిన దంతిని త్రాగిన కిక్కిసరోగములు నశించును.

## హ్రీబేరాది కషాయములు.

శ్లో. హ్రీబేరారనాల రక్తచందన బలా ధన్యాక వత్సాదనీ. 36.
ముస్తోశీర యవాస పర్పటవిషా క్వాథం పిబే ద్గర్భిణీ, నానాదోషయుతాతిసారకగదే రక్తస్రుతౌ వా జ్వరే. 37. యోగోఽయం మునిభిః పురా నిగదితః సూత్యామయే శస్యతే అమృతానాగర సహచర భద్రోత్కట పంచమూల జలదలశ్రృతం, మధుసంయుక్తం నివారయతి సజ్వరం సూతికాతంకం. 38. సహచరపుష్కరవేతసమూలం వైకంకతం దారుకులత్థం సమం, జలమత్ర సైంధవహింగుయుతం సద్యో ఘోరసూతికాశూలహరం. 39.

కురువేరు విషబొద్ది రక్తచందనము ముత్తువపులగము ధనియములు చిప్పతీగ తుంగముస్తెలు వట్టివేళ్లుపిత్తపాపడ వీటికషాయమును గర్భిణీస్త్రీ త్రాగవలయును. దీనిని అనేకదోషములు గిలగ రక్తస్రావముల నుపయోగింపవలె నని మునులనిరి. చిప్పతీగ శొంఠ గోరింట భద్రముస్తెలు లవంగపుపట్ట పంచమూలములు కురువేరు తేజపత్రి వీటికషాయములో తేనెనుచేర్చి త్రాగిన సూతికారోగములు నశించును. గోరింట పుష్కరమూలము వేతసము వీటివేళ్లను దేవదారుకులుత్థ కషాయముతో సైంధవలవణము ఇంగువను చేర్చికొని త్రాగిన సూతికారోగములు శీఘ్రముగా నశించును.

## వజ్రకాంజికము.

శ్లో. దశమూలీకృతః క్వాథః సద్యస్సూతిరుజాపహః, పిప్పలీ పిప్పలీమూలం చవ్యం శుంఠీ యవానికా. 40. జీవకేద్వే హారిద్రే ద్వే బిడ
సౌవర్చలం తథా, ఏతై రేవౌషధైః పిష్టై రారనాలం విపాచితం. 41.
ఆమవాతహరం వృష్యం కఫఘ్నం వహ్నిదీపనం, కాంజికం వజ్రకం నా

మ స్త్రీణా మగ్నివివర్ధనం. 42. సుక్కాందశమూలశమనం పరం క్షీరాభిమ ర్దనం, క్షీరపాకవిధానేన కాంజికస్యాపి సాధనం. 43.

దశమూలముల కషాయము సూతికలను వెంటనే పోగొట్టును. పిప్పళ్లు పిప్పలి దుంపలు చవ్యము శొంఠి వాముము జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ పసపు మ్రానిపసపు అంటుప్పు నల్లయుప్పు వీటిని నూరి గంజితో పక్వము చేసి త్రాగిన ఆమవాతములు హరించును. వీర్య పుష్టి నిచ్చి కఫముల నశింప చేయును. అగ్నిని దీపింప చేయును. స్త్రీలరోగములను పోగొట్టును.

## పంచజీరకగుడము.

శ్లో. జీరకం హాపుషా ధాన్యం శతాహ్వా సురదారు చ, య మానీ త్రివృష్టకో హింగు పత్రికా కాసమర్దకం. 44. పిప్పలీ పిప్పలీమూల మజమోదాథ బాష్పికా, చిత్రకం చ పలాంశాని తథాన్యచ్చ చతుఃప లం. 45. కశేరుకం నాగరం చ కుష్ఠం దీప్యక మేవ చ, గుడస్య చ శ తం దద్యా ద్ఘృతప్రస్థం తథైవ చ. 46. క్షీరద్విప్రస్థసంయుక్తం శ నైర్మృద్వగ్నినాపచేత్, పంచజీరక ఇత్యేష సూతికానాం ప్రశస్యతే. 47. గర్భార్థినీనాం నారీణాం బృంహణీయః సమారుతే, వింశతివ్యాపదో యోనేః కాసం శ్వాసం జ్వరం క్షయం. 48. హలీమకం పాండురోగం దౌర్గంధ్యం బహుమూత్రతాం, హంతి పీనోన్నతకుచాః పద్మపత్రాయ తేక్షణాః. 49. ఉపయోగాత్ స్త్రియో నిత్య మలక్ష్ములవర్జితాః.

జీలకఱ్ఱ హాపుషము ధనియాలు శతావరి దేవదారు వాముము త్రివృత్తకము (కొబ్బర) హింగు పత్రిక కాసమర్దము పిప్పళ్లు పిప్పలి మూలము జీలకఱ్ఱ చిత్రమూల ము వీటిని ఒక్కొక్క పలమును ఇతరవస్తువులను 4 పలముల చొప్పున కసేరువు శొంఠి కోష్ఠు అజమోద బెల్లము 100 పలములును నేయి 16 పలములును ఇచ్చి 32 పలముల పాలను మెల్లని సెగపైని పక్వము చేయవలయును. ఇది పంచజీరకము. సూతిక మున్నగు వానిని నశింపజేయును. గర్భార్థులకు బలము నిచ్చును.

## దుగ్ధవర్ధనోపాయములు.

శ్లో. వనకార్పాసకేక్షూణాం మూలం సౌవీరకేణ వా. 50 విదా రీకందం సురయా పిబే ద్వా స్తన్యవర్ధనం, దుగ్ధేన శాలితండుల చూర్ణ పానం వివర్ధయేత్. 51. స్తన్యం సప్తాహతః క్షీరసేవినా స్తు న సంశ

యః, హరిద్రాదిం వచాదిం వా పిబే త్స్తన్యవిశుద్ధయే. 52. తత్ర వా తాత్మకే స్తన్యే దశమూలీజలం పిబేత్, పిత్తదృష్టేఽమృతా భీరు పటోలం నింబచందనం. 53. ధాత్రీకుమార శ్చ పిబే త్క్వాథయిత్వా సశారిబం, కఫే వా త్రిఫలా ముస్తా భూనింబు కటురోహిణీం. 54. ధాత్రీ స్తన్యవిశుద్ధ్యర్థం ముద్గయూషరసాశినీ, భార్గీ వచా దారుపాఠాః పిబేత్సాతివిషాః శృతాః. 55. కుక్కుటా మంజకామూలం చర్వితమాస్యే విధారితం జయతి, సప్తాహా త్స్తనకీలం స్తన్యం చైకాంతతః కురుతే. 56.

అడవి ప్రత్తి చెఱకు వీటి వేళ్లను గంజితో నూరిగాని విదారీకందను మద్యముతో గాని త్రాగిన పాలు హెచ్చును. వరిబియ్యపు పిండిని పాలతో నేడు రోజులు త్రాగిన పాలుత్రాగెడిదానిపాలు హెచ్చును. హరిద్రాదిగణపు ఔషధములుగాని వచాదిగణపు ఔషధులుగాని పాలను వృద్ధినొందించును.

### స్తనశోథలకు చికిత్స.

శ్లో. శోథం స్తనోత్థితము వేక్ష్యభిషగ్విదధ్యా, ద్విద్రధావభిహితంత్విహ భేషజం తు,ఆమే విదహ్యతి తథైవ గతేచ పాకం, తస్యాః స్తనౌ సతతమేవచనిర్దుహీతం. 57. విశాలామూలలేపస్తు హంతి పీడాం స్తనోత్థితాం,నిశాకనకఫలాభ్యాం లేప శ్చాపి స్తనార్తిహా. 58.మూషికవసయా సూకర, గజమహిషమాంసచూర్ణసంయుతయా. 59. అభ్యంగమర్దనాభ్యాం కఠినపీన స్తనౌ భవతిః, మహిషీభవనవనీతం వ్యాధిబలోగ్రా స్తథైవ నాగబలా. 60. పిష్ట్వామస్తునయోగా త్పీనం కఠినం స్తనం కురుతే.

చనుమొనలఁ గలవాపులకు విద్రధిరోగమునకు వలె చికిత్సఁ జేయవలయును. ఇంద్రాయణీవేరు నూరి రాచిన చనుమొనలపోటు తగ్గును. ఎలుకపంది ఏనుగు దున్నపోతు వీటిమాంసము చూర్ణముచేసి రుద్దిన చూచుకములు కఠినములును పుష్టములు నగును.

### శ్రీపర్ణి తైలము.

శ్లో. శ్రీపర్ణిరసకల్కాభ్యాం తైలం సిద్ధం తిలోద్భవం. 61. తత్తైలం తూణకే నైవ స్తనస్యోపరి ధారయేత్, పతితా వుత్థితౌ స్త్రీణాం భవేయాతాం పయోధరౌ. 62.

శాలిపర్ణిరసమునందు కల్కమునందు సిద్ధముచేసిన తిలతైలమును నూదితో చను మొనల నుంచిన పతితములైనప్పటికిని పయోధరములు మఱల నున్నతము లగును.

కాసీససిద్ధతైలాదులు.

శ్లో. కాసీసతురగగంధా శారివా గజపిప్పలీ విపక్వేన, తైలేవ యాంతి వృద్ధిం స్తనకర్ణవరాంగలింగాని. 63 ప్రథమర్తౌ తండులాంభో నస్యం కుర్యాత్ స్తనౌ స్థిరౌ, గోమహిషీఘృతసహితం తైలం శ్యామాకృతాంజలివచాభిః. 64. సత్రికటునిశాభిః సిద్ధం నస్యం స్తనోత్థాపనం పరం, తనూకరోతి మధ్యం పీతం మథితేన మాధవీమూలం. 65. స్యాచ్ఛిథిలాపిచ గాఢా సురగోపాజ్యాభ్యంగసంగతో యోనిః, శరబహలసిరబంధనరజ్వా సంతాడనాద్ధి దయితేన. 66 నశ్యత్యబలా ద్వేషః పత్యౌ సహజః కృతోఽధనా యోగైః, దత్త్వైవ దుగ్ధభక్తం విప్రాయోత్పాట్య సితబలామూలం. 67. పుష్యే కన్యా పిష్టం దత్తసి మనిచ్ఛాభ్యాహారం భక్తే.

కాసీసము అశ్వగంధ మనుబాల ఏనుగుపిప్పలి వీటితైలము చనుమొనలు చెవులు యోనిలింగము వీటిని పెంచును. ప్రథమార్తవసమయములందు బియ్యపుకడుగును నస్యవిధిచేసిన చూచుకములు స్థిరములై యుండును. ఆవు గేదె వీటినేతితో తైలమును నల్లతెగడ వస శొంఠి మిరియములు పిప్పళ్లు పసపు వీటితో సిద్ధముచేసిన నస్యమును తీసికొనిన చూచుకము లుత్థితములగును. ఇల్లు మయ్యాకుపొన్న వీటితో కట్టిన త్రాటితో భర్తతాడనముచేయుట పిసుకుటవలనను అబలాద్వేషము నశించును. పుష్యనక్షత్రమున సిత(వాపలి) వేరును తెచ్చి బ్రాహ్మణుని భుజింపఁజేసి సేవించిన అరుచి నశించిపోవును.

ఇట్లు చక్రదత్తయందు స్త్రీరోగాధికారప్రకరణము ముగిసెను.

---

# ౬౩. బాలరోగాధికారము.

బాలరోగ దుగ్ధాదులు.

శ్లో. కుష్ఠవచాభయాబ్రాహ్మీ కమలం క్షౌద్రసర్పిషా, వర్ణాయుః కాన్తిజననం లేహం బాలస్య దాపయేత్. 1. స్తన్యాభావే పయశ్ఛాగం గవ్యం వా తద్గుణం పిబేత్, తర్కాద్వాథో గుడికాం తప్తాం నిర్వాప్య కటుతైలకే. 2. తత్తైలం పానతో హంతి

బాలానా ముల్బముద్ధతం, వ్యోషశివోగ్రాగజనీకల్కం వా పీత మధు పయసా. 3. ఉల్బం నిశ్శేషం కురుతే పటుతాం బాలస్య చాత్యంతం, మృత్పిండే నాగ్నితప్తేన క్షీరసిక్తేన సోష్మణా. 4. స్వేదనమ్ముత్థితాం నాభిం శోథ స్తేన ప్రశామ్యతి, నాభిపాకే నిశా లోధ్ర ప్రియంగుమధుకైః శృతం. 5. తైల మాభ్యంజనే శస్త మేభి ర్వాప్యవచూర్ణనం.

కోష్ఠు వస కరక్కాయలు బ్రాహ్మీ కమలము వీటిని తేనెతోను నేతితోను కలిపి లేహ్యము చేసి పిల్లలకీయవలయును. ఇయ్యది బలమును ఆయుష్యమును కాంతిని కలిగించును. స్త్రీలకు పాలు లేనిచో మేకపాలుగాని ఆవుపాలుగాని మాతృస్తన్యము వలె గుణము నిచ్చును. తర్కాధమును (హిం = బడవేరి) గుటికను చేసి కాచి కటుతైలమునందు ముంచి త్రాగిన బాలురకు ఉల్బము నశించును. శొంఠి మిరియములు పిప్పళ్లు కరక్కాయలు వస పసపు వీటికల్కమును పాలతో త్రాగింపవలయును. ఉల్బములు నశించును. బాలకులు మిక్కిలియును చతురులగుదురు. అగ్నితో తప్తము చేసిన మృద్గలను పాలతో చల్లార్చి ఆయావిరిని బొడ్డునకు పట్టించినచో వాపులు నశించును.

### మయూరశిఖాధారణాదులు.

శ్లో. సోమగ్రహణే విధివత్ కేకిశిఖామూలముద్ధృతం బద్ధం, జఘనేఽథ కంధరాయాం క్షపయ త్యహిండికాం నియతం. 6. సప్తదలపుష్పం మరిచం పిష్టం గోరోచనాసహితం, పీతం తద్వత్ తండులభక్తకృతో దగ్ధపిష్టకప్రాశః. 7. జంబూకనాసావాయసజిహ్వానాభిర్వరాహసంభూతా, కాంస్యం చాఽథగరలం ప్రావృడ్భేకస్య నామజంఘాస్థి. 8. ఇత్యేకశోఽథమిలితం విధృతం గ్రీవాదికటిదేశే, అహిండికాప్రశమన మభ్యంగో నాతిపథ్యవిధిః. 9. అనామకే ఘుర్ఘురికా జక్కా మరిచరోచనా, నవనీతం చ సంమిశ్ర్య ఖాదే త్తద్రోగనాశనం. 10. తైలాక్తశిరసాలుని సప్తదలార్కస్నుహీభవం క్షీరం, దత్వా రజనీచూర్ణే దత్తే నస్యే దనామకో రోగః. 11. లేహయే చ్ఛునా బాలం నవనీతేన లేపితం, స్ఫుటకిపత్రిజరసోద్వర్తనం చ హి తద్ధితమ్. 12.

చంద్రగ్రహణమునందు యథావిధిగా నెమలిపించమును పెల్లగించి జఘనమునందుగాని మెడలోగాని కట్టినచో అహిండికరోగములు నశించును. ముయ్యాకుపొన్నపుష్పములు మిరియములు గోరోచనము వీటిని నూరి అన్నముతో తినినను అహిండి

నెలలో ఒక చిన్నమాత్రయంత, రెండవనెలలో రెండుచిన్న మాత్రలంత ఇవ్విధం బున సంవత్సరమువరకు హెచ్చించుచు నౌషధమును తేనెలోగాని, పాలలోగాని చక్కెరలోగాని, నేతిలోగాని కలిపి నాకించవలయును. ఆవల సంవత్సరము మొదలు పదునాలుసంవత్సరము లగువఱకు నొక్కొక్క మినపగింజంత హెచ్చింపవలయును.

హరిద్రాదులు.

శ్లో. హరిద్రాద్వయయష్ట్యాహ్వానింహీశక్రయవైః కృతః, శిశో ర్జ్వరాతిసారఘ్నః కషాయ స్తస్య దోషజిత్. 21.

పసపు మ్రానిపసపు మధుకము కొడిసెపాలవిత్తులు వీటికషాయము పిల్లల అతిసా రరోగములను మాన్పును.

బాలచతుర్భద్రిక.

శ్లో. ఘనకృష్ణారుణా శృంగీ చూర్ణం క్షౌద్రేణ సంయుతం, శిశో ర్జ్వరాతిసారఘ్నం కాసశ్వాసవమీహరం. 22.

తుంగముస్తలు పిప్పళ్లు శృంగి వీటిని చూర్ణముచేసి తేనెతోకలిపి పిల్లల కిచ్చిన జ్వరాతిసారములు దగ్గు శ్వాస వాంతులు నశించును.

ధాతుక్యాదులు.

శ్లో. ధాతకీబిల్వధాన్యాక లోధ్రేంద్రయవవాలకైః, లేహః క్షౌద్రేణ బాలానాం జ్వరాతీసారవాంతిజిత్. 23. రజనీదారుశరలశ్రేయసీ బృహతీద్వయం, పృశ్నిపర్ణీశతాహ్వాచ లీఢం మాక్షికసర్పిషా. 24. గ్రహణీ దీపనం హన్తి మారుతార్తిం సకామలాం, జ్వరాతీసారపాండుఘ్నం బాలానాం సర్వశోధనుత్. 25. మిశీకృష్ణాంజనం లాజా శృంగీ మరిచమాక్షికైః, లేహః శిశో శ్ఛర్దిధాతవ్య శ్ఛర్దికాసజ్వరాపహః. 26.

ధాతకీఫలము మారేడు దనియములు లోధ్ర కొడిసెపాలవిత్తులు కురువేరు తేనె వీటిలేహము పిల్లలకు జ్వరాతిసారములను వాంతిని పోగొట్టును. పసపు దేవదారు కరక్కాయలు వాకుడు శతావరి వీటిని తేనెతో నేతితో కలిపి లేహమునుచేసి ఈయ వలయును. గ్రహణి వాతరోగము కామెల అతిసారము మున్నగు వానిని పోగొట్టును. సోంపు పిప్పళ్లు సుర్మా పేలాలు మిరియములు తేనె వీటితోచేసిన లేహమును పిల్లల కిచ్చిన వాంతిని మున్నగునవి నశించును.

శృంగ్యాదిలేహము.

శ్లో. శృంగీం సముస్తాతివిషాం విచూర్ణ్య లేహం విదధ్యా న్మధునా

శిశూనామ్. 27. కాసజ్వరచ్ఛర్దిభిరర్దితానాం సమాక్షికాం చాతివిషాం తథైకామ్. 28. పీతం పీతం వమేద్యస్తు స్తన్యం తన్మధుసర్పిషా, ద్వివార్తాకీ ఫలరసం పంచకోలం చ లేహయేత్. 29. ఆమ్రాస్థిలాజసింధూత్థైః లేహైః క్షౌద్రేణ ఛర్దినుత్, పిప్పలీ మరిచానాం తు చూర్ణం సమధుశర్కరం. 30. రసేన మాతులుంగస్య హిక్కాఛర్దినివారణం, పేటీపాఠామూలాజ్జంబ్వాః సహకారవల్కలతః కల్కః. 31. ఇత్యేకశశ్చ పిండో విధృతో హృన్నాభిమధ్యతాల్వాది, ఛర్ద్యతిసారజం వేగం ప్రబలం ధత్తే తదేవ నియమేన. 32.

శృంగి, తుంగముస్తలు అతివస వీటిని చూర్ణముచేసి తేనెతో లేహముచేసిగాని అతివస తేనె లేహమును చేసిగాని తినిన దగ్గు జ్వరము ఛర్ది మున్నగునవి నశించును. పాలను త్రాగిత్రాగి క్రక్కుచుండెడు పిల్లలకు వాకుడుకాయలరసమును తేనెతోను నేతితోను నాకింపవలయును. పంచకోలములను తినిపింపవలయును. మామిడి టెంకలు పేలాలు సైంధవలవణము వీటిని లేహముచేసి తేనెతో నాకించిన వాంతి నశించును. పిప్పళ్లు మిరియములు వీటిచూర్ణమును తేనె కించుక చక్కెరలోనైనకొని మాదీఫలరసముతో నాకించిన ఎక్కిళ్లును ఛర్దులును నశించును. పేటిక విపద్ద వేరు నేరేడు చెక్క గోరంటతొక్క వీటిని వేరువేరుగా కల్కమును చేసి నాభిహృదయము దవడలు మున్నగుచోటులను పట్టువేసినచో ఛర్ద్యతిసారములు తప్పక నశించును.

## బిల్వక్వాథాదులు.

శ్లో. బిల్వం చ పుష్పాణి చ ధాతకీనాం జలం సలోధ్రం గజపిప్పలీ చ, క్వాథావలేహౌ మధునా విమిశ్రౌ బాలేషు యోజ్యావతిసారితేషు. 33. సమంగా ధాతకీ లోధ్రశారివాభిః శృతం జలం, దుర్ధరేఽపి శిశోర్దేయ మతీసారే సమాక్షికం. 34. నాగరాతివిషా ముస్తబాలకేంద్రయవైః శృతం, కుమారం పాయయేత్ప్రాతః సర్వాతీసారనాశనం. 35. సమంగాధాతకీపద్మం వయస్యాకచ్ఛురా తథా, పిష్టైః రేతైర్యవాగూః స్యాత్సర్వాతీసారనాశనం. 36. బిల్వమూలకషాయేణ లాజాశ్చైవ సశర్కరాః, ఆలోడ్య పాయయేద్బాలం ఛర్ద్యతీసారనాశనం. 37. కల్కః ప్రియంగుకోలాస్థి మధ్యముస్తరసాంజనైః, క్షౌద్రలీఢః కుమారస్య ఛర్దితృష్ణాతిసారనుత్. 36.

బిల్వాను ఆరెపువ్వులు కురువేరు లోధ్ర పినుగుపిప్పళ్లు వీటి కషాయములోను అవలేహమున దను తేనెను కలిపి అతిసారముగల బాలకుని క్రియవలయును. మంజిష్ఠము ధాతకీకుసుమము లోధ్ర మనుబాల వీటి కషాయములో తేనెను కలిపి బాలకులకు భయంకరములగు నతిసారములలో నీయవలయును. శొంఠి అతివస తుంగము స్తలు కురువేరు కొడిసెపాల వీటికషాయమును ప్రాతఃకాలమునందే బాలకునిచేత త్రాగింపవలయును. అన్ని అతిసారములను నశింపజేయును. మంజిష్ఠ ధాతకీకుసుమము ఉసిరికకమలము వీటిని నూరి గంజిని కాచి ఇచ్చిన అన్ని అతిసారరోగములును నశించును. మారేడు వేళ్లను కషాయముగా గాచి కడచక్కెర పేలాలు వీటిని కలిపి పిల్లలకు త్రాగించినచో చర్ది అతిసారమును నశించును.

## మోచరసాదియోగము.

శ్లో. మోచరస స్సమంగా చ ధాతకీ పద్మకేసరం, పిష్టై రేభి ర్యవాగూః స్యా ద్రక్తాతీసారనాశినీ. 39. లేహ స్తైలసితాక్షౌద్ర తిలయష్ట్యాహ్వకల్కితః, బాలస్య రుంధ్యా న్నియతం రక్తస్రావం ప్రవాహికాం. 40. లాజాః సయష్టిమధుకం శర్కరాక్షౌద్ర మేవ చ, తండులోదకసంసిక్తం క్షిప్రం హన్తి ప్రవాహికాం. 14. అంకోటమూల మథవా తండులసలిలేన పటజమూలం వా, పీతం హంత్యతిసారం గ్రహణీరోగం సుదుర్వారం. 42. సితజీరసర్జచూర్ణం బిల్వదలోత్థాంజనమిశ్రితం పీతం, హన్త్యామరక్తశూలం గుడసహితః శ్వేతసర్జో వా. 43. మరిచమహౌషధకుటజం ద్విగుణోత్తర ముత్తరోత్తరం క్రమశః, గుడతక్రయుక్త మేతద్ గ్రహణీరోగం నిహంత్యాశు. 44. బిల్వాగ్రకాంజ మోచాబ్దసిద్ధ మాజం పయః శిశోః, సామం సరక్తాం గ్రహణీం పీతం హన్యా త్రిరాత్రతః. 45. తద్వదజాక్షీరసమో జంబూత్వ గుద్భవో రసః, గుదపాకే తు బాలానాం పిత్తఘ్నం కారయే త్క్రియాం. 46. రసాంజనం విశేషేణ పానాలేపనయో ర్హితం.

బూరుగుజిగట మంజిష్ఠము ధాతకీకుసుమము కమలకేసరములు వీటినినూరి గంజి చేసి త్రాగించిన రక్తాతిసారములు నశించు. తైలము కండచక్కెర తేనె తిలలు మధుకము వీటికల్కము పిల్లలకుగల రక్తస్రావమును ప్రవాహికను పోగొట్టును. పేలాలు మధుకము కండచక్కెర వీటిని నీళ్లతోఁ ద్రావినచో ప్రవాహిక నశించును. అంకోటమూలమును గాని మట్టియూడనుగాని బియ్యపుకడుగుతో నూరి త్రావించిన అతిసారములు

తు దంతాః ప్రోథస్యచోత్తరాః. 55. కుర్యాత్తస్య కుతః శాంతిం బాలస్యాపి ద్విజాతయః, దద్యాత్సదక్షిణం బాలం హైన మేవం ప్రపూజయేత్. 56. పంచమూలీకషాయేణ సఘృతేన పయః శృతం, సశృంగబేరం సగుడం శృతం హిక్కార్దితః పిబేత్. 57. సువర్ణగైరికస్యాపి చూర్ణాని మధునా సహ, లీఢ్వా సుఖమవాప్నోతి క్షిప్రం హిక్కార్దితః శిశుః. 58. చిత్రకం శృంగవేరం చ తథా దంతీగవాక్ష్యపి, చూర్ణం కృత్వా తు సర్వేషాం సుఖోష్ణేనాంబునా పిబేత్. 59. శ్వాసం కాస మథో హిక్కాం కుమారాణాం ప్రణాశయేత్, ద్రాక్షాయా సాభయా కృష్ణా చూర్ణం సక్షౌద్రసర్పిషా. 60. లీఢం శ్వాసం నిహంత్యాశు కాసం చ తమకం తథా, పుష్కరాతివిషా శృంగీ మాధవీధన్వయాసకైః. 61. తచ్చూర్ణం మధునా లీఢం శిశూనాం పంచకాసనుత్, దాడిమస్య చ బీజాని జీరకం నాగకేసరం. 62. చూర్ణితం శర్కరా క్షౌద్ర లీఢం తృష్ణావినాశనం.

పండ్లు పుట్టునప్పటిరోగములయందు పిల్లలకు ఎక్కువ చికిత్సను చేయరాదు. పండ్లురాగానే ఆరోగములు తమంత తామే శాంతించును. పండ్లువచ్చినవాడుగాని తోలి పండ్లువచ్చినవాడుగాని యగు బాలకుల కెట్లు శాంతిని చేయవలయు ననగా దక్షిణతో నాబాలకు నిచ్చివేయవలయును. కాని యుంచుకొనరాదు. పంచమూలకాథము నేయి పాలు అల్లము బెల్లము వీటిని పక్వముచేసి ఎక్కిళ్ళరోగికి త్రాగింపవలయును. బంగరువంటిరంగుగల గైరికము తేనెతో నాకించిన ఎక్కిళ్లునశించును. చిత్రమూలము అల్లము దంతి దంతివేళ్ళు వీటినిచూర్ణముచేసి వెచ్చజేసినీళ్ళతో త్రాగవలయును. శ్వాసకాసములు ఎక్కిళ్లు మున్నగునవి నశించును. ద్రాక్ష పిన్నదూలగొండి కరక్కాయలు పిప్పళ్లు వీటి చూర్ణమును తేనెతోనాకినచో దగ్గు మున్నగునవి నశించును. పుష్కరమూలము అతివస శృంగి పిప్పళ్లు పిన్నదూలగొండి వీటిచూర్ణమును తేనెలో కలిపినాకిన పంచవిధములగు దగ్గులను నశించును. దానిమ్మవిత్తులు జీలకర్ర నాగకేసరములు వీటిని చూర్ణముచేసి కండచక్కెరను కలిపి త్రాగిన తృష నశించును.

## తృషాశాంత్యుపాయములు.

శ్లో. మయూరపక్షభస్మ వ్యుషితజలం తేన భావితం పేయం. 63. తృష్ణాఘ్నం వటకాష్ఠకభస్మజలం వక్త్రశోషజిద్ఘృతం వక్త్రే, పిష్టైశ్ఛాగేన పయసా దార్వీముస్తకగైరికైః. 64. బహి రాలేపనం శస్తం శిశోర్నేత్రామయాపహం, మనఃశిలాశంఖనాభిః పిప్పల్యోఽథగసాంజనం.

65. వర్తిః క్షౌద్రేణ సంయుక్తా బాలే సర్వాక్షిరోగనుత్, మాతుః స్తన్యం కటుస్నేహకాంచికై ర్భావితో జయేత్. 65. స్వేదా ద్దీపశిఖోత్తప్తో నేత్రామయ మలక్తకః, శుంఠీభృంగనిశాకల్కైః పుటపాకైః ససైంధవైః. కుకూలకే౽క్షిరోగేషు భద్ర మాశ్చ్యోతనం హితం, కమిఘ్నాలశిలా దార్వీలాక్షా కాంచన గైరికైః. 67. చూర్ణాంజనం కుకూలే స్యాద్భిశూనాం పోధకీషు చ, సుదర్శనామూలచూర్ణా దంజనం స్యా త్కుకూలకే. 69. గృహధూమనిశాకుష్ఠవాజికేంద్రయవైః శిశోః, లేప స్తక్రేణ హన్త్యాశు సిద్ధ్మ పామావిచర్చికాః. 69.

నెమలికాలియొక్క బూడిదలో నీళ్లను కలిపి త్రాగినను వటకష్టము ధరించినను తృషలు నశించును. మ్రానిపసవు శుంఠి ముస్తెలు గైరికము వీటిని మేకపాలతో నూరి కన్నులకు పట్టువేసినచో నేత్రరోగములు నశించును. మణిశిల శంఖనాభి పిప్పళ్లు రసాంజనము తేనె వీటివత్తినుపయోగించిన నేత్రరోగములు నశించును. లత్తుకరసము పాలు కటుతైలము గంజి వీటిలో తడిపివత్తిచేసి వెలిగించి కాచిన నేత్రరోగములు నశించును. వాయువిడంగము హారిదళము మణిశిల మ్రానిపసపులక్క విషబొద్ది వీటిచూర్ణము ను పిల్లలకు కూరరోగాదులను పోగొట్టును. సుదర్శనపు వేళ్లను కాటుక వేసిన కుకూలము కు మంచిది. బూజు పసపు కోష్టు పెన్నేరు కోడిసెపాల వీటిని మజ్జిగలో నూరి లేపనముచేసిన సిధ్మ పామ విచర్చిక మున్నగు రోగములు నశించును.

## అశ్వగంధ ఘృతము.

శ్లో. పాదికల్కే౽శ్వగంధాయాః క్షీరం దశగుణే పచేత్, ఘృతం పేయం కుమారాణాం పుష్టికృ ద్బలవర్ధనం 69.

పెన్నేరుకల్కము పాలు పదిరెట్లును తీసికొని అందు నేతిని సిద్ధముచేసి త్రాగిన చిన్న పిల్లలకు బలము కలుగును.

## బాలచాంగేరీ ఘృతము.

శ్లో. చాంగేరీస్వరసే సర్పి శ్ఛాగక్షీరసమే పచేత్, కపిత్థవ్యోషసింధూత్థ సమంగోత్పలబాలకైః. 71. సబిల్వధాతకీమోచైః సిద్ధం సర్వాతిసారనుత్, గ్రహణీం దుస్తరాం హంతి బాలానాం తు విశేషతః. 72.

చాంగేరిరసము మేకపాలు వీటిని సమభాగములను గ్రహించి అందు నేతిని పక్వము చేసి వెలగ శొంఠి మిరియములు పిప్పళ్లు సైంధవలవణము మంజిష్ట తెల్లకమల

ములు కురువేరు మారేడు ధాతకీకుసుమము బూరుగుబంక వీటికల్కమును కలిపి సేవించిన అన్నివిధములగు అతిసారాదులు నశించును.

### కుమార కల్యాణఘృతము.

శ్లో. శంఖపుష్పీవచా బ్రాహ్మీ కుష్ఠం త్రిఫలయా సహ, ద్రాక్షా సశర్కరా శుంఠీ జీవంతీ జీరకం బలా. 73. శఠీ దురాలభా బిల్వం దాడిమం సురసః స్థిరా, ముస్తం పుష్కరమూలం చ సూక్ష్మైలా గజపిప్పలీ. 74. ఏషాం కర్షసమై ర్భాగై ర్ఘృతప్రస్థం విపాచయేత్, కషాయే కంటకార్యాశ్చ క్షీరే తస్మిం శ్చతుర్గుణే. 75. ఏతత్కుమారకల్యాణ ఘృతరత్నం సుఖప్రదం, బలవర్ణకరం ధన్యం పుష్ట్యగ్నిబలవర్ధనం. 76. ఛాయా సర్వగ్రహాలక్ష్మీక్రిమిదంతగదాపహం, సర్వబాలా మయ హ రం దంతోద్భేదం విశేషతః. 76.

శంఖుపుష్పి వస బ్రాహ్మి కోష్ఠు త్రిఫలములు ద్రాక్ష కలకండ శొంఠి జీవంతి జీలకఱ్ఱ ముత్తువపులగము కచ్చూరము మారేడు దానిమ్మ బూరుగుబంక శాలిపర్ణి తుంగముస్తెలు పుష్కరమూలము చిన్నయేలకులు ఏనుగుపిప్పళ్లు వీటిని ఒక్కొక్కతులము చొప్పున తెచ్చి 16 పలముల తైలమును సిద్ధము చేయవలయును. వాకుడుకషాయములో నాలుగురెట్లు పాలను గలిపి సిద్ధముచేసి సేవించిన బాలరోగములు దంతరోగములు నన్నియును నశించును.

### అష్టమంగళఘృతము.

శ్లో. వచాకుష్ఠం తథా బ్రాహ్మీ సిద్ధార్థక మథాపి చ, శారివా సైంధవం చైవ పిప్పలీఘృత మష్టమమ్. 77. మేధ్యం ఘృత మిదం సిద్ధం పాతవ్యం చ దినేదినే, దృఢస్మృతిః క్షిప్రమేధాః కుమారో బుద్ధిమా న్భవేత్. 78. న పిశాచా న రక్షాంసి న భూతా న చ మాతరః, ప్రభవంతి కుమారాణాం పిబతా మష్టమంగలం. 79.

వస కోష్ఠు బ్రాహ్మి దిరిసెన మనుబాల సైంధవలవణము పిప్పళ్లు ఎనిమిదవది నేయి వీటిని సిద్ధముచేసి యిచ్చిన బుద్ధి వృద్ధి నొందును. పిశాచరాక్షసాదిబాధలు బాలురకుఁ గలుగవు.

### లాక్షాది తైలము.

శ్లో. లాక్షారససమం సిద్ధం తైలం మస్తు చతుర్గుణం, రాస్నా చందనకుష్ఠాబ్దవాజిగంధానిశాయుతైః. 80. శతాహ్వా దారుయష్ట్యా

హ్వా మూర్వాతిక్తాహరేణుభిః, బాలానాం జ్వరరక్షోఘ్న మభ్యంగా ద్బలవర్ణకృత్. 81.

లాక్షారసముతో సమముగా తైలమును మజ్జిగ తేట నాలుగురెట్లును రాస్నా చందనము కోష్ఠు తుంగముస్తెలు పెన్నేరు పసపు మ్రానిపసపు పిల్లపీచర దేవదారు మధుకము చాగఫలము కటుకరోహిణి రేణుకబీజములు వీటికల్కములో తైలమును సిద్ధము చేసి రుద్దినచో బాలజ్వరములు రాక్షసదోషములు సున్నగునని నశించును.

## గ్రహపీడారాస్నాదులు.

శ్లో. సహాముండితికోదీచ్య క్వాథస్నానం గ్రహాపహం, సప్తచ్ఛాదనిశాకుష్ఠచందనై శ్చానులేపనం. 82. సర్వత్వగ్లశునం మూర్వా సర్ప పారిష్టపల్లవాః, బైడాలబిడజాలోమ మేషశృంగీవచా మధు. 83. ధూపః శిశోర్జ్వరఘ్నోఽయ మశేషగ్రహనాశనః, బలిశాంతీష్టకర్మాణి కార్యాణి గ్రహశాంతయే. 84. మంత్ర శ్చాయం ప్రయోక్తవ్య స్తత్రాదా సర్వకామికః.

రాణిపెసలు ముండితకము తుంగముస్తెలు వీటిని కషాయముచేసి ఇచ్చినను స్నానముచేసినను గ్రహదోషమునుపోగొట్టును. సప్తపర్ణి పసపు కోష్ఠు చందనము వీటిని లేపనముచేయవలయును. పాముకుబుసము లశునము ఛాగఫలము ఆవాలు వేపాకులు పిల్లిమలము మేకరోమములు వస తేనె వీటిని ధూపమువేసిన బాలకులకు జ్వరాదులు నశించును.

## బలిమంత్రములును, విధులును.

శ్లో. "ఓం నమో భగవతే గరుడాయ త్ర్యంబకాయ సద్యస్తవ స్తుతస్వాహా ఓం కం పం టం శం వైనతేయాయ నమః, ఓం హ్రీం హూం క్షః". 85. బాలదేహప్రమాణేన పుష్పమాలాంతు సర్వతః, ప్రగృహ్యా మత్సికా భక్ష్యబలి ర్దేయ స్తు శాంతికః. 86. "ఓంకారీ స్వర్ణపక్షీ బాలకం రక్ష రక్ష స్వాహా, గరుడబలిః ఓం నారాయణాయ నమః. 87.

ఓన్నమోభగవతే గరుడాయ అను మంత్రముతో పిల్లవానిదేహమును కొలచి అంత మాలనుచేసి నాలుగుదిక్కులను త్రిప్పుచు ఓంకారీ అనుమంత్రములో గరుడబలిని వేయవలయును.

## ప్రథమవర్ష మాసదినములలోని గ్రహపీడలు.

శ్లో. ప్రథమే దివసే మాసే వర్షే వా గృహ్ణాతి నందనా నామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః. అశుభం శబ్దం ముంచతి ఆత్కారం చ కరోతి స్తన్యం న గృహ్ణాతి, బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం. నద్యుభయతటమృత్తికాం గృహీత్వా పుత్తలికాం కృత్వా శుక్లౌదనం శుక్లపుష్పం శుక్లసప్తధ్వజాః సప్త ప్రదీపాః సప్తస్వస్తికాః సప్తవటకాః.సప్తశష్కులికాః జంబులికాః సప్త ముష్టికాః గంధం పుష్పం తాంబూలం మత్స్యం మాంసం సురా మగ్ర భక్తం చ పూర్వస్యాం దిశి చతుష్పథే మధ్యాహ్నే బలిర్దేయః. తతోఽశ్వత్థపత్రం కుంభే ప్రక్షిప్య శాంత్యుదకేన స్నాపయేత్. రసోనసిద్ధార్థకమేష శృంగ నింబపత్రశివనిర్మాల్యైర్బాలకం ధూపయేత్. ఓం నమో నారాయణాయ అముకస్య వ్యాధిం హనహనముంచముంచ హ్రీం ఫట్ స్వాహా,ఏవం దినత్రయం బలిం దత్వా చతుర్థదివసే బ్రాహ్మణాం భోజయేత్తతః సంపద్యతే శుభమ్. 89.

తొలియేడు తొలిమాసను తొలిదినమునందు బాలుని మాతృకయను గ్రహము కబళించును. గ్రహము ఆవేశించిన మాత్రాన జ్వరము వచ్చును. ఏడ్చును. ఆవులించును. పాలుత్రాగడు. ఈరోగము శాంతించుటకు బలిని చెప్పుచున్నాను. ఏటికి రుప్రక్కలను న్నమట్టిని తెచ్చి బొమ్మనుచేసి తెల్లఅన్నము తెల్లని పూవులు తెల్లనిఏడుజండాలు ఏడుదీపములు ఏడుస్వస్తికలు ఏడువటకములు ఏడుచక్కిలములు ఏడునేరేడుపండ్లు గంధము పూలుతాంబూలను మత్స్యములు మాంసము కల్లు తీసికొనిపోయి తూర్పుదిక్కున నాల్గు ప్రక్కలు కలసినత్రోవలో బలివేయవలయును. పిమ్మట రావిఆకును కుంభములోనుంచి శాంత్యుదకముతో స్నానమును చేయింపవలయును. ఉల్లిఆకులు మేకకొమ్ములు వేపాకులు గంగాజలము వీటితో పొగవేసి ఓన్నమోనారాయణాయ యను మంత్రముతో మూడురోజులు బలిఈయవలయును.

## రెండవయేడు.

శ్లో. ద్వితీయే దివసే మాసే వర్షేవా గృహ్ణాతి సునందా నామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః చక్షురున్మీలయతి గాత్రముద్వేజయతి న శేతే క్రందతి స్తన్యం న గృహ్ణాతి ఆ

త్కార శ్చ భవతి. బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం, తండులం హస్తపృష్ఠికం దధిగుడఘృతం చ మిశ్రితం, శరావైకం, గంధతాంబూలం పీతపుష్పం పీతసప్తధ్వజాః సప్తప్రదీపాః దశస్వస్తికాః మత్స్యమాంససురాతిలచూర్ణాని పశ్చిమస్యాం దిశి చతుష్పథే బలి ర్దేయః, దినాని త్రీణి సంధ్యాయాం తతః శాంత్యుదకేన స్నాపయేత్, శివనిర్మాల్యసిద్ధార్థ మార్జాలలోమ అశీరవాలఘృతైర్ధూపం దద్యాత్. ఓన్నమో నారాయణాయ అముకస్య వ్యాధిం హన హన ముంచ ముంచ హ్రీం ఫట్ స్వాహా. చతుర్థదినసే బ్రాహ్మణం భోజయే త్తతః సంపద్యతే శుభమ్. 90.

గండవరోజు గండవమాసము గండవరోజు సునందయను గ్రహము గ్రహించును. వెంటనే జ్వరము వచ్చును. కన్నులుమూసికొనును. ఒడలు వడకును. నిద్దురబోడు. ఏడ్చును. పాలుత్రావడు. ఆకాశంతట్టు పెట్టి చూచును. ఇందులకు బలి:—బియ్యము పులిసెడు పెరుగు బెల్లము నేయి వీటితో మిశ్రము చేసినయొక మూకుడు గంధముతాంబూలము పచ్చనిపూవులు పచ్చనిధ్వజములేడు ఏడుదీపములు దశమూలములు మత్స్యమాంసము మద్యము తిలచూర్ణము వీటి పశ్చిమదిక్కున ఓంన్నమోనారాయణాయ అముకస్య అనుమంత్రముతో మూడురోజులు బలివేసి నాలవనాడు బ్రాహ్మణభోజనముచేయవలయును.

ముంజవయేడు.

శ్లో. తృతీయే దివసే మాసే నన్దేవా గృహ్ణాతి పూతనానామ మాతృకా, తథా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, గాత్రముద్వేజయతి స్తన్యం నగృహ్ణాతి ముష్టిం బధ్నాతి క్రందతి ఊర్ధ్వం నిరీక్షతే, బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం, నద్యుభయతటమృత్తికాం గృహీత్వా పుత్తలికాం కృత్వా గంధపుష్పతాంబూలరక్తచందనం రక్తపుష్పం రక్తసప్తధ్వజాః, సప్తప్రదీపాః సప్తస్వస్తికాః పక్షిమాంససురా అగ్రభక్తం చ దక్షిణస్యాం దిశి అపరాహ్ణే చతుష్పథే బలి ర్దాతవ్యః, శివనిర్మాల్య గుగ్గులు సర్షప నింబపత్ర మేషశృంగై ర్దినత్రయం ధూపయేత్, ఓన్నమోనారాయణాయ బాలస్య వ్యా

ధిం హన హన ముంచముంచ హ్రాసయ హ్రాసయ స్వాహా, చతుర్థదివసే బ్రాహ్మణం భోజయే త్తతః సంపద్యతే శుభమ్. 91.

మూడవయేడు మూడవ మాసము మూడవ దినమునందు పూతనయను గ్రహము బాలుని గ్రహించును. తొలుత జ్వరము వచ్చును. ఒడలు వడకును. పాలు త్రాగడు. పిడికిలిఁ బట్టికొనును. ఏడ్చును. పైనిచూచును. ఇందులకు బలి:— ఏటిరెండువైపుల మట్టితో బొమ్మను చేసి గంధపుష్పతాంబూలచందనములను రక్తచందనము రక్తపుష్పములు ఎఱ్ఱని ధ్వజము లేదు ఏడుదీపములు ఏడుస్వస్తికలు పక్షిమాంసము మద్యము వీటిని దక్షిణపు దిక్కున మధ్యాహ్నకాలములో ఓంనమోనారాయణాయ బాలస్య వ్యాధిం అను మంత్రముతో బలినివేసి గంగోదకము గుగ్గులము సున్నగుడానితో ధూపమును వేయవలయును.

## నాల్గవయేడు.

శ్లో. చతుర్థదివసే మాసే వర్షేవా గృహ్ణాతి ముఖమండికా నామ మాతృకా, తయాగృహీత మాత్రేణ ప్రథమం భవతి జ్వరః గ్రీవాం నామయతి అక్షిణీ ఉన్మీలయతి స్తన్యం న గృహ్ణాతి రోదితి స్వపితి ముష్టిం బధ్నాతి బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం, నద్యుభయతటమృత్తికాం గృహీత్వా పుత్తలికాం కృత్వా ఉత్పలపుష్పంగంధతాంబూలం దశధ్వజాః చత్వారః ప్రదీపాః త్రయోదశస్వస్తికాః, మత్స్యమాంససురా, అగ్రభక్తం చ ఉత్తరస్యాం దిశి అపరాహ్ణే చతుష్పథే బలిం దద్యాత్ ఆద్యమాసికో ధూపః ఓన్నమో నారాయణాయ హన హన ముంచ ముంచస్వాహా, చతుర్థదివసే బ్రాహ్మణం భోజయే త్తతః సంపద్యతే శుభమ్.92.

నాలవయేడు నాలవనెల నాలవనాడు ముఖమండికయను గ్రహము గ్రహించును. మొదల జ్వరమువచ్చును. మెడ వంచికొనును. కన్నులను తెఱచికొనును. పాలను త్రాగడు. ఏడ్చును. కలవరించును. పిడికిలి పట్టును. అందులకు బలి:—ఏటియుభయతటముల మట్టిని బొమ్మనుచేసి కలువ గంధము తాంబూలము పదిజండాలు నాలుగుదీపములును, పదుమూడు స్వస్తికలు మత్స్యమాంసాదులు వీటి నుత్తరదిక్కున నపరాహ్ణకాలమున చతుష్పథమునందు బలిని వేయవలయును. ఓన్నమోయను మంత్రముతో ధూపమును వేయవలయును. ఇట్లు మూడు రోజులు చేసి నాలవనాడు బ్రాహ్మణభోజనమును చేయింపవలయును.

## అయిదవయేడు.

**శ్లో.** పంచమే దివసే మాసే వర్షే వా గృహ్ణాతి కటపూతనా నామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వర గాత్ర ముద్వేజయతి స్తన్యం న గృహ్ణాతి ముష్టిం చ బధ్నాతి, బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం. కుంభకారచక్రస్య మృత్తికాం గృహీత్వా పుత్తలికాం నిర్మాయ గంధతాంబూలం శుక్లోదనం శుక్లపుష్పం పంచ ధ్వజాః పంచప్రదీపాః పంచ వటకాః ఐశాన్యాం దిశి బలిర్దాతవ్యః, శాంత్యుదకేన స్నాపయేచ్ఛివనిర్మాల్య సర్వనిర్మోక గుగ్గులు నింబపత్ర వాలకఘృతైర్ధూపం దద్యాత్ "ఓన్నమో నారాయణాయ అముకస్య వ్యాధిం చూర్ణయ చూర్ణయ హనహన స్వాహా" చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్తతః సంపద్యతే శుభమ్. 93.

అయిదవయేడు అయిదవదినమున కటపూతన యనుఅయిదవనెల గ్రహము గ్రహించును. గ్రహావేశమునకు ముందుగా జ్వరము వచ్చును. పిడికిలిని పట్టుకొనును. ఇందులకు బలిని చెప్పుచున్నాను:—కుమ్మరివానిచక్రముక్రిందిమట్టిని తెచ్చి బొమ్మనుచేసి గంధతాంబూలములను తెల్లనియన్నము తెల్లనిపూవులు ఐదుధ్వజములు ఐదుదీపములు ఐదుభక్ష్యములు ఈశానదిక్కునందు ఈక్రింది ఓన్నమోనారాయణాయ్యనుమంత్రముతో బలిని వేయవలయును.

## ఆరవ యేడు.

**శ్లో.** షష్ఠే దివసే మాసే వర్షే వా గృహ్ణాతి శకునికా నామమాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః గాత్రభేదం చ దర్శయతి దివారాత్రౌ వుత్థానం భవతి ఊర్ధ్వం నిరీక్షతే, బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం. పిష్టకేన పుత్తలికాం కృత్వా శుక్లపుష్పం రక్తపుష్పం పీతపుష్పం గంధతాంబూలం దశ ప్రదీపాః దశ ధ్వజాః దశ స్వస్తికాః దశ ముష్టికాః దశ వటకాః క్షీరజంబూడికా మత్స్యమాంససురా ఆగ్నేయ్యాం దిశి నిష్క్రాంతే మధ్యాహ్నే బలిం దాపయేత్. శాంత్యుదకేన స్నాపయేత్ శివనిర్మాల్యరసోనగుగ్గులు సర్వనిర్మోక నింబపత్ర ఘృతైర్ధూపం దద్యాత్. ఓన్నమోనారాయణాయ చూర్ణయ చూర్ణయ హనహనస్వాహా. చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్తతః సంపద్యతే శుభమ్. 94.

ఆరవయేడు ఆరవ నెల ఆరవదినమునందు శకునికయను మాతృక గ్రహించును. తొలుత జ్వరమువచ్చును. రేయిం బవళ్లు ప్రక్కనుండి లేచుచుండును. ఇందులకు బలిని చెప్పుచున్నారు:—పిండితో బొమ్మను చేసి తెల్లపూలు ఎఱ్ఱపూలు పచ్చనిపూలు గంధ తాంబూలములు పదిదీపములు పదిధ్వజములు పదివస్తికలు పదిపిడికిళ్ళు పదివటకములు నేతీఉడుప్పులు మత్స్యమాంసమద్యములు ఆగ్నేయపు దిక్కున మధ్యాహ్నకాలమున బలి వేసి శాంత్యుదకముతో స్నానము చేయించి ఉల్లిపొట్టు గుగ్గిలము మున్నగునానిని ధూపము వేసి ఈక్రింది ఓన్నమోనారాయణాయ అనుమంత్రముతో బలి నొసంగ వలయును.

## ఏడవ యేడు.

శ్లో. సప్తమే దివసే మాసే వర్షే వా యదా గృహ్ణాతి శుష్క- రేవతీనామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః గాత్ర ముద్వేజయతి ముష్టిం బధ్నాతి రోదితి. బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం. రక్తపుష్పం శుక్లపుష్పం గంధ తాంబూలం రక్తౌదనం కృశరా త్రయోదశ స్వస్తికాః మత్స్యమాంససురా త్రయోదశ ధ్వజాః పంచ ప్రదీపాః పశ్చిమదిగ్భాగే గ్రామనిష్కానే అపరాహ్ణే వృక్ష మాశ్రిత్య బలిం దద్యాత్, శాంత్యుదకేన స్నానం గుగ్గులు మేషశృంగసర్షపోశీరవాలకఘృతై ర్ధూపయేత్, ఓన్నమో నారాయణాయ దీప్తతేజసే హన హన ముంచముంచస్వాహా. చతుర్థదివసే బ్రాహ్మణం భోజయే త్తతః సంపద్యతే శుభం. 9 .

ఏడవయేడు ఏడవనెల ఏడవదినమునందు శుష్కరేవతియను గ్రహము ఆవేశించును. తొలుత జ్వరము వచ్చును. గాత్ర ముద్వేగము నొందును. పిడికిలి పట్టుకొనును. ఇందులకు బలి:—రక్తపుష్పములు శుక్లపుష్పములు గంధతాంబూలములు రక్తౌదనము పదుమూడు తొండలు పదిధ్వజములు అయిదు దీపములు స్వస్తికములు మత్స్యమాంస మద్యములు వీటిని పశ్చిమదిగ్భాగమునందు ఊరివెలుపల అపరాహ్ణకాలమునందు వృక్షము క్రింద బలినిచ్చి ఓన్నమోనారాయణాయ అనుమంత్రముతో శాంత్యుదకము ను స్నానమును చేయింపవలెను.

## ఎన్మిదవయేడు.

శ్లో. అష్టమే దివసే మాసే వర్షే వా యది గృహ్ణాతి అర్యకా నామ మాతృకా తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః గృ

ధ్రగంధః పూతిగంధ శ్చ జాయతే,ఆహారం చ న గృహ్ణాతి ఉద్వేజయతి గాత్రాణి. బలిం తస్య ప్రవక్ష్యామి యేన సమ్పద్యతే శుభమ్. రక్తపీతధ్వజాః చందనం పుష్పం శష్కుల్యః పర్పటికాః మత్స్యమాంససురాజంబుడికాః ప్రత్యూషే బలి ర్దేయః ప్రాన్తరే. మంత్రః—ఓంన్నమోనారాయణాయ చతుర్దిఙ్మోక్షణాయ వ్యాధిం హనహన ముంచముంచ ఓం హ్రీం ఫట్ స్వాహా. చతుర్థదివసే బ్రాహ్మణం భోజయే త్తతః సంపద్యతే శుభమ్. 96.

ఎనిమిదవయేడు ఎనిమిదవనెల ఎనిమిదవదినమునందుగాని ఎనిమిదవయేటియందుగాని అర్యకయను మాతృక బాలుని గ్రహించును. తొలుత జ్వరము వచ్చును. గృధ్రగంధము పూతి గంధమును కలుగును. తిండితినఁడు. గాత్రోద్వేజనకలుగును. అందులకు బలినిచెప్పుచున్నాను:—రక్తపీత ధ్వజములు చందనము పూవులు శష్కులులు పర్పటికలు మత్స్యమాంసమద్యములు వీటిని ఓంన్నమో యను మంత్రముతో ప్రాతఃకాలమున బలి వేయవలయును.

## తొమ్మిదవయేడు.

శ్లో. నవమే దివసే మాసే వర్షే వా గృహ్ణాతి భూసూతికానామ మాతృకా. తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, నిత్యం ఛర్ది ర్భవతి గాత్రభేదం దర్శయతి;ముష్టిం బధ్నాతి; బలిం తస్య ప్రవక్ష్యామి యేన సమ్పద్యతే శుభమ్. నద్యుభయతటమృత్తికాం గృహీత్వా పుత్తలికాం నిర్మాయ శుక్లన స్త్రేణ వేష్టయే చ్ఛుక్లపుష్పం గంధ తాంబూలం శుక్లత్రయోదశధ్వజాః త్రయోదశ దీపాః త్రయోదశ స్వస్తికాః త్రయోదశ పుత్తలికాః మత్స్యమాంససురాః ఉత్తరదిగ్భాగే గ్రామనిష్క్రామే బలిం దద్యాత్. శాంత్యుదకేన స్నానం గుగ్గులు నింబపత్ర గోశృంగ శ్వేతసర్షపఘృతై ర్ధూపం దద్యాత్. మంత్రః—"ఓం న్నమోనారాయణాయ చతుర్భుజాయ హన హన ముంచ ముంచ స్వాహా." చతుర్థదివసే బ్రాహ్మణాం భోజయే త్తతః సంపద్యతే శుభం. 97.

తొమ్మిదవయేడు తొమ్మిదవనెల తొమ్మిదవ దినమునగాని తొమ్మిదవయేడుగాని భూసూతికయను గ్రహము గ్రహించును. తొలుతజ్వరము వచ్చును. ఛర్దికలుగును. ఒడలు విఱుపుపుట్టును. ఇందులకుబలి:—నదియొక్క రెండుగట్టులమట్టితోను బొమ్మను చేసి శ్వేతవస్త్రము శ్వేతకుసుమములు చందనతాంబూలములు తెల్లజండాలు పదుమూడు పదుమూడుదీపములు 13 ముగ్గులు 13 బొమ్మలు 13చేపలు మద్యమాంసములు వీటి

తో నుత్తరదిక్కున 'ఓం నమో నారాయణాయ' యను మంత్రముతో బలిని వేసి శాంతి స్నానమును చేయింపవలయును.

పదవయేడు.

శ్లో. దశమే దివసే మాసే వర్షే వా గృహ్ణాతి నిర్బృతా నామ మాతృకా తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః. గాత్ర ముద్వేజయతి ఆత్కారం కరోతి, రోదితి, మూత్రం పురీషం చ భవతి. బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం, పారావారమృత్తి కాం గృహీత్వా పుత్తలికాం నిర్మాయ గంధతాంబూలం రక్తపుష్పం రక్తచందనం పంచవర్ణధ్వజాః పంచ ప్రదీపాః పంచ స్వస్తికాః పంచ పుత్తలికాః మత్స్యమాంససురాః వాయవ్యాం దిశి బలిం దద్యాత్, కాకవిష్ఠాగోమాంసగోశృంగరసోన మార్జారలోమ నింబపత్ర ఘృతై ర్ధూపయేత్. ఓన్నమోనారాయణాయ చూర్ణితహస్తాయ ముంచ ముంచ స్వాహా. చతుర్థదివసే బ్రాహ్మణం భోజయే త్తతః సుస్థో భవతి బాలకః. 98.

పదవయేడు పదవ నెల పదవదినముగాని పదవయేడుగాని నిర్జతయను మాతృక గ్రహించును. జ్వరము వణకు ఆత్కారము లెక్కువగా మలమూత్రములు కలుగును. ఇందుకు బలి యిట్లు:—సముద్రపుమట్టితో బొమ్మను చేసి గంధతాంబూలములు ఎఱ్ఱ నిపూలు ఎఱ్ఱనిగంధము పంచవర్ణపు ధ్వజములు పంచదీపములు పంచస్వస్తికలు పంచపుత్తలికలు మత్స్యమాంస మద్యములు వాయువ్యదిక్కున బలి నిచ్చి కాకవిష్ఠాదులతో ఓన్నమోయను మంత్రముతో ధూపము వేసి నాలవరోజు బ్రాహ్మణభోజనమును చేయింపవలయును.

పదునొకండవ యేడు.

శ్లో. ఏకాదశే దివసే మాసే వర్షే వా యది గృహ్ణాతి బలిపిచ్ఛికానామ మాతృకా. తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః ఆహారం న గృహ్ణాతి; ఊర్ధ్వదృష్టి ర్భవతి; గాత్రభంగో భవతి, బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం, పిష్టకేన పుత్తలికాం కృత్వా రక్తచందన రక్తం చ తస్యా ముఖం దుగ్ధేన సించేత్. పీతపుష్పం గంధ తాంబూలం సప్త పీతధ్వజాః సప్తప్రదీపాః అష్టౌ వటకాః అష్టౌ శష్కు

లికాః అష్టౌ పూరికాః మత్స్యమాంససురాః, పూర్వస్యాం దిశి బలి ర్దాతవ్యః శాంత్యుదకేన స్నానం, శివ నిర్మాల్యగుగ్గులు గోశృంగ సర్ప నిర్మోకఘృతై ర్ధూపయేత్, "ఓన్నమో నారాయణాయ ముంచ ముంచ స్వాహా" చతుర్థదివసే బ్రాహ్మణం భోజయే త్తతః, సుస్థో భవతి బాలకః. 99.

పదునొకండవయేడు పదునొకండవనెల పదునొకండవదినముగాని పదునొకండవ వర్షముగాని పిలిపిచ్ఛికయను మాతృక గ్రహించును. దానియావేశ మాత్రమున జ్వరము అన్నము తినకపోవుట ఊర్ధ్వదృష్టి గాత్రభంగము మున్నగునవి కలుగును. అందుల కీ క్రిందిరీతిని బలిసీయవలయును:—పిండిబొమ్మను చేసి రక్తచందనము రక్తము, ఆబొమ్మ ముఖమును పాలతో తడిపి పచ్చనిపూవులు గంధతాంబూలములు పచ్చనియేడుజండాలు ఏడుదీపములు 8 వడలు ఎన్మిది చక్కిలములు ఎన్మిదిపూరీలు మత్స్యమాంసమద్యములు వీటిని పూర్వదిక్కున బలిసీయవలయును. ఓన్నమోనారాయణాయ యనునది బలిమంత్రము.

## పంద్రెండవయేడు.

శ్లో. ద్వాదశే దివసే మాసే వర్షే వా యది గృహ్ణాతి కాముకా నామ మాతృకా, తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః, విహస్య వాదయతి కరేణ తర్జయతి గృహ్ణాతి క్రామతి నిఃశ్వసితం ముహుర్ముహు రాహారం న కరోతి, బలిం తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం. క్షీరేణ పుత్తలికాం కృత్వా, గంధం తాంబూలం శుక్లపుష్పం శుక్లసప్తధ్వజాః, సప్త ప్రదీపాః సప్త పూపికాః కరస్థేన దధిభక్తేన సర్వకర్మబలిం దద్యా చ్ఛాంత్యుదకేన స్నాపయేత్ శివనిర్మాల్యగుగ్గులు సర్పఘృతై ర్ధూపయేత్, ఓన్నమోనారాయణాయ ముంచ ముంచ హన హన స్వాహా చతుర్థదివసే బ్రాహ్మణం భోజయే త్తతః సుస్థో భవతి బాలకః. 100.

పంద్రెవయేడు పంద్రెండవనెల పంద్రెండవదినమునందుగాని పంద్రెండవ వర్షమునందుగాని కాముకయనుమాతృక గ్రహించును. తొలుతజ్వరము వచ్చును. వెనుక నవ్వు నవ్వును. వాదించును. బెదరించును. పట్టుకొనును. దాటును. నిట్టూర్పు విడుచును. భుజింపకుండును. ఇందుల కీక్రిందివిధమున బలినిచ్చిన మేలు కలుగును:—పాలతో బొమ్మను చేసి గంధతాంబూలాదులు శుక్లపుష్పములు తెల్లని ఏడుధ్వజములు ఏడుదీపములు,

ఏడుపూరీలు చేతిలో పెరుగన్నమును ఉంచికొని బలినిచ్చి కాంస్యోదకములతో స్నానమును చేయింపవలయును. శివనిర్మాల్యము గుగ్గిలము ఆవాలు నేయి వీటితోప గ వేయవలయును. బలిమంత్రము:— ఓం నమో నారాయణాయ ముంచ ముంచ హన హన స్వాహా” అని. నాల్గవదినమునందు బ్రాహ్మణ భోజనమును చేయించినచో బాలుడు సుస్థుఁడై యుండును.

ఇట్లు చక్రదత్తయందు బాలరోగాధికారప్రకరణము ముగిసెను.



# ౬౮. విషాధికారము.

అరిష్టాబంధనమను మంత్రమును, విషహారములగు ప్రయోగములునుగాని, ఈదుఫలమును తినుటగాని విషఘ్నములగు చికిత్సలు.

శ్లో. అరిష్టా స్బంధనం మంత్రం ప్రయోగ శ్చ విషాపహాః, దంశనం దంశక స్యాహేః ఫలస్య మృదునోఽపి వా. 1. మూలం తండులవారిణా పిబతి యః ప్రత్యంగిరాసంభవం, నిష్పిష్టం శుచి భద్రయోగదివసే తస్యాహిభీతిః కుతః. 2. దర్వాదేవ ఫణీ యథా దశతి తం మోహాన్వితో మూలపం, స్థానే తత్ర స ఏవ యాతినియతం వక్త్రం యమస్యాచిరాత్. 3. మసూరం నింబపత్రాభ్యాం ఖాదే న్మేషగతే రవౌ, అబ్ద మేకం న భీతి స్స్యా ద్విషా త్తస్య న సంశయః. 4. ధవలపునర్నవజటయా తండులజలపీతయా చ పుష్యర్క్షే, అపహరతి విషధరవిషోపద్రవ మావత్సరం పుంసామ్. 5. గృహధూమో హరిద్రే ద్వే సమూలం తండులీయకం, అపి వాసుకినా దష్టః పిబే ద్దధి ఘృతాప్లుతం. 6. కూలికామూలనస్యేన కాలదష్టోఽపి జీవతి, శ్లేష్మణః కర్ణయూథస్య వామానామికయా కృతః. 7. లేపో హన్యా ద్విషం ఘోరం నృమూత్రాసేచనం తథా, శిరీషపుష్పస్వరసే భావితం శ్వేతసర్షపం. 8. సప్తాహం సర్పదష్టానాం నస్యపానాంజనే హితం, ద్విపలం నతకుష్టాభ్యాం ఘృతక్షౌద్రం చతుఃపలం. 9. అపి తక్షకదష్టానాం పాన మేత త్సుఖప్రదం, వంధ్యకర్కోటజం మూలం ఛాగమూత్రేణ భావితం. 10. నస్యం కాంజికసంయుక్తం విషోపహతచేతసః.

ప్రత్యంగిరా (ముండ్లదిరిసెన) మూలమును బియ్యముకడుగుతో నూరి త్రాగినచో సర్పభయములేదు. ఒకవేళ యెప్పుడైనను భ్రాంతివలనఁ గఱచినచో నాసర్పమే నశించును. నల్లతెగడను వేపాకును మేషమునందు సూర్యుఁ డుండఁగా భక్షించినచో ఒకసంవత్సరమువఱకును సర్పభయము కలుగదు. పుష్యనక్షత్రమునందు తెల్లగలిజేరును బియ్యపుకడుగుతో నూరి సేవించిన సంవత్సరము వఱకును విషభయ ముండదు. ఇంటిబూజు పసపు మ్రానిపసపు మూలకము బియ్యపుకడుగు వీటిని నూరి నేతిని చేర్చికొని త్రాగినచో వాసుకి గఱచినను బ్రదుకఁగలఁడు. దంతివేళ్లను నస్యవిధిచేసిన కాలదష్టుఁడైనను బ్రదుకును. గుమిలితో వామనాసికయందు చేసిన లేపనుగాని విషమును పోగొట్టును. మనుష్యునిమూత్రముతో తడుపుట యును విషహరమగును. తెల్లయూవాలను దిరిసెనపూవులతో భావనచేసి ఏడుగోజులు నస్యపానాంజనములుగా సేవించుట మంచిది. తగరము కోష్ఠు 2 పలములును నెయ్యి తేనె 4 పలములును త్రాగించిన తక్షకదష్టులైనను సుఖింపగల్గుదురు. మధ్యకర్కోటకపు వేరును మేకమూత్రములో భావనచేసి గంజిని గలిపి నస్యము నిచ్చిన విషములు నశించును.

## త్రివృతాదిచూర్ణము.

శ్లో. త్రివృ ద్విశాలా మధుకం హరిద్రే మంజిష్ఠవర్గో లవణం చ సర్వమ్, కటుత్రికం చైవ విచూర్ణితాని శృంగే నిదధ్యా న్మధునాయుతాని. 11. ఏషో౽గదో హం త్యుపయుజ్యమానః పానాంజనాభ్యంజన నస్యయోగైః, అవార్యవీర్యో విషవేగహంతా మహాగదో నామ మహాప్రభావః. 12. పీతే విషే స్యా ద్వమనం చ త్వక్స్థే ప్రదేహసేకాది సుశీతలం చ, కపిత్థమాంసం ససితా క్షౌద్రం కంఠగతే విషే, లిహ్యా దామాశయగతే తాభ్యాం చూర్ణపలం నతాత్. 13. విషే పక్వాశయగతే పిప్పలీరజనీద్వయం, మంజిష్ఠాం చ సమం పిష్ట్వా గోపిత్తేన నరః పిబేత్. 14. రజనీసైంధవక్షౌద్రసంయుక్తం ఘృత ముత్తమం, పానం మూలవిషార్తస్య దిగ్ధవిద్ధస్య చేష్యతే. 15. సితామధుయుతం చూర్ణం తామ్రస్య కనకస్య వా, లేహః ప్రశమయ త్యుగ్రం సర్వసంయోగజం విషం. 16. అంకోటమూలనిఃక్వాథం పాణితం సఘృతం లిహేత్, తైలాక్తః స్విన్నసర్వాంగో గరదోషవిషాపహః. 17. కటభ్యంజన శైరీయ శేలుక్షీరద్రుమత్వచః, కషాయచూర్ణకల్కాః

స్యుః కీటలూతా వ్రణాపహాః. 1౮. అగారధూమ మంజిష్ఠా రజనీలవణోత్తమైః, లేపో జయ త్యాఖువిషం కర్ణికాయూ శ్చ పానతః. 19.

తెల్లతెగడ కొడిసెపాలవిత్తులు మధుకము పసపు మ్రానిపసపు మంజిష్ఠవర్గము సమస్తలవణములు శొంఠి మిరియములు పిప్పళ్లు వీటిని చూర్ణముచేసి తేనెతో నాకినను అంజనము మర్దనము మున్నగు రీతుల నుపయోగించినను వ్యర్థముగాక విషవేగములను శాంతినొందించును. విషమును త్రాగిన వాంతి చేయింపవలయును. కంఠస్థితమైనచో లేపనసేచనాదులం జేయునది. కపిత్థమును మాంసమును కలకండ తేనెతో సేవింప వలయును. పక్వాశయము నందున్నచో పిప్పళ్లు పసపు మ్రానిపసపు మంజిష్ఠ వీటిని సమభాగములను గోపిత్తములోనూరి త్రాగవలయును. పసపు సైంధవలవణము తేనె నెయ్యి వీటినిత్రాగినచో కాల్చిన తెగనఱకిన మూలపువిషములును నశించును. రాగియొక్కగాని బంగారుయొక్కగాని చూర్ణములో చక్కెరను తేనెను గలిపి నాకిన సంయోగజములగు విషములు హరించును. అంకోటమూలమును కషాయముచేసి తేనెతో త్రాగవలెను. నల్లమద్దిమద్ది గోరెంటలశునము పాలవృక్షపు బెరడులు వీటిచెక్కలను చూర్ణముచేసి కషాయకల్కములనుజేసి సేవించిన లూతావిషములు నశించును.

## వృశ్చికాదివిషములు.

శ్లో. యః కాసమర్దనపత్రం వదనే ప్రక్షిప్య కర్ణే ఫూత్కారం, మనుజ్యో దదాతి శీఘ్రం జయతి విషం వృశ్చికానాం సః. 20. దంశే భ్రమేణ విధినా వృశ్చికవిషహృత్తు కైరపదగుడికా, పురధూపపూర్వ మర్కచ్ఛదభవ పిష్ట్వా కృతో లేపః. 21. జీరకస్య కృతః కల్కో ఘృతసైంధవసంయుతః, సుఖోష్ణో వృశ్చికార్తానాం సులేపో వేదనాపహః. 22. అమలాఘుర్ష్ణం దంశే కంటకం చ త దుద్ధరేత్, కరణే విషజే లేపా తృణజ్జకరసోధవా. 23. కుంకుమకునటీకర్కట హరితాలైః కుసుంభసమ్మిలితైః, కృతగుడికాభ్రామగతో విదష్టగోధాసరట విషజిత్. 24. అంకోటపత్రధూమో మీనవిషం ఝటితి విఘటయే చ్ఛృంగీ, గోధాసరటీవిషమివ ఆలేపేన కుటజకపాలిజటా. 25. కనకోదుంబరఫలమివ తండులజలపిష్టం పీత ముపహరతి, కనకదలద్రవ ఘృత గుడ దుగ్ధపలైకం శునాం గరలం. 26. లేప ఇవ భేకగరలం శిరీషబీజైః స్నుహీపయస్సిక్తైః, హారతి గరలం త్వరితా మశితాంకోటజటాకుష్ఠ

సమ్మిలితా. 27. మరిచమహౌషధవాలక నాగాహ్వార్కక్షీ కావిషే లేపః, లాలావిష ననునయతో మూలే మిలితే పటోలనీలికయోః. 28.

కాసమర్దనపు ఆకును (కసివెంద) ఆకును నోటిలోబెట్టికొని చెవిలో నూదిన తేలువిషములు శాంతించును. భ్రమచేతఁ గట్టైనేని మణిశిలను నూరి లేపనచేసిన విషములు హరించును. శిఁకట్టును కల్కముచేసి తేనెసైంధవలవణములను కలిపి యిచ్చిన వృశ్చికపీడలు నశించును. లేనిచో కుట్టినచోట ఉసిరికను రుద్దినను మంటితో కుట్టినను మంచిది. కుంకుమపువ్వు మణిశిలదంతి హరిదళము నీటిని నూరి మాత్రచేసి గాయముచుట్టును త్రిప్పినచో బల్లిమున్నగువాని విషములు హరించును. అంకోటపత్రపుధూమము చేపవిషమును పోగొట్టును. ఉమ్మెత్త మేడిఫలములను కడుగుతో నూరి ఉమ్మెత్తరసము నేయి బెల్లము పాలు కలిపి ఒకపలము త్రాగిన శునకవిషములు నశించును.

## సోమవల్క్యాదిక్వాథములు.

శ్లో. సోమవల్కోఽశ్వకర్ణశ్చ గోజిహ్వాహంసపాద్యపి, రజన్యౌ గైరికం లేపో నఖదంతవిషాపహః. 29. వచాహింగువిడంగాని సైంధవం గజపిప్పలీ, పాఠాప్రతివిషావ్యోషం కాశ్యపేన వినిర్మితమ్. 30. దశాంగ మగదం పీత్వా సర్వకీటవిషం జయేత్, కీటదష్టక్రియా స్సర్వాః సమానాః స్యు ర్జలౌకసామ్. 31. పృక్కాప్లవస్థౌణేయ కాక్షీశైలేయరోచనాతగరమ్, ధ్యామకం కుంకుమం మాంసీ సురసా గైలాలకుష్ఠఘ్నం. 32. బృహతీశిరీషపుష్ప శ్రీవేష్టక పద్మచారటివిశాలాః, సురదారు పద్మకేశర, శారవక మనఃశిలాకౌంత్యః. 33. జాత్యర్కపుష్పసర్షప రజనీద్వయ హింగుపిప్పలీ ద్రాక్షాః, జలముద్గపర్ణీమధుక మదనక మథ సింధువారా శ్చ, సంపాక లోధ్రమయూరక గంధఫలీలాంగలీ విడంగాః. 34. పుష్యే సముద్ధృత్య సమం పిష్ట్వా గుడికా విధేయా స్స్యుః, సర్వవిషఘ్నో జలకృద్విషసంజీవనో జ్వరనిహంతా. 35. పేయవిలేపనధారణ ధూమగ్రహణై ర్గృహస్థస్య, భూతవిషజంత్వలక్ష్మీ కార్మణమంత్రాగ్న్యశన్యరీ హన్యాత్. 36. దుస్స్వప్నస్త్రీదోషాకాలమరణాంబుచారభయం, ధనధాన్య కార్యసిద్ధి శ్రీపుష్టిర్వర్ణాయుర్వర్ధనో ధన్యః, మృతసంజీవన ఏవ ప్రాగమృతా ద్బ్రహ్మణాభిహితః. 37.

వెలిచంద్ర అశ్వకర్ణవృక్షము పసపు మ్రానిపసపు వీనినినూరి లేపనచేసిన నఖదంతవిషములు నశించును. వస ఇంగువ వాయువిడంగము సైంధవలవణము ఏనుగ పిప్పలి విషబొద్ది అతివస శొంఠి మిరియములు పిప్పళ్లు ఇయ్యవి త్రాగిన సమస్తపీడలను పోగొట్టును. ఈదశాంగపు ఔషధము సర్వకీటకముల విషమునుఁ బోగొట్టును.

ఇట్లు చక్రదత్తయందు విషాధికార ప్రకరణము ముగిసెను.

---

# ౬౫. రసాయనాధికారము.

## రసాయనప్రకారము.

శ్లో. యజ్జరావ్యాధి విధ్వంసి భేషజం తద్రసాయనం, పూర్వే వయసి మధ్యే వా శుద్ధదేహః సమాచరేత్. 1. నావిశుద్ధశరీరస్య యుక్తో రసాయనో విధిః, నాభాతి వాససి క్లిష్టేరంగయోగ ఇవార్పితః. 2. గుడేన మధునా శుంఠ్యా కృష్ణయా లవణేన వా, ద్వేద్వే ఖాదన్సదా పథ్యా జీవే ద్వర్షశతం సుఖీ. 3. సింధూత్థ శర్కరాశుంఠీ కణా మధుగుడః క్రమాత్, వర్షాదిష్వభయా సేవ్యా రసాయనగుణైషిణా. 4. త్రైఫలేనాయసీం పత్రీం కల్కేనా లేపయే న్నవాం, త మహోరాత్రికం లేపం పిబేత్ క్షౌద్రోదకాప్లుతం.౫. ప్రభూతస్నేహ మశనం జీర్ణే తస్మి న్ప్రయోజయేత్. అజరోరుకనాభ్యాసా జీవే చ్చాపి సమాః శతం. 6.

ముసలితనమును వ్యాధిని పోగొట్టెడిదానిని రసాయనమందురు. ప్రథమావస్థలో కాని మధ్యావస్థలోగాని శుద్ధశరీరుఁడై మనుజుడు దీనినిచేయవలయును. శుద్ధశరీరికాని వానికి రసాయనమును బ్రయోగింపరాదు. బెల్లము తేనె శొంఠి పిప్పళ్లు ఉప్పు వీటిలో దేనితోనైననొకదానితోటి కరక్కాయలను తినెడి మనుష్యుఁడు నూరువర్షములు జీవించును. సైంధవలవణము కండచక్కెర శొంఠి పిప్పళ్లు తేనె బెల్లమును వర్షాదిఋతువులందు రసాయనము వంటిగుణమును కోరెడివాడు సేవింపవలయును. త్రైఫలరసముతో లోహపత్రిని నూఁరు దినరాత్రులంతయును తేనెతో నీటితో లేపనచేసినచో మంచిది. జీర్ణించిన పిమ్మట చాల స్నేహయుక్తమగు భోజనమును పెట్టింపవలయును. వీని నభ్యసించుటవలన ముదుసలితనము లేక నూరువర్షములు జీవింపఁగలడు.

## త్రిఫలారసాయనము.

శ్లో. పంచాష్టౌ సప్తదశ వా పిప్పలీః క్షౌద్రసర్పిషా, రసాయనగుణాన్వేషీ సమామేకాం ప్రయోజయేత్, తిస్రస్తిస్రస్తు పూర్వాహ్ణే భుక్త్వాగ్రే భోజనస్య చ. 7. పిప్పల్యః కింశుకక్షారభావితా ఘృతభర్జితాః, ప్రయోజ్యా మధుసంమిశ్రా రసాయనగుణైషిణా. 8. జేతుం కాసం క్షయం శ్వాసం శోషం హిక్కాం గలామయం, అర్శాంసి గ్రహణీదోషం పాండుతాం విషమజ్వరం. 9. వైస్వర్యం పీనసం శోషం గుల్మం వాతబలాసకం, జరణాం తేఽభయా మేకాం ప్రాగ్భక్తే ద్వే విభీతకే. 10. భుక్త్వాతు మధుసర్పిర్భ్యాం చత్వార్యామలకాని చ, ప్రయోజయేత్సమా మేకాం త్రిఫలాయా రసాయనం, జీవేద్వర్షశతం పూర్ణ మజరోఽవ్యాధి రేవ చ. 11.

అయిదుఎన్మిది లేక ఏడు పదిపిప్పళ్లను తేనెతోను నేతితోను రసాయనగుణమును కోరువాడు ఒక వత్సరము సేవింపవలయును. ప్రొద్దుటిపూట భోజనమునకు ముందు మూడేసి కాయలను మోదుగక్షారముతో భావనచేసి నేతితోవేయించి తేనెగలిపిసేవింపవలయును. దగ్గు క్షయ శ్వాసము వాపు ఎక్కిళ్లుగలరోగము మూలరోగము గ్రహణీరోగము పాండురోగము విషమజ్వరము స్వరభేదము పీనస శోష గుల్మము వాతము కఫము నశించును. భోజనమైనపిమ్మట ఒకకరక్కాయను భోజనముకు వెనుక రెండు తాడికాయలను నాల్గు ఉసిరికకాయలను తేనె నేతులతో తీసికొనవలయును. దీని నొకసంవత్సరము సేవింపవలయును. అట్టివాడు ముసలితనము రోగము లేక నూరేండ్లు జీవించును.

## మండూకపర్ణ్యాదిరసాయనము.

శ్లో. మండూకపర్ణ్యాః స్వరసః ప్రయోజ్యః క్షీరేణ యష్టీమధుకస్య చూర్ణం, రసో గుడూచ్యాస్తు సమూలపుష్పాయాః కల్కః ప్రయోజ్యః ఖలు శంఖపుష్ప్యాః. 12. ఆయుఃప్రదాన్యామయనాశకాని బలాగ్నివర్ణస్వరవర్ధనాని, మేధ్యాని చైతాని రసాయనాని మేధ్యావిశేషేణ తు శంఖపుష్పీ. 13. పీతాశ్వగంధా పయసార్ధమాసం ఘృతేన తైలేన సుఖాంబునా వా, కృశస్య పుష్టిం వపుషో విధత్తే బాలస్య సస్యస్య యథాంబువృష్టిః. 14. ధాత్రీతిలాన్భృంగరజోవిమిశ్రాన్ యే భక్షయేయుర్మనుజాః క్రమేణ, తే కృష్ణకేశా విమలేంద్రియాశ్చ నిర్వ్యాధయో వర్షశతం భవేయుః. 15.

దుండిగపురసమును మధుకచూర్ణమును పాలతో ప్రయోగింపవలయును. ముల్లంగిరసము తిప్పతీగెరసములతో శంఖపుష్పికల్కమును చేసి ప్రయోగింపవలయును. నేతితో తైలముతో లేక వేడినీటితో సేవించిన కృశశరీరము పుష్టమగును. ఉసిరిక తిలలు గుంటకలగరచూర్ణము వీటిని కలిపి క్రమముగా సేవించువాడు నల్లని కురులు గలిగి స్వచ్ఛములగు నింద్రియములు కలవాడై వ్యాధిరహితుడై నూరేండ్లు జీవించును.

వృద్ధదారక చూర్ణము.

శ్లో. వృద్ధదారకమూలాని శ్లక్ష్ణచూర్ణాని కారయేత్, శతావర్యా రసేనైవ సప్తరాత్రాణి భావయేత్. 16. అక్షమాత్రంతుతచ్చూర్ణంసర్పిషా సహ భోజయేత్, మాసమాత్రోపయోగేనమతిమాన్ జాయతే నరః. 17. మేధావీ స్మృతిమాంశ్చైవ వలీపలితవర్జితః, హస్తికర్ణరజః ఖాదేత్ప్రాతరుత్థాయ సర్పిషా. 18. యథేష్టాహారాచారోఽపి సహస్రాయుర్భవేన్నరః, మేధావీ బలవాన్కామీ స్త్రీశతాని వ్రజత్యసౌ. 19. మధునా త్వశ్వవేగః స్యాద్బలిష్ఠః స్త్రీసహస్రగః, మంత్రశ్చాయం ప్రయోక్తవ్యో భిషజా చాభిమంత్రణే. 20. "ఓన్నమో మహావినాయకాయ అమృతం రక్ష రక్ష మమ ఫలసిద్ధిం దేహి రుద్రవచనేన స్వాహా."

వృద్ధదారకపు వేళ్లను చక్కగా పొడిచేసి శతావరిరసముతో నేడుగాత్రులు భావన చేసి అక్షమాత్రమును నేతితో నెలరోజులు సేవించినచో బుద్ధిమంతుడగును. మేధావియును స్మృతిమంతుడును తలనెఱపులేనివాడుగను అగును. ప్రొద్దున లేచి ఆముదపు చూర్ణమును నేతితోగాని హస్తికందచూర్ణమును గాని తిని మనోవాంఛితమగుభోజనము చేసినచో వేయేండ్లు ఆయుష్మంతుడగును. ఉత్తమబుద్ధి గలవాడుగను, బలిష్ఠుడుగను కామిగను అగును. తేనెతో కలిపి త్రాగినగుఱ్ఱమువంటి వేగముకలవాడుగను అధికమగు బలము కలవాడుగను వేలస్త్రీలతో భోగించువాడుగ నగును. వైద్యుడు నభిమంత్రించుటలో ఓంనమో మహావినాయకాయ యను మంత్రము నుపయోగింపవలెను.

ఉసిరిక తిప్పతీగెల చూర్ణము.

శ్లో. ధాత్రీచూర్ణస్య కర్షం స్వరసపరిగతం క్షౌద్రసర్పిఃసమాంశం, కృష్ణామాసీసితాష్టప్రసృతయుత మిదం స్థాపితం భస్మరాశౌ. 21. వర్షాంతే తత్సమశ్నన్భవతి విపలితో రూపవర్ణప్రభావై, ర్నిర్వ్యాధి

ర్బుద్ధిమేధా స్మృతిబలవచన స్థైర్యసత్త్వై రుపేతః. 22. గుడూచ్యపామార్గవిడంగశంఖినీ వచాభయాకుష్ఠ శతావరీసమా, ఘృతేన లీఢా ప్రకరోతి మానవం త్రిభి ర్దినైః శ్లోకసహస్రధారిణం. 23.

ఉసిరిక చూర్ణము 64 పలములు ఉసిరిక రసములో కలిపి తేనెను నేతిని సమభాగములను కలిపి పాత్రలో వైచి అన్నములో నుంచి ఒక వర్షము వఱకు సేవించుచున్న మనుజుఁడు రూపవర్ణప్రభావములు కలవాఁడై వ్యాధిరహితుఁ యుత్తమమగు ధారణను స్మృతిని కలిగి యుండును. తిప్పతీగె ఉత్తరేణు వాయువిడంగములు శంఖిని వస కరక్కాయలు కోష్ఠు పిల్లపీచర పీటిని సమభాగములను నేతిలో కలిపి సేవించిన మూడుదినములలో వేయిశ్లోకములు ధరించువాడగును.

## బ్రాహ్మీఘృతము.

శ్లో. సమూలపత్త్రి మాదాయ బ్రాహ్మీం ప్రక్షాళ్య వారిణా, ఉలూఖలే క్షోదయిత్వా రసం వస్త్రేణ గాలయేత్. 24. రసే చతుర్గుణే తస్మి న్ఘృతప్రస్థం విపాచయేత్, ఔషధాని తు పేష్యాణి తానిమాని ప్రదాపయేత్. 25. హరిద్రామాలతీకుష్ఠం త్రివృతా సహారీతకీ, ఏతేషాం పలికా న్భాగాన్ శేషాణాం కార్షికాణి తు. 26. పిప్పల్యోథ విడంగాని సైంధవం శర్కరా వచా, సర్వ మేత త్సమాలోడ్య శనైః మృద్వగ్నినా పచేత్. 27. ఏత త్ప్రాశితమాత్రేణ వాగ్విశుద్ధి శ్చ జాయతే, సప్తరాత్రప్రయోగేణ కిన్నరై స్సహ గీయతే. 28. అర్ధమాసప్రయోగేణ సోమరాజీవపు ర్భవేత్, మాసమాత్రప్రయోగేణ శ్రుతమాత్రం తు ధారయేత్. 29. హంత్యష్టాదశ కుష్ఠాని అర్శాంసి వివిధాని చ. పంచ గుల్మా న్ప్రమేహాం శ్చ కాసం పంచవిధం జయేత్. 30. వంధ్యానాం చైవ నారీణాం నరాణాం చాల్పరేతసాం, ఘృతం సారస్వతం నామ బలవర్ణాగ్నివర్ధనం. 31.

ఆకులు వేళ్లతో బ్రాహ్మిని నీటితో కడిగి ఱోటిలో దంచి వడియగట్టి నాలుగురెట్ల రసములో ఒక ప్రస్థము నేయిని పక్వముచేసి ఈ క్రింది యౌషధులనునూరి కలపవలయును. పసపు జాజికోష్ఠు తెల్లతెగడ కరక్కాయలు నీటిని ఒకొక్కపలము తక్కినవాటిని కర్షముచొప్పునను కలపవలయును. పిప్పళ్లు వాయువిడంగములు సైంధవలవణము చక్కెర వస వీనిని కలిపి సన్ననిమంటపైని పక్వముచేసి తినినవాక్శుద్ధిగలుగును. ఏడు

రాత్రులు సేవించిన కిన్నరులవంటి కంఠముకలుగును. పదునైదు రోజులు సేవించిన శ్రుతధరుఁడగును. అష్టాదశకుష్ఠువులు మూలరోగములు పంచగుల్మములు ప్రమేహములు కాసలైదు తెగులును నశించును. గొడ్డుపోయిన స్త్రీలకును అల్పరేతస్కులగు పురుషులకును బలమును తేజమును ఆకలిని పెంచెడి ఘృతమియ్యది సారస్వతఘృతమనఁబడును.

### ఉషఃపానము.

శ్లో. కాసశ్వాసాతిసారజ్వరపిటక కటీ కుష్ఠకోఠప్రకారాన్, మూత్రాఘాతోదరార్శః శ్వయథుగలశిరఃకర్ణశూలాక్షిరోగాన్, యే చాన్యే వాతపిత్తక్షతజకఫకృతా వ్యాధయ స్సంతి జంతో స్తాంస్తానభ్యాసయోగా దపనయతి పయః పీత మంతే నిశాయాః. 32. వ్యంగవలీపలితఘ్నం పీనస వైస్వర్య కాసశోథఘ్నం, రజనీక్షయేఽంబు నస్యం రసాయనం దృష్టిజననే చ. 34.

రాత్రియంతయు నుంచిన నీళ్ళను ప్రాతఃకాలము (అనఁగా తెల్లవారు జామున) త్రాగినచో దగ్గుశ్వాసము అతిసారము జ్వరము పిడకములు కటీరోగములు కుష్ఠులు మూత్రఘాతములు ఉదరరోగములు మూలరోగములు క్షయరోగములు గలిత శిరములు చెవిపోటు కంటిరోగములు ఇంకను వాతపిత్తకఫ జనితములగు రోగములును నశించును.

### లోహరసాయనపు రతులు.

శ్లో. నాగార్జునో మునీంద్రః శశాస యల్లోహశాస్త్ర మతిగహనం, తస్యార్థస్య స్మృతయే వయ మేతద్విశదాక్షరైర్బ్రూమః. 35. మేనే మునిః స్వతంత్రే భూయః పాకం న ఫలపంచకా దర్వాక్, సుబహుప్రయోగదోషా న్నార్ధ్వం న పలత్రయోదశకాత్. 36. తత్రాయసి పాచనీయే పంచపలాద్యా త్రయోదశ పలకాంతే, లోహాద్విగుణా త్రిఫలా గ్రాహ్యా షడ్భిః పలై రధికా. 37. మారణపుటనస్థాలీపాకా స్త్రిఫలైకభాగసంపాద్యాః, త్రిఫలాయా భాగద్వితయం గ్రహణీయం లోహపాకార్థం. 38. సర్వత్రాయ స్తుటనాద్యర్థైరేకాంశైరాపసంఖ్యాతం, ప్రతిపల మేవ త్రిగుణం. పాథః క్వాథార్థ మాధేయం. 39. సప్తపలాద్యా భాగే పంచదశాంతేఽంభసాం శరావైశ్చ, ద్వాదశ ద్వ్యేకాదశకాంతై రధికం తద్వారి కర్తవ్యం. 40. తత్రాష్టమో వి

భాగః శేషః క్వాథస్య యత్నతః స్థాప్యః, తేన హి మారణపుటన స్థాలీపాకా భవిష్యంతి. 41.

దురవగాహ మైనలోహశాస్త్రమును నాగార్జునమునీంద్రుఁడు చెప్పెను. దాని యర్థమును స్మృతికై మేము స్పష్టముగా చెప్పుచున్నాము. తనశాస్త్రమునందు అయిదు పలములకంటె పైన మఱల రెండవపాకమును ఒప్పుకొనఁడయ్యెను. సుబహుప్రయోగదోషమువలన పదిపలములకంటె పైని రెండవపాకము నంగీకరింపలేదు. అయఃపాచనమునందు అయిదుపలములు మొదలుకొని 13 పలములవఱకు లోహముకంటెను మూడురెట్లు త్రిఫలములను తీసికొనవలయును. 6 పలములకుపైన అధికముగా మారణపుటన స్థాలీపాకాదులను త్రిఫలములలో నొకభాగముతో చేయవలయును. లోహపాకముకొఱకు త్రిఫలములను రెండుపాళ్లు గ్రహింపవలయును. (తక్కినది సుగమము.)

## లోహశుద్ధికరణములు.

శ్లో. పాకార్థే తు త్రిఫలా భాగద్వయే శరావసంఖ్యాతం, ప్రతిపల మంబుసమం స్యా దధికం ద్వాభ్యాం శరావాభ్యాం. 42. తత్ర చతుర్థో భాగః శేషో నిపుణేన యత్నతో గ్రాహ్యః, అయసః పాకార్థత్వా త్స చ సర్వస్మాత్ప్రధానతమః. 43. పాకార్థ మశ్మసారే పంచపలాద్యే త్రయోదశపలాంతే, దుగ్ధశరావద్వితయం పాకే రేకాదికై రధికం. 44. పంచపలాధికమానాత్ తదభావే తపనసారతో గ్రాహ్యం, చతురాదిక మేకాంతం శక్త్యా ప్యధికం త్రయోదశకాత్. 45. త్రిఫలా త్రికటుక చిత్రక కాంతక్రామక విడంగచూర్ణాని, అన్యాన్యపి దేయాని ఫలానిపృక్షస్య చ బీజాని. 46. జాతీఫలజాతీకోశైలక కంకోలక లవంగానాం, సితకృష్ణజీరకయో రపి చూర్ణా న్యయసః సమాని స్యుః. 47. త్రిఫలాత్రికటువిడంగా నియతా అన్యే యథా ప్రకృతి, కాలాయసదోషహృతే ర్జాతీఫలాదే ర్లవంగాంతస్య. 48. క్షేపః ప్రాప్త్యనురూపః సర్వస్యాస్య చైకాద్యైః, కాంతక్రామక మేకం నిఃశేషం దోష మపహర త్యయసః. 49. ద్విగుణత్రిగుణచతుర్గుణ మాజ్యం గ్రాహ్యం యథాప్రకృతి, యది భేషజభూయస్త్వం స్తోకత్వం వాపి చూర్ణానాం. 50. అయసా సామ్యం సంఖ్యా భూయోఽల్పత్వేన భూయోఽల్పా, ఏవం ధాత్వనుసారా త్తత్త్రైధ తౌషధస్య బాధేన, సర్వత్రైవ విధేయ స్తత్తదవధిత స్యౌషధస్యాహః. 51.

పాకమునకు త్రిఫలముల రెండుభాగములలో ఒకశరావము చెప్పఁబడినది. ప్రతిపలమునకు నీరు సమానము. రెండుశరావములకంటె నెక్కువయుండిన నాలవభాగము నేర్పుగా గ్రహింపవలయును. అయస్సు పాకము నిమిత్తమగుట వలన నయ్యది యన్నిటికంటెను ప్రధానము. పాకార్థమైనలోహసారము నైదు అయిదు మొదలుకొని 12 పలములవఱకు పాలుగల రెండు మూకుళ్లుపోయవలయును. ఒక్కొక్క పాదమునకు నిట్లధికమగును. అయిదుపలములది మాత్ర. అయ్యది లేనిచో తదనుసారముగా గ్రహింపవలయును. కరక తాడి యుసిరిక త్రికటుక చిత్రమూలము తెల్లలొద్దుగ వాయువిడంగములు వీటిని చూర్ణము చేసి మోదుగ మాడను పొడిచేసి జాజికాయ జాపత్రి ఏలకులు లవంగము తెల్లజీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ వీటిని చూర్ణము చేసి లోహముతో సమముగా స్వీకరింపవలయును. కరకతాడియుసిరిక శొంఠి మిరియములు పిప్పళ్లు వీటి తప్పక తీసికొనవలయును. తక్కినవానిని ప్రకృత్యనుసారముగా గ్రహింపవలయును. జాజికాయ మొదలుకొలవంగము వఱకున్న యౌషధములు ఆయాదోషమును బోగొట్టి ప్రాప్తానుసారముగా ఫలమునిచ్చును. జాజికాయ తెల్లలొద్దుగ లోహదోషములను పోగొట్టును. ప్రకృత్యనుసారముగా రెండుమూడునాలుగు రెట్లు కూడ నేతిని గ్రహింప వచ్చును. ఔషధ మెక్కువైన చూర్ణము తక్కువైన లోహమును భర్తీచేయ వలయును. ఇట్లు ధాత్వనుసారముగా చెప్పనిస్థలముల నౌషధుల నూహించుకొనునది.

## కాంతాదిలోహమారణవిధులు.

శ్లో॥ కాంతాదిలోహమారణవిధానసర్వస్వముచ్యతే తావత్, యస్య కృతే తల్లోహం పక్తవ్యం తస్య శుభే దివసే. 52. సమ్మృదంగారక వాలితనతభూభాగే శివం సమభ్యర్చ్య, వైదికవిధినా వహ్నిం నిధాయ హుత్వాఽఽహుతీ స్తత్ర. 53. ధర్మాత్సిధ్యతి సర్వం శ్రేయ స్తద్ధర్మసిద్ధయేకిమపి, శక్త్యనురూపం దద్యా ద్ద్విజాయ సంతోషిణేగుణినే. 54. సంతోష్య కర్మకారం ప్రసాదపూగాది దానసంమానైః, ఆదౌ తదశ్మసారం నిర్మల మేకాంతతః కుర్యాత్. 55. తదనుకుఠారచ్ఛిన్నత్రిఫలాగిరికర్ణికాస్థిసంహారైః, కరికర్ణచ్ఛదమూలకశతావరీకేశరాజాఖ్యైః. 56. శాలిం చ మూలక కాళీ మూలప్రావృజ్జ భృంగరాజైశ్చ లిప్త్వా దగ్ధవ్యం తత్ పుష్టక్రియులోహకారేణ. 57. చిరజలభావితనిర్మల శాలాంగారేణ పరిత ఆచ్ఛాద్య, కుశలాధ్మాపిత భస్త్రానవరత

ముక్తేన పవనేన. 58. వహ్నే ర్బాహ్యజ్వాలా బోద్ధవ్యా జాతు నైవ కుంచికయా, మృల్లవణ సలిలభాజా కింతు స్వచ్ఛాంబుసంప్లుతయా. 59. ద్రవ్యాంతరసంయోగా త్స్వాం శక్తిం భేషజాని ముంచంతి, మల ధూలిమ త్సర్వం సర్వత్ర వివర్జయే త్తస్మాత్. 60 సందంశేన గృహీత్వాంతః ప్రజ్వాలితాగ్నిమధ్య ముపనీయ, గలతి యథాయథ మగ్రే తథైవ మృదు వర్ధయే న్నిపుణః. 61. తిలనిహితోర్ధ్వముఖా ద్యుక్తలగ్నం త్రిఫలాజలే వినిక్షిప్య, నిర్వాపయేచ్ఛేషం త్రిఫ లాంబు రక్షే చ్చ. 62. యల్లోహం న మృతం తత్పున రపి ప క్తవ్య ముక్తమార్గేణ, య న్న మృతం తథాపి తత్త్యక్తవ్యము లోహ మేవ తతః. 63. తదను ఘనలోహపాత్రే కాలాయసో ముద్గ రేణ సంచూర్ణ్య, దత్వా బహుశః సలిలం ప్రక్షాళ్యాంగార ముద్ధృ త్య. 64. తదయః కేవల మగ్నౌ, శుష్కీకృత్యాథవా తపే పశ్చాత్, లోహశిలాయాం పింష్యా దసితేఽశ్మసి వా తదప్రాస్తౌ. 65.

తాంతకాంతాదిలోహమారణోపాయములను చెప్పుచున్నాము:—లోహమును పాకముచేయవలసిన శుభదినమునందు మట్టినిప్పుగల భూభాగమునకు క్రిందు శివుని పూజించి వైదికవిధితో అగ్నిని పూజింపవలయును. పిమ్మట ఆహుతులను వేల్చవలయును. ధర్మమువలన సమస్తమును సిద్ధించును. అధర్మసిద్ధికొఱకు అనిర్వాచ్యమగు శ్రేయస్సు వలయును. కావున తమతమశక్తి ననుసరించి సంతోషియును గుణియునగు బ్రాహ్మణునకు ఈయవలయును. ప్రసాదము పూగములు తాంబూలముమున్నగు వానినిచ్చి శిల్పిని సంతోషపెట్టవలయును. అపిమ్మట లోహమును ఏకాంతముగా నిర్మలమును చేసి గొడ్డలితో నఱికి తెచ్చిన త్రిఫలములు గిరికర్ణికా బీజములు విష్ణుక్రాంత ఆముదపు ఆకులు వేళ్లు శతావరి గుంటకలగరాకు చెఱకువేళ్లు వస్త్రపులోని గుంటకలగర వీటిరసముతో పూసి లోహమును దగ్ధము చేయవలసినది. చిరకాలము నీటిలో భావనచేయఁబడిన బొగ్గులతో నలువైపుల నాచ్ఛాదనముఁజేసి నేర్పుగా నూది నిప్పులో జ్వాలలు వెలుపటికిరాకుండ స్వచ్ఛమగు నుదకముతో తడిపిన మట్టిలవణము నీళ్లు వీటితో ద్రవ్యాంతర సంయోగమువలన నౌషధులు తమతమశక్తిని వదలిపెట్టును.

## స్థాలీపాకవిధి.

శ్లో. అథ కృత్వా యో భాండే దత్వా త్రిఫలాంబుశేష మ న్యద్వా ప్రథమం స్థాలీపాకం దద్యా ద్ద్రవక్షయా త్తదను. 66. గజ

కర్ణ పత్రమూల శతావరీ భృంగకేశరాజరసైః, ప్రాగ్వత్స్థాలీపాకం కుర్యాత్ప్రత్యేక మేకైకం వా. 67.

తరువాత లోహపాత్రములో త్రిఫలాజలములను తక్కిన ద్రవ్యములను చేర్చి స్థాలీపాకమును చేయవలయును. ఆముదపుఆకులు వేళ్లు శతావరి గుంటకలగర వీటి రసములతో ప్రత్యేకముగా స్థాలీపాకమును చేయవలయును.

## పుటపాకవిధి.

శ్లో. హస్తప్రమాణవదనం, శ్వభ్రం హస్తైకఖాతసమమధ్యం, కృత్వా కటాహసదృశం, తత్ర కరీషం తుషం చ కాష్ఠంచ. 68. అంతర్ఘనతరమధ్యం శుషిరం పరిపూర్య దహనమాయోజ్య, పశ్చాదయస శ్చూర్ణం శ్లక్ష్ణంపంకోపమంకుర్యాత్. 69. త్రిఫలాంబుభృంగకేశరశతావరీకందమాణసహాజరసైః, భల్లాతక కరికర్ణ చ్ఛదమూల పునర్నవాస్వరసైః. 70. క్షిప్త్వాథ లోహపాత్రే మార్దే వా లౌహమార్దపాత్రాభ్యాం, తుల్యాభ్యాం పృష్ఠే నాచ్ఛాద్యాంతే రంధ్ర మాలిప్య. 71. తత్పుటపాత్రం తత్ర శ్వభ్రేజ్వలనే నిధాయ భూయోఽపి, కాష్ఠకరీషతుషై స్తత్సంఛాద్యాహర్నిశం దహేత్ప్రాజ్ఞః. 72. ఏవం నవఫైర్భేషజరాజైస్తు పచేత్సదైవ పుటపాకం, ప్రత్యేక మేక మేభిర్మిలితైర్వా త్రిచతురాన్వారాన్. 73. ప్రతిపుటనం తత్పింష్యాత్ స్థాలీపాకం విధాయ తథైవ, తాదృశదనం పిష్ట్వా ద్విగలద్రజసా శుయుజ్యతే యత్ర. 74. తదయశ్చూర్ణం పిష్టం ఘృష్టం ఘనసూక్ష్మవాససి శ్లక్ష్ణం, యది రజసా సదృశం స్యాత్ కేతక్యాస్తర్హి తద్భద్రం. 75. పుటనే స్థాలీపాకేఽధికృతపురుషే. స్వభావమనధిగమాత్, కథిత మపి హేయ మౌషధ ముచిత ముపాదేయ మన్య దపి. 76.

ఎటుచూచినను మూరెడు వెడల్పు పొడుగు కలుగునట్లు గంగాళమువలె త్రవ్వి అందు పేడ పొట్టు కట్టెలు లోపల గట్టి రంధ్రమును చేసి అగ్నిని తగిల్చి లోహచూర్ణమును పంకమువలెనూరి త్రిఫలములు కురువేరు గుంటకలగర శతావరి మానికంద గోరింట వీటిరసముతీసి జీడివిత్తులు ఆముదపు ఆకులు వేళ్లు గలిజేరు వీటిరసములనుకూడ తీసి లోహపాత్రములోగాని మట్టికుండలోగాని వైచి చక్కగా మూసి యుంచి సీలుచేసి దానిని స్వచ్ఛమగు నిప్పులో నునిచి కట్టెలు పొట్టు పిడకలు మున్నగువానితో రాత్రిం

దివసములు పుటపాకమును వైచి పిమ్మట నందలి యొక్కొక్క వస్తువును స్థాలీపాకమును చేసి తెగని రాత్రిపైని నూరి మొగలిరసముతో కలిపి సేవింపవలయును.

### లోహపాకామృతసారములు.

శ్లో. అభ్యస్తకర్మవిధిభి ర్బాలకుశాగ్రీయబుద్ధిభి ర్లక్ష్యం, లోహస్య పాక మధునా నాగార్జునశిష్ట మధిదధ్మః. 77. లోహారకూటతామ్రజకటాహే దృఢమృణ్మయే ప్రణమ్య శివం, తదయః పచే దచపలః కాష్ఠేంధనేన వహ్నినా మృదునా. 78. సిక్తస్య త్రిఫలాజల ముదితం యత్తద్ఘృతం చ దుగ్ధం చ, సంచాల్య లోహమయ్యా దర్వ్యా లగ్నం సముత్పాట్య. 79. మృదు మధ్య ఖరభావైః పాకస్త్రివిధోఽత్ర వక్ష్యతే పుంసాం, పిత్తసమీరణశ్లేష్మ ప్రకృతీనాం మధ్యమస్య సమః 80. అభ్యక్తదర్విలోహం సుఖదుఃఖస్ఖలనయోగి మృదుమధ్యం, ఉజ్ఝితదర్వి ఖరం పరిభాషంతే కేచి దాచార్యాః. 81. అన్యే విహీనదార్వీప్రలేపమాఖూత్కరాకృతిం బ్రువతే, మృదుమధ్య మర్ధచూర్ణం సికతాపుంజోపమం తు ఖరం. 82. త్రివిధోఽపి పాక ఈదృక్ సర్వేషాం గుణకృదేవ నతు విఫలః, ప్రకృతివిషమే చ సూక్ష్మో గుణదోషౌ జనయతీత్యల్పం. 83. విజ్ఞాయ పాక మేవం ద్రాగవతార్య క్షితౌ క్షణాన్నియతః, విశ్రామ్య తత్ర లోహే త్రిఫలాదేః ప్రక్షిపే చ్చూర్ణం. 84. యది కర్పూరప్రాప్తిర్భవతి తతో విగళితే తదుష్ణత్వే, చూర్ణీకృత మనురూపం క్షిపేన్నవా న యది తల్లాభః. 85. పక్వం ఖదిర సారం సుచిరఘృతస్థిత్యభావిరూక్షత్వే, గోదోహనాదిభాండే లోహభాండాభావే సతి స్థాప్యం. 86. యది తు పరిప్లుతిహేతోః ఘృతమిశ్రేతాధికం తతోఽన్యస్మిన్, భాండే నిధాయ రక్షే ద్భువ్యుపయోగో హ్యనేన మహాన్. 87. అయసి విరూక్షీభూతే స్నేహ స్త్రిఫలాఘృతేన సమ్పాద్యః, ఏత త్తతో గుణోత్తర మిత్యమునా స్నేహనీయం తత్. 88. అత్యంతకఫప్రకృతే ర్భక్షణ మయసోఽమునైవ శంసంతి, కేవల మపీద మశితం జనయ త్యాయుషో గుణాన్నియతః. 89.

చికిత్సావిధి నభ్యసించినవారలును కుశాగ్రబుద్ధులు నగువారలగు వైద్యులు నాగార్జును నను శిష్టునిచేతం దలంపంబడిన లోకపాక విధిని చెప్పుచున్నాము:—లోహము విత్తిలి

రాగి వీటికళాయీలలో గాని మట్టిపాత్రలో గాని లోహమును వేసి ఈశునకు నమస్కరించి కట్టెలతో సన్నని మంటను పెట్టవలయును. అందుపైని చెప్పిన త్రిఫలోదకములు నేయి పాలును చేర్చి లోహపుగరిటెతో కలియబెట్టి గట్టిపడినపిమ్మట సేవించిన పిత్తవాతకఫప్రకృతులగు మనుష్యులకు హితముఁగలిగించును. గరిటెకు కఱచికొన్నలోహము మృదువును వేఱుపడినది అల్పమును నగును.

ఈరీతిగా మూడువిధములగు పాకములును గుణము నిచ్చును. ఇట్లు పాకమును గుర్తించి దింపికొన్నినిమిషము లుంచి ఆలోహమునందు త్రిఫలాదిచూర్ణమును కలిపినచెను కర్పూరమును వేయవలసినచో ఆరినపిమ్మట వేయవలయును.

## రెండవపాకవిధి.

శ్లో. అథవా పక్తవ్యవిధిః సంస్కృతకృష్ణాభ్రకచూర్ణమాదాయ, లోహచతుర్థాంశసమద్విత్రిచతుఃపంచగుణభాగాన్. 90. ప్రక్షిప్యాయః ప్రాగ్వత్ పచేదుభాభ్యాం భవేదయో యావత్, తావన్మానానుస్మృతేః స్యాత్త్రిఫలాదిద్రవ్యపరిమాణం. 91. ఇదమాప్యాయిక మిదమతిపిత్తను దిద మేవ కాంతిబలజననం, స్తభ్నాతి తృట్క్షుధౌ తత్ పరమమధికమాత్రయా యుక్తం. 92.

పక్వయోగ్యమునుగా చేసి కృష్ణాభ్రకచూర్ణమును లోహమును రెండుమూడు నాలుగు భాగములును కలిపి పూర్వమునవలెనే లోహమును పక్వముచేయవలయును. రెండువిధులను పూర్వమువలెనే పక్వముచేయ అంతపరిమాణముతోనే త్రిఫలాది ద్రవ్యములను గ్రహింపవలయును. ఇయ్యది బలమును కలిగించును; పిత్తమును పోగొట్టును. కాంతిని బలమును కలిగించును. ఎక్కువగా నిచ్చిన ఆకలిదప్పులు నశించును.

## అభ్రకవిధి.

శ్లో. కృష్ణాభ్రక మేకవపుః వజ్రాఖ్యం చైకపత్రకం కృత్వా, కాష్ఠమయోదూఖలకే చూర్ణం ముసలేన కుర్వీత. 93. భూయో దృషది చ పిష్టం వాసఃసూక్ష్మావకాశతలగలితం, మండూకపర్ణికాయాః ప్రచురరసే స్థాపయే త్త్రిదినం. 94. ఉద్ధృత్యతద్రసా దథ పింష్యా ద్దైవం తథాన్యభక్తస్య, అక్షోదాత్యంతామ్లస్వచ్ఛజలేన ప్రయత్నేన. 95. మండూకపర్ణికాయాః పూర్వం స్వరసేనాలోడనం కుర్యాత్, స్థాలీపాకం పుటనం చాద్యై రపి భృంగరాజాద్యైః. 96. తాలాదిపత్ర

మధ్యే కృత్వా పిండం నిధాయ భస్త్రాగ్నౌ, తావ ద్దహే న్న యావల్లీ నో నిర్గచ్ఛతే సుచిరం. 97. నిర్వాపయేచ్ఛ దుగ్ధే దుగ్ధం ప్రక్షాల్య వారిణా తదను, పిష్ట్వా ఘృష్ట్వా వస్త్రేచూర్ణం నిశ్చంద్రికం కుర్యాత్.

కృష్ణాభ్రకమును ఒక శరీరమును గాని వజ్రము నొక అరుగా గానిచేసి కొయ్య తోటిలో రోకటితో చూర్ణము చేయవలయును. పిమ్మట దానిని బండపైనినూరి వస్త్ర కాళితమును చేసి మండూకపర్ణి రసములో 3 దినములు భావన చేసి పిమ్మట హేమంతతు వునఁబుట్టినబియ్యపునీటితో చేర్చి త్రాగవలయును. స్థాలీపాకపుటపాకములను గుం టకలగ రాకు మున్నగువానితోను మాత్రను చేసి కొలిమిలోబెట్టి లీనమై గిప్ప కనిపించ నంతవఱకును దగ్ధము చేయవలయును. పాలలో తడిపి పిమ్మట నీటితో కడిగి నూరి చూర్ణమును చేయవలయును.

### అభ్రకపు సమంత్రకమగువిధి.

శ్లో. నానావిధగుద్రోగాంత్యై పుష్ట్యై కాంత్యై శివం సమభ్య ర్చ్య, సువిశుద్ధేఽహని పుణ్యే తదమృతమాదాయ లౌహాఖ్యం. 99. దశకృష్ణల పరిమాణం శక్తివయోభేద మాకలయ్య పునః, ఇద మధి కం తదధికతరజయ దేవ న మాత్రుమోదకవత్. 100. సమమస్ఋణా మలపాత్రే లౌహే లౌహేన మర్దయే ద్దృఢం భూయః, దత్వా మధ్వ నురూపం తదనుఘృతం యోజయే దధికం. 101. బంధం గృహ్ణాతి య థా మధ్వపృథక్త్వేన పంక మవశింపేత్, ఇద మిహ దుష్టోపకరణ మేతద్దృష్టం తు మంత్రేణ. 102. స్వాహాంతేన విమర్దో భవతి ఘడంతే న లోహబలరక్షా, సనమస్కారేణ బలి ర్భక్షణ మయసో హోమాంతేన. 103. "ఓం అమృతోద్భవాయ స్వాహా, ఓం అమృతే హ్రీంఫట్ ఓం నమ శ్చండవజ్రపాణయే, మహాయక్షసేనాధిపతయే, సురగురువిద్యా మహాబలాయ స్వాహా, ఓం అమృతే హ్రీం.

అనేకవిధములగు పీడలు శాంతించుటకును, పుష్టి కాంతి గలుగుటకును ముందు శివుని బూజించి పవిత్రమగుదినమునందు లోహమను నాయమృతమును పదిరతు లు తీసికొని శక్తివయోభేదములను ఎచ్చుతగ్గులను గుర్తించి గట్టిదియును మురికిలేని దియునగు లోహపాత్రములో మాటిమాటికి చక్కగా మర్దింపవలయును. పిమ్మట తన

నురూపమురా తేనెను ఘృతమునందు చేర్చవలయును. తేనె వేఱుపడక శుద్ధయి గుళ్టులు మర్దన చేయువలయును. దుష్టోపకరణమగు దీనిని మంత్రముతో స్వాహా ఫట్ అనువఱకునుమర్దించి లోహబలమును రక్షింపవలయును. హూంఅతముగల మంత్రముతో లోహమును తినవలయును. మంత్రము ఓం అమృతోద్భవాయ అమృత హ్రీమ్. అని.

## అభ్రకమును సేవించు రీతులు.

శ్లో. జగ్ధ్వా తదమృతసారం నీరం వా క్షీర మే వానుపిబేత్, కాంతక్రామక మమలం సంధార్య రసం పిబే న్నతు తత్. 104. ఆచమ్య చ తాంబూలం లాభే ఘనసారసహిత ముపయోజ్యం, నాత్యుపవిష్టో నాత్యతిభాషీ నాతిస్థిత స్తిష్ఠేత్. 105. అత్యంతవాతశీతాతపయానస్నానవేగరోధాదీన్, జహ్యాచ్చ దివానిద్రాసహితం చాకాలభుక్తం చ. 106. వాతకృతః పిత్తకృతః సర్వా న్కటుమ్లతిక్తక కషాయాన్, తత్క్షణవినాశహేతూన్ మైథునకోపశ్రమా న్థారే. 107. అశితం తదయః పశ్చా త్పతతు నవా పాటవం ఛర్ద్యధికానాం, అ త్తిర్భవతి నవాం తం కూజతి భోక్తవ్య మవ్యాజమ్. 108.

ఆ యమృతసారమును తినిన తెఱువాత పాలనుగాని నీటినిగాని త్రాగవలయును. కాంతమును క్రామకమును అమలరూపమును అనురసమును త్రాగరాదు. చమనము చేసి కర్పూరముతో తాంబూలమును నమలవలయును. ఎక్కువగా కూర్చుండరాదు. అతిగా మాటలాడరాదు. గాలి మిక్కిలియును, చలిగాలి ఎండ ప్రయాణము స్నానము వేగము నిర్బంధము మున్నగు వానిని వదలిపెట్టవలయును. పగలు నిద్రపోవుట అకాలమునందు భుజించుటయును మంచిదికాదు. వాతకారకములును తిక్తకారకములనగు కట్వమ్లతిక్తకషాయములను తత్క్షణమే నాశనమునకు కారణము లగు మైథునాదికర్మలను సేవింపరాదు. లోహసారమును సేవించునప్పుడు పడరాదు. కపటమును చేయరాదు. బాధ కలుగనిభోజనమును సేవింపవలయును.

## అభ్రకసేవనమునకు పథ్యములు.

శ్లో. ప్రథమం పీత్వా దుగ్ధం శాల్యన్నం విశదసిద్ధ మక్లిన్నం, ఘృతసంప్లుత మశ్నీయాత్ మాంసై ర్వైహంగమైః ప్రాయః. 109. ఉత్తమ మూషరభూచర విష్కిరమాంసం తథాబ్జ మైణాని, అన్యదపి ఖలచరాణాం పృథురోమా పేక్షయా జ్యాయః. 110. మాంసాలాభే

మాత్స్య అదోషలా స్థూలసద్గుణా గ్రాహ్యాః, మద్గురరోహిత శకులా దగ్ధాః పలలా న్నవా గుణాః. 111. శృంగాటక ఫలకేశరు కదళీఫల తాల నారికేళాది, అన్య దపి యచ్చ వృష్యం మధురం పనసాదికం జ్యాయః. 112. కేజక తాడకీరాన వార్తాక పటోల ఫల దలసమ తాన్, ముద్గమసూరేక్షురసాన్ శంసంతి నిరామిషే ష్వేతాన్. 113. శాకం ప్రహేయం సుఖిలాం స్తోకం రుచయే తు వాస్తుకం దద్యాత్, విహితనిషిద్ధా దన్య న్మధ్యమకోటిస్థితం విద్యాత్. 114 తప్తదుగ్ధాను పానం ప్రాయ స్స్రావయతి బద్ధకోష్ఠస్య, అనుపీత మంబు యద్వా కోమలఫలనారికేళస్య. 115.

మొదలపాలను త్రాగి నిర్మలమును క్లిష్టమైనవరమున్ననును నేతితో తినవలయును. పక్షిమాంసములతోను చేర్చుకొనవలయును. ఊషరములు భూచరములు నగు మేక ఇత్తినున్నగువానిమాంసమును జలచరములగు మత్స్యములకంటె తలుచు మంచిది. మాంసము దొఱకనిచో దోషరహితములు ఉత్తమగుణకారకములు నగు మత్స్యములను గ్రహింపవచ్చును. శృంగాటకఫలము కసేరు కదళీఫలము తాటిపండు కొబ్బరి కాయమున్నగు వృష్యపదార్థములను మధురములగు పనసాదులను సేవింపవలయును. క్రమకము తాడఫలము ఉద్ధసరవు కాయ పొట్ల మున్నగు మాంసభక్షకులు కానివారికి హితకరములు. విహితనిషిద్ధములకంటె నితరములను మధ్యమములుగా గ్రహింపవలయును. కాచినపాలను త్రాగినను కోమలమగు నారికేలోదకములను త్రాగినను బద్ధకోష్ఠములు నశించును.

## అభ్రిక సేవనమునందు హ్రాసవృద్ధిరీతులు.

శ్లో. యస్య న తథా సరతి సయనక్షారం జలం పిబేత్కోష్ణం, కోష్ణం త్రిఫలాక్వాథసనాథం క్షారం తతో ఽప్యధికం. 116. త్రీణి దినాని సమం స్యాదహ్నా చతుర్థే తు వర్ధయే త్క్రమశః, యావ చ్చాష్టమ మాసం న వర్ధయే త్పున రితోఽప్యధికం. 117. ఆద్యా రక్తి ద్వితయం ద్వితీయవృద్ధౌ తు రక్తికాత్రితయం, రక్తిపంచకపంచక మత ఊర్ధ్వం వర్ధయే న్నియతం. 118. వాత్సరికకల్పపక్షే దినాని యావంతి వర్ధితం ప్రథమం, తావంతి వర్షశేషే ప్రతిలోమం హ్రాసయే త్తదయః. 119. తే ష్వష్టమాసకేషు ప్రాతర్మాషత్రయం సమశ్నీయాత్, సాయం

చ తావ దహ్నా మధ్యే మాసద్వయం శేషం. 120. ఏవం తద మృత మశ్నన్ కాంతిం లభతే చిరస్థిరం దేహః సప్తాహత్రయమాత్రాత్ సర్వరుజో హంతి కిం బహునా. 121. ఆర్యాభి రిహ నవత్యా సప్తవిధీనాం యథావ దాఖ్యాతం, అమతివిపర్యయసంశయశూన్య మనుష్ఠాన ముపనీతం. 122. మునిరచితశాస్త్రపార గత్వా సారం తతః సముద్ధృత్య, నిబబంధ బాంధవానా ముపకృతయే కోఽపి షట్కర్తా. 123. యత్ర తత్రోద్భవం లోహం నిఃశేషం మారితం యది, త్రిఫలావ్యోష సంయుక్తం భక్షయేః ద్వలినాశనం. 124. సామాన్యా ద్ద్విగుణం చౌండ్రం కలింగోఽష్టగుణ స్తతః, తస్మా చ్ఛతగుణం భద్రం భద్రా ద్వజ్రం సహస్రధా. 125. వజ్రాత్ షష్టిగుణః పాండి ర్నిరవి ర్దశభి ర్గుణైః. తతః కోటిసహస్రం వా అయస్కాంతం మహాగుణం 126. రసత స్తామ్రం ద్విగుణం తామ్రా త్కృష్ణాభ్రకం ద్విగుణం, పృథ గేవైషాం శుద్ధి స్తామ్రశుద్ధి స్తతో ద్వివిధా. 127.

అంత ఎక్కువగా బాధకలుగనివారు యవక్షారమును గోరు వెచ్చని వేడినీళ్లను త్రాగవలయును. మూషురోజులు సమానముగా నౌషధమును గ్రహించి నాలవదినము నందు క్రమముగా వృద్ధిసేయవలయును. ఎనిమిది నెలలవఱకు నింతకంటె వృద్ధిసేయరాదు. తొలుత రెండురత్తులు, పిమ్మట మూఁడు, అటుతరువాత దినమున కైదుగత్తులు సేవింప వలయును. సంవత్సరమంతయును ఔషధమును సేవింప వలసినచో ప్రారంభమున నెన్నిరోజులు వృద్ధిఁ జేసిరో చివఱను అన్నిదినములు లోహమును సంఘటింప వలయును. ఆయెన్మిది నెలలలో ప్రొద్దుట మూఁడుమాషములును సాయంకాలను మధ్యాహ్నములందు రెండుమాషములను తినవలెను. ఈరీతిగా నమృతమునుతినినచో కాంతిని స్థిరమగు దేహమును పొందును. ఇరువదియొక్క రోజులు సేవించిన సమస్తరోగములు నశించును. ఈయేడు విధులను యథావిధిగా 90 ఆర్యావృత్తములతో చెప్పిరి. మతివిపర్యయము సంశయమును లేనియనుష్ఠానమును చేయవలెను. ముని రచించిన శాస్త్రముల నంతమువఱకు చదివి అందలిసారము తనబంధువులయుపయోగమునిమిత్తమై ఒక బ్రాహ్మణుఁడు ఇట్లు నిర్మించెను.

లోహసేవనమున కనుపానాదులు.

శ్లో. పత్రీకృతస్య గంధక యోగా ద్వా మారణం తథా లవణైః, ఆర్ద్రే ధ్మాపిత తామ్రే నిర్గుండీకల్క కంజికనిమగ్నే. 128. యత్పత

తి గైరకాభం తత్పిష్టం చార్ధగంధకం తదను, పుటపాకేన విశుద్ధం శు
ద్ధం స్యాదభస్మకం తు పునః 129 హిలమోచి మూలపిండే క్షిప్తం
తదను మార్ధసంపుటే లిప్తే, తీక్ష్ణదగ్ధం పిష్ట మమ్లాభసా సాధు చం
ద్రికారపుటం. 130. రేచితతామ్రేణ రసః స్వల్పశిలాయాం ఘృష్య
పిండికా కార్యా, ఉత్స్వేద్య గృహసలిలేన నిర్గుండీకల్కేఽస
కృచ్ఛుద్ధా. ఏతత్సిద్ధం త్రికటుయుత చూర్ణితతామ్రాద్రితైః పృథగ్యు
క్తం. 131. పిప్పలి విడంగమరిచైః శ్లక్ష్ణం ద్విత్రిమాసికం భక్ష్యం,
శూలామ్లపిత్తశ్వయథు, గ్రహణీయక్ష్మాది కుక్షిరోగేషు, రసాయనం
మహాదేత త్పరిహారో **నియమతో** నాత్ర. 132.

ఎచ్చటెచ్చటఁబుట్టిన లోహమునైనను నిశ్శేషముగా మారణచేసి త్రిఫలోదకములతో సేవింపవలయును. సామాన్యముగా రెండు రెట్లు బొంద్రములు ఎన్మిదిరెట్లు కొడిసెపాలఁకత్తులు నూరురెట్లు తుంగముస్తెలు వేయిరెట్లు వజ్రము అరువది గుణములు పొందినది పదిరెట్లు ఇంతకంటెను వేయిరెట్లు కాంతమును రసమునకంటె రాగి రెండురెట్లును రాగికంటె కృష్ణాభ్రకము రెండురెట్లును ప్రత్యేకముగా శుద్ధిచేసి చేర్పవలయును.

## తామ్రయోగము.

శ్లో. తనుపత్రీకృతం తామ్రం నైపాలం గంధకం సమం, దత్వా
చోర్ధ్వమధో మధ్యే స్థాలికామధ్యసంస్థితం. 134. కృత్వా స్వల్పవిధా
నేన స్థాలీముఖే పిధాయ చ, శర్కరాభస్మలేపేన లిప్త్వా సంధిం తదూ
ర్ధ్వతః. 135. వాలుకాపూరితస్థాల్యాం పిధానాయాం పునస్తథా, సులి
ప్తాయాం చ యామైకమధో జ్వాలాం ప్రదాపయేత్. 136. తత ఆకృష్ట
తామ్రస్య మృతస్య త్వింహ యోజనా, అథ నష్టం గంధకస్య వహ్నిస్థంలో
హపాత్రగం. 137. శిలాపుత్రేణ సంమర్ద్య దృఢం ఘృష్టం పునఃపునః,
కృత్వా దేయం మృతం తామ్రం కర్షమానం తతః పునః. 138. రసోఽమ్ల
మథితః శుద్ధస్తావన్మాత్రః ప్రదీయతే, తత స్తథైవం సమ్మర్ద్య పునరాజ్యం
ప్రదాపయేత్. 139. అష్టబిందుకమాత్రం చ మర్దయే స్మార్ఛితం తథా,
సర్వం స్యాత్తస్య ఆకృష్య శిలాపుత్రాదికం దృఢం. 140. సంపూర్ణాత్యా
లంబుషరసప్రసృతేన విలోడితం, పున స్తథైవ వహ్నిస్థలోహపాత్రే విమ

ర్దయేత్. 141. యావద్రసక్షయం పశ్చాద్దాకృష్య సంప్రపేషితం, అలంబుషరసే నైవ గుడకం సంప్రకల్పయేత్. 142. తత్పిండం వస్త్రవిస్తీర్ణం పిండే త్రికటుజే పునః, వసనాంతరితే దత్వా పోట్టలీం కారయేద్బుధః. 143. తతస్తాం పోట్టలీం మాజ్యముగ్నాం కృత్వా విధారితాం, సూత్రేణ దండసంలగ్నాం పాచయేత్కుశలో భిషక్. 144. యదా నిష్ఫేనతా చాజ్యే పుటితా చ దృఢా భవేత్.

రాగిని రేకులుగ చేసిన గంధకసంయోగమునగాని ఉప్పుతోగాని మారణమగును. వానిలి కల్కమును గంజనిపోసి గైరికసమానమగు కాంతిగలదాని నందు ముంచి నూరి అర్ధము గంధకమును కలిపి పుటపాకముతో శుద్ధిన చేయవలయును. పిమ్మట అభ్రకమును శుద్ధిచేయవలయును. హిలమోచికపువేళ్ల ముద్దలోనుంచి గుడ్డను చుట్టి దగ్ధము చేయవలయును. పిమ్మట పుల్లనిరసములో నూరినచంద్రికలు నశించును. తరువాత రేచితమును చేసిన రాగితో చిన్నగా తిప్పెనినూరి ముద్దచేయవలయును. ఇట్లు మూడునుసిద్ధము చేసి సగముసగము భాగములను కలిపి తామ్రమునకంటె వేలుపఱుపవలెను. పిప్పళ్లు వాయువిడంగములు మిరియములు వీటినినూరి రెండు మూడుమాషము లంత తినిన ఆమ్లపిత్తాదులగు నఖిలరోగములు నశించును.

## తామ్రభస్మపుటపాకనవిధి.

శ్లో. తదా పక్వం తి సమాకృష్య పంచగుంజా తులాంశ్యం. 145. త్రికటు త్రిఫలాచూర్ణం తుల్యం ప్రాతః ప్రయోజయేత్, తక్రం స్యాదనుపానం తు అమ్లపిత్తోచ్ఛ్రయే పునః. 146. త్రిఫలైవ సమాదేయా కోష్ణం వారి పిబేదను, సప్తమే దివసే రక్తవృద్ధి స్తామ్రాత్తు మాసకం. 147. యావత్ప్రయోగి శ్చ తద్దై వాపకర్షః పునర్భవేత్. యోగోఽయం గ్రహణీయుక్త పిత్తశూలఘ్నం పిత్తహా. 148. రసాయనం చైతదిష్టం గుదకీలాదినాశనం, సచాత్రసంహారో స్తి సహోరాస రక్షణే.

నేపాల తామ్రమును రేకులుగ చేసి సమముగా గంధకమును తెచ్చి ఆస్థాలికి క్రిందను మీదను నమునుంచి చక్కగా అన్నమును నూరి లేప చేసి పిమ్మట ఇసుకను పూరించి ఒకజాముపఱకు తీలంబెట్టవలయును. పిమ్మట మారణము చేసిన తామ్రమును కలుపవలయును. పిమ్మట మృతమైన తామ్రమునందు ఒకతులము గంధకము వైచి రాతితోనూరి మరల మృతతామ్రమును చేర్పవలయును. పుల్లని రసములో మథించిన రసమునుకూడ నందే చేర్పవలయును. పిమ్మట ఆజ్యే మర్దనచేసి నేతినికలిపి ఎన్మిదిబిందువుల

మాత్రను చేర్చి మర్దన చేయవలయును. పిమ్మట తీసి గట్టిరాతితో నూరి 2 పలములు లజ్జా
వంతిరసమును పోసి కలిపి పెట్టవలయును. ద్రవములేకుండునంతవఱకు లజ్జావంతిరస
మును పోయుచు మాత్రను కట్టి గుడ్డలోనుంచి త్రిఫలములపిండములోనుంచి పొట్లము
కట్టి నేతితో తరిగి సూత్రమూలయున దండముపైనుంచి పక్వముచేయవలయును.

## తామ్రసేవనము.

శ్లో. హేమాద్యాఽపి సూర్యసంతప్తాః స్రవంతి గిరిధాతవః,
జతాభం మృదుమృత్స్నాచ్ఛం యన్మలం తచ్ఛిలాజతు. 150.
అనమ్లం చాకషాయం చ కటుపాకి శిలాజతు, నాత్యుష్ణశీతం ధాతుభ్య
శ్చతుర్భ్య స్తస్య సంభవః. 151. హేమ్నోఽథ రజతా త్తామ్రా ద్వరం
కృష్ణాయసా దపి, మధురం చ సతిక్తం చ జవాపుష్పనిభం చ యత్.
152. విపాకే కటుతిక్తం చ తత్సువర్ణస్య నిస్స్రవం, రాజతం కటుకం
శ్వేతం స్వాదు శీతం విపచ్యతే. 153. తామ్రా ద్బర్హిణకంఠాభం
తీక్ష్ణోష్ణం పచ్యతే కటు, యత్తు గుగ్గులుసంకాశం తిక్తకం లవణాన్వి
తం. 154. విపాకే కటుశీతం చ సర్వశ్రేష్ఠం తదాయసా, గోమూత్ర
గంధః సర్వేషాం సర్వకర్మసు యౌగికః. 155. రసాయనప్రయోగేషు
పశ్చిమం తు విశిష్యతే.

పక్వమైనపిమ్మట తీసి ఏడురతులఔషధమును సమముగా నేతిని శొంఠి మిరియ
ములు పిప్పళ్లు త్రిఫలములు చూర్ణముచేసి కలిపి ప్రాతఃకాలమునందు సేవించుచుండ
వలెను. అమ్లపిత్తాధిక్యమునందు మజ్జిగను అనుపానముచేసి కొనవలయును. త్రిఫలము
లను సమానముగా చేర్చి కొంచెము వెచ్చ జేసి త్రాగవలయును. ఏడవగ్జున రక్తిని
వృద్ధిచేయవలయును. ఇత్యాది గ్రహణి మున్నగు రోగములను పోగొట్టును.

## శిలాజిత్తు భస్మాదులు.

శ్లో. యథాక్రమం వాతపిత్తే శ్లేష్మపిత్తే కఫే త్రిషు. 156. విశే
షేణ ప్రశస్యంతే మలా హేమాదిధాతుజాః, లోహంకిట్టాయతే వహ్నౌ
విధూమం దహ్యతేఽంభసి. 157. తృణాగ్రే కృతం సర్వ మధో గలతి
తంతువత్, మలినం య ద్భవే త్తచ్చ క్షాలయే త్కేవలాంభసా. 158.
లోహపాత్రేషు విధినా ఊర్ధ్వభూతం చ సంహరేత్, వాతపిత్తకఫఘ్నై
స్తు నిర్యూహై స్త త్సుభావితం. 159. వీర్యోత్కర్షం పరం యాతి

సర్వై రేకైకశోఽపివా, ప్రక్షిప్యోద్ధృతమావానం పున స్తత్ప్రక్షిపే ద్రసే. 160. కోష్ణే సప్తాహ మేతేనవిధినా తస్య భావనా, తుల్యం గిరిజేన జలే చతుర్గుణే భావనౌషధం క్వాథ్యం, తతః క్వాథే పాదాంశే పూతోష్ణే ప్రక్షిపే ద్గిరిజం, తత్సమరసతాం యాతం సంశుష్కం ప్రక్షిపే ద్రసే భూయః. 161.

హేమాదులగు గిరిధాతువులు సూర్యసంతాపమువలన మృదువుగా స్వచ్ఛముగా లక్కవలెకఱగును. అదియే శిలాజతు వనఁబడును. పులుపులేకను రసాయనము లేకను కటుపాకము గలిగి వేడిగను చల్లగనుండక నాలుగు ధాతువులవలన శిలాజితు పుట్టుచున్నది. బంగారము వెండి రాగి యినుము వీటినుండి స్రవించినది శ్రేష్ఠము. వెండివలనఁబుట్టిన శిలాజితు తెల్లగానుండును. పక్వముచేసిన స్వాదుగను శీతలముగనుండును. తామ్రజమగునది మయూరకంఠమువలె కాంతిగలిగి కొంచెము వెచ్చగానుండును. గుగ్గిలమువలె నుండునది లోహజము. అన్నిశిలాజతులలోను గోమూత్రమువంటి వాసనయుండును. సమస్తకర్మలందును చేర్పఁదగియుండును.

శిలాజితు భస్మము సేవించుటవలని ఫలము.

శ్లో. పూర్వోక్తేన విధానేన లోహై శ్చూర్ణీకృతై స్సహా, తత్పీతం పయసా దద్యా ద్దీర్ఘ మాయుః సుఖాన్వితం. 162. జరావ్యాధిప్రశమనం దేహదార్ఢ్యకరం పరం, మేధాస్మృతికరం ధన్యం క్షీరాశీ తత్ప్రయోజయేత్. 163. ప్రయోగః సప్తసప్తాహ స్త్రయ శ్చైక శ్చ సప్తకః, నిర్దిష్ట స్త్రివిధ స్తస్య పురో మధ్యో వర స్తథా. 164. మాత్రాపలం త్వర్ధపలం స్యా త్కర్షం తు కనీయసీ, శిలాజితుప్రయోగేషు విదాహీని గురూణి చ. 165. వర్జయే త్సర్వకాలం చ కులుత్థా న్పరివర్జయేత్, పయాంసి శుక్తాని రసాః సయూషా స్తోయం సమూత్రం వివిధాః కషాయాః, ఆలోడనార్థే గిరిజస్య శస్తా స్తే తే ప్రయోజ్యాః ప్రసమీక్ష్య కార్యం. 166.

పూర్వోక్తవిధానములతో చూర్ణముచేసి పాలతో సేవించిన ఆయుష్యమును అభివృద్ధిసేయును. ముసలితనమునుపోగొట్టును. మేధాస్మృతులను వృద్ధిసేయును. దీనిని ఏడు సప్తాహములును మూడుసప్తాహములును, ఒకసప్తాహమును సేవించిన ఉత్తమమధ్యమాధమము లనఁబడుదురు. నాలుగుతులములు ఉత్తమమగును. రెండుతులములు మధ్యమము. ఒకతులమది అధమమునగును. శిలాజితును సేవించునప్పుడు దాహకారకము

లును గురుపదార్థములును వర్జింపవలయును. పాలు శుక్తము గంజిరసము యూషము నీరు గోమూత్రము అనేకవిధములగు కషాయములును ఆలోడనార్థమై యుత్తమములగును.

## శిలాజితూద్భవములగు శిలాగుటికలు.

శ్లో. చరకోక్తశిలాజతునో విధానం సోపస్కారం హ్యేతత్, కాలేషు రవితాపాఢ్యే ష్వష్టాయసజం శిలాజతుప్రవరం. 168. త్రిఫలారససంయుక్తం త్ర్యహం శ్చ శుష్కం పునః శుష్కం, దశమూలస్య చ గుడూచ్యా రసే బలాయా స్తథా పటోలస్య. 169. మధుకరసై ర్గోమూత్రే త్ర్యహం త్ర్యహం భావయే త్క్రమశః, ఏకాహం క్షీరేణ తు త చ్చ పున ర్భావయే చ్ఛుష్కం. 170. సప్తాహం భావ్యం స్యా త్క్వాథే నైషాం యథాలాభం, కాకోల్యౌ ద్వే మేదే విదారియుగ్మం శతావరీ ద్రాక్షా. 171. ఋద్ధియుగర్షభపీలా ముండితికా జీరకేంశుమత్యౌ చ, రాస్నాపుష్కరచిత్రకదంతీభకికాకలింగచవ్యాబ్దాః. 172. కటుకా శృంగీ పాఠా ఏతాని పలాంశికాని కార్యాణి, అద్రోణే సాధితానాం రసేన పాదాంశికేన భావ్యాని. 173. గిరిజ స్యైవం భావితశుద్ధస్య పలాని దశ షట్చ, ద్విపలం చ పిశ్వభంత్రి మాగధికాయా శ్చ మరిచానాం. 174. చూర్ణం పలం విదార్యా స్త్వక్షీపపలాని చత్వారి, షోడశసితాపలాని చత్వారి ఘృతస్య మాక్షికస్యాష్టౌ. 175. తిలతైలస్య ద్విపలం చూర్ణార్ధపలాని పంచానాం, త్వక్ క్షీరీపత్రత్వక్ నాగైలానాం చ మిశ్రయిత్వా తు. 176. గిరిజస్య షోడశపలై ర్గుడికాః కార్యా స్తతోఽక్షసమాః, తాః శుష్కా నవకుంభే జాతీపుష్పాధివాసితే స్థాప్యాః, తాసా మేకా కాలే భక్ష్యా పేయాపి వా సతతం. 177.

చరకమునందుచెప్పఁబడిన శిలాజిత్తుయొక్క విధానమిట్లు:—సూర్యునివేడిమిగల కాలములో కృష్ణాయసమువలన బుట్టిన శిలాజిత్తు శ్రేష్ఠమైనది. త్రిఫలారసముతో చేర్చి మూడుగోజా లెండించి దశమూలములు తిప్పతీగె ముత్తువపులగము చేదుపొట్ల వీటి రసముతో మఱల నెండించి మధుకరసము గోమూత్రములలో మూడేసి గోజులును పాలలో నొకగోజును భావనచేసి ఎండిన పిమ్మట ఏడుగోజాలు కషాయముతో భావన చేయవలయును. రెండు విధములగు కాకోలులు మేదలు విదారీలు పిల్లపీచర ద్రాక్ష ఋద్ధి ఋషభము జీలకఱ్ఱ బ్రాహ్మిసాలపర్ణి నన్నరాస్న పుష్కరమూలము దంతిపిప్పళ్లు

కోష్ఠ చవ్యము తుంగముస్తెలు కటుకరోహిణి విషబొద్ది ఇత్యాదికొక్కొక్కపలము చేర్చికొని ఒకద్రోణము నీటిలో ఓక్వముచేసి నాల్గవపాలు మిగులగా దించి భావన చేసి శుద్ధిచేసి శిలాజిత్తు 18 పలములు శొంఠి ఉసిరిక పిప్పళ్లు మిరియములు రెండేసి పలములు విదారిగంధ ఒకపలము తాడిశపత్రి 4 పలములు చక్కెర 16పలములు నేయి 4 పలములు తేనె 8 పలములు తిలతైలము 2 పలములు వీటిని చూర్ణము అరపలము కలిపి మాత్రలను కట్టి ఎండించి జాజిపూలతో వాసించి సేవించుట మంచిది.

### శివాగుటికాసేవనవిధి.

శ్లో. క్షీరరసదాడిమరసాః సురాసవం మధు చ శిశిరతోయాని, ఆలోడనాని తాసా మనుపానే వా ప్రశస్యంతే. 178. జీర్ణే లఘ్వన్న పయో జాంగలనిర్యూహయూషభోజీ స్యాత్, సప్తాహం యావ దతః పరం భవే త్సోఽపి సామాన్యః. 179. భుక్త్వాపి భక్ష్యేయం యదృచ్ఛయా నావహే వ్యయం కించిత్, నిరుపద్రవా ప్రయుక్తా సుకుమారైః కామిభి శ్చైవ. 180. సంవత్సర ప్రయుక్తా హం త్యేషా వాతశోణితం ప్రబలం, బహువార్షిక మపి గాఢం యక్ష్మాణం చాఢ్యవాతం చ. 181. జ్వరయోని శుక్రదోషప్లీహార్శఃపాండుగ్రహణీరోగాన్, బ్రధ్నమెవగుల్మపీనస హిక్కాకాసారుచిశ్వాసాన్. 182. జఠరం శ్విత్రం కుష్ఠం పాండ్యం క్లైబ్యం మదం క్షయం శోషం, ఉన్మాదాపస్మారా వదనాక్షిశిరోగదా న్సర్వాన్. 183. ఆనాహ మతీసారం సాసృగ్దరం కామలాప్రమేహాం శ్చ, యకృదర్బుదాని విద్రధిం భగందరం రక్తపిత్తం చ. 184. అతికార్శ్య మతిస్థౌల్యం స్వేద మథశ్లీపదం చ వినిహంతి, దంష్ట్రావిషం సమూలం గరాణి చ బహుప్రకారాణి. 185. మంత్రౌషధియోగాదీన్ విప్రయుతా న్యాభికా న్యావాన్, పాపాలక్ష్మ్యౌ చేయం శమయే ద్గుడికా శివా నామ్నా. 186. బల్యా వృష్యా ధన్యా కాంతియశఃప్రజాకరీ చేయం, దద్యా న్నృతివల్లభతాం జయం వివాదే ముఖస్థా చ. 187. శ్రీమా న్ప్రకృష్టమేధః స్మృతిబుద్ధిబలాన్వితో ఽతులశరీరః, పుష్ట్యోజోవర్ణేంద్రియతేజోబలసంపదాదిసదుపేతః. 188. వలిపలితరోగరహితో జీవే చ్ఛరదాం శతద్వయం పురుషః, సంవత్సరప్రయోగా ద్ద్వాభ్యాం శతాని చత్వారి. 189. సర్వామయజి త్కథితం మునిగణభక్ష్యం రసా

యనరహస్యం, సముద్భభూ వామృతమంథనోత్థః స్వేదః శిలాఖ్యోఽమృతవద్గిరేః ప్రాక్. 190. యో మందర స్యాత్మభువా హితాయ న్యస్తశ్చ శైలేషు శిలాజరూపీ, శివాగుడికేతి రసాయన ముక్తం గిరీశేన గణపతయే. 191. శివపదనపినిర్గతా యస్మా న్నామ్నా తస్మా చ్ఛివాగుడికేతి.

పాలు దానిమ్మరసము సురాసవము మధువు శీతోదకములు వీటి ఉలోదనములు గాని అనుపానములు గాని యుత్తమములు. అడవిజంతువుల మాంసమును తినెడివాడు జీర్ణమైన పిమ్మట లఘ్వన్నమును పాలను త్రావవలయును. ఇష్టేచ్ఛా జాలు గడచిన పిమ్మట నదియును సామాన్యముగనే భుజింపవలయును. భుజించి దీనిని భక్షించినను యదృచ్ఛావశమునకైన భయమును కలిగింపదు. సుకుమారులును కాముకులును దీనిని ప్రయోగించిన నేయుపద్రవములు నుండవు. ఒకసంవత్సరము దీనిని సేవించినచో ప్రబలములగు వాతశోణితములు హరించును. అనేకసంవత్సరములనుండి వచ్చిన క్షయరోగమును అఢ్యవాతమును పోగొట్టును. జ్వరములును యోనిదోషములును శుక్రదోషములును ప్లీహరోగములును మూలరోగములును పాండురోగములును గ్రహణులును బ్రధ్నములును వమి గుల్మములను పీనస యెక్కిళ్లు కాసశ్వాస అరుచి కుష్ఠు బొల్లి పాండ నపుంసకత్వము మదము క్షయ వాపు పిచ్చి యపస్మారము వదననేత్రశిరోరోగములను ఆనాహమును అతిసారమును అసృగ్దరమును కామెల ప్రమేహములు యకృత్తు అర్బుదమును విద్రధియును భగందరము రక్తపిత్తము మిక్కిలి కృశించుట ఊఱుట చెమ్మట శ్లీపదము మున్నగునవి నశించును. దంష్ట్రావిషములను బహుప్రకారములగు విషములను మంత్రౌషధాదిప్రయోగములను వియుతములగు భూతరోగములను పాపము అభాగ్యములను శివయను నీగుటిక శమింపఁజేయును. బలకరమును వృష్యమును ధన్యమును కాంతిని కీర్తిని సంతానమును ఇచ్చునట్టిదీగుటిక. వివాదకాలమున ముఖస్థముచేసికొనిన జయమునిచ్చును. దీనిని సేవించినవాడు శ్రీమంతుఁడై ప్రకృష్టమేధాసంపన్నుఁడై స్మృతి బుద్ధిబలాన్వితుఁడై నిరుపమానమగు శరీరముగలిగి పుష్టితేజస్సు కాంతి ఇంద్రియబలము మున్నగు సంపదలు గలవాడై వలీపలితములులేక 200 వర్షములు జీవించును. ఒక సంవత్సరము సేవించినంత మాత్రాన రెండుసంవత్సరములు సేవించిన 400 వందలేండ్లు జీవించును. సమస్తరోగములను జయించును. మునిగణములు సేవింపదగిన రహస్యపు రసాయనమని చెప్పఁబడినది.

తొలుత సముద్రమథనకాలమునందు మంథరపర్వతమునుండి చెమ్మట పుట్టెను. దానిని బ్రహ్మగారు లోకకల్యాణమునకై కొండలలో శిలాజిత్తురూపముగానుంచెను.

ఈశివాగుటికయనురసాయనమును ఈశ్వరుఁడుగణపతికి చెప్పెను. శివునివలన నుత్తమయ్యె నుకావున నిది శివాగుటిక యనఁబడెను. ఇయ్యది శైవసిద్ధాంతమునందు చెప్పఁబడియెను.

## అమృతభల్లాతకి.

శ్లో. సుపక్వభల్లాతఫలాని సమ్యగ్ద్విధా విదార్యాఢకసమ్మితాని. 192. విపాచ్య తోయేన చతుర్గుణేన చతుర్థశేషే వ్యపనీయ తాని, పునః పచేత్ క్షీరచతుర్గుణేన ఘృతాంశయుక్తేన ఘనం యథా స్యాత్. 193. శీతే పలాంషోడశభిః ప్రైస్తు విమిశ్ర్య సంస్థాప్య దినాని సప్త, తతః ప్రయోజ్యాగ్నిబలేన మాత్రాం జయేద్గుదోత్థాన్ సకలాన్ వికారాన్. 194. కచాన్ సునీలాన్ ఘనకుంచితాగ్రాన్ సుపర్ణదృష్టిం సుకుమారతాం చ, జవం హయానాం చ మతంగజానాం బలం స్వరం చాపి మయూరస్య హుతాశదీప్తిం. 195. స్త్రీవల్లభత్వం లభతే ప్రజాం చ నిరోగమబ్దశతాని చాయుః, న చాన్నపానే పరిహార్యమస్తి నచాతపే చాధ్వని మైథునే చ. 196. ప్రయోగరాజః సకలామయానాం రాజా హ్యయం సర్వరసాయనానాం. భల్లాతకశుద్ధిరిహ ప్రాగుక్తచూర్ణగుండనాత్, ఘృతాచ్చతుర్గుణం క్షీరం ఘృతస్య ప్రస్థ ఇష్యతే. 197.

చక్కఁగా పక్వములైన జీడివిత్తనములను రెండుగా చీల్చి ఒక ఆఢకమును నాలుగు రెట్లునీటిలో పక్వముచేసి నాల్గవపాలు మిగిలియుండఁగా దించి నాల్గురెట్లు పాలను కలిపి మఱల పక్వముచేయవలయును. ఇట్లు గట్టిపడునంతవఱకును చేసి పిమ్మట 16 పలముల చక్కెరను కలిపి ఏడురోజు లుంచవలయును. పిమ్మట అగ్నిబలానుసారముగ మాత్రల నుపయోగింపవలయును. ఇయ్యది గుదరోగములను సంపూర్ణముగా పోగొట్టును. వెంట్రుకలను నల్లగను సన్నని యగ్రములు గలవానిగను చేయును. గరుడునిలాగంటిచూపును సుకుమారతను ఇచ్చును. గుఱ్ఱమువంటి వేగమును ఏనుగుల వంటిబలమును నెమలివంటి స్వరమును అగ్నివంటి తేజమును స్త్రీవల్లభత్వమును మంచి సంతానము నిచ్చి నీరోగముగా రెండునూర్లయేండ్లయూయువు నొసగును. అన్నపానములలో పరిహరింపఁదగిన దేదియును లేదు. ఎండ, దారి, మైథునములు పరిహరింపనవసరము లేదు. ప్రయోగకాలమునందు అన్నిరోగములకును స్వేచ్ఛగా దీనిని వాడవచ్చును. సమస్తరసాయనములలో నిది శ్రేష్ఠమైనది. జీడివిత్తులను శుద్ధిచేయుటలో పూర్వము చెప్పినచొప్పన వాంఛితమగు చూర్ణగుండనముతో చేయవలయును. నేతికంటె నాలుగురెట్లుపాలును 16 పలముల నేతిని గ్రహింపవలయును.

ఇట్లు చక్రదత్తమునందు రసాయనాధికారప్రకరణము ముగిసెను.

---

# ౬౬. వృష్యాధికారము.

## వాజీకరణోపాయములు.

శ్లో. పిప్పలీలవణోపేతౌ బస్తాండౌ క్షీరసర్పిషా, సాధితౌ భక్షయేద్యస్తు స గచ్ఛేత్ప్రమదాశతం. 1. బస్తాండసిద్ధే పయసి సాధితానసకృత్తిలాన్, యః ఖాదేత్స నరో గచ్ఛేత్ స్త్రీణాం శతమపూర్వవత్. 2. చూర్ణం విదార్యాః సుకృతం స్వరసేనైవ భావితం, సర్పిః క్షీరయుతం లీఢ్వా శతం గచ్ఛేద్వరాంగనాః. 3. ఏవమామలకం చూర్ణం స్వరసేనైవ భావితం, శర్కరామధుసర్పిర్భిర్యుక్తం లీఢ్వా పయః పిబేత్. 4. ఏతేనాశీతివర్షోఽపి యువేవ పరిహృష్యతే, విదారీకందకల్కం తు ఘృతేన పయసా నరః. 5. ఉదుంబరసమం ఖాదన్వృద్ధోఽపి తరుణాయతే, స్వయంగుప్తాగోక్షురయోర్బీజచూర్ణం సశర్కరం. 6. ధారోష్ణేన నరః పీత్వా పయసా న క్షయం వ్రజేత్, ఉచ్చటాచూర్ణమప్యేవం క్షీరేణోత్తమముచ్యతే. 7. శతావర్యుచ్చటాచూర్ణం పేయమేవం సుఖార్థినా, కర్షం మధుకచూర్ణస్య ఘృతక్షౌద్రసమన్వితం. 8. పయోనుపానం యో లిహ్యాన్నిత్యవేగః స నా భవేత్, గోక్షురకః క్షురకః శతమూలీ వానరీ నాగబలాతిబలా చ. 9. చూర్ణమిదం పయసా నిశి పేయం యస్య గృహే ప్రమదాశతమస్తి.

మేకఅండములను పాలు నేయి వీటితో సిద్ధము చేసి పిప్పళ్లు లవణము కలిపి తినినచో నూర్వురు యువతులతో భోగింపగలవాఁడగును. మేకఅండములతో సిద్ధము చేసిన పాలలో ననేకమార్లు తిలలను పక్వము చేసి తినినచో క్రొత్తవానివలె ప్రమదాశతము ననుభవింపగలుగును. విదారీకందము చూర్ణము చేసి దానిరసముతోనే భావనచేసి పాలతో కలిపి నాకిన స్త్రీశతము నుపభోగింపగలుగును. ఇట్లే యుసిరికకాయలను చూర్ణము చేసి యుసిరికరసముతో భావనచేసి కండచక్కెర తేనె నేయి కలిపి సేవించి పాలను త్రాగవలయును. దీనిని చేసిన ఎనుబదియేండ్ల వృద్ధుడైనను యువకునివలె సంభోగింపగలుగును. విదారీకందకల్కమును నేతితో పాలతో ఒకపలమంత తినిన వృద్ధుఁడును యువకునివలె నగును. దురదగొండి పల్లేరువీటిచూర్ణములో కండచక్కెరను కలిపి ధారోష్ణములగు పాలతో త్రాగిన క్షయరోగములు నశించును. ఉరీ

తిగనే పిల్లపీచర నేలగుమ్మడిక చూర్ణముచేసి త్రాగినను ముల్లంగిచూర్ణ మును ఒకతులము ను నేయి తేనె వైచికొని తిని పాలుత్రాగినను నిత్యవేగము కలవాడగును. పల్లేరు త్సుర కము పిల్లపీచర ముత్తువపులగము అతిబల వీటిచూర్ణ మును పాలతో రాత్రులం త్రాగ వలయును.

## ఘృతభృష్ట మాషాద్యౌషధములు.

శ్లో. ఘృతభృష్టో దుగ్ధమాషపాయసో వృష్య ఉత్తమః. 10. దధ్నః సారం శరచ్చంద్రసన్నిభం దోషవర్జితం, శర్కరాక్షౌద్రమరిచైస్తుగాక్షీర్యా చ బుద్ధిమాన్. 11. యుక్త్వా యుక్తం ససూక్ష్మైలం నవే కుంభే శుచౌ పటే, మార్జితే ప్రక్షిపే చ్ఛీతే ఘృతాఢ్యం షష్టికౌదనం. 12. తద్దద్యా దుపవిష్టా చ్చ రసానాం మాత్రయా పిబేత్, వర్ణస్వరబలోపేతః పుమాం స్తేన వృషాయతే. 13. ఆర్ద్రాణి మత్స్యమాంసాని శఫరీర్వా సుభర్జితాః, తప్తే సర్పిషి యః ఖాదేత్స గచ్ఛే త్స్త్రీషు న క్షయం. 14.

నేతిలో మినుములను వేయించి పాలలో నూరి కలిపి క్షీరాన్నమును చేయవల యును. ఇయ్యది ఉత్తమమగు వాజీకరణము. శరచ్చంద్రసన్నిభమును దోషరహితము నగుదధిసారమును కలకండ తేనెమిరియములు వంశలోచనము చిన్నయేలకులు వీటితో చేర్చి యుక్తిగా నవీనమును శుద్ధమగుగుడ్డలో వడియ కట్టవలయును. పిమ్మట దానిలో నేయి గలిపేరు బియ్యమును వైచి మాత్రలను చేయవలయును. దీనినే సేవించినచో భోగింపసమర్థుఁడగును. ఆర్ద్రములగు మత్స్యమాంసములు లేనిచో వేడినేతిలో వేయించినచేపను తినెడివాడు స్త్రీలయందు క్షీణత నొందడు.

## నాగసింహ చూర్ణము.

శ్లో. శతావరీరజః ప్రస్థం ప్రస్థం గోక్షురకస్య చ, వారాహ్యా వింశతిపలం గుడూచ్యాః పంచవింశతిః. 15. భల్లాతకానాం ద్వాత్రింశచ్చిత్రకస్య దశైవ తు, తిలానాం శోధితానాం చ ప్రస్థం దద్యా త్సుచూర్ణితం. 16. త్ర్యూషణస్య పలా న్యష్టౌ శర్కరాయా శ్చ సప్తతిః, మాక్షికం శర్కరార్ధేన మాక్షికార్ధేన వై ఘృతం. 17. శతావరీసమం దేయం విదారీకందజం రజః, ఏత దేకీకృతం చూర్ణం స్నిగ్ధే భాండే నిధాపయేత్. 18. పలార్ధ ముపయుంజీత యథేష్టం చాపి భోజనం, మాసైక

ముపయోగేన జరాం హంతి రుజా మపి. 19. వలీపలితఖాలిత్యమే హపాండ్వాద్యపీనసాన్, హంత్యష్టాదశ కుష్ఠాని యథాష్టా వుదరాణి చ. 20. భగందరం మూత్రకృచ్ఛ్రం గృధ్రసీం సహలీమకం, క్షయం చైవ మహాశ్వాసా న్పంచ కాసా న్సుదారుణాన్. 21. అశీతిం హితజా న్రోగాం శ్చత్వారింశ చ్చ పైత్తికాన్, వింశతిం శ్లేష్మికాం శ్చైవ సంసృష్టా న్సాన్నిపాతికాన్. సర్వా నర్శోగదా న్హంతి వృక్ష మింద్రాశనిర్యథా. 22. సకాంచనాభో మృగరాజవిక్రమ స్తురంగమం చాఽప్యనుయాతి వేగతః, స్త్రీణాం శతం గచ్ఛతి సోఽతిరేకం ప్రకృష్టదృష్టి శ్చ యథా విహంగః. 23. పుత్రా న్సంజనయే ద్వీరా న్నరసింహనిభాం స్తథా, నారసింహమిదం చూర్ణం సర్వరోగహరం నృణాం. 24. వారాహీకంద సంగ స్తు చర్మకారాలుకో మతః, పశ్చిమే ఘృష్టిశబ్దాఖ్యో వరాహో లోమవా నివ. 25.

శతావరి 16 పలములు, పల్లేరు 16 పలములు, వారాహీకంద 20 పలములు, తిప్పతీగె 25 పలములు, జీడివిత్తులు, 62 పలములు చిత్రమూలము 10 పలములు శుద్ధిచేసినదియు, చూర్ణము 16 పలములు, త్రికటుకములు 8 పలములు, చక్కెర 70 పలములు, తేనె శర్కరలో సగము, తేనెలో సగము నేయి, శతావరితో సమముగా పిల్లపీచర వీటి నొకటిగా కలపి చూర్ణముచేసి స్నిగ్ధభాండములో స్థాపనచేసియుంచి అర్ధపలముచొప్పున తిని మనోవాంఛితరీతిని భోజనమును చేయవలయును. ఒక నెల సేవించినచో వృద్ధత్వము పీడలును నశించును. తల నెరియుట ఖాలిత్యము మేహము పాండువు పీనస అష్టాదశకుష్ఠులు అష్టోదరములు భగందరము మూత్రకృచ్ఛ్రము గృధ్రసి హలీమకము క్షయ మహాశ్వాసములు కాసరోగము లయిదును అశీతివాతరోగములును నలువదిపైత్తికరోగములును వింశతిశ్లేష్మములును సంకరములగు సన్నిపాతములును సమస్తములగు మూలరోగములను పిడుగు చెట్లనువలె నశింపజేయును. దీనిని సేవించువాడు సింహవిక్రమముగలవాడుగను స్వర్ణతేజము గలవాడుగను వేగవిషయమున తురంగమునుగూడ మించెడివాడు నగును. గరుడునివలె తీక్ష్ణదృష్టిగలవాడుగను స్త్రీశతముతో భోగింపగలవాడుగ నగును. నరసింహునితో తుల్యులగు కొమరులను పుట్టింపగలుగును. ఇయ్యది సమస్తరోగములను హరించునట్టిది. నృసింహచూర్ణము. వారాహీకందతో గలిపి సేవించువాడు పశ్చిమవయస్సులో దృఢుడగును.

## గోధూమాద్యచూర్ణము.

శ్లో. గోధూమాచ్ఛ పలశతం నిఃక్వాథ్య సలిలాఢకే, పాదావశేషపూతే చ ద్రవ్యాణీమాని దాపయేత్. 26. గోధూమం యుంజాతఫలం మాషద్రాక్షాపరూషకం, కాకోలీ క్షీరకాకోలీ జీవంతీ సశతావరీ. 27. అశ్వగంధా సఖర్జూరా మధుకం త్ర్యూషణం సితా, భల్లాతకమాత్మగుప్తా సమభాగాని కారయేత్. 28. ఘృతప్రస్థం పచేదేకం క్షీరం దత్వా చతుర్గుణం, మృద్వగ్నినా చ సిద్ధే చ ద్రవ్యాణ్యేతాని నిక్షిపేత్. 29. త్వగేలాపిప్పలీధాన్యకర్పూరం నాగకేసరం, యథాలాభం వినిక్షిప్య సితాక్షౌద్రపలాష్టకం. 30. శక్త్యేక్షుదండేనాలోడ్య విధివద్వినియోజయేత్, శాల్యోదనేన భుంజీత పిబేన్మాంసరసేన వా. 31. కేవలస్య పిబేదస్య పలమాత్రాం ప్రమాణతః, న తస్య లింగశైథిల్యం నచ శుక్రక్షయో భవేత్. 32. బల్యం పరం వాతహరం శుక్రసంజననం పరం, మూత్రకృచ్ఛ్రప్రశమనం వృద్ధానాం చాఽపి శస్యతే. 33. పలద్వయం తదశ్నీయా ద్దశరాత్రమతంద్రితః, స్త్రీణాం శతం చ భజతే పీత్వా చానుపిబే త్పయః. 34. అశ్విభ్యాం నిర్మితం చైతద్గోధూమాద్యం రసాయనం, జలద్రోణే తు గోధూమక్వాథే తచ్ఛేష మాఢకం. 35. యుంజాతకస్య స్థానే తు తద్గుణం తాలమస్తకం, కల్కద్రవ్యసమం మానం త్వగాదేః సాహచర్యతః. 36.

గోధుమలు నూరుపలములు ఒక ఆఢకపు నీటిలో పక్వముచేసి నాలవ పాలు మిగిలియుండగా నీక్రింది ద్రవ్యములను చేర్పవలయును. తవక్షీర యుంజాతకను మినుములు ద్రాక్ష కాకోలి క్షీరకాకోలి జీవంతి పిల్లపీచర పెన్నేరు ఖర్జూరము మధుకము త్రికటుకములు సితజీడిగింజలు దురదగొండి వీటిని సమభాగములను చేసి వేయవలయును. ఒక ప్రస్థము నేతిని నాలుగురెట్లు పాలను అందు కలిపి సన్నని సెగను సిద్ధముచేసి పిమ్మట నీక్రింది ద్రవ్యములను వేయవలయును. లవంగపుపట్ట ఏలకులు పిప్పళ్లు ధనియములు కర్పూరము నాగకేసరములు వీటిని దొరకినంతవఱకు వైచి చక్కెర తేనె 8 పలములు వైచి ఇక్షుదండముతో ఆలోడనచేసి యథావిధిగా ప్రయోగింపవలయును. శాలితండులముల అన్నమునుగాని మాంసరసమునుగాని సేవింపవలయును. ఒక పలము మాత్రను సేవింపవలయును. లింగము శిథిలముగాదు. వీర్యముజాఱదు. బలమును వృద్ధిచేయును. వాతమును హరించును. వీర్యమును కలిగించును. మూత్రకృచ్ఛ్రములను పోగొట్టును.

2 పలములు తినిన వృద్ధులకును మంచిది. సావధానులై పదిరాత్రులవఱకు పాలను త్రాగు చుండిన స్త్రీశతమును భోగింపగలడు. ఈరసాయనమును అశ్వినీకుమారులు రచించిరి. ద్రోణపుష్పి కషాయములో అధికమును మిగుల్పవలయును. యుంజాతకమునకు బదులు తాడ మస్తకమును చేర్పవలయును.

## శతావరీఘృతము.

శ్లో. ఘృతం శతావరీగర్భం క్షీరే దశగుణే పచేత్, శర్కరాపిప్పలీక్షౌద్రయుక్తం తద్వృష్య ముచ్యతే. 37.

పదిరెట్లపాలలో శతావరికల్కమును వైచి ఘృతమునుపక్వముచేసి పిమ్మట కండచక్కెర పిప్పళ్లు తేనె కలిపి త్రాగినచో వీర్యవృద్ధి యగును.

## గుడకూష్మాండకము.

శ్లో. కూష్మాండకాత్పలశతం సుస్విన్నం నిష్కులీకృతం, ప్రస్థం ఘృతస్య తైలస్య తస్మిం స్తప్తే ప్రదాపయేత్. 38. త్వక్పత్రధన్యాకవ్యోషజీరకైలాద్వయానలం, గ్రంథికం చవ్య మానంగ పిప్పలీ విశ్వభేషజం. 39. శృంగాటకం కశేరుం చ ప్రలంబం తాలమస్తకం, చూర్ణీకృతం పలాంశం చ గుడస్య చ తులాం పచేత్. 40. శీతీభూతే పలా న్యష్టౌ మధునః సంప్రదాపయేత్, కఫపిత్తానిలహరం మందాగ్నీనాం చ శస్యతే. 41. కృశానాం బృంహణం శ్రేష్ఠం వాజీకరణ ముత్తమం, ప్రమదాసు ప్రసక్తానాం యే చ స్యుః క్షీణరేతసః. 42. క్షయేణ చ గృహీతానాం పర మేతి ద్భిషగ్జితం, కాసం శ్వాసం జ్వరం హిక్కాం హంతి ఛర్ది మరోచకం. 43. గుడకూష్మాండకఖ్యాత మశ్విభ్యాం సముదాహృతం, ఖండకూష్మాండవ త్పాత్రం స్విన్నకూష్మాండకద్రవః. 44. యత్కించి న్మధురం స్నిగ్ధం జీవనం బృంహణం గురు, హర్షణం మనసశ్చైవ సర్వం త ద్వృష్య ముచ్యతే. 45. భల్లాతకబృహతీ ఫల దాడిమఫలకల్కసాధితం. కురుతే, లింగం మర్దనవిధినా కటుతైలం వాజిలింగాభం. 46. కనకరసమసృణవర్తితహయగంధామూలవిశ్వపర్యుషితం, మాహిష మిహ నవనీతం గతబీజే కనకఫలమధ్యే. 47. గోమయగాఢోద్వర్తితం పూర్వం పశ్చా దనేన సంలిప్తం, భవతి హయలింగసదృశం లింగం కఠినాంగనాదయితం. 48.

కూష్మాండమును చెక్కుతీసి నూరుపలములు తెచ్చి తప్తముఁజేసి దానియందు ఒకప్రస్థముచొ॥ నేయిని నూనెను పోయవలయును. లవంగపుపట్ట తేజపత్రి ధనియము లు త్రికటుకములు జీలకఱ్ఱ ఏలకులు చిత్రమూలము గ్రంథికము చవ్యము ఉష్మెత్త పిప్ప ళ్లు శొంఠి శృంగాటకము కసేరువు తాడమస్తకము వీటినిచూర్ణముచేసి ఒకతులము బెల్ల మును చేర్చి పక్వముచేసి చల్లారిన పిమ్మట ఎన్నిదిపలములు తేనెను చేర్పవలయును. కఫ పిత్తవాతములను హరించును. మందాగ్నిని పోగొట్టును. చిక్కినవారి బలపఱచును. ఉత్త మమగు వాజీకరణమియ్యది. స్త్రీప్రసక్తిగలిగి నప్పుడు క్షీణరేతసులగువారలకును క్ష యరోగులకును ఇయ్యది యుత్తమౌషధము. కాసశ్వాసజ్వరము ఎక్కిళ్లు చర్ది అరోచ కములను పోగొట్టును. ఇయ్యది అశ్వినీకుమారులచేతఁజెప్పఁబడినది. ఏదేది మధురముగ ను స్నిగ్ధముగను ధాతువులకు బృంహణమును మనస్సునకు హర్షణము నైయుండునో అయ్యదెల్లను వృష్యమేయగును. జీడివిత్తులు వాకుడుకాయలు దానిమ్మపండు వీటికి లక్క ముతో సిద్ధముచేసిన కటుతైలము లింగమును గుఱ్ఱపులింగమంతపాటిఁగాచేయును. ఉష్మె త్తరసముతో పూసివత్తిచేసిన పెన్నేరువేళ్లు శొంఠిలో నానబెట్టి గేదెపాలతో నైన వెన్నను ఉష్మెత్తలోనగింజలుదీసి దాని మధ్యనుంచి గోమయముతో ఉద్వర్తనముచేసి పిమ్మటదీనితో లింగమును మర్దించిన గుఱ్ఱపులింగమంత లింగమగును.

## అశ్వగంధాతైలము.

శ్లో. అశ్వగంధావరీకుష్ఠమాంసీసింహీఫలాన్వితం, చతుర్గుణేన దుగ్ధేన తిలతైలం విపాచయేత్. 49. స్తనలింగకర్ణపాళివర్ధనం మ్రక్షణా దిదం.

అశ్వగంధ పిల్లపీచర కోష్ఠు జటామాంసి వాకుడు వీటికల్కములో నాలుగురెట్లు పాలను తిలతైలమును పక్వముచేయవలయును. ఇది స్తనములను లింగములను చెవి తమ్మెలను పెంచును.

## ఇతరములగు వాజీకరణోపాయములు.

శ్లో. భల్లాతక బృహతీఫల నలినీదల సింధు జలశూకైః, మాహిష నవనీతేన చ కరంబితైః సప్తదిన ముషితైః. 50. మూలేన హయ గంధాయా మాహిషమలమర్దితపూర్వ ముత, లిప్తం భవతి లఘుకృత రాసభలింగం ధ్రువం పుంసాం. 51. నీలోత్పలసితపంకజకేసరమధుశ ర్కరావలిప్తేన, సురతే సుచిరం రమతే దృఢలింగో భవతి నాభివివ రేణ. 52. సిద్ధం కుసుంభతైలం భూమిలతాచూర్ణమిశ్రితం కురుతే, చర

ణాభ్యంగేన రతే ర్బీజ స్తంభా ద్దృఢం లింగం. 53. సప్తాహం ఛాగభవ సలిలస్థంకరభవారుణీమూలం, గాఢోద్వర్తనవిధినా లింగ స్తంభం తథా దృఢం కురుతే. 54. గోరేకోన్నతశృంగత్వగ్భవచూర్ణేన ధూపితం వస్త్రం, పరిధాయ భజతి లలనాం నైకాంతే భవతి హర్షార్తః. 55. సమ తిలగోక్షురచూర్ణం ఛాగీక్షీరేణ సాధితం సమధు, భుక్తం క్షపయతి షాండ్యం యజ్జనితం సుప్రయోగేణ. 56. యోగజవరాంగబద్ధం మథితేన ఖాలిత్యం హరతి, ఉన్ముఖ గోశృంగోద్భవ మృల్లేపో యోగజధ్వజ భంగహరః. 57. కుష్ఠైలవాలుకైలా ముస్తకధన్యాకమధుజః కవలః, అపహరతి పూతిగంధం రసానమదిరాదిజం గంధం. 58. ఘ్రాణేన బీజపూర త్వగ్గ్రహణాత్ వాలిగంధనుత్.

జీడిపిక్కలు కోష్ఠు పెద్దనాకుడు కమలినీదళములు సైంధవలవణము కురువేరు వీటిని గేదనేతితో కలిపి ఏడుగోజులు ధరిపవలయును. పెన్నేరువేళ్లతో కలిపి పుచ్చుకొనవలయును. గేదపేడతో మొదల లేపనచేసి పిమ్మట దీనితో చేసిన, గడిదెలింగమంతయగును. నల్లకమలములు తెల్లకమలములు కుంకుమపువ్వు మధుకము పండచక్కెర వీటిని నూరిబొడ్డునకు రాచికొని భోగించిన దృఢలింగము కలవాడై చాలసేపు భోగింపకలుగును. తిలలు పల్లేరుచూర్ణము సమములుగా గ్రహించి మేకపాలతో సిద్ధముచేసి తేనెను కలిపి కొని తాగిన కుత్సితప్రయోగములవలన గలిగిన నపుంసకత్వము నశించును. మాచికాయచెక్కను తేనెతో కలిపి తినిన అధోవాతముల దుర్గంధము నశించును.

ఇట్లు చక్రదత్తయందు వృష్యాధికారప్రకరణము ముగిసెను.



# ౬౭. స్నేహాధికారము.

## స్నేహవిచారము.

శ్లో. సర్పి స్తైలం వసా మజ్జా స్నేహేషు ప్రవరం మతం, తత్రాపి చోత్తమం సర్పిః సంస్కారస్యానువర్తనాత్. 1. కేవలం పైత్తికే సన్నిపాతికే లవణాన్వితం, దేయం బహుకఫే చాపి వ్యోషక్షారసమాయుతం. 2. తథా ధీస్మృతిమేధాగ్నికాంక్షిణాం శస్యతే ఘృతం,

గ్రంథినాడీక్రిమిశ్లేష్మ మేదోమారుతరోగిషు. 3. తైలం లాఘవదార్ఢ్యార్థం క్రూరకోష్ఠేషు దేహిషు, వాతాతపాధ్వభారస్త్రీవ్యాయామక్షీణధాతుషు. 4. రూక్షక్లేశ క్షయాత్యగ్ని వాతావృతపథేషు చ, శేషా వసంతే సంధ్యస్థి మర్మకోష్ఠరుజాసు చ. 5. తథా దగ్ధాహతభ్రష్ట యోనికర్ణ శిరోరుజి, తైలం ప్రావృషి వర్షాంతే సర్పి రంత్యే తు మాధవే. 6. సాధారణఋతౌ స్నేహం పిబేత్కార్యవశా దిహ.

నేయి తైలము వస మజ్జ ఇయ్యది స్నేహములలో శ్రేష్ఠములు. అందునను సంస్కారము ననువర్తించుటచేత నేయి యుత్తమము. పిత్తరోగమునకు కేవలఘృతమును, వాతికమునకు లవణసహితమగుఘృతమును, కఫమునందు త్రికటుకములు యవక్షారములతో ఘృతమును ఇయ్యవలసినది. బుద్ధి స్మృతి మేధ జఠరాగ్ని కావలసినవారు నేతిని త్రాగుట యుత్తమము. గ్రంథులు నాడీరోగములు క్రిమిరోగములు శ్లేష్మరోగములు మేదోరోగములు వాతరోగములు క్రూరములగు కోష్ఠములుగలవారికి లాఘవమును దార్ఢ్యమును కలిగించుటకు తైలము నీయవలయును. వాతము ఎండ మార్గాయాసము స్త్రీవ్యాయామము ధాతుక్షీణము రూక్షక్లేశము క్షయవాతావృతమార్గములు కీటియందును తైలము నీయవలయును. తక్కినవాని వసంతకాలమునందు సంధులు అస్థులు మర్మకోష్ఠపురుజలు దగ్ధములు నాహతములు నగుయోనులు కర్ణములు శిరస్సు వీటి నొప్పులయందును ఈయవలయును. తైలమును వర్షాకాలములోను నేతిని శరదృతువునందును వసామజ్జలను వసంతకాలమునందును సాధారణఋతువులలో స్నేహమును సేవింపవలయును.

### స్నేహపానమునకు యోగ్యకాలములు.

శ్లో. వాతపిత్తాధికో రాత్రా వుష్ణేచాఽపి పిబేన్నరః. 7. శ్లేష్మాధికో దివా శీతే పిబేచ్చామలభాస్కరే. స్వేద్య సంశోధ్య మద్యస్త్రీవ్యాయామాసక్తిచింతకాః. 8. వృద్ధా బాలా బలకృశా రూక్షక్షీణాస్రరేతసః, వాతార్తస్పందతిమిర దారుణప్రతిరోధినః. 9. స్నేహ్యా నశ్యతి మందాగ్నితీక్ష్ణాగ్నిస్థూలదుర్బలాః, ఊరుస్తంభాతిసారామగలరోగగరోదరైః. 10. మూర్ఛాఛర్ద్యరుచి శ్లేష్మతృష్ణామద్యైశ్చ పీడితాః, ఆమప్రసూతా యుక్తే చ నస్యే వస్తౌ విరేచనే. 11. స్నేహసాధ్యాః క్లేశసహా దృఢాః కాలే చ శీతలే, అచ్ఛమేవ పిబేత్స్నేహ 'మచ్ఛపానం హి శోభనం. 12. పిబేత్సంశమనం స్నేహ మన్నకాలే ప్రకాం

క్షితః, శుద్ధ్యర్థం పునరాహారే నైశే జీర్ణే పిబే న్నరః. 13. అహోరాత్ర మహః కృత్స్నం దినార్థం చ ప్రతీక్షతే.

వాతపిత్తాధిక్యముగలవాడు రాత్రులను వేడిచేసినప్పుడును స్నేహమును త్రాగవలయును. కఫాధిక్యముగలవాడు పగలు శీతమునందు సూర్యుఁ డస్తమించిన పిదప త్రాగవలయును. స్వేద్యమును సంశోధ్యమును అగుమద్యమునందును వ్యాయామమునందు నాసక్తి గలవారును ముసలివారు పసివారు బలములేనివారు రూక్షక్షీణములగు నస్రరేతస్సులు గలవారలు వాతార్తులు తిమిరములు ప్రతిరోధములు గలవారు సంబాగ్ని క్షీణాగ్ని స్థౌల్యదౌర్బల్యములు గలవారలును స్నేహపానమును చేయరాదు. ఊరుస్తంభము అతిసారము ఆమము గళరోగము ఉదరరోగము మూర్ఛ ఛర్ది అరుచి శ్లేష్మము తృష్ణ మద్యము వీటిచేత పీడితులైనవారును స్నేహమును సేవింపరాదు. ఆమపరిణాతయగు స్త్రీవస్తినివిరేచనమును సంహరించును. స్వచ్ఛముచేసిన స్నేహమునే త్రాగవలయును. అన్నకాలమునందు వలసినవాడు సంశమనరూపమగు స్నేహము త్రాగవలయును. రాత్రిభోజనమైన పిమ్మట జీర్ణమైన పిమ్మట శుద్ధ్యర్థమై త్రాగవలయును. అహోరాత్రమును పగలును జీర్ణమగుట ఉత్తమాధమమధ్యమములు.

## స్నేహప్రమాణాదులు.

శ్లో. ఉత్తమామధ్యమా హ్రస్వా స్నేహమాత్రా జరాం ప్రతి. 14. ఉత్తమస్య పలం మాత్రా త్రిభి శ్చాక్షై శ్చ మధ్యమేః జఘన్యస్య పలార్ధేన స్నేహక్వాథ్యౌషధేషు చ. 15. జల ముష్ణం ఘృతే పేయం యూష స్తైలేఽనుశస్యతే, వసామజ్ఞో స్తు మండః స్యాత్సర్వే ష్వూష్ణ మథాంబువా. 16. భల్లాతే తౌరవే స్నేహే శీత మేవ జలం పిబేత్, స్నేహపీత స్తు తృష్ణాయాం పిబే దుష్ణోదకం నరః. 17. ఏవం చానుప్రశామ్యంతం స్నేహ ముష్ణాంబు నోద్ధరేత్, మిథ్యాచారా ద్బహుత్వా ద్వా యస్య స్నేహో న జీర్యతి. 18. విష్టభ్య వాపి జీర్యేత్తం వారి ణోష్ణేన వామయేత్, తతః స్నేహం పున ర్దద్యా ల్లఘుకోష్ఠాయ దేహినే. 19. జీర్ణాజీర్ణవిశంకాయాం పిబే దుష్ణోదకం నరః, తేనోద్గారో భవే చ్ఛుద్ధో రుచి శ్చాన్నం భవే త్ప్రితి. 20. భోజ్యాన్నం మాత్రయా పాస్యన్ శ్వః పిబన్పీతవా నపి, ద్రవోష్ణ మనభిష్యంది నాతిస్నిగ్ధ మశంకరం. 21. త్ర్యహావరం సప్తదినంపరంతు స్నిగ్ధోఽవరః స్వేద

యితవ్య ఇష్టః, నాతః పరం స్నేహన మాదిశంతి సాత్మ్యీభవే త్సప్త దినా త్పరం తు. 22.

ఒక పలముది ఉత్తమమాత్ర, ముక్కాలుంపలముది మధ్యమము, అరపలముది హ్రస్వమాత్రయనఁబడును. స్నేహక్వాథాదులలో నిదియే మాత్రాక్రమము. ఘృతము నందు వేడినీరును తైలమునందు యూషమును వసామజ్జలకు మండమును అన్నిఁటికి వేడి నీరు గాని త్రాగవలయును. స్నేహమును త్రాగినవానికి దప్పి కలిగిన వేడినీటిని త్రాగవల యును. మిథ్యాచారమువలనఁగాని ఎక్కువయగుటఁగాని అఱుగకున్నచో వేడినీటితో వాంతిని చేయింపవలయును. లఘుకోష్ఠముగల యాగోగికి మఱల స్నేహము నిప్పింపవల యును. జీర్ణాజీర్ణసందేహమునందు వేడినీటిని త్రాగిన వాంతియైనను. జీర్ణమైననగును. భోజ్యాన్నమును మాత్రతో త్రాగఁబోవాడుగాని త్రాగినవాడుగాని ద్రవోష్ణము కానట్టి యును అనభిష్యందియుం నఁతిస్నిగ్ధము నగు స్నేహమ్మును త్రాగవలయును.

## కోష్ఠభేదమువలన సేవనపరిమాణము.

శ్లో. మృదుకోష్ఠ స్త్రిరాత్రేణ స్నిహ్యా త్యచ్ఛోపసేవయా, స్నిహ్యతి క్రూరకోష్ఠ స్తు సప్తరాత్రేణ మానవః. 23. స్నిగ్ధద్రవోష్ణధ న్వోత్థరసభు క్స్వేద మాచరేత్, స్నిగ్ధః త్ర్యహం స్థితః కుర్యా ద్విరేకం వమనం పునః. 24. ఏకాహం దిన మన్యచ్చ కఫ ముత్క్లేశ్య తత్కరైః, వాతానులోమ్యం దీప్తాగ్ని ర్వర్చః స్నిగ్ధ మసంహతం. 25 స్నేహోద్వేగః క్లమః సమ్యక్ స్నిగ్ధే రూక్షే విపర్యయః, అతిస్నిగ్ధే తు పాండుత్వం ఘ్రాణవక్త్రగుదస్రవాః. 26. రూక్షస్య స్నేహనం కార్య మతిస్నిగ్ధస్య రూక్షణం, శ్యామాకకోరదూషాన్న తక్రపిణ్యాకసక్తుభిః. 27. బాలవృద్ధాదిషు స్నేహపరిహారాసహిష్ణుషు, యోగా నిమా నను ద్వేగా న్సద్యః స్నేహా న్ప్రయోజయేత్. 28. భృష్టే మాంసరసే స్నిగ్ధా యవాగూః స్వల్పతండులా, సక్షౌద్రా సేవ్యమానా తు సద్యః స్నేహన ముచ్యతే. 29. సర్పిస్తైలవసామజ్జా తండులప్రసృతైః శృతా, పాంచప్రసృతికీ పేయా పేయా స్నేహన మిచ్ఛతా. 30. సర్పిష్మతీ బహుతిలా తథైవ స్వల్పతండులా, సుఖోష్ణా సేవ్యమానా తు సద్యః స్నేహన ముచ్యతే. 31. శర్కరాఘృతసంసృష్టే దుహ్యా ద్గాం కలశే ఽథవా, పాయయేదక్షమే తద్ధి సద్యః స్నేహనముచ్యతే. 32. గ్రామ్యా

నూపౌదుకం మాంసం గుడం దధి పయ స్తైలాన్, కుక్షి శోధ ప్రమేహీ చ స్నేహనేన ప్రయోజయేత్. 33. స్నేహై ర్యథాస్వం తాన్స్విన్నైః స్నేహయే దవికారిభిః, పిప్పలీభి ర్హరీతక్యా సిద్ధైః త్రిఫలయా సహ. 34. స్నేహ మగ్రే ప్రయుంజీత తతః స్వేద మనంతరం, స్నేహస్వేదోపపన్నస్య సంశోధన మథాంతరం. 35.

మృదుకోష్ఠము గలవాడు స్వచ్ఛమును సేవించుటచేత మూడురాత్రులలో స్నిగ్ధుఁడగును. క్రూరకోష్ఠుఁ డేడురాత్రులలో నగును. స్నిగ్ధములు ద్రవములు ఉష్ణములు గసము వీటిని సేవించుచు స్వేదమును పట్టవలయును. స్నిగ్ధుఁడై మూడుగోజులైన పిమ్మట విరేచనమునకు ఇప్పింపవలయును. ఒకటి రెండుదినములు కఫకారకములగు వానితో కఫము నుత్క్లేశించినపిమ్మట వాతానులోమ్యము దీప్తాగ్ని అసంహతమలము నగును. స్నిగ్ధునికి స్నేహోద్వేగమును రూక్షునందు తద్విపరీతమును హితకరములు. చామలు కొఱ్ఱలు తక్రము పిండిసత్తువు వీటిని బాలవృద్ధాదులకును స్నేహపరిహారాసహిష్ణువులకును ఈయోగములను ప్రయోగింపవలసినది.

ఇట్లు చక్రదత్తయందు స్నేహాధికారప్రకరణము ముగిసెను.

---

# ౬౫. స్వేదాధికారము.

స్వేదాధికారులును తదుపాయములును.

శ్లో. వాతశ్లేష్మణి వాతే వా కఫే వా స్వేద ఇష్యతే, స్నిగ్ధరూక్ష స్తథా స్నిగ్ధో రూక్ష శ్చా ప్యుపకల్పితః. 1. వ్యాధౌ శీతే శరీరే చ మహా న్స్వేదో మహాబలే, దుర్బలే దుర్బల స్స్వేదో మధ్యమే మధ్యమో మతః. 2. ఆమాశయగతే వాతే కఫే పక్వాశయాశ్రయే, రూక్షపూర్వో హితః స్వేదః స్నేహపూర్వ స్తథైవ చ. 3. వృషణౌ హృదయం దృష్టీ స్వేదయే న్మృదువా నవా, మధ్యమం వంక్షణా శేష మంగావయవ మిష్టతః. 4. న స్వేదయే దతిస్థూలరూక్షదుర్బల మూర్ఛితాన్, స్తంభనీయక్షతక్షీణ విషమద్యవికారిణః. ౫. తిమిరోదర వీసర్పకుష్ఠశోషాఢ్యరోగిణః, పీతదుగ్ధదధిస్నేహమధూ న్కృతవిరేచ

నాన్. 6. భగ్నదగ్ధ గుదమ్లాని క్రోధశోకభయార్దితాన్, క్షుత్తృష్ణా కామలాపాండు మేహినః పిత్తపీడితాన్. 7. గర్భిణీం పుష్పితాం సూతాం మృదు ర్వాత్యయికే గదే, స్వేదో హిత స్త్వనాగ్నేయో వాతే మేదఃకఫావృతే. 8. నివాతగృహ మాయాసో గురుప్రావరణం భయం, ఉపనాహాహవక్రోధ భూరిపాన క్షుధాతపాః. 9. స్వేదయంతి దశైతాని నర మగ్నిగుణాదృతే, శీతశూలవ్యుపరమే స్తంభగౌరవనిగ్రహే. 10. సంజాతే మార్దవే స్వేదే స్వేదనా ద్విరతి ర్మతా.

వాతశ్లేష్మమునందుగాని వాతమునందుగాని కఫమునందుగాని స్వేదము హితము. వ్యాధియందును శీతలశరీరమునందును విస్తారము స్వేదము హితకరము. దుర్బలునకు కొలదిగాను మధ్యమునికి మధ్యమముగాను స్వేదమును పట్టింపవలయును. ఆమాశయగతవాతమునందును పక్వాశయగతకఫమునందును రూక్షపూర్వకమగు స్వేదమును స్నేహపూర్వకమగు స్వేదమును పట్టుట మంచిది. వృషణములు హృదయము కన్నులు స్వేచ్ఛగా స్వేదమును పట్టవలయును. అంగసంధులను స్వేదితములఁ జేయవలయును. అతిస్థూలుడు రూక్షదుర్బలుడు మూర్ఛకలవానికి చెమటను పట్టింపరాదు. స్తంభనీయులు క్షతక్షీణులు విషమద్యవికారములును తిమిరము ఉదరరోగము విసర్పకుష్ఠు నాపుకలవారును పాలు పెరుగు తైలము తేనెను త్రాగినవారలును విరేచనమునకు తీసికొనినవారును ఆకలి దప్పి కామెల పాండువు మేహముకలవారును పిత్తరోగముకలవారును గర్భిణి రజస్వలపు సూతయైన స్త్రీలును స్వేదమును పట్టుకొనుట హితము. గాలిలేని యిల్లు ఆయాసము బరువగు ఆచ్ఛాదనము భయము ఉపనాహము యుద్ధము కోపము విస్తారపుత్రాగుడు ఆకలి యెండ ఈపదియును అగ్ని మున్నగు లేకయే చెమటను కలిగించును.

## అతిస్వేదమున కుపశమనప్రకారములు.

శ్లో. స్ఫోటోత్పత్తిః పిత్తరక్తప్రకోపో మదో మూర్ఛా భ్రమదాహౌ క్లమ శ్చ, అతిస్వేదే సంధిపీడా తృషా చ క్రియాః శీతా స్తత్ర కుర్యా ద్విధిజ్ఞః. 11. సర్వా న్స్వేదా న్నివాతే తు జీర్ణా న్నే చావచారయేత్. 12. యేషాం నస్యం విధాతవ్యం వస్తి శ్చాపి హి దేహినాం, శోధనీయా స్తు యే కేచి త్పూర్వం స్వేద్యా స్తు తే మతాః. 13. పశ్చా త్స్వేద్యా హృతే శల్యే మూఢగర్భానుపద్రవాః, సమ్య

క్ష్రిజాతా కాలే చ పశ్చా త్స్వేద్యా విజానతా. 14. స్వేదః పశ్చాచ్చ పూర్వం చ భగంద ర్యర్శస స్తథా. 15. తప్తైః సైకతపాణికాంస్య వసనైః స్వేదోఽథ వాంగారకై, ర్లేపా ద్వాపాహారైః సహోమ్లలవణస్నేహై స్సుఖోష్ణై ర్భవేత్, ఏవం తప్తపయోంబుపాత శమనక్వాథాది సేకాదిభి స్తప్తై స్తోయనిసేచనోద్భవ బృహద్బాష్పైః శిలాద్యైః క్రమాత్. 16. తాపోపనాహ ద్రవబాష్పపూర్వాః స్వేదా స్త్రయోఽంత్య ప్రథమా కఫే స్తః, వాయౌ ద్వితీయః పవనే కఫే చ పిత్తోపసృష్టే వి హిత స్తృతీయః. 17.

అతిస్వేదము అయినచో బొబ్బలెత్తుట పిత్తరక్తప్రకోపము మదము మూర్ఛభ్రిమదాహములు క్లమము సంధిపీడ దప్పి కలుగును. కావున శీతక్రియలను చేయవలయును. సర్వస్వేదములను నివాతస్థలమునందు అన్నము జీర్ణించినపిమ్మట చేయవలసినది. వస్యము వస్తులు శోధనచేయఁదగు వారికి దతికిని ముందు స్వేదమును చేయింపవలయును. శల్యములు లేనివారును మూఢగర్భులును ఉపద్రవరహితులును పిమ్మట స్వేదమును చేయింపనర్హులు. భగందరము మూలరోగములయందు ముందును వెనుకను స్వేదమును పట్టవలయును. కాచిన ఇనుక చేయి కంచు గుడ్డ వీటితోగాని బొగ్గులతోగాని చెమ్మట నియ్యవలయును. వాతనాశకపదార్థములు పులుపు ఉప్పు తైలము వీటిని కొద్దిగా వెచ్చజేసి స్వేదమునీయవలయును. ఈరీతిగనే కాచిన పాలు నీళ్లు గాలి మున్నగువానివలన స్వేదము నొందింపవలయును. తాపము ఉపనాహము బాష్పము ఇయ్యవి స్వేదములు. మొదటివి చివరిప కఫమునందు హితకరములు. వాయువునందు వాతకఫమునందు రెండవస్వేదమును పిత్తవాతమునందు మూడవదియును హితకరములు.

ఇట్లు చక్రదత్తయందు స్వేదాధికారప్రకరణము ముగిసెను.



# ౬౮. వమనాధికారము.

వమనవిధులు.

శ్లో. స్నిగ్ధస్విన్నం కఫే సమ్యక్సంయోగే వా కఫోల్బణే, శ్వో వమ్య ముత్క్లిష్టకఫం మత్స్యమాంసతిలాదిభిః. 1. యథావికారం విహితాం మధుసైంధవసంయుతాం, కోష్ఠం విభజ్య భైషజ్యమాత్రాం యుం

త్రాభిమంత్రితాం. 2. బ్రహ్మదక్షాశ్విరుద్రేంద్ర భూచంద్రార్కానిలానలాః, ఋషయః సౌషధిగ్రామా భూతసంఘా స్తు పాంతు తే. 3. రసాయన మివర్షీణాం దేవానా మమృతం యథా, సుధే వో త్తమనాగానాం భైషజ్య మిద మస్తు తే. 4. పూర్వాహ్ణే పాయయే త్పీతో జానుతుల్యాసనే స్థితః, తన్మనా జాతహృల్లాస ప్రసేక శ్ఛర్దయే త్తతః. 5. అంగులీభ్యా మనాయ స్తనాలేన మృదునాథవా, వృషేంద్రయవసింధూత్థ వచాకల్కయుతం పిబేత్. 6.

స్నిగ్ధుండై స్విన్నుడైవానిని కఫమునందుగాని కఫసంయోగమునందుగాని తదాధిక్యమునందుగాని ఒకపటిదినము వాంతి చేయింపవలసినవానిని మత్స్యమాంసక్షీరాదుల చేత రుచి ననుసరించి తేనె సైంధవలవణములు కలసినట్టి భైషజ్యమాత్రను బ్రహ్మదత్తీయను నీమంత్రముతో మంత్రించి ఈయవలయును. పూర్వాహ్ణమునందు త్రాగింపవలయును. మోకాళ్లపైని కూర్చుని వమనమును చేయవలయును. పిప్పళ్లు కొడిసెపాలవేళ్లు వస సైంధవలవణము వీటితో చేర్చి కల్కమును త్రాగవలయును.

పంచకషాయములు.

శ్లో. యష్టికషాయం సక్షౌద్రం తేన సాధు వమ త్యలం. 7. తండులసలిలనిష్పిష్టా యాః పీత్వా సమతి పూర్వాహ్ణే, ఫలినీ వల్కలముష్ణం హరతి గరం పిత్తకఫజం చ. 8. క్షౌద్రలీఢం తామ్రరజో వమనం గరదోషనుత్, ఆటరూషం వచానింబం పటోలం ఫలినీత్వచం, క్వాథయిత్వా పిబే త్తోయం వాంతికృ న్మదనాన్వితం. 9. క్వాథ్య ద్రవ్యస్య కుడవం శ్రాపయిత్వా జలాఢకే, చతుర్భాగావశిష్టం తు వమనే ష్వవచారయేత్. 10. నింబకషాయోపేతాం ఫలినీగదమదనమధుకసింధూత్థాం, మధుయుత మేత ద్వమనం కఫతః పూర్ణాశయే సదా శస్తం. 11. ఫలజీమూతకేక్ష్వాకుకుటజాః కృతవేధనాః, ధామార్గవ శ్చ సంయోజ్యాః సర్వథా వమనే ష్వమీ. 12.

తేనెతో యష్టిమధుకపు కషాయమును త్రాగిన వాంతి యగును. బియ్యపు కడుగులో ప్రేంఖణపుచెక్కను నూరి వెచ్చచేసి సేవించిన పిత్తకఫజమగు విషము నశించును. తేనెతో తామ్రచూర్ణమును కలిపి వాంతిచేసిన విషదోషములు హరించును. అడ్డసరము

వస వేప చేదుపొల్ల ఉష్మెత్త సీటిని కషాయముచేసి త్రాగిన వాంతి కలిగించును. క్వాథములను నౌషధులను 4 పలములను ఒక ఆఢకపునీటిలో కాచి నాలవమిలుగునటులు దింపి వమనముల కుపయోగింపవలయును. ఉష్మెత్త తాడిఫలము చేదుసార కోష్ఠ రోహిషతృణము అన్నివిధములగు వమనములకు నుపయోగింపవలయును.

## వాంతిపరీక్ష.

శ్లో. క్రమాత్కఫః పిత్త మథానిలశ్చ యస్యైతి సమ్యగ్వమితః స ఇష్టః, హృత్పార్శ్వమూర్ధేంద్రియమార్గశుద్ధౌ తనో ర్లఘుత్వేఽపి చ లక్ష్యమాణే. 13. సుచ్ఛర్దితే స్ఫోటకకోఠకండూః వక్త్రావిశుద్ధి ర్గురుగాత్రతా చ, తృణ్మోహమూర్ఛానిలకోపనిద్రా బలాతిహాని ర్వమితేతి విద్యాత్. 14. తతః సాయం ప్రభాతే వా క్షుద్వాన్ స్నేయాదికం భజేత్, పేయాం విలేపీ మకృతం కృతం చ యూషం రసం ద్విస్త్రిర క్షకశ్చ. 15. క్రమేణ సేవేత విశుద్ధకాయః ప్రధాన మధ్యావరశుద్ధి శుద్ధః, జఘన్యమధ్యప్రవరే తు వేగాశ్చత్వార ఇష్టా వమనే షడ ష్టౌ, దశైవ తే ద్విత్రిగుణా విరేకే ప్రస్థ స్తథా ద్విత్రిచతుర్గుణ శ్చ. 16. పిత్తాంతి మిష్టం వమనం విరేకా దర్ధం కఫాంతం చ విరేకమాహుః, ద్విత్రాన్ సవిట్కాన నపనీయ వేగాన్ మేయం విరేకే వమనే తు పీతం. 17.

కఫపిత్తవాతములు గలవానిని వమితుని చేయవచ్చును. హృదయము ప్రక్కలు తల ఇంద్రియమార్గము శుద్ధమగను. దుష్టమననువలన బొబ్బలు కోష్ఠరోగములు మున్నగునవి కలుగును. అత్యంతవమనముచేత మూర్ఛాదులును కలుగును. సాయంకాలమునందుగాని ప్రాతఃకాలమునందుగాని ఆకలి దప్పిగలవాడు పేయను త్రాగవలయును. పేయ విలేపి కృతాకృతమగు యూషము వీటినిత్రాగవలయును. పిత్తము కలుగువఱకును వమన ముత్తమము. కఫపర్యంతము విరేచన ముత్తమము.

## వమనాదులకు మానము.

శ్లో. వమనే చ విరేకే చ తథా శోణితమోక్షణే, సార్ధత్రయోదశపలం ప్రస్థ మాహు ర్మనీషిణః, అయోగే లంఘనం కార్యం పున ర్వాథ విశోధనం. 18. అతివాంతం ఘృతాభ్యక్త మవగా

హ్యా హిమేజలే, ఉపాచరేత్సితాక్షౌద్ర మిశ్రై ర్లేహై శ్చికిత్సకః. 19. వమనే ఽతిప్రవృత్తేతు హృద్యం కార్యం విరేచనం, నవామయే త్తైమిరికం న గుల్మినం నచాపి పాండూదరరోగపీడితం, స్థూలక్షతక్షీణకృశాతివృద్ధా నర్శోర్దితాక్షేపకపీడితాంశ్చ. 20. రూక్షే ప్రమేహే తరుణే చ గర్భే గచ్ఛత్యథోర్ధ్వం రుధిరే చ తీవ్రే, దష్టే చ కోష్ఠే క్రిమిభి ర్మనుష్యం, న వామయే దర్శసి చాతిబద్ధే. 21. ఏతే ఽప్యజీర్ణవ్యధితా వామ్యా యే చ విషాతురాః, అత్యుల్బణకఫాయే చ తే చ స్యు ర్మధుకాంబునా. 22.

వమనము విరేచనము రక్తస్రావము వీటియందు 132పలములు ప్రశస్తములు. యోగము లేనిచో లంఘనముగాని శోధనముగాని చేయవలయును. ఎక్కువగా వమితుండగువానికి నేతితో చల్లనినీటి నియవలయును. చక్కెర తేనె కలిపిన లేహమును వైద్యుండొసంగవలయును. అత్యంతము వమనములు కానిచో విరేచనము నియవలయును. రూక్ష ప్రమేహము తరుణగర్భము తిమిరగుల్మములు పాండూదరరోగములు ఊర్ధ్వగతరక్తము మూలరోగము అజీర్ణవాతము పెచ్చుపెరిగిన మూలరోగము వీట్లయందు వాంతులను చేయింపరాదు.

ఇట్లు చక్రదత్తయందు వమనాధికార ప్రకరణము ముగిసెను.

---

# 20. విరేచనాధికారము.

## విరేచనవిధులు.

శ్లో. స్నిగ్ధస్విన్నాయ వాంతాయ దాతవ్యం తు విరేచనం, అన్యథా యోజితం హ్యేతద్గ్రహణీగదకృన్మతం. 1. మృదుః పిత్తేన కోష్ఠః స్యా త్క్రూరో వాతకఫాశ్రయాత్, మధ్యమః సమదోషత్వా ద్యోజ్యా మాత్రానురూపతః. 2. శర్కరాక్షౌద్రసంయుక్తం త్రివృచ్చూర్ణావచూర్ణితం, రేచనం సుకుమారాణాం త్వక్పత్రమరిచాంశకం. 3. త్రివృచ్చూర్ణం సితాయుక్తం పిబేత్, శ్లేష్మం విరేచనం భిత్త్వా ద్విధేత్యుం పరిలిప్య కల్కైః శ్రీమండిజాతైః పరివేష్ట్య బద్ధ్వా, పక్వం తు సమ్య క్పుటపాకయుక్త్యా, ఖాదే త్తు తం పిత్తగదీ సుశీతం.

4. పిప్పలీనాగరక్షారం శ్యామా త్రివృతయా సహ, లేహాయే న్మధునా సార్ధం కఫవ్యాధౌ విరేచనం. 5. హరీతకీవిడంగాని సైంధవం నాగరం త్రివృత్, మరిచాని చ తత్సర్వం గోమూత్రేణ విరేచనం. 6. త్రివృద్భాగత్రయసమా త్రిఫలా తత్సమాని చ, క్షార కృష్ణా విడంగాని తచ్చూర్ణం మధుసర్పిషా. 7. లిహ్యా ద్గుడేన గుడికాం కృత్వా వా ప్యుపయోజయేత్, కఫవాతకృతా న్గుల్మా న్ప్లీహోదర భగందరాన్. 8. హంత్యన్యా నపి చాప్యేత న్నిరపాయం విరేచనం.

స్నిగ్ధుడును స్విన్నుడును వమితుడునగువానికి విరేచనముల నొప్పింపవలెను. లేనిచో గ్రహణీరోగమును కలిగించును. పిత్తముచేత కోష్ఠము మృదువుగను వాతకఫముల వలన కఠినముగను సమదోషములవలన మధ్యముగనుండును కావున మాత్రానురూపముగా సేవింపవలెను. కండచక్కెర తేనెయును కలిపి త్రివృచ్చూర్ణముచేత నవచూర్ణితముం జేసి లవంగపుపట్ట, తేజపత్రి యిటిని సమభాగములుగా చేర్చి సుకుమారులకు విరేచనమునకీయవలయును. త్రివృచ్చూర్ణమును చక్కెరతో కలిపితినిన విరేచనము శ్రేష్ఠముగానగును. చెఱకును రెండుగా చీల్చి కల్కములతో నవలేపనముం జేసి పుటపాకమువలె చుట్టిచట్రగా కట్టి పక్వముచేసి యెల్లాప్పుడు తినవలయును. పిప్పళ్లు శొంఠి యవక్షారము నల్లతెగడ తెల్లతెగడ తేనె వీటితో కఫరోగికి విరేచనము చేయింపవలయును. కరక్కాయలు వాయువిడంగములు సైంధవలవణము శొంఠి తెల్లతెగడ మిరియములు వీటిని గోమూత్రముతో తీసికొనిన విరేచనములగును. తెల్లతెగడ త్రిఫలములు యవక్షారము పిప్పళ్లు వాయువిడంగములు వీటిని తులము చొ తీసికొని చూర్ణముచేసి తేనెతో తినినను బెల్లముతో మాత్రలగట్టి తినినను కఫవాతపు గుల్మములను ప్లీహోదర రోగములను భగందరమున్నవానిని పోగొట్టును.

## అభయాదిమోదకము.

శ్లో. అభయా పిప్పలీమూలం మరిచం నాగరం తథా, త్వక్పత్రపిప్పలీముస్త విడంగామలకాని చ. 9. కర్షః ప్రత్యేక మేషాం తు దంత్యాః కర్షత్రయం తథా, షట్కర్షాశ్చ సితాయా స్తు ద్విపలం త్రివృతోభవేత్. 10. సర్వాంసు చూర్ణితం కృత్వా మధునా మోదకం కృతం, ఖాదే త్ప్రతిదినం చైకం శీతం చాను పిబే జ్జలం. 11. తావద్విరిచ్యతే జంతుర్యావ దుష్ణం న శీర్యతే, పాండురోగం విషం కాసం

జంఘాపార్శ్వరుజౌ తథా. 12. పృష్ఠార్తిం మూత్రకృచ్ఛ్రం చ దుర్నామసభగందరం, అశ్మరీమేహకుష్ఠాని దాహశోథోదరాణి చ. 13. యక్ష్మాణం చక్షుషోరోగం కష్టం వైద్యేన జానతా, యోజితో ఽయం నిహంత్యాశు అభయాద్యో హి మోదకః. 14. ఏరండతైలం త్రిఫలాక్వాథేన ద్విగుణేన చ, యుక్తం పీత్వా పయోభి ర్వా నచిరేణ విరిచ్యతే. 15.

కరక్కాయలు పిప్పలిమూలము మిరియములు శొంఠి లవంగపుపట్ట తేజపత్రి పిప్పళ్లు తుంగముస్తలు వాయువిడంగములు ఉసిరిక వీటిని కాలుకాలు పలముచొ॥ దంతి ముక్కాలుపలము కలకండ ఒకటిన్నరపలమును తెల్లతెగడ 2 పలములును చూర్ణము చేసి తేనెతో లడ్డులుగాచేసి ప్రతినిత్య మొకటిచొప్పునతిని చన్నీటిని త్రాగిన పాండురోగాదిసమస్తరోగములు నశించును.

విరేచనమైనవానిలక్షణము.

శ్లో. స్రోతోవిశుద్ధీంద్రియసంప్రసాదౌ లఘుత్వ మూర్జోఽగ్నిరనామయత్వం, ప్రాప్తి శ్చ విట్పిత్తకఫానిలానాం సమ్యగ్విరిక్తస్య భవేత్క్రమేణ. 16. స్యాచ్ఛ్లేష్మపిత్తానిలసంప్రకోపః సాద స్తథాగ్నే ర్గురుతా ప్రతిశ్యా, తంద్రా తథా ఛర్ది రరోచకశ్చ వాతానులోమ్యం న చ దుర్విరిక్తే. 17. కఫాస్రపిత్తక్షయజానిలోత్థాః సుప్త్యంగమర్ద క్లమ లేపహాద్యాః, నిద్రాబలాభావ తమఃప్రవేశాః సోన్మాదహిక్కా శ్చ విరేచితేఽతి. 18. మందాగ్ని మక్షీణ మసద్విరిక్తం న పాయయేత్ తద్దివసే యవాగూం, విపర్యయే తద్దివసే తు సాయం పేయాక్రమో వాంతవ దిష్యతే తు. 19. యథాణు రగ్ని స్తృణగోమయాద్యైః సంధుక్ష్యమాణో భవతి క్రమేణ, మహాన్ స్థిరః సర్వసహ స్తథైవ శుద్ధస్య పేయాదిభి రంతరాగ్నిః. 20.

స్రోతోవిశుద్ధియును ఇంద్రియములకు నైర్మల్యమును తేలికతనమును అగ్నిరోగములేకుండుట మలపిత్తకఫములు కలుగుట ఇయ్యవి సమ్యగ్విరిక్తునికి లక్షణములు. కఫపిత్తవాతముల ప్రకోపము మందాగ్ని ఒడలుబరువు తంద్ర ఇయ్యవి దుర్విరేచనమున గలుగును. కఫపిత్త రక్తక్షయ జనితమగు పీడ మున్నగునవి విరేచన మధికమగుటచేత కలుగుచున్నవి. మందాగ్ని కలవారలకు విరిక్తులకు గంజినీయరాదు. తృణాదులసంధు

క్షణమున నగ్నిస్థిరమై మండునట్లే శుద్ధుడగు మనుష్యున కిచ్చిన పేయాదులవలన ఉదరాగ్ని బలిష్ఠమగును.

**పిత్తాదులకు భిన్నములగు విరేచనములు.**

శ్లో. కషాయమధురైః పిత్తే విరేకః కటుకైః కఫే, స్నిగ్ధోష్ణలవణై ర్వాయో రప్రవృత్తే చ పాయయేత్. 21. ఉష్ణాంబు స్వేదయేచ్చాస్య పాణితాపేన చోదరం, ఉత్థానేఽల్పే దినే తస్మిన్భుక్త్వా న్యేద్యుః పునః పిబేత్. 22. అదృఢస్నేహకోష్ఠస్తు పిబేదూర్ధ్వం దశాహతః, భూయోప్యుపస్కృతతనుః స్నేహస్వేదై ర్విరేచనం. 23. యౌగికం సమ్యగాలోచ్య స్మర న్పూర్వ మనుక్రమం, దుర్బలః శోధితః పూర్వ మల్పదోషః కృశో నరః. 24. అపరిజ్ఞాతకోష్ఠస్తు పిబే న్మృద్వల్పమౌషధం, రూక్షబహ్వనిలక్రూరకోష్ఠవ్యాయామసేవినాం 25. దీప్తాగ్నీనాం చ భైషజ్య మవిరేచ్యైవ జీర్యతి, తేభ్యో వస్తిం పురా దద్యాత్తత స్స్నిగ్ధం విరేచనం. 26. అస్నిగ్ధే రేచనం స్నిగ్ధం రూక్షం స్నిగ్ధేతి శస్యతే, విరూక్ష్య స్నేహసాత్మ్యం తు భూయః స్నిగ్ధం విరేచయేత్. 27. పద్మకోశీరనాగాహ్వచందనాని ప్రయోజయేత్, అతియోగే విరేకస్య పానాలేపనసేచనైః. 28. సౌవీరపిష్టామ్రపల్లవాలాభిలేపోఽతిసారహా, అవిరేచ్యాః బాలవృద్ధశ్రాంతభీతనవజ్వరాః 29. అల్పాగ్న్యధోగపిత్తాస్రక్షతపాయ్వతిసారిణః, సశల్యాస్థాపితక్రూరకోష్ఠాతిస్నిగ్ధశోషిణః. 30. గర్భిణీ నవసూతా చ తృష్ణార్తో జీర్ణవానపి.

కషాయ మధురములతో పిత్తమునందును స్నిగ్ధోష్ణలవణములతో వాతమునందును విరేచనమును చేయింపవలయును. అపరిజ్ఞాతకోష్ఠుడగు వాడు మృదువు నల్పమునగు నౌషధమును సేవింపవలయును. అగ్నిదీప్తిగలవానికి విరేచన మక్కఱలేకయే యౌషధము జీర్ణమగును. అట్టివారికి ముందు వస్తులు పిమ్మట విరేచనమును ఈయవలయును. స్నేహములతో విరేచనములచేయవలెను. విరేచనము అధికమైనచో పద్మకము ఉశీరము చందనము వీటిని పానాలేపన సేచనముల నుపయోగింపవలయును. బాలురు వృద్ధులు పరిశ్రమకరులు భీతులు క్రొత్తగా జ్వరము వచ్చినవారలు అల్పాగ్నులు అధోగతములు

పిత్తాస్రములు మున్నగు నవికలవారలు విరేచనములకు తీసికొనరాదు. గర్భిణియును క్రొత్తగా ప్రసవించిన స్త్రీయును అజీర్ణముగా నున్నను విరేచనములకు తీసికొనరాదు.

ఇట్లు చక్రదత్తయందు విరేచనాధికార ప్రకరణము ముగిసెను.

# ౭౧. అనువాసనాధికారము.

## అనువాసనార్హులు.

శ్లో. వాంతోల్బణేషు దోషేషు వాతేవా వస్తి రిష్యతే, యథోచితా త్పాదహీనం భోజయిత్వా నువాసయేత్. 1. నచాభుక్తవతేస్నేహః ప్రణిధేయః కథంచన, సూక్ష్మత్వాచ్ఛూన్యకోష్ఠస్య క్షిప్ర మూర్ధ్వ ముత్పతేత్. 2. షట్పలీచ భవే చ్ఛ్రేష్ఠా మధ్యమా త్రిఫలీ భవేత్, కనీయసా సార్ధపలా త్రిధా మాత్రానువాసనే.3. ప్రాగ్దేయ మాద్యే ద్విపలం పలార్ధవృద్ధి ర్ద్వితీయే పల మక్షవృద్ధిః, కర్షద్వయం వా వసుమాషవృద్ధి ర్యస్తౌ తృతీయే క్రమఏషఉక్తః.4. మాషమాత్రం పలే స్నేహే సింధుజ స్శతాహ్వయోః, సతు సైంధవచూర్ణేన శతాహ్వేన చ సంయుతః. 5. భవే త్సుఖోష్ణ శ్చ తథా నిరేతి సహసాముఖ, విరిక్తశ్చానువాస్య శ్చే త్సప్తరాత్రా త్పరం తదా. 6.

వాతోల్బణదోషములందు గాని వాతమునందు గాని వస్తియుత్తమము. యథోచితములో నాలవపాలు తక్కువగా భోజనముఁజేయించి అనువాసన చేయింపవలయును. భుజింపనివాని కెప్పుడును స్నేహమే ఈయరాదు. లేనిచో శూన్యకోష్ఠము సూక్ష్మమైన దగుటచేత ఊర్ధ్వమునకుప్పతించును. అనువాసనకుషట్పలి యుత్తమమును త్రిఫలి మధ్యమముగను అర్ధపలి అధమమనుగనుండును. తొలుత తొలుతటిది రెండుపలముల నిచ్చి పిమ్మట నర్ధపలము ఎక్కువచేయ వలయును. రెండవదాని పలమునిచ్చి అర్ధపలము పెంచవలయును. మూడవదాని నర్ధపలము నిచ్చి ఎన్మిదిమాషములను పెంచవలయును. ఇయ్యది క్రమము. ఒకపలము స్నేహములో సైంధవలవణము శతావరిమాష మాత్రముచేర్పవలయును. అయ్యదియును సైంధవ చూర్ణములోను శతాహ్వలోనుచేర్చి సుఖోష్ణముగానిచ్చిన సుఖించును. విరిక్తుడు అనువాస్యుడుకాదగునేని ఏడురోజులు దాటిన తర్వాత చేయవలయును.

## వస్తియంత్ర నిర్మాణపరీతులు.

శ్లో. సువర్ణ రూప్య త్రపుతామ్రరీతి కాంస్యాయసాస్థిద్రుమ వేణుదంతైః, నళైర్విషాణై ర్మణిభి శ్చ తై స్తైః కార్యాణి నేత్రాణి సుకర్ణికాని. 7. షడ్ద్వాదశాష్టాంగుళసమ్మితాని షడ్వింశతి ద్వాదశవర్ష జానాం, స్యుర్ముద్గకర్కంధుసతీనవాహి ఛిద్రాణి వర్త్యాపి హితాని చాపి. 8. యథా యవోంగుష్ఠకనిష్ఠికాభ్యాం మూలాగ్రయోః స్యుః పరిణాహవంతి, బుజూని గోపుచ్ఛసమాకృతీని శ్లక్ష్ణాని చ స్యుర్గుడికాముఖాని. 9. స్యాత్కర్ణికైకాగ్రచతుర్థభాగే, మూలాశ్రితే వస్తినిబంధనే ద్వే, జారద్గవో మాహిషహారిణౌ వా, స్యాచ్ఛౌకరో వస్తిరజస్య వాపి. 10. దృఢ స్తనుర్నష్టశిరోవిబంధః, కషాయరక్తః సుమృదుః సుశుద్ధః, నృణాం వయోవీక్ష్య యథానురూపం నేత్రేషు యోజ్యస్తు సుబద్ధసూత్రః.

స్వర్ణముమున్నగువానితో సుందరముగను కర్ణికాయుతముగను నేత్రములను నిర్మింపవలయును. ఇయ్యది 20 వది 12 వర్షముల ప్రాయము వారికి 6, 12, 8 అంగుళ ప్రమాణములుగా నేత్రములను చేయవలయును. పెసలు రేగులు చిరిసెనగలు పట్టతగినంత గవత్తిని చేసిఅచ్చాదన చేయవలయును. అంగుష్ఠోప కనిష్ఠికలయొక్క మూలాగ్రముల కొలతలు గలవియును గోపుచ్ఛపు ఆకారము కలవియునగు గుటికాముఖములుగు కర్ణ్లను చేయవలయును. కర్ణకకొనను చతుర్థభాగములోని మూలాశ్రిత వస్తులను రెండింటిని కట్టవలయును. వృద్ధవృషభపు వస్తిగాని మహిషవస్తిగాని హారిణవస్తిగాని సూకరవస్తిగాని మేకవస్తిగాని చేయవలయును. విబంధములు లేనిదియును కషాయ రక్తమైమృదువై పరిశుద్ధమైన సూత్రముతో కట్టిమనుష్యుల స్థితిని కనిపెట్టి తదనుసారముగా ప్రయోగింపవలయును.

## వస్తివిధిః.

శ్లో. నిరూహమాత్రా ప్రథమే ప్రకుంచో వత్సరే పరం, ప్రకుంచ వృద్ధిః ప్రత్యబ్దం ద్వాదశాష్టాదశస్య తు, ప్రసృతం వర్ధయే దూర్ధ్వం ద్వాదశాష్టాదశస్యతు, ఆసప్తతే రిదం మానందశైవ ప్రసృతాః పరం, యథాయథం నిరూహస్య పాదో మాత్రానువాసనే, కృతచంక్రమణం ముక్తవిణ్మూత్రం శయనే సుఖే. 14. నాత్యుచ్ఛ్రితే నఖోచ్ఛ్రితే సంవి

ష్టం వామపార్శ్వతః, సంకోచ్య దక్షిణం సక్థి ప్రసార్య చ తతోఽపరం. 15. వస్తిం సవ్యే కరే కృత్వా దక్షిణే నావపీడయేత్, తథా స్య నేత్రం ప్రణయే త్స్నిగ్ధే స్నిగ్ధముఖం గుదే. 16. ఉచ్ఛ్వాస్యస్య బస్తే ర్వదనం బద్ధ్వా హస్త మకంపయన్, పృష్ఠవంశం ప్రతి తతో నాతిద్రుతవిలంబితం. 17. నాతివేగం నవా మందం సకృ దేవ ప్రపీడయేత్, సావశేషం ప్రకుర్వీత వాయుః శేషే హి తిష్ఠతి. 18. నిరూహాదానేపి విధిరయమేవ సమీరితః.

తా. సులభము.

శ్లో. దత్తః ప్రణిహితే స్నేహే ఉత్తానో వాక్శతం భవేత్ 19. ప్రసారితైః సర్వగాత్రై స్తథావీర్యం ప్రసర్పతి, ఆకుంచయే చ్ఛనైస్త్రి స్త్రిః సక్థి బాహూ తతః పరం. 20. తాడయే త్తలయో శ్చైనం త్రీం స్త్రీ న్వారా న్ఛనై శ్శనైః, స్ఫిచో శ్చైనం తతః శ్రోణిం శయ్యాం త్రి రుత్క్షిపే చ్ఛనైః. 21. ఏవం ప్రణిహితే వస్తౌ మందాయాసోఽథ మందవాక్, ఆస్తీర్ణే శయనే కామ మాసీతాచారికే రతః. 22. యోజ్యః శీఘ్రం నివృత్తేభ్యః స్నేహో తిష్ఠ న్నకార్యకృత్, సానిలః సపురీష శ్చ స్నేహః ప్రత్యేతి యస్య వై. 23. వినాపీడాం త్రియామస్థః ససమ్యగనువాసితః, క్వాథార్ధమాత్రయా ప్రాతః ధాన్యశుంఠీజలంపిబేత్. 24. పిత్తోత్తరే కదుష్ణాంభ స్తావన్మాత్రం పిబే దను, తేనాస్య దీప్యతే వహ్ని ర్భక్తాకాంక్షా చ జాయతే. 25. అహోరాత్రా దపి స్నేహః ప్రత్యాగచ్ఛ న్న దుష్యతి, కుర్యా ద్వస్తిగుణాం శ్చాపి జీర్ణ స్త్వల్పగుణో భవేత్. 26. యస్య నోపద్రవం కుర్యా త్స్నేహవస్తి రనిస్సృతః, సర్వోల్పో వా వృతో రౌక్ష్యా దుపేక్ష్యః సంవిజానతా. 27. అనాయంతి మహోరాత్రా త్స్నేహం సోపద్రవం హరేత్, స్నేహవ్యాపదనాయాంతే నాన్యః సేకో విధీయతే. 28.

తా. సులభము.

### అశుద్ధియందు నిరూహములు.

శ్లో. అశుద్ధస్య మలోన్మిశ్రః స్నేహో నైతి యదా పునః, తదాంగసదనాధ్మానశూలశ్వాసశ్చ జాయతే. 29. పక్వాశయగురుత్వం చ తత్ర దద్యాన్నిరూహణం, తీక్ష్ణం తీక్ష్ణౌషధైరేవ సిద్ధం చాప్యనువాసనం. 30. స్నేహవస్తిర్విధేయస్తు నావిశుద్ధస్య దేహినః, స్నేహవీర్యం తదాదత్తే స్నేహో నానువిసర్పతి. 31. అశుద్ధమపి వాతేన కేవలేనాభిపీడితం, అహోరాత్రస్య కాలేషు సర్వేష్వేవానువాసయేత్. 32. అనువాసయేత్తృతీయేహ్ని పంచమే వా పునశ్చ తం, యథా వా స్నేహపక్తిః స్యాత్తతోప్యుల్బణమారుతాన్. 33. వ్యాయామనిత్యాన్దీప్తాగ్నీన్రూక్షాంశ్చ ప్రతివాసరం, ఇతి స్నేహైస్త్రిచతురైః స్నిగ్ధస్రోతోవిశుద్ధయే. 34. నిరూహం శోధనం యుంజ్యాదస్నిగ్ధే స్నేహనం తనోః, విష్టబ్ధానిలవిణ్మూత్రైః స్నేహైహీనేఽనువాసనే. 35. దాహజ్వరపిపాసార్తకరశ్చాత్యనువాసనే.

తా. సులభము.

### వస్త్యాదులందలి పరిణామములు.

శ్లో. స్నేహవస్తిం నిరూహం వా నైకమేవాతిశీలయేత్. 36. స్నేహాత్పిత్తకఫోత్క్లేదో నిరూహాత్పవనాద్భయం, అనాస్థాప్యా యేభిధేయా నానువాస్యాశ్చ తే మతాః. 37. విశేషతస్త్వమీ పాండుకామలామేహపీనసాః, నిరన్నప్లీహవిడ్భేదీ గురుకోష్ఠకఫోదరాః. 38. అభిష్యందభృశస్థూలక్రిమికోష్ఠాఢ్యమారుతాః, పీతే విషే గరేఽపచ్యాం శ్లీపదీగలగండవాన్. 39. అనాస్థాప్యాస్త్వతిస్నిగ్ధః క్షతోరస్కో భృశం కృశః, ఆమాతిసారీ వమిమాన్సంశుద్ధో దత్తనావనః. 40. శ్వాసకాసప్రసేకార్శో హిక్కాధ్మానాల్పవహ్నయః, శూనపాయుః కృతాహారో బద్ధచ్ఛిద్రదకోదరీ. 41. కుష్ఠీ చ మధుమేహీ చ మాసాన్సప్త చ గర్భిణీ, న చైకాంతేన నిర్దిష్టేప్యత్రాభినివిశేద్బుధః. 42. భవేత్కదాచిత్కార్యాపి విరుద్ధాపి మతా క్రియా, ఛర్దిహృద్రోగగు

ల్యార్తే వమనం సుచికిత్సితే, అవస్థాంప్రాప్య నిర్దిష్టం కుష్ఠినాం వస్తి కర్మ చ. 44.

ఇట్లు చక్రదత్తయందు అనువాసనాధికారప్రకరణము ముగిసెను.

---

# ౭౨. నిరూహాధికారము.

## నిరూహావిధియును సమయమును.

శ్లో. అనువాస్య స్నిగ్ధతనుం తృతీయేహ్ని నిరూహయేత్, మధ్యాహ్నే కించి దావృత్తే ప్రయుక్తే బలిమంగళే. 1. అభ్యక్తం స్వేదితోత్సృష్ట మలం నాతిబుభుక్షితం, మధుస్నేహనకల్కాఖ్య కషాయావాతపః క్రమాత్ 2. త్రీణి షడ్ద్వే దశ త్రీణి పలా న్యనిలరోగిషు, పిత్తే చత్వారి చత్వారి ద్వే ద్వే పంచ చతుష్టయం. 3. షట్ త్రీణి ద్వే దశ త్రీణి కఫే చాపి నిరూహణం, దత్వాదౌ సైంధవ స్యాక్షం మధునః ప్రసృతిద్వయం. 4. వినిర్మథ్య తతో దద్యా త్స్నేహస్య ప్రసృతద్వయం, ఏకీభూతే తతః స్నేహే కల్కస్య ప్రసృతం క్షిపేత్. 5. సమ్మూర్ఛితం కషాయం తం పంచప్రసృతిసమ్మితం, వితరే తు యథావాప మంతే ద్విప్రసృతోన్మితం. 6. వస్త్రపూతః సుఖోష్ణాంబు కుంభీ బాష్పేణ తాపితః, ఏవం ప్రకల్పితో వస్తి ర్ద్వాదశప్రసృతో భవేత్. 7. నధావ త్యౌషధం పాణిం న తిష్ఠ త్యవలిప్య చ, న సాంద్రో న చ సీమంతం ననిరూహః సుయోజితః. 8.

అనువాసనచేసి స్నిగ్ధశరీరుఁడగు వానికి మూఁడవదినమున నిరూహవస్తినీయవలయును. మధ్యాహ్నకాలమునందు కొంచెము ఆవరణచేసి అంత బలిమంగళాచారాదులను చేసి అభ్యంజనముచేసికొని స్వేదితుఁడై శుద్ధుఁడైయున్న వానిని మిక్కిలి యాఁకలిగొనని వానిని మధువు స్నేహనము కల్కము క్వాథను ఆతపము వీటిని వరుసగా 3-6-2-10 3 పలములనువాతరోగికిని, పిత్తమునందు 4-4-2-2-5-10-4 పలములును 1కఫమునందు 6-3-2-10-3 పలములును నిరూహనస్తిని ఈయవలయును. తొలుత సైంధవలవణము ఒక తులము తేనె 2 పలములు కలిపినూరి, పిమ్మట 4 పలముల తైలమును పోసి ఒకటిగాచేసి 2 పలముల కల్కమును చేయవలయును. 10 పలముల కషాయము విపటు

ములో 4 పలముల ఆసాపమును చేర్చి వడియకట్టి వస్తిచేసి ప్రయోగించిన నిరూహము గును.

## నిరూహము చేయురీతులు.

శ్లో. పూర్వోక్తేన విధానేన గుదవస్తిం నిధాపయేత్, త్రింశ న్మాత్రాస్థితో బస్తి స్తత స్తూత్కటకో భవేత్. 9. జానుమండల మావే ష్ట్య దత్తం దక్షిణపాణినా, కుష్ఠనేత్రచ్ఛటాశబ్దశతం త్క్షేపదవేగవా న్. 10. ద్వితీయం వా తృతీయం వా చతుర్థం వా యథార్థతః, సమ్య జ్నిరూహలింగేతు ప్రాప్తే వస్తిం నివారయేత్. 11. ప్రసృష్టవిణ్మూత్రస మీరణత్వం రుచ్యగ్నివృద్ధ్యాశయలాఘవాని, రోగోపశాంతిః ప్రకృతి స్థతా చ బలం చ తత్స్యా త్సునిరూఢలింగమ్. 12. అయోగ శ్చా తియోగశ్చ నిరూహ శ్చ విరిక్తవత్, స్నిగ్ధోష్ణ ఏకః పవనే సమాంసో ద్వ్యాస్వాదుశీతో పయసా చ పిత్తే, త్రయస్సమూత్రాకటుకోష్ణరూక్షాః. కఫే నిరూహా నపరం విధేయాః, ఏకోపకర్ష త్యనిలం స్వమార్గాత్ పిత్తం ద్వితీయ స్తు కఫం తృతీయః. 13.

పూర్వోక్తవిధానమున గుదయం దుంచవలయును. జానుమండలమును చుట్టికొని దక్షిణహస్తముతో నీయవలయును. నిరూహప్రయోగప్రతియోగములు విరేచనమునకు వలెనే ఎఱుంగునది. వాతమునందు సమాంశము గలిగి స్నిగ్ధరూపమగు ది యొకనిరూ హము. పిత్తమునందు స్వాదువును శీతలమునగు పాలతో రెండవనిరూహము. కఫమునందు గోమూత్రముతో వెచ్చజేసి ఇచ్చిన నది మూడవనిరూహము. ఈమూటికంటెను ఇకను నిరూహ మేదియును లేదు.

## నిరూహచేయలేని వారికి ఉపాయములు.

శ్లో. ఆయామాంతం ముహూర్తాంతం నిరూహం శోధనై ర్హ రేత్, నిరూహై రేవ మతిమాన్ క్షారమూత్రామ్లసంయుతైః. 14. వి గుణానిలవిష్టబ్ధ శ్చిరం తిష్ఠ న్నిరూహణః, శూలారతిజ్వరాటోపా న్మర ణం వా ప్రయచ్ఛతి. 15. నతు భుక్తవతే దేయ మాస్థాపన మితి స్థితిః, ఆమం తద్ధి హరే ద్భుక్తం ఛర్దిదోషాం శ్చ కోపయేత్. 16. ఆవస్థికః క్రమః చాపి మత్వా కార్యో నిరూహణే, అతిప్రపీడితో వస్తి రతిక్ర మ్యాశయం తతః. 17. వాతేరితో నాసికాభ్యాం ముఖతో వా ప్రప

ద్యతే, ఛర్దిహృల్లాసమూర్ఛాదీ న్స్రకుర్యా ద్దాహ మేవ చ. 18. తత్ర చూర్ణం గలాపీడం కుర్యా చ్ఛా హ్యవధూననం, శిరఃకాయవిరేకౌ చ తీక్ష్ణౌ సేకాం శ్చ శీతలాన్. 19. సునిరూఢ మథోష్ణాంబు స్నాతం భుక్త రసౌదనం, యథోక్తేన విధానేన యోజయే త్స్నేహబస్తినా. 20. తద హ స్తస్య పవనా ద్భయం బలవ దిష్యతే, రసౌదన స్తేనశ స్త స్తదహ శ్చానువాసనం. 21.

యామము వఱకుగాని ముహూర్తము వఱకుగాని నిరూహమును శోధనలతో పోగొట్టవలయును. దుష్టవాయువు చేత స్తబ్ధమై చాలసేపటి వఱకున్న నిరూహము శూలగ్లాని జ్వరాదులను పుట్టించును. భుజించిన వానికి ఆస్థాపనను ఈయరాదు. అభుక్త పదార్థము అమును అనుసరించి ఛర్దిదోషములను జేయును. నిరూహమునందు ఆవశ్యక క్రియమునుగూడ యోచించి చేయవలయును. అతిపరిపీడితవాగువ స్తిఆశయమును దాటి వాత ప్రేరితమై నాసికద్వారాగాని ముఖద్వారాగాని బయలువెడలును. ఛర్దమున్నగు వాటిని ప్రకోపింపజేయును. శీఘ్రముగా గలాపీడమును పుట్టించును. నాడీవిరేచనములను శరీరమునను విరేచనములును చల్లనిసేకములును ఇందు చేయదగును. చక్కగా నిరూహముచేసినవారిని వేడినీళ్ళతో స్నానముజేయించి భుజింపజేసి యథోక్తవిధిని స్నేహవస్తిని ప్రయోగింపవలయును. ఆపూట గాలితో తిరుగరాదు. కావున రసౌదనమును అనువాసనయును నిందు ప్రశస్తములు.

### అర్ధమాత్రక నిరూహము

శ్లో. దశమూలీకషాయేణ శతాహ్వాక్షం ప్రయోజయేత్, సైంధవాక్షం చ మధునోః ద్విపలం ద్విపలం తథా. 22. తైలస్య పల మేకం తు పలస్యైకత్ర యోజయేత్, అర్ధమాత్రికసంజ్ఞోయం వస్తి ర్దేయో నిరూహవత్. 23. నచ స్వేదో నచ స్నేహః పరిహారవిధి ర్నచ, అత్రే యానుమతో హ్యేష సర్వరోగనివారణః. 24. యక్ష్మఘ్న శ్చ క్రిమిఘ్న శ్చ శూలఘ్న శ్చ విశేషతః, శుక్రసంజననో హ్యేష వాతశోణిత నాశనః, బలవర్ణకరో వృష్యో వస్తిః పుంసువనః పరః. 25.

దశమూల క్వాథముతో సోంపునుగాని శతావరికల్కమును 1 తులముగాని ప్రయోగింపవలయును. సైంధవలవణము తులము తేనె 2 పలములు తైలము రెండు పలములు ఇయ్యది అర్ధమాత్రకసంజ్ఞము. దీనిని గూడ నిరూహమువలెనే వస్తినిచేయ వల

యును. స్నేహముగాని స్వేదముగాని అపథ్యముగాని ఏదియును లేదు. ఇయ్యది ఆత్రేయమతముచేత ననుమతింపబడినది. క్షయ మున్నగు సమస్త రోగములను పోగొట్టును. శుక్రమును కలిగించును. వాతశోణితములను పోగొట్టును. బలమును కాంతి నిచ్చును.

## క్షారవస్తులు.

శ్లో. స్నేహం గుడం మాంసరసం పయ శ్చ అమ్లాని మూత్రం మధుసైంధవే చ, ఏతా న్యనుక్తాని చ దాపయే చ్చ నిరూహయోగే మదనా త్ఫలం చ. 26. లవణం కార్షికం దద్యా త్ఫల మేకం తు మాదనం, వాతే గుడః సితా పిత్తే కఫే సిద్ధార్థకాదయః. 27. సైంధవాక్షం సమాదాయ శతాహ్వాక్షం తథైవ చ, గోమూత్రస్య పలా న్యష్టౌ వస్తికాయాః పలద్వయం. 28. గుడస్య ద్వే పలే చైవ సర్వమాలోడ్య యత్నతః, వస్త్రపూతం సుఖోష్ణం చ వస్తిం దద్యా ద్విచక్షణః. 29. శూలం విట్సంగ మానాహం మూత్రకృచ్ఛ్రం చ దారుణం, క్రిమ్యుదావర్తగుల్మాదీ న్సద్యో హన్యా న్నిషేవితః. 30. పలశుక్తి కర్షకుడవై రమ్లిగుడసింధు జన్మగోమూత్రైః, తైలయుతో యం వస్తిః శూలానాహామవాతహరః. 31.

స్నేహము బెల్లము మాంసరసము పాలు అమ్లపదార్థములు గోమూత్రము సైంధవలవణము ఉమ్మెత్తకాయ వీటిని చెప్పకున్నను నిరూహములో చేర్పవలయును. ఉప్పు ఒక కర్షము ఉమ్మెత్త ఒక పలమును చేర్పవలయును. వాతమునందు బెల్లము కఫమునందు ఆవాలు మున్నగు నవి పిత్తమునందు చక్కెర చేర్పవలయును. సైంధవలవణము పిల్లపిచ్చర ఒక్కొక్కతులమును గోమూత్రము 8 పలములును శంఖరలవణము 2 పలములు బెల్లము 2 పలములు కలిపి ఆలోడనచేసి వడియగట్టి నులివెచ్చని వస్తిని చేసి ఈయవలయును. ఇయ్యది శూల మలబద్ధకము మున్నగువానిని పోగొట్టును.

## వైతరణ వస్త్యాదులు.

శ్లో. వైతరణః క్షారవస్తి ర్యుక్తే చాపి ప్రదీయతే, బద రైరావతీ శేలుశాల్మలీ ధన్వనాంకురాః. 32. క్షీరసిద్ధాః సుసిద్ధా స్స్యుః సాస్రాః పిచ్ఛిలసంగతాః, వారాహమాహిషౌరభ్రై ర్బైడాలై ణేయ కౌక్కుటం. 33. సద్యస్క మసృ గాజం వా దేయం పిచ్ఛిలవస్తిషు, చరకాదౌ సముద్దిష్టా వస్తయో యే సహస్రశః. 34. వ్యవహారో న తైః ప్రా

యో నిబద్ధా నాత్ర తేన తే, వస్తి ర్వయఃస్థాపయితా సుఖాయు ర్బలాగ్ని మేధాస్వరవర్ణకృ చ్చ, సర్వార్థకారీ శిశువృద్ధయూనాం నిర త్యయః సర్వగదాపహా శ్చ. 35.

వైతరణము క్షారవస్తియును భుజించిన వానికిసీయఁబడుచున్నది. ఉగుపటపత్రి పాషాణ భేదము బూరుగు ధన్వ వీటిని పాలతో సిద్ధిచేసిన పిచ్ఛిలమగు వస్తి యగు చున్నది. పందులందున్నలు గొఱ్ఱెలు పిల్లులుమృగములు కోళ్లుమేకలు వీటి యొక్క అప్పుడు స్రవించిన రక్తమును పిచ్ఛిలవస్తు లందీయవలయును. చరకా దులలో వేలకొలది చెప్పఁబడిన వస్తువులు వీటికంటె నెక్కుడుగా వ్యవహరింప బడు చుండుటలేదు. కావున అయ్యవి అన్నియు నిచ్చట చెప్పలేదు, ఇది వస్తి వయోవస్థను నిలుపును. సుఖపూర్వకముగా నాయుష్యమును వృద్ధిసేయును. బలము జాఠరాగ్ని బుద్ధి మున్నగువాని నభివృద్ధి సేయును. పిల్లలు పెద్దలు యువకులు మున్నగు నందఱకును ఉప యోగించును. ఇయ్యది సమస్తరోగములను పోగొట్టునదియు గూడనైయున్నయది.

ఇట్లు చక్రదత్తయందు నిరూహాధికారము ముగిసెను.

---

# 23. నస్యాధికారము.

## నస్యవిధిప్రకారములు.

శ్లో. ప్రతిమ ర్శోవపీడ శ్చ నస్యం ప్రధమనం తథా, శిరోవిరే చనం చేతి నస్య కర్మ చ పంచధా. 1. ఊర్ధ్వజత్రువికారేషు విశేషా న్నస్య మిష్యతే, నస్తో నిషిక్తం తం విద్యా త్ప్రతిమర్శం ప్రమాణతః. 2. ప్రతిమర్శ స్తు నస్యార్థం కరోతి నచ దోషవాన్, నస్తః స్నేహాంగులిం దద్యా త్ప్రాత ర్నిశి చ సర్వదా. 3. నచే చ్ఛింఘే దరోగాణాం ప్రతిమర్శః సదాఢ్యకృత్, నిశాహ ర్భుక్తవంతో హః స్వప్నాధ్వశ్రమరేతసాం. 4. శిరోభ్యంజనగండూష ప్రస్రావాంజన వర్చ సాం, దంతకాష్ఠస్య హాస్యస్య యోజ్యోంతే సౌ ద్విబిందుకః. 5 శోధ నః స్తంభన శ్చ స్యా దవపీడో ద్విధా మతః, అవపీడ్య దీయతే యస్మా దవపీడ స్తత స్తు సః. 6. స్నేహార్థం శూన్య శిరసాం గ్రీవాస్కంధోర సాం తథా, బలార్థం దీయతే స్నేహో నస్తః శబ్దోత్ర వర్తతే. 7. నస్యస్య స్నైహికస్యాథ దేయా స్త్వష్టౌ తు బిందవః, ప్రత్యేకశో న స్తకయో ర్నృణా మితి వినిశ్చయః. 8.

ప్రతిమర్శము అవపీడము నస్యము ప్రధమనము శిరోవిరేచనము అని నస్యకర్మ అయిదువిధములు. కొంచెము పీల్చుటచేత నెంతచమురు ముఖములోనికి వచ్చునో అంత నాసికలో పోయఁదగినది. ఇది ప్రతిమర్శమనఁబడును. ఇయ్యది నస్యముకొఱకై చేయబడుచున్నది. దోషమేదియునిందులేదు. ప్రతిమర్శము దార్ఢ్యమునుకలిగించును. రాత్రి దినభోజనమును చేయువాడును, పగలు నిద్రబోయెడువాడు దాగినడచువాడును, శిరో ఖ్యంజనగండూషాదులుగల వారలును, పండ్లుతోమికొనిన పిమ్మట రెండుబిందువులు దీనిని నస్యముచేసికొనవలయును. శోధన స్తంభనములని అవపీడ రెండుతెఱఁగులు. అవపీడితము చేసి ఈయఁబడును గనుక అవపీడితమైనది. శిరము లేనివారికి స్నేహార్థము, కంఠము లోమ్మును లేనివారలకు బలార్థమును స్నేహము ఈయఁబడుచున్నది.

నస్యప్రమాణాదులు.

శ్లో. శుక్తిశ్చ పాణిశుక్తిశ్చ మాత్రాస్తిస్రః ప్రకీర్తితాః, ద్వాత్రింశద్బిందవశ్చాత్ర శుక్తిరిత్యభిధీయతే. 9. ద్వే శుక్తీ పాణిశుక్తిశ్చ దేయాత్ర కుశలైర్నరైః; తైలం కఫే చ వాతే చ కేవలే పవనే వసాం. 10. దద్యాన్నస్తః సదా పిత్తే సర్పిర్మజ్జాసమారుతే. ధ్మాపనం రేచనశ్చూర్ణో యుంజ్యాత్తం ముఖవాయునా. 11. షడంగులద్విముఖయానాడ్యా భేషజగర్భయా, సహి భూరితరం దోషం చూర్ణత్వాదపకర్షతి. 12.

శుక్తి పాణిశుక్తియని మూడుమాత్రలు, 32 బిందువులది శుక్తి రెండుశుక్తులైన పాణిశుక్తియగును. కఫవాతములను తైలమును కేవలవాతమునకు వసను పిత్తమునకు ఘృతమును ప్రశస్తములు.

శిరోవిరేచనములు.

శ్లో. శిరోవిరేచనద్రవ్యైః స్నేహైర్వాతైః ప్రసాధితైః, శిరోవిరేచనం దద్యాద్రోగేష్వేతేషు బుద్ధిమాన్. 13. గౌరవే శిరసః శూలే. జాడ్యే స్యందే గళామయే, శోషగండక్రిమిగ్రంధి కుష్ఠాపస్మారపీనసే,. స్నిగ్ధస్విన్నోత్తమాంగస్య ప్రాక్కృతావశ్యకస్య చ, నివాతశయనస్థాస్య జత్రూర్ధ్వం స్వేదయేత్పునః. 15. అథోత్తానార్జుదేహస్య పాణిపాదే ప్రసారితే, కించిదున్నతపాదస్య కించిన్మూర్ధని నామితే. 16. నాసాపుటం పిధాయైకం పర్యాయేణ నిషేచయేత్, ఉష్ణాంబుతప్తం భైషజ్యం ప్రణాడ్యా పిచునా తథా. 17. దత్తే పాదతలస్కంధ

థహస్త కర్ణాది మర్దయేత్, శనై రుచ్ఛింఘ్య నిష్ఠీవే త్పార్శ్వయో రుభయో స్తతః. 18. ఆభేషజక్షయా దేవం ద్విస్త్రి ర్వా నస్య మాచరేత్, స్నేహం విరేచన స్యాంతే దద్యా ద్దోషాద్యపేక్షయా. 19.

శిరోవిరేచన ద్రవ్యములతోను స్నేహములతోను శిరోవిరోచనములకిప్పించవలయును. శిరోభారము శూలమున్నగునవి దీననశించును. ఉత్తానమగు నగముశరీరము గల వానికి పాణిపాదములు స్వేదము నొందింపవలయును. ముక్కురంధ్రము నొకదానిని మూసి రెండవదానిలో వేడినీళ్లతో కలిపినమందును పోయవలయును. పిమ్మట కాళ్లు స్కంధను చేతులును మర్ధింపవలయును. ఇట్లు ఔషధిఅయిపోవునంత వఱకు 2-3 సార్లుచేసి విరేచనము అయినపిమ్మట దోషాద్యపేక్షచేత స్నేహమును తీసికొనవలయును.

### నస్యవిధియందు కాలపరిమాణము.

శ్లో. త్ర్యహా త్త్ర్యహా చ్చ సప్తాహం స్నేహకర్మ సమాచరేత్, ఏకాహాంతరితం కుర్యా ద్రేచనం శిరస స్తథా. 20. సమ్యక్స్నిగ్ధే సుఖోచ్ఛ్వాస స్వప్నబోధాక్షిపాటవం, రూక్షేక్షి స్తబ్ధతాశోషో నాసాస్యే మూర్ధశూన్యతా. 21. స్నిగ్ధేతికండూ గురుతా ప్రసేకారుచిపీనసాః, సువిరక్తే ఽక్షిలఘుతా వక్త్రస్వరవిశుద్ధయః. 22. దుర్విరిక్తే గదోద్రేకః క్షామతాతివిరేచితే, తోయమద్య గరస్నేహపీతానాం పాతు మిచ్ఛతాం. 23. భుక్తభక్త శిరఃస్నాత స్నాతుకామస్రుతాసృజాం, నవపీనసరోగార్తసూతికాశ్వాసకాసినాం. 24. శుద్ధానాం దత్తవస్తీనాం తథాచార్తవ దుర్దినే, అన్యత్రాత్యయిక వ్యాధౌ నైషాం నస్యం ప్రయోజయేత్. 25. న నస్య మూనసప్తాద్వే నాతీతాశీతి వత్సరే, నచోనద్వాదశే ధూమః కవలో నోనపంచమే. 26. నశుద్ధి రూనదశమే నచాతిక్రాంత సప్తతౌ, ఆజన్మమరణం శస్తః ప్రతిమర్శస్తు వస్తివత్. 27.

మూడేసిరోజులకుగాని ఏడురోజులకుగాని స్నేహకర్మము చేయవలెను. దినము మాఱ్చిదినము శిరోరేచనము చేయవలయును. చక్కగా విరేచనమైనందునకు కనులు తేలికయిచ్చుట వక్త్రస్వరము శుద్ధముగా మాఱుట చిహ్నములు, దుర్విరక్తమునందు గదోద్రేకాదులు చిహ్నములు. ఏడేండ్లకుముందును ఎనుబది సంవత్సరములకు పైనను నస్యమును చేయరాదు. పండ్రెండు సంవత్సరములకు లోపుగను ధూమమును చేయరా

దు. పదిసంవత్సరములలోపునను డెబ్బది సంవత్సరములు దాటినను శోధనచేయరాదు. ఆజన్మమరయును ప్రతిమర్శము వస్తివలెనే శ్రేష్ఠమైనది.

ఇట్లు చక్రదత్తయందు నస్యాధికారప్రకరణము ముగిసెను.



# ౭౪. ధూమాధికారము.

ధూమార్హులు, తదుపాయములు.

శ్లో. ప్రయోగికః స్నైహికశ్చ ధూమో వైరేచన స్తథా, కాసహారో వామనశ్చ ధూమః పంచవిధో మతః. 1. ఋజుత్రికోశ ఫలితం కోలాస్థ్యగ్రప్రమాణిత, వస్తినేత్రసమద్రవ్యం ధూమనేత్రం ప్రశస్యతే. 2. సార్ధత్ర్యంశయుతః పూర్ణో హస్తః ప్రాయోగికాదిషు, నేత్రే కాసహారే త్ర్యంశహీనః శేషే దశాంగులః. 3 ఔషధై ర్వర్తికాం కృత్వా శరగర్భావిశోషితాం, విగర్భా మగ్నిసంప్లుష్టాం కృత్వా ధూమం పిబేన్నరః. 4 వక్త్రేణైవ వమే ద్ధూమం నస్య వక్త్రేణ వా పిబన్, ఉరః కంఠగతే దోషే వక్త్రేణ ధూమ మాపిబేత్. 5. నాసయా తు పిబే ద్దోషే శిరోఘ్రాణాక్షిసంశ్రయే, గంధై రకుష్ఠతగరై ర్వర్తిః ప్రాయోగికే మతా. 6. స్నైహికే తు మధూచ్ఛిష్టస్నేహగుగ్గులుసర్జకైః, శిరోవిరేచనద్రవ్యై ర్వర్తి ర్వైరేచనే మతా. 7. కాసఘ్నై రేవ కాసఘ్నీ వామనై ర్వామనీ మతా, యోజ్యాని పిత్తరక్తార్తి విరిక్తోదరమేహిషు. 8. తిమిరోర్ధ్వానిలాధ్మాన రోహిణీదత్తవస్తిషు, మత్స్య మద్య దధిక్షీర క్షౌద్రస్నేహవిషాశిషు. 9. శిర స్యభిహతే పాండురోగే జాగరితే నిశి, రక్తపిత్తాంధ్యబాధిర్య తృణ్మూర్ఛామదమోహకృత్. 10. ధూమోఽకాలేఽతిపీతో వా తత్ర శీతో విధి ర్హితః, ఏతద్ధూమవిధానం తు లేశతః సంప్రకాశితం. 11.

ప్రాయోగికము స్నైహికము ధూమము వైరేచనము వామనము నని ధూమము లయిదు విధములు. కోమలమగు త్రికోషఫల మంతయుండి రేగుగింజంత ప్రమాణముతో వస్తినేత్రముతో సమానమగు ధూమముపలన నేత్రములు శ్రేష్ఠములగును. ప్రాయోగికాదులలో ముప్పదిన్నర అంశలుగలిగి పూర్ణమైన హస్తపు ప్రమాణమును సహస్థా

రమగు నేత్రరోగమునందు త్ర్యంశహీనమగు దశాంగుళమును ఓషధులతో వత్తిని చేసి నిప్పులోనంటించి ఆ పొగను నోటినుండి పీల్చుకుక్క గుండావదలి పెట్టవలయును. ఊపిరితిత్తుకలలో గలసమస్తరోగములకు ధూమమును త్రాగవలయును. ప్రాయోగిక ధూమమునందు తగరము కోష్ఠులేకుండను స్నైహికమున తేనెనైనను స్నేహము గుగ్గులము సర్జకములతోను వైరోచనమునందు శిరోవిరేచనద్రవ్యములతోను వత్తిని చేయవలయును. పిత్తరక్తాదులందు దీని నుపయోగింపరాదు. తిమిరములు మున్నగువానియందు నుపయోగింపవలయును. ఇది ధూమవిధానము. శేషము గా ప్రకాశము చేయబడినది.

ఇట్లు చక్రదత్తయందు ధూమాధికారప్రకరణము ముగిసెను.

## ౭౫. కవలగండూషాధికారము.

### కవలగండూషధారణార్థాలు.

శ్లో. స్నిగ్ధోష్ణైః స్నైహికో వాతే స్వాదుశీతైః ప్రసాదనః, పిత్తే కట్వమ్లలవణైః రూక్షైః సంశోధనః కఫే. 1. కషాయస్వాదతిక్తైశ్చ కవలో రోపణో వ్రణే, సుఖం సంచార్యతే యాతు సా మాత్రా కవలే హితా. 2. అసంచార్యాతు యా మాత్రా గండూషే సా ప్రకీర్తితా, తావచ్చ ధారణీయోఽయం యావద్దోషప్రవర్తనం. 3. పునశ్చాన్యోఽపి దాతవ్యస్తథా క్షౌద్రఘృతాదిభిః, వ్యాధేరపచయస్తుష్టిర్వైశద్యం వక్త్రలాఘవం. 4. ఇంద్రియాణాం ప్రసాదశ్చ కవలే శుద్ధిలక్షణం, దాహతృష్ణాప్రశమాన్ హన్తి మధుగండూషధారణం. 5. ధాన్యామ్ల మాస్యవైరస్య మలదౌర్గంధ్యనాశనం, తదీషల్లవణం శీతం ముఖశోషహరం పరం. 6. ఆశు క్షారాంబుగండూషో భినత్తి శ్లేష్మణశ్చయం, సుస్థే హితం వాతహరం తైలగండూషధారణం. 7.

వాతమునందు స్నిగ్ధములు ఉష్ణములు నగువానితో, స్నైహికము పిత్తము స్వాదువులును శీతలములగు వానితో ప్రసాదనములును, కఫమునందు రూక్షములగు ఆమ్లలవణములతోను సంశోధనమును చేయింపవలయును. కషాయస్వాదుతిక్తములతో కబళమును చేసి ధరింపవలయును. సుఖసంచారముగల మాత్ర హితకరము. సంచారములేనిదే గండూషము నందు ధరింపవలెను. దోషము లుండునంతవఱకు మాత్రమే దీనినుపయోగింపవలయును. పిమ్మట తేనె నెయ్యి మున్నగువానితో నింకొకదానిని చేయవలయును.

ఇంద్రియములు శాంతముగా నుండుటయే కబలగ్రహమునందు శుద్ధియని యెఱుగునది. దాహము తృష్ణ వ్రణము ను మున్నగునవి శమించును. ధాన్యామ్లము నోటిదుర్వాసన అరుచిని పోగొట్టును. అందుకొఱకుచెము ఉప్పువైచి చల్లార్చి సేవించిన ముఖశోషలను పోగొట్టును. క్షారామ్ల గండూషము తత్క్షణమే శ్లేష్మములను పోగొట్టును. వాతమును హరించును స్వస్థత గలిగించును.

ఇట్లు చక్రదత్తయందు కవలగండూషాధికార ప్రకరణము ముగిసెను.



# ఆశ్చ్యోతనాంజనతర్పణపుటపాకాధికారము

## నేత్రరోగములకు ఆశ్చ్యోతనము.

శ్లో. సర్వేషా మక్షిరోగాణా మాదా వాశ్చ్యోతనం హితం, రుక్తోద కండూఘర్షాస్రు ద్దాహరాగని బర్హణం. 1. ఉష్ణం వాతే కఫేచోష్ణం తచ్ఛీతం రక్తపిత్తయోః, నివాతస్థస్య వామేన పాణినోన్మీల్య లోచనం. 2. శుక్తౌ ప్రలంబ యాన్యేన పిచువర్త్యా కనీనకే, దశ ద్వాదశ వా భిందూన్ ద్వ్యంగులా దవసేచయేత్. 3 తతః ప్రమృజ్య మృదునా చేలేన కఫవాతయోః, అన్యేన కోష్ణపానీయప్లుతేన స్వేదయే న్మృదు. 4. అత్యుష్ణతీక్ష్ణం రుగ్రాగదృఙ్నాశాయాక్షిసేచనం, అతిశీతం తు కురుతే నిస్తోదస్తంభ వేదనాః. 5. కషాయవర్త్మతాం ఘర్షం కృచ్ఛ్రోన్మీలనం మేహానం బహు, వికారవృద్ధి మత్యల్పం సంరంభ మపరిస్రుతం. 6.

అన్నివిధములగు నేత్రరోగములయందును తొలుత నాశ్చ్యోతనుచేయుట మంచిది. రక్తము ఉదకము జిలకన్నీళ్లుగారుట మంట ఎఱ్ఱబడుటయును పోగొట్టును. వాతమునందు ఉష్ణముగను కఫమునందు నుష్ణముగను రక్తపిత్తములందు చల్లగను ఈయవలయును. గాలిలేనిచోట, ఎడమచేతితో కంటిని తెఱచి కనుగ్రుడ్డునందు పడవగు పిచువర్తిచేత పది పండ్రెండు బిందువులను వేయవలయును. పిమ్మట మెత్తనిగుడ్డతో తుడిచి వెచ్చని నీటితో కాచి చెమ్మటను పుట్టింపవలయును.

## నేత్రమలమున కంజనములు.

శ్లో. అథాంజనం శుద్ధతనో ర్నేత్రమాత్రాశ్రయే మలే, పక్వాలింగేల్పశోథార్తి కండూపైచ్ఛిల్య లక్షితే. 7. మందఘర్షాస్రురాగేక్షి ప్రయోజ్యం ఘనదూషికే, లేఖనం రోపణం దృష్టిప్రసాదన మితి త్రిధా. 8.

అంజనం లేఖనం తత్ర కషాయామ్లపటూషణైః, రోపణం తిక్తకైర్ద్రవ్యైః స్వాదుశీతైః ప్రసాదనం. 9. దశాంగులా తనుర్మధ్యే శలాకా ముకులాననా, ప్రశస్తా లేఖనే తామ్రీ రోపణే కాలలోహజా. 10. అంగులీ చ సువర్ణోత్థా రూపజా చ ప్రసాదనే, పిండో రసక్రియా చూర్ణం త్రిధైవాంజనకల్పనా. 11. గురౌ మధ్యలఘౌ దోషే తాం క్రమేణ ప్రయోజయేత్, అథానూన్మీలయన్ దృష్టిం అంతఃసంచారయేచ్ఛనైః. 12. అంజితే వర్త్మనీ కించిచ్చాలయేచ్చైవమంజనం, అపేతౌషధసంబంధం నిర్వృతం నయనం యదా. 13. వ్యాధిదోషం తు యోగ్యాభిరద్భిః ప్రక్షాలయేత్తదా, దక్షిణాంగుష్ఠకేనాక్షి తతో వాముం సవాససా. 14. ఊర్ధ్వవర్త్మని సంగృహ్య శోధ్యం వామేన చేతరత్, నిశి స్వప్నే న మధ్యాహ్నే పానాన్నోష్ణగభస్తిభిః. 15. అక్షిరోగాయ దోషాస్స్యుర్వర్ధితోత్పీడితద్రుతాః, ప్రాతస్సాయం చ తచ్ఛాంత్యై వ్యభ్రే కేఽతోఽంజయేత్సదా. 16. కండూజాడ్యేఽంజనం తీక్ష్ణం ధూమం వా యోజయేత్పునః, తీక్ష్ణాంబునాభితప్తే తు చూర్ణం ప్రత్యంజనం హితం. 17.

పరిశుద్ధశరీరుని నేత్రములో మలముండినచో పక్వలక్షణము కొలదిగ వాపు దురద నీరుగారుట యున్నను అంజనమును వేయవలయును. లేఖనమని రోపణమని దృష్టిప్రసాదమని అంజనము మూడువిధములు. వీటిలో కషాయములు ఆమ్లములు మున్నగు వానివలన గీచుట లేఖనమనఁబడును. కటువులగు నౌషధులతో చేయునది రోపణము. ప్రసాదనము నిచ్చునది అంజనమనఁబడును. పదియంగుళములు పొడవుగలిగి నడుముసన్నగిలి ముకుళించిన అగ్రము గలరాగికడ్డీ లేఖనమునకు శ్రేష్ఠము. రోపణమునకు ఇట్టిదే ఉక్కుది శ్రేష్ఠము. ఒక అంగుళముండిన బంగారుది ప్రసాదనమునకు శ్రేష్ఠము. దోషము ఎక్కువగను లఘువుగనున్న దీనిని ప్రయోగింపవలసినది. నేత్రములను తెఱవక యేలో పల త్రిప్పవలయును. పిమ్మట కన్నులను తెఱచి కుడిబొటన వ్రేలితో ఱెప్పను పైదాని నెత్తిపెట్టి ఎడమవ్రేలితో శోధింపవలయును. రాత్రులు నిదురించుటలోను మధ్యాహ్నమున అన్నపానములు ఉష్ణకిరణములు వీటితోను అక్షిరోగమునకు వలయు దోషములు హెచ్చుగును కనుకను ఈబాధతొలగుటకై ప్రొద్దుటను సంజవేళను అంజనమును వేసికొనవలయును. దురద మున్నగు రోగములన్నియు నశించును.

### తర్పణము.

శ్లో. నాంజయే ద్భీత వమిత విరిక్తాసిత వేగితే, క్రుద్ధజ్వరిత భ్రాంతార్తే శిరోరుక్ శోషజాగరే. 18. అదృష్టేఽర్కే శిరఃస్నాతే పీతయో ర్ధూమమద్యయోః, అజీర్ణే ప్యర్కసంతప్తే దివాస్వప్నే పిపాసితే. 19. నిర్వాతే తర్పణం యోజ్యం శుద్ధయో ర్మూర్ధకాయయోః, కాలే సాధారణే ప్రాతః సాయం వోత్తానశాయినః. 20. యవమాషమయీం పాలీం నేత్రకోశా ద్బహిః సమాం, ద్వ్యంగులోచ్చాం దృఢాం కృత్వా యథాస్వం సిద్ధ మావపేత్. 21. సర్పి ర్నిమీలితే నేత్రే తప్తాంబు ప్రవిలాయితం, నక్తాంధ్యవాతతిమిర కృచ్ఛ్రక్రోధాధికే వసాం. 22. ఆపక్ష్మాగ్రా ద్దధో న్మేషం శనకై స్తస్య కుర్వతః, మాత్రాం విగణయే త్తత్ర వర్త్మసంధిసితాసితే. 23. దృష్టౌ చ క్రమశో వ్యాధౌ శతం త్రీణి చ పంచ చ, శతాని సప్తచాష్టౌ చ దశమంథే సిలే దశ. 24. పిత్తే షట్ స్వస్థవృత్తే చ బలాసే పంచ ధారయేత్, కృత్వాపాంగే తతో ద్వారం స్నేహం పాత్రే నిగాలయేత్. 25. పిబే చ్చ ధూమం నేక్షేత వ్యోమరూపం చ భాస్వరం, ఇత్థం ప్రతిదినం వాతే పిత్తే త్వేకాంతరం కఫే. 26. స్వస్థే చ ద్వ్యంతరం దద్యా దాతృప్తే రితి యోజయేత్, ప్రకాశక్షమతా స్వాస్థ్యం విశదం లఘులోచనం. 27.

భీతులు వమితులు విరిక్తులు అశితవేగితులు అంజనమును వేసికొనరాదు, క్రుద్ధులు మున్నగువారును వేసికొనరాదు. నిర్వాతస్థలము నందు శుద్ధములగు తలశరీరములకు తర్పణచికిత్స చేయవలయును. సాధారణ కాలములో ప్రాతఃకాలమునందు గాని సాయంకాలమునందుగాని వెల్లకిలపరుండిన వానికి యవమాషపిష్టముగ మైన రెండంగుళముల వత్తినిచేసి నేతిని వేడి నీటిలాగున చేసి కంటిలో నైచి కొనవలయును. రేజీకటి వాతము తిమిరము మున్నగునవి అన్నియును నశించును. వర్త్మసంధులయందు మాత్రలను లెక్కింపవలసినది. ధూమమును త్రాగవలయును. వ్యోమరూపముగు భాస్వరమును చూడకూడదు. ఈరీతిగా చక్కనగువఱకును వాతపిత్తకఫములలోను స్వస్థతయందును చేయుచుండవలయును.

### పుటపాకము.

శ్లో. తృప్తే వివర్యయోఽతృప్తే త్రృప్త్యేతి శ్లేష్మజా రుజః, పుటపాకం ప్రయుంజీత పూర్వోక్తే ష్వేవ పక్ష్మసు. 28. సవాతే స్నేహనః

శ్లేష్మసహితే లేఖనో మతః, తృడ్దార్శ్యే౽నిలే పిత్తే రక్తే స్వస్థే ప్రసాదనః. 29. బిల్వమాత్రం పృథక్పిండం మాంసభేషజకల్కయోః, ఉరుబూక వటాంభోజ పత్రైః స్నిగ్ధాదిషు క్రమాత్. 30. వేష్టయిత్వా మృదా లిప్తం ధవధన్వనగోమయైః, పచేత్ప్రదీప్తైరగ్న్యాభం పక్వం నిష్పీడ్య తద్రసం. 31. నేత్రే తర్పణవద్యుంజ్యాచ్ఛతం ద్వే త్రీణి ధారయేత్, లేఖనస్నేహనాంత్యేషు కోష్ణౌ పూర్వౌ హిమో౽పరః. 32. ధూమపోంతే తయోరేవ యోగాస్తత్ర చ తృప్తివత్, తర్పణం పుటపాకం చ నస్యానర్హేన యోజయేత్. 33. యావంత్యహాని యుంజీత ద్విగుణో హితభాగ్భవేత్.

తృప్తమైన పిమ్మట స్వస్థముగాను సుందరముగాను తేలికగాను నేత్రముండును. లేనిచో నిందులకు విపరీతలక్షణములను కలిగియుండును. ప్రాగ్వ్యక్తములగు తెప్పలకు పుటపాకమును ప్రయోగింపవలయును. వాతసహితమునకు స్నేహనమును శ్లేష్మసహితమునకు లేఖనమును దాహదౌర్బల్యము వాతము పిత్తము రక్తము వీటియందు ప్రసాదనమును చేయవలయును. బిల్వమాత్రమును మాంసభేషజ కల్కములపిండమును ఆముదపు ఆకులు మఱ్ఱిఆకులు తామరఆకులతో చుట్టి మట్టినిపూసి పక్వముచేసి ఎఱ్ఱగా నిప్పువలె పక్వముకాగానే ఆరసమునుతీసి కంటికి తర్పణమువలెనే యందుబొట్లు ఉపయోగింపవలయును. లేఖనస్నేహన ప్రసాదనములలో తొలి రెంటను కొలదిపాటి శీతోష్ణములు కలుగునట్లుగా తర్పణచేయవలసినది. ఎన్నిదినములు దీనిని సేవించునో అందులకు రెండు రెట్లదినములు పథ్యమును చేయవలయును.

ఇట్లు చక్రదత్తయందు ఆశ్చ్యోతనాంజనపుటపాకాధికారప్రకరణము ముగిసెను.

---

# ౭౭. శిరావ్యధాధికారము.

## శిరావ్యధమునకు అధికారులు.

శ్లో. అథ స్నిగ్ధతనుః స్నిగ్ధరసాన్నప్రతిభోజితం, ప్రత్యాదిత్యముఖః స్విన్నో జానూచ్చాసనసంస్థితః. 1. మృదుపట్టాత్తకో శాంతో జానుస్థాపితకూర్పరః, అంగుష్ఠగర్భముష్టిభ్యాం మన్యే గాఢం నిపీడయేత్, 2. దంతసంపీడనోత్కాసగండాధ్మానాని చాచరేత్, పృష్ఠతో

యంత్రయే చ్చైనం వస్త్ర మావేష్టయే న్నరః. 3. కంధరాయాం పరి క్షిప్య నస్యాంతర్వామతర్జనీం, ఏవ ముత్థాప్య విధినా శిరాం విధ్యే చ్ఛిరోగతాం. 4. విధ్యే ద్ధస్తశిరాం బాహా వనాకుంచితకూర్పరే, బద్ధ్వా సుఖోపవిష్టస్య ముష్టి మంగుష్ఠగర్భిణం. 5. ఊర్ధ్వం వేధ్యప్రదేశా చ్చ పట్టికాం చతురంగులే, పాదే తు సుస్థితేధస్తా జ్జానుసంధే ర్నిపీడితే. 6. గాఢం కరాభ్యా మాగుల్ఫం చరణే తస్య చోపరి, ద్వితీయే కుంచితే కించి దారూఢే హస్తవ త్తతః. 7. బధ్వా విధ్యే చ్ఛిరా మిత్థ మను క్తేష్వపి కల్పయేత్, తేషు తేషు ప్రదేశేషు తత్త ద్యంత్ర ముపాయవిత్. 8. తతో వ్రీహిముఖం వ్యధ్య ప్రదేశే న్యస్య పీడయేత్, అంగుష్ఠతర్జనీభ్యాం తు తలప్రచ్ఛాదితం భిషక్. 9. వాము హాస్తేన నిన్యస్య కుఠారీ మితరేణ తు, తాడయే న్మధ్యమాంగుల్యాం గుష్ఠవిష్టబ్ధయుక్తయా. 10. మాంసలే నిక్షిపే ద్దేశే వ్రీహ్యాస్యం వ్రీహి మాత్రకం, యవార్ధ మస్థ్నా ముపరి శిరాం విధ్యే త్కుఠారికాం. 11.

సిరావ్యధలను చేయునప్పుడు స్నిగ్ధతనువుదును స్నిగ్ధములగు రసములనన్నమును భుజించెడివాడును సూర్యునికెదురుగా పద్మాసనముతో కూరుచుండి చెమ్మట బెట్టబడినవాడై మృదుపట్టాత్తకుడై శాంతములవాడై ముడిచికొనిన పిడికిటితో గట్టిగానొక్కవలయును. దంతసంపీడనము ఉత్కాసము గంధాఘ్రానము వీనిని చేయవలయును. వెనుకవైపునకు కట్టివైచి బట్టను చుట్టవలయును. కంధరయందుంచి ఎడమతర్జని వ్రేలినెత్తి వాడిని భేదింపవలయును. ఇట్లే తక్కినదియును.

## రక్తాతిస్రావములను శమనోపాయములు.

శ్లో. అసమ్యగస్రే స్రవతి వైల్యవ్యోషనిశానతైః, సాగారధూమలవణతైలై ర్దిహ్యా చ్ఛిరాముఖం. 12. సమ్యక్ప్రవృత్తే కోష్ణేన తైలేన లవణేన చ, అశుద్ధౌ బలినోప్యస్రం న ప్రస్థా త్స్రావయే త్పరం. 13. అతిస్రుతౌ హి మృత్యు స్స్యా ద్దారుణా హ్యనిలామయాః, తత్రాభ్యంగరసక్షీర రక్తపానాని భేషజం. 14. స్రుతే రక్తే శనై ర్యంత్ర మపనీయ హిమాంబునా, ప్రక్షాల్య తైలప్రోతాక్తం బంధనీయం శిరాముఖం. 15. అశుద్ధం స్రావయే ద్భూయః సాయ మహ్న్యపరేపి వా, రక్తే త్వతిష్ఠతి క్షిప్రం స్తంభనీ మాచరే త్క్రియాం. 16. లోధ్ర

ప్రియంగు పత్తుంగ మాష యష్ట్యాహ్వ గైరికైః, మృత్కపాలాంజన క్షౌమ మసీక్షీరిత్వగంకురైః. 17. విచూర్ణయే ద్వ్రణముఖం పద్మకాదిహిమం పిబేత్, తామేవ వా శిరాం విధ్యే ద్వ్యధా త్తస్మా దనంతరం. 18. శిరాముఖం వా త్వరితం దహే త్తప్తశలాకయా, సశేష మ ప్యసృగ్ధార్యం నచాతిస్రుతి మాచరేత్, హరే చ్ఛృంగాదినా శేషం ప్రసాద మథవా నయేత్. 19.

రక్తము చక్కగా స్రవింపకున్నచో శొంఠిమిరియములు పిప్పళ్లు పసపుతగరము గృహధూమము వీటితో శిరలను లేపన చేయవలయును. చక్కగా స్రవించు చుండిన వేడినూనెతో గాని ఉప్పుతో గాని అశుద్ధమగు రక్తమును ఒకత్తి వెడలింప వలయును. ఎక్కువగా రక్తము స్రవించినచో మరణమును భయంకరము అగువాతరోగము గాని పుట్టుచున్నది. అప్పుడు అభ్యంగము మాంసరసముపాలు రక్తమువీటిని సేవించుట మంచిది. రక్తస్రావమైన పిమ్మట కట్టును విప్పి తైలముతో తడిపి నాడులను కట్టుకట్టుట యుత్తమము. రక్తము నిలువక పోయినచో శీఘ్రముగా రక్తము స్తంభించు చికిత్సను చేయవలయును. లోధ్ర ప్రియంగువు రక్తచందనము మినుములు మధుకము గైరికము వీటిచూర్ణముతో పద్మకాదిహిమమును త్రాగవలయును.

### వేధనస్థానములు.

శ్లో. మర్మహీనే యథా సన్నప్రదేశే వ్యధయే చ్ఛిరాం, సతూన షోడశాతీత సప్తత్యబ్దస్రుతాసృజాం. 20. అస్నిగ్ధాస్వేదితాత్యర్థ స్వేదితానిలరోగిణాం, గర్భిణీసూతికాజీర్ణ పిత్తాస్రశ్వాసకాసినాం. 21. అతిసారోదరచ్ఛర్దిపాండుసర్వాంగశోఫినాం, స్నేహపీతే ప్రయుక్తేషు తథా పంచసు కర్మసు. 22. నాయంత్రితాం శిరాం విధ్యే న్న తిర్య ఙ్నాప్యనుత్థితాం, నాతిశీతోష్ణవాతాభ్రే ష్వన్యత్రాత్యయికా ద్గదాత్. 23. నాత్యుష్ణశీతం లఘుదీపనీయం, రక్తేపనీతే హిత మన్నపానం, తదా శరీరం హ్యనవస్థితాసృక్, వహ్ని ర్విశేషేణ చ రక్షణీయః. 24. నరో హితాహారవిహారసేవీ, మాసం భవే దాబలలాభతో వా. ప్రసన్న వర్ణేంద్రియ మింద్రియార్థా, నిచ్ఛంత మవ్యాహతశక్తివేగం. 25. సుఖాన్వితంపుష్టిబలోపపన్నం, విశుద్ధరక్తం పురుషం వదన్తి.

మర్మహీనములు సమీపప్రదేశము నందున్నవియగు నాడులను ఛేదింప వలయు ను. పదిఆరు సంవత్సరములకు తక్కువగాని, డెబ్బది యేండ్లకు మించిన, రక్తస్రావ రోగు లకును గర్భిణీస్త్రీలు మున్నగువానికి నాడులను ఛేదింపరాదు. ఇట్లైన ప్రసన్నవర్ణము ప్రసన్నేంద్రియములును ఇంద్రియార్థములను కోరుచున్నవాడై పురుషుడు సుఖాన్వి తుడై బలము కలిగియుండునని యందరు.

ఇట్లు చక్రదత్తయందు శిరావ్యధాధికార ప్రకరణము ముగిసెను.

---

# ౭౮. స్వస్థాధికారము.

దినచారవిధులు.

శ్లో. బ్రాహ్మే ముహూర్తే ఉత్తిష్ఠే త్స్వస్థో రక్షార్థ మాయుషః, శరీ రచింతాం నిర్వర్త్య కృతశౌచవిధిః తతః. 1. ప్రాత ర్భుక్త్వా చ మృ ద్వగ్రం కషాయకటుతిక్తకం, భక్షయే ద్దంతపవనం దంతమాంసాన్య బాధ యన్. 2. నాద్యా దజీర్ణవమథు శ్వాసకాసజ్వరార్దితః, తృష్ణాస్యపాకహృ న్నేత్రశిరఃకర్ణామయీ చ తత్. 3. సౌవీర మంజనం నిత్యం హిత మక్ష్ణోః ప్రయోజయేత్, సప్తరాత్రే ష్టరాత్రే వా స్రావణార్థం రసాంజనం. 4. తతో నావనగండూషధూమతాంబూలభా గ్భవేత్, తాంబూలం క్షత పిత్తాస్రరూక్షోత్కుపితచక్షుషాం. 5. విషమూర్ఛామదార్తానా మ పథ్యం చాపి శోషిణామ్.

బ్రాహ్మముహూర్తములో లేచి ఆయుష్యరక్షణముకై శరీరచింతనమును చేసి శౌచములను తీర్చికొన వలయును. ప్రాతఃకాలమున కోమలమును కషాయ కటుతిక్తములు గలది యునగు నాహారమును భుజించి పండ్లచిగుళ్లకు నొప్పిలేకుండ తాంబూలమును సేవింపవల యును. అజీర్ణము వమథు శ్వాస కాసములు జ్వరము దాహము ముఖపాకము హృద్రోగము నేత్రరోగము శిరోరోగము కర్ణరోగము కలవారు దీనిని భక్షింపరాదు. సౌవీరాంజనమును ప్రతినిత్యమును కంటికి పెట్టుకొనవలయును. ఏడు రోజులకుగాని ఎనిమిది రోజులకు గాని మలము పోవుటకై రసాంజనమును సేవింప వలయును. పిమ్మట తాంబూలము నస్యము మున్నగువానిని వేసికొనవచ్చును. క్షయ పిత్తరక్తము రూక్షఉత్కుపిత నేత్రరు లు. అనగా కంటి జబ్బులుగల వారు మాత్రము తాంబూలమును నమలరాదు.

### అభ్యంగాదులు.

శ్లో॥ అభ్యంగమాచరేన్నిత్యం సజరాశ్రమవాతహా. 6. శిరః శ్రవణపాదేషు తం విశేషేణ శీలయేత్, బాహ్యాభ్యంగః కఫగ్రస్తకృతసంశుద్ధ్యజీర్ణిభిః. 7. శరీరచేష్టా యా చేష్టా స్థైర్యార్థా బలవర్ధనీ, దేహవ్యాయామసంఖ్యాతా మాత్రయా తాం సమాచరేత్. 8. వాతపిత్తామయీ బాలో వృద్ధో జీర్ణీ చ తాం త్యజేత్, ఉద్వర్తనం తథా కార్యం తతః స్నానం సమాచరేత్. 9. ఉష్ణాంబునాధఃకాయస్య పరిషేకో బలావహః, తేనైవ తూత్తమాంగస్య బలహృత్కేశచక్షుషోః. 10. స్నానమర్దితనేత్రాస్యకర్ణరోగాతిసారిషు, ఆధ్మానపీనసాజీర్ణభుక్తవత్సు చ గర్హితం. 11. నీచరోమనఖశ్మశ్రుర్నిర్మలాంఘ్రిమలాయనః, స్నానశీలః ససురభిః సువేషో నిర్మలాంబరః.12. ధారయేత్సతతం వస్త్రం రత్నం సిద్ధమంత్రమహౌషధీః.

అభ్యంగమును ప్రతిదినము సేవింపవలయును. ఇది వృద్ధత్వమును పరిశ్రమను పోగొట్టును. తల చెవులు కాళ్లు మున్నగు వానికి అభ్యంగమును ఎక్కువగ చేయవలయును. కఫగ్రస్తులు శోధనచేసి కొనినవారలు అజీర్ణము గలవారలు నిరుబాహ్యాభ్యంగనము జేసికొనుటమంచిది. దేహవ్యాయామాదులచేత దాని నుపచరింపవలయును వాతపిత్తరోగముకలవాడు బాలుడు వృద్ధుడు అజీర్ణరోగి అభ్యంగనమును పరిత్యజింపవలయును. నలుగుపెట్టికొని స్నానమును చేయవలయును. వేడినీళ్లతో అధఃకాయమును కడిగికొనుట మంచిది. శిరస్సును కూడనీళ్లకడిగిన కన్నులకును కేశములకును బలమునశించిపోవును. స్నానమర్దిత నేత్రాస్య రోగముగల వారికిని అతిసారరోగము గలవారికిని అభ్యంగనము మంచిదికాదు. పరిశుద్ధ జలములో స్నానమును చేయవలయును. నియమముగా స్నానము చేయుచు పరిమళద్రవ్యములను శుభ్రములగు వస్త్రములనుధరించి సిద్ధమంత్రములును ఓషధులను చేర్చికొట్టుకొనవలయును.

### గమనాద్యుపకరణములు.

శ్లో॥. సాతపత్రపదత్రాణో విచరేద్యుగమాత్రదృక్, నిశిచాత్యయికే కార్యే దండీ మౌలీ సహాయవాన్. 13. జీర్ణే హితం మితం చాద్యాన్న వేగాన్ధారయేద్బలాత్, నవేగితోऽన్యకార్యస్స్యాన్నాజిత్వాసాధ్యమామయం. 14. దశధా. పాపకర్మాణి కాయవాఙ్మనసైస్త్యజేత్,

కాలేహితం మితం బ్రూయాదవిసంవాదిపేశలం. 15. ఆత్మవత్సతతం పశ్యే దపి కీటపిపీలికాం, ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్.16. నక్తం దినానిమేయాంతి కథంభూతస్య సంప్రతి, దుఃఖభాఙ్నభవత్యే వం నిత్యంసన్నిహితస్మృతిః. 17.

గొడుగు చెప్పులు ధరించికొని పరీక్షించుచు నడువవలయును. రాత్రులేదియైన నావశ్యకమగు కార్యముగలిగెనేని కఱ్ఱనుధరించి మౌనియై సహాయుని తీసికొని బయలు వెడలవలయును. జీర్ణమగుచుండినచో హితముగను మితముగను భుజింపవలయును. త్వరపడరాదు. బలముకొలదివేగము నణచపరాదు. సాధ్యమగు రోగమును పోగొట్టుకొనక అన్యకార్యమునకై వేగిరపడకూడదు. శరీరము వాక్కు మనస్సు వీటితో పదివిధములగు పాపకార్యములను త్యజింపవలెను. సమయమునందు హితముగను ప్రమాణముగను భుజింపవలయును. ఎవ్వరితోను విసంవాదముగా పరుసనాడరాదు. తనవలెనే అందఱను చూచికొనవలయును. కీటకములనైనను పిపీలికములనైనను నిట్లే చూడవలయును. తనకు ప్రతికూలములగు వానిని ఇతరుల కెవ్వరికిగాని చేయరాదు. నాకు ఇప్పుడీతీరున రాత్రింగివములు గడచుచున్నవని అని సన్నిహితస్మృతియై దుఃఖింపరాదు.

## ఋతుచర్య.

శ్లో. మాసైర్ద్విసంఖ్యైర్మాఘాద్యైః క్రమాత్షడృతవః స్మృతాః, బలినః శీతసంరోధాద్ధేమంతే ప్రబలోఽనలః 18. సేవేతాతో హిమేస్ని గ్ధస్వాద్వమ్లలవణాన్రసాన్, గోధూమపిష్టమాషేక్షుక్షీరోత్థవికృతీః శుభాః. 19. నవమన్నం వసాం తైలం శౌచకార్యే సుఖోదకం, యుక్త్యార్కకిరణాన్స్వేదం పాదత్రాణం చ సర్వదా 20. ప్రావారాజినకౌశేయప్రవేణీకుథకాస్తృతం, ఉష్ణస్వభావైర్లఘుభిః ప్రావృతః శయనం భజేత్. 21. అంగారతాపసంతప్తగర్భభూవేశ్మని ప్రియాం, పీవరోరుస్తనశ్రోణీమాలింగ్యాగురుచర్చితాం. 22. అయమేవ విధిః కార్యః శిశిరేపి విశేషతః, తదాహి శీతమాధ్వీకం రౌక్ష్యం చాదానకాలజం. 23. కఫశ్చితో హి శిశిరే వసంతేఽర్కాంశుతాపితః, హత్వాగ్నిం కురుతే రోగాంస్తత స్తత్ర ప్రయోజయేత్. 24. తీక్ష్ణం వమననస్యాది కవలగ్రహమంజనం, వ్యాయామోద్వర్తనం ధూమం శౌచకార్యే సుఖోదకం. 25. స్నాతోనులిప్తః కర్పూరచందనాగురుకుంకుమైః, పురాణయవగోధూమక్షౌద్రజాంగలశూల్యభుక్, ప్రపిబేదాసవారిష్టసీధుమాధ్వీకమాధవాన్, 26.

మాఘాదిమాసములు రెండేసి రెండేసి చొప్పున ఒక్కొక్క ఋతువగును. బలముంగలవానికి చలివలన హేమంతర్తువునందు జఠరానలము హెచ్చును. కావున చల్లనివియును స్నిగ్ధములును స్వాదువులును పులుపుడుప్పు కలవియునగు వానిని సేవింపవలయును. గోధుమపిండి మాంసము చెఱకుపాలు కల్లు క్రొత్తబియ్యపుటన్నము వస తైలము వీటిని చకర్మమునకై వెచ్చఁజేసియును నీటిని చెప్పులను సూర్యహారణ సంస్పర్శను వలనను శుద్ధిచేసి సేవింపవలయును. ప్రావారము అజినము పట్టుబట్ట కంబళిమున్నగునవి పఱచినపాన్పునందు పరుండవలయును. బొగ్గులవేడిమికి వెచ్చఁబడిన యింటిలోనుండవలయును. అగురుచర్చితయును పృథుస్తనియునగు భార్యను ఆలింగనము చేసికొనియుండవలయును. శిశిరర్తువులో కూడ విశేషముగా నీకీలినసే నడచికొనవలయును. భోజనకాలమున వేడిగా భుజింపవలెను. వసంతర్తువునందు సూర్యకిరణసంతాపితుండగుటచేత అగ్నినశించి రోగములు జనించును. కావున తీక్ష్ణములగు వమనములును నస్యవిధులును చేయవలయును.

## వసంత విహారాదులు.

శ్లో. వసంతే ఽనుభవేత్స్త్రీణాం కాననానాంచ యౌవనం, గురూష్ణస్నిగ్ధమధురం దివాస్వప్నంచ వర్జయేత్. 27. మయూఖైర్జగతిస్నేహం గ్రీష్మే పేపీయతే రవిః, స్వాదుశీతం ద్రవం స్నిగ్ధమన్నపానం తదాహితం. శీతం సశర్కరం మంథం జాంగలాన్మృగపక్షిణః, ఘృతం పయః సశాల్యన్నం భజన్ గ్రీష్మే న సీదతి 29. మద్యమల్పం నవాపేయమథవా సుబహూదకం, మధ్యాహ్నే చందనార్ద్రాంగః స్వప్యాద్ధారాగృహే నిశి. 30. నిశాకరకరాకీర్ణే ప్రవాతే సౌధమస్తకే, నివృత్తకామో వ్యజనైః పాణిస్పర్శైః సచందనైః. 31. సేవ్యమానో భజేతాస్యాం ముక్తామణివిభూషితః, లవణామ్లకటూష్ణాని వ్యాయామంచాత్ర వర్జయేత్. 32. భూబాష్పాన్మేఘనిష్యందాత్పాకాదమ్లాజ్జలస్య చ, వర్షాస్వగ్నిబలే క్షీణే కుప్యంతి పవనాదయః. 33. భజేత్సాధారణం సర్వమూష్మణస్తేజనం చ యత్, ఆస్థాపనం శుద్ధతనుర్జీర్ణం ధాన్యం కృతాన్ రసాన్. 34. జాంగలం పిశితం యూషాన్మధ్వరిష్టం చిరంతనం, దివ్యం కౌపం శృతం వాంభో భోజనం త్వతిముర్దినే. 35. వ్యక్తామ్లలవణస్నేహం సంశుష్కం క్షౌద్రవల్లఘు, నదీజలోదమంథాహః స్వప్నాయాసాతపాంస్త్యజేత్. 36. వర్షాశీతోచితాంగానాం సహసైవార్కరశ్మిభిః, తప్తానా మా

చితం పిత్తం ప్రాయః శరది కుప్యతి. 20. తజ్జయాయ ఘృతం తిక్తం విరేకో రక్తమోక్షణం, తిక్తస్వాదుకషాయం చ క్షుధితోన్నం భజే ల్లఘు. 21.

వసంతఋతువులో స్త్రీలు ఉద్యానవనములను ఉపభోగింపఁదగినవి. పగలు నిద్దుర పోకూడదు. సూర్యుఁడు కిరణములచేత లోకమును పీల్చిపిప్పి చేయునుగనుక స్వాదువుగను శీతముగను ద్రవముగనుండు అన్నపానములను సేవింపవలయును. జాంగలములగు పశుపక్ష్యాదుల మాంసము పాలు నేయి వరియన్నమును సేవించుచున్న గ్రీష్మమున క్లేశమునొందరు. కొంచెమంతయైనకల్లును త్రాగకూడదు. ఎక్కువ నీళ్లనుత్రాగరాదు. మధ్యాహ్నమునందు చందనమును పూసికొని ధారాగృహమునందు నిద్రపోవలయును. చంద్రకిరణప్రసారితమగు మేడపైని కామమును వీడి చల్లగాలి విసరికొనుచు ముక్తామణి మున్నగు వానిచేత నలంకృతుఁడై యుండవలయును.

వర్షఋతువులలో అగ్నిబలము క్షీణించుట చేత వాతాదులు ప్రకోపించును. సాధారణముగా వెట్టనిచ్చు వస్తువులను ఉపయోగించికొనవలయును. పరిశుద్ధుఁడై ప్రాతధాన్యమును రసద్రవ్యములను అడవిజంతువులమాంసములను యూషములను దివ్యమగు కూపోదకములు మున్నగు వానిని పరిత్యజింపవలయును.

వర్షాకాలమునందు నెస్సుతగిలిన అవయవములు గలవారలు వాడలో కూర్చుండిరేని అయ్యది శరత్కాలమునందు విషమించును. దానినితొలగించి కొనుటకై తిక్తమగుఘృతమును విరేచనమును రక్తస్రావమును తిక్తములు స్వాదువులునగు కషాయములను సేవింపవలయును.

## శరత్కాలపదార్థములు.

శ్లో. ఇక్షవః శాలయో ముద్గాః సరోంభః క్వథితం పయః, శరద్యేతాని పథ్యాని ప్రదోషే చేందురశ్మయః. 22. శారదాని చ మాల్యాని వాసాంసి విమలాని చ, తుషారక్షారసౌహిత్య దధితైలరసాత పాన్. 23. తీక్ష్ణ మద్య దివాస్వప్న పురోవాతాతపాం స్త్యజేత్ శీతే వర్షాసు చాద్యాం స్త్రీ న్వసం తేం త్యా న్రసా న్భజేత్. 24. స్వాదూ న్నిదాఘే శరది స్వాదుతిక్తకషాయకాన్, శరద్వసంతయో రూక్షం శీతం ఘర్మఘనాంతయోః. 25. అన్నపానం సమాసేన విపరీ

త మతోఽన్యథా, నిత్యం సర్వరసాభ్యాసః స్వస్వాధిక్య మృతావృతౌ.
26. ఋతోరాద్యంతసప్తాహ వృతుసంధి రితి స్మృతః, తత్ర పూర్వో
విధి స్త్యాజ్యః సేవనీయో పరః క్రమః. 27. ఇ త్యుక్త మృతుసాత్మ్యం
య చ్చేష్టాహారవ్యపాశ్రయం, ఉపశేతే యదౌచిత్యా దోకసాత్మ్యం
త దుచ్యతే. 28. దేశానా మామయానాం చ విపరీతం గుణం గుణైః,
సాత్మ్య మిచ్ఛంతి సాత్మ్యజ్ఞా శ్చేష్టితం చాద్య మేవ చ. 29. తచ్చ నిత్యం
ప్రయుంజీత స్వాస్థ్యం యే నానువర్తతే, అజాతానాం వికారాణాం అను
త్పత్తిం కథంచ యత్. 30. నగరీ నగరస్యేవ రథస్యేవరథీ యథా, స్వ
శరీరస్య మేధావీ కృత్యే ష్వవహితో భవేత్. 31.

చెఱకులు వరిబియ్యము పెసలు సరస్సులోని నీరు క్వధితోదకము చంద్రకిరణములు ఇయ్యవి శరత్కాలమునందు పథ్యములు. శరదృతు సంబంధములగు మాల్యములు నిర్మలములగు వస్త్రములు తుషారోదకములు తృప్తిని కలిగించు అన్నము పెఱుగు తైలము రసము వీటినివదలి పెట్టవలయును. మఱియు తీక్ష్ణమగు మద్యము దివాస్వప్నము పురోవాతము ఎండ వీటిని త్యజింపవలయును. శీతకాలమునందును వర్షాకాలమునందును మొదటి మూడిటిని వసంతమునందు చివఱరెండిటిని సేవింపవలయును. మొత్తమీదనన్నపానములను విపరీతముగా భుజింపవలెను. ఋతువులలో తొలుతను కొనను ఏడురోజులు ఋతుసంధియనఁబడును. దేశకాలములకును రోగములకును గుణములకును అనుగుణముగా ప్రవర్తింపవలెను. స్వాస్థ్యమును కలిగించు దానిని ప్రతిదినమునందును సేవింపవలయును. లేనిచో లేనిరోగములను పుట్టించును. పట్టణములను పట్టణవాసులవలెను రథమును రథికుఁడువలెను తనశరీరమును కనిపెట్టి తాను బుద్ధిమంతుఁడై జాగ్రత్తగా కాపాడుకొనుచు మెలగవలయును.

## గ్రంథకర్తనుగూర్చిన ప్రశంస.

శ్లో. గౌడాదినాథరసవత్యధికారిపాత్ర
నారాయణస్య తనయః సునయోఽంతరంగాత్,
భానో రను ప్రథితలోధ్రవలీకులీనః
శ్రీచక్రదత్త ఇహ కర్తృపదాధికారీ.

శ్లో. యస్సిద్ధయోగ లిఖితాధికసిద్ధయోగా
న్యత్రైవ నిక్షిపతి కేవల ముద్ధరే ద్వా,
భట్టత్రయత్రిపథవేదవిదా జనేన
దత్తః పతే త్సపది మూర్ధని తస్య శాపః.

గౌడరాజాగారి రసవత్యధికారులలో యోగ్యుడగు నారాయణుని కొమరుండును, ఉత్తమకులోత్పన్నుండును చక్రదత్తుండను పేరుతో బఱగినట్టినేను ఈగ్రంథము యొక్క కర్తృపదమునకు అధికారిని. (అనఁగా దీనిని రచించినది గౌడరాజాగారి రసవత్యధికారియైన నారాయణుఁడనువాఁడని తాత్పర్యము.)

ఇందు వ్రాయఁబడిన సిద్ధయోగములలో అధికముగా చేర్చువారుగాని ఉన్నవాటిని తీసివేయువారుగాని ఎవ్వరు కలరో వారి తలపై వేదపాఠులు ఇచ్చినశాపము బడును. కాన దీనియందు చేర్పులుగాని కూర్పులుగాని ఇతరులు చేయరాదని భావము.

ఇట్లు చక్రదత్తయందు సుస్థాధికారప్రకరణము ముగిసెను.

చక్రదత్త ముగిసెను.



చెన్నపురి : వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే
శ్రీ'రామ' ప్రెస్సున ముద్రితము.—1926.

# వైద్య గ్రంథములు.



| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అనుపానమంజరి, సాంధ్ర తాత్పర్యము ... | 0 | 8 |
| అజీర్ణమంజరి ,, ... | 0 | 4 |
| ఇలాజుల్ గుర్బా, యూనాని వైద్యగ్రంథములలో మిక్కిలి యుత్తమమైనది, ఉర్దూభాషతర్జుమా, కాలికోబైండు ... | 3 | 0 |
| కాలజ్ఞానము, సాంధ్ర తాత్పర్యము ... | 0 | 4 |
| కుమారతంత్రము, రావణకృతము ,, ... | 0 | 6 |
| చక్రదత్త ,, ... | 3 | 12 |
| గదనిగ్రహము, సోఢలకృతము, సాంధ్ర తాత్పర్యము | 2 | 8 |
| నాడీజ్ఞానము ,, ... | 0 | 4 |
| భేషజకల్పము, సాంధ్ర తాత్పర్యము ... | 0 | 6 |
| రసప్రదీపిక, ఆంధ్ర తాత్పర్యసహితము ... | 0 | 12 |
| రాజమార్తాండము ,, ... | 0 | 10 |
| లోలంబరాజీయము, సాంధ్ర తాత్పర్యము ... | 0 | 8 |
| విషవైద్యచింతామణి ,, ... | 2 | 0 |
| వృక్షాయుర్వేదము ,, ... | 0 | 4 |
| వైద్యశతశ్లోకి ,, ... | 0 | 6 |
| శార్ఙ్గధరసంహిత, క్రొత్తకూర్పు ,, ... | 3 | 0 |
| శార్ఙ్గధరకృతత్రిశతి, సాంధ్ర తాత్పర్యము ... | 0 | 8 |
| సుశ్రుతశారీరము ... | 2 | 0 |
| షడ్రసనిఘంటువు, అభిధానరత్నమాల, సటీక ... | 0 | 12 |
| బసవరాజీయము, సాంధ్ర తాత్పర్యము ... | 7 | 0 |
| సహదేవ పశువైద్యశాస్త్రము ... | 0 | 6 |

## వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.